శ్రీ శ్రీ శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారి

# గీతోపన్యాసములు


రచన:

బ్రహ్మచారి గోపాల్





ప్రకాశకులు :

శ్రీ శుకబ్రహ్మాశ్రమము, కాళహస్తి.

1979

కావలసినవారు ఈ క్రింది అడ్రెసుకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

మేనేజరు - శ్రీ శుకబ్రహ్మాశ్రమము,
శ్రీ శుకబ్రహ్మాశ్రమము (పోస్టు),
శ్రీ కా ళ హ స్తి,
చిత్తూరుజిల్లా, (ఆంధ్రప్రదేశ్).

| | | |
|---|---|---|
| 8-వ ముద్రణము వరకు | — 1976 | 23,000 |
| 9-వ ముద్రణము | — 1979 | 3,500 |
| | మొత్తం | 26,500 కాపీలు |



వెల : రు. 12-00

శ్రీ లక్ష్మీ ఆర్ట్ ప్రింటర్స్, తెనాలి.

OM

Gita is the Universal Mother. When I am in difficulty and distress I seek refuge in her bosom. It has been my 'Kamadhenu,' my guide in hundreds of moments of doubt and difficulty. Once you have tasted of its sweet nectar your attachment to it will grow day to day. It contains treasures of knowledge. For me the Gita became an infallible guide of conduct. It became my dictionary of daily reference. I turned to it for a ready solution of all my troubles and trials. A true votary of the Gita ever dwells in perennial joy and peace.

భగవద్గీత సకల జీవులకును తల్లివంటిది. ఆపదలు సంభవించినపుడు నేనామెయొడిలో విశ్రాంతి నొందుచుందును. సంశయములు విపత్తులు నన్ను అలముకొను పెక్కు సందర్భములలో ఆతల్లి నాకు దారిచూపెను. నన్నురక్షించెను. ఆమె నాకు కామధేనువు వంటిది. ఒక్కపర్యాయము గీతామృతమును నీవు చవిచూచితివా, ఇక దానిని వదలకుందువు. దానిపై నీకు మక్కువ అధికమగుచుండును. గీత విజ్ఞానభండారము. నామటుకు నాకది శీలపరిరక్షణముకం దెంతయో ఉపయోగపడెను. కావున నిఘంటువు (డిక్షనరీ)ను వలె ప్రతిదినము నేను దానిని పరిశీలించుచుందును. కష్టములు సంప్రాప్తమైనపుడు నేను దానిని తెరచుటతోడనే ఏదియోయొక నివారణామార్గము అందు గోచరించును. గీతను తెప్పగా ఆశ్రయించువారెల్లపుడును పరమానందమును, శాంతిని బడయుచుందురు.

— మహాత్మాగాంధి

ఓమ్

In the literature of the whole world there is no book like the Gita. It is a most luminous and priceless jem. It takes us to the supreme bliss.

విశ్వవాఙ్మయమంతటిలోను గీతయంతటి మహోత్తర గ్రంథము మరియొకటి లేనేలేదు. అది మహాప్రకాశమానమగు అమూల్యరత్నమువంటిది. అయ్యది మనలను పరమానందపదవికి గొనిపోవు అపూర్వసాధనము.

—బాలగంగాధర తిలక్

# విషయసూచిక



హరిః ఓం తత్ సత్

ఓమ్

# తొలి పలుకులు

---

సనాతన ధర్మమునకు 'జీవగఱ్ఱ' యనబడెడి ప్రస్థాన త్రయములో శ్రీమద్భగవద్గీత యొకటైనను, నిజముగ నిది మతమునకు, దేశకాలపాత్రములకు అతీతమై, ఆచరణ యుక్తమై, సర్వకాల సర్వావస్థలయందు మానవుని ఆధ్యాత్మిక, నైతిక పునరుజ్జీవనమున కుపయోగించు పవిత్ర గ్రంథమని నానిశ్చితాభిప్రాయము. అంతమాత్రమున దాదాపు అయిదు వేల సంవత్సరములు గడచినను యుగ, కాలముల మార్పులతో నిమిత్తము లేకుండ, నిత్యనూతనత్వంతో, నవనవోన్మేషణంగా ప్రజ్వలిస్తూ యావత్ప్రపంచానికి నిరంతరము వెలుగుబాట చూపించుచునేయున్నది. ఈ వైజ్ఞానిక యుగంలో కూడా భగవద్గీతకు విశ్వవ్యాప్తంగా అద్వితీయమైన, అనన్యసామాన్యమైన ప్రతిష్ఠా గౌరవము లున్నవన్న, అందలి బోధ ప్రజాహిత జీవితానికి బహు సన్నిహితంగా నుండుటయే కారణము.

మధ్యతరగతి ప్రజానీకానికి ప్రాతినిధ్యం వహిస్తూ డర్జునుడు. అట్టివానికే గీతాశాస్త్రముపదేశింపబడినది. ఈ బోధను సాకల్యంగా విన్నట్టి అర్జునుడు తన మోహమంతయు నశించినదని, జ్ఞానోదయమైనదని, సందేహములన్నియు తీరినవని, శ్రీకృష్ణభగవానుడు సూచించిన మార్గంలోనే అక్షరాలా నడచెదనని సుస్పష్టంగా చెప్పియున్నాడు. అదే వర్గానికి చెందిన అస్మదాదుల కీ గీతాబోధ చాలా ప్రయోజనకరము కావలసి

యున్నను, ఎందుకట్టి లాభము పొందజాలకున్నామో లోతుగ యోచించినచో మనము తెలుసుకొనగలము. శ్రద్ధాళువులకు, అసూయారహితులకు, జిజ్ఞాసువులకు మాత్రమే గీతా విషయము లుపయోగించునని యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు చెప్పియున్నాడు. ఇట్టి సుగుణములు కలిగి అర్జునునివలె "శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్"-అని పలుకుచున్నను, హృదయాన్ని భగవానుని కంకితము చేయగలిగినవారికి గీతాబోధ అమృతప్రాయమై, కాయికంగాను, మానసికంగాను, ఆధ్యాత్మికంగాను మనకు సంపూర్ణారోగ్యము నివ్వగలదు.

ఈ గీతాసాగరంలో నొక్కొక్కచోట మహాపండితులు కూడ సాహసించి ముందునకడుగు పెట్టలేని అగాధములు కలవు. వేరొక్కచోట అతిసామాన్యుడుకూడ సునిశ్చితంగా సాగిపోగల మెరకలుకూడ కలవు. వివిధపరిణామస్థాయిలలో నున్న మానవులు వారివారి శక్త్యనుసారం గీత సహాయము చేసికొని తమ జీవితాలను సుగమం చేసుకొను వీలు పూర్తిగా ఉన్నది.

గీతామాత కామధేనువు. ఈమె క్షీరము ఉపనిషత్సారము. ఈ క్షీరము నెవరు పితుకుటకు ప్రయత్నించినను గీతాధేనువు కభ్యంతరము లేదు. ఎవరి శక్త్యనుసారం వారు పితికికొని అనుభవించవచ్చు. వారివారి శ్రద్ధాసక్తులనుబట్టి వారివారి ఆధ్యాత్మిక శక్త్యుత్సాహములనుబట్టి వారలకు లభించగలదు. లభించినంతవఱకు ఆచరణలో పెట్టి ప్రయత్నించవలెను. ఇట్టి స్వయంకృషితో దీర్ఘకాలము నైరంతర్యము సత్కారముతో కృషి సలిపిన యెడల సమగ్రజీవితం గడుపుట సులభము.

శాస్త్రదృక్పథం గలిగిన విజ్ఞానవేత్తలను సంతృప్తిపరచగల యోగశాస్త్రమిది. హేతువాదమనస్కులకుకూడ అంగీకారయోగ్యంబైన కృష్ణార్జునసంవాద ఫలితముకూడనై యున్నది. ఆధ్యాత్మికతత్త్వ మిందిమిడియున్నందున ఇది బ్రహ్మవిద్య. శాస్త్రంబులలోకెల్ల శాస్త్రంబై, హేతువాదసమర్థనీయమై, ఆధ్యాత్మికతకాలవాలంబైన ఇందలిసిద్ధాంతము లన్నితరహాలవారలకు మార్గదర్శకమై, ఆశాజనకమై శాంతిని, సుఖాన్ని ఇవ్వగలవని రూఢిగా చెప్పవచ్చును.

ఎందరో మహానుభావులు గీతాసాగరాన్ని వారివారి శక్త్యనుసారం మథించియున్నారు. సత్ఫలితాలు వారు పొంది వాటిని ప్రపంచాని కందివ్వగలిగిరి. ఎవరి బుద్ధికుశలతను, విమర్శనాత్మక శక్తినిబట్టి వారు భిన్నభిన్న రూపాలలో గీతా బోధంలోని రహస్యాలను వెల్లడిచేసిరి.

కాళహస్తిలోని శ్రీశుకబ్రహ్మాశ్రమ స్థాపకులైన శ్రీ శ్రీ శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాముల వారట్టి శక్తి సమన్వితులలో నొకరు. వీరు మహాపండితోత్తములు. ఆధునిక పద్ధతిలో 'గీతామకరందము' అను పేరుతో గీతకు భాష్యము వ్రాసియున్నారు. కాకినాడ పురజనుల ఆహ్వానమును మన్నించి 1959 సం॥రం డిశంబరు నెలలో కాకినాడ పట్టణము విచ్చేసి గౌతమి దివ్యజ్ఞానసమాజావరణములో దినమున కొక అధ్యాయము చొప్పున పదునెనిమిది దినములు (10-12-59 మొదలు 27-12-59 వరకు) భగవద్గీతపై మహోపన్యాసయాగమును గావించియుండిరి. వేలకొలది ప్రజ లా ఉపన్యాసము విని తరించియున్నారు. కాకినాడపట్టణములో వేలకొలది శ్రోతలు

నాకర్షించిన గీతోపన్యాసము లివియే అని చెప్పక తప్పదు. శ్రోతలలో నధిక సంఖ్యాకులు విద్యాధికులు. శ్రీవారు తమ సహజ మృదుమధురభాషణములతో, అనేక దృష్టాంత సాదృశ్యములతో తమ స్వానుభవాన్ని మిళితంచేసి సర్వులకు సుబోధకముగనుండునట్లు చెప్పి శ్రోతల ప్రశంసలను బడయుటయేగాక, వారిలో గీతపట్ల, అందలి తత్త్వబోధపట్ల అభిరుచి, ఉత్సాహము శాశ్వతముగ నెలకొనునట్లు చేయగలిగిరి. వారు బోధించినరీతిని 'తు, చ' తప్పకుండ ఆచరించగల ధీశక్తియుతులు. గీతను ప్రజారంజకముగ నుపదేశింపగల శక్తి వారి కీశ్వరుడు ప్రసాదించినాడు.

వారు ఉపన్యాసములు చెప్పుచున్న సమయములో ఆ ఉపన్యాస విషయములను వారి ఆశ్రమభక్తుడు అయిన బ్రహ్మచారి గోపాల్‌గారు సంక్షిప్తముగ తమ ఉపయోగము నిమిత్తము వ్రాసుకున్నారు. వాటిని అచ్చువేయించవలసినదనియు, అందులకు ఆర్థికముగ తాము సహాయపడెదమనియు శ్రీవారిభక్తులు కొందరు కోరినందునను, శ్రోతలకు తదితరులకు కూడా అవి ఉపయోగించునని శ్రోతలలో కొందరుకూడ చెప్పినందునను, తాము వ్రాసుకొన్న విషయములను అచ్చువేయుటకు బ్రహ్మచారి గోపాల్‌గారు అంగీకరించిరి. ఇవి పాఠక మహాశయుల కెంతో ప్రయోజనకరముగా నుండగలవని ఆశించుచున్నాను. శ్రోతలందరి తరఫున శ్రీగోపాల్‌గారికి నాహృదయపూర్వక శుభాకాంక్షలు, అభినందనలు తెలియపరచుచూ, ఇట్లే ముందుకూడ వారు ఇతోధికంగా ఇట్టి జ్ఞానదాన కార్య

క్రమాలలో ఎక్కువగ నిమగ్నులై యుండవలెనని శ్రీకృష్ణ భగవానుని ప్రార్థించుచున్నాను.

ఈ గ్రంథమునకు "తొలిపలుకులు" వ్రాయు అవకాశము నాకొసంగిన శ్రీ బ్రహ్మచారి గోపాల్ గారికి నా కృతజ్ఞతా పూర్వక వందనములు. శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాముల వారికి నా ప్రణామములు.

ఇట్లు,

కాకినాడ. }
25-5-60 }

తోపల్లి కృష్ణబ్రహ్మశాస్త్రి.
(అడ్వకేటు - కాకినాడ)



# విజ్ఞప్తి

మా గురుదేవులగు పూజ్యపాద శ్రీ శ్రీ శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు - కాకినాడ పురప్రముఖులగు శ్రీ పైడా శ్రీరామకృష్ణయ్యగారు, శ్రీ బాదం రామస్వామిగారల ప్రోత్సాహముతో కాకినాడ పౌరుల ఆహ్వానముపై కాకినాడ దివ్యజ్ఞాన సమాజములో 10-12-1959 తేదీనుండి నలుబదియైదు రోజులు గీతోపన్యాసముల నొసంగిరి. శ్రీవారి ప్రబోధము అనర్గళముగ, మృదుమధురముగ కొనసాగిన విధము అచ్చటి శ్రోతలకు అనుభవైక విషయమే. మా ఆశ్రమవాసుల కోర్కెపై ఏరోజు ఉపన్యాసములను, ఆరోజు అచ్చటనే నా శక్తికొలది సంక్షేపముగ వ్రాసికొని ఆశ్రమవాసులకు పంపుచుంటిని. శ్రీవారి ఉపన్యాసములను పూర్తిగ వ్రాసికొనుటకు ఆ తొందరలో సాధ్యపడక పోయినను, సారభూతమగు విషయమును యథాశక్తి సంగ్రహింపగలిగితిని. అదియే ఈ గ్రంథరూపమున ఆవిర్భవించినది. నేను కోరుటయే తడవుగా ఈ గ్రంథమునకు 'తొలిపలుకులు' వ్రాసి పంపించినట్టి కాకినాడ పురప్రముఖులు, ఆధ్యాత్మిక విద్యాకోవిదులైన శ్రీ తోపల్లి కృష్ణబ్రహ్మశాస్త్రిగారికి నా కృతజ్ఞతాపూర్వక వందనములను అర్పించుచున్నాను. ఈ గ్రంథము వెలువడుటకై తోడ్పడినట్టి భక్తమహాశయులందరికినిగూడ నా నమోవాకములను అందజేయుచున్నాను. ఓం.

ఇట్లు సుజనవిధేయుడు,

బ్రహ్మచారి గోపాల్

# శ్రీ కృష్ణ ధ్యానము

ప్రపన్న పారిజాతాయ తోత్రవేత్రైక పాణయే ।
జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృతదుహే నమః ॥

ఆశ్రితులకు కల్పవృక్షమువంటివాడును, ఒకచేతితో కొరడాబెత్తమును, మఱియొకచేతితో జ్ఞానముద్రను ధరించినవాడును, గీతామృతమును పితికినవాడునగు శ్రీకృష్ణమూర్తికి నమస్కారము.

సారథ్యమర్జునస్యాజౌ కుర్వన్ గీతామృతం మహాత్ ।
లోకత్రయోపకారాయ తస్మై కృష్ణాత్మనే నమః ॥

పూర్వము అర్జునునకు సారథిగానుండి ముల్లోకములకును ఉపకారము చేయుటకొఱకై ఏమహత్తరమగు గీతామృతమును ఒసంగెనో అట్టి శ్రీకృష్ణపరమాత్మకు నమస్కారము.

# శ్రీ వ్యాస ధ్యానము

నమోఽస్తుతే వ్యాస విశాలబుద్ధే
ఫుల్లారవిన్దాయతపత్రనేత్ర ।
యేన త్వయా భారత తైలపూర్ణః
ప్రజ్వాలితో జ్ఞానమయః ప్రదీపః ॥

విశాలబుద్ధియు, వికసిత కమలపత్రనేత్రుడవును, భారతతైలమధ్యమున గీతాజ్ఞానప్రదీపమును లెస్సగ వెలిగించినవాడవునగు ఓ వ్యాసమహర్షీ నీకు నమస్కారము.

# శ్రీ గీతాధ్యానము

పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయమ్
వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యే మహాభారతమ్
అద్వైతామృతవర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయినీం
అంబ ! త్వా మనుసందధామి భగవద్గీతే భవద్వేషిణీమ్.

భగవంతుడగు శ్రీకృష్ణునిచే స్వయముగ అర్జునునకు ఉపదేశింపబడినట్టియు, సనాతన మునీంద్రుడగు వేదవ్యాసునిచే మహాభారత మధ్యమున కూర్చబడినట్టియు, పదునెనిమిది అధ్యాయములతో గూడి అద్వైతామృతమును వర్షించుచు సంసారదుఃఖములను శమింపజేయునట్టియు గీతామతల్లీ ! నిన్ను ధ్యానించుచున్నాను.

# శ్రీ గురుధ్యానము

భవారణ్యప్రవిష్టస్య దిఙ్మోహ భ్రాన్తచేతసః ।
యేన సందర్శితః పన్థా తస్మై శ్రీగురవే నమః ॥

సంసారారణ్యమున ప్రవేశించి దిక్కుతెలియక భ్రాంతితో గూడి యున్నట్టి జీవునకు ఎవడు మార్గమును చూపునో అట్టి గురుదేవునకు నమస్కారము.

# గీతా మహిమ

1. భగవద్గీతా కించిదధీతా
గంగాజల లవకణికా పీతా
సకృదపి యేన మురారి సమర్చా
తస్య కరోతి యమోఽపి న చర్చామ్.

భగవద్గీతను కొంచెమైనను అధ్యయనము చేయువానిని, గంగా జలమును ఒకింతైనను త్రాగువానిని, శ్రీకృష్ణమూర్తిని ఒక్క పర్యాయమైనను పూజించువానిని యముడు బాధింపకుండును.

2. భారతామృత సర్వస్వం విష్ణోర్వక్త్రాద్వినిస్సృతం।
గీతా గంగోదకం పీత్వా పునర్జన్మ న విద్యతే॥

మహాభారత సారమున్ను, అమృతస్వరూపమున్ను, సాక్షాద్విష్ణుభగవానుని ముఖారవిందమునుండి వెలువడినదియు నగు భగవద్గీతయను గంగయొక్క ఉదకమును పానముచేయువారికి జన్మరాహిత్యము సిద్ధించును.

3. గీతాశాస్త్రమిదం పుణ్యం
యః పఠేత్ ప్రయతః పుమాన్ ।
విష్ణోః పదమవాప్నోతి
భయ శోకాదివర్జితః ॥

అతి పవిత్రమగు ఈ గీతాశాస్త్రము నెవడు ప్రయత్న పూర్వకముగ పఠించునో అట్టివాడు భయ దుఃఖాదిరహితమగు పరమాత్మ పదమును బొందుచున్నాడు.



Be fearless

# దైవప్రార్థన

కరుణామూర్తియగు సర్వేశ్వరా! మాచిత్తము సర్వకాల సర్వావస్థలయందును నీ పాదారవిందములందు లగ్నమై అచంచలమైన భక్తితో కూడియుండునట్లు అనుగ్రహింపుము!

పరమదయానిధీ! ప్రాతఃకాలమున నిద్రలేచినది మొదలు మరల పరుండు వరకును మనోవాక్కాయములచే మావలన ఎవరికిని అపకారము కలుగకుండునట్లును, ఇతర ప్రాణికోట్లకు ఉపకారము చేయులాగునను సద్బుద్ధిని దయచేయుము.

సచ్చిదానందమూర్తీ! నిర్మలాత్మా! మా యంతఃకరణమునందు ఎన్నడును ఏ విధమైన దుష్టసంకల్పముగాని, విషయవాసనగాని, అజ్ఞానవృత్తిగాని జొరబడకుండునట్లు దయతో అనుగ్రహింపుము!

వేదాంతవేద్యా! అభయస్వరూపా! మాయందు భక్తి, జ్ఞాన, వైరాగ్య బీజము లంకురించి శీఘ్రముగ ప్రవృద్ధములగునట్లు ఆశీర్వదింపుము. మఱియు ఈ జన్మమునందే కడతేరి నీ సాన్నిధ్యమున కేతెంచుటకు వలసిన శక్తిసామర్థ్యములను కరుణతో నొసంగుము!

దేవా! నీవు భక్తవత్సలుడవు! దీనులపాలిటి కల్పవృక్షమవు! నీవుతప్ప నాకు ఇంకెవరు దిక్కు? నిన్ను ఆశ్రయించితిని. అసత్తునుండి సత్తునకు గొనిపొమ్ము. తమస్సునుండి జ్యోతిస్సునకు తీసికొనిపొమ్ము. మృత్యువునుండి అమృతత్వమును పొందింపజేయుము. ఇదే మావినతి. అనుగ్రహింపుము. నీదరి జేర్చుకొనుము. పాహి మాం, పాహి మాం, పాహి మాం, పాహి.

ఓం తత్ సత్.

శ్రీ శుకబ్రహ్మాశ్రమము, కాళహస్తి.

---

(ఈ ప్రార్థనను ఎవరు ప్రతిదినము నియమము తప్పక ఉదయము నిద్రలేచునపుడు, రాత్రి పరుండబోవునపుడును మనస్ఫూర్తిగా పఠించుదురో, అట్టివారికి జీవితమునం దేలాటి దోషములున్ను కలుగకుండుటయే గాక భగవంతునియొక్క అనుగ్రహమునకున్ను వారుపాత్రులు కాగలరు.)



శ్రీకృష్ణపరమాత్మనే నమః

# 1-వ అధ్యాయము

# అర్జున విషాదయోగము

శ్రీభగవద్గీతను ప్రారంభించుటకు ముందుగా ఆ గీత ఏ శ్రీకృష్ణ పరమాత్మయొక్క ముఖారవిందమునుండి వెలువడినదో, వారిని భక్తిపూర్వకముగ స్మరించుట శ్రేయోదాయకమైయున్నది. గ్రంథకర్తపై ఎంతెంత విశ్వాసము అధికముగ నుండునో గ్రంథస్థవిషయము అంతంతచక్కగ హృదయగోచర మగుచుండును. దేవతయందుగాని, తీర్థమందుగాని, బ్రహ్మనిష్ఠునియందుగాని, మంత్రమందుగాని, జ్యోతిష్కునియందుగాని, వైద్యునియందుగాని, గురువునందుగాని, ఎవరెవరికి యెట్టి భావనయుండునో, ఆ ప్రకారమే ఫలితము సిద్ధించుచుండునని శాస్త్రప్రమాణము—

**దేవే తీర్థే ద్విజే మంత్రే దైవజ్ఞే భేషజే గురౌ**
**యాదృశీ భావనా యస్య సిద్ధిర్భవతి తాదృశీ.**

కాబట్టి శ్రీకృష్ణుని నామమును స్మరించుటద్వారా వారియందు పరిపూర్ణవిశ్వాసమును ప్రదర్శించి ఆపిదప గీతోపన్యాసములను ప్రారంభించెదము. [నామము-శ్రీకృష్ణచైతన్య ప్రభునిత్యానంద, హరేరాం హరేకృష్ణ రాధేగోవింద" అని శ్రీవారు పలుకుచు అందరిచేతను పలికించిరి.]

ఇప్పుడు మన హృదయములన్నియు శ్రీకృష్ణస్మరణముచే పవిత్రములైనవి. వాక్కు ప్రభునామముచే పునీతమై పోయినది. ఆధ్యాత్మిక తత్త్వగ్రహణమునకు ఇట్టి క్షేత్రశుద్ధి అత్యావశ్యకమైయున్నది. ఏలయనగా అనేక ప్రాపంచిక వ్యవహారముల మధ్యనుండి అకస్మాత్తుగ విచ్చేసి దైవవిచారణ ప్రారంభించినను అది చిత్తమునకు హత్తుకొనక వ్యర్థమైపోవును. నామస్మరణచేగాని, ప్రార్థనాదులచేగాని, స్తోత్రపఠనముచేగాని మొట్టమొదట చిత్తమును ప్రపంచమువైపునుండి మరల్చి దైవోన్ముఖముగ నొనర్పవలెను. ఏకాగ్రతను కలుగజేయవలెను. దున్నిన నేలయందు విత్తనము పెట్టిన, త్వరలో మొలకవచ్చునట్లు అత్తఱి హృదయక్షేత్రమున జ్ఞానతత్త్వము లెస్సగ ప్రకాశించును. చిన్నపిల్లలు 'బిళ్లంగోడు' అను ఆట ఆడుకొనుచుందురు. ఒక చిన్నకఱ్ఱ మరియొక పెద్దకఱ్ఱ తెచ్చుకొని, నేలలో చిన్నగుంటత్రవ్వి, చిన్నకఱ్ఱను దానిపై నుంచి పెద్దకఱ్ఱతో దానినొక దెబ్బకొట్టి పైకిలేపి ఆ పిదప ఆ లేచిన దానిని గట్టిగాకొట్టి దూరమునకు పంపుదురు. అట్లే ప్రారంభమున చిత్తమును ప్రార్థనా, నామస్మరణాదులచే పరమార్థరంగమున ఒకింత పైకిలేపి, ఆ పిదప తత్త్వవిచారణచే ఊర్ధ్వముగ గొనిపోవలెను.

ఇపుడు శ్రీకృష్ణనామస్మరణచే మన మనంబులు దైవోన్ముఖములుగ వర్తించుటచే ఇక గీతోపన్యాస ముపక్రమింపవచ్చును. అయితే ప్రారంభమందు అందఱును ఒక్కవిషయము జ్ఞాపకమునందుంచుకొనవలయును. అది యేది యనిన, శ్రవణమాత్రముచే సంతుష్టి నొందరాదు. శ్రవణము

చేసినదానిని వెంటనే మననము చేయవలెను. మననము చేసిన దానిని నిదిధ్యాసనము గావింపవలెను. అపుడే సత్యము హృద్గతముకాగలదు. తత్త్వము రక్తనాళములలో ప్రవేశించి మూర్తివంతమై యలరగలదు. కావుననే శాస్త్రములలో శ్రవణ, మనన, నిదిధ్యాసనములను మూడు అంగములను ఏర్పరచిరి. కాని ప్రస్తుతకాలమున జనులలో పెక్కురు ఉపన్యాసములను శ్రవణముచేసి అంతటితో తమ పని పూర్తి అయినదని తలంచుచున్నారు. కనుకనే వారు ఉన్నతిని పొందలేకున్నారు. అట్టి వారినిగూర్చి వివేకానందులు చెప్పిన వాక్యములను వినుడు—

"With them hearing new things grows into a kind of disease, a sort of religious drink-mania. They want to hear new things just by way of getting a temporary nervous excitement. Religion is with these people a sort of intellectual opium eating and there it ends."

("కొందఱికి శ్రవణము ఒక జబ్బుగా మారిపోవుచున్నది. తాత్కాలిక మనోరంజనముకొఱకే వారు వినుచుందురు. ప్రతిరోజు నల్లమందు ఒకింత తినువారివలె, వారు కొద్దికొద్దిగా వేదాంతమును కులాసాగా వినుచు అంతటితో తమపని పూర్తి అయినదని తలంచి అనుష్ఠానమునందు ప్రవేశింపక యుందురు.")

కనుక గీతోపన్యాసములకంటె గీతానుష్ఠానమే ప్రధానమైనది. పూర్వము శ్రీకృష్ణచైతన్యులు దక్షిణాభారతమున యాత్రచేయుచు శ్రీరంగపట్టణమునకు విచ్చేయు అట నొకచోట గీతాపారాయణ జరుగుచుండుట జూచి యచటికి వెళ్ళెను. అనేకులు గ్రంథములను చేతులందుంచుకొని పారా

యణము సలుపుచుండిరి. కాని అందొక్కనియొద్ద మాత్రము గీతలేదు. ఆతని కంటివెంట ధారాధారగా అశ్రువులు మాత్రము రాలుచుండెను. పారాయణము పూర్తి అయినపిదప సన్న్యాసులాతనిని సమీపించి "నాయనా! నీయొద్ద గీతాపుస్తకము లేదేమి?" అని ప్రశ్నింప 'నాకు చదువురాద'ని ఆతడు సమాధాన మొసగెను. మఱి యేల నీ నేత్రములనుండి అశ్రువులు రాలుచున్నవని ప్రశ్నింప 'నేను నేత్రములను మూసికొనగనే కురుక్షేత్రరణరంగమున శ్రీకృష్ణపరమాత్మ రథసారథిగ నుండి అర్జునునకు దివ్యోపదేశము చేయుచున్న దృశ్యము నాకన్నులకు గొట్టినట్లగపడుచున్నది. ఆ పవిత్ర దృశ్యమునుగాంచి ఆనందాతిరేకముచే నా కంటివెంట బాష్పములు రాలుచున్నవి' అని యాతడు వచింప, అంతట సన్న్యాసులు అచటనున్నవారి నందఱిని ఉద్దేశించి "ఓ జనులారా! మీరందఱు నీతనివలె గీతా పారాయణము చేయువారలు కండో" అని నుడివెను. కావున గీత అనుభూతి ప్రధానమైనది. గీతను జీర్ణింపజేసికొనుట నెల్లరు నేర్చుకొనవలెను. అదియే నిజమైన పారాయణము, నిజమైన శ్రవణము. కావున మీరందఱున్ను గీతాశ్రవణముచే గీతామననముచే పరిణతహృదయులై, గీతాధర్మములతో తాదాత్మ్యమునొంది ఆనందమును చూరగొనవలెను. అప్పుడే 'గీతా సుగీతా కర్తవ్యా' అనునది సార్థకము కాగలదు.

మఱియు ఇట్టి గీతాశ్రవణేచ్ఛ పూర్వపుణ్యమువలననే కలుగగలదు. పాపము హృదయమందున్నచో జనులకు దైవ కార్యములందు ప్రీతిజనించదు. ఒకవేళ జనించినను నిలువదు. మనస్సు రాగాది కషాయయుతమై మలినముగా నున్నచో

దైవమునందుగాని, దైవవాక్కునందుగాని అభిరుచి గలుగదు. కనుకనే శ్రీ శంకరాచార్యులవారు

**తపోభిః క్షీణపాపానాం శాన్తానాం వీతరాగిణాం**
**ముముక్షూణామపేక్ష్యోఽయ మాత్మబోధో విధీయతే (ఆత్మబోధ)**

అని చెప్పియున్నారు. అనగా 'తపస్సుచే పాపములు నశించిన వారును, శాంతచిత్తులును, రాగరహితులు నగు ముముక్షువులకొఱకీ యాత్మబోధ చెప్పబడుచున్నది.' కాబట్టి పుణ్యకార్యములచేతను, నామస్మరణచేతను, ప్రార్థనాదులచేతను మొట్టమొదట పాపములను నశింపజేసుకొనవలయును. అప్పుడే దైవవాణిని వినుటకును, అనుభవించుటకును నోచుకొనగలము. భగవద్గీతలో 'జ్ఞానము, జ్ఞేయము' అను రెండు విషయములు ప్రధానముగా పేర్కొనబడినవి. అందు జ్ఞానము సాధన, జ్ఞేయము సాధ్యము. సాధ్యవస్తువును గూర్చి ఒకింత చెప్పి సాధనను గూర్చి గీత విశేషించి పేర్కొనినది. ఏలయనగా సాధనయందు దారి తేరినచో సాధ్యవస్తువు కరతలామలకమై పోవును. కనుకనే శీల నిర్మాణమునకు (Character-Building) గీత విశేష ప్రాధాన్యము నొసంగినది. రెండవ అధ్యాయములోని స్థితప్రజ్ఞలక్షణములు, పన్నెండవ అధ్యాయములోని అద్వేష్టృత్వాది గుణములు, పదుమూడవ అధ్యాయములోని అమానిత్వాది గుణములు, పదునాఱవ అధ్యాయములోని అభయసత్త్వసంశుద్ధ్యాది గుణములను జనులు ప్రయత్నపూర్వకముగ నలవరచుకొని, తద్ద్వారా క్షేత్రశుద్ధిని కలుగజేసుకొనినచో, జ్ఞేయ (ఆత్మ) ప్రాప్తి సులభతరమై పోవును.

ఇక గీతాస్వరూపమునుగూర్చి ఒకింత విచారించెదము. గీత ఉపనిషత్సారము. ఉపనిషత్తులను గోవులను పిదికి శ్రీకృష్ణ పరమాత్మ గీతామృతమను క్షీరమును లోకమునకు ప్రసాదించెను. గోవులయొక్క రూపవర్ణాదులు భిన్నములుగా నున్నను వాటి సారమగు పాలు ఒకేవిధముగ నున్నట్లు, ఉపనిషత్తులు విభిన్న తత్త్వములను ప్రతిపాదించినను, వాటి సారమగు గీత సమస్త ధర్మములను, మార్గములను సమన్వయపరచి సాధకునకు ఏకత్వమును బోధించినది. ఉపనిషత్సారమైన ఈ గీతామృతమును ఎవనిద్వారా లోకమునకు ప్రసాదించవలెనని ? అని శ్రీకృష్ణమూర్తి యోచించి, భీష్మద్రోణకృపాది మహానుభావులున్నప్పటికిన్ని వారందఱిని వదలి ఒక సామాన్య గృహస్థుడగు అర్జునుని ఆకార్యమున కెన్నుకొనెను. ఏలయనగా లోకములో గృహస్థాశ్రమమునందే పెక్కుండు కలరు. సాధువులు, సన్న్యాసులు, బ్రహ్మచారులు తక్కువ. కావున అధిక సంఖ్యాకులుగల ఆశ్రమమునే ఎన్నుకొనెను. మరియు గొప్ప రణరంగమునందు కల్లోల మధ్యమున గీత నుపదేశించుట చూడ, సంసారసమరమధ్యమున, తాపత్రయములచే పరివేష్టింపబడి, ప్రతిబంధములచే విఘ్నములచే సమాక్రాంతుడై యున్నప్పటికిని మనుజుడు భగవత్తత్త్వవిచారణ, భగవద్ధ్యానము చేయవచ్చునని లోకమునకు ఒక ఆదర్శమును చూపినట్లైనది. యుద్ధరంగమున అర్జునునకు గీతాశ్రవణావశ్యకత కలిగినట్లు, జీవితరంగములోని అల్లకల్లోలములలో మనుజునకు భగవత్తత్త్వవిచారణావశ్యకత ఎంతేని కలుగుచున్నది. భగవద్ధ్యానము ఎక్కడో, కొండగుహాలలోనో, అరణ్య మధ్యము

లందో, ఏకాంత మఠములందో, ఆశ్రమములందో, నదీతీర సైకతములందో మాత్రము చేయవలెనను అపోహను శ్రీకృష్ణమూర్తి ఈ గీతోపదేశము ద్వారా తొలగించివైచి, ఎవరైనను, ఏస్థానమందైనను ఎప్పుడైనను భగవద్విచారణా చింతనాదులు జరుపుకొని తరించవచ్చునని ప్రబోధించినవా డాయెను.

అయితే తరించవలెనను తీవ్రమైన అభిలాష మాత్ర ముండవలెను. ధర్మజిజ్ఞాస కలుగవలెను. విషయములపై రోత జనించవలెను. ఇదియే గీతాశ్రవణమునకు తగిన అర్హతయై యున్నది. అర్జునునకు అట్టిస్థితి ఉదయించినది. "ధర్మసమ్మూఢ చేతాః" అని తనపరిస్థితిని తానే యర్జునుడు వర్ణించుకొనెను. ధర్మమును తెలిసికొనవలెననెడు తీవ్రమైన జిజ్ఞాస అతనియం దంకురించినది. ఏలయనగా భ్రాంతిజనిత దృశ్యసత్యత్వజ్ఞాన ముదయించుటవలన 'అహం, మమ' ప్రత్యయము లంకురింప అర్జునుడు తన దేహమును నిత్యమని సత్యమని నమ్మి 'స్వజను' లని తాను భావించిన గురువులు, తాతలు, తండ్రులు మర ణింతురని శోకాకులుడయ్యెను. అత్తఱి ప్రపంచముయెడల అతనికి విరక్తి జనించినది. అప్పుడే

**న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ ।**
**కిం నో రాజ్యేన గోవింద కిం భోగైర్జీవితేనవా ॥**

అని యాతడు విలపించెను. అనగా 'నాకు విజయమువద్దు, రాజ్యమువద్దు, సుఖములువద్దు, భోగములువద్దు' అని పరితపించెను. అంతేకాదు,నాకు మూడులోకములు ప్రసాదించినప్పటికిని వల దనెను. (అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిం ను మహీ

కృతే.) ఇట్టి స్థితి ఉదయించుటయే, అనగా ధర్మమందుగాని, దైవమందుగాని, ఆసక్తిజనించుటయే, మఱియు దృశ్యమందు గాని భోగములందుగాని విరక్తిప్రాదుర్భవించుటయే ఆధ్యాత్మ జ్ఞానోపదేశమునకు తగిన అర్హత అయియున్నది. కనుకనే శ్రీకృష్ణమూర్తి ఇంతకుపూర్వ మనేక పర్యాయములు అర్జును నితో కలిసికొనుటయు మాట్లాడుటయు తటస్థించినను గీత నుపదేశింపక అదనుకొఱకై వేచియుండి సరిగా ఇప్పుడు చెప్పుటకు కారణమైనది. కాబట్టి అర్జునునివలె ఎవ్వరైనను సరియే దైవమునందు ధర్మమునందు విశ్వాసము గలిగియుం దురో ప్రాపంచిక సుఖములయెడ ఒకింతైన విముఖులై యుం దురో అట్టివారందఱును గీతాశ్రవణమునకు గీతాధ్యయనము నకు అధికారులే యగుదురు. కనుకనే శాస్త్రములు 'సుధీర్భోక్తా' అని వక్కాణించినవి. అనగా గీతామృతపానము నకు బుద్ధిమంతులందఱును అధికారులని అర్థము.

ఇక ప్రస్తుతవిషయమునందు ప్రవేశించెదము. నేడు గీత మొదటి అధ్యాయము విచారింపవలసియున్నది. ఈనాడు అతి పవిత్రమైన దివసమని మీరందరున్ను జ్ఞాపకము చేసికొనవలె యును. ఏలయనగా ఏ దివసమున అర్జునుడు రణరంగమున విషణ్ణుడై, శోకసంతప్తుడై ధర్మమార్గమును గూర్చి శ్రీకృష్ణుని ప్రశ్నించెనో మఱియు శ్రీకృష్ణుడు మోహవిముక్త్యుపాయ మగు (సాంసారతరణహేతువైన) గీత నుపదేశించెనో, ఆ పుణ్యదినము నేడే (మార్గశిర శుద్ధ ఏకాదశి) • ఇట్టి పవిత్ర

• శ్రీ స్వాములవారి గీతోపన్యాసములు సరిగా మార్గశిర శుద్ధ ఏకాదశి (గీతాజయంతి) నాడు ప్రారంభింపబడినవి.

దినమున మనము గీతనుగూర్చి చర్చించుట స్మరించుట ఎంతేని సమంజసము. అది మన భాగ్యమున్ను అయియున్నది. ఇంత వఱకు దేశములో వ్యక్తులకు జయంతులు జరుగుచున్నవే కాని గ్రంథములకు కాదు. కాని ఒక్క భగవద్గీతమాత్రము లోకములో జయంతి (గీతా జయంతి) ని జరుపుకొనుచు తన విశిష్టతను చాటుచున్నది.

'అర్జునవిషాద యోగము'తో గీత ప్రారంభమైనది. విషాద మనగా వేదన, దుఃఖము అని అర్థము. గీతను శుభముగా అని తెరచుటతోడనే విషాదసందర్శనమా? అని మీరు మనంబున క్లేశపడనక్కరలేదు. ఏలయనిన సామాన్యజనులుపొందు విషాదముకాదు అర్జునుని విషాదము. అది విషాదయోగము. సామాన్యముగ జనులు దృశ్యపదార్థములకొఱకై వాపోవుచుందురు. ఇవి కావలెను, అవి కావలెను, ఇవి పోవుచున్నవి, అవి పోవుచున్నవి, అని ఈప్రకారముగ ప్రపంచవస్తువులకై పరితపించు చుందురు. అట్టి విషాదము, రోగమేయగునుగాని యోగము కానేరదు. కాని ఇట అర్జునునివిషాదము అట్టిదికాదు. ధర్మము కొఱకై యాతడు పరితపించెను. కనుక ఆతనివిషాదము యోగముగా పరిణమించినది. అర్జునుడు విషాదము పొందియుండనిచో గీత ఆవిర్భవించియుండెడిదికాదు. అర్జునునివలెనే ఎవరెవరు ధర్మముకొఱకు, దైవముకొఱకు పరితపించెదరో, అట్టివారికి భగవానుడు ఆధ్యాత్మికపురోభివృద్ధికి చక్కని మార్గము చూపెదను. 'ఒకదానియందు ఆసక్తి, మఱియొకదానియందు విరక్తి' ఇదియే సర్వశాస్త్రసిద్ధాంతసంగ్రహము. అనగా దైవమునందు ఆసక్తి,విషయభోగములందువిరక్తి కలిగియుండవలెను. దైవము మాయ

అను భిన్నము (Fraction) లో క్రింది సంఖ్యయగు సూయము అధికమగుకొలది పై సంఖ్యయగు దైవము తగ్గుచుండును. అట్లే మాయాగుణములు, ఆశాపిశాచము, కామక్రోధాదులు జీవునియం దెంతెంత అధికమగుచుండునో, అతనియందున్న దైవత్వము అంతంత సన్నగిలిపోవుచుండును. అవి ఎంతెంత తగ్గుచుండునో దైవత్వము, ఆధ్యాత్మికత అంతంత ప్రబలు చుండును. ఏనాడు అవి సంపూర్ణముగ తొలగిపోవునో, అప్పుడు కైవల్యము మాత్రము శేషించును—

యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య హృదిస్థితాః
అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే

(కఠోపనిషత్తు)

అను కఠోపనిషద్వాక్య మీసత్యమునే ఋజువుచేయుచున్నది. అనగా హృదయమందలి కామాదులన్నియు ఎప్పుడు తొలగి పోవుచున్నవో అప్పుడు మనుజు డిచ్చోటనే బ్రహ్మమునుపొంది అమృతస్వరూపుడగుచున్నాడని అర్థము. మాయ, అజ్ఞానము, అవిద్య బహుకాలమునుండి జీవునియందు తిష్ఠవేసికొనియున్నది. దాని అస్తిత్వము తెలియనికాలమున మనుజుడు దానికి ఆశ్రయ మిచ్చియుండవచ్చునుగాని, ఏక్షణమున దానిని తెలిసికొనునో వెంటనే పారద్రోలవలెను. రాత్రి పరుండబోవునపుడు ఇంటిలోకి ఒకపాము జొరబడినదనుకొనుడు. పెట్టెసందులోదూరి ఎక్కడను కనిపించలేదనుకొనుడు-అత్తటి ఆ రాత్రి ఆ ఇంటియందున్న వారికి నిద్రపట్టునా? ఎట్లైనను మేల్కొని ఇల్లంతయు వెతికి దానిని తొలగించుటయో, సాగనంపుటయో చేయుదురుగదా! అట్లే మన హృదయములందు అనాదిగా ఆశ్రయము కల్పించు

కొని మనలను బాధించుచు దుఃఖసాగరమున బడవైచుచున్న ఈ అజ్ఞానముయొక్క అస్తిత్వమును తెలిసికొనిన జ్ఞానులగు మహాత్ములయొక్క సంసర్గముద్వారా దానిని బయటకు నెట్టి వేయవలెను. అర్జునుడట్లే చేసెను. తనయందు మోహము (అజ్ఞానము) ఉన్నదని తెలిసికొని వెంటనే శ్రీకృష్ణుని శ్రయించెను. తత్ఫలితముగ - 'నష్టో మోహః స్మృతిర్లబ్ధా' 'అజ్ఞానము నశించినది. ఆత్మస్వరూపము స్మృతికి వచ్చినది' అని అర్జునుడు చెప్పగలిగెను.

అయితే శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు తక్షణమే ఉపదేశింపలేదు. ముందుగా అతని ప్రవర్తనను బాగుగ గమనించెను. దృశ్యసౌఖ్యములయెడల అతనికి విరక్తి జనించినదా, లేదా యని విచారించెను. అర్జునుని ముఖతః ఎప్పుడు 'మున్ముందు శోకములకుండ నాశనము లేదు' అను వాక్యమును వినగనే అప్పుడాతని వైరాగ్యముపై భగవానునకు నమ్మకము కుదిరెను. అప్పుడే బ్రహ్మోపదేశము చేసెను. 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' అను బాదరాయణ సూత్రప్రకారము బ్రహ్మజిజ్ఞాసకు పూర్వము సాధనచతుష్టయసంపత్తి బాగుగ ఉండవలెను. అందును మొట్టమొదట వైరాగ్యము లెస్సగ సంప్రాప్తించవలెను. బ్రహ్మజ్ఞాన సౌధమునకు వైరాగ్యము పునాదివంటిది. పునాది గట్టిగ లేనిచో ఎంత పెద్దభవనమైనను అచిరకాలములో కూలిపోవునట్లు విషయవిరక్తి సంపూర్ణముగ లేనిచో తత్త్వజ్ఞానము కలుగదు. కలిగినను నిలువదు. దీపజ్యోతి వెలుగవలెనన్న, ప్రమిద, తైలము, వత్తి అవసరమైనట్లు జ్ఞానజ్యోతి వెలుగవలెనన్న వైరాగ్యమను

భక్తి అను తైలము, చిత్తైకాగ్రత అను వత్తి అవసరములై యున్నవి. కాబట్టి అర్జునునకు దృశ్యవిరాగభావము ఏర్పడిన ఈ ప్రథమాధ్యాయము తక్కిన పదునేడధ్యాయములకు రూపమగు గీతాగ్రంథమున కంతకును ఆధారభూతమై యుండు చున్నది. మఱియు తక్కిన అన్ని యోగములతోబాటు అర్జున విషాదమున్ను ఒక యోగముగ వర్ణింపబడినది. విషాదము చెడ్డదిగాని అర్జునవిషాదము మంచిది. 'విషయవిరక్తి, ధర్మ జిజ్ఞాస' అను ఈ రెండు పదములు 'అర్జునవిషాద' పదమందు అంతర్భూతములై గర్భితములై యున్నవి. ఆ పదము నయ్యవి వివరించి చెప్పుచున్నవి.

ఈ ప్రకారముగ అర్జునవిషాదయోగముయొక్క ప్రాముఖ్యత తేటతెల్లమైనది. బ్రహ్మలోకము ప్రసాదింపబడి నప్పటికిని దానిని తృణీకరించుట వైరాగ్యముయొక్క అవధి యని శాస్త్రములు వక్కాణించుచున్నవి—

బ్రహ్మలోక తృణీకారో వైరాగ్యస్యావధిర్మతః

అర్జునున కిట్టి స్థితి ఉదయించినదని అతని వాక్యములద్వారా ఋజువగుచున్నది. రాముడు కావలయుననిన కాముడు దూరముగా పోవలెను. రెండును ఒకేచోట ఉండుటకు వీలుపడదు. కావున రామవాంఛగలవాడు కామవాంఛను పారద్రోలవలెను. కామవాంఛగలవాడు రాముని ఆహ్వానించలేడు. ఏలయనగా రామసన్నిధియందు కామముపటాపంచలై పోగలదు. పూర్వము రావణాసురుడు సీతాదేవిని అశోకవనమందు కూర్చుండబెట్టి తన్ను జేపట్టవలసినదని ఎన్నివిధముల ప్రాధేయపడినను ఆమె అంగీకరించనందున దుఃఖాక్రాంతుడై దినమొక యుగముగ

గడుపుచుండ, అతని యర్ధాంగియగు మండోదరి ఒకనాడతనిని సమీపించి ఏల యిట్లు పరితపించుచున్నారని యడుగ రావణుడు విషయమంతయు సవిస్తరముగ నుడివెను. అంతట మండోదరి 'నాథా! సీతను స్వాధీనపఱచుకొనుటకు చక్కని యుపాయం బొందు వచించెదను ఆలకింపుడు. మీకు అష్టసిద్ధులున్నవిగదా! ఈ క్షణముననే అచ్చుగ శ్రీరామచంద్రునివలె వేషమును ధరించి సాక్షాత్ రామచంద్రుడే వచ్చినాడా యనిపించునట్లు చేసి సీతయొద్దకు బొమ్ము. అప్పుడు తత్క్షణమే ఆమె నీకు వశమగును!' అని నుడువ అప్పుడు రావణుడు-'ప్రాణేశ్వరీ! ఈయుపాయమువలన నా ప్రయోజన మిసుమంతైనియు సిద్ధింపదు. ఏలయనగా నేనెప్పుడు రాముని యాకృతిని ధరించుదునో అప్పుడు నాయందు కామము పలాయనమైపోవును. రాముని సన్నిధియందు కామము నిలువనేరదుకదా! ఇది ముమ్మాటికిని సత్యము. కామదేవతను ఆరాధించుటయే నా మతము గాని కామము బోగొట్టుకొనుటకాదు. అట్టి నాకు నీవాక్యమువలన ప్రయోజనమేమియు నుండబోదు' అని పలికెను. కాబట్టి దైవమును సాక్షాత్కరించుకొనగోరువారుగాని, పరమార్థసత్యముల నెఱుగగోరువారుగాని మొట్టమొదట తమయందున్న ప్రాపంచిక వాంఛలకు, కామక్రోధాదులకు తిలాంజలి నొసంగవలెను. దృశ్యవస్తువులందు విరాగభావ ముత్పన్నము చేసికొనవలెను. అర్జునునివలె ముల్లోక భోగములందును గూడ ప్రీతిలేక దైవమందు, ధర్మమందు ప్రీతి గలిగి యుండవలెను.'

మఱియు తరింపగోరువారు సర్వేశ్వరునియెడల అనన్య భక్తిగలిగి సద్గురువును ఆశ్రయించవలెను. అర్జునుని అదృష్ట

మేమియోకాని సాక్షాత్ వైకుంఠనాథుడే గురువుగదొరికెను. అనుభవజ్ఞుడైన సద్గురువుయొక్క ఆశ్రయములేనిచో ప్రకృతిని జయించుటగాని, తత్త్వ మనుభూతమగుటగాని సంభవింపదు. అర్జునుడు మొట్టమొదట ఏమేమియో తనబుద్ధికి తోచినట్లు ధర్మ పన్నములను ఏకరుపు పెట్టదొడంగెను (ఈ ప్రథమాధ్యాయములో). శ్రీకృష్ణపరమాత్మ ఏమియు ప్రత్యుత్తరమీయక నిశ్శబ్దముగ అంతయు వినుచుండెను. కాని తుట్టతుదకు అర్జునుడు అసలు కీలకమును గ్రహించెను. అది యేదియనగా భగవానునకు ప్రపత్తిని చెల్లించుటయే. ఇక తనవాదముచే ఏమాత్రము ప్రయోజనము లేదని గ్రహించెను. అర్జునుడు మహానుభావుడు గనుక వెంటనే కర్తవ్యమును తెలిసికొని శ్రీకృష్ణపరమాత్మకు సాష్టాంగనమస్కారము చేసి—

"శిష్యస్తేఽహం శాధిమాం త్వాం ప్రపన్నమ్"

"మహాత్మా! నిన్ను శరణుబొందుచున్నాను. శిష్యుడనగు నన్ను కడతేర్చుము" అని వేడుకొనెను. ఏ క్షణమున అర్జునుని ముఖతః ఈ వాక్యము వెలువడినదో ఆ క్షణము నుండియే గీతోపదేశము ప్రారంభమైనది. అంతకుముందుకాదు. ఏలయనగా అంతకుముందు అర్జునుని హృదయము పూర్ణ పరిపక్వత నొందలేదు. 'ప్రజ్ఞావాదాంశ్చ భాషసే' అన్నట్లు ప్రజ్ఞావాదములనే కావించుచుండెను. అనగా శిరస్సునుండి (మెదడునుండి) వెలువడిన వాక్యములనే పలుకుచుండెను గాని హృదయమునుండి వెలువడినవి కావు. ప్రపంచములో రెండు వస్తువులున్నవి. ఒకటి శిరస్సు (head), రెండు హృదయము (heart) అని. ఇందులో మొదటిదానిని ఆశ్రయించుటయనగా

ప్రపంచములోని సమస్త లౌకికవిద్యలను, వాఙ్మయమును పరిగ్రహించుట యగును. రెండవ దానిని ఆశ్రయించుట యనగా దైవగుణములు గలిగి భక్తి జ్ఞాన వైరాగ్యములను జేబట్టి పవిత్రమైన శీలము గలిగియుండుట యగును. ఈ రెండింటిలో మొదటిదానికంటె రెండవది భగవంతుని దృష్టిలో మిన్న. శిరస్సును వికసింపజేసి హృదయమును సంకుచిత మొనర్చినచో నేమి ప్రయోజనము? అన్ని విద్యలను నేర్చుకొనినప్పటికీ, ప్రేమ, దయ, పరోపకారము మున్నగు దైవగుణములు లేనిచో ఏమి లాభము? శిరస్సు, హృదయము - అను నీ రెండింటిని వికసింపజేసుకొనుట మరీ ఉత్తమము. అట్లుగాక ఏ ఒక్క దానినో చేబట్టవలెనన్న మొదటిదానికంటె రెండవదియే శ్రేష్ఠము. అర్జునుడు మొట్టమొదట తన శిరస్సును నమ్ముకొని ప్రలాపము చేయదొడంగెను. పిమ్మట అది మార్గము కాదనుకొని హృదయము నాశ్రయించి సద్గురువుయొక్క చరణకమలములపై ప్రాలి భక్తి ప్రపత్తులను వెల్లడించెను. అర్జునుని ఆ వినయప్రవర్తనయే గీతకు నాందిగా తయారైనది. అక్కడ నుండియే గీత ఆవిర్భవించినది.

ఈ సందర్భమున నొక ఇతిహాసము జ్ఞాపకమునకు వచ్చుచున్నది. పూర్వకాలమున విశ్వామిత్రుడు ఘోరతపంబొనర్చి రాజర్షి యను బిరుదును బడసెను. అంతటితో తృప్తినొందక ఇంకను పెక్కు సాధనలనుచేసి బ్రహ్మర్షి యని ప్రజలందరిచేతను అనిపించుకొనెను. ఒక్క వసిష్ఠుడు మాత్ర మాతనిని రాజర్షి యనియే సంబోధించుచుండెను. అది విశ్వామిత్రునకు బాధాకరముగనుండెను. బ్రహ్మర్షిత్వమున కవసరమైన సాధనలేవైన

నాయందు లోపించినదా? ఏల వసిష్ఠు డిట్లు రాజర్షి యనియే పలుకుచుండెను? అని తలంచి ఇంకను తీవ్రముగ తపము చేయు మొదలిడెను. కాని అప్పటికిని వసిష్ఠుడాతనిని రాజర్షి యనియే పిలుచుచుండెను. దానిని ఓర్వలేక ఒకనాడు రాత్రి విశ్వామిత్రుడు పదునైన ఖడ్గమును జేబూని తన్ను కించపరచుచున్న వసిష్ఠుని శిరంబును ఛేదించివేయదలంచి వసిష్ఠుని కుటీరమునకు సమీపమున ఒకానొక పొదలో దాగుకొని సమయమునకై నిరీక్షించుచుండెను. ఇంతలో నారాత్రి తమ కార్యములన్నియు నిర్వర్తించుకొని వసిష్ఠుడు అరుంధతితో సహా కుటీరము వెలుపల నొక రాతితిన్నెపై కూర్చుండిరి. అది పున్నమినాటి రాత్రి. నలువైపుల శీతలచ్ఛాయలను వెదజల్లుచు చంద్రుడాహ్లాదకరముగ ప్రకాశించుచుండెను. అదిజూచి అరుంధతి వసిష్ఠునితో 'నాథా! నేడు వెన్నెల యెంతచక్కగానున్నది!' అనెను. అంతట వసిష్ఠుడు 'ఔను, విశ్వామిత్రుని కీర్తివలె ఈ వెన్నెల దిగంతముల వ్యాపించి ప్రజల నానందపరచుచున్నది' అని పలికెను. వసిష్ఠుని ముఖతః వెలువడిన ఆ వాక్యములను వినినతోడనే విశ్వామిత్రునకు కనువిప్పు గలిగెను. 'ఆహా! ఇంతకాలమువరకు ఎవనిని నేను శత్రురూపమున దలంచుచున్నానో, అట్టివాడు నాపై ఎంత కరుణ, సదభిప్రాయము కలిగియున్నాడు! ఇట్టి దయాశీలునా వధించుట! ఛీ! ఈనాజీవితమునకు ధిక్కారము!' అని తలంచుకొని ఖడ్గమును పారవేసి పరువెత్తుకొని వెళ్ళి అమాంతముగ వసిష్ఠుని పాదములపైబడి సాష్టాంగదండప్రణామం బాచరించెను. వసిష్ఠుడాతనిని లేవనెత్తి 'ఏమండీ! బ్రహ్మర్షి గారూ! ఎప్పుడు దయ చేసినారు?' అని ప్రశ్నించెను. అంతట

విశ్వామిత్రుడు 'మునీంద్రా! ఇంత కాలమువరకు నన్ను రాజర్షి యని పిలుచుచు ఇపుడేల బ్రహ్మర్షి యని పలికితిరి? అని యడుగ 'ఇంతవఱకు మీయందు అహంకారము, గర్వము పూర్తిగ శమించలేదు. మహాత్ములయెడ, సద్గురువులయెడల, పరమాత్మని యెడల మీకు పూర్ణ భక్తి గలుగలేదు. మీ తల వారి యొద్ద వంగలేదు. ఇపుడో వంగినది. కాబట్టి బ్రహ్మర్షి అయితిరి. అహంకారము చచ్చుట, వినయవిధేయత లావిర్భవించుట ఇదియే బ్రహ్మర్షిత్వమునకు గురుతు' అని వసిష్ఠమునీంద్రుడు పలికెను.

ఇట్టి విషయమునే అర్జునుడు గీతయొక్క ఆరంభదశ యందు శ్రీకృష్ణునిమాహాత్మ్యమెడల ప్రదర్శించి గీతాశ్రవణము నకు యోగ్యతను సంపాదించి తనకేగాక మన కందరకును గూడ మహోపకారమును చేసినవాడాయెను. పూర్వ మర్జునుడు కృష్ణునకు కేవలము సఖుడుగా మాత్రమే యుండి యుండెను. కనుక ధర్మోపదేశమును నోచుకొనలేదు. ఇపుడో 'భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్' అను శ్రీకృష్ణవాక్యానుసారము సఖుడుగను, భక్తుడుగను కూడ తయారయ్యెను. ఎపుడు శిష్యునియందు భక్తి ఉదయించినదో అపుడు గురుముఖతః గీతామృతవాహిని ప్రవహించినది. కావున సంసార సాగరమును తరింప తలంచువారందరున్ను, తత్త్వ బోధను కాంక్షించువారందరున్ను గురువుయెడల, భగవంతునియెడల పరిపూర్ణ విశ్వాసము, అనన్యభక్తి కలిగియుండవలెనని అర్జునోదంతముద్వారా సువ్యక్తమగుచున్నది. జ్ఞానము ఎవనికి కలుగును ? అను ప్రశ్నకు భగవానుడు గీతలో నిట్లు సమాధాన

మొసంగెను 'శ్రద్ధావాన్ లభతేజ్ఞానం' శ్రద్ధా విశ్వాసములుగల వాడే జ్ఞానమును పొందగల్గును. మఱియు నిట్లు వచించెను —

**అశ్రద్దధానాః పురుషా ధర్మ స్యాస్య పరన్తప**
**అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని.** (౯-౩)

దైవమునందు, ధర్మమునందు విశ్వాసము లేనివారును, శ్రద్ధలేని వారు భగవంతుని పొందజాలక మృత్యురూపమగు సంసార సముద్రమున పడిపోవుదురని భావము. కావున దైవముకలదని, ధర్మము ఉద్ధరించునని పరిపూర్ణ విశ్వాసముతో అనన్యభక్తితో గీతను శ్రవణము చేయవలెను. అప్పుడుమాత్రమే అజ్ఞానజనిత మోహరహితుడు కాగల్గును. అట్లుగాక సంశయాత్ముడై, అపనమ్మకముతో ప్రారంభించినచో 'సంశయాత్మా వినశ్యతి' అనునట్లు వినాశమునే పొందును. నమ్మకముతో గీతాసాధనలను ఆచరణయందుంచుకొనినచో ఫలితము కరతలామలకమై ప్రత్యక్షముగ ఆనందానుభూతి గలుగగలదు. రోగి వైద్యుని యొద్దకేగి 'నీ మందు నా వ్యాధిని నయము చేయగలదా' అని యడిగిన 'తప్పక నయముచేయగలదు. కాని దానిని సేవింపవలెను' అని వైద్యుడు చెప్ప 'అట్లుకాదు నయమగునని నీవు ప్రత్యక్షముగ ఋజువుచేసిననే నేను సేవింతును' అను సమాధాన మెట్టిదో యోచించుకొనుడు. అట్టివారికి ఔషధసేవనముగాని, వ్యాధినివారణగాని ఎట్లు సంభవింపవో, అట్లే అవిశ్వాసముతోను, అశ్రద్ధతో గీతను సమీపించినవారికిని భవరోగము నిర్మూలనము కానేరదు. దుఃఖరాహిత్యము కలుగనేరదు. కుంభవృష్టి కురియుచున్నను పాత్రను బోర్లించిపట్టుకొనినచో ఒక్క చుక్క నీరైనను అందుపడనట్లు విశ్వాసహీనునకు అశ్రద్ధధానునకు గీత

వలన ఇసుమంతేని ప్రయోజనము కలుగకుండును. అర్జునుడు మాత్రము ఫలితమును పొందగల్గెను తక్కినవారు పొందలేరు అను సంశయమునకు ఏమాత్రము తావీయక గీతాగంగోదక పానముచే సర్వులున్ను పాపరహితులు, మృత్యురహితులు అగుదురను అకుంఠితశ్రద్ధతో భగవద్గీత నుపక్రమింపవలయును. అర్జునునకు 'పార్థుడ'ను పేరుగలదు. పృథివిలో జనించినవారందరున్ను పార్థులే. అనగా పార్థునివలె సర్వమానవులున్నూ గీతా శ్రవణమునకు అధికారులే యగుదురు, శ్రద్ధావిశ్వాసములు గలిగియున్నచో

'యే మే మతమిదం నిత్యమనుతిష్ఠన్తి మానవాః'

అని పలికి భగవానుడు సర్వమానవులకును గీతార్హతను చాటినవాడాయెను.

అయితే వారివారి హృదయక్షేత్రములయొక్క పరిపక్వత ననుసరించి ఒకేబోధ భిన్నభిన్న వ్యక్తులందు భిన్నభిన్నముగ భాసించుట లోకములందు సహజము. గీతామృతమును అర్జునుడు, హనుమంతుడు, సంజయుడు, వ్యాసుడు గ్రోలి ఆనందాంబోధి నోలలాడి తరించిరి. కాని అదేబోధను ధృతరాష్ట్రుడు విని ఫలితమును పొందజాలకపోయెను. క్షేత్రము శుద్ధముగా నుండవలెనే, ఒకే విత్తనము మెత్తటి మట్టిలోపడిన త్వరగా మొలకెత్తును; ఇసుకలోపడిన నెమ్మదిగా మొలచును; రాతిపై పడిన అసలు మొలకెత్తదు-అట్లే ధర్మబోధయున్ను. కాబట్టి ధృతరాష్ట్రునకు జ్ఞానోదయము కాకుండుటలో ఆశ్చర్యము లేదు. మఱియు శుభమా అని గీత తెరువగనే 'ధృతరాష్ట్ర ఉవాచ' అని గ్రుడ్డివాని సందర్శనము పాఠకులకు లభించు

చున్నది. అట్లుండవచ్చునా? అని కొందరు ప్రశ్నింతురు. ధృతరాష్ట్రుడు ప్రపంచములోగల అజ్ఞానులందఱియొక్క ప్రతినిధి (Representative) కనుకనే గ్రుడ్డివాడుగా వర్ణింపబడుటకు కారణము. ఎవరికి జ్ఞాననేత్రములేదో వారందరును నేత్రము లున్నప్పటికిని గ్రుడ్డివారే యగుదురు. "ధృతరాష్ట్రం యేన సః-ఇతి ధృతరాష్ట్రః" - తనదికాని రాష్ట్రమును ధరించిన వాడు ధృతరాష్ట్రుడు. తన రాష్ట్రము ఆత్మ. తనది కాని రాష్ట్రము దృశ్యప్రపంచము, ప్రకృతి. అనగా దృశ్యప్రపంచము సత్యమని నమ్మువారందరున్ను ధృతరాష్ట్రులే యగుదురు. అసత్యమును సత్యముగను, సత్యమును అసత్యముగను భావించు వారున్ను, దేహాదులే తామని అభిమానించువారున్ను అందఱు ధృతరాష్ట్రులే. కాబట్టి గీత ప్రారంభమున అజ్ఞాన రూపమును నిలబెట్టి-'ఓ జీవులారా! అట్టి అజ్ఞానమును, గ్రుడ్డి తనమును గీతాజ్ఞాన ప్రభావముచే పోగొట్టుకొనుడు' - అని శ్రీకృష్ణపరమాత్మ ఆనతిచ్చుచున్నాడు.

మఱియు గీతప్రారంభమున 'ధర్మక్షేత్రే' అనుపదము గోచరించుచున్నది. అనగా గీతాశ్లోకములు 'ధర్మ' శబ్దముతో ప్రారంభమైనవి. అది మంగళవాచకము. ఏలయనగా ధర్మమునకును దైవమునకును భేదములేదు. భగవంతుడు ధర్మస్వరూపుడు. ధర్మము ఎచటనైన లోపించినచో ధర్మసంరక్షణార్థము తాను అవతారమెత్తుచుందునని గీతయందు భగవానుడు నుడివి యున్నాడు. 'ధర్మో రక్షతి రక్షితః'-అనునట్లు ఎవరు ధర్మమును కాపాడుదురో వారిని ఆ ధర్మమే రక్షించును. కాబట్టి ధర్మమే మనుజునకు జీవితలక్ష్యమై యున్నది. ధర్మమునచట

నుండునో అచట భగవంతుడు కాపురముండును. భగవంతుడెచటనుండునో అచట విజయము, ఐశ్వర్యము, నీతి యుండును. ఇదియే గీతాసారము. గీత మొదటి శ్లోకములోగల ప్రశ్నకు చివరి శ్లోకము చక్కని సమాధానరూపముగ నున్నది. అనగా

**'ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః**

**మామకాః పాండవాశ్చైవ కిమ కుర్వత సంజయ.'** (1-1)

అను ప్రశ్నకు

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః

తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ. (18-78)

అను సమాధానము సమీచీనముగనున్నది. యుద్ధములో ఎవరు జయించిరి అని ధృతరాష్ట్రుడడుగ తుట్టతుదకు సంజయుడు "ఎచ్చోట శ్రీకృష్ణపరమాత్మ యుండునో అచ్చోట విజయము సంభవించున'ని చెప్పెను. కాబట్టి గీతాశయమగు ఈ ధర్మావలంబనమును, ధర్మాచరణను ఎవరును మఱువరాదు. గీతయే ధర్మము. ధర్మమే గీత ధర్మమును గౌరవించుటయే గీతను గౌరవించుట, ధర్మాచరణము గలిగియుండుటయే గీతను ప్రేమించుట యగును. గీతాసారమేమియని ఎవరైన ప్రశ్నించినచో గీత మొదటిశ్లోకముయొక్క మొదటిపదమగు 'ధర్మ'మని చెప్పియూరకున్న చాలును. తక్కిన 700 శ్లోకములున్ను ఆ పదముయొక్క భాష్యము మాత్రమే యగును.

ఈ ప్రకారముగ భగవద్గీత ప్రథమాధ్యాయమగు అర్జున విషాదయోగములోని కొన్ని ముఖ్యాంశములనుగూర్చి సంక్షేపముగ నేటిదినము మనము విచారించినాము. అర్జునునివలె

ధర్మముకొఱకు, దైవముకొఱకు విలపించువాడు మానవుడు నేర్చుకొనవలెను. లోకములో జనులు ధనముకొఱకు విలపించుచున్నారు, భోగములకొఱకు విలపించుచున్నారు, ఐశ్వర్యముకొఱకు విలపించుచున్నారు. కాని దైవముకొఱకు విలపించువారెందఱు? బిడ్డ ఊయలయందు పడుండి ఏడ్చినచో, అన్ని పనులు వదలుకొని తల్లి ఎక్కడున్నప్పటికిని పరుగెత్తుకొని వచ్చి అతని యోగక్షేమములను విచారించును. అట్లే భక్తుని మొరను భగవంతుడు ఆలకించుచునే యుండును. కావున దైవముకొఱకు, ధర్మముకొఱకు విలపించువాడే ధన్యుడు. రామకృష్ణపరమహంస దైవముకొఱకు విలపించెను. అట్లే మీరాబాయి విలపించెను. గజేంద్రుడు విలపించెను. పండరి భక్తులు విలపించిరి. ఇంకను ఎందఱో మహాత్ములు విలపించిరి. వారందఱికిన్ని జ్ఞానోదయము కలిగెను. అట్లే అర్జునుడున్ను ధర్మముకొఱకు విలపించి జ్ఞానోదయమును బడసెను. కావున భక్తమహాశయులారా! మన దృష్టిని ప్రాపంచిక సుఖములు నుండి మరల్చి దైవమందు ధర్మమందు నిలిపి, అర్జునునివలె శోకమోహవినాశమును బడసి బ్రహ్మానందము ననుభవింతుదుము గాక!

ఓం తత్ సత్.

(తదుపరి ముమ్మారు 'ఓంకార' స్మరణతో, శాంతి మంత్రములతో మొదటిరోజు ఉపన్యాసము ముగిసెను.

ఓమ్

# 2-వ అధ్యాయము

# సాంఖ్య యోగము

గీతాభవనమునందు పదునెనిమిది చక్కని గదులు కలవు. ఒక్కొక్క గదియందు విచిత్రమైన వస్తుసముదాయము ప్రదర్శింపబడినది. నిన్నటిదినము మొదటిగదిలో ప్రవేశించి లోని సామగ్రినిపరిశీలించినాము. ఈ దినము రెండవగదిలో ప్రవేశించుచున్నాము. ఇది "డబుల్ రూము" (double room) వలె చాల పెద్దదిగానున్నది. ఇదియే సాంఖ్యయోగము. సాంఖ్య విచారణా సంబంధమైన ఆత్మ, అనాత్మలస్వరూపము తెలియజేయబడినది యగుటచే ఈఅధ్యాయమునకు ఈ పేరు వచ్చినది. కర్మ, భక్తి, ధ్యానము, జ్ఞానము - అను క్రమపద్ధతిలో బోధించక శ్రీకృష్ణ పరమాత్మ ఆదిలోనే అఖండమైన ఆత్మజ్ఞానమును అర్జునునకు బోధించెను. అందులకు కారణము లేకపోలేదు. అర్జునుని అజ్ఞానరూపవ్యాధి అతితీవ్రమైనదిగా నున్నది. దానికి తీవ్రమైన ఔషధమునే ముందు పరమాత్మ ప్రయోగింపనెంచెను. ప్రమాదస్థితిలో నున్న రోగిని మొట్టమొదట ప్రమాదమునుండి తప్పించి తదుపరి ఇతర సేవలు చేయునట్లును, మునిగిపోవుచున్న వానిని ముందు లేవదీసి పిమ్మట తక్కిన పరిచర్యలు చేయునట్లును, తీవ్రభవరోగబాధితుడును, అజ్ఞానజన్య దేహభ్రాంతి పరివేష్టితుడును నగు అర్జునునకు గురుదేవుడగు శ్రీకృష్ణుడు తన మందులపెట్టెలోనున్న అతిశక్తివంతమైన ఔషధమునే మొట్టమొదట ప్రయోగించెను. అదియే ఆత్మజ్ఞానము. దృగ్దృశ్యవివేకము.

ఇట్టి ఆత్మజ్ఞానమును వివరించుటకు పూర్వము ధైర్యోత్సాహములను పురికొల్పునట్టి ఒకటి రెండు వాక్యములను భగవానుడు పలికియుండెను. నిర్భయత్వమును బోధించెను.

'క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరన్తప' (2.3)

'ఓ అర్జునా! అతినీచమైనట్టి ఈ మానసిక దుర్బలత్వమును పారద్రోలి, ధైర్యోత్సాహముతో పైకిలెమ్ము!' అని గంభీరముగ నుద్బోధించెను. శ్రీకృష్ణపరమాత్మ మొదటి అధ్యాయములో ధర్మబోధ యేమియు చేయలేదు. రెండవ అధ్యాయ ప్రారంభమున బోధ ఉపక్రమించుటతోడనే అతని ముఖారవిందమునుండి నిర్భయత్వ సూచకమగు ఈ ప్రశస్తమైన ఉపదేశము వెలువడినది. ఏమి ఆశ్చర్యము! ఆదిలో కర్మను బోధించలేదే, భక్తిని చాటలేదే, ధ్యానము నుపదేశింపలేదే, జ్ఞానము నుద్ఘాటించలేదే, ధైర్యమును నిర్భయత్వమును మాత్రముపదేశించెనే! ఏల? ఇదియే శాస్త్రములందుగల కీలకము. దీనిని తెలిసికొనినచో మనుజుడు ధన్యుడుకాగలడు. దిగులుతో నిరుత్సాహముతో ఆముదము త్రాగినవానివలె నుండునట్టివ్యక్తి ఏకార్యమును సాధించలేడు. లౌకిక క్షేత్రమందుగాని, పారమార్థిక క్షేత్రమందుగాని ఏడ్పుగొట్టువానిని చూచినవానికి కూడ ఏడ్పువచ్చును. అట్టివాడు సంఘములో నుండతగడు. ఏలయనిన ఆ ఏడుపు అను జబ్బును అతడు అందరికిని వ్యాపింపజేయును. నిరుత్సాహము, దుర్బలత్వము అంటువ్యాధి (epidemic or contagion) వంటివి. ఒకరికి అంటుకొనినచో అందరిని చెడగొట్టును. అట్టివారు ఏరంగమునకును ఉపయోగించరు. పరమార్థరంగమునకు అసలు ఉపయోగించరు. దుర్బ

లత్వము కలవాడు, అధైర్యమును వరించువాడు ఆత్మ సన్నిధికిని పొందజాలడని ఉపనిషత్తు లుద్ఘోషించుచున్నవి.

'నాయమాత్మా బలహీనేన లభ్యః' (ముండకోపనిషత్తు)

(The Atman cannot be attained by the weak)

ఈఆత్మ దుర్బలునిచే పొందబడదు. ఎచ్చట ధైర్యముండునో, ఉత్సాహముండునో, ఆనందముండునో, అచట పరమాత్మ నివసించుచుండును. ఎచట పిరికితనము, దిగులు, దౌర్బల్యము ఉండునో అచట దయ్యములు కాపురముండును.

ఉత్సాహం సాహసం ధైర్యం బుద్ధిశ్శక్తిః పరాక్రమః
షడేతే యత్ర తిష్ఠన్తి తత్ర దేవోఽపి తిష్ఠతి.

అను శాస్త్రప్రమాణమునసనుసరించి ఉత్సాహము, సాహసము, ధైర్యము, సద్బుద్ధి, శక్తి, పరాక్రమము అను నీయాఱుసుగుణములున్న ఉండుచోట సాక్షాత్ భగవానుడు నివాసముండును. కావుననే శ్రీకృష్ణపరమాత్మ గీతాప్రారంభమున ఇట్టి ధైర్యోత్పాదకవచనముచే నిర్వీర్యుని వలెనున్న అర్జునునియందు శక్తిసంచారము చేయుదొడగెను. చక్కటి 'ఇంజక్షన్' (Injuction) ప్రయోగించెను. గీతయొక్క గణపతిపూజ ఇచ్చటనే జరిగినది. భగవద్గీతను సాంగోపాంగముగ విచారించినచో భగవానుని (Be fearless అను) ఈనిర్భయమంత్రమునకు అచటచట ఎంతప్రాధాన్యమొసంగుచుపోయెనో విదితముకాగలదు. 16-వ అధ్యాయము చూడుడు. అట దైవగుణములను పేర్కొనుచు ఉల్లేఖించుచు మొట్టమొదటనే 'అభయం' అని వ్రాసెను. ఏల? అన్ని సుగుణములుండగా దీనినే నాయకుడు

(Captain) గ ఏల చేసెను? ఇది యుత్సాహముతో చేసినపని. నిర్భయత్వమున్నచో తక్కిన సుగుణములన్నియు వానియంతట నవియే క్రమముగవచ్చి ప్రవేశించును. ఈ రహస్య మెఱింగియే భగవానుడట్లు పలుకుటకు కారణము.

వివేకానందులు అమెరికాఖండమున ప్రబోధించినను 'Be fearless' అను నిర్భయమంత్రమును సలుపుచు పులుకడిగి దుర్బలత్వమే పాపమని నుడువుచు తమస్సునందలి జనులను మేలుకొలిపెను. Awake, arise, stop not till the goal is reached-ఉత్తిష్ఠత! జాగ్రత! ప్రాప్యవరాన్నిబోధత-లెండు, మేలుకొనుడు-గమ్యస్థానము చేరువరకు విశ్రాంతి లేక యుండుడు! అని వేదాంతశంఖారావమును మార్మోగునట్లు వినిపించెను. పిరికిపందలకు ఆధ్యాత్మక్షేత్రమున చోటులేదని బలముగ చాటెను—

"People with emaciated bodies and long faces are fit subjects for the physician, they are not yogins."

'దుర్బల దేహులు, ఏడుపుముఖములుగలవారు వైద్యులకు శిష్యులుగా నుండవలసినవారే కాని యోగు లెన్నటికిని కానేరరని నుడివెను. కాబట్టి గీతాప్రబోధము నుపక్రమింపనున్న ఈశుభ సమయమున రెండవ అధ్యాయ ప్రారంభమున భగవానుడు అర్జునుని నిమిత్తముగాజేసికొని ధైర్యోత్పాదకమగు ఈగంభీర సదుపదేశమును గావించుట ఎంతేని సమంజసముగా నున్నది.

ఇట్లుద్బోధించి శ్రీకృష్ణపరమాత్మ వెంటనే ఆత్మజ్ఞానము నుపదేశింప దొడంగెను. ఏ ప్రకారముగ? "ప్రహసన్నివ" ఆనం

దాతి శోకముతోఁగూడి సప్పుచు పలికెనట! అర్జునుడు ఎంతదుఃఖా క్రాంతుడై యుండెనో, కృష్ణుడు అంత హర్షాతిశయముతో కూడి యుండెను. ఇదియే అజ్ఞానికిని, జ్ఞానికిని గల భేదము. అజ్ఞానికి గోష్పాదజలము సాగరముగ తోచును. జ్ఞానికి సాగరము గోష్పదజలముగ స్ఫురించును. కనుకనే అజ్ఞాని సంసారమును జూచి భీతిల్లుచుండును. జ్ఞాని పరిహాసించుచుండును.

**యే తు పారంగతా బుద్ధేరిన్ద్రియైర్న వశీకృతాః**
**త ఏనాం జాగతీం మాయాం పశ్యన్తి కరబిల్వవత్. (వసిష్ఠగీత)**

“బుద్ధిని దాటినవారును అనగా బుద్ధికి ఆవలనున్న పరమాత్మను సాక్షాత్కరించుకొనినవారును, ఇంద్రియములకు వశులు కాని వారు నగు మహాత్ములు ఈ జగన్మాయను అరచేతియందలి మారేడుపండువలె ప్రత్యక్షముగ గాంచగల్గుదురు.” అట్టిస్థితిని పొందనివారు నిరంతరము ఏదియో యొక భీతిని ఎదుర్కొనుచునే యుందురు. వారు నిత్యమును అనిత్యముగను, అనిత్యమును నిత్యముగను భావించుచుందురు. శోకింపదగనివానిని గూర్చి శోకించుచుందురు. దేహాత్మ భ్రాంతి గలిగియుందురు. అవిద్యా ప్రభావముచే వారికి అట్లు భ్రాంతి జనించుచుండును.

**‘అనిత్యాశుచిదుఃఖానాత్మసు నిత్యశుచి సుఖాత్మఖ్యాతిరవిద్యా ’**
**(పతంజలి యోగసూత్రము)**

అనిత్యమును నిత్యముగను, అపవిత్రమైనదానిని పవిత్రవంతముగను, అనాత్మను ఆత్మరూపముగను వీక్షించుటయే అవిద్యయని పతంజలిమహర్షి నుడివియున్నాడు.

పూర్వమొకప్పుడు దేవేంద్రునకు శాపవశాత్తు భూలోకమున పందిజన్మయెత్తవలసివచ్చెనట. అత్తఱియాతడు భూమిపై

ఒక మడుగులో తన నివాస మేర్పరచుకొని ఆపందిసంసారముతో పందిపిల్లలతో బురదలోపడి కాలక్షేపము చేయుచుండెను. త్రిలోకసంచారియగు నారదు డటకేతెంచి ఆతనిశోచనీయమగు పరిస్థితి చూచి "ఓవరాహమా! నీవు దేవేంద్రుడవు, సురాధిపతివి. శాపబలముచే నిట్లయితివి. నీ పరిస్థితి నాకు జాలిగొలుపుచున్నది. స్వకీయ తపశ్శక్తిచే నిన్ను మరల దేవేంద్రుడుగ జేయదలంచినాను, అంగీకరింతువా?" అని యడుగ నంతట ఆ వరాహము 'అయ్యా! మీరు, మీతపశ్శక్తికి ఒకనమస్కారము; దయచేసి శీఘ్రముగ ఇచటనుండి తొలగిపొండు; నా యీ ఆనందమునకు భంగము కలుగ జేయకుడు. ఈ బురదలో నున్న సుఖము స్వర్గములో నున్నదని నేను తలంపను. ఈ ఆపందివంటి సుందరముఖము కలవారు ముల్లోకములలోను ఎచ్చటను లభింపరనుట నిక్కము! చూచితిరా, నా యీ (పంది) పిల్లలు! భాగ్యవశముచే వారు నాకు లభించినారు. జన్మార్జితపుణ్యము బలీయస్సునాకిట్టి ఆనందానుభూతి చేకూర్చినది. ఇద్దానికి తమరు విఘ్నమును గలుగ జేయకుడు. లేచిపొండు'- అననట! నారదుడు ఆశ్చర్యనిమగ్నుడై మాయావైభవమును తలపోసికొనుచు వెడలిపోయెను. చూచితిరా! ఇదియే అవిద్యయొక్క ప్రభావము. ఈ ప్రపంచమున సంసారకర్దమమునబడి దొర్లాడుచున్న జీవుడు క్షణికములైన భోగభాగ్యములకు వశుడై, నశ్వరములగు ప్రాపంచిక పదార్థములను సత్యములనినమ్మి శాశ్వతమగు తన ఆత్మస్వరూపమును విస్మరించుచున్నాడు. దేహమే తానని భావించి,బంధ్వాదులందు మమత్వము కలిగిశోకించుచున్నాడు. ఇట్టి దేహాత్మభ్రాంతియంతయు అవిద్య (అజ్ఞానముచే) కలుగు

చున్నది. అర్జునునకు భోగభాగ్యముల యెడల విరక్తి జనించుట ద్వారా అవిద్యయొక్క కొంతభాగము శమించినప్పటికిని, దేహాత్మబుద్ధి, బంధ్వాదులందుమమత్వము తొలగలేదు. దానిని తొలగించుటకై పరమాత్మ యిప్పుడు ప్రయత్నము చేయుచున్నాడు. అందులకై ఈ ప్రకారముగ చక్కని ఆత్మజ్ఞానోపదేశమును రెండవ అధ్యాయమున ప్రారంభించుచున్నాడు-

"ఓ అర్జునా! నీవు దేహముకాదు. దేహివి. దేహములు నశించును. దేహి (ఆత్మ) నశింపదు. అది ఎన్నడును పుట్టుటలేదు, చచ్చుటలేదు. అది శాశ్వతము, సనాతనము. అది అగ్నిచే దహింపబడదు, జలముచే తడుపబడదు, దేనిచేతను ఛేదింపబడదు. శరీరములు వస్త్రముల వంటివి. మురికివస్త్రములనుగాని, చినిగిన వస్త్రములనుగాని మనుజుడు తొలగించివేసి నూతనవస్త్రములను ధరించునట్లు జీవుడు కర్మవశముచే అనేక శరీరములను ధరించి మరల వానిని తొలగించివేయుచున్నాడు. కావున ఓ అర్జునా! వస్త్రములవంటి ఈ శరీరములకై నీవు శోకించవద్దు. నేనుగాని, నీవుగాని, ఈ రాజులుగాని ఆత్మరూపముతో ఎల్లప్పుడు ఉండువారమే. మనకు నాశమే లేదు. నాశము దేహములకే. అవ్యయమగు ఆత్మకు వినాశము కలుగజేయగల నాథు డెవ్వడును లేడు. కావున లెమ్ము! కర్తవ్యమునకు గడంగుము! సుఖదుఃఖములయందును, లాభాలాభములందును, జయాపజయములందును సమబుద్ధిగలిగి కార్యములనాచరింపుము. అట్లైతే పాపము నిన్నంటకుండును. 'సమత్వం యోగ ఉచ్యతే'-అట్టి సమత్వబుద్ధియే వాస్తవముగ యోగమనంబడును. కర్మలను చేయుటయందే నీకధికారము కలదు. కాని

వాని ఫలములను గోరుటయందు కాదు. కావున నిష్కామ బుద్ధితో కార్యముల నాచరింపుము. నీస్వస్వరూపమగు ఆత్మ యందు స్థితిగల్గి, దేహాభావనలేనివాడవై అసక్తముగ కర్మల జేయుము. అకర్మణ్యత్వము నాశ్రయించి సోమరివై పడియుండగూడ రాదు. అది తమోగుణ లక్షణము" అని యీ ప్రకారముగ భగవానుడు అమోఘమగు జ్ఞానసుధను వర్షింపజేసెను.

ఇచ్చోట ఒక వైచిత్ర్యము దృగ్గోచరమగుచున్నది. అది యేది యనిన శ్రీకృష్ణపరమాత్మ ముందు జ్ఞానమును బోధించి, తదుపరి కర్మను ప్రతిపాదించెను. ఈ అధ్యాయ ములో అంతియేకాదు. రెండవ అధ్యాయమగు సాంఖ్యయోగ మైన తదుపరి మూడవ అధ్యాయమగు కర్మయోగమును ప్రకటించెను. జ్ఞానవంతుడే కర్మను పరిపూర్ణ అనాసక్తితో, సర్వసమత్వబుద్ధితో ఆచరింపగల్గునని దీనిద్వారా తేలు చున్నది. ఆత్మజ్ఞానము కలిగిన పిమ్మట చేయు కార్యములు ఎంతయో పవిత్రవంతములుగను, నిర్దోషములుగను నుండును. కనుకనే జ్ఞానులగు మహాత్ములు బహుకాలము తత్త్వవిచారణ చేసికొని నిత్యానిత్యముల నెరింగి తదుపరి కర్మరంగములో ప్రవేశించి మహత్తరమగు లోకసేవ గావించి యుండిరి, గావిం చుచున్నారు. అయితే నిష్కామకర్మలచే ముందు చిత్తశుద్ధిని బడసిననేగాని జ్ఞానము పరిపూర్ణముగ కలుగదను సిద్ధాంతశ మున్ను సత్యమే. కాబట్టి ఒక చెంప ఈశ్వరార్పణబుద్ధితో కార్యము లాచరించుచు, మరియొక చెంప విచారణద్వారా ఆత్మతత్త్వము నవగాహనము చేసికొనుచు రావలెను. దీనినే సముచ్చయయోగము (The Yoga of Synthesis) అందురు.

భగవద్గీత ఇద్దానిని లెస్సగ పోషించినది. కర్మచేగాని, భక్తిచే గాని, యోగముచేగాని, జ్ఞానముచేగాని, వీనిలో ఒకటిచే గాని, లేక రెండిటిచేగాని, లేక అన్నిటిచేగాని, మీమీ సంస్కారమునననుసరించి ప్రయత్నించి మోక్షమును సాధింపుడు అని గీత యానతిచ్చుచున్నది. సామాన్యముగ జ్ఞానయోగ మనుదానిలో కర్మ, భక్తి, ధ్యానము అంతర్భూతములై యుండును. అట్లే కర్మయోగమునందు భక్తి జ్ఞాన ధ్యానము లున్ను, భక్తియోగమునందు కర్మజ్ఞానాదులున్ను అంతర్లీన ములై యుండును. మఱియు జ్ఞానముతో గూడిన కర్మయే శ్రేష్ఠ మని ఈ అధ్యాయమున భగవానుడు నిరూపించెను. ఎట్లనిన ఒకటి రెండు దృష్టాంతముల నిచట పొందుపఱచెదను.

'యోగస్థః కురు కర్మాణి'

అని ఇట చెప్పబడినది. అనగా 'ఆత్మస్థితియందు నిలుకడగల్గి కార్యములను చేయుము' అని యర్థము. దైవస్మరణచే, స్వస్వరూపస్మృతిచే కర్మరంగమునకు మెరుగు ఏర్పడును. అట్టి స్థితిలో చేయబడు కార్యములు అమోఘములుగ, బంధరహితములుగ, నిర్దుష్టములుగ నుండును. అత్తఱి కర్మలు చేసినను మనుజుడు నక్తముగాక యుండును మహాత్ములు జ్ఞానప్రాప్త్యనంతరము చేయు మహత్తరమైన పరోపకారకార్యము లన్నియును ఈ విధముగనే యుండును.

**అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తాః శరీరిణః**
**అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత (2-18)**

అను ఈ శ్లోకమునందుగూడ జ్ఞానసహితకర్మ ప్రతిపాదింప బడినది. 'ఓ అర్జునా! ఆత్మ (శరీరి) నిత్యము, నాశరహితము,

అప్రమేయము. దేహమో నాశవంతమైనది. ఈ సత్యమును తెలిసికొని (దేహముల వినాశమునందు శోకము లేక) ఇక యుద్ధమునకు లెమ్ము!

ఈ ప్రకారముగ జ్ఞాన కర్మలను ప్రతిపాదించి భగవానుడిక స్థితప్రజ్ఞ లక్షణములను నిరూపించబోవుచున్నాడు. ఈ అధ్యాయ ప్రారంభమున అర్జునుని (శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్) అను ప్రపత్తిదిగ్దర్శనఘట్టమందు భక్తియు, పిమ్మట ఆత్మానాత్మస్వరూప నిర్ణయమందు జ్ఞానమున్ను, తదుపరి నిష్కామకర్మాచరణావశ్యకతా నిరూపణమందు కర్మయు, తుట్టతుదకు స్థితప్రజ్ఞుని వర్ణనమందు ఇంద్రియ నిగ్రహప్రతిపాదకమైన రాజయోగమున్ను-ఇవ్విధముగ కర్మ భక్తి జ్ఞానయోగములు నాలుగున్ను ఈ రెండవ అధ్యాయమున పొందుపరుపబడినవి. కనుకనే గీతలోని అన్ని అధ్యాయములలోను రెండవ అధ్యాయము అత్యంతప్రధానమై యొప్పుచున్నది. ద్వితీయము అద్వితీయము (unparalled) అను ఖ్యాతిని ఆర్జించుకొనినది. 'సంక్షిప్తగీత' యనియు ఈ అధ్యాయమును కొందరు పేర్కొనుచుందురు. ఈ అధ్యాయము యొక్క చివరిభాగమున తెలుపబడినట్టి స్థితప్రజ్ఞుని లక్షణములు సాధనాపరులకు అత్యంతోపయుక్తములుగ నున్నవి. కనుకనే గాంధిమహాత్ముడు వీనిని ప్రతినిత్యము పారాయణము చేయుచుండెడివాడు. గీతాగ్రంథమున ప్రాణతుల్యముగ నున్నట్టి ఈ స్థితప్రజ్ఞ లక్షణములనుగూర్చి యిపు డొకింత విచారించుట సమంజసము.

కోరికల నన్నింటిని సంపూర్ణముగ విడిచిపెట్టి ఆత్మయందే సంతుష్టిని బొందవలయును. ఏ ఒక్క కోరిక మిగిలి యున్నను అది క్రమక్రమముగా అభివృద్ధినొంది జీవుని ఆత్మస్థితికి దూరునిగ చేయును. కనుకనే 'ప్రజహాతి యదా కామాన్ సర్వాన్' అని ఇచట 'సర్వ' శబ్దము చేర్చుటకు కారణము. మఱియు 'జహాతి' అనక 'ప్రజహాతి' అనుటలోను విశేషము కలదు. లెస్సగ వదలవలయునని దాని తాత్పర్యము.

**వాసనాయా స్తథా వహ్నేః ఋణవ్యాధి ద్విషామపి**
**స్నేహవైరవిషాణాం చ శేషః స్వల్పోఽపి బాధతే.**

(1) వాసన (2) అగ్ని (3) ఋణము (4) రోగము (5) ద్వేషము (6) రాగము (7) వైరము (8) విషము అను ఈ ఎనిమిది వస్తువులు పూర్తిగ తొలగిపోయిననే శాంతికల్గును. ఏ ఒక్కటి కొద్దిగ మిగిలియున్నప్పటికి, అదియే క్రమక్రమముగ వృద్ధినొంది అపకారమును కలుగజేయగలదు. కాబట్టి భగవానుడు కోరికలను పూర్తిగ తొలగించవలసినదిగా ఆనతిచ్చెను.

మఱియు తాబేలు తన అవయవములన్నిటిని లోనికి ముడుచుకొనునట్లు, విషయములపై వ్యాపించియున్న ఇంద్రియములను అచ్చోటనుండి మరల్చి స్వస్థానమగు హృదయమున చేర్చవలెను. దీనినే ప్రత్యాహార మందురు. ఇంద్రియములకు శబ్దస్పర్శాదులపై గల మక్కువను విచారణచే రహితమొనర్చి నిగ్రహింపవలయును.

**వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.**

ఎవరు తన ఇంద్రియములను నిగ్రహించుకొందురో అట్టివారి యొక్క ప్రజ్ఞ, ధ్యానము స్థిరముగ నుండును. ఎంతటి భౌతిక

శక్తులు, విద్యాప్రైదుష్యము, కలిగియున్నప్పటికిని తన యింద్రియములు తనకు లోబడకయున్నచో అతడు బానిసయే యగును. రాజ్యాధిపతి అయియున్నను సేవకునివలె అస్వతంత్రుడే యగును.

**యో న నిర్వాసనో నూనం సర్వధర్మపరోఽపి సః**
**సర్వజ్ఞోఽప్యభితో బద్ధః పఞ్జరస్థో యథా ఖగః. (వసిష్ఠగీత)**

వాసనారహితుడు కానివాడు, ఇంద్రియనిగ్రహము లేనివాడు సర్వశక్తులు కలిగియున్నను, సర్వజ్ఞుడైనను, పంజరములోని పక్షివలె నలువైపుల బంధింపబడియున్నవాడే యగునని వసిష్ఠులు శ్రీరామచంద్రుని కుపదేశించెను. ప్రహ్లాదుడున్ను తన తండ్రియగు హిరణ్యకశిపున కిట్లే బోధించెను.

**లోకములన్నియున్ గడియలోన జయించినవాడ వింద్రియా**
**నీకముఁ జిత్తమున్ గెలువనేరవు నిన్ను నిబద్ధుఁ జేయు నీ**
**భీకర శత్రులార్వురఁ బ్రభిన్నులఁ జేసినఁ బ్రాణికోటిలో**
**నీకు విరోధి లేఁడొకఁడు నేర్పున జూడుము దానవేశ్వరా.**

కనుకనే భగవానుడు ఇంద్రియ నిగ్రహమును గూర్చి ఈ అధ్యాయమందును తక్కినచోట్లనుగూడ నొక్కి చెప్పుటకు కారణము. అయితే అది యెట్లు ఏర్పడగలదు? జన్మాంతర సంస్కారముచే పరిపరివిధముల దృశ్యభోగములపైకి పరుగిడుచున్న ఆ బలీయమైన మనస్సును, ఇంద్రియములను నిరోధించుట యెట్లు? లోకస్థితిని చక్కగ విచారణ చేయవలెను. ప్రపంచ వస్తువులయొక్క నశ్వరత్వమునుగూర్చి మాటిమాటికి చింతన జేయవలెను. విషయభోగములవలన లభించు సుఖము క్షణికమైనదని, దుఃఖమిశ్రితమైనదని యూహించవలెను. ఇదియే దానికి ఉపాయము.

ఈ ప్రపంచమున ఎచ్చోట వెదికినను పంచభూతములు దప్ప అన్యమేమియు కానరాదుగదా!

**సర్వత్ర పంచభూతాని షష్ఠం కిం చిన్నవిద్యతే**
**పాతాలే భూతలే వాపి రతిమేతు క్వధీరధీః. (వసిష్ఠగీత)**

"పాతాళములోగాని భూలోకమునగాని ఎచట వెదికినను ఎల్లెడల భూమి, జలము మొదలగు పంచభూతములే కానవచ్చును గాని, ఆఱవవస్తువు లేదు. అట్టిచో ప్రజ్ఞావంతుడు వానియెడల ఆసక్తి ఏల గలిగియుండవలెను?" అని వసిష్ఠ వచనము. మఱియు ఈ ప్రపంచమున ప్రతివస్తువున్ను పరిణామశీలమై యున్నది. ఈనాడు రమణీయముగానున్న పుష్పమాల రేపటికి వాడిపోవుచున్నది. ఎల్లుండికి కుళ్ళిపోవుచున్నది. నేడు ఎంతయో ఆకర్షణీయముగ నున్నట్టి భోజనము రేపటికి పాచిపోవుచున్నది. ఈనాడు మహాసుందరముగనున్నట్టి స్త్రీయొక్కగాని, పురుషునియొక్కగాని శరీరము నలుబదిసంవత్సరములైన పిదప ముడుతలుపడి కృశించి వికారవంతముగా నగుచున్నది. ఇట్లు ప్రపంచమునందలి ప్రతిపదార్థమున్ను కొంతకాలమునకు పూర్తిగ మారిపోవుచున్నది. ఎయ్యేల, ఇప్పుడిచ్చటనున్న అణువు రేపు సూర్యుని లోనికి పోవచ్చును. సూర్యునిలోని అణువులు ఇచటకు రావచ్చును. 7 సంవత్సరముల పిదప ఈ శరీరములోని అణువులన్నియుపోయి క్రొత్తఅణువులు చేరునని విజ్ఞానశాస్త్రసిద్ధాంతము. ఈప్రకారముగ దృశ్యమంతయు పరిణామశీలమే అయియున్నది. ఇట్టి చంచలపదార్థములను నమ్మి వానినుండి ఆనందమును అభిలషించు వారందఱున్ను ఆశాభంగమును పొందగలరు. పొందుచున్నారుకూడను. ఏలయనిన,

నశ్వరవస్తువులనుండి కలుగు సుఖమున్ను నశ్వరముగానే యుండును. చపల వస్తువులనుండి కలుగు ఆనందమున్ను చపలముగానే యుండును. ఈ ప్రకారముగ వస్తువులలోగల దోషమును విచారించినచో ఇక ఇంద్రియములు వానిపై పడ కొత్తవు. "దుఃఖదోషానుదర్శనమ్" అని గీతయందు భగవానుడు వైరాగ్యమునకు ఉపాయము చెప్పియే యున్నాడు. ఇందుల కొక చిన్నదృష్టాంతము చెప్పెదను వినుడు.

పూర్వ మొకానొక రేవుపట్టణములో సముద్రతీరమునందు అనేకనావలు లంగరువేసి నిలుకడగనుండెను. అందొక నావయొక్క తెరచాపకఱ్ఱపై కొసను ఒక కాకివచ్చి వ్రాలెను. అది యేదో ఆలోచనలోనుండి కదలకయుండెను. ఇంతలో నావ సముద్రములోనికి బయలుదేరెను. వేగముతో కొన్నిమైళ్ళు పోయెను. కాకిమాత్రము కొయ్యపైననే ఉండెను. తీరా నావ సముద్రమధ్యమునకుబోవ కాకి ఎగిరిపోయెను. కాని ఎంత దూరము ఎగిరిచూచినను ఎక్కడను చెట్టుగాని, పుట్టగాని, నేలగాని లేనందుచేతను, చుట్టూ జలమయమైయుండుటవలనను, విహ్వలచిత్తయై, మరల ఆ కొయ్యపైననే వచ్చి వ్రాలుచుండెను. ఈ ప్రకారముగ ఎన్నిపర్యాయములు ఎగిరినను అధారములేనందున తిరిగి ఆకఱ్ఱనే ఆశ్రయించుచుండెను. అట్లే ప్రకారముగ బాహ్యవస్తువులయందలి దోషములను విచారించుటద్వారా ఇంద్రియముల కచట ఆశ్రయము లేకుండ చేసినచో అవి తప్పక వెనుకకు తిరిగి స్వస్థానమగు హృదయమును (ఆత్మను) ఆశ్రయించగలవు. ఇదియే ఇంద్రియనిగ్రహమునకు సరియైన ఉపాయము. దీనినే 'నౌకాగ్రకాక న్యాయ

మందురు. జనకుడు మొదలైన రాజర్షులందఱున్ను, ఉద్దాలకుడు మొదలైన మహాత్ములందరున్ను ఈప్రకారముగ జగత్పదార్థములయొక్క అనిత్యత్వమును గూర్చి బాగుగ విచారించినవారై విషయవిరక్తిని, ఇంద్రియజయమును బొందగల్గిరి.

మఱియు భోగైశ్వర్యములందు తగుల్కొనిన వానికి ధ్యాన మెన్నటికిని కుదురదని గీతాచార్యుఁ డీ యధ్యాయములోనే నొక్కి వక్కాణించెను.

**భోగైశ్వర్య ప్రసక్తానాం తయాఽపహృతచేతసాం**
**వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే.** (2-44)

అనగా భోగైశ్వర్యములందు ఆసక్తికలవారును, వానిచే అపహరింపబడిన చిత్తముకలవారు నగు మనుజులకు ధ్యానమందు ఏకాగ్రత ఎన్నటికిని కలుగనేరదని భావము. పరమాత్మయందు చిత్తము ఏకాగ్రముగ వర్తించినపుడు మాత్రమే జీవునకు బ్రహ్మానందానుభూతి కలుగును. ఏకాగ్రత లేనిచో విక్షేప వశమున ఆనందమునకు విఘ్నము వాటిల్లును. చంచల జలమున ప్రతిబింబము చక్కగ పడకుండునట్లు, విషయవిక్షిప్త చిత్తమున ఆత్మానంద మనుభూతము కాకయుండును. ఇది యొక గొప్ప అనర్థము. ఆనందమును గోల్పోవుట వాంఛనీయముకాదు గనుక ప్రతివారును తమ మనస్సును భోగజాలములపై పరుగిడకుండ చూడవలెను. పురుషప్రయత్నముచే నీకార్యమును సాధించవలెను. అనేక జన్మార్జిత దృశ్య సంస్కారమువలన మనస్సు బహిర్ముఖముగనే పోవుచుండును. దానిని విచారణద్వారా ప్రయత్నపూర్వకముగ మరలింపవలెను. కాగితము కొన్ని నెలల పర్యంతము చుట్టగా చుట్టబడి

యున్నచో, తెరచినపుడు మరల వెంటనే ముట్టుకొనిపోవును. అట్లే మనస్సున్ను. దానిని వెనుకకు త్రిప్పి ముట్టు ప్రయత్నము చేయవలెను.

**శుభాశుభాభ్యాం మార్గాభ్యాం వహన్తీ వాసనాసరిత్**
**పౌరుషేణ ప్రయత్నేన యోజనీయా శుభే పథి. (వసిష్ఠగీత)**

'వాసనాప్రవాహము శుభమార్గమందును, అశుభమార్గమందును గూడ జనుచున్నది. పురుషప్రయత్నముచే అశుభమార్గమును నిరోధించి మొత్తము ప్రవాహమంతయు శుభమార్గమునందే పోవునట్లు చూడవలెను' అని వసిష్ఠులు శ్రీరామచంద్రునకు ఉపదేశించియున్నారు. ఇప్పుడు అనేకులు ఆశ్రమములకు, మఠములకు వచ్చి 'మహాత్మా! ధ్యానమందు మనస్సు నిలుకడగా ఉండుటలేదు' అని అచట నుండు సాధుపుంగవులతో మొఱపెట్టుకొనుచున్నారు. అది ఏందులకు అట్లు నిలుకడలేక యున్నదో, నిలుకడగ నుండుటకు ఉపాయమేద్దియో భగవాను డీ యధ్యాయమున పునఃపునః వర్ణించియున్నారు. (భోగైశ్వర్య ప్రసక్తానాం అను శ్లోకముద్వారా) ఈ ఘట్టమందే గీతాచార్యుడు స్వర్గభోగములను గూడ ఖండించి యుండుట గమనింపదగినది.

"Earthly sensual pleasures multiplied by thousand are equal to heavenly pleasures." 'స్వర్గమనగా యేమియో గొప్ప అని మురిసిపోవలదు. ఇక్కడ ఉన్నవానికంటె కొంచెము మెరుగైన భోగములుకల ప్రదేశమే స్వర్గము. ఇంతకు మినహా ఆత్మోన్నతికి సంబంధించిన వ్యవహార మచట ఏమియును లేదు' అని మహాత్ములు పలుకు చున్నారు. కావున ఇహలౌకిక వైభవములు కాని, పరలౌకిక

వైభవముకాని ఆత్మశ్రేయమునకు ప్రతిబంధకములని యెంచి ముముక్షువగువాడు వానికొఱకు అఱ్ఱులు చాచక విరాగ భావమును అభ్యసించుచు రావలెను. విషయముల కొఱకై పరుగిడి వినాశము కొనితెచ్చుకొను అభాగ్యుని మనంబున చిత్తమేవిధముగ విక్షోభముఁనుబొందునో, ఆ క్రమ పరిణామ మును (Psychological change) భగవాను డీ స్థిత ప్రజ్ఞ ఘట్టమున ఎంత చక్కగా వర్ణించెనో చూడుడు-

(1) ధ్యాయతో విషయాన్ పుంసః సఙ్గస్తేషూపజాయతే
సఙ్గాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే-

(2) క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్స్మృతివిభ్రమః
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి. (2-62,63)

'విషయభోగములనుగూర్చి చింతించువాని మనంబున మొట్ట మొదట వానిసంబంధమగు సంకల్ప ముదయించును. పిదప వాని ననుభవింపవలెనను కోరిక జనించును. తనకోరికను అడ్డుపెట్టు వానియెడ క్రోధముద్భవించును. క్రోధముచే మోహము జనించును. మోహమువలన విస్మృతి సంభవించును. దానిచే బుద్ధినాశ ముద యించును. బుద్ధినాశముచే అధఃపతనమునుబొందును.' కాబట్టి ఇట్టి అనర్థమునకు ఆలవాలమైనట్టి విషయసంకల్పము హృదయ మున స్ఫురించినవెంటనే అద్దానిని పెకలించివేయవలెను. అట్టి వాడే విజ్ఞుడు. ఈ సందర్భమున నొక ఇతిహాసమును వినుడు.

పూర్వము దత్తాత్రేయులు భూమండలమున సంచారము సల్పుచుండ నొకచోట సముద్రమును జూచి దాని తీరముననే నిలబడి తరంగములను వీక్షించుచుండెను. సముద్రమధ్యమున నొకగడిసొచను ఆతరంగములు మెల్లమెల్లగ బయటకునెట్టుచు తుట్టతుదకు ఒడ్డునకు చేర్చివైచినవి. అదిచూచిన దత్తాత్రేయు

లకు ఆశ్చర్యము కలిగినది. "ఏమి ? సముద్రము ఇంత విశాల ముగ నుండియు ఒక చిన్న గడ్డిపోచకు తనయం దాశ్రయమివ్వ లేదా? దానిని వెంటనే తరిమి తరిమి బయటకు కొట్టపారెను ? ఏమి దీని స్వార్థభావము!" అని ఇట్లాలోచించు చుండ వెంటనే యొకభావము మనస్సున స్ఫురింప "ఓహో ! తెలిసినది ! చిన్న గడ్డిపోచయేగదా అని ఈరోజు దానికి ఆశ్రయమిచ్చినచో, రేపు మఱియొక గడ్డిపోచపడి, ఇట్లే అనేకములుపడి క్రమక్రమ ముగ తన స్వరూపమునే కప్పివేసి స్వకీయ గాంభీర్యమును చెడ గొట్టునేమోయను సంశయముచే సముద్రమిట్టిదని గ్రహించి మును నెట్టివైచినది. ఆహా ! చక్కనిపాఠము నేర్పినది ! అదే విధముగ జీవుడు తన హృదయసరోవరమున దృశ్యసంకల్ప ముదయించిన తత్క్షణమే దానిని పెరికివేయవలెను. అప్పుడు మాత్రమే హృదయము నిర్మలముగనుండి ఆత్మసాక్షాత్కారము కలుగగలదు. ఎట్టి నీతినిబోధించిన దీసముద్రము ! ముముక్షువు లకు ఎట్టిసదుపదేశములభించినది దీనిద్వారా!" అని అనుకొనుచు తన కిట్టి మహోన్నత సాధనను నేర్పినట్టి ఆ సముద్రమునకు సాష్టాంగనమస్కారముచేసి దానిని తన గురువుగా భావించెను. దత్తాత్రేయులకు గల 24 మంది గురువులలో సముద్రమొకటి.

ఈ ప్రకారముగ భగవానుడు స్థితప్రజ్ఞుని చరిత్రయం దనేక సాధనలను వెల్లడిచేయుచు ముముక్షువుల కత్యంతోపయోగ కరమగు మఱియొక పరమసత్యమును గూడ ఉద్ఘాటించెను- అది యేది యనిన—

**"రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే"** (2.9)

"పరమాత్మ దర్శనముచే వాసన సమూలముగ నశించును' అని

దీనియర్థము. వాసనాక్షయము, మనోనాశము, తత్త్వజ్ఞానము, అను మూడు సాధనలను శాస్త్రములు పేర్కొనినవి. వీనిలో మనోనాశమనునది వాసనాక్షయముచే సహజముగ సిద్ధించును. ఏలననగా, అనేకవాసనలు, సంకల్పములు చేరి మనస్సు ఏర్పడుచున్నది. ఏనాడు వాసనలు క్షయించినవో, ఆనాడు మనోనాశము సిద్ధించినదేయగును. కట్టెలు ఒక్కొక్కటి తీసివేసినచో నిప్పు దానియంతట నదియే చల్లారునట్లు. కాబట్టి ఇక మిగిలినవి వాసనాక్షయము, తత్త్వజ్ఞానము. ఈ రెండును పరస్పరము ఒకదానిచే నొకటి పోషింపబడుచుండును. తత్త్వజ్ఞానముయొక్క సహాయముచే వాసనలు సన్నగిలుచుండును. వాసనలు క్షీణించినకొలది తత్త్వజ్ఞానము వికాసము నొందుచుండును. కావున రెండింటిని ఏకకాలమందు అభ్యసించుచు రావలెను. విషయములను ఎంత నిగ్రహించినప్పటికిని దాని వాసన ఏకొంచెమో మిగిలియేయుండును. ఆ కొంచెము కూడ ఆత్మానుభూతిచే తొలగిపోవును. 'పరందృష్ట్వానివర్తతే' అను దాని భావ మిదియే. కావున తన ఆత్మస్వరూపమును గూర్చి బాగుగ మననము చేయుచుండవలెను. 'అచలోఽయం సనాతనః'—అనునట్లు సనాతనమగు ఆత్మయే తన రూపమని భావన చేయవలెను.

ఇట్టి బ్రహ్మస్థితిని అంత్యకాలమువఱకును కాపాడుకొనుచునే యుండవలెను. ఏలయనిన మాయ బలీయమైనది. అది ఓడిపోయినట్లు నటించి అమాంతముగ నొకసమయమున విరుచుకపడును. అది నివురుగప్పిన నిప్పువలె నుండును. సాధకులు బహుజాగ్రతగ నుండవలెను.

చున్నట్లు వినిపించినది. జాగ్రత్తగా ఆలకింప अभी नहीं 'అభీ నహీ' అనుపదములు వినిపించెను. అనగా 'ఇప్పుడే కాదు' అని దాని యర్థము. అచట చేరిన భక్తకోటికి అంతకును దానిభావమును తెలిసికొనవలెనని కుతూహలముకలిగి గురుమహారాజు గారిని అడిగిరి. ఆతడిట్లు చెప్పెను. "భక్తులారా! నాకు అంత్యకాలము సమీపించినదని తెలిసికొని సైతాను (మాయ) నా దగ్గఱకువచ్చి 'అయ్యా! ఇంతవఱకు అనేకమందిని వారి జీవితములో ఏదియో యొక సమయమున నేను బుట్టలో వేసికొనుచుంటిని. నీవు ఒక్కడవే బహుజాగ్రతగ నున్నవాడవై నా వలలో పడకుండ తప్పించుకొంటివి! ఓహో! ఎంతగట్టివాడవయ్యా!' అని పలుకగా నేను 'అభీ నహీ' ఇప్పుడే కాదు అని దానికి జవాబిచ్చితిని. అనగా 'నేనింకను నిన్ను జయించినట్లు చెప్పుకొనలేను. ఏలయనిన, ఇంకను ఒకటిరెండు శ్వాసలు బాకీయున్నవి. ఈ లోపల నేను అజాగ్రతగ నున్నచో తత్క్షణమే నీవు నన్ను మోసగించగలవు. చివరిశ్వాసవఱకు కూడ నిన్ను నమ్మరాదు' అని దానితో చెప్పితిని" అని పలికి గురువు నిర్యాణము బొందెను. శిష్యులది విని తాముకూడ తమ సాధనల విషయములో బహుజాగరూకులై మెలగిరి. ఆనకట్టలో ఒక చిన్నరంధ్రము పడిన చాలును. దానిగుండ నీరు ప్రవహించి అదియే క్రమక్రమముగ పెద్దదై తుదకు కట్టనే భేదించివేయును. అట్లే మనస్సును నిగ్రహించునపుడు అది ఒకింత నియమోల్లంఘనమునకు అనుజ్ఞ నడుగును. అపుడు జాగ్రతగ నుండవలెను. దానికి ఏ మాత్రము సందు ఇవ్వరాదు. శంకరాచార్యులీ సందర్భమున వచించిన వాక్యములను వినుడు.

లక్ష్యచ్యుతం చేద్యది చిత్తమీషత్
బహిర్ముఖం సన్నిపతేత్తతస్తతః
ప్రమాదతః ప్రచ్యుతకేళికందుకః
సోపానపఙ్క్తౌ పతితో యథా తథా. (వివేకచూడామణి)

"మేడమెట్లలోని పై మెట్టుపై బంతిపడినది. ఒక్క మెట్టు జారినది. అంతమాత్రమేయని అనుకొనుటకు వీలులేదు. పడియుండిన ఆ బంతి అచటనుండి ఇంకొకమెట్టు జారును. ఇంకొక మెట్టు జారును. అట్లే క్రమక్రమముగ జారి తుట్టతుదకు క్రింది మెట్టునకు వచ్చును. ఇవ్విధముననే పరమాత్మ రూపలక్ష్యమునుండి మనస్సు ఒకింత మరలి బహిర్ముఖమైనచో క్రమముగ ఆత్మస్థితి నుండిదిగజారిపోవును. కావున లక్ష్యమునుండి మనస్సును మరల్చరాదు" అని శంకరులు హెచ్చరించిరి. పిల్లలు ఇండ్లలో పరమపదసోపానపటము అను ఆటను గవ్వలతో ఆడుచుందురుగదా! అందులో కొన్ని నిచ్చెనలు, కొన్ని పాములు ఉండును. నిచ్చెన వచ్చినపుడు పైకిఎక్కును. పామువచ్చినపుడు క్రిందకు దిగును. ఎంతయో ప్రయాసపడి ఒకడు నిచ్చెన్లునెక్కి ఎక్కి 99 స్థానము వరకు వచ్చెను. 100 వ స్థానములో ఒక పెద్ద పాము ఉన్నది. అమాంతముగ దానినోటిలోపడి దిగిదిగి 1 వ స్థానమునకువచ్చి చేరెను. అట్లేయుండును చివరి కాలములో సాధనయందు అజాగ్రతగ నుండువారి పరిస్థితి. కనుకనే శ్రీకృష్ణపరమాత్మ 'స్థిత్వాస్యామన్తకాలేఽపి'—అంత్యకాలమువరకు కూడ పరమార్థ సాధన విషయములో బహుజాగరూకులై యుండవలెను అని సాధకులకు హెచ్చరిక(Warning)చేసెను. ఈఅధ్యాయములో

అనన్యసామాన్యమై మహోత్కృష్టమైనట్టి ఇట్టిబోధను మొదటనే చేయక శ్రీకృష్ణుడు ఒకింతసేపు వేచియుండెను.

శిష్యుని హృదయపరిణామమును గమనించుచుండెను. భక్తి ప్రపత్తులచే హృదయము ద్రవీభూతముకాగా అప్పుడు బోధించెను. ఏలయనిన అర్జునుడు అహం మమ ప్రత్యయబద్ధుడై యుద్ధములో తనవారు చచ్చెదరని, దానిచే వర్ణసంకర మేర్పడునని తద్వారా పితరులు లుప్తపిండోదకులు అగుదురని పెద్ద ధర్మశాస్త్రములను చదివి మొట్టమొదట ప్రజ్ఞావాదనలు కావించెను. కాని ఆ వాదనలచే నతని శోకము పోలేదు. ఇక ఈ అధ్యాయ ప్రారంభములో అర్జునుడు ధర్మసమ్మూఢ చేతస్కుడై కృష్ణుని పాదములపై వ్రాలెను. అప్పుడే కృష్ణవాణి బయల్వెడలినది. అట్లే కర్తృత్వాహంకారములు కలిగియున్నంతవరకు ఎవరికిని దుఃఖము తొలగదు; పైగా ధర్మమును వారు వక్రముగా అపసవ్యముగా అర్థము చేసికొనుచుందురు. ఇంతియే కాదు, అహంకారములో 'అంతయు నాకు తెలియును' అనుకొను నంతవరకు మహాత్ములు వారికి జ్ఞానోపదేశము చేయరు. ఎప్పుడు వినమ్రులై గురువుల పాదముల ప్రక్కల వ్రాలుదురో అప్పుడే గురూపదేశము లభించును. గురూపదేశముద్వారా నిత్య, సత్యవస్తుజ్ఞానముచే శాంతి చేకూరును. దుఃఖరాహిత్యము సంభవించును. నిత్యవస్తువునందే శాంతికలదు. అనిత్యములగు దేహాదులయందలి యభిమానమును వీడి నిత్యమగు ఆత్మవస్తువును ఆశ్రయించువానికే పరిపూర్ణమగు శాంతి లభించునుగాని తదితరులకు కాదని ఉపనిషత్తు లీ క్రింది విధముగ నుద్ఘోషించుచున్నవి:-

**నిత్యో నిత్యానాం చేతనశ్చేతనానా**
**మేకో బహూనాం యో విదధాతి కామాన్**

తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరా
స్తేషాం శాన్తి శ్శాశ్వతీ నేతరేషామ్ (కఠోపనిషత్)

ఈ అధ్యాయారంభమున శ్రీకృష్ణమూర్తి అర్జునునకు గావించిన బ్రహ్మజ్ఞానోపదేశముచే, ఆత్మానాత్మస్వరూప విచారణచే జీవునకు మరణభయము తొలగిపోవుచున్నది. ప్రపంచములో గల భయములన్నిటిలోను మరణభయము అతి తీవ్రమైనది. మరణమను మాట వినుటతోడనే జనులు భయభ్రాంతులగుచున్నారు. ఆ భయమును గీతాచార్యుడు సంపూర్ణముగ తొలగించివేసెను. 'చనిపోయెను' అను వాక్యములోని చనుట అను పదమునకు పోవుట-వెళ్ళుట అను అర్థము కలదు. అనగా జీవుడు ఒక దేహమును వదలి మఱియొక దేహమును గ్రహించుటకు ఇంకొక చోటునకు వెడలెనని అర్థము. దీనిలో నశించుట అను అర్థము లేనేలేదు. కావున మరణమనగా పాతవస్త్రములను వదలి క్రొత్తవి ధరించుటయను అపూర్వసత్యమును భగవానుడు ప్రస్ఫుటముచేసి అజ్ఞానజీవుల భయమును రూపుమాపెను. ఆత్మ ఒకటితప్ప ప్రపంచములోని ప్రతివస్తువు షడ్భావవికారములకు లోనై యుండును. శరీరమున్ను దృశ్య ప్రపంచములో నంతర్భాగమే కావున, అదియు ఈవికారముల నుండి తప్పించుకొనజాలదు. కాబట్టి అది పుట్టుట గిట్టుట కలిగి యుండును. ఆత్మమాత్రము నిర్వికారమై వెలుగొందుచుండును. మంచుకు శీతలత్వ మెట్లు స్వభావమో, అగ్నికి ఉష్ణత్వ మెట్లు స్వభావమో అట్లే శరీరమునకున్ను జననమరణములు స్వభా

వములై యున్నవి. కాబట్టి మరణమునుగూర్చి యెవరును భయపడ నవసరములేదు.

రామతీర్థు లొకప్పుడు ఒకానొక సభలో ఉపన్యసించు చుండ మధ్యలో ఎవరో ఒక చీటి తెచ్చి వారికి అందజేసిరి. రామతీర్థు లది చదువుకొని దానిని ప్రక్కనబెట్టి మరల ఉపన్యాసమును కొనసాగించెను. సభ పూర్తిఅయిన వెనుక ఒకరు 'అయ్యా ! ఆ చీటిలోని విషయమేమి ?' అని రామతీర్థుల నడుగ నాకు ఒకడే కుమారుడు కలడు. అతడు మరణించెనను వార్త దానియందు గలదు' అని చెప్పెను. 'దానిచే తమకు దుఃఖము కలుగలేదేమి ?' అని వారడుగ 'నిప్పు వేడిగానున్నది' అను వార్తచేగాని 'మంచు చల్లగానున్నది' అను కబురుచే గాని ఎవరికైన శోకము జనించునా? జనింపదు. ఏలయనిన అవివానికి సహజ గుణములు. అట్లే పుట్టినవస్తువు గిట్టినది అనువార్తచే విజ్ఞునకు దుఃఖమెన్నటికిని కలుగదు. ఏలయనిన 'జాతస్య హి ధ్రువో మృత్యుః' అను గీతావాక్యానుసారము పుట్టిన దేహము ఎప్పటికైనను నశించియే తీరును అని రామతీర్థులు గంభీరముగ పలికిరి. చూచితిరా ! మహాత్ములయొక్క అనుభూతి వాక్యము లెట్లుండునో ! ఇంతవఱకు దేహమునుగూర్చి విచారించితిమి. ఇక ఆత్మయో నాశరహితమైనది. షడ్భావవికారములు లేనిది. శాశ్వతమైనది. సనాతనస్వరూపము. ఈ సత్యమునే క్రింది గీతాశ్లోకము నిరూపించుచున్నది.

**న జాయతే మ్రియతే వా కదాచి**
**న్నాయం భూత్వాఽభవితా వా న భూయః**
**అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో**
**న హన్యతే హన్యమానే శరీరే.** (2-20)

ఇట్టి ఆత్మయే జీవుని యథార్థస్వరూపము. జీవుడు 'దేహి'యే కాని 'దేహము' కాదు. వస్త్రమును ధరించువాడేగాని వస్త్రము కాదు. ఇంటిలో ఉండువాడే కాని ఇల్లుకాడు. పొలమును (క్షేత్రమును) చూచువాడేకాని పొలముకాడు. ఉపనిషత్సారమైన ఇట్టి నిగూఢతత్త్వమును జనసామాన్యమునకు వ్యాపింపజేసి (broadcast చేసి) తద్ద్వారా ధైర్య, వీర్య, గాంభీర్యములను కలుగజేసినట్టి శ్రీకృష్ణపరమాత్మకు మనఃపూర్వక నమోవాకములు. ఇట్టి ఆత్మబోధచే మనుజునకు ఎంత ధైర్యము నిర్భయత్వము కలుగునో ఒక చిన్న ఇతిహాసమును చెప్పెదను వినుడు—

పూర్వము అలెగ్జాండరను చక్రవర్తి అనేక దేశములను జయించి తుట్టతుదకు భారతదేశమునుగూడ జయింపనెంచి సింధునదీప్రాంతమున అడుగుపెట్టెను. ఆ నదీతీరమున ఒకానొక తపస్వి నివసించుచుండెను. అలెగ్జాండరు సైన్యసమేతుడై ఆ మార్గముగుండ బోవుచుండ ఆ బ్రహ్మనిష్ఠుడచ్చోటనే కూర్చొనియుండెను. లేవలేదు. సామ్రాజ్యాధిపతియగు తన్ను జూచి లేవలేదను నెపమున ఆతని శిరస్సు ఛేదించివేయుటకై అలెగ్జాండరు తన ఖడ్గమును పైకిదీయ, ఆ సాధువు పకపక నవ్వెను. అంతట అలెగ్జాండరు చకితుడై 'నిన్ను చంపుటకు ఉద్యమింప నీవేల నవ్వుచున్నావు? ఇట్టి వైపరీత్యమును నేనెన్నడును గాంచలేదే! నవ్వుటకు కారణమేమి' యని యడుగ నా ఋషిపుంగవు డిట్లు వచించెను—'నీవు నన్ను చంపెదనంటివి. అందులకు నాకు పట్టరాని నవ్వు వచ్చినది. ఏల యనిన, నేను నిత్య సత్య ఆత్మస్వరూపుడను.

నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః
నచైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః (2-23)

నేను శస్త్రములచే ఛేదింపబడువాడనుకాను, అగ్నిచే దహింపబడువాడనుకాను, నీటిచే తడుపబడువాడనుకాను, గాలిచే ఎండింపబడువాడనుకాను. నేను సచ్చిదానంద పరిశుద్ధస్వరూపుడను. భౌతికశక్తులు నన్నేమియు చేయజాలవు.' అని శీఘ్రగ పలికెను. అలెగ్జాండరు దిగ్భ్రమ జెంది భారతదేశములో మృత్యువునుగూడ ధిక్కరించునట్టి మహిమాతిశయము గలిగిన జనులున్నారే! ఆహా! ఇట్టి ఆధ్యాత్మిక వైభవముతో గూడిన పరమపావన ప్రదేశముపై దండెత్తుట అపచారము! నైతికసంపత్తిచే తులతూగు మహాత్ముల కాలవాలమైన భారతదేశమున కివియే నా జోహారులు! అని మ్రొక్కి వెనుకకు మరలిపోయెను.

ఇంత ధైర్యము, ఇంత నిర్భయత్వము ఆత్మజ్ఞానముచే దప్ప మఱి దేనిచేతను గలుగనేరదు. 'ద్వితీయాద్వై భయం భవతి' అను శ్రుతిప్రకారము ఆత్మకంటె వేఱుగ మఱియొక వస్తువు సత్యమని నమ్మినచో వెంటనే భయ ముదయించును. అజ్ఞానజనులు దృశ్యమును సత్యమని నమ్మి భయమును, దుఃఖమును పొందుచున్నారు. జ్ఞాని దృశ్యమును నశ్వరముగను, ఆత్మను శాశ్వతముగను నమ్మి నిర్భయత్వమును, అనంతానందమును బడయుచున్నాడు. కావున మనుజునకు బలశౌర్య తేజములు ఉత్సాహ గాంభీర్యాదులు ఆత్మజ్ఞానమువలననే కలుగగలవు. వివేకానందులు చెప్పినది చూడుడు—

"It is strength and strength that we want and the first step in getting the strength is to

uphold the Upanishads and believe that I am the Atman."

'మనకు కావలసినది బలము, బలము! అట్టి బలమును సంపాదించుటకు ఏకైక మార్గము ఉపనిషత్తులను విశ్వసించి తాను ఆత్మనని తలంచుటయే.' కనుకనే శ్రీకృష్ణపరమాత్మ దుర్బలత్వమును, నిరుత్సాహమును పొందియున్న అర్జునునకు ఆత్మజ్ఞానమునే మొట్టమొదట ఉపదేశించుటకు కారణమైనది.

నైతికముగను, ఆధ్యాత్మికముగను గొప్ప పతనమును బొందియున్న ప్రపంచమున కిట్టి బ్రహ్మవిద్య, ఆత్మతత్త్వోపదేశము ప్రస్తుతకాలమున ఎంతేని అవసరమైయున్నది. ప్రపంచములో ఎన్ని విద్యలున్నను శాంతిని ప్రసాదించు విద్యకే మనము అధిక ప్రాధాన్య మివ్వవలసియున్నది. "అధ్యాత్మ విద్యావిద్యానాం" 'విద్యలన్నిటిలో అధ్యాత్మవిద్యయే నేను' అని గీతాచార్యుడు చెప్పియున్నాడుకదా! కావున అట్టి బ్రహ్మవిద్యకు ప్రోత్సాహ మొసంగి, నిత్యసత్య ఆనంద స్వరూపమగు ఆత్మనుగూర్చి బాగుగ మననము చేయవలెను. అన్నియు నశించినను నశింపనిదియు, మార్పు జెందనిదియు నగు ఆత్మయే తానుగాని దేహాది దృశ్యపదార్థములు తానుగాదని మరల మరల భావనచేయుచుండవలెను. గీత రెండవ అధ్యాయము బోధించిన మహోన్నత సత్య మిదియే.

గీత ఉపనిషత్సారమని చెప్పుట కిట్టి బోధలే నిదర్శనములు. చూచుటకు చిన్నదిగానున్నను ఈ గీతాగ్రంథమున సమస్తశాస్త్రములయొక్క సిద్ధాంతములన్నియు క్రోడీకరింపబడి సాధనానుకూలముగ వచింపబడినవి యగుటచే నిది చాల

గొప్ప గ్రంథమే యగుచున్నది. మఱియు సర్వప్రాణులయొక్క జీవితోద్ధరణకు వలసిన సాధనసంపత్తి, జీవితములో వారెదుర్కొను సమస్యలు, ఆ సమస్యలను పరిష్కరించుమార్గములు, ప్రతిజీవియు ఉన్నతస్థితికి ఆనందధామమునకు పోవుటకు సహాయపడు సూత్రములు సవివరముగ ఇందు ప్రతిపాదింప బడుటచే సర్వులకును ఇది జీవితమిత్రుడు(Life companion) గా నుండుచున్నది. వెయ్యేల.

'ఏకం శాస్త్రం దేవకీపుత్రగీతం'

అను వాక్యము మున్నాటికిని సార్థకమేయగును-మహాశయులారా! ఇట్టి పరమపవిత్రగ్రంథమును మీరును పఠించి ఇతరులు కూడ పఠించునట్లుచేయుడు. గీతాజ్ఞానమును తాను తెలిసికొని ఇతరులకుకూడ అద్దానిని ప్రసాదించు సద్బుద్ధి గలిగియుండు మహనీయుడు తనకెంతో ప్రియతముడని భగవానుడు స్వయముగనే పలికియున్నాడు. కావున ప్రతిరోజు గీతా పారాయణము, గీతాధ్యయనము చేసిన తదుపరియే ప్రసాద మును భుజించు నియమమును ఏర్పఱచుకొనవలెను. మొత్తము చదువలేనిచో ఒక అధ్యాయముగాని లేక కొన్ని శ్లోకములుగాని భక్తిపూర్వకముగ చదివినచాలును. అయితే అర్థము బాగుగ మననము చేయుచుండవలెను. హృదయ పరిణామము కలిగిననే గీతాధ్యయనము సార్థకమైనట్లగును. కరుణామూర్తియగు సర్వేశ్వరుని కృపచే జనులలో భక్తిజ్ఞాన వైరాగ్యాదు లభివృద్ధినొంది గీతాసక్తి పెంపొంది తద్ద్వారా వారు మోక్షమునకు సన్నిహితు లగుదురుగాక !

ఓం తత్ సత్.

ఓమ్

# 3-వ అధ్యాయము

# కర్మయోగము



భగవద్గీత మూడవ అధ్యాయమగు కర్మయోగమును గూర్చి నేడు విచారింపబోవుచున్నాము. వేదమువలె గీత కాండ త్రయాత్మకముగ విభజింపబడినది. వేదములలో మొదటి భాగము సంహిత. అది కర్మప్రతిపాదకము. రెండవభాగము బ్రాహ్మణము. అయ్యది ఉపాసనా ప్రతిపాదకము. మూడవ భాగము ఉపనిషత్తులు. అవి విజ్ఞాన ప్రతిపాదకములు. అట్లే వేదసారమగు భగవద్గీతయు త్రిభాగరూపముగ (త్రిషట్కముగ) వెలయుచున్నది. అందు ప్రథమషట్కము కర్మయోగమును దెల్పును. ద్వితీయషట్కము భక్తియోగమును ప్రతిపాదించును. తృతీయషట్కము జ్ఞానయోగమును బోధించును. అయితే కర్మయోగమునందు భక్తిజ్ఞానములున్న అంతర్భూతములై గౌణముగ నుండును. అట్లే భక్తియోగమునందు కర్మజ్ఞానములున్ను, జ్ఞానయోగమునందు కర్మభక్తులున్ను ఇమిడియుండును. వానిని ప్రత్యేకముగ విశదీయుటకు వీలు.

భగవద్గీతయందు శ్రీకృష్ణపరమాత్మ కర్మయోగము యొక్క ప్రాశస్త్యమును అచటచట విశదీకరించుచుపోయినను ప్రత్యేకముగ ఒక అధ్యాయమునంతయు ఇచట దానిక్రింద వినియోగించినవాడాయెను. అదియు దాదాపు గీత ప్రారంభమునందే. ఏలయనిన శ్రీకృష్ణమూర్తియొక్క ప్రథమాశయము

అకర్మణ్యుడై రథమున చతికిలపడియున్న అర్జునుని లేపి (యుద్ధాది) కర్మలయందు ప్రేరేపించుటయే యగును. దాని కొఱకై మొట్టమొదట రెండవ అధ్యాయములో స్వస్వరూప జ్ఞానమును బోధించి, అటుపిదప అట్టి ఆత్మభావముతో దైవ భావముతో గూడి అనాసక్తముగ కర్మనాచరింపుమని ఈ మూడవ అధ్యాయములో తెలిపెను. ఈ ప్రపంచమున కర్మ చేయక ఎవరును ఒక్కక్షణమైనను ఉండజాలరు.

స హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః. (3-5)

అయితే ఆ కర్మను యోగముగా మార్చు పద్ధతి నేర్చుకొనినచో కర్మ బంధహేతువు కానేరదు. కర్మను ఎవ్విధముగ ఆచరించిన జీవుడు బంధింపబడడో ఆ పద్ధతి ఈ అధ్యాయమందు చెప్పబడినది. కర్మ వేఱు, కర్మయోగము వేఱు. అహంభావముతో, ఫలాపేక్షతో, సక్తముగ నాచరింపబడినది కర్మ. అదియే నిరహంభావముతో, ఫలాభిసంధిరహితముగ, అనాసక్తముగ, దైవార్పణబుద్ధితో నాచరింపబడినచో కర్మయోగముగా మారిపోవును. ఏలయనిన అప్పుడది జీవుని పరమాత్మతో కలుపును (యుజ్యతే ఇతి యోగః). అట్టి అనాసక్తకర్మకే 'యజ్ఞ' మను చక్కటి నామధేయము భగవానుడు గీతయందు ప్రసాదించెను. మఱియు,

యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబన్ధనః. (3-9)

అని తెలుపుచు, అట్టి యజ్ఞముకొఱకు గానట్టి కర్మయంతయు బంధహేతువే యగునని సెలవిచ్చెను. ప్రపంచములో ఎక్కువమంది ప్రవృత్తి మార్గముననే యుండియుందురు. కేవలము నివృత్తిని ఆశ్రయించి నిరంతర ధ్యాననిష్ఠలందు నిర్వికల్ప సమాధులందు

కాలముగడుపువారు చాల అరుదుగా నుందురు. కాబట్టి ఎట్లు తిరిగి అందఱును కర్మ చేయవలసియేయుందురు. చేయుచున్నారు కూడను. అట్టిచో ఆకర్మను యజ్ఞముగ ఏలమార్చుకొనరాదు? బంధహేతువును మోక్షహేతువుగ ఏల పరివర్తనమొనర్చుకొనరాదు? అదియే కర్మను అనాసక్తముగ, నైవార్పణబుద్ధితో చేసినచాలును. అద్భుతమగు ఫలితము కలుగును. ఈకీలకమును తెలిసికొనియే జనకుడు మొదలైనవారు రాజ్యములనుగూడ పరిపాలించిరి. గీతారహస్యమగు ఈ అనాసక్తిని ఆశ్రయించియే సాక్షాత్ భగవానుడున్ను 'త్రీన్ లోకాన్ పాలయామ్యహమ్' "మూడులోకములను పాలించుచున్నాను" అని నుడివెను. అట్టిచో ఒక చిన్న గృహమును, గృహవ్యవహారములను మను జులు పాలింపలేరా? ఇట్టి అసంగత్వమును బోధించుటకే శ్రీకృష్ణ మూర్తి 'కర్మయోగ'మను ఈఅధ్యాయమును ప్రారంభించెను.

కర్మలను త్యజించివేసి సోమరిగ కూర్చొనుట భగవానుని ఆశయముకాదు.

'శ్రేయోస్తు కర్మసన్న్యాసాత్కర్మయోగో విశిష్యతే. (5-2)

అనుచు కర్మలను విడుచుటకంటె చేయుటయే మేలని తేల్చి చెప్పివైచెను. వారివారి స్వకర్మలను వారు ఆచరించుకొనుచు దైవార్పణబుద్ధికలిగి, వానిలో తగుల్కొనక, కర్తృత్వమును వహించకనుండినచో, ఆ కర్మలన్నియు పూజలుగాను, యజ్ఞములుగాను మారిపోవును (work is worship). అనగా పాకీవాడు పాకీపని చేసికొనుచు, మాదిగవాడు చెప్పులుకుట్టుకొనుచు, వంటవారు వంటచేసికొనుచు, వర్తకుడు వ్యాపారము చేసికొనుచు, ఆఫీసరు ఉద్యోగముచేసికొనుచు, పురోహితుడు

పౌరోహిత్య మాచరించుకొనుచు తరించుటకు అవకాశములు కలవని గీత బోధించుచున్నది. కనుకనే కాబోలు శ్రీకృష్ణుడు బండితోలువని స్వీకరించి అదియు ఏమంతతక్కువైనపని కాదని ఋజువుచేసెను. అంతియేకాదు సంధ్యాకాలమున యుద్ధమును విరమించి అందఱును అర్ఘ్యప్రదానము లిచ్చుచుండు సమయమున ఆ గుఱ్ఱములకు తగిలిన గాయములను నదిలో కడిగి తదుపరి వానికి గుగ్గిళ్ళు పెట్టుచుండువాడు శ్రీకృష్ణపరమాత్మ. కావున ఫలాని కర్మ తక్కువని ఎక్కువని భావింపరాదు. అన్నియు పవిత్రములైనవే. వానిని ఒనర్చు పద్ధతియందు మనోభావమునందు మార్పు రావలెను.

"You shall be judged ultimately not by the kind of work you do, but by the spirit in which you do it" (నీవు ఏపనినిచేయుచున్నావని దైవము ప్రశ్నింపదు. ఏ భావముతో చేయుచున్నావని ప్రశ్నించును.) గీతయొక్క గొప్పతనము ఇచటనేయున్నది. అది ఏమి చేయవలెనని ఆదేశింపదు. ఎట్లు చేయవలెనో ఆదేశించును. అంత మాత్రమే. వేదాంతమును వ్యవహారస్థాయికి దింపుటయు, వ్యవహారమును వేదాంతస్థాయికి లేపుటయు గీతయొక్క చాతుర్యము. అట్లుండుటవలననే అయ్యది సర్వజనాదరణీయంబై చెన్నొందుచున్నది. గీతయంతయు వినిన తర్వాత అర్జునుడు జోలి యెత్తుకొని భిక్షాటనముచేయుచు అరణ్యములకు పారిపోలేదు. రణరంగమున నూతనోత్సాహముతో దుమికి క్షత్రియోచితమగు తనయుద్ధకార్యమును ఆనందముగ నెరవేర్చెను. చూచితిరా! గీతోపదేశము మనుజునియందు

తెచ్చిన మార్పు! మూలుగుచు ఒక మూల కూర్చున్న వానిని లేపి కర్తవ్యనిష్ఠునిగ నొనర్చిన ఘనత గీతకే చెల్లును; ఇట్లు ఒక్క అర్జునుడేకాదు, భూతకాలమందు ఎందరో ఈ ధర్మ రహస్యమును గుర్తెరిగి, ఈ నిష్కామ కర్మాచరణ యను మహా దివ్యౌషధమును భుజించి, వారివారి వ్యవహారములను, గృహకార్యములను, లోకకార్యములను, అనాసక్తముగ (unattached) నాచరించి శాంతిసౌఖ్యములను బడసిరి. ఇపుడును బడయుచున్నారు. మున్ముందును బడయుగలరు. 'గీతా పఠనముగావించినచో మాబిడ్డలు సన్న్యసించి అడవులకు పారిపోవుదురేమో' యను భయ మెవరికిని ఉండనవసరము లేదు. వెలయసిన గీతను సాక్షాత్తు (direct) గ వినినట్టి అర్జునుడే ఆ పనిని చేయలేదు. క్షేత్రమున నిలబడి కర్తవ్యమును శీలించెను. మఱియు, యోగః కర్మసు కౌశలమ్-కర్మలందలి నేర్పరితనమే యోగమని గీత బోధించుచున్నది. కావున గీతాశ్రవణముచే మాదిగవాడు చెప్పులను ఇంకను బాగుగ కుట్టగలడు. వంటవాడు ఇంకను చక్కగ వంటచేయుగలడు. వర్తకుడు ఇంకను చక్కగ వర్తకము చేయుగలడు. (మోసము Black Market లేకుండ అని భావము). ఈ ప్రకారముగ భగవద్గీత భౌతిక, ఆధ్యాత్మికరంగములు రెండు వేరువేరు, ఒకటి యనియు, భౌతికరంగమున ఆధ్యాత్మికతను వ్యాపింపజేయ వచ్చుననియు సోపపత్తిగ ఋజువుచేసి, ఆ రెండింటిమధ్యనున్న అఖాతమునకు ఒక చక్కటి సేతువును (వారధిని) నిర్మించినది యాయెను. ఇదియే గీతయొక్క ఘనత.

సామాన్యముగ మనుజులయొక్క స్వభావము మూడు విధములుగ నుండును. కొందఱి స్వభావము భక్తిరసాత్మకము (emotional) గ నుండును; కొందఱిది క్రియాశీలమై (active) యుండును. మఱికొందఱిది విచారణాత్మకము (rational) గ నుండును. మొదటి తరగతివారు ఎక్కువగ పూజారాధనాదులందు, భజనకీర్తనాదులందు మక్కువగలిగియుందురు. రెండవ తరగతివారు సేవాకైంకర్యములందు ప్రీతి గలిగి యుందురు. మూడవతరగతివారుతమధీశక్తిని ఉపయోగించిఎక్కువగ తత్త్వవిచారణ గావింపుచు దానియందే అభిలాష గల్గియుందురు. సామాన్యముగ పేర్కొనినచో వీనినే భక్తిమార్గమని, కర్మమార్గమని, జ్ఞానమార్గమని చెప్పవచ్చును. ఈమూడు మార్గములను భగవానుడు గీతయందు స్పష్టముగ తెలిపియున్నారు. మోక్షప్రాప్తికి ఈమూడున్ను ఆవశ్యకములేయగును. ఇదివరలో తెలిపిన లాగున ఈమూడున్ను ఒకదానికి మఱియొకటి పెనవేసికొనియున్నవి. ప్రత్యేకముగ విడగొట్టుటకువీలులేదు. అయితే ఒక్కొక్కరియందు ఒక్కొక్కటిఅధికముగనుండును. తక్కినవిఅల్పముగ నుండును. ఇంతమాత్రమే. ఒకమిద్దె కట్టవలెననిన ఇటుక, సున్నము, కొయ్య ఎట్లు అవసరమో, అట్లే మోక్షసౌధనిర్మాణమునకు భక్తి, జ్ఞాన, కర్మలు మూడున్ను అవసరములై యున్నవి. ఈమూడున్ను ఎవనియందు మేళవించియుండునో, అట్టివాడు అద్భుతమగు శక్తిసామర్థ్యములు కలిగియుండును. అతడే పరిపూర్ణ మానవుడు, మోక్షాధికారియు. అనగా శంకరాచార్యుల వంటి మేధాశక్తి, బుద్ధునివంటి హృదయము, జనకునివంటి నిష్కామకర్మతత్పరత గలిగియుండవలెను. (one should

possess the head of Shankara; the heart of Buddha and the hand of Janaka). సాధకుడు అన్ని యోగములను గలిగియుండుటయే భగవానునిమతము. ఈతని ఆశయమును శ్రీకృష్ణపరమాత్మ ఈ క్రింది శ్లోకము ద్వారా గీత 11వ అధ్యాయముయొక్క చివరిభాగములో తెలిపియున్నాడు.

మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సఙ్గవర్జితః
నిర్వైరస్సర్వభూతేషు యస్సమామేతి పాణ్డవ. (11-55)

"ఓ అర్జునా! ఎవడు నాసంబంధమైన కర్మలను చేయునో (కర్మ యోగము), నాయందే మనస్సు నిలుపునో (ధ్యానయోగము), నాయెడల భక్తి కలిగియుండునో (భక్తియోగము), దృశ్య పదార్థములందు సంగము (attachment) లేకుండునో (జ్ఞాన యోగము), సమస్త ప్రాణికోట్లయెడ దయ కలిగియుండునో, అట్టివాడు నన్ను పొందును." ఈశ్లోకమునందు అన్నియోగము లను కలిపివేసి భగవానుడుపదేశించెను. కాబట్టి అన్నియోగ ములు, అన్ని మార్గములు అవసరములే యగునని భావము.

అయినను, నేడు మనము కర్మయోగమును గూర్చి ప్రత్యేకముగ విచారించుచున్నాము. అన్నియోగములకును ఇది పునాది అయి యున్నది. కర్మ నాచరింపక, కర్మచే చిత్తశుద్ధిని బడయక ఎవరును నైష్కర్మ్యరూపమగు పరమస్థితిని, కైవల్యమును బడయజాలరని శ్రీకృష్ణుడు ఈ అధ్యాయ ప్రారంభమున ఘంటాపథముగ చెప్పివైచెను.

'న కర్మణా మనారమ్భాన్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే.' (3-4)

కొందఱు సోమరులు ఏ కార్యమున్ను చేయక, కర్మేంద్రియము లను బిగబట్టి, ఒకమూల ముడుచుకొని కూర్చొని (జగత్తు

మిథ్య కనుక) తాము పరమవైరాగ్యము నవలంబించియున్నా మని చెప్పుకొనుచు మనస్సుతో మాత్రము ముల్లోకము లందును సంచరించుచుందురు. అట్టి కపటభక్తులను ఈ అధ్యాయమున బాగుగ ఖండించివైచిరి. మిథ్యాచార్యులని వారికి తగిన నామధేయమును భగవాను డొసగెను—

**కర్మేన్ద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్**
**ఇన్ద్రియార్థాన్విమూఢాత్మా మిథ్యాచారః స ఉచ్యతే. (3-6)**

కర్మ చేయుటగాని, చేయకపోవుటగాని ప్రధానముకాదు. హృదయమందలి వాసనలు తొలగుటయే ప్రధానము. మనస్సునందలి మాలిన్యము నశించుటయే ప్రధానము. చిత్తమందలి రాగద్వేషములు వీడుటయే ప్రధానము. అవి తొలగనప్పుడు ప్రపంచమును విడిచి ఏకాంతమునకు పరుగెత్తి వెళ్ళి గిరిగహ్వరములలో కాపురముండినను, కర్మేంద్రియము లన్నింటిని బంధించివైచి కూర్చున్నను ఏ కర్మయు ఆచరింపక నుండినను మనుజుడు బద్ధుడేయగును. ఏలయనగా అప్పుడు మనస్సు మలినసంకల్పములు చేయుచునే యుండును. ప్రపంచమంతయు తిరుగాడుచునేయుండును. వాసనలు విజృంభించుచునేయుండును. అట్లుగాక, రాగద్వేషములు తొలగినప్పుడు, మనస్సునందలి మాలిన్యము నశించినప్పుడు, వాసనలు ఉడిగినప్పుడు మనుజుడు మహాజన మధ్యమున నున్నప్పటికిని నిరంతరము కర్మ శీలించుచున్నప్పటికిని ముక్తుడే యగును.

**యస్త్విన్ద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున**
**కర్మేంద్రియైః కర్మయోగ మసక్తస్స విశిష్యతే. (3-7)**

అను శ్లోకముద్వారా భగవానుడు పై భావమును వ్యక్తీకరించెను. ఇదియొక గొప్ప పరమార్థ రహస్యము. దీనిని తెలిసికొనక జనులు అకర్మణ్యులై వ్యర్థముగ కాలమును గడిపివేయుచున్నారు. ఆధ్యాత్మికరంగము సోమరులకు ఆలవాలమైపోవుచుండుటజూచి తిలక్ మహాశయుడు సహింపలేక 'గీతారహస్య' మను పేరిట నొక మహాగ్రంథమును వ్రాసి కర్మయోగముయొక్క ప్రాశస్త్యమును లోకమునకు చాటెను. మహాత్మాగాంధిజీ కూడ గీతాశయము 'అనాసక్త కర్మయోగమే'యని వెల్లడించి తన గీతావ్యాఖ్యానమునకు 'అనాసక్తియోగ' మని పేరుపెట్టెను. ప్రారంభమున దుష్కర్మనుండి సత్కర్మకు మారవలెను. అటుపిమ్మట సత్కర్మనుండి నైష్కర్మ్యమునకు (మోక్షమునకు) దారితీయవలెను. ఇదియే సరియైన పద్ధతి. అట్లుకాక దుష్కర్మనుండి ఒకేపర్యాయము నైష్కర్మ్యమునకు గంతు వేసినచో, అచటికి చేరకపోవుటయు అట్లుండ కాలు మాత్రము విరుగగొట్టుకొనును (పతనమొందును). ఈ ప్రమాదమును గుర్తించియే భగవానుడు పైవిధముగ హెచ్చరిక చేసెను.

కర్మలద్వారా చిత్తశుద్ధి కలుగును. నిలయముగా ఈశ్వరార్పణబుద్ధితో కర్మలను చేయుచురాగా, చిత్తమందలి దోషములు, పాపములు శమించి చిత్తము నిర్మలమగును. నిర్మల చిత్తమందు శుద్ధజలమందు సూర్యుని ప్రతిబింబము స్పష్టముగ గోచరించునట్లు జ్ఞానోదయమగును. జ్ఞానముచే మోక్షము లభించును. ఈ యర్థమునే ఈ క్రింది శ్లోకము నిరూపించుచున్నది—

**కర్మణా జాయతే భక్తిః భక్త్యా జ్ఞానం ప్రజాయతే**
**జ్ఞానాత్ప్రజాయతే ముక్తిః ఇతి శాస్త్రార్థసంగ్రహః.**

మఱియు కర్మయనునది మనుజుని సత్త్వ మెంతమాత్రమున్నదో తెల్పి చెప్పగల వస్తువు. ముఖ మెట్లున్నదో అద్దము తెల్పి చెప్పగలదు. అట్లే జీవుడు సత్త్వగుణమందున్నాడో, రజోగుణమునందున్నాడో, తమోగుణమునందున్నాడో కర్మరంగమున బయటపడును. కొందఱు ఏ పనియు లేనప్పుడు ప్రశాంతచిత్తులుగనున్నను, పనిలో ప్రవేశించినపుడు అందఱిని "కస్సుబుస్సు" మనుచుందురు. వారింకను క్రోధాదివాసనలు శమింపలేదని అర్థము. ఈ ప్రకారముగ మనుజుడు తానుపూర్ణముగ పవిత్రత నొందినది లేనిది కర్మక్షేత్రమున పరీక్షించుకొనుచుండవలెను. మహాత్ములు ఎన్ని కార్యములందు నిమగ్నులై యున్నప్పటికిని తమ సహజ శాంతిస్వభావమును వీడకయే యుందురు. ఒకింత సాధన చేసినవారుకూడ ఒకొక్కప్పుడు ఏదైన విపత్కరపరిస్థితి ఏర్పడినప్పుడు తలక్రిందులై పోవుచుందురు. వారింకను కర్మయోగాదులను లెస్సగ శీలించి, నిశ్చలత్వమును పొందవలసి యుందురు. అధికముగ చెప్పనేల, కర్మ ఒక 'థర్మామీటరు' వంటిది. జీవుని ఉష్ణము (తాపత్రయము) పూర్తిగ తగ్గినదా, లేక కొంచెము తగ్గినదా, లేక అధికముగనున్నదా యని అది పరీక్షించి చెప్పును. కాబట్టి ప్రతివారున్ను కర్మయోగమున వారి వారి పారమార్థిక బలాబలములను పరీక్షించి చూచుకొనుచుండవలయును. ఒకడు చూచుటకు దేవుడుగ కన్పించును. కాని కర్మయందుదిగినచో రాక్షసుడుగ ప్రవర్తించును. ఒకడు చూచుటకు రాక్షసుడుగ (అందవికారముగ) కన్పించును. కాని కార్యము

లందు దివ్యత్వమును వెదజల్లును. కావున మనుజుని పట్టిచూచిన నది కర్మయోగాని తదితరము కాదని విజ్ఞులు నిశ్చయించుకొని, దానియందు తీక్ష్ణముగ పవిత్రతను సంపాదించవలెను.

అయితే అట్టి పవిత్రతను ఎట్లు సంపాదించగలము? కర్మలను భగవదర్పితములు చేయవలెనని, కర్తృత్వమును వదలి కార్యములను చేయవలెనని గీత శాసించుచున్నది. ఇందలి రహస్య మేమియనిన, భగవంతునకు అర్పణచేయుకార్యమును ఎవడును అపవిత్రముగ చేయుటకు సాహసింపడు. సామాన్య మానవునకుఇచ్చుపదార్థమే శుద్ధముగనుండునట్లు చూచుచుండ ఇక భగవానునకు ఇచ్చుదానిని కల్మషభూయిష్ఠముగ ఉంచు దురా? ఉంచరు. కనుక 'నీవు చేయు కర్మలను ఈశ్వరార్పణ బుద్ధితో చేయుము' అని ఎప్పుడు గీతాదిశాస్త్రములు శాసించినవో అప్పుడిక జీవుడు ఆకర్మను శుద్ధముగనే చేయుటకు ప్రయత్నించును. మఱియు మనస్సును దైవముపైనుంచి దైవార్పణ బుద్ధితో చేయుకార్యము దైవకార్యముగనే పరిణతి నొందగలదు. ఏలయనగా అపుడు చిత్తము భగవంతునిపై ఆసక్తమగుటచే కర్మఫలమునందు ఆసక్తిగొనదు. ఫలాసక్తి రహితమగుకర్మ ప్రపంచకార్యమైనను, దైవకార్యముగను, యజ్ఞముగను, పూజగను, ధ్యానముగను మారిపోగలదు. కావున ఇక దానిచే జీవునకు బంధము కలుగకయే యుండును. ఇట్లుచేసినందువలననే పూర్వము జనకాదులు కర్మద్వారా జ్ఞానమును, తద్ద్వారా సంసిద్ధిని బడయగల్గిరి. జ్ఞాని అజ్ఞాని ఇద్దఱు చేయు కర్మలు పైకి ఒకటిగా గన్పించినను రెండిటి లక్ష్యములు వేఱు. అజ్ఞాని కర్మతో తాదాత్మ్యమునొంది 'నేనుచేయుచున్నాను'ను

కొనును. కర్తృత్వముతో, ఫలాభిసంధితో చేయును. జ్ఞాని ఆత్మస్థితియందుండి, లేక మనస్సును దైవమునందుంచి దైవ బుద్ధితో కర్తృత్వఫలాభిసంధిరహితముగ జేయును. కావున వానిఫలితములున్ను వేర్వేఱుగ నుండును. అనగా జ్ఞాని కర్మ ముక్తిజనకమున్ను, అజ్ఞాని కర్మ బంధజనకమున్ను అగుచున్నది.

ఈ కర్తృత్వమును మనుజుడు అనవసరముగ తనయందు కల్పించుకొని బాధపడుచున్నాడు. వాస్తవముగ ఈ అనంత కోటి బ్రహ్మాండమునందు మనుజుని ఉనికి యెంత! అనంతకాలములో అతని ఆయువు ఎంత! ఖగోళమునందలి నక్షత్రముల మధ్యగల దూరము లెక్కించునపుడు, వాని పరిమాణమును లెక్కించునపుడు ఈ గోళమంతయును అసలు గణన కేరాని యంతటి చిన్నవస్తువుగ నుండును. అట్లే అనంతకాలములో జీవుని ఆయుర్దాయమున్ను బహుస్వల్పమైనదియే యగును. మనుజుడు తాను పుట్టకపూర్వము కోట్లకొలదిసంవత్సరములు ఈ జగత్తును ఎవరు పాలించిరో, తాను మరణించిన పిదప కోట్లకొలది సంవత్సరములవఱకు ఎవరు పాలించుదురో, ఒకింత యోచించవలెను. బ్రహ్మాండమును నంతటిని నడుపుశక్తి ఒకటి యున్నది. అదియే దైవము.

'పితాసి లోకస్యచరాచరస్య'

అనునట్లు చరాచర ప్రపంచమునకు నాథు డొకడుకలడు. అతడే పరమాత్మ. అతడే ఈ విశ్వమునంతటిని నడుపుచున్నాడు. మన ద్వారా పనులు చేయించునదియు అతడే. మనము కేవలము నిమిత్తమాత్రులము. అతని చేతిలో ఉపకరణములము. ఈ జగ

న్నాటకములో మనము పాత్రధారులము. భగవంతుడు సూత్రధారి. అనంతశక్తిమంతుడగు దైవము. ఈ ప్రపంచమును గూర్చి నడుపుచున్నాడు. ఇంతవరకు అనంతకాలముగ జరిగిన పనులన్నియు మీవలనగాని మావలనగాని జరుగలేదు.

'పూర్వేషామపి గురుః కాలేనానవచ్ఛేదాత్'

అను పతంజలి యోగసూత్రప్రకారము కాలముచే పరిచ్ఛిన్నుడు కానట్టియు, పూర్వీకులకున్న గురుస్థానమట్టియు మహానుభావుడొకడు కలడు. అతడు త్రివిధపరిచ్ఛేదరహితుడు. దేశమునకు, కాలమునకు, వస్తువునకు అతడు లోబడువాడు కాడు. జీవుని మనస్సు, శరీరము దేశకాలవస్తువులచే పరిచ్ఛిన్నములైనవి. అనగా జీవుడు కాలముచే మ్రింగబడుచున్నాడు. భగవంతుడో కాలమునే తాను మ్రింగివైచుచున్నాడు. ఈ ప్రకారముగ చరాచరప్రపంచమును, అనంతకాలమునను, వానియందుగల కర్మలను ఈశ్వరుడు నడుపుచుండగా, ఈ ముప్పది, యాభైయేండ్ల బ్రతుకుగల జీవుడు తానే అంతయు చేయుచున్నానని, కర్తనని విఱ్ఱవీగుట హాస్యాస్పదముగ నున్నది. అది కేవలము అసంగతమే యగును. అతడు కర్తృత్వము వహించుట ఎట్లున్నదనిన-ఒక చిన్న సాదృశ్యము చెప్పెదను-

ఒక అమాయకుడగు పల్లెటూరిరైతు (ఇదివఱకెన్నడును రైలు ఎక్కనివాడు) ఒకపర్యాయము రైలులో ప్రయాణముచేయుట తటస్థించినది. అతనియొద్ద ఒక చిన్నమూట కలదు. రైలులో ప్రవేశించగనే చుట్టును అనేకమంది ప్రయాణీకులు పెద్దపెద్దపెట్టెలను క్రిందపెట్టుకొని కూర్చొనియుండుట అతడు చూచి 'అయ్యో! ఎంతభారము రైలునకు! వీరందరిని

వీరి సామానులను మోయుటయే దానికి కష్టముగదా! ఇక నామూటకూడ అందుచేర్చి దానికి భారము మేల అధికముచేయవలెను? అని వితర్కించుకొని తనమూటను క్రిందబెట్టక తన నెత్తిపైననే ఉంచుకొని రైలులో కూర్చొనెను. చుట్టునున్న జనము ఆ వింతజూచి విరగబడి నవ్వసాగిరి. మఱియు ఆ పల్లెటూరి మనిషితో నిట్లు చెప్పసాగిరి. "ఓయీ వెఱ్ఱివాడా! నీవు నీమూటను రైలులో క్రింద పెట్టక నీ నెత్తిన పెట్టుకున్నను దానిని మోయునది రైలేకదా! నిన్ను, నీమూటను మమ్ములను వెయ్యేల సమస్తమును ఆ రైలే మోయుచున్నదని తెలిసికొనుము." అది విని యా రైతు తన తప్పిదమును గుర్తెఱిగెను. ఆ ప్రకారముగనే జీవుడు తానే కర్తనని, తానే లోకోద్ధారకుడనని, కర్తృత్వాహంకారములుగల్గి సర్వలోకపితయగు పరమాత్మను మఱచిపోవుచున్నాడు. అదియే అతని అనర్థమునకు మూలకారణమై యున్నది. కనుకనే భగవద్గీత కర్తృత్వమును వదలి అసక్తముగ లేక ఈశ్వరార్పణబుద్ధితో కర్మలను చేయవలెనని ఉద్బోధించుచున్నది.

తస్మాదసక్తః సతతం కార్యం కర్మ సమాచర ।
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః॥ (3-19)

అని వచించుచు గీత అనాసక్తకర్మాచరణమునకు ఫలితము మోక్షమని ఋజువు చేయుచున్నది. కాబట్టి ఇంద్రియములను గుఱ్ఱములగొనుక కళ్లెమును అర్జునునివలె శ్రీకృష్ణపరమాత్మకు (దైవమునకు) ఒసంగి, ఆతనివశము చేసి, కర్మలను గావించిన అవి బంధహేతువులుకాక మోక్షహేతువులేయగు

చున్నవి. అత్తఱి తాను ఏకర్మచేసినను అది భగవానునకు పరిచర్యగనే యుండును. ఎట్లనిన,

> ఆత్మాత్వం గిరిజా మతిః, పరిజనాః ప్రాణాః శరీరం గృహం।
> పూజా తే విషయోపభోగరచనా నిద్రా సమాధి స్థితిః ।
> సంచారః పదయోః ప్రదక్షిణ విధిః స్తోత్రాణి సర్వాంగిరో ।
> యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం శంభో తవారాధనమ్॥

'ఈశ్వరా! నా ఆత్మయే నీవు. నా బుద్ధియే నీ యర్ధాంగియగు పార్వతి. నా ప్రాణములే నీ పరిజనులు. నా శరీరమే నీ యిల్లు. నేను జీవితావసరములగు విషయములు ననుభవించుటయే నీయొక్క పూజ. నాయొక్క నిద్రయే సమాధిస్థితి. నే నెచట నెచట సంచరించినను అదియంతయు నీకు ప్రదక్షిణము చేయుటయే. నేను మాట్లాడినది యంతయు నిన్నుగూర్చిన స్తోత్రములే. ఈప్రకారము నేనేది చేసినను అనియంతయు నీయొక్క ఆరాధనయే అయియున్నది.' అని ఒక మహాభక్తుడు ఈశ్వరుని గూర్చి తన భక్త్యతిశయమును వెల్లడించినాడు. ఈపృస ద్వైవ భావముతో గావించు ప్రతికార్యమున్ను జీవుని తరింపజేయు పూజావిధానముగ మారిపోగలదు. భగవంతుని పురస్కరించు కొని (కృష్ణుని ముందు పెట్టుకొని) అర్జునుడు చేసిన మహా యుద్ధము యజ్ఞకార్యముగ చెన్నొందెను. భగవంతుని తిరస్కరించుకొని దక్షుడు చేసిన మహాయజ్ఞము యుద్ధకార్యముగ పర్యవసించెను. కర్తృత్వాహంకారరహితుడై, భగవదాజ్ఞను రీతి వ్యవహరించి అర్జునుడు యుద్ధమును మహాభయంకర కార్యము యొక్క వికారరూపమును తొలగించి పవిత్రవంతముగ నొనర్చెను. దక్షుడో, అహంభావాదులతో గూడి భగవంతుని

(ఈశ్వరుని) ఉపేక్షించి, యజ్ఞమను మహాపవిత్రకార్యము యొక్క సురూపమును తొలగించి వికాగవంతముగ గావించెను. ఇదియే ఇరువురికినిగల భేదము. కనుకనే గీతాచార్యుడు-

మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా
నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః. (3-30)

అధ్యాత్మచిత్తముతో గూడి సర్వకర్మలను తనకు సమర్పించి ఆశా, మమకారాదులులేక నిశ్చింతగ యుద్ధము చేయుము (కర్తవ్యము నాచరింపుము) అని అర్జునుని, తద్ద్వారా సమస్త లోకమును ఆదేశించుటకు కారణము. అర్జునుడు క్షత్రియుడు కావున క్షాత్రధర్మమగు యుద్ధకార్యమిచట ప్రస్తావింపబడెను. ఇతరులో, వారి వారి సంప్రదాయములకు సముచితములైనట్టి కార్యములను భగవదర్పితముగ చేసికొనవచ్చునని ఈ శ్లోక భావము. ఈ ప్రకారము కర్మాచరణపద్ధతి గీతయందు సర్వ జనులకును సులభముగ నిర్దేశింపబడినది. దీనినిబట్టి కొందఱను కొనువిధముగ గీత యుద్ధమును ప్రోత్సహించలేదనియు, రాగ ద్వేషములులేక సుఖదుఃఖములందును, లాభాలాభములందును, జయాపజయములందును సమబుద్ధిగలిగి వారివారికి తగిన కార్యములను చేయవలెననియే ఉపదేశించినదనియు స్పష్టమగుచున్నది. అర్జునునకు తత్కాలమున ధర్మయుద్ధము స్వకార్యముగ, క్షత్రియోచితపద్ధతి ననుసరించి ఏర్పడినది కనుక ఆలెడాగనుయమున యుద్ధము చేయవలసివచ్చెను.

ఇక కర్మవిషయమై మరియొక రహస్యము తెలిసికొనవలసియున్నది. ఈ ప్రపంచమున మనుజుని ఉద్ధరించునది, క్రిందకు పడద్రోయునది కర్మయే. ఎవనికర్మ శుద్ధముగనుండునో

పుణ్యవంతముగను, పాపరహితముగను నుండునో అట్టివాడు సద్గతినే పొందును. అతడిక ఎవనికిని భయపడ నవసరములేదు. జీవుడు కర్మకర్త, సర్వేశ్వరుడు కర్మఫలప్రదాత. జీవుని కర్మ యేవిధముగ నుండునో ఆవిధమగు ఫలితమునే దేవు డొసంగు చుండును. కనుక ప్రతిజీవియొక్క ఉద్ధారము వారివారి పవిత్ర కర్మపై ఆధారపడియున్నది. అందులకే కాళిదాసు ఒక మహా నీయుడు "నేను మొట్టమొదట నా కర్మకు దణ్ణము పెట్టు కొందును. తరువాత తక్కిన దేవతలకు" అని పలికియున్నాడు (తస్మై నమః కర్మణే). కావున (దైవసాక్షిగ) ఎవరును పాపా చరణము చేయరాదు. మనము చేయు పుణ్యములను, పాపము లను వెయ్యికండ్లతో కనిపెట్టువాడొకడు కలడని పూర్ణ విశ్వా సముతో నుండవలెను. 'సహస్రాక్షః సహస్రపాత్' అను వేదవాక్యమును జ్ఞప్తియం దుంచుకొనవలయును. భగవంతు డనగా దుఃఖముల చేతను, కర్మముల చేతను అంటబడనట్టియు, అనంతమైన దేహము కలిగినట్టియు ఒకానొక సజీవ వ్యక్తి యనియే తెలిసికొనవలయును.

"క్లేశకర్మ విపాకాశయైరపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః"

(పతంజలి యోగసూత్రము)

అనగా 'దుఃఖములు, కర్మలు మున్నగువానిచే అంటబడని ఒకానొక పురుషుడే ఈశ్వరుడు' అని అర్థము. జీవునిశక్తి అంతయు కలసి ఒకటి (X) అనుకొనిన ఆ ఒకటిని అనంత ముతో హెచ్చించిన భగవంతు డగును.

**Jiva × Infinity = God.**

అనగా మన శరీరమును అనంతముతో హెచ్చించిన అది దైవ శరీరమగును (విరాట్). మన మనస్సును అనంతముతో హెచ్చించిన దైవమనస్సగును (హిరణ్యగర్భుడు). ఇక మన ఆత్మయు అతని ఆత్మయు ఒకటియే. ఇదియే దేవుని రూపము. దీనినిబట్టి దేవుడు లేడని చెప్పువారు తాము లేమని చెప్పుకొనినట్లే యగుచున్నది. అది అసంగతము. కావున వారివారి అస్తిత్వమును జనులు విశ్వసించినచో దైవముయొక్క అస్తిత్వమును గూడ విశ్వసించవలసియున్నది. ఈప్రకారముగ దేవునియందు జీవుడు ఒకానొక అంశమే కనుక, జీవుడు చేయు పాపపుణ్యములను దేవుడు నిరంతరము గమనించుచునేయుండును. పాపసంకల్పముదయించుటకు పూర్వమే అచ్చోట (సంకల్పమునకు అధిష్ఠానముగ) పరమాత్మ నివసించియుండ ఇక అతని దృష్టి బడని పాపమేదైన యుండగలదా ?

ఏకోఽహమస్మీతి చ మన్యసే త్వం
న హృచ్ఛయం వేత్సి కవిం పురాణం
యో వేదితా కర్మణః పాతకస్య
తస్యాన్తికే త్వం వృజినం కరోషి.

"నేనొక్కడనే ఉన్నాను. నన్నెవరును చూచుటలేదు. కావున పాపముచేసెద' నని నీవనుకొనుచున్నావు కాబోలు. అది చాల తప్పు. ఏలయనిన నీ హృదయముననే వసించియున్నట్టి పురాణపురుషుని నీ వెఱుంగకున్నావు. ఎవడు నీయొక్క పాపకర్మములను సాక్షిగ చూచుచున్నాడో, అతని చెంతనే నీవు పాపము చేయుచున్నావు! ఆహా! ఎంత ప్రమాదము!' అని శ్లోకభావము. కాబట్టి జీవుడు తన

శ్రేయోభివృద్ధి నిమిత్తము జీవితములో ఏలాటి పాపమును చేయక, పుణ్యమునే అధికముగ చేయుచుండవలెను. కనుకనే గీత మొదటినుండి తుదివరకు, పుణ్యకార్యములను, దైవ కార్యములను, నిష్కామ కార్యములను ప్రోత్సహించుచు వచ్చినది. ఈకర్మరహస్యమును తెలిసికొనినచో ప్రతి మానవుడు నిర్భయత్వమునుబొంది ఈజన్మయందే తనయొక్క సాధనసోపానములను నిరంతర పుణ్యసంపాదనముద్వారా చేసికొనగలడు.

అయితే కొందఱికి పాపము చేయవలెనను ఇచ్ఛ లేకపోయినను బలాత్కారముగ పాపము చేయుచున్నారు. అధర్మ మాచరించవలెనను సంకల్పము లేకున్నను ఏదియో యొకశక్తిచే ప్రేరితులై బలాత్కారముగ అధర్మ మాచరించుచున్నారు. ఇట్టి విపరీతమగు లోకస్థితిని గమనించి అర్జునుడు దాని కీలక మేదియో తెలిసికొనవలెనని అభిలషించి శ్రీకృష్ణపరమాత్మను తద్విషయమై యిట్లు ప్రశ్నించెను.

అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః. (3-36)

అనునది ప్రశ్న. పాపము చేయవలెనను కోరిక లేనప్పటికిని ఏల పాపము చేయుచున్నాడు? దేనిచే ప్రేరేపింపబడి అట్లొనర్చుచున్నాడు? అని అర్జునుని శంక. ఈ ప్రశ్న ఎంతేని తగియున్నది. ఏలయనిన ఇది ప్రతివారియొక్క అనుభవములోనున్న విషయము. నిత్యజీవితములో మనుజుని వేధించుచున్న ప్రశ్న ఇదియే. అర్జునుడు ముల్లోకములందలి సాధకులందఱికిని, ముముక్షువులందఱికిని ప్రతినిధి (representative). కావున వారి అందఱి తరఫున ఈ సమయోచితమగు ప్రశ్నగావించెను.

అబద్ధము మాట్లాడగూడదు అని అందరికిని తెలియును. కాని మాట్లాడుచున్నారు. పరులకు అపకారము చేయగూడదని అందరికిని తెలియును. కాని చేయుచున్నారు. లంచమును తీసికొనగూడదు, వ్యాపారములో మోసము చేయగూడదు-అని ఎవరికి తెలియదు? కాని తద్విరుద్ధముగ జరుగుచున్నది. 'ఈరోజేకాదశి ఉపవాస ముండవలెను'-అని పట్టుదలతో వ్రతము ప్రారంభించినను, మధ్యాహ్న సమయము అగుసరికి ఏదియో యొక శక్తి వచ్చి కొద్దిగ కాఫీ త్రాగినను ఏమియు పరవాలేదు. వ్రతమునకు లోపములేదు; ఆరగించండి, అని చల్లగా బోధించుటకుపక్రమించి సాధకుని మెల్ల మెల్లగా గోతిలోనికి త్రోసివేయుచున్నది. ఆదుష్ట శక్తి యేదియో తెలిసికొనవలెననియే అర్జునుని ఉబలాటము.

అర్జునుని సందేహము తీర్చుచు శ్రీకృష్ణపరమాత్మ ధర్మరహస్యములతో గూడిన చక్కటి ఆధ్యాత్మిక ప్రసంగము గావించెను. భగవద్గీతలోని ఈ ఘట్టము అతి ముఖ్యమైనదని సాధకులు జ్ఞప్తియందుంచుకొనవలెను. ఏలయనిన మనస్సును నిగ్రహించుటకు, వశమొనర్చుకొనుటకు ఏపద్ధతి నవలంబించవలెనో స్పష్టముగ నిచట నిరూపింపబడినది. జీవునియందు సామాన్యముగ మూడు గుణము లుండును. 'సత్త్వగుణము, రజోగుణము, తమోగుణము' అని. అందు రజోగుణ, తమోగుణములు మహా ప్రమాదములైనవి. రజోగుణముయొక్క గర్భమున కామమను భయంకర రాక్షసి జన్మించినది. అదియే జీవుని యధఃపతనమునకు కారణమని భగవానుడు నుడివెను-

**కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః**
**మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్.** (3-37)

ఈ కామమే జీవునకు పరమశత్రువు, నిత్యవైరి. ఎన్ని సుగుణము లున్నప్పటికిని ఈ కామ మనునది ఒక్కటి చేరినచో అన్నియును నాశనమైపోవును. ఇది విషబిందువు వంటిది. రావణాసురుడు మహాశివభక్తుడని ప్రతీతి. గొప్ప బ్రాహ్మణవంశమున జన్మించినవాడు. ప్రతిరోజు ఎన్నిసారో శివలింగములకు పూజ చేయువాడట! కాని ఏమి లాభము! అమృతకలశములో గరళబిందువు పడినట్లు ఆ సద్గుణములలో కామము వచ్చిపడినది. తత్ఫలితముగ లోకములకు అధిపతియైనను కామమునకు దాసుడై వర్తించెను కాబట్టి వినాశమునే పొందెను. దుర్గుణము లన్నింటికిని కామము అధినేత (captain). అది కదిలినచో అరిషడ్వర్గములోని తక్కినవి యన్నియు (క్రోధలోభాదులు) కదులును. కామము మొదట మనుజుని చిత్తమున కన్నమువేసి లోనికి ప్రవేశించును. పిదప క్రోధాదులు ఆ కన్నముగుండా లోనికి ప్రవేశించుదురు. తుదకు అందఱును జేరి జీవుని జ్ఞానధనమును తస్కరించివేయుదురు.

> కామః క్రోధశ్చ లోభశ్చ దేహే తిష్ఠన్తి తస్కరాః
> జ్ఞానరత్నాపహారాయ తస్మా జ్జాగ్రత జాగ్రత.

'కామ క్రోధ లోభములను దొంగలు జ్ఞానమను రత్నమును దొంగిలించుటకై ఈ శరీరమున కాచుకొనియున్నారు. కావున చాల జాగ్రతగ నుండుము' అని హెచ్చరిక. మఱియు ఈ కామము ఎంత అనుభవించినను, జీవునకు తృప్తి కలుగదు. పైగా వృద్ధినొందుచునే యుండును. కనుకనే భగవానుడు దానిని 'మహాశనము' అని పేర్కొనెను. అనగా అగ్నివలె ఎంత ఆహుతివేసినను ఇంకను కావలెననియే కోరునది యని అర్థము.

సంస్కృతములో అగ్నికి 'అనలము' అని పేరు. 'అలం' అనగా "చాలును". 'అనలం' అనగా 'చాలదు' అని అర్థము. తనలో ఎంత వేసినను చాలదనియే అగ్ని చెప్పుచుండునని భావము. కనుకనే శ్రీకృష్ణపరమాత్మ ఆ అగ్ని దృష్టాంతమే కామమునకు సబబుగా నుండునని తలంచి 'దుష్పూరేణానలేన చ' అని యిట పేర్కొనినవాడాయెను. అగ్నిని పొగ కప్పివేయునట్లును, అద్దమును దుమ్ము కప్పునట్లును, గర్భస్థపిండమును మావికప్పునట్లును ఈ కామాదులచే జీవుని జ్ఞానము కప్పివేయబడుచున్నది. దీనిని జయించవలెనన్న దీనికి ఆశ్రయస్థానములైనట్టి ఇంద్రియములను మొట్టమొదట (వివేకముచే) జయించవలెనని శ్రీకృష్ణుడు జ్ఞానశిక్షనిచ్చుచున్నాడు. ఆ యింద్రియములను జయించుట ఎట్లు? "ఏవంబుద్ధేః పరం బుద్ధ్వా"-అనునట్లు ఆ ఇంద్రియ బుద్ధ్యాదులకు పరమైన అతీతమైన సాక్షియైనట్టి తన ఆత్మస్వరూపమును వివేకముద్వారా తెలిసికొనినచో ఇక ఇంద్రియాదులు లోబడిపోవును. ఆత్మజ్ఞానసహాయ్యముచే వాసనాక్షయము తప్పక కలుగగలదని భగవానుని యభిప్రాయము. ఇంద్రియములకు, బుద్ధికి లోబడినవస్తువుల నన్నింటిని పట్టుకొనినను లాభములేదు, ఇంద్రియములు వశపడవు. ఇంద్రియములకు పరమైనట్టి వస్తువును (ఆత్మను) పట్టుకొనినచో అవి వానియంతట నవియే వశపడిపోగలవు. ఈ ఉపాయముద్వారా, అనగా ఆత్మవిచారణద్వారా, ఆత్మధ్యానముద్వారా భయంకరమైన కామరూపపిశాచమును త్యజించివేయుమని భగవదాజ్ఞ. ఉదయము 8 గంటలకు ఎండలో నిలబడినచో నీడ చాలపొడవుగా కన్పించును. ఆ నీడ తగ్గవలెననినగాని, నశించవలెననినగాని అభిలషించి

నచో అందులకు ఒకేఒక ఉపాయముకలదు. దానిని కొట్టినను తిట్టినను, ఛేదించినను ఏమియు ప్రయోజనములేదు. సూర్యుడు పైకిలేచిన చాలును. అదియే దాని వినాశమునకు ఉపాయము. ఎంతెంత సూర్యుడు పైకి లేచుచుండునో అంతగా నీడ తగ్గుచుండును. సూర్యుడు నడినెత్తిపైకి వచ్చినప్పుడు అసలు నీడయే యుండదు. అట్లే కామమను నీడను నశింపజేయుటకై జ్ఞానసూర్యుని పైకి లేపవలసినదిగా భగవానుడిచట ఆదేశించుచున్నాడు. ఇంద్రియజయమునకు, కామాదుల వినాశమునకు ఇది చక్కని మార్గము.

జ్ఞానసూర్యుని పైకి లేపుటయనగా వివేకముతో గూడిన విచారణ గావింపవలెననిభావము. ఆత్మస్వరూపమెట్టిదో, దృశ్యముయొక్క స్వరూపమెట్టిదో లెస్సగా విచారించవలెను. ఆత్మ ఇంద్రియములకు, మనస్సునకు, బుద్ధికిగూడ పరమైనట్టిది. వానియన్నిటికి సాక్షిగానుండునది. కావున కామసంకల్పముదయించగనే ఆసంకల్పమునకు సాక్షిగానున్న ఆత్మస్థానమునుండి దానిని వీక్షించినచో వెంటనే అది విలుప్తమైపోవును. దొంగనుకనిపెట్టినచో ఇక నాతడు దొంగతనముచేయుటకు సాహసింపజాలడు! ఇక రెండవదియగు దృశ్యస్వరూపవిచారణయనగా - ఈప్రపంచమంతయును, ప్రతివస్తువున్ను పంచభూతాత్మకమైనదని తెలిసికొనుట-అనగా ఏవస్తువైననుసరియే నిప్పు, నీళ్లు, గాలి, ఆకాశము, మట్టి—వీనితో చేయబడినదియేయని గ్రహింపవలెను. దృష్టాంతమునకు, మహాసుందరమైన ఒక స్త్రీ దేహముగాని, పురుషదేహముగాని తీసుకొనుడు. అదిన్ని, ఈ నిప్పు,నీళ్ళు,మట్టి మొదలైన ఐదింటిచేతనే చేయబడినదియగును. ఈసత్యమెఱిగి

నచో కామసంకల్పము వెంటనే నమసిపోగలదు. ఈప్రకారముగ విచారణాదులచే కామమునకు అంకుశము. 'సంస్తభ్యాత్మాన మాత్మనా' అను వాక్యముద్వారా ఇట్టి సాధననే భగవానుడు కామజయమునకు సూచించెను. కామసంకల్ప ముదయించిన తరువాత దానిని విచారణాదులచే సరకట్టువాడు మధ్యతరగతి వాడు. ఉత్తములో, బుద్ధికి పరమగు స్వస్వరూపమందే నిలకడ కలవారై, అనగా ఆత్మను ఆశ్రయించినవారై, అసలు కామ సంకల్ప ముదయించకుండగనే చూచుచుందురు.

కామ జానామితే మూలం సంకల్పాత్త్వం హి జాయసే।
న త్వాం సంకల్పయిష్యామి సమూలస్త్వం వినశ్యసి॥

"ఓ కామమా! నీ అంతు తెలిసినది. సంకల్పమునుండియే నీవు పుట్టుచున్నావు. కాబట్టి సంకల్పమును నాయందు ముదయించ కుండ చూచెదను. అత్తఱి సమూలముగ నీవునశించినదానవే యగుదువు" అని పలుకుచు శచుడు కామమును జయించు పద్ధతిని వెల్లడిచేసెను. ఇది ఉత్తమాధికారులు అవలంబించు మార్గము. ఇన్విధములు ఏదోయొక యుపాయము ద్వారా మనుజుడు తన నిత్యశత్రువగు కామమును జయించియే తీర వలెను. లేనిచో పరమార్థమార్గమున ఆతడు ఒకింతేని ఉన్నతిని బొందజాలడు. ప్రపంచమున చతురంగబలములను జయించు వాడు శూరుడుకాడు. అస్త్రశస్త్రములు కలిగియున్నవాడు శూరుడుకాడు. లోకమంతయు దిగ్విజయ మొనర్చువాడు శూరుడుకాడు.

శూరాస్త ఏవేహ మనస్తరంగం।
దేహేంద్రియాంభోధి మిమం తరన్తి॥ (వసిష్ఠగీత)

అని వసిష్ఠులానతిచ్చినట్లు తన ఇంద్రియమనంబులను జయించి కామాదులపై విజయము సంపాదింపగలిగినవాడే శూరుడనం దగును. ఈ సత్యమునే భగవాను డీ యధ్యాయముయొక్క చివరిభాగమున ప్రస్ఫుట మొనర్చెను. ఇవ్విధమున జీవుడు తన ఆచరణను శుద్ధపరచుకొనవలెననియు, కర్తృత్వ, అహంకారాదులు లేకుండ దైవార్పితముగ కార్యముల నాచరింపవలె ననియు నిష్కామ కర్మాచరణముద్వారా శుద్ధపడునట్టి తన మనస్సే తన్ను (జ్ఞానోత్పత్తిద్వారా) కాపాడగలదనియు, ఆత్మ విచారణచే ఇంద్రియములను జయించి కామాదులను సమూలముగ తొలగించివేయవలెననియు బోధించి శ్రీకృష్ణ మూర్తి ఈకర్మయోగమను అధ్యాయమును పరిసమాప్తము గావించెను. భగవాను డాదేశించిన ఈ విధానములను ముముక్షువులు శ్రద్ధాభక్తులతో శీలించి, సత్ఫలితముల ననుభవించి ధన్యులయ్యెదరు గాక !

ఓమ్

ఓమ్

# 4-వ అధ్యాయము

# జ్ఞానయోగము

భగవద్గీత నాలుగవ అధ్యాయమగు జ్ఞానయోగమును గూర్చి ఈ దినము విచారింపవలసియున్నాము. 'గీత యొక కల్పవృక్షము. అది కృష్ణునిచే నాటబడినది. వ్యాసులచే పెంచబడినది. ఉపనిషత్తులే దాని విత్తనము. జ్ఞానప్రబోధమే దాని అంకురము. వివిధశాస్త్రరహస్యములే దాని కొమ్మలు. విషయవిరక్తి, సహనములే దానిచిగుళ్ళు. శ్రీకృష్ణపరమాత్మయొక్క పాదపద్మములయెడల భక్తియే దాని పుష్పసుగంధము. మోక్షమే దాని ఫలము.' కనుకనే శంకరాచార్యులవారు 'దేనిని గానముచేయవలెను?' అను ప్రశ్నవచ్చినప్పుడు గీతను, విష్ణుసహస్రనామములను గానము చేయవలెను (గేయం గీతా నామసహస్రం) అని సెలవిచ్చిరి. గీతయందలి భావములు అతి గంభీరములు. వానిని అనుష్ఠించినచో నవి మనుజునకు తప్పక శాంతిసుఖములను కలుగజేయగలవు. గీతాగంగాపానముచే ఇంతవఱకు కెందరో తరించిరి, తరించుచున్నారు, తరింపగలరు. శంకరులు ఎలుగెత్తి చాటిన భావములను వినుడు—

భగవద్గీతా కించిదధీతా
గంగాజలలవకణికాపీతా
సకృదపి యేన మురారి సమర్చా
తస్య కరోతి యమోఽపి న చర్చామ్.

"భగవద్గీతను ఒకింత అధ్యయనము చేసినను, గంగాజలమును కొద్దిగ త్రాగినను, విష్ణుభగవానుని ఒక్క పర్యాయము పూజించినను-ఇక యముడు వాని చెంతకు పోనేరడు." గీతయొక్క మహిమాతిశయమును మహానుభావు లీప్రకారముగ వ్రాసి యున్నారు. వేయేల! శ్రీకృష్ణుని హృదయమే గీత యని చెప్పవచ్చును. 'నేను గీత నాశ్రయించుకొనియున్నాను. గీత నాకు చక్కని ఇల్లు. గీతాజ్ఞానము నవలంబించి మూల్లోకములను నేను పాలించుచున్నాను' అని భగవానుడు చెప్పియే యున్నాడు*. కాబట్టి గీతపై పూర్ణ విశ్వాసముంచి, అందలి సత్యములను అనుష్ఠించి నిరతిశయానంద సామ్రాజ్యమందే యనుభవించుటకు బద్ధకంకణులు కావలెను. గీత కేవలము కృష్ణార్జున సంభాషణమే కాదని జ్ఞప్తియందుంచుకొనవలెను. అది ప్రతివాని హృదయమందును నిరంతరము జరుగుచున్న సంభాషణమే యగును. అర్జునునివలె మనము చెవులు శ్రీకృష్ణపరమాత్మవైపు త్రిప్పినచో ఆ దివ్యవాణి మనకు వినిపించగలదు. సామాన్య గ్రంథమువలె దీనిని ఒక పర్యాయము చదివి ప్రక్కన పెట్టరాదు. నిరంతరము అధ్యయనము చేయుచు, అందలి ధర్మ రహస్యములను అనుష్ఠించుచు, దైనందినజీవితమునందు వానిని ప్రయోగించుచు రావలెను. అప్పుడే సామాన్యజీవితము దివ్య జీవితముగా మారిపోవును. ఫలితముగ దానవుడు మానవుడుగా మారుటయేకాక, మానవుడు మాధవుడుగా పరివర్తించును. ఇదియే గీతయొక్క అనన్యసామాన్యప్రతిభ. ఇట్టి మహోత్తర

* గీతాశ్రయోఽహం తిష్ఠామి గీతా మే చోత్తమం గృహమ్
గీతాజ్ఞానముపాశ్రిత్య త్రీన్‌లోకాన్ పాలయామ్యహమ్.

ఉద్గ్రంథమును లోకమునకు ప్రసాదించినట్టి శ్రీకృష్ణపరమాత్మకు, శ్రీ వేదవ్యాసులకు, శ్రీ పార్థునకు సమస్కృతులర్పించి నేటి ఉపన్యాసము నుపక్రమించుచున్నాను.

నేడు గీత 4-వ అధ్యాయము విచారణీయాంశము. జ్ఞానయోగమని దీనికి పేరు. క్రిందటి అధ్యాయము కర్మయోగమను పేరు కలిగియున్నను తుట్టతుదకు అఖండజ్ఞానోపదేశము నెట్లొసంగెనో, ఈ అధ్యాయము జ్ఞానయోగ మని పేరు కలిగియున్నను నిష్కామకర్మనుగూర్చి అనాసక్తకర్మయోగమును గురించి విపులముగ బోధించినది. దీనినిబట్టి కర్మ, జ్ఞానములు రెండును జీవుని ఉన్నతికి అత్యావశ్యకములని తేలుచున్నది.

శ్రీయోగవాసిష్ఠ ప్రారంభమున నేకల శ్లోకమును జూడుడు-

ఉభాభ్యామేవ పక్షాభ్యాం యథా ఖే పక్షిణాం గతిః
తథైవ జ్ఞాన కర్మభ్యాం జాయతే పరమంపదమ్.

"రెండు రెక్కలచే పక్షులకు ఆకసమున గమనము సంభవించునట్లు జ్ఞానకర్మల రెండిటిచే పరమపదమగు మోక్షము సంభవించుచున్నది. నిష్కామ కర్మాచరణముద్వారా చిత్తశుద్ధి కలుగగా, అట్టి నిర్మలచిత్తమున జ్ఞానము తెస్సగ ప్రకాశించుచున్నది. అట్టి నాత్మానాత్మ వివేకరూపమగు జ్ఞానముద్వారా లోకములో కర్మను అతిపవిత్రముగ, నిస్సంగముగ, పరోపకారబుద్ధితో, త్యాగభావనతో, ఆచరించుటకు వీలుపడుచున్నది. ఈ ప్రకారమున జ్ఞాన, కర్మలు ఒకదానినొకటి పరిపోషించుకొనుచుండును. అయితే జ్ఞానము పరిపక్వమై నిర్వికల్పసమాధిస్థితి సంభవించినపుడు జీవునిచే నిక కర్మాచరణము

సాధ్యపడదు. తిరిగి వ్యుత్థాన దశయందును మాత్రమే వారి వారి సంస్కారము ననుసరించి కొందఱు లోకసంగ్రహార్థము కర్మ చేయుదురు! మఱికొందఱు చేయరు. అట్టివారి కిక కర్మలు చేయుటచేగాని, చేయకపోవుటచేగాని బంధము లేదు. అయినను జీవన్ముక్తులగు మహనీయులు, పరమజ్ఞానులు సామాన్యముగ లోకసేవాతత్పరులై కార్యములను చేయుచునే యుండుట చరిత్రయందు మనము గమనించుచునే యున్నాము. ఈప్రకారముగ జ్ఞాన, కర్మల పరస్పర సాన్నిహిత్యము వలననే 'జ్ఞానయోగము'ను ప్రతిపాదించు ఈ అధ్యాయమున భగవానుడు "తత్తేకర్మ ప్రవక్ష్యామి (కర్మనుగూర్చి వచించుచున్నాను)" అని కర్మాచరణపద్ధతిని నిరూపించుటకు కారణము.

మఱియు 'జ్ఞానిమాత్రు'లగు కొందఱు తాము జ్ఞానులమని తలంచి అకర్మణ్యులై, సోమరులై, తమోగుణము నవలంబించి, కర్మ బ్రహ్మోభయభ్రష్టులై పతనమునొందుట చూచి శ్రీకృష్ణపరమాత్మ—

కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః
స బుద్ధిమాన్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్. (4-18)

అను మహోన్నతసత్యమును లోకమునకు వెల్లడించినవాడాయెను. అనగా మహనీయులు అసంగముగ ఎంత కర్మనాచరించినను, వారు కర్మనాచరించనివారే యగుచున్నారు. కర్మబంధము వారికి లేకున్నది. కాని ఇంద్రియజయము లేనివారు, తమోగుణావలంబులునగు సోమరులు ఏ కర్మను చేయక యున్నను, అనంతకర్మ వారినెత్తిపై బడియున్నదే యగును. వారు బంధరూపమగు కర్మనాచరించినవారే యగుచున్నారు.

ఇట్టి సత్త్వము నెఱిఁగినవాడే మనుజులలో నుత్తముడు. కాబట్టి తమోగుణసంబంధమైన అకర్మణ్యత్వము నాశ్రయించక జనులు జ్ఞానసంపాదనార్థము చిత్తశుద్ధికై మొట్టమొదట పుణ్యకర్మాచరణము, నిష్కామ కార్యములు తప్పక చేయవలసి యున్నారు. అట్టివానికే 'యజ్ఞము' లను చక్కని పేరుపెట్టెను శ్రీకృష్ణమూర్తి ఈ అధ్యాయములో. ఆ యజ్ఞములను గూర్చి తరువాత విచారించెదము. ప్రస్తుత మీ 'జ్ఞానయోగ' వివరణమునందు ప్రవేశించెదము.

ఈ అధ్యాయ ప్రారంభమున శ్రీకృష్ణపరమాత్మ "ఈ గీతాధర్మములను, నిష్కామకర్మయోగ ప్రాశస్త్యమును నేను మొదట సూర్యున కుపదేశించితిని, సూర్యుడు మనువునకు, మనువు ఇక్ష్వాకునకు దానిని బోధించెను; పిమ్మట రాజర్షులు పెక్కురు దానిని అవలంబించుచువచ్చిరి. క్రమముగ కాలగర్భమున నయ్యది విలుప్తమైపోవ తిరిగి ఆ పరమ రహస్యమును నేడు నీ కుపదేశించుచున్నాను" అని అర్జునునితో చెప్పెను. పరమాత్మ దేశకాలములకు లోబడనివాడు. 'అజుడు, అవ్యయుడు' అను నామధేయము లాతనికి గలవు. ఎల్లకాలములందును ఉండువాడు కనుకనే అతడు సూర్యభగవానునకు ఉపదేశింపగల్గెను. సామాన్యులు దేవుని ఉపాధిమాత్రముగ దలంచుచుందురు. రాముడనగా దశరథ పుత్రుడని, కృష్ణుడనగా వసుదేవతనయుడని మాత్రమే వారు భావించుచుందురు. అర్జునుడంతటివాడు కూడ ఈ పొరపాటు పడెను మొదట. కనుకనే 'సూర్యుడు ఎప్పుడో జన్మించెను గదా, నీ విప్పుడు పుట్టితివిగదా, అట్టి సూర్యునకు నీ వెట్లుపదేశింప

గల్గితివి ?' అని ఈ అధ్యాయమున నాతడు ప్రశ్నించుటకు కారణము. దానికి ప్రత్యుత్తరముగ భగవానుడు దేశకాల వస్త్వతీతమగు తన దివ్యస్వరూపమును గూర్చి బోధించెను.

కాబట్టి దేవుడనగా ఉపాధిమాత్రమేయని, విగ్రహము మాత్రమేయని యెవరును తలంచరాదు. చిత్తము మొట్టమొదట నిరాకారము నాశ్రయించలేదు. కనుక సాకారోపాసనను పెద్దలేర్పఱచిరి. దేవాలయములు, విగ్రహములు, లింగములు మొదలైనవియన్నియు ఇందుకొరకే ఏర్పడినవి. మనస్సు నిలుచుటకు ఒక ఆధారము, రూపము (Form) కోరును. నామము (Name) లేక రూపముండదు. కావున దానికొక నామమును కల్పించును. ఈ ప్రకారము రూప, నామములను ఆధారపరచుకొని మనస్సు ధ్యానించుచుండును. కాబట్టి ప్రారంభస్థితిలో సాధకునకు దేవాలయములు; విగ్రహారాధనలు అత్యావశ్యకములేయగును. అయితే ఎల్లప్పుడును అదే స్థితియందుండరాదు.

"It is wise to be born in a church but not to die there."

*'చర్చి యందు పుట్టుట మంచిదే కాని, అక్కడనే చచ్చుట మంచిదికాదు'-అను సామెత కలదు. అనగా ప్రారంభములో దేవాలయములు, విగ్రహములు, ప్రతీకములు మున్నగువానిని ఆశ్రయించి, క్రమముగ విశాలభావములు కలవారై, దేవాలయమందేకాక బయట విశాలప్రపంచమందును గూడ దేవుడు

*క్రైస్తవుల ప్రార్థనామందిరమునకు 'చర్చి' యని పేరు.

వ్యాపించియున్నాడు, అను సత్యము నవగతము చేసికొనవలయునని భావము. బౌద్ధమతస్థులు మూడు ప్రమాణములు చేయుచుందురు.

బుద్ధం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి.

అని. ఇందులో మొదటిదానియందు 'వ్యక్తి'ని ఆశ్రయించుట చెప్పబడినది. అది చాలదని తలంచి తరువాత ఇంక కొంత విశాలభావమును కల్పించి, పదిమందితో గూడిన 'సంఘము' నాశ్రయించుట చెప్పబడినది. కాని అదియు పర్యాప్తము కాదని ఊహించి ఇంకను విశాలభావమును గ్రహించి విశ్వవ్యాపకమైనట్టి 'ధర్మము'ను ఆశ్రయించుట చెప్పబడినది. ఈ ప్రకారముగ మనుజుడు అధ్యాత్మరంగమున క్రమవికాసమును బొందుచుండవలెను. కనుకనే హిందూమతమున చెట్టును (అశ్వత్థమును) పూజించుట, పుట్టను పూజించుట, పామును (నాగులచవితినాడు) పూజించుట మొదలుకొని అఖండాద్వితీయ నిరాకారబ్రహ్మముయొక్క చింతనవరకును వారివారి సంస్కారముల కనుగుణ్యమైనట్టి ఉపాసనావస్తువు లనేకముల నేర్పఱచి క్రమముగ పైకిపోవుచుండవలెనని బోధింపబడెను. వికాసము మానవత్వచిహ్నము. విద్యార్థి ఎల్లకాలము మొదటి తరగతి Kindergarten) లోనే యుండునా ? అట్లుండినచో నతని వికాసము కుంటుపడి వ్యర్థజీవితుడు కాగలడు. ప్రాథమిక విద్య (Elementary course), మాధ్యమికవిద్య (High school course), ఉన్నతవిద్య (College course), అను

నవి యెట్లు కలవో, ఎట్లు విద్యార్థి ఒకదానిని అభ్యసించి మఱి యొకదానియందు ప్రవేశించుచుండునో, అట్లే సాధకుడు ద్వైతమునుదాటి విశిష్టాద్వైతమునందును, విశిష్టాద్వైతమును దాటి అద్వైతమునందును క్రమముగ ప్రవేశించవలెను. సాకారమునుదాటి నిరాకారమునందు ప్రవేశింపవలయును. కనుకనే శ్రీకృష్ణపరమాత్మ తాను దేవకీగర్భమున జనించిన నాలుగు మూరలు పొడవుకల భౌతికపంజరము మాత్రమే కాదనియు, అనాదియు, అనంతమునైనట్టి సద్వస్తువనియు, సచ్చిదానంద పరబ్రహ్మమనియు అర్జునునకు బోధించెను.

అట్టి పరబ్రహ్మవస్తువును తెలిసికొనుటయే జ్ఞానము. అదియే విద్య. అన్ని విద్యలలోను, ఈ అధ్యాత్మ విద్యయే శ్రేష్ఠము. ఏలయనిన, లౌకికవిద్యలెన్నియున్నను అవి పూర్ణ శాంతిని, జన్మరాహిత్యమును కలుగజేయజాలవు. 'జరామరణ మోక్షాయ మామాశ్రిత్య యతన్తియే' అనునట్లు జరామరణాది దుఃఖములనుండి విడిపించుకొనవలెననిన, పరమాత్మను ఆశ్రయించియే తీరవలెను. ఆత్మజ్ఞానమును బొందియే తీరవలెను.

పూర్వము నారదుడు ప్రపంచములోగల సమస్త విద్యలందును, చతుష్షష్టికళలందును ఆరితేరి, వానియందు చక్కటి కుశలత్వమును సంపాదించి యుండెను. కాని ఆ విద్యలద్వారా అతనికి అన్నియు లభించినవి కాని ఒక్కటిమాత్రము లభించ లేదు. అదియే మనశ్శాంతి. అది మినహా అన్నియు వచ్చి చేరినవి. అందుచే నాతడు చిత్తశాంతిలేక బహుదుఃఖితుడై సనత్కుమారుడను మహర్షి యొద్దకువెళ్లి తన దీనవృత్తాంతమును

మనవిచేసికొనెను. 'మునివర్యా! శోక మెట్లు తొలగును? మన శ్శాంతి యెట్లు లభించును.' అని యడిగెను. అపుడు బ్రహ్మ మానసపుత్రుడగు సనత్కుమారు డిట్లు బోధించెను.-

'తరతి శోకమాత్మవిత్' (ఛాందోగ్యోపనిషత్తు)

ఓ నారదా! ఆత్మజ్ఞాని యొకడుమాత్రమే శోకమును దాట గలడు. తక్కినవారు కాదు.

నాల్పే సుఖమస్తి భూమావై తత్సుఖమ్.

'అల్పవస్తువునందు (పరిచ్ఛిన్న మగు దృశ్యపదార్థమునందు) సుఖములేదు. అనంతమైనట్టి ఆత్మవస్తువునందే సుఖము కలదు. కావున ఓ నారదా! శోకరాహిత్యమునకై అట్టి ఆత్మను నీవు తెలిసికొనుము'. అని పలికినవాడై 'భూమావిద్య' నాతనికి ఉప దేశించెను. ఆ విషయమంతయు ఛాందోగ్యోపనిషత్తునందు జూడనగును. ఎన్ని విద్యలను బొందినను మరణమునుండి తప్పించుకొనజాలనిచో ఆ విద్యలవలన నేమి ప్రయోజనము?

చదివి చదివి చదివి చావంగనేటికి
చావులేని చదువు చదువవలయు
చదువులేక కోటిజనులు చచ్చిరిగదా
విశ్వదాభిరామ వినురవేమ!

అని వేమన ప్రాపంచిక చదువులయొక్క అపూర్ణత్వమును చక్కగ వెల్లడిచేసెను. అది పొందగూడదని కాదు. దానితో బాటు ఆత్మవిద్యనుగూడ సముపార్జించవలె ననియే భావము. అది ముఖ్యమని, తక్కినవి గౌణమని అర్థము. కనుక నే శ్రీకృష్ణపరమాత్మ ఈ అధ్యాయమునందు

న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే (4-38)

"ముల్లోకములందును జ్ఞానమునకు సాటియైన పవిత్రవస్తువు ఇంకొకటి లేనేలేదు" అని తెగవేసి చెప్పివైచెను. ప్రపంచములో ఈ విశ్వాంతరాళములో ఎన్నియో కోట్లకొలది గ్రహములు, నక్షత్రములు, లోకములు కలవు. వానిలో ఏయే పదార్థము లెచటెచట నున్నవో మనకు తెలియదు. అవి ఎంతెంత విలువ కలవియో అంతకంటెను తెలియదు. కాని సర్వజ్ఞుడగు భగవానునకు అన్నియును తెలియును. అట్లు తెలిసియున్న పరమాత్మ ఆ పదార్థములయొక్క యోగ్యతా యోగ్యతలను త్రాసులోపెట్టి తూచి, అన్నిటికంటెను ఆత్మజ్ఞానమే, బ్రహ్మజ్ఞానమే మిన్నయని, అతిపవిత్రమని వచించెను. అట్టివాక్యములందు మనకెంత విశ్వాసముండవలెను. కావునఎన్ని కష్టములకోర్చియైనను జ్ఞానమునే సముపార్జించవలెను. అదియే సర్వులయొక్క జీవితలక్ష్యముగా నుండవలెను. పుట్టుట దేనికొఱకు ? మరల పుట్టకుండా చేసికొనుట కొఱకు. మరల పుట్టకుండ నుండుటకు (జన్మరాహిత్యమునకు) ఉపాయమేమి ?

యే మానవా విగతరాగ పరాపరజ్ఞా
నారాయణం సురగురుం సతతం స్మరన్తి
ధ్యానేన తేన హతకిల్బిషచేతనాస్తే
మాతుః పయోధరరసం న పునః పిబన్తి.

ఇదియే యుపాయము. "ఎవరు రాగద్వేషరహితులై శ్రీమన్నారాయణుని (పరమాత్మను) నిరంతరము స్మరించుచుందురో ధ్యానవిచారణాదులచే పాపరహితులైన అట్టి మహనీయులు తల్లిపాలు మరల త్రాగకుందురు." (తిరిగి జన్మింపరని భావము.)

అనాదియగు ఈ సంసార ప్రవాహమునబడి జీవుడు విశ్రాంతిలేక 'ఆవర్తాంతర కీటవత్'-సుడిలోపడిన పురుగువలె

గిరగిర తిరుగుచు నానా యోనులందు జన్మించుచు అత్యంత ఖిన్నుడై ప్రవర్తించుచున్నాడు. అట్టివానికి శాంతి యెట్లు లభించును? శాస్త్రములన్నియు ఈ పరిశోధననే కావించినవి. మహనీయులందఱును ఈ ప్రశ్నను విడదీయుటయందే తమ జీవితములను ఆహుతిచేసిరి. తుట్టతుదకు పరిష్కారమార్గమును కనుగొనిరి. అదియేది? ఎచటనుండిబయలుదేరెనో, అచటికి చేరుటయే. అదియే శాంతికి మార్గమని వారు వచించిరి. **Religion** (మతము) అను ఆంగ్లపదమునకు అర్థమున్ను ఇదియే. **Re= again** (తిరిగి) **ligio = to unite** (కలియుట). విడిపోయిన జీవుని తిరిగి పరమాత్మతో కలుపునదియే మతమని భావము. సముద్రములోని నీరు ఎండాకాలమున ఆవిరియై మేఘరూపముగా మారును. అనగా నీరు తన స్వస్థానమగు సముద్రమును వీడి పైకిపోవును. అపుడది చాల దిగులుపడి ఎట్లైనను తన జన్మస్థానమగు సముద్రమును తిరిగి చేరుటకు కృతనిశ్చయమై, పోయిపోయి కొండలపై వర్షించి, శిఖరములనుండి క్రిందకు వ్రాల్పి నదీరూపమున పీఠభూమిపై వేలకొలది మైళ్ళు ప్రయాణము సాగించి తుట్టతుదకు సముద్రములో కలిసి తన ప్రతిజ్ఞను ఎట్టకేలకు నెరవేర్చుకొనుచున్నది. ఆహా! జీవులకు అది యెట్టి పాఠమును నేర్పుచున్నది! అలాగుననే జనులున్ను తాము అనాదికాలమున ఏ పరమాత్మనుండి విడివడి ఈ జననమరణ ప్రవాహమున తగుల్కొనియున్నారో, ఆ పరమాత్మను తిరిగి చేరువఱకును విశ్రాంతి తీసికొనరాదను పట్టుదల గలిగియుండవలెను. పరమాత్మను జేరునపుడే జీవితనాటకము సమాప్తము కాగలదు. మరణముతో జీవితము ఎన్నటికిని సమాప్తము

కాదు. "నిర్దోషంహి సమంబ్రహ్మ" అనునట్లు సమరూపమగు పరబ్రహ్మమును పొందినపుడే సమాప్తముకాగలదు. (సమం=బ్రహ్మ, ఆప్తం=సమాప్తమ్) అపుడే జీవితమునకు Fullstop (పూర్ణవిరామము) పెట్టినట్లగును. తత్పూర్వము జీవితమునకు Comma (అపూర్ణవిరామము) మాత్రమేయుండుటచే మరల పుట్టుచు మరల చచ్చుచు అంతులేకయుండును. కావున ఆత్యంతిక దుఃఖవినాశముకొరకై జీవుడు ఏదియో యొకకాలమున పరమాత్మతో చేరియే తీరవలెను. అట్లు పరమాత్మతో జీవుని చేర్చునదియే జ్ఞానము. దానినిగూర్చియే శ్రీకృష్ణపరమాత్మ ఈ జ్ఞానయోగమున విశేషించి తెలిపెను. అయితే ఇట్టి జ్ఞానమును బడయవలెననిన, నది ఏ ప్రకారము ప్రయాణమధ్యమున ఎవరు ఎంత ప్రాధేయపడినను ఆగక, ఎడతెగకుండ సముద్రమువరకు గమనము సల్పునట్లు, సాధకులున్ను ఎన్ని అవాంతరములు వచ్చినను, తమ భగవద్ధ్యాన చింతనాదులను విడువక యుండవలయును.

ఈ సందర్భమున సామాన్యముగ కొందఱి మనంబున నొక సంశయ ముదయించుచుండును. అది యేది యనిన జీవునకు ఈ అజ్ఞాన మెప్పుడు కలిగినది? ఈ సంసార చక్రమున నాతడెపుడు తగుల్కొనెను? ఈభ్రమణము నెపుడు ప్రారంభించెను? ఇట్టిప్రశ్నలకు శాస్త్రములో ప్రత్యుత్తరము లేదు. తలబ్రద్దలు కొట్టుకొనినను ఎవరును వీనికి సమాధానము చెప్పలేరు. మహాత్ములందఱును ఇవ్విషయమున మౌనము వహించిరి. జీవునకు అజ్ఞానము ఎపుడు ఎందులకు కలిగినది అను ప్రశ్నకు శ్రీ శంకరు లేమి సమాధానము చెప్పిరో చూడుడు—

ప్రశ్న :- ఆత్మనః కిం నిమిత్తం దుఃఖమ్ ?
(జీవునకు దుఃఖ మెందులకు కలిగినది ?)

సమాధానము :- శరీరపరిగ్రహాత్ - (దేహధారణమువలన)

ప్ర :- శరీర పరిగ్రహః కేన భవతి ? (దేహ మెట్లు కలిగినది ?)

స :- కర్మణా (కర్మవలన)

ప్ర :- కర్మ కేన భవతి ? (కర్మ దేని వలన కలుగుచున్నది ?)

స :- రాగాదిభ్యః (రాగద్వేషాదులవలన)

ప్ర :- రాగాదయః కేన భవన్తి ? (రాగ ద్వేషాదులు దేని వలన గలుగును ?)

స :- అవివేకాత్ (అవివేకమువలన)

ప్ర :- అవివేకః కేన భవతి ? (అవివేకము దేనివలన కలుగుచున్నది ?)

స :- అజ్ఞానాత్ (అజ్ఞానమువలన)

ప్ర :- అజ్ఞానం కేన భవతి ? (అజ్ఞానము దేనివలన కలుగును ?)

స :- న కేనాపి భవతి; అజ్ఞానమనాద్యనిర్వచనీయమ్.
(అజ్ఞానము దేనివలనను కలుగదు. అది అనాది అనిర్వచనీయము)

ఈ ప్రకారము శంకరులు తుట్టతుదకు అజ్ఞానము అనాది యనియు, అది యెప్పుడు ఎచ్చట ఎందుకు జీవుని తగుల్కొనినది చెప్ప వీలులేదనియు త్రోసివైచెను. వారిట్లు చెప్పుటకు కారణము లేకపోలేదు. జీవుడు మాయాంతర్గతుడై యున్నాడు. దేశ, కాల, క్రియలతో గూడినదియే మాయ, ప్రకృతి,

అజ్ఞానము. మాయలో నున్నంతవఱకే జీవుడు ఆ మాయ ఎప్పుడు, ఎందుకు, ఎక్కడ వచ్చినది చెప్పజాలడు. నిద్రలో నున్నవాడు స్వప్నమును చూచునపుడు ఆ స్వప్న మెప్పుడు, ఎందులకు వచ్చినదో చెప్పగల్గునా? చెప్పలేడు. మేలుకొనిన పిదప రాత్రి ఫలాని గంటకు నిద్రపోయితిననియు, అప్పుడు స్వప్న మారంభమైనదనియు చెప్పగల్గును. అంతియేగాదు, అసలు స్వప్నమే లేదనియు, అసత్తనియు చెప్పగల్గును. అట్లే అజ్ఞాన విషయమున్ను మేలుకొనిన పిదప అనగా జ్ఞానోత్పత్తి అనంతరము అసలు అజ్ఞాన మనునదియే లేదని తెలిసికొనగలడు. కావున ఇపుడు సాధకుని ప్రథమ కర్తవ్యము అజ్ఞానమును జ్ఞానముచే రూపుమాపుటయేకాని, అది ఎట్లు వచ్చినదియని విచారించి కాలయాపన చేయుటకాదు.

ఒక గుహలో చీకటియున్నదనుకొనుడు. ఆ చీకటి ఎప్పుడు వచ్చినది? అను ప్రశ్న నిరర్థకము. ఒక చిన్న దీపము వెలిగించిన చాలును. అనాదికాలమునుండియున్న ఆ చీకటి పటాపంచలై పోవును. చీకటి ఎప్పుడు వచ్చినదియను ప్రశ్నకు ఎవరును సమాధాన మివ్వలేరు. కాని చీకటిని పోగొట్టు ఉపాయము మాత్రము చేయగలరు (దీపము తెచ్చుటద్వారా). అట్లే అజ్ఞానము, ఈ జననమరణ పరంపర ఎప్పుడు మొదలుపెట్టినది చెప్పలేకపోయినప్పటికి, దానిని పోగొట్టు ఉపాయమును మాత్రము చేయగలరు (జ్ఞానసంపాదనముద్వారా). ఇంకొక చిన్న దృష్టాంతమును చెప్పెదను. ఒకానొకడు ఏదైన తొందరపనిమీద బజారు వెళ్ళి తిరిగి ఇంటికివచ్చినాడనుకొనుడు. ఇంటికి రాగానే కాలుపై మల

ముందుట గమనించినచో నతడు వెంటనే ఏమి చేయును ? అపవిత్రమైన ఆ మలమును తత్క్షణమే నీటితో కడిగివేసి కొనునా? లేక 'ఈ మలమును నేను ఏ వీధిలో ఎవరింటికి ముందు త్రొక్కితిని? ఎప్పుడు త్రొక్కితిని? ఎందులకు త్రొక్కితిని? ఇది ఏయే పదార్థముల సమ్మేళనమువలన యేర్పడినది? దీని వాసన ఎంతదూరము పోవును? దీని సాంద్రత (density) ఎంత ?' అని ఈ ప్రకారముగ వితర్కించుకొనుచుండునా ? ఒకవేళ అట్లు వితర్కించుకొనిన దానివలన అతనికి కలుగు ప్రయోజనము లేకపోగా, పైగా దుర్వాసన భరింపలేక అవస్థపడుచుండును. కాబట్టి ముముక్షువు లీప్రకారముగ అజ్ఞానముయొక్క పుట్టుపూర్వోత్తరములను విచారించుట యందు కాలయాపన చేయక,

> జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః
> తేషామాదిత్యవజ్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్. (5-16)

అను భగవదాజ్ఞానురీతి జ్ఞానముచే నట్టియజ్ఞానమును నాశనము చేయు ప్రయత్నమునందే నిమగ్నులై మేఘనివారణముచే సూర్యునివలె తమ ఆత్మను నిరావరణముగ గావించుకొని బ్రహ్మానంద మనుభవించవలయును.

ఈ జ్ఞానముయొక్క స్వరూపస్వభావ వివరములనుగూర్చి భగవానుడు ఈ అధ్యాయమునందు ఎక్కువగ చెప్పకపోయినను* దాని మహిమను వర్ణించుచు అచటచట దానిని గొప్ప

* 'జ్ఞాన' వివరములు 13-వ అధ్యాయమగు క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగమునను 14-వ అధ్యాయమగు గుణత్రయ విభాగయోగమునను తెలుపబడినవి.

తము చూచినను, జ్ఞానయజ్ఞ ఫలితకంటె తక్కువైనదే కాబట్టి గీతాచార్యుడు వాని యన్నిటికంటెను జ్ఞానయజ్ఞమే ఉత్కృష్టమైనదని ప్రవచించెను. దైవార్పణబుద్ధితో నిస్సంగముగ ఆచరింపబడు పవిత్రకార్య మేదియైనను అది యజ్ఞమే యగును. అట్టి (యజ్ఞ) కర్మ జీవునకు బంధమును గలుగజేయదు. పైపెచ్చు మనుజుని చిత్తమును శుద్ధపరచి జ్ఞానోదయమున కనుకూలవాతావరణమును కల్పించును. ఈ ప్రకారములగు యజ్ఞములనేకములను భగవాను డీయధ్యాయమున దెల్పెను. నియమితాహారమును గ్రహించుటయు ఒక యజ్ఞముగా వర్ణించెను. శాస్త్రాధ్యయన రూపమగు స్వాధ్యాయమున్ను మహాయజ్ఞముగా నుటంకించెను. ఇంద్రియనిగ్రహమున్ను ఒకానొక యాగమని తెల్పెను. "యజ్ఞక్షపితకల్మషాః" అనునట్లు ఈ ప్రకారములగు యజ్ఞములన్నియు జీవునిచిత్తము నందుగల అనేక జన్మార్జిత పాపపంకిలమును కడిగివేసి శుద్ధపరచునని భగవానుడు నుడివెను. అయినను, వీని యన్నిటికంటెను జ్ఞానయజ్ఞమునకు అధికస్థానమిచ్చెను. ఏలయనిన ఆ సమస్తకర్మలున్ను తుట్టతుదకు జ్ఞానమునందే విలీనమైపోవుచున్నవి-నదులు సముద్రమునందువలె. ఈ ప్రకారముగ కర్మలన్నియు జ్ఞానమునం దంతర్భూతములే యగుచున్నవి. కావుననే దాని శ్రేష్ఠత్వము. జ్ఞానమనగా నేమియో ఇదివఱకు తెలిపియే యున్నాము- ఆత్మతత్త్వవివేచనము, స్వస్వరూపానుభవము. అట్టి ఆత్మవిచారణాపూర్వకమగు జ్ఞానయజ్ఞమును ఎవరైనను ఆచరించవచ్చును. స్త్రీలుకాని, పురుషులుగాని, బీదవారుకాని, ధనవంతులుకాని, బ్రాహ్మణులుకాని, చండాలురుకాని,

హిందువులుకాని, క్రైస్తవులుకాని, ఎవరైనను సరియే ఈ జ్ఞానజ్యోతిని వెలిగించుకొనవచ్చును. ఇచట జాతి, మత, కుల, లింగ వివక్షత లేనేలేదు. దీపము వెలిగించవలెనన్న ప్రమిదె, తైలము, వత్తి, నిప్పుపెట్టె - అను ఈ నాలుగున్ను ఉండిన చాలును. ఎవరికైనను వెలుగును. జాతిమతముల ప్రశ్న అచట లేదు. ఆ ప్రకారమే జ్ఞానజ్యోతియు, వైరాగ్యమను ప్రమిదె, భక్తి యను తైలము, చిత్తైకాగ్రతయను వత్తి, ఆత్మవిచారణయను అగ్నియుండినచో నిరాటంకముగ వెలుగు చుండును. ఈజ్ఞానజ్యోతిని వెలిగించుటయే జ్ఞానయజ్ఞము నాచ రించుట యగును. ద్రవ్యాది యజ్ఞములను అందఱును చేయ లేరు. అవి ధన జనబాహుళ్యముండిననే సంభవించును. పైగా ఫలితమున్ను అల్పమే. ఈ తత్త్వచింతనారూపమగు జ్ఞాన యజ్ఞమో, అందఱికిని అందుబాటులో నున్నది. కాబట్టి సర్వు లును ప్రయత్నపూర్వకముగ దాని నాచరించి జ్ఞానయాజులని కీర్తినొంది కైవల్యమును జేబట్టుదురుగాక !

(3) జ్ఞాననౌక :-

అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సన్తరిష్యసి. (4-36)

'ఓ అర్జునా! ఒకవేళ పాపులందరికంటెను మిక్కిలిపాపాత్ముడవు నీవగుదువేని, ఆసమస్త పాపసముద్రమును జ్ఞానమను నౌకచే లెస్సగ దాటివేయగలవు' అని భగవానుడు పలికెను. సముద్ర మెంత విశాలముగనున్నను, లోతుగనున్నను నౌక గలవానికి దానిచే భీతియుండదు. ఏలయనగా నావకు తరింప జేయుశక్తి కలదు. అట్లే అజ్ఞానదశయందు జీవు లెట్టి ఘోర

పాపము నాచరించియుండినవారైనను, జ్ఞానము నాశ్రయించినచో ఆ పాపసముదాయమంతయు దీపముచే చీకటివలె పటాపంచలై పోవును. మేలుకొనిన పిదప, స్వప్నకృత దోషములు తీవ్రతరములైనప్పటికిని విలుప్తములై పోవునట్లు జ్ఞానావిర్భావముచే కొండంత పాపమున్ను విలీనమైపోవును. వాల్మీకి పూర్వము గొప్ప పాపాత్ముడై యుండినను, దైవభక్తిచే క్రమముగ జ్ఞానవంతుడై ఆ పాప సముద్రమునంతను త్రుటిలో దాటివేయగలైనుగదా! ఈ శ్లోకముద్వారా భగవానుడు అల్పులందఱికిని అపరిమిత ధైర్యమును సమకూర్చును- ఈ ప్రపంచమున ఎవరును వాస్తవముగ పాపాత్ములు కారు. అందఱును సహజముగ పుణ్యాత్ములే. పవిత్రమైన ఆత్మయే స్వరూపముగా గలిగియున్న జీవుడు పాపియెట్లు కాగలడు? పాపము ఆగంతుకము. అది మధ్యలో వచ్చినది. మధ్యలోనేపోవును.(Impuirty is a mere superimposition) వివేకానందుల గంభీరవచనములను ఆలకింపుడు -

"Ye, divinities on earth! Sinners! It is a sin to call a man so. It is a standing libel on human nature. Come up! O lions and shake of the delusion that you are sheep. You are souls immortal, spirits free, blest and eternal. You are not matter, you are not bodies; matter is your servant not you the servant of matter."

'అవనిపై మూర్తీభవించిన 'ఓ దివ్యస్వరూపులారా! మిమ్ములనా పాపులనుట; శివ! శివ! మనుజుని పాపాత్ముడనుటయే పాపము. అట్లు పాపియనుట మానవత్వమునకే కళంక మాపా-

దించినట్లు, ఓ సింహములారా! లెండు! మీరు గొఱ్ఱెలను అహో వాను వదలివేయుడు! మీరు శాశ్వత నిత్యముక్త సచ్చిదానం దాత్మస్వరూపులు. మీరు దృశ్యవస్తువులు కారు. మీరు దేహములు కారు. ప్రకృతి మీయొక్క దాసియేగాని, మీరు ప్రకృతికి దాసులుకారు!'-ఇట్టి ధీరోదాత్తస్వభావమునే, ఇట్టి నవ్యచైతన్యమునే శ్రీకృష్ణపరమాత్మ పై శ్లోకముద్వారా జనుల యందు రేకెత్తించుచున్నాడు. శ్రీవసిష్ఠమునీంద్రులు తెలిపి నట్లు మానవునికిపట్టినమాలిన్యము బొగ్గుయొక్క నలుపుదనము వంటిదికాదు. అది రాగిపై చిలుమువంటిదియే యగును. లేక వస్త్రగింజపైని పొట్టు (ఊక) వంటిదియేయగును. తోమినగాని, దంచినగాని అది తొలగిపోవును. బొగ్గుయొక్క నలుపుదనమో అట్టిదికాదు. ఎంత తోమినను, కడిగినను పోదు—

1. తణ్డులస్య యథా చర్మ యథా తామ్రస్య కాలిమా
   నశ్యతి క్రియయా పుత్ర పురుషస్య తథా మలమ్
2. జీవస్య తణ్డులస్యేవ మలం సహజమప్యలమ్
   నశ్యత్యేవ న సందేహ స్తస్మాదుద్యమవాన్భవ. (వసిష్ఠగీత)

అట్లే మనుజునకు అంటిన పాపరూపమాలిన్యము కర్మ, భక్తి, జ్ఞానాదిప్రయత్నములచే తప్పక నశించిపోగలదు. ఎపుడు జ్ఞానా దులచే పాపము నశించిపోయినదో అపుడు 'తేషా మాదిత్య వజ్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్' అనునట్లు మేఘము తొలగిన సూర్యునివలె జీవుడు పరమాత్మరూపమున దేదీప్యమానముగ వెలుగొందును. ఇదియే భగవానుడు తెలిపిన ధర్మరహస్యము. కావున ఎవరును అధైర్యపడరాదు. నిరుత్సాహమును జెంద రాదు. ప్రతివారున్ను పాపరహితులగు పవిత్రాత్మ స్వరూపు

లను భావన గలిగియుండవలెను. మఱియు తపనుగుణ్యముగ శుద్ధాచరణము కలిగియుండవలెను. సంఘములో ఎంతయో నీచముగ జూడబడుచున్న మాల మాదిగలకు 'హరిజనుల'ను పేరును మహాత్మాగాంధీజీ ఈ హేతువువలననే ఒసంగెను. ఏలయనిన, ఆ పవిత్రనామమును స్మరించుచు అల్పజీవులైనను అచిరకాలములో పవిత్రులు కాగలరని వారి ఆశయము. కాబట్టి భగవానుడు తెలిపినట్లు సర్వులును ప్రయత్నపూర్వకముగ జ్ఞానమను తెప్పను ఈ జీవితమునందే సంపాదించుకొని దుఃఖభూయిష్ఠమగు ఈ ఘోరసంసారసాగరమును, పాపరూపవైతరణిని దాటివేయుదురుగాక !

## (4) జ్ఞానాగ్నిః-

యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున
జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా. (4-37)

'బాగుగ మండుచున్న అగ్ని కట్టెలను కాల్చివేయునట్లు జ్ఞానాగ్ని కర్మలన్నిటిని భస్మీభూతమొనర్చుచున్నది' అని గీతాచార్యుడు వక్కాణించెను. కొండంత కట్టెలప్రోగు ఉన్నప్పటికి అగ్ని దానిని సమూలముగ నశింపజేయగలదు. అట్లే ఏ క్షణమున జీవునియందు అభ్యాసప్రాబల్యముచే జ్ఞానమను చిచ్చు రగుల్కొనినదో, ఆక్షణముననే కర్మబంధములన్నిటిని అయ్యది పటాపంచలు చేసివేయుచున్నది.

భిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యన్తే సర్వసంశయాః
క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్దృష్టే పరావరే.

అను ఉపనిషద్వాక్యమున్ను ఈ సత్యమునే వెల్లడించుచున్నది. అనగా, పరమాత్మసాక్షాత్కరింపబడగనే (ఆత్మానుభూతికలుగ

గనే జీవునిహృదయస్థ అజ్ఞానగ్రంధి తెగిపోవుచున్నది; సంశయములన్నియు తొలగిపోవుచున్నవి; కర్మలన్నియు నశించిపోవుచున్నవి అని అర్థము. ప్రపంచములోని సమస్త పదార్థములను నశింపజేయుశక్తి ఒక్క అగ్నికిమాత్రమే కలదు. మఱిదేనికిన్ని లేదు. కనుకనే జ్ఞానము నిచట అగ్నితో బోల్చిరి. సమస్తకర్మబంధములనునశింపజేయగలశక్తి దానికిఒక్కదానికే కలదు. మఱియు అగ్నికి దహనశక్తితో బాటు ప్రకాశనశక్తియు కలదు. ఒక గుహాలో ఎన్నికోట్లసంవత్సరములనుండియో చీకటి కాపురముండుచున్నను, అచట అగ్నిరగుల్కొల్పినచో ఆ దీపకాంతిచే అంధకారమంతయు పలాయనమైపోవును. అట్లే జీవునకు అజ్ఞానము, కర్మబంధము, దుఃఖము అనాదిగా ఉండుచున్నను, జ్ఞానాగ్నిచే నవియన్నియు తత్క్షణమే తొలగిపోవుచున్నవి. అజ్ఞానియగుజీవునకు ప్రపంచములో అనేక దుఃఖములుతటస్థించుచుండును. కొన్నికొన్ని ఉపాయములచే కొన్నికొన్నింటిని ఆతడు తొలగించుకొనినను మఱికొన్ని క్రొత్తదుఃఖములు వెంటనే ఆవిర్భవించి ఆతని శాంతిని భంగముచేయుచునే యుండును. దృష్టాంతమునకు-ఒకనికి రోగము వచ్చినది యనుకొనుడు. ఔషధమను వస్తువు ఆ వ్యాధి దుఃఖమును తొలగించివేసెను. ఇంతలో వ్యాపారములో నష్టమువచ్చినది. దానినికూడ ఆతడు ఇతరుల సహాయముచే సర్దుబాటుచేసికొనెను. ఆహా! దుఃఖము లన్నియు సమసిపోయినవిగదాయని సంతసించుచుండ ఇంతలో నతని పెద్దకుమారుడు చనిపోయెను. ఇక భరింపరాని క్లేశము ఆతని నావహించెను. ఈప్రకారముగ నొకటి తరువాత మఱి యొకటి ప్రవాహరూపమున సంతాపములు జీవుని యెదుర్కొను

చు నే యుండును. సంఘసంస్కర్తలు వానిలో కొన్నిటిని తొలగించవచ్చును. రాజకీయవేత్తలు మఱికొన్నిటిని నివారింప వచ్చును- కాని ఎన్నియుపాయము లవలంబించినను ఆత్యంతిక దుఃఖవినాశము కానేరదు. జ్ఞాన మొకటియే సమస్త సాంసారిక దుఃఖములను తొలగింప సమర్థమైనది. ఎట్లనిన—

ఒక యూరిలో ఒక పెద్ద 'టౌనుహాలు'(పురమందిరము) కలదు. దానిలో చాలబల్లలు, కుర్చీలు, పుస్తకములు అమర్చబడియున్నవి. ఎలక్ట్రిక్ దీపములున్ను కలవు. అనేకులు ప్రతిదినము అచటికి వచ్చి పుస్తకములు, వార్తాపత్రికలు చదువుకొనుచునుందురు. ఒకనాడు రాత్రివేళ చదువుకొనుటకై ఒకడు ఆ మందిరములోనికి ప్రవేశించుచుండ అకస్మాత్తుగ దీపములు ఆరిపోయెను. చీకటిలో, ఆ పోవువానికి కుర్చీతగిలి గాయమయ్యెను. అప్పు డాతడు అచటి సేవకుని బిలిచి 'ఏమయ్యా, కుర్చీ దారిలో పెట్టినావు-ప్రక్కకుదీయు' మనెను. సేవకుడట్లే దానిని తొలగించెను. కాని ఆ చీకటిలో ఇంక కొంతదూరము పోవ కాలికి బల్లతగిలి బొబ్బఎక్కెను. దానినికూడ సేవకునిచే ప్రక్కకునెట్టివేయించిపోవుచుండ చీకటిలో గోడ తలకు కొట్టుకొని బొప్పికట్టెను. ఈ ప్రకారము ఒకటివెనుక మఱియొకటిగా దుఃఖము లాతనిని వెన్నంటుచుండెను. ఉపాయముచే, కొన్నిటిని తొలగించుకొనుచుండెను. కాని ఎంతవఱకు ఆ మందిరమున చీకటియుండునో అంతవఱకు ఎన్ని బాధలు పోగొట్టుకొనినను మఱికొన్ని వేచియేయుండును. ఆత్యంతిక బాధావినాశమునకు మార్గమేమి? దీపము వెలిగించుటయే. అది వెలిగినచో బాధలన్నియు అంతమగును. ఇది యొకటియే పూర్ణ దుఃఖ

రాహిత్యమునకు ఉపాయము. కాబట్టి సాంసారిక క్లేశములు సమూలముగ, నిశ్శేషముగ తొలగవలెనన్న జ్ఞానజ్యోతిని హృదయమున వెలిగింపవలెను. జ్ఞానాగ్నిని సంపాదింపవలెను. అప్పుడే సమస్తకర్మబంధములు, సమస్తపాపములు, సమస్త తాపములు భస్మీభూతములై పోగలవు—అని శ్రీకృష్ణభగవాను డానతిచ్చుచు అట్టిజ్ఞానాగ్నిని తనయందు ప్రజ్వలింపచేసికొన ఁ్ధీశక్తిగల మహానీయుడే పండితుడనబడునని వాక్రుచ్చెను—

జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః (4-19)

భగవంతునిదృష్టిలో పాండిత్యమనగా జ్ఞాన సముపార్జన యనియే దీనిచే స్పష్టమగుచున్నది. ప్రాపంచికవిద్యలలో ఆరితేరినవానిని జనులు పండితుడని పిలుచుచుందురు. కాని భగవంతు డట్లు పిలువడని పైవాక్యముచే స్పష్టమగుచున్నది.

తత్పాండిత్యం పతసి న పునర్యేన సంసారచక్రే (యోగవాసిష్ఠము)

దేనిని గ్రహించినచో మనుజుడు మరల ఈదుఃఖభూయిష్ఠమగు సంసార చక్రమున తగుల్కొనకయుండునో అదియే పాండిత్య మనబడునని శ్రీ వసిష్ఠమునీంద్రుడు శ్రీరామచంద్రునకు బోధించెను. కావున యితర విద్య లెన్ని యభ్యసించినను, వానితోబాటు ఈ బ్రహ్మవిద్యను, ఈ జ్ఞానసంపదను, ఈ తత్త్వవిచారణను మనుజుడు తప్పక అవలంబించవలసి యున్నది. ఇదియే భగవానుని యాదేశము.

(5) జ్ఞానఖడ్గము:-

తస్మాదజ్ఞానసంభూతంహృత్థ్సం జ్ఞానాసినాత్మనః
ఛిత్త్వైనం సంశయం యోగమాతిష్ఠోత్తిష్ఠ భారత. (4-42)

"ఓ అర్జునా, కాబట్టి నీయొక్క హృదయమునందున్నదియు, అజ్ఞానజనితమునునగు ఈ సంశయమును జ్ఞానఖడ్గముచే ఛేదించి వైచి యోగాచరణరూపమగు కర్తవ్యమునకు గుంగుము. లెమ్ము!" అని శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు ధైర్యము గొల్పెను. 'దేవుడు కలడా, లేడా? ఉన్నచో ఎట్టిరూపము కలవాడు? ఎచట నివసించును? తరించుమార్గమేది? పాప మెట్లు శమించును? కర్మబంధ మెట్లు తొలగును? ఈ మొదలైన సంశయములు ముముక్షువులను ఆరంభదశయందు బాధించుచుండును. వానినన్నింటిని వివేకమను ఖడ్గముచే ఛేదించివేయవలెను. ఏలయనగా ఆసంశయములన్నియు అజ్ఞానమునుండియే ఉత్పన్నములగును (అజ్ఞానసంభూత) అజ్ఞానమో, జ్ఞానమువలననే నశించును! కాబట్టి జ్ఞానఖడ్గముచే అజ్ఞానవృక్షమును సమూలముగ నఱికివేయవలెను. ఈ అజ్ఞానవృక్షము ఎన్ని జన్మలనుండియో బాగుగ వేళ్ళు పాతుకొనియున్నది.

అశ్వత్థమేనం సువిరూఢమూల మసంగశస్త్రేణ దృఢేన ఛిత్వా (15-3),

అని గీతాచార్యుడు వచించినలాగున ఈ వృక్షమగు సంసారవృక్షమును అసంగశస్త్రముచే, వివేకఖడ్గముచే ఉన్మూలనము చేయవలసి యున్నది. కావున జ్ఞానమును (ఆత్మవివేకమును) తప్పక సంపాదింపవలయును. ఈ ప్రకారముగ శ్రీకృష్ణమూర్తి వివిధరీతుల జ్ఞానమును అభివర్ణించి అర్జుని దానిని పొందులాగున అర్జునుని ప్రేరేపించెను.

అయితే అట్టి సర్వోత్తమమైన జ్ఞానమును పొందువిధానమేది? దానిని జీవు డెట్లు పడయగల్గును? దానిని తెలిసికొనుటకు పద్ధతియేది? అనుభవజులగు మహాత్ములను వినయ.

విధేయతలతో సమీపించి వారికి సాష్టాంగదండప్రణామం బాచరించి వారి సేవాశుశ్రూషాదుల గావించి భక్తితో వారిని ప్రశ్నించి తెలుసుకొనవలయును.

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః (4-34)

అట్లు సవినయముగ ప్రశ్నించినమీదట మహాత్ములు వానికి తత్త్వజ్ఞానమును బోధించెదరు. దానిచే నతని యజ్ఞానము శమించిపోగలదు. జ్ఞానమును సముపార్జించుటకు భగవానుడు గీతయందు చూపిన త్రోవ ఇదియే. సత్సాంగత్యము కలిగి యుండుమని ఆజ్ఞాపించెను ఈ భవారణ్యమున దిక్కు తెలియక పరిభ్రమించుచుండు పథికుడను పాంథునకు మార్గమునుజూపునది సద్గురువే. కావున గురుసేవ, గురుభక్తి మొదలైనవి ముముక్షువునకు అత్యావశ్యకములని గీతాచార్యుడు హెచ్చరిక చేసెను. 'ప్రణిపాతేన' అను పదప్రయోగముచే యెంత వినయము బోధింపబడినదో చూడుడు! (పాతము - నిపాతము - ప్రణిపాతము) పాతమనగా పడుట; నిపాతమనగా లెస్సగ పడుట; ప్రణిపాతమనగా పూర్తిగా సాగిలపడుట. (సాష్టాంగ వందనమాచరించుట అని భావము)- శిష్యుడు గురువుయొద్ద ఎంతెంత భక్తిప్రపత్తులు కలిగియుండునో, గురువునకు ఆతనిపై అంతంత వాత్సల్యభావ ముదయించుచుండును. అపుడు గురువు శిష్యుని చెంత తన హృదయమును విప్పివేయును. అర్జునుడుకూడ గీతోపదేశమునకు పూర్వము 'శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్'-అనుచు శ్రీకృష్ణుని పాదారవిందములకు నమోవాకము లర్పించియే యుండిన సంగతి గీతాపాఠకులకు విదితమే

అయియున్నది. ఇదియే ధర్మరహస్యము. ఇప్పటికాలపు నవ నాగరికులకు ఈ పద్ధతి ఒకింత వెగటుగా తోచవచ్చును. కాని అహంకారము చచ్చినగాని ఆత్మ ఉదయింపదని వారు జ్ఞప్తి యందుంచుకొందురుగాక! ఎవరితల పెద్దలయొద్ద, భగవంతుని యొద్ద వంగునో వారియొద్ద ప్రపంచమంతయు తన తలవంచును. మఱియు నాతనికి జ్ఞానప్రాప్తి కలుగును. ఇదియే ధర్మ సూక్ష్మము. ఈ రహస్యమును ముముక్షువుల శ్రేయస్సాధనకై భగవాను డీ యధ్యాయమున ప్రకటించివేసెను.

కాబట్టి సాధకుడు శ్రద్ధాభక్తులు కలవాడై —

'సద్విద్వా నుపసర్ప్యతాం ప్రతిదినం తత్పాదుకే సేవ్యతామ్'

అను శ్రీ శంకరాచార్యుల వచనానుసారము మహాత్ములను సేవించి సంసారతారణోపాయమగు ఆత్మజ్ఞానమును బడయవల యును. శ్రద్ధ అన్నిటికంటెను ముఖ్యము. శ్రద్ధ కలవాడే జ్ఞాన మును పొందగల్గును (శ్రద్ధావాన్ లభతే జ్ఞానం). నమ్మకము లేక సందేహించుచు డోలాయమానమగువాడు అధ్యాత్మమార్గ మున ఎన్నటికిని వృద్ధికిరాడు (సంశయాత్మా వినశ్యతి). కావున శాస్త్రమునందు, గురువునందు, దైవమునందు పరిపూర్ణ విశ్వా సము, అకుంఠితశ్రద్ధయుండవలెనని గీతాచార్యుని యూదేశము.

'Faith, faith, faith in ourselves, faith, faith in God–this is the secret of greatness'.

'నమ్మకము! నమ్మకము! తనయందు నమ్మకము. దేవునియందు నమ్మకము. ఇదియే ఔన్నత్యమునకు, విజయమునకు కీలకము'-అని వివేకానందు లుద్ఘోషించిరి. కాబట్టి జ్ఞానసంపాద

నక్తే శాస్త్రమునందు, దైవమునందు, సద్గురువునందు అత్యంత శ్రద్ధకలిగియుండవలెను. ఈశ్రద్ధలోపించినందువలననే పెక్కురు లక్ష్యమును పొందలేక సంసారసముద్రమున పడిపోవుచున్నారు-



శ్రద్ధా విహీనస్య తు న ప్రవృత్తిః
ప్రవృత్తిశూన్యస్య న సాధ్యసిద్ధిః
అశ్రద్ధయైవాభిహతాశ్చ సర్వే
మజ్జన్తి సంసారమహాసముద్రే.



ఏలయనిన, 'శ్రద్ధలేనిచో కార్యమందు ప్రవృత్తి జనించదు. ప్రవృత్తిలేనిచో సాధ్యవస్తువు లభించదు. అశ్రద్ధచేగొట్టబడిన వారై జనులు దుఃఖసాగరమున మునుంగుచున్నారు.' కావున అధ్యాత్మపథమున పురోగమించు సాధకునకు శ్రద్ధ ఎంతేని అవసరమై యున్నది. ఇక్కారణముననే శ్రీకృష్ణమూర్తి శ్రద్ధావంతుడు జ్ఞానమును పొందగల్గునను సత్యమును ఈ అధ్యాయాంతమున తెలిపియున్నాడు. అయితే ఈ జ్ఞానము ఎప్పుడు కలుగును ? ఏ ప్రకారము కలుగును ? ఎచ్చోట కలుగును ? అను సంశయములు జనులను బాధించవచ్చునని ఊహించి భగవానుడు ఆ మూడు ప్రశ్నలకునుగూడ ఒకేఒక వాక్యములో సమాధానము చెప్పివైచెను. అది ముముక్షువులకు అత్యావశ్యకమైనది. కనుక దానినికూడ నిచట తెలిపి ఇక నేటి ఉపన్యాసమును విరమించుచున్నాను.



తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విన్దతి (4-38)

ఈ అర్ధశ్లోకము గీతయందు చాల ప్రాముఖ్యత కలిగియున్నది. 'తత్' అనగా ఆజ్ఞానముఅందరికిని లభించదు. యోగసంసిద్ధునకు మాత్రములభించును. అనగా కర్మయోగమందు కుశలత్వమును

సంపాదించినవారికి, అనాసక్తకార్యాచరణముచేతను, ఈశ్వరార్పణబుద్ధితో (కర్తృత్వాహంకారరహితముగ) నొనర్పబడిన క్రియలచేతను చిత్తశుద్ధినిబొందినవారికి అట్టిజ్ఞానము సంప్రాప్తమగునని భావము. దీనినిబట్టి నిష్కామకర్మములచే ముందుగా చిత్తశుద్ధిని బొందనివారికి జ్ఞానముదయించదని మరొకవిధముగ చెప్పినట్లైనది. మురికిగుడ్డలు రంగుపట్టనట్లున్నూ, చవిటినేలలో విత్తనము మొలవనట్లున్నూ, పాపములతో గూడిన చిత్తమందు జ్ఞాన మంకురింపదు. కావున కర్మయోగాభ్యాసములచే ముందు శుద్ధపరచవలెను. కావుననే కొంతకాలమునకు 'కాలేన' జ్ఞానము లభించును అని చెప్పబడెను. ఎంతకాలమునకు? అని యెవరైన ప్రశ్నించినచో, అది వారివారి ప్రయత్నాతిశయముపై ఆధారపడియుండునని భావము.

'తీవ్ర సంవేగానా మాసన్నః'

'తీవ్రప్రయత్న మాచరించినచో లక్ష్యము చేరువనేయుండును' పతంజలి నుడివియున్నాడు. 100 మైళ్ళ దూరమును రాకెట్టు అతినిమిషములోపోగలదు. విమానము అరగంటలోపోగలదు. రైలు నాలుగుగంటలలో పోగలదు. గుఱ్ఱపుబండి 2 రోజులలో పోగలదు. ఎద్దుబండి 10 రోజులలో పోగలదు. అట్లే జ్ఞాన ప్రాప్తియగు గమ్యము వారివారి సాధనయొక్క తీవ్రతపై ఆధారపడియుండునని తెలుపుటకుగాను 'కాలేన' (కొంతకాలమునకు) అని వచించెను. అయితే ఆ జ్ఞాన మెచట కలుగును? 'ఆత్మని' (తనయందే) అనగా ఆత్మానుభూతిని, నిరతిశయానందమును జీవుడు తనయందే పొందగల్గునని భావము. మోక్ష.

మనునది బయట ఎచటనో, ఏలోకములోనో కలదను భ్రమ ఈ భగవద్వాక్యముచే తొలగిపోగలదు. మోక్షము ప్రతివారికిని తమయందే కలదని గ్రహింపవలెను.

న మోక్షో నభసః పృష్ఠే పాతాలే న చ భూతలే
మోక్షో హి చేతో విమలం సమ్యజ్ఞానవిబోధితమ్. (వసిష్ఠగీత)

'మోక్షము ఆకాశమున లేదు. పాతాళమున లేదు. భూలోకమున లేదు; ఆత్మజ్ఞానముతో గూడిన నిర్మల చిత్తమే మోక్షము'-అని శ్రీ వసిష్ఠమునీంద్రు లుద్బోధించిరి.

మఱియు నిట్టిజ్ఞానమును తనకుతానే స్వయముగ సాధన చేసి తనయందు పొందవలసియుండును. గురువులు త్రోవ మాత్రము చూపెదరు. నడువవలసినది శిష్యుడు తన కాళ్ళతో తానే. చూడవలసినది శిష్యుడు తన కండ్లతో తానే. దైవము కాని, గురువుకాని, మహాత్ములుకాని తనకు మోక్షమును సంపాదించి పెట్టెదరని ఎవరైనను అనుకొనినచో వారు భ్రమయందున్నవారే యగుదురు. మోక్షముకాని, జ్ఞానానుభవము కాని 'పర్మిట్టు' వలె ఒకరిచ్చునది, ఒకరు పుచ్చుకొనునదికాదు. అది పెద్దలసహాయముచే, ఈశ్వరానుగ్రహముచే, తనయందు తాను తయారు చేసికొను వస్తువు. కనుకనే భగవానుడు 'తత్స్వయం యోగసంసిద్ధః' అని పలుకుచు జ్ఞానమును స్వయముగనే సాధింపవలెనని ప్రకటించియున్నాడు. గురువులు 'Sign boards' (దారిచూపు స్తంభపు పలకలు) వంటివారు. రెండు మూడు మార్గములు కలియుచోట కీలకస్థానములందు కొన్ని స్తంభములపై త్రోవపలకలు కట్టియుందురు. అవి

ఏ ఊరు ఏ వైపు ఎన్ని మైళ్లుండునో తెలుపును. అంతమాత్రమే వాని సహాయము. కష్టపడి నడువవలసినవాడు పాంథుడు.

ఈ ప్రకారముగ జ్ఞానమును సాధించి మనుజుడు తన మానవత్వమును సార్థకము చేసికొనవలయును. అజ్ఞానమును పోగొట్టుకొనుటయే మానవత్వచిహ్నము. "మా=అజ్ఞానము, న=లేకుండ, వ=వర్తించువాడు" మానవుడని చెప్పబడును. మానవశబ్దముయొక్క వ్యుత్పత్త్యర్థమిదియే. ఇవ్విధముగ జ్ఞానమును సముపార్జించక జీవితములను భోగవిలాసములందు భ్రష్టము చేయువారు మానవులుకాక మానవేతరులు (పశువులు) అగుదురు. పశువులవలె వర్తించక పశుపతి (శివుని) వలె వర్తించుటను నేర్చుకొనవలయును. ప్రాపంచికసంపదల నెన్ని పొందినను అవి యన్నియు ఈ శరీరవియోగముచే వియోగమును బొందియే పోవుచున్నవి. కాని జ్ఞానసంపదను బడసినవాడు శాశ్వతముగ సద్గతిని తన సొంతమునుచుకొని పరమశాంతిని నిరతిశయానందమును కైవల్యమును పొందుచున్నాడు. కాబట్టి శ్రీకృష్ణపరమాత్మ ప్రాణికోట్లపై కరుణకలిగి ప్రసాదించిన ఈ అఖండజ్ఞానామృతమును ముముక్షువులు తనివితీర గ్రోలి సంసారదుఃఖదావాగ్ని తాపశాంతిని బడయుదురుగాక!

ఓం తత్ సత్.

ఓమ్

# 5-వ అధ్యాయము

# కర్మసన్న్యాసయోగము

నేడు భగవద్గీతయొక్క ఐదవ అధ్యాయమగు కర్మ సన్న్యాసయోగమును ప్రారంభించుటకుముందుగా గీతపై జనులకు పరిపూర్ణ విశ్వాసము కలుగుటకుగాను దాని మహిమను, ప్రాశస్త్యమునుగూర్చి ఒకటిరెండు వాక్యములను చెప్పదలంచినాను. భగవద్గీత నవలవంటి ఒక చిన్న పుస్తకముకాదు. సజీవ చైతన్యమూర్తి యని ఇదివఱకు తెలిపియుంటిని. సామాన్యముగ ఏదైన గ్రంథమును చదివి పూర్తిచేసినపిదప దానిని బీరువాలోపెట్టి దానిమాట మరల పట్టించుకొనక యుందుము. గీత అట్టి గ్రంథముకాదు. అది నిరంతరము మనవెంట నుండదగినది. ఆపత్తులలో, సాంసారిక క్లేశములలో అది జీవునకు కలుగజేయు ఉపకారము అమోఘమైనది. రోగి ప్రక్కననే వైద్యుడున్నచో రోగికి ఎంతధైర్యము కలుగునో, సంశయములు తొలగక తికమకపడుచుండు శిష్యునిచెంత అనుభవజ్ఞుడగు సద్గురువున్నచో శిష్యునికి ఎంత ఆనందము లభించునో, భవదుఃఖపీడితుడగు మనుజునియొద్ద గీతయున్నచో అంత ఉత్సాహము జనించును. గాంధిమహాత్ముడు పలికిన పలుకుల నాలకింపుడు —

'When doubts haunt me, when disappointments stare me in the face and when I see not one ray of light on the horizon I turn to

Bhagavadgita and find a verse to comfort me and I immediately begin to smile in the midst of overwhelming sorrow. My life has been full of external tragedies and if they had not left any visible and indelible effect on me I owe it to the teachings of the Bhagavadgita.'

"సంశయములు నన్నావరించినపుడు, సంకటములు సంప్రాప్తమైనపుడు, నిరాశా నిరుత్సాహములు జనించినపుడు నేను భగవద్గీతను తెరచి చూచెదను. అందు ఏదో యొక శ్లోకము నన్నాదరించును. తత్ఫలితముగ మహావిపత్కర పరిస్థితియందుగూడ నా ముఖముపై చిరునవ్వు తాండవించుచుండును. నాజీవితము అనేక ఒడుదుడుకులతో గూడియున్నను ఘోరసంకటములను నేను అనుభవింపవలసివచ్చినను, అవి యెవ్వియు నామనంబున లవలేశమైనను అశాంతిని గలుగ జేయజాలకపోవుట యేదికలదో, అదియంతయు గీతా ప్రబోధముయొక్క సత్ఫలితమే యగును."

ఈప్రకారముగ ఎందఱో మహనీయులకు గీత శాంతిభిక్ష నొసంగియున్నది. ఒసంగుచున్నదికూడను. ఆకాలమున శ్రీకృష్ణ పరమాత్మ చేసిన వేణుగానముయొక్క మాధుర్యమును గోపికలు గోపాలురు మాత్రము అనుభవింపగలిగిరి. మనము దానిని అనుభవించుటకు నోచుకొనలేదు. కాని ఆకాలముననే చేసిన గీతాగాన మేదికలదో అదిమాత్రము మనపాలిట పడినది. దానిని మన మనుభవించుకొనుచున్నాము. అయితే భాగ్యము పండి, 'గీత' చక్కగా నుండిననే గీతపై మనుజునకు అను [illegible] జనించును. లేకున్న ఇది యేదియో సామాన్యగ్రంథమని తలంచి

మూలపెట్టును. ఎచట గీతాశ్రవణముకాని, గీతాపఠనము కాని, గీతాతత్త్వవిచారణకాని జరుగుచుండునో అచట తాను గూడ వచ్చియుండునని సాక్షాత్ విష్ణుభగవానుడు భూదేవికి వచించెను.* కావున, ఏగృహమున గీతాగానము జరుగుచుండునో, ఆ గృహము భగవంతునకు నిలయమై యొప్పుచుండును. అనగా ఆ ఇల్లు దేవాలయముగ మారిపోవు నని భావము. దైవము ప్రతిష్ఠింపబడని ఇల్లు ఇల్లుకాదు; నరక కూపము, దయ్యములకొంప, కారాగృహము. కావున ఇంటింటి యందును గీతావాణి ప్రతిధ్వనించవలయును. అపుడే ఆ ఇల్లు, ఆ పల్లె, ఆ ఊరు పవిత్రములై పోవును.

అయితే గీతాధ్యయనపరులు ఒక చిన్న విషయమును దృష్టియందుంచుకొనవలయును. గీతాశ్రవణము, గీతాపఠనము అయిన వెనుక గీతామననము, గీతానిదిధ్యాసనములనుగూడ కొనసాగించవలెను. గీతాపఠనముచే పారాయణ పుణ్యము లభించును. దాని మనన, నిదిధ్యాసనములచేతనో మోక్షము లభించును. తినినది జీర్ణమైనపుడే ఆరోగ్యమును కలుగజేయు నట్లు, ధర్మరహస్యములు హృద్గతములై, రక్తనాళములలో ప్రవేశించి స్వభావముగ మారునపుడే అవిద్యాతమస్సును దూరీకరింప సమర్థములు కాగల్గును.

"Religion is realising. Before that it is the spelling of the word and no more."

అని ఒక మహానీయుడు నుడివినట్లు దైవమును అనుభవింప

* యత్ర గీతావిచారశ్చ పఠనం పాఠనం శ్రుతం
తత్రాహం నిశ్చితం పృథ్వి నివసామి సదైవ హి.

నంతవఱకు ఆ దైవము దై + వ + ము అను అక్షరముల కూడికగనే యుండును. కావున శ్రవణము ఒక్క పర్యాయము చేసినచో మననము వెయ్యిపర్యాయములు చేయవలెను. నిది ధ్యాసనము లక్షపర్యాయములు చేయవలెను. పశువుగడ్డితినిన పిదప ఒకచోటపరుండి బాగుగ నెమరువేయునట్లు సాధకుడు ఒక్కొక్క గీతాశ్లోకమును పఠించి దానినిగూర్చి ఏకాగ్రచిత్త ముతో ధ్యానముచేయవలెను. అపుడు క్రొత్తక్రొత్తఅర్థములు క్రొత్తక్రొత్తభావములు స్ఫురించుచుండును. గీతయొక్క ఒకా నొక విశిష్టత యేమియనిన, చిత్తము ఎంతెంత సంస్కారము కలదియైయుండునో, అంతంత గొప్పగొప్పఊహాలుదానియందు పాఠకునకు గోచరించుచుండును. ఇట్టి అపూర్వవిశిష్టత మఱి ఏ యితరగ్రంథమునకును లేదనియే చెప్పవచ్చును. ఇదియం తయు శ్రీకృష్ణపరమాత్మయొక్కయు, శ్రీ వ్యాసభగవానుని యొక్కయు యోగమహిమ, తపశ్శక్తియే యగును. కాబట్టి గీతాహృదయమును తెలిసికొనవలెననిన (1) శ్లోకార్థములను బాగుగ మననము చేయవలెను. (2) ఏకాగ్రబుద్ధిని అలవరచు కొనుచుండవలెను. ఇది చాల ముఖ్యవిషయము కనుక ఈ శ్రవణ మననములగూర్చి ఒక చిన్న ఇతిహాసమును చెప్పెద-

పూర్వము విక్రమార్కుడను మహారాజు ఉండెను. అత డొకనాడు తన మంత్రులతోను, సామంతులతోను, పురప్రము ఖులతోను కొలువుతీర్చియుండ, ఆసభామధ్యమున నొక రాక్ష సుడు ప్రవేశించెను. అతని చేతిలో మూడు పుఱ్ఱెలుండెను. ఆ భయంకర దృశ్యమునుజూచి సభ్యులందఱు ఆశ్చర్యచకితులైరి. ఇంతలో నా రాక్షసుడు రాజును సంబోధించి 'ఓ రాజా! ఈ

మూడుపుత్తైలలో నెయ్యది శ్రేష్ఠమైనదో మీలో నెవరైనను నాకు తెలుపవలెను-అట్లు తెలుపనిచో మిమ్ములనందఱిని ఈ క్షణములోనే భక్షించివైచెదను' అని పలికెను. ఆ వాక్యము లను విని సభ్యులు భయభ్రాంతులై, ఆలోచనానిమగ్నులై ఆ పుత్తైలవంక నే చూచుచుండిరి. కాని ఒక్కరును జవాబు చెప్పజాలరైరి. ఇంతలో మంత్రిలేచి ఒక సన్నని ఇనుపతీగెను తెప్పించి ఒకపుత్తైయొక్క చెవిలో దూర్చెను. ఆతీగె మఱి యొక చెవినుండి బయటకు వచ్చివేసెను. 'ఓ రాక్షసా! ఈపుత్తై అధమమైనది. నికృష్టమైనది అని తెలిసికొనుము'-ఇట్లు పలికి మంత్రి ఆతీగెను రెండవపుత్తైచెవిలోదూర్చగా అది నోటిగుండా బయటకు వచ్చెను. అంతట మంత్రి 'ఓ రాక్షసా! ఇది మధ్యమ తరగతిపుత్తై'అని చెప్పి ఆతీగెను మూడవపుత్తైచెవిలో దూర్చగా అది తత్క్షణమే హృదయములోనికి జొరబడెను. అపుడు మంత్రి 'రాక్షసా! ఇది ఉత్తమమైనదని యెఱుగుము' అని పలుక రాక్షసుడు ఏప్రకారముగ నాతడట్లు నిర్ణయించెనో తెలుపుమని వేడ, మంత్రి యిట్లు వివరించి చెప్పెను-'ఎవడు ఒక చెవిలో ప్రవే శించినబోధను మఱియొక చెవిగుండా వదలివేయునో అతడు అధ ముడు (అనగా వినినదానిని మఱచువాడనిభావము). ఎవడు ఒక చెవిలో ప్రవేశించిన దానిని నోటితో మాత్రము చెప్పగల్గునో అతడు మధ్యముడు. ఎవడు వినినదానిని హృదయమునందు జేర్చి అనుభూతమొనర్చుకొనునో ఆతడు ఉత్తముడు. ఆవాక్యములను విని రాక్షసుడు సంతుష్టుడై వెడలిపోయెను. ఆప్రకారముగనే జనులలో మూడు తరగతుల వారుందురు. ఎవరెవరు ఏస్థితియం దున్నది గమనించుకొని ఉత్తమతరగతిలోనికి ప్రవేశించు

టకు యత్నించవలెను. అనగా తాము శ్రవణముచేయు సత్య, ధర్మ, అహింసాదులను, అనుభవములోనికి తీసికొనివచ్చి ధర్మమూర్తులు, సత్యమూర్తులు, అహింసామూర్తులు కావలెనని అర్థము. శ్రీరామచంద్రుడు వసిష్ఠమునీంద్రులయొక్క యోగవాసిష్ఠమును వినిన రోజులలో ప్రతిదినము రాత్రి అందఱును పరుండిన పిదప తానులేచి కూర్చుండి, పగలు వినిన యర్థములన్నిటిని లెస్సగ చింతనచేయువాడు. ఆ ప్రకారముగ రాత్రి చాలప్రొద్దుపోవువఱకు ధ్యానించి మరల పరుండువాడు. తీవ్రముముక్షుత్వము కలవారి లక్షణ మిట్లేయుండును. కావున గీతాపఠనానంతరము గీతార్థధ్యానము అతిముఖ్యమైనదని తెలుపుచు ఇక ప్రస్తుతవిషయములోనికి ప్రవేశించుచున్నాను.

గీత ఐదవ అధ్యాయము నేటి విచారణీయాంశము. ఇంతవఱకు గీతాభవనముయొక్క మొదటి నాలుగు గదులలోని అపూర్వవస్తుసముదాయమంతను పరికించితిమి. ఇక ఐదవగదిలోనికి ప్రవేశించుచున్నాము. మూడవ అధ్యాయములో కర్మయోగము, నాలుగవఅధ్యాయములో జ్ఞానయోగము శ్రీకృష్ణమూర్తి బోధించినమీదట అర్జునునకు ఒకానొక సంశయముదయించెను. ఈ రెంటిలో ఏది శ్రేష్ఠమైనది అని. అందులకు పరమాత్మ రెండును శ్రేష్ఠములైనవియే యనియు, ఒకే గమ్యస్థానమునకు రెండును గొనిపోగలవనియు, కాని కర్మసన్న్యాసపూర్వకమగు జ్ఞానయోగము ప్రారంభములో అందఱికిని ఒంటపట్టదనియు, కర్మయోగమునందు చక్కగ ఆరితేరినవారికే అది లభ్యమగుననియు, ఇక్కారణమున అపరిపక్వసమయమున కర్మలను త్యజించివేసి అకర్మణ్యులై భ్రష్టులగుటకంటె కర్మయో-

గమే శ్రేష్ఠమైనదనియు భగవానుడువచించెను (కర్మసన్న్యాసాత్కర్మయోగో విశిష్యతే). నిష్కామకర్మయోగము చేతను, ఈశ్వరార్పణబుద్ధితో గావింపబడు కర్మాచరణము చేతను చిత్తము శుద్ధముకాగా, అట్టి నిర్మలచిత్తమున జ్ఞానమంకురింప విశుద్ధసత్త్వగుణమునాశ్రయించుఅమ్మహనీయునకుకర్మలువాని యంతటనవియేరాలిపోవును. అదియే కర్మసన్న్యాసమనబడును గాని, ఏకర్మలు చేయక ఊరక కూర్చుండుటకాదు. అది సోమరితనమే యగునుగాని నైష్కర్మ్యము కానేరదు. ఈ విషయమునుగూర్చి 3-వ అధ్యాయ ప్రారంభమున భగవానుడు హెచ్చరిక చేసియేయున్నాడు. అట్టిసోమరులను, అనగా కర్మేంద్రియములనరికట్టి మనస్సుచే చతుర్దశభువనములందు తిరుగాడు వారిని మిథ్యాచారులని, డంబాచారులని పేర్కొనియుండెను. ఆధ్యాత్మిక ధర్మసూక్ష్మములను గ్రహించవలెనన్న ఎంతయో పూర్వపుణ్యముండవలెను. అది లేనపుడు తత్త్వము సరిగ బోధపడక వక్రార్థములను గ్రహించుచు శుష్కవేదాంతమునాశ్రయించి జనులు పతనము నొందిపోవుదురు. కనుకనే అనేకులు మొదటనే కర్మలను సన్యసించినవారై ఏ పనిని ముట్టక, తుట్టతుదకు తన గదికూడ తాను ఊడ్చుకొనలేక, తన చాపకూడ తానుపఱచుకొనలేక, కర్మబ్రహ్మల రెండింటికిని దూరులై భ్రష్టులగుచున్నారు. ఈప్రమాదమును గుర్తించియే శ్రీకృష్ణమూర్తి 'నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవచ కర్మణి' అనునట్లు తాను స్వయముగ (సారథ్యాది) కర్మయోగమును జేబట్టి అర్జునునకు (అనాసక్త) కర్మయోగప్రాశస్త్యమును వెల్లడించి, (తస్మాదుత్తిష్ఠకౌన్తేయ) "లెమ్ము! లెమ్ము! ఓ అర్జునా! నడు

ములు బిగించి కర్మరంగమున దూకి ఫలాభిసంధిరహితముగ కార్యముల నెరవేర్పుము" అని పలుమారు ఉద్బోధించుటకు కారణము.

మఱియు కర్మసంన్యాసపూర్వకమగు జ్ఞానయోగము (నిష్కామ)కర్మయోగాభ్యాసము ముందుగా లేనివానికి ప్రాప్తించుట కష్టసాధ్యమని భగవానుడు పలికెను. (సంన్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయోగతః). కర్మయోగమున ఆరితేరినవారికి చిత్తశుద్ధికలుగగా జ్ఞానమావిర్భవించి పరమాత్మసాక్షాత్కారము శీఘ్రముగ కలుగగలదు (యోగయుక్తో మునిర్బ్రహ్మ నచిరేణాధిగచ్ఛతి.) పుష్పము వికసించి దానిలో ఫలముఆవిర్భవించునప్పుడు ఆపుష్పమిక నెమ్మదిగా రాలిపోవును. కురుపుపై పక్కుకట్టును. కాని ఆ పక్కును బలాత్కారముగ పెరికివేసినచో పుండు పెద్దదియై బాధించును. పుండు మానుచు రాగా కొంతకాలమునకు ఆ పక్కు దానియంతట అదియే రాలిపోవును. అట్లే ఉద్యోగముచేయుచుండగా కొంతకాలమునకు అది వదలిపోయి 'పింఛను' అను గొప్ప ఉపకారమునకు దారితీయును. మధ్యలోనే ఉద్యోగమును బలాత్కారముగ వదలినచో ఆ ఉపకారవేతనమునకు అవకాశమే ఉండదు.

పక్వజ్ఞానస్సమాప్తిర్విపులతరధియః కర్మణాం సంవిధాత్రీ
సన్న్యాసో యద్వదధ్వా స్వయముపరతిర్గ్రామముత్తిం ప్రవేశ్య
రమ్భా తావద్వివృద్ధిం భజతి ఫలభరం యావదుచ్చైః ప్రసూతే
హ్రాసం పశ్చాత్తథైవామృత మభిలషతో జ్ఞానముత్పాద్యకర్మ.

"మార్గము గ్రామమువఱకుపోయి అచట స్వయముగనే నిలచిపోవును. అరటిచెట్టు వృద్ధినొందుచువచ్చి గెల ముదిరిన పిదప

చానియంతట నదియే శమించిపోవును. అట్లే కర్మయు జ్ఞానము నుత్పన్నము చేసి విరామమును బొందును. అదియే సన్న్యాసము. [(సమ్యక్+న్యాసః) లెస్సగ వదలుట (సమాప్తి నొందుట)] అనగా కర్మలు చిత్తనైర్మల్యముద్వారా జ్ఞానముత్పాదన మొనర్చి స్వయముగనే వదలిపోవునని (సమాప్తి నొందునని) భావము." అంతవరకు ఎవరును వానిని బలవంతముగ తొలగింపరాదు. అట్లు తొలగించినచో కర్మబ్రహ్మోభయభ్రష్టుడగును. ఇవ్విషయమున నొక చిన్న ఇతిహాసమును చెప్పెదను వినుడు—

పూర్వము శిఖిధ్వజుడను రాజుండెను. ఆతనికి చూడాల యను భార్య కలదు. పూర్వజన్మపుణ్యసంస్కారమువలన ఇరువురికిని చక్కనివైరాగ్య ముదయించెను. ప్రతిదినము వారు కొంతసేపు ఆధ్యాత్మిక తత్త్వవిచారము గావించుకొనుచుండెడివారు. వారిరువురిలో చూడాల హృదయము అతినిర్మలముగను, రాగద్వేషరహితముగను, క్రోధాదికషాయవర్జితముగను నుండుటచే మెత్తటిమట్టియందు నాటబడిన బీజమువలె ఆమెకు శీఘ్రముగ ఆత్మజ్ఞానోదయమయ్యెను. భర్తయగు శిఖిధ్వజుని చిత్తమింకను పరిపాకమును బొందలేదు. శాస్త్రములందు వైరాగ్యమునుగూర్చి, సర్వత్యాగమునుగూర్చి బోధింపబడినయంశములను వినుచుండునపుడు ఆతని హృదయమందు ఆవేశము జనించుచుండెను. రాజ్యాధికారములన్నింటిని వదలివేసి ఏకాంతమునకు పారిపోవు సంకల్పము లుదయించుచుండెను. కాని తన యీ హృద్గతభావములను భార్యకెఱింగింపక లోలోన వాపోవుచుండెను. ఒకనాటి రేయి సరిగా అర్ధరాత్రివేళ నిద్రలేచి

భార్యను, కుటుంబమును, రాజ్యమును పరిత్యాగము చేసి ఎవరి కిని తెలియకుండగనే పట్టణము వెలుపలకు బోయి, అరణ్య ములగుండాపయనమై బహుదూరమున కేగి తనపట్టువస్త్రము లన్నియు పారవేసి నారవస్త్రములు ధరించి, ఒకానొక నిర్జన వనమున నొక పర్ణకుటీరము నిర్మించుకొని, జపమాల, కమండలువు, ఆసనము గ్రహించి అచ్చోట వసించుచుండెను. నాటిరాత్రి భార్య చూడాల నిద్రలేచి చూడ పతిభక్తి భర్త శిఖిధ్వజుడు లేడు. రాజభవనము, పట్టణము అంతయు వెతికెను. వెతికించెను కాని కానరాలేదు. పెక్కు సిద్ధులు సంపాదించి యున్న సాధ్వీమణికనుక ఆపె వెంటనే ఆకాశమార్గముగుండా చని నలువైపుల బహుదూరము వఱకు వెతకగా ఒకానొక నిర్జనారణ్యమున కుటీరము వేసికొని కాలము గడుపుచున్న తనభర్తను గాంచగల్గెను. కాని అతని కార్యక్రమమునకు అవరోధమును కల్పించుటకు ఇష్టములేక "కొంతకాలము మీరిట్లే యుండుగాక!" అని తలంచి మింటివీధినే తిరిగిపోయి రాజ్య కార్యములను స్వయముగనే చూచుకొనుచుండెను. కొన్ని వత్సరములు గడచెను. అటుపిమ్మట ఒకనాడు భార్య చూడాల కుంభుడను బ్రాహ్మణకుమార వేషమునుదాల్చి ఆకాశమార్గము గుండాపోయి భర్త శిఖిధ్వజుని పర్ణశాలముందు వ్రాలెను. వారిరువురిమధ్య ఈక్రింది సంభాషణము నడిచెను—

(కుంభుని వేషముననున్న) చూడాల:- మీరెవరు? ఏల ఇంత నిర్జనప్రదేశమున నున్నారు?

శిఖిధ్వజుడు:- నేను పూర్వము మహారాజును. చూడాల అను పేరుగల చక్కనిభార్య నాకు కలదు. వైరాగ్యముజనింప

అంతయు విడిచి పైచి, కర్మసన్న్యాసము చేసి ఇచటనున్నాను.

చూ :- మీకు మనశ్శాంతి కలుగుచున్నదా ?

శి:- అదితప్ప తక్కినవి అన్నియు కలుగుచున్నవి.

చూ :- మీరు తప్పుదారి అవలంబించితిరి కనుకనే మీకు మన శ్శాంతికలుగుటలేదు. శాస్త్రములు సర్వత్యాగము మోక్ష హేతువని వచించినవి. కాని మీరు చేసినది సర్వత్యాగము కాదు; రాజ్యము, పరిజనులు, భార్య, కుటుంబము — మొదలగు బాహ్యవస్తువులను మీరు విడనాడితిరేకాని, మనస్సునగల దృశ్యసంకల్పములను, వాసనలను విడనాడ లేదు. వానినివదలుటయే ముఖ్యమగు సన్న్యాసలక్షణము. అదియే సర్వత్యాగము. అంతియేకాని భార్యను, బిడ్డలను వదలి అరణ్యములకు పరుగెత్తుట కాదు. ఒకవేళ అట్లు పరు వెత్తిపోయినను, మీనీడ మీ వెంటనుండునట్లు ఆ దృశ్య వాసనలు, కామాదికషాయములు మిమ్ములను వదలిపోవు. అవి ఉన్నంతవఱకు ఎంత ఏకాంతప్రదేశముననున్నను జీవు నకు శాంతి లభ్యముకాదు. అవి లేనప్పుడు గృహమం దున్నను, రాజ్యము పాలించుచున్నను ప్రశాంతియే మిమ్ము లను వరించును. నిష్కామబుద్ధితో, అనాసక్తపూర్వకముగ కర్మలనుచేయుచురాగా, చిత్తముశుద్ధపడి, జ్ఞానముదయింప కర్మసన్న్యాసము దానియంతట నదియే సిద్ధించును. అంతియే కాని మొదటనే కర్మలను వదలి పారిపోరాదు.

అని ఈప్రకారముగ చక్కని జ్ఞానబోధను గావించి భార్య యగు చూడాల తన భర్తయగు శిఖిధ్వజునకు అంతట తన నిజ

రూపమునుజూపి రాజధానికి తోడ్కొనిపోయి రాజ్యాదికార్యములను (నిర్లిప్తముగ) నిర్వర్తింపజేసెను. కనుకనే శ్రీకృష్ణ పరమాత్మ సాధకులకు ప్రారంభస్థితిలో కర్మసన్న్యాసముకంటె కర్మయే శ్రేష్ఠమని నుడువుటకు కారణము (తయోస్తు కర్మ సన్న్యాసాత్కర్మయోగో విశిష్యతే).

ఈప్రకారముగ కర్మయోగమును చక్కగ ననుష్ఠించుచు రాగా రాగా, ఈశ్వరార్పణబుద్ధివలనను, ఫలాభిసంధి రాహిత్యమువలననుచిత్తమందలిదోషములుశమించిచి త్తముునిర్మలము కాగా, తత్త్వవిచారణయందు ఆసక్తిజనించి క్రమముగ జ్ఞానోదయమగును. అపుడుమనస్సు అధిష్ఠానమగు పరమాత్మయొక్క ధ్యానమందు, విచారణయందు, చింతనయందు సంలగ్నము కాగా, కర్మలు వానియంతటవియే శమించిపోవును. అదియే కర్మసన్న్యాసము. ఇవ్విధముగ కర్మ కొంతకాలమునకు కర్మ సన్న్యాసమునకు దారితీయును. ఎంతకాలమనిప్రశ్నించిన, అది చిత్తముయొక్క పరిపక్వత, సాధనయొక్క తీవ్రతలపై ఆధారపడియుండును. ఎంతవరకుమనస్సు పరమాత్మయందు పరిపూర్ణముగ విలయము జెందకుండునో అంతవఱకును కొద్దియో, గొప్పయో కర్మయోగమునుశీలించుచు నేయుండవలెను.ఎపుడు అభ్యాసప్రాబల్యముచే క్రమముగ తత్త్వజ్ఞానముదయించునో, ఆత్మానుభవము కలుగునో, అపుడు అజ్ఞానమంతయు సూర్యోదయముచే మంచువలె పటాపంచలై పోవును. స్వస్వరూపమున నాతడుస్థితిగల్గియుండును. నవద్వారములతోగూడిన దేహమను నగరమున సామ్రాట్టువలె వెలయుచు, కార్యములను చేయుటగాని, చేయించుటగాని లేక, సాక్షిరూపముగ నిర్వికారముగ

ప్రకాశించుచున్న ఆత్మయే తానుకాని, దేహముకాని, ఇంద్రియాది దృశ్యవర్గముకాని తాను కాదని అపుడు బాగుగ గుర్తెఱుగును. మేఘముచే సూర్యుడు కప్పబడినప్పుడుకూడ సూర్యుని తేజము వాస్తవముగ ఏమియు తగ్గలేదు. అట్లే అజ్ఞానకాలమునగూడ ఆత్మయొక్క నిత్య, నిర్మల, నిర్వికారత్వ మేమాత్రము తీసిపోకయే యున్నది. అయితే మాయా గూఢావరణమువలన అనుభూతముకాక యున్నది. ఇపుడో జ్ఞానముచే అజ్ఞాన మెపుడు దూరీకృతమయ్యెనో, మేఘము తొలగిన సూర్యునివలె స్వకీయాత్మరూపము సువ్యక్తమై నిర్మలముగ, నిరావరణముగ, గంభీరముగ ప్రకాశించుచున్నది. (తేషామాదిత్యవజ్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్). అట్టానిని సాక్షాత్కరించుకొనినవారికిక పునరావృత్తి (జన్మ) లేదు. జన్మజరాదిదుఃఖములను వారు దాటినట్లే. ఈ సత్యముల నన్నిటిని పూసగ్రుచ్చినట్లు శ్రీకృష్ణపరమాత్మ ఈ అధ్యాయమున అర్జునునకు వర్ణించి చెప్పెను.

ఇంతియేకాదు. అట్టిసాక్షియగుపరమాత్మను సాక్షాత్కరించుకొనినవారికి గురుతు ఏమి? ఏలక్షణమును జూచి 'ఈతడు జ్ఞానమును పొందెను, ఆత్మానుభూతిని బడసెను ?' అని చెప్పగల్గుదుము ? - అను ప్రశ్నలకు చక్కని సమాధాన మిట నొసంగెను. భగవంతుడు సమస్వరూపుడు. దోషరహితుడు (నిర్దోషం హి సమంబ్రహ్మ). కావున ఎవరి మనస్సుకూడ సమరూపమున నుండునో, శీతోష్ణములందు, సుఖదుఃఖములందు, మానావమానములందు, జయాపజయములందు సమస్థితిని కాపాడుకొనుచుండునో, అట్టివాడు పరమాత్మయందే నివసించు

చున్నవాఁడగును. పరమాత్మను లెస్సగ తెలిసికొనినవాఁడగును (బ్రహ్మవిద్బ్రహ్మణిస్థితః). ఇట్టిసమత్వదృష్టి కలిగియుండుటయే యథార్థమగు పాండిత్యము. ప్రపంచములోగల సమస్తప్రాణి కోట్లయందును, కుక్కయందును, నక్కయందును, ఈగయం దును, దోమయందును, సూర్యునియందును, చంద్రునియందును, బ్రాహ్మణునియందును, చండాలునియందును, పుష్పమాలయందు దారమువలె పరమాత్మ అనుస్యూతముగ వ్యాపించియున్నాఁడని తెలిసికొని వాని యన్నిటియందు సమత్వబుద్ధి కలిగియుండు టయే ఆత్మజ్ఞానియొక్క గురుతు. దీనినిబట్టి ఒకఁడు ఆత్మజ్ఞాని అగునోకాదో తేల్చిచెప్పివేయవచ్చును. భగవానుడు తెలిసిన ఈగురుతు ఒక బరామీటర్ (Barometer) వంటిది. వాతా వరణము ఎట్లున్నది, ఎన్నిడిగ్రీలు వేడి కలిగియున్నది, లేక చల్ల దనము గలిగియున్నది 'బరామీటర్' అను సాధనము వెంటనే చెప్పగలుగునట్లు ఈ సమదృష్టిరూపలక్షణము ద్వారా జ్ఞాని, అజ్ఞానులను గుర్తించవచ్చును. కొందఱు ఎన్నియో శాస్త్ర ములు చదివినను, జపతపాదులను గావించుచున్నను ఎవఁడైనా శూద్రుఁడుకాని, అంత్యజుఁడుకాని సమీపమునకు వచ్చిరో 'ఛీ ఛీ-ఛీ' అని ఏవగించుకొని ఆమడదూరము పరుగెత్తుదురు. వారి కింకను ఆత్మజ్ఞానముయొక్క 'ఎ, బి, సి, డి' లు కూడా రావని మనము అర్థముచేసికొనవచ్చును. కనుకనే భగవానుడు 'శుని చైవ శ్వపాకేచ' (బ్రాహ్మణునియందును, కుక్కయందును, కుక్కమాంసముతిను చండాలునియందును) అని చెప్పుచు సర్వ జీవులందును సమభావన కలిగియుండవలెనని ఆనతిచ్చెను. ఇప్పుడు మహాత్మాగాంధీజీ ప్రారంభించిన ఈ అస్పృశ్యతా నివారణో

ద్యమమునకు బీజమును శ్రీకృష్ణమూర్తి కొన్ని వేల సంవత్సరము లకు పూర్వమే వేసియుంచెనని దీనివలన స్పష్టమగుచున్నది. కావున గీతాచార్యు డుద్బోధించిన విధముగ సమదృష్టిని వికసింపజేసికొని బ్రహ్మానుభూతి నొందవలయును.

అట్టి బ్రహ్మానుభవమే జీవునియొక్క చరమలక్ష్యము. అట్టి సచ్చిదానందాత్మానుభూతియే జీవితము యొక్క పరమావధి. అఖండానందస్వరూపమగు అట్టి ఆత్మవస్తువును తనయందుంచుకొని అల్పములగు విషయసుఖములకై పరుగిడు వాడు మందప్రజ్ఞుడే యగును.

> బహిర్వ్యాప్రియతి యః కశ్చిత్త్యక్త్వా దేహస్థ మీశ్వరమ్
> స్వగృహే పాయసంత్యక్త్వా భిక్షామటతి దుర్మతిః.

తన దేహమందున్నట్టి పరమానందస్వరూపమగు యీశ్వరుని విడిచి యితర ఆనందములకొరకు బయట తిరుగాడువాడు తన యింటియందున్న పాయసమును వదలి ఇంటింటికిపోయి బిచ్చ మెత్తుకొను మందభాగ్యుడే యగును.

> యస్స్వాత్మసుఖముత్సృజ్య సుఖం బాహ్యమపేక్షతే
> కరస్థం పాయసం త్యక్త్వా స మూఢో లేఢి కూర్పరమ్.

(మహావాక్యదర్పణము).

'ఎవడు తనయందున్న ఆత్మసుఖమునువదలి బాహ్యవస్తునము దాయమునుండి జనించు క్షణికసుఖమును అపేక్షించునో అట్టి వాడు తనదోసిటియందున్న పాయసమునువదలివైచి మోచేతి మీదుగా కారిన రెండుమూడు పాయసపుచుక్కలను నాకు వాడే యగును' అని శంకరాచార్యులవారు 'మహావాక్య దర్పణము'న తెలిపియున్నారు. శాస్త్రములన్నియు ఈప్రకార

ముగనే ఉద్ఘోషించుచున్నవి. గీతాచార్యుడున్ను భగవద్గీత యందు పలుచోట్ల యీ సత్యమును నొక్కి వక్కాణించి యున్నాడు. ముఖ్యముగ ఈ ఐదవ అధ్యాయమున విషయ సుఖముల యొక్క న్యూనత్వమును, ఆత్మసుఖము యొక్క ఆధిక్యతను అత్యంత స్పష్టముగ వర్ణించెను.

బాహ్యస్పర్శే ష్వసక్తాత్మా విన్దత్యాత్మని యత్సుఖమ్
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయ మశ్నుతే. (5-21)

బాహ్యములగు శబ్ద స్పర్శాది విషయసుఖములందు ఆశలేని వాడగు బ్రహ్మనిష్ఠుడు తనయందు అక్షయమగు సుఖమును ఆత్మానందమును బొందుచున్నాడని భగవానుడు నుడివెను. ఈ శ్లోకములో గీతాచార్యుడు బాహ్య అభ్యంతర సుఖముల రెండిటిని త్రాసునందుపెట్టి తూచి ఫలితమును వెల్లడించెను. ఆత్మసుఖము అక్షయమని, అనగా తరుగులేనిదియని, అనంత మని, విషయసుఖము క్షయమని తేల్చి చెప్పివేసెను. ఏల యనగా శబ్దస్పర్శరూపరసగంధములవలన కలుగునది ప్రతి బింబసుఖము. ఆత్మసుఖ మొకటియే బింబసుఖము. దానినే బ్రహ్మనంద మందురు. అది తరుగులేనిది.

'What enjoyment can there be in little clods of earth ? It is the crystallised essence of infinite enjoyment that we have to seek and that is in God. Let all our passions and emotions go up unto Him.'

"ఈ మట్టిముద్దలయందు (పంచభూతముల వికారముతో యగు దేహ, ధన, దారాదులందు) ఏమిసుఖము కలదు ? సారభూత మగు అనంతానందమునే మనము వెతుకవలెను. అది భగవం

తుదియందే (ఆత్మయందే) కలదు. కావున మన ప్రయత్నము లన్నియు ఆతనిని సాక్షాత్కరించుకొనుటయందే వినియోగపడ వలెను'-అని స్వామి వివేకానంద జనులందఱికిని హెచ్చరిక చేసెను. శాస్త్రములు, మహాత్ములు ఈ ప్రకారముగ మరల మరల ఘోషించుటకు కారణమేమి? భగవానుడు పేర్కొనినట్లు దృశ్యసౌఖ్యములందు రెండు ప్రధానమైన దోషములు కలవు. అందుచేత. అవి యేవి యనిన - (1) అది క్షయశీలమైనది, (2) అది దుఃఖమిశ్రితమైనది. ఈ రెండింటిని గూర్చి ఒకింత పరిశీలించెదము—

'ఆద్యన్తవన్తః' (మొదలు తుది కలవి) అని గీతాచార్యుడు బాహ్యసుఖములను వర్ణించుటచే అవి క్షయిష్ణువులని స్పష్టమగుచున్నది. అవి కొద్దిసేపు ఉండి మరల అంతరించి పోవును. ఒకగంటసేపైనను అవిచ్ఛిన్నముగ సుఖమును కలుగ జేయు వస్తువులు ప్రపంచమున చాల అరుదుగానున్నవి. అట్టిచో శాశ్వతమైన బ్రహ్మానందమునకును వీనికిని సాటియెచట? పైగా ఆ విషయసుఖములు దుఃఖమిశ్రితములై యున్నందువలన ప్రారంభమున ఒకింత సుఖాభాసము లభించినను, క్రమముగ దుఃఖమే చేతికి చిక్కుచున్నది. 'దుఃఖయోనయ ఏవ తే' (అవి దుఃఖహేతువులేయగును) అని భగవానుడు వానిని వర్ణించుట చాల సబబుగానున్నది. ఒకవస్తువు తినినను, త్రాగినను, అనుభవించినను, ఏమో సుఖముగ నున్నట్లుండి, కొద్దిసేపటికి ఏ కడుపునొప్పియో, అజీర్ణమో, రోగమో తగులుకొనుటయు, పైపెచ్చు ఆకోరిక వాసనారూపముగ పరిణమించి మరల ఎప్పుడు దానిని అనుభవింతుమా అని నిరంతరము అశాంతి కలుగజేయు

టయు, ఇంక ననేకజన్మలకు హేతుభూతమై జననమరణ చక్రమున జీవుని బడద్రోయుటయు, ఇట్లనేక సంకటములకు ఆలవాలమగుచున్నది. కనుకనే శ్రీ శంకరాచార్యులవారు—

సుఖమల్పం బహుక్లేశో విషయగ్రాహిణాం నృణామ్
అనన్తం బ్రహ్మనిష్ఠానా మితి వేదాన్తడిండిమః.

"విషయభోగములను పరిగ్రహించుజనులకు అల్పసుఖము, అధిక దుఃఖము-ఇదియే గతి. బ్రహ్మనిష్ఠులకో, అనంతానందము వారి వంతు-అని వేదాంతభేరి మ్రోగుచున్నది" అని వాక్రుచ్చియున్నారు. ఒక మంగలికత్తియొక్క పదునైన అంచునకు ఒకింత తేనెపూయబడియున్నదనుకొనుడు. దానిని పసిపిల్లవాడు నాకినచో, క్షణకాలము మాధుర్యసుఖము కలిగినను, నాలుక తెగుటచే దీర్ఘకాలమొట్లు పరితాప మనుభవించునో, అట్లే దృశ్య సౌఖ్యములు జనులకు పరిమితానందము, అపరిమిత క్లేశము కలుగజేయుచుండును. అట్టి దుఃఖగర్భితములగు సుఖములను విజ్ఞులు కోరుకొందురా? ఎన్నటికిని కోరరు. (న తేషు రమతే బుధః) తెలివిగలవారు వానిని కోరరని భగవానుడు నుడివినందువలన, తెలివితక్కువవారు వానిని కోరుదురనియు లేక వానిని కోరువారందరున్ను తెలివితక్కువవారని స్పష్టమగుచున్నది.

ఇంద్రియార్థములగు ఈశబ్దాదుల ననుభవించుటకు ఇంత అమూల్యమగు మానవజన్మతో పనియేమి? పశుజన్మకాని, క్రిమికీటకాది జన్మకాని దానికి చాలును. కావున ఎవడు తన జీవితము అల్పములగు విషయానందములందు గడపివేయునో, మోక్షముకొఱకు ప్రయత్నింపకుండునో అట్టివాడు ఆత్మఘాతకుడేయగునని శాస్త్రములు తెలుపుచున్నవి. మఱియు

సద్వస్తువగు ఆత్మను వదలి అసద్వస్తువగు విషయములకై పరుగిడువాడు నీడను వెంటాడువాడే యగును. మానవుడు జన్మించినది దానవుడగుటకు కాదు, దేవుడగుటకు. పశుత్వము నొందుటకు కాదు, పశుపతిగా మారుటకు. అట్టిచో ఎండమావులవంటి ఈ క్షణికసుఖములందే జీవితమంతయు ఆహుతి చేయనేల? సున్నపుముద్దలనుజూచి వెన్నముద్దలని భ్రమించి పరుగిడుట విజ్ఞుడు చేయవలసిన పని కాదు. తినుట, త్రాగుట, గంతులువేయుట-ఇదియేనా మానవత్వము ?

'Man does not live by bread alone.'

అని క్రీస్తు వచించినట్లు కేవలము తిండియే మానవుని పరమావధి కాదు. దానిని మించిన మఱికొన్ని విషయములు కలవు. అనిత్యవస్తువును విడనాడుట, నిత్యవస్తువును పరిగ్రహించుట, ఆత్మ నన్వేషించుట-ఆత్మేతరమునందు విరక్తి గలిగియుండుట ఈ ప్రకారమగు నైతిక జీవితము నలవరచుకొనుటయే మానవ జన్మ సాఫల్యత.

అయితే, ఈ సందర్భమున కొందఱీ ప్రశ్న వేయుచున్నారు - 'అయ్యా! ఇంద్రియార్థములగు శబ్దాదులను, విషయభోగములను పరిత్యజించవలసినదిగా గీతాదిగ్రంథములు చెప్పుచున్నవే! మాకేమో అవి చాల సుఖకరములుగ గన్పట్టుచున్నవి. దైవసుఖమెట్టిదో మాకు తెలియదు. మాకు అందుబాటులో లేదుకూడను. మాకది లభించునను నమ్మకము కూడ లేదు. అట్టిచో ప్రత్యక్షముగనున్న ఈ ఇంద్రియసుఖములనుపోగొట్టుకొని పరోక్షముగనున్న మఱియొక(ఆత్మ) సుఖమునకై అఱ్ఱులుచాచుట హాస్యాస్పదమే యగునుగదా! పొదలో

నున్న పక్షికొరకై చేతిలోనున్న పక్షిని జారవిడుచుకొను వాడు విజ్ఞుడేనా-అని ఈ ప్రకారముగ పలుకుచుందురు. ఇట్టి వారందఱును చార్వాక మతస్థులగుటకు దగ్గఱి బంధువులని జ్ఞప్తియందుంచుకొనవలెను. భోగపదార్థములు సుఖకరములని వారు పలుకుచున్నారు. అది సరికాదు. సుఖము బాహ్యమునలేదు. పదార్థములందు సుఖమున్నదని యనుకొనుట ఒట్టి భ్రమయే యగును. ఒకానొక వస్తువుపై ఆశకలిగి దానిని గూర్చి పదేపదే చింతించునపుడు మనస్సు స్వస్థానమగు హృదయమునువిడచి బయటకు పోవును. అప్పుడది చంచలముగ నుండును. కాని ఎప్పుడా యభిలషితపదార్థము చేజిక్కునో, లేక అనుభవింపబడునో అపుడు మనస్సు నిశ్చలమగును. పదార్థమునుగూర్చిన సంకల్పము శమించును. అట్టితఱి ఆ నిశ్చల మనస్సునందు, అధిష్ఠానమగు ఆత్మానందము కొంత ప్రతిబింబించును. ఈ ప్రకారమగు తనలోని ప్రతిబింబిత ఆత్మ సుఖమునే జీవుడు వస్తుజన్యముగ తలంచి పొరబడుచున్నాడు. ఆ సుఖము తనలోనిదే, బయటిది కాదు. ఎట్లనిన—

ఒక కుక్క ఎచ్చటనో ఒక ఎముకనుసంపాదించి దానిని కొఱుకుచుండెను. ఎముక గట్టిగా నున్నందువలన విఱుగలేదు. కాని బలవంతముగ కొఱుకుట వలన ఆ పన్ను ఊడిపోగా దాని నోటిగుండా నెత్తురు ఎముకపై కారుచుండెను. పాపము, అమాయకమగు ఆ కుక్క ఎముకలోనుండి రక్తము స్రవించుచున్నదని భావించి తనభాగ్యము పండెనని యూహించి నిర్విరామముగ ఆ రక్తమును నాకసాగెను. ఇట్టిదియే అజ్ఞానుల పరిస్థితిన్ని. భోగలాలసులగువారు పదార్థముల ననుభవించుచు

ఆత్మసుఖమే ఆ పదార్థములందు ప్రతిబింబించుచున్నదని యెఱుంగక 'ఆహా ! భోగ్యవస్తువు లెంత ఆనందకరములు !' అని తలంచుకొని మురిసిపోవుచున్నారు.

అసారే ఖలుసంసారే సుఖభ్రాన్తిః శరీరిణాం
లాలాపానమివాంగుష్ఠే బాలానాం క్షీరవిభ్రమః.

'కొందఱు చంటిపిల్లలు నోటిలో వ్రేలుపెట్టుకొని చీకుచు, తమ ఉమ్మినే తాముమ్రింగుచు వ్రేలిలోనుండి పాలువచ్చుచున్నవని భ్రమింతురు. అట్లే ఈ అసారసంసారమున పదార్థములందు జనులకు సుఖభ్రాంతి కలుగుచున్నది'. కాబట్టి బాహ్యవస్తువులందు సుఖములేదు. మనస్సు శమించుటయే, సంకల్పముడుగుటయే సుఖమునకు కారణము. అది యెంతెంత అధికముగ శమించుచుండునో అంతంత అధికముగ జీవునకు సుఖముగలుగుచుండును. నిజముగా సుఖము పదార్థమునందున్నచో అది అందఱికిని ఎల్లవేళలయందును సుఖకరముగ తోచవలెను. అట్లులేదు. ఒకేవస్తువు కొందరికి ప్రీతికరముగను, కొందరికి అప్రీతికరముగను, ఒకేకాలమున సుఖవంతముగను, మఱియొక కాలమున జుగుప్సాకరముగను స్ఫురించుచున్నది. వస్తువునందానందమున్నచో ఇట్లెన్నటికిని సంభవింపదు. దృష్టాంతమునకు జూడుడు-భోజనాత్పూర్వము ఎంతయో రుచికరములుగ తోచిన పాయసము, గారెలు మున్నగునవి కడుపునిండ భుజించిన పిదప ఇక తిన బుద్ధికాక, ఎవరైన బలవంతముగ వడ్డించినచో విషప్రాయముగ భావించి తినక వదలివేయుదురు. 'కడుపు నిండితే గారెలు చేదు' అను ఆర్యోక్తి సత్యేతర మెన్నటికిని కాజాలదు. చేదుతనము గారెలలోలేదు. కమ్మదనము అంత

కంటెను లేదు. మన ఆకలి, మన మన స్తత్వము ఆ యా రుచులను కల్పించుకొనుచున్నది. ఇంతమాత్రమే. కాబట్టి సుఖము బాహ్యపదార్థములందు లేదు. జీవుని అవిద్యయే అప్రకారముగ వస్తువునందు సుఖభ్రాంతిని కలుగ జేయుచున్నది. బృహదారణ్యకోపనిషత్తునందు యాజ్ఞవల్క్య మహాముని తన భార్యయగు మైత్రేయికి వచించిన పరమసత్యముల నాలకింపుడు—

"న వా అరే పత్యుః కామాయ పతిః ప్రియో భవతి ఆత్మనస్తు కామాయ పతిః ప్రియోభవతి న వా అరే జాయాయై కామాయ జాయా ప్రియా భవతి, ఆత్మనస్తు కామాయ జాయా ప్రియా భవతి.... ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః"

'ఓ మైత్రేయీ! భర్తకాని, కొమార్తెకాని, తదితరులుకాని, వెయ్యేల, ప్రపంచములోని ఏ పదార్థముకాని ప్రియముగా తోచుచున్నచో, ఆ ప్రియత్వము వస్తువునందు లేదు, తనయందేయున్నది. తనకొఱకే ఆ పదార్థములు ప్రియములుగా తోచుచు నున్నవి. కాబట్టి అట్టి ప్రియాతిప్రియమైన ఆత్మనే దర్శించవలెను. దానినిగూర్చియే వినవలెను, చింతించవలెను, అనుభవించవలెను'. కావున ఆనందముయొక్క మూలస్థానము ప్రధానకేంద్రము (Headquarters) హృదయముననే కలదు. బయటకాదు. ఆనందఘనమగు పరమాత్మను తనయందుంచుకొని ఆ విషయము తెలియక అజ్ఞుడు పేలాలకొఱకై బాలురు పరుగెత్తునట్లు అల్పసుఖములకొఱకై బయట దేవులాడుచున్నాడు. ఎట్లనిన—

పూర్వమొకప్పుడు ఒకానొక వర్తకుడు కొంతసొమ్మును మూటగట్టుకొని యాత్రచేయుటకై బయలుదేరెను. దారిలో

అచటచట సత్రమునందో, దేవాలయమునందో, విశ్రమించుచు ప్రయాణము కొనసాగించుచుండెను. వర్తకునియొద్దగల డబ్బు మూటనుజూచి మఱియొకనికి దానిని తస్కరించవలెననుదుర్బుద్ధి జనించి స్నేహితునివలె నటించి మెల్లగా అతనిచెంత చేరెను. ఇరువురును పరమమిత్రులవలె మెలగుచు యాత్ర సల్పుచుండిరి. ఒకనాటిరేయి ఇద్దఱును ఒక సత్రమునందలి గదిలో పరుండిరి. వర్తకుడు గాఢనిద్రపోవుచుండ, ఆ కపటమిత్రుడు నెమ్మదిగాలేచి డబ్బుమూటకొరకై గదియంతయు వెదకెను. వర్తకునిపెట్టె, సంచులు, చొక్కా, మూటలు అన్నియు విప్పిచూచెను. కాని డబ్బుమూట కనిపించలేదు. మరల మరల వెతకెను. కాని కని పించలేదు. మఱునటిరోజు ఉదయము తన స్నేహితునితో మాట్లాడుచు మాటలసందర్భములో 'రాత్రి మీ డబ్బుమూట ఎచ్చట దాచితిరి?' అని ప్రశ్నింప అతడు 'నీదిండుక్రిందనే' అని జవాబిచ్చెను. కపటమిత్రుడు అత్యాశ్చర్యపడెను. వర్తకుడు తన మిత్రుని దొంగగా గ్రహించి అతడెట్టైన తన ధనము అపహరించునని తలంచి ఆ మూటను ప్రతిరోజు ఆమిత్రుని తల (దిండు) క్రిందనే దాచుచుండెను. ఏలయనగా దొంగ అన్ని చోట్లు వెతుకునుగాని తన తల (దిండు) క్రింద వెతకడు. వర్త కునకో, దొంగలను మేపు అభ్యాసము కలదుగనుక, తన ధన రక్షణకొఱకై ఈ చక్కని ఉపాయమును అవలంబించెను. ఆ ప్రకారమే జీవుడు బ్రహ్మానందవారాశిని తన హృదయమందే ఉంచుకొని ప్రపంచమంతయు ఆనందముకొఱకు వెదకు చున్నాడు. కాని ఎంత వెతకినను ఆ శాశ్వతానంద మాతనికి బయట ఎచటను లభించలేదు. అది అంతరంగముననే కలదు.

ఆ రహస్య మతనికి తెలియక అజ్ఞానవశమున బయట తుచ్ఛ సుఖములకై తిరుగాడుచున్నాడు. 'విష్టత్వాత్మని యత్సుఖమ్' 'సుఖమక్షయమశ్నుతే' 'యోఽన్తః సుఖో'-ఇత్యాది వాక్యములద్వారా శ్రీకృష్ణపరమాత్మ అక్షయ సుఖము లోపలనే కలదని స్పష్టము చేసియున్నాడు.

ప్రతిరోజు గాఢనిద్రపోవునపుడు బాహ్యవస్తువులు సన్నిటిని మఱచి, సంకల్పమును కూడ వదలి జీవుడు అవిచ్ఛిన్నముగు (Homogeneous) సుఖమును తనయందే అనుభవించు చుండుట చూచుచున్నారము కదా! ఆ సమయమునను ఎట్టి దుఃఖముకూడ స్ఫురణకురాక జీవునకు పరమశాంతి కలుగుచుండును. అజ్ఞానస్థితియందు మనస్సుయొక్క తాత్కాలిక ఉపశమనరూపమగు సుషుప్తియందే ఇంతసుఖము జీవునకు అభ్యంతరమున లభించుచుండ, ఇక జ్ఞానస్థితియందు మనస్సుయొక్క శాశ్వత ఉపశమనరూపమగు సమాధిస్థితియందు ఎంత సుఖము లభించగలదు? కాబట్టి అట్టి ఆనందాత్మసుఖప్రాప్తికి బాహ్యఅల్పసుఖములను జీవుడు పరిత్యజించవలసి యుండును. దానినే విషయవిరక్తియందురు. కొంతత్యాగ మవలంబించి ఈకార్యమును సాధించినచో ఫలితము అఖండ వైభవప్రాప్తియే.

కావున విజ్ఞులగువారు తమ అమూల్య మానవజన్మను సార్థక పఱచుకొనుటకొఱకు ప్రయత్నశీలురై, విషయసుఖములను పరిత్యజించుచు ఇంద్రియమనోనిగ్రహమును సాధించుచు, కామక్రోధాదుల వేగమును అణచుచునుందురు. జీవితకాలము అతిస్వల్పము. తెలిసికొనవలసిన ధర్మములా పెక్కుకలవు. ఆచరించవలసిన సాధనలా అనేకములున్నవి. విఘ్నములా లెక్కలే

వన్ని వచ్చిపై బడుచున్నవి. ఇట్టి స్థితిలో జీవుడు ఎంత త్వరితముగ తన లక్ష్యమును సాధింపగల్గునో అంత శ్రేయస్కరము. మృత్యువు ప్రతినిమిషము జీవుని కబళించివేయుటకై ప్రక్కనే వేచియున్నది. వార్ధక , రోగాదులు హుంకరించుచు మీద పడబోవుచున్నవి. కావున వానివలన అపకారము కలుగక పూర్వమే, మృత్యువు దాపురించకమునుపే, ఇంద్రియములశక్తి ఉడుగక పూర్వమే వైరాగ్య శమదమాదిసాధనలను అభ్యసించి స్వస్వరూపానుభవమును పొందవలసియుండును. మరణించిన పిదప మరల మానవజన్మవచ్చునను 'గ్యారంటీ' లేదు. ఆ ప్రకారము భగవంతుడు మనకు హామీపత్ర మేదియు నివ్వలేదు. ఒక వేళ ఇతరలోకములందు జన్మించితిమా, అచట పరమార్థ సాధనలకుఅనుగుణ్యమైనవాతావరణముండదు. అవియన్నియు భోగభూములేకాని యోగభూములు కావు. కర్మభూములు అంతకంటెకావు. భూలోకమొక్కటియే చక్కని కర్మక్షేత్రము. పాపముచేసినచో నరకమునకు, పుణ్యముచేసినచో స్వర్గమునకు, జ్ఞానము పొందినచో మోక్షమునకు ఇక్కడినుండియే జీవునకు నేరులో టిక్కెట్లు (Passports) దొరకును. తన గమ్యమును తాను ఇచటనే నిర్ణయించుకొనవచ్చును. కాబట్టి త్వరలో సద్గురువు నాశ్రయించి, తారకోపాయము నెఱిగి జీవితమును కడతేర్చుకొనవలయును. ఆ తారకోపాయ మేదియో గురోర్గురువైన శ్రీకృష్ణమూర్తి ఈ యధ్యాయమున వెల్లడించివేయున్నాడు. అది యేది యనిన-

శక్నోతీహైవ యః సోఢుం ప్రాక్శరీర విమోక్షణాత్
కామక్రోధోద్భవం వేగం స యుక్తస్స సుఖీ నరః (5-23)

పరమార్థసుఖము ఎవనికి లభించును? కామక్రోధాదులను నిగ్రహించగలిగినవానికి. వానిని ఎప్పుడు నిగ్రహించవలెను? ఈ శరీరము పతనముకాకపూర్వమే. అనగా మృత్యువాసన్నమగుటకు ముందే. ఎచట నిగ్రహించవలెను ? ఇచటనే, ఈ మానవజన్మయందే, ఈ భూలోకముననే (ఇహైవ)- ఇవ్విధముగ పరమాత్మ అధ్యాత్మసుఖప్రాప్తికై రాజబాటను చూపెను. కోరికలను తగ్గించుకొనవలెను. ఆశలను విసర్జించవలెను. విషయసుఖములను పరిత్యజించవలెను. భోగాభిలాషను దూరీకృతమొనర్చుకొనవలెను. కామక్రోధాదులను అణచవలెను - ఇదియే రాజబాట. కాని జనులట్లు చేయుచున్నారా ? లేదు. పైపెచ్చు అనేక శృంగారవిషయిక గ్రంథములను చదువుచు, విషయవికారములను రెచ్చగొట్టుక్రియలనాచరించుచు, చూడరాని దృశ్యములను చూచుచు, చేయరానిపనులను చేయుచు. కామాగ్నియందాహుతులువేయుచు ప్రజ్వలింపజేయుచున్నారు తత్ఫలితముగ దైవమునకు (వాస్తవ సుఖమునకు) దూరులై నరకమునకు సన్నిహితులగుచున్నారు. భగవానుడు గీతయందుగాని, వేదశాస్త్రములందుగాని తెలిపినవి యున్నియు పరమధర్మములు. వానిని అనుసరించువాడు ధన్యుడు. త్రోసిరించువాడు దౌర్భాగ్యుడు. అతడధఃపతనమును బొందిపోవును.

"ధర్మో రక్షతి రక్షితః'

'నీవు ధర్మమును కాపాడినచో, ధర్మము నిన్ను కాపాడగలదు.' ధర్మమును, భగవద్వాక్యమును ఉల్లంఘించినచో తత్ఫలితముగా మహాద్దుఃఖమును జీవు డనుభవింపవలసివచ్చును. మేడమీదనుండి క్రిందకుదూకినచో కాలువిరుగును. అది ఎట్టువంటివానికైన

నను విరుగును. బలవంతుడైనను, ధనవంతుడైనను, విద్యావంతుడైనను, అధికారవంతుడైనను సరియే. ఏల? ప్రకృతియందుగల భూమ్యాకర్షణశక్తియను అప్రతిహతమైన నియమము (law of gravity) వలన ఆ నియమము (law) ను ఎవరును మార్చలేరు. అట్లే ప్రపంచము కొన్ని ధర్మములపై ఆధారపడి నడచుచున్నది. వానిని అతిక్రమించిన వారికి అందుకిని తగిన శాస్తి లభించును. అదియే దుఃఖము. అనుసరించినవారికి అందుకిని తగిన పురస్కారము లభించును. అదియే సుఖము. కాబట్టి బ్రహ్మనిర్వాణరూపమగు ఆత్యంతికసుఖప్రాప్తి కొఱకును, జననమరణరూప సంసారదుఃఖవినాశముకొఱకును, గీతాచార్యుడు కరుణతో ఈ అధ్యాయమునందు వచించిన అనాసక్త (నిష్కామ) కర్మాచరణము, సమదృష్టి, విషయవిరక్తి (భోగవైతృష్ణ్యము), ఇంద్రియనిగ్రహము, ఆత్మచింతన మున్నగు మహోన్నత ధర్మములను చక్కగ నాచరణయందుంచుకొని ధన్యులయ్యెదరుగాక!

ఓం తత్ సత్.

ఓమ్

# 6-వ అధ్యాయము

# ఆత్మసంయమయోగము

భగవద్గీత అమూల్యమగు జ్ఞానభండారము. తరగని నిధి. శ్రీవేదవ్యాసమహర్షి నాలుగువేదములను, పదునెనిమిది పురాణములను,నవవ్యాకరణములను బాగుగ మథించి ఏభారతమును రచించెనో, ఆ భారతమును మథించుటచే వెలువడిన సారమే గీతయని స్కాందపురాణమున తెలుపబడినది.* కావున నిది సర్వశాస్త్ర సిద్ధాంత సంగ్రహమని సుస్పష్టమగుచున్నది. ఇంతవరకు మనము విచారించిన ఐదు అధ్యాయములలోనే ఎన్నియో పరమరహస్యములు బయటపడినవి. రానున్న అధ్యాయములందును ఇంక నెన్నియో నిగూఢ మర్మములను తెలిసికొననున్నాము. ముముక్షువులకీ గీతాగ్రంథ మెంతటి ఆశ్వాసమును గలుగజేయగలదో ప్రత్యేకించి చెప్పనక్కఱ లేదు. పఠించిన వారివారికే అనుభూతము కాగలదు. ఒక్క పర్యాయము దీనియర్థమును బాగుగ తెలిసికొనినవాడు మరల దీని నెన్నటికిని విడిచిపెట్టడు. ఆ జీవితసంగినిగ దీని నొనర్చుకొనును. గీతయొక్క మహిమ యెట్టిదో, శ్రీకృష్ణపరమాత్మ

---

* (1) అష్టాదశ పురాణాని నవవ్యాకరణాని చ
నిర్మథ్య చతురో వేదాన్ మునినా భారతం కృతమ్.

(2) భారతోదధి నిర్మథ్య గీతానిర్మథితస్య చ
సారముద్ధృత్య కృష్ణేన అర్జునస్య ముఖే ధృతమ్.

(స్కాందపురాణము)

స్వయముగవచించినభావముల నిచట పేర్కొనుచున్నాను-వినుడు. మహాభారతయుద్ధము పరిసమాప్తమైన కొంతకాలమునకు అర్జునునకు గీతను మరల నొకపర్యాయము వినవలెననెడి కుతూహలము జనించెను. అపుడు తన యీ యభీష్టము నాతడు శ్రీకృష్ణున కెఱింగింప నంతట శ్రీకృష్ణు డర్జునునితో నిట్లు పలికెను-

న చ సాద్య పునర్భూయః స్మృతిర్మే సంభవిష్యతి
స హి ధర్మః సుపర్యాప్తో బ్రహ్మణః పదవేదనే.

(భారతం - అశ్వమేధపర్వం)

"ఓ అర్జునా ! మరల ఆ విషయములన్నిటిని చెప్పుటకు సాధ్యపడదు. ఏలయనిన, ఎట్టి ఏకాగ్రతతో నేను నీకపుడు బోధించితినో, అట్టి ఏకాగ్రత ఎల్లప్పుడును సంభవింపదు. కావున నీవే దానిని మరల బాగుగ చింతనచేసి జ్ఞాపకమునకు తెచ్చుకొనుము. పరమాత్మపదము నెఱుఁగుటకు ఆ గీతాధర్మములు చాలును"—దీనినిబట్టి శ్రీకృష్ణమూర్తి గీతోపదేశకాలమున ఎంతటి తదేక నిష్ఠాపరత్వమందుండెనో సువ్యక్తమగుచున్నది. మఱియు బ్రహ్మసాక్షాత్కారమునకు గీతాధర్మములు చాలునని వచించుటవలన సాధకుడు గీతాగ్రంథ మొక్కదానిని క్షుణ్ణముగ పరిశీలించి, తదుపదిష్టమార్గములను అనుష్ఠానమునం దుంచుకొనినచో భవసాగరమును దాటివేయగలడనియు స్పష్టమగుచున్నది. గీతాప్రభావమునుగూర్చి సాక్షాత్ శ్రీకృష్ణమూర్తియే యిట్లు తెలియజేసినపుడు, ఇక ముముక్షువుల కద్దానిపై నెంతటి విశ్వాసముండవలెనో యోచించుకొనుడు.

సామాన్యముగ గీతను గంగకు పోల్చుచుందురు. గంగ పవిత్రమైనది. గీతయు పవిత్రమైనది. కావున వారట్లు పోల్చి

చెప్పుటకు కారణము. కాని గంగ ఎచట నుద్భవించినది? విష్ణుభగవానుని పాదములనుండి. గీత ఎచట నుద్భవించినది? విష్ణుభగవానుని ముఖకమలమునుండి. ఓహో! ఎంతటి వ్యత్యాసము! పాదమెచట, ముఖమెచట! గంగలో ఎవరైనను జారిపడినచో క్రిందకు పోవుదురుగదా! కాని గీతాగంగలో ఎవరైనను జారిపడినచో పైకిపోవుదురని భగవానుడు పలికెను. ['తేషా మహం సముద్ధర్తా మృత్యు సంసార సాగరాత్'- 'సంసారసముద్రమునుండి వారలను నేను పైకిలేపుదును' గీత-12-7] గంగాప్రవాహములో ఎవరైనను కొట్టుకొనిపోయి నచో వానిని తీసికొని వెళ్ళి వెళ్ళి తుదకు ఉప్పుసముద్రమగు బంగాళాఖాతము (Bay of Bengal)లో అది కలిపివేయును. కాని, గీతాప్రవాహములో కొట్టుకొనిపోయిన వానిని అది తీసి కొని వెళ్ళి వెళ్ళి బ్రహ్మానందసముద్రములో కలిపివేయును. ('బ్రహ్మనిర్వాణమృచ్ఛతి') కాబట్టి గంగ పావనమైనప్పటికిని గీత పరమపావనమైనదని గుర్తింపవలెను.

గీత ఆఱవ అధ్యాయము నేటి విచారణీయాంశము. నేటితో గీత ఒక షట్కము పూర్తికాగలదు. ఈషట్కమునకు సామాన్యముగ కర్మవిభాగమని పేరుకలదు. దీని కనుపటి అధ్యాయము ఆత్మసంయమయోగము. దానినేధ్యానయోగమనియు నందురు. ఈ అధ్యాయమునుగూర్చియే మనమిపుడు విచారించ వలసియున్నాము. సాధననుగూర్చి ఇంత విపులముగ బోధించిన అధ్యాయము మఱియొకటి గీతలో లేదనియే చెప్పవచ్చును. కూర్చొనుట మొదలుకొని నిర్వికల్పసమాధివఱకు ఏయే అంగములు సాధకుడు ముఖ్యముగ తెలిసికొనవలసియున్నవో, అవి

యన్నియు నిచట పొందుపఱుపబడినవి. కనుక సాధకున కీయధ్యాయము పెన్నిధివంటిది. సామాన్యముగ హైస్కూళ్ళలోగాని, కాలేజీలలోగాని భౌతిక శాస్త్రము (Physics), రసాయన శాస్త్రము (Chemistry) మున్నగునవి బోధింపబడునపుడు సిద్ధాంతబోధనా తరగతి (Theoretical class) అనుష్ఠాన బోధనాతరగతి (Practical class) అను రెండు తరగతులు నడుపబడుచుండును. ఏలయనిన, ఆ ప్రకారములైన శాస్త్రములకు అనుష్ఠానరహితమగు కేవల సిద్ధాంతము నిరుపయోగనే యగును. అట్లే అధ్యాత్మశాస్త్రమునందు ఆచరణపద్ధతులను బోధింప కేవలము సిద్ధాంతములనే ఏకరువు పెట్టుచు పోయినచో ఆశాస్త్రమువలన మనుజునకు కలుగు ప్రయోజనము శూన్యమే యగును. ఈ రహస్య మెఱిగియే గీతాచార్యుడు సిద్ధాంతములతో పాటు ఆచరణగూడ జోడించి గీతాగ్రంథమును తయారుచేసెను. అందువలన నియ్యది లోకవిఖ్యాతముగ నలరుచున్నది. అధ్యాత్మవిజ్ఞానము అతిసూక్ష్మమైనది. అనుభవజ్ఞుడగు మహనీయుడే దాని లోతుపాతులన్నియు చక్కగ దెలిసికొని చెప్పగలడు. ఇక సర్వజ్ఞుడును, యోగీశ్వరుడునగు శ్రీకృష్ణమూర్తియే ఆపనికి పూనుకొనినచో, ఫలితము ఎంత మహత్తరముగా నుండగలదు! బోధన యెంత రసవత్తరముగ కొనసాగగలదు! కావుననే గీతలో సాధకు డెదుర్కొను సమస్యలన్నియు విపులముగ చర్చించబడి తగు సమాధానము లొసంగబడినవి. అందు ముఖ్యముగ ఆఱవ అధ్యాయమగు ఈ ఆత్మసంయమయోగము సాధనాదృష్టిలో గణనీయమైనది.

ఆత్మసంయమయోగమను పదమందలి ఆత్మ అనుదానికి అర్థము పరమాత్మకాదు, మనస్సని. ఆత్మకు సంయమములతో పనిలేదు. మనస్సునకే సంయమములతో అవసరము. కావున ఈ అధ్యాయము పేరు మనస్సంయమయోగమని భావము. సంయమ మనగా అరికట్టుట, నిగ్రహించుట (Control)అని అర్థము. సామాన్యముగ మనస్సు మహాచపలముగా నుండును. దానిని కోతికి పోల్చిరి. మామూలు కోతికికాదు, కల్లుత్రాగిన కోతికి. ఇంతేకాదు, కల్లుత్రాగి, తేలుకుట్టినకోతికి. అంతటితో ఆగలేదు. కల్లుత్రాగి, తేలుకుట్టి, దయ్యంపట్టిన కోతికి పోల్చి కొండంగిరి, కవులు దానిచపలత్వాతిశయమునుజూచి. అట్టిచపల మానసమును అరికట్టనిదే మనుజునకు శాంతి యెట్లు లభింప గలదు ? ప్రతిజీవియొక్క సహజస్వరూపము పరమానందాత్మ అయియున్నను ఈ మనస్సు అను అడ్డువలన అట్టి నిరతిశయా నంద మనుభూతమగుటలేదు. కనుకనే మహనీయులందఱున్ను మనోనిగ్రహమునకును, మనస్సంయమమునకు, మనోనాశమున కు అధిక ప్రాధాన్య మొసంగినవారై యుద్ధానిని ఆత్మ సాక్షాత్కారమునకు ప్రథమసాధనగా పేర్కొనిరి.

చిత్తం నాభిః కిలాస్యేహ మాయాచక్రస్య సర్వతః
స్థీయతే చేత్త దాక్రమ్య తన్న కించిత్ప్రబాధతే. (వసిష్ఠగీత)

'ఈ జగన్మాయ యను మహాచక్రమునకు మనస్సు నడిబొడ్డు అయియున్నది. దానిని పట్టుకొనినచో (నిగ్రహించినచో) ఇక ఈ మాయ ఒకింతైనను జీవుని బాధింపనేరదు' అని వసిష్ఠ మునీంద్రులు శ్రీరామచంద్రునకు బోధించెను. ఇంతియేకాదు. ఇట్టి మనోనిగ్రహమును పరమౌషధము చేదప్ప మఱిదేనిచేతను

గూడ ఈసంసారమహారోగము శమించనేరదనియు, ఒకింత విచారణచే తనమనస్సును కొంచెముగా నిగ్రహించినప్పటికిని మనుజుడు జన్మసాఫల్యమును బొందినట్లేయనియు అమ్మునీంద్రు డుపదేశించెను-

మనాగపి విచారేణ చేతసః స్వస్యనిగ్రహః
మనాగపి కృతో యేన తేనాప్తం జన్మనః ఫలమ్. (వసిష్ఠగీత).

దీని యర్థము పైనదెలిపినదే. కావున ప్రతిమానవునియొక్క ప్రథమకర్తవ్యము తన మనస్సును తాను జయించుకొనుటయే యగును. మనస్సనునది వాస్తవముగ ఆత్మకంటె ఎంతయో క్రిందిస్థానముననున్న వస్తువు. అట్టిది అనేక జన్మలయందు వాసనలను ప్రోగుచేసుకొని బలమును సంపాదించి పైన ఉన్న ఆత్మను అణగద్రొక్కివేయుచున్నది. 'గుడ్డువచ్చి పిల్లను వెక్కిరించిన చందమున' ప్రవర్తించుచున్నది.

పూర్వమొకరాజుండెడివాడు. అతనికి పెక్కుభూములు, కోటలు, 'ఎస్టేట్లు' కలవు. వానినన్నింటిని తాను స్వయముగ చూచుకొనుటకు వీలులేక ఒక ప్రతినిధిని అకార్యమునకై వినియోగించెను. ఆ ప్రతినిధియో, క్రమముగ అధికారమును చేపట్టి అహంకరించి, రాజును చిన్నచూపు చూచుచు కొంత కాలమునకు 'నీవెవరవయ్యా' అని రాజును ప్రశ్నించు స్థితికి వచ్చెను. అట్టిసందర్భమున రాజునకు రెండేరెండు మార్గములు కలవు. తన యధికారమును చలాయించి ఆప్రతినిధిని లోబరచుకొనుటకాని, తొలగించివేయుటకాని ఒకటి; లేక అతనికి తలయొగ్గి దాసానుదాసుడై బానిసవలె వర్తించుట రెండవది. వివేకముతో గూడిన రాజు కనుక అతడు తన హోదాను

గమనించి ఆ ప్రతినిధిని ఉద్యోగమునుండి తొలగించివేసి సుఖముగ నుండెను. అట్లే ఆత్మయను రాజు చిరకాలము క్రిందట మనస్సను ప్రతినిధి (Agent) ని ఈ జగద్వ్యవహారమంతయు చూచుకొనుటకు నియోగింపగా, అయ్యది క్రమముగ విషయ వాసనలచే బలపడి, క్రొవ్వెక్కి, ఆత్మను (జీవుని) బానిసగా చేసివైచినది. ఇట్టి స్థితి చాల శోచనీయమైనది. కనుక దాని నెట్లైన జయించి తమసార్వభౌమాధికారమును నిలబెట్టుకొనవలసినదిగా జనులకు విజ్ఞప్తి చేయుటకుగాను శ్రీకృష్ణపరమాత్మ ఈ ఆత్మసంయమయోగమును ప్రబోధించియున్నాడు.

వాస్తవముగ జీవుడు స్వతంత్రుడేకాని, పరతంత్రుడు కాడు. యజమానియేకాని, బానిసకాడు. అధికారియే కాని, నౌకరుకాడు. ఎవడు తన యింద్రియములను, మనంబును జయించుకొనునో, అతడు ఈ నవద్వారపురంబునకు సార్వభౌముడై, ఈదృశ్యజగత్తునకు ఏకచ్ఛత్రాధిపతియై విలసిల్లును. మఱియు ఆ జయింపబడిన ఇంద్రియములు తనకు మిత్రులుగా వ్యవహరించును, సహాయపడును. అట్లుగాక ఎవడు తన ఇంద్రియములను, మనస్సును జయింపనేరక, వానికి లోబడిపోవునో అట్టివాడు ఈ నవద్వారనగరంబగు దేహమున భృత్యునివలెను దీనముగ వర్తించుచు శోకాన్వితుడై యుండును. అత్తఱి ఆ జయింపబడని ఇంద్రియములు తనకు శత్రువులుగావ్యవహరించునని శ్రీకృష్ణపరమాత్మ ఈ అధ్యాయ ప్రారంభమున తెలియజేసెను. దీనినిబట్టి మిత్రుడు మనలోనే కలడు, శత్రువు మనలోనే కలడని నిర్ణయమగుచున్నది. శత్రువును ప్రక్కనే ఉంచుకొనినవాడు శాంతి నెన్నడైన పొందగల్గునా? దొంగ ఇంటి

యుండే కలవాడు సుఖము నెన్నడైన నోచుకొనగలడా? కట్టుకొనినపంచెలోగాని, చీరలోగాని తేలుఉన్నవారి సంగతి ఎంత బాధాకరముగనుండునో, అట్టి అజితేంద్రియుల స్థితియు నట్లే యుండును. కావున ప్రతివారున్ను తమయందు శత్రువులకు ఆలంబనమొసంగక, జీవితమున పరమసౌఖ్య మనుభవించుటకు చూడవలయును. ఇందుల కేకైక ఉపాయము, తనమనస్సును, ఇంద్రియములను, వివేకాదులద్వారాసంయమన మొనర్చుటయే యగును. దీనినే ఇంగ్లీషుభాషలో 'మైండుకంట్రోలు' (Mind control) అందురు. యుద్ధకాలములోను, తదనంతరమున్ను మన ప్రభుత్వమువారు అన్నిపదార్థములను కంట్రోలు చేసిరి. దానినిగూర్చి ప్రజలకు నేర్పిరికూడ. కాని ఒక్క-దానిని మాత్రము నేర్పలేదు. అదియే మనస్సునుగూర్చిన కంట్రోలు (నిగ్రహము). దానిని ప్రభుత్వమువారు నేర్పకపోయినను గీతాచార్యుడు ఈఆఱవఅధ్యాయములో చక్క-గ నేర్పివైచెను.

ఉపనిషత్తులలో ఈఇంద్రియాదులనుగూర్చి సుందరమైన ఉపమాన మొకటి ఈయబడినది. ఈశరీరమే రథము; ఆత్మయే రథికుడు (యజమాని); బుద్ధియే సారథి; మనస్సే కళ్లెము; ఇంద్రియములే గుఱ్ఱములు; విషయములే బాట. ఎవనియొక్క-బుద్ధిప్రజ్ఞావంతమై ఇంద్రియము లను చెడ్డగుఱ్ఱములను మనస్సను కళ్లెముతో లాగిపట్టి విషయభోగము లను గోతులందు పడకుండ చక్క-గ తప్పించినదుపునో, అట్టివాని దేహమను (ఉపాధియను) రథమునిరాటంకముగ గమ్యస్థానమగు పరమాత్మనుచేరగలదు. లేకున్న గోతులలో, చెరువులలో పడిపోవు రథమువలె వినాశమునే పొందగలదు. ఒక్కొక్క-ఇంద్రియము తన ఇంద్రియార్థ

మగు విషయములవైపు జీవుని లాగుచున్నది. చెవి ప్రాపంచిక శృంగారశబ్దజాలమును వినుటకై తహతహలాడుచున్న దేకాని భగవన్నామమును, వేదఘోషను వినుటకు సిద్ధపడుటలేదు. పైగా ఏవగించుకొనుచున్నది. అట్లే త్వగింద్రియము విషయ స్పర్శనే అభిలషించుచున్నదికాని భగవంతుని పాదపద్మములను స్పృశించుట కిష్టపడుటలేదు. నేత్రము తళుకు బెళుకు ప్రాపంచికరూపములనే చూచుటకు కాంక్షించుచున్నది కాని భగవానుని దివ్యస్వరూపమును గాంచ నిచ్ఛగించుటలేదు. ఈ ప్రకారముగనే రసనేంద్రియ, ఘ్రాణేంద్రియములున్ను వానికి అభిలషితములైన వస్తువులనే కోరుచున్నవి. ఇట్లుండ నిక జీవునకు శాంతి యెట్లు కలుగగలదు ? పదిమంది భార్యలుకల భర్త యొక్క దుర్గతియే ఈ జీవునకు పట్టుచున్నది. కాబట్టి ఇంద్రియనిగ్రహము, మనోజయము, అత్యావశ్యకములనియు, అవిలేనిచో జీవునకు శాంతి మృగ్యమనియు గీతాచార్యుడు ఈ అధ్యాయప్రారంభముననే నుడివి యున్నాడు.

అయితే అట్టి నిగ్రహము, సంయమము అలవడుట ఎట్లు? మనోజయ మెట్లు సిద్ధించును ? ఈ విధమైన ప్రశ్నలను మన కంటె ముందుగ అర్జునుడే వేసెను.

చంచలం హి మనఃకృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్. (6-34)

ఓ శ్రీకృష్ణా! మనస్సును నిగ్రహింపవలెనని చెప్పుచున్నావు. నామనస్సో మహాచపలముగానున్నది. బలవత్తరముగ నుండుట వలనను, విషయములందు గట్టిపట్టుదల గలిగియున్నందునను దానిని లొంగదీయుట గాలిని పట్టుకొనుటవలె మహాదుష్కర

ముగా తోచుచున్నది. ఇట్టి పరిస్థితిలో ఇక నా కర్తవ్య మేమి? ఇది అర్జునుని ప్రశ్న. అర్జునుడు ఒకానొక వ్యక్తిగా జనులకు గోచరించినను వాస్తవముగ వ్యక్తి కాడు. భూతభవిష్యద్వర్తమానకాలములందలి పరమార్థ సాధకులందఱియొక్క మూర్తీభవించిన ప్రాతినిధ్యమే అర్జునుడు. అనగా మనయందఱియొక్క ప్రతినిధిగా అతడు వ్యవహరించుచున్నాడు. మనము అడుగదలంచిన ప్రశ్నను అతడే అడిగివైచెను. మనతరపున వకాలత్ నామాతీసికొనిఅచ్చట వ్యవహరించుచున్నాడన్న మాట. అర్జును డడిగిన ప్రశ్న చాలగొప్పది. సర్వులకు అత్యావశ్యకమైనది. దానికి భగవాను డేమి సమాధానము చెప్పునో వినవలెనని అందఱికిని సహజముగనే కుతూహలముండును. మనోనిగ్రహ మెట్లు సంభవించునో వినవలెనని ఎవరికి జిజ్ఞాసయుండదు? ఈ ప్రకారముగ జనులందఱును, ముఖ్యముగ సాధకులందఱున్ను వెయ్యిచెవులతో వినుటకు సిద్ధపడియుండు సమయమున శ్రీకృష్ణపరమాత్మ యిట్లు ప్రత్యుత్తర మొసంగెను-

> అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్
> అభ్యాసేన తు కౌన్తేయ వైరాగ్యేణ చ గృహ్యతే. (6-35)

'ఓ అర్జునా! నిస్సందేహముగ మనస్సుచపలమైనదే, నిగ్రహించుటకు కష్టసాధ్యమైనదే; అయినను అభ్యాసము చేతను, వైరాగ్యముచేతను అయ్యది నిగ్రహింపబడగలదు. ప్రయత్నము చేయనివారికి మనోనిగ్రహము కష్టముగానుండునుగాని, ప్రయత్నించువారికి అది సులభముగనే ఉపాయముచే లభ్యమగును. కావున పార్థా! ప్రయత్నము సలుపుము!' గీతాచార్యుని ఈ యాదేశము సోమరులకు గొడ్డలిపెట్టుగా పరిణమించినది. మనస్సం

యమము ఒక వరమువలె హఠాత్తుగ ఆకసమునుండి ఊడిపడి జీవుని హృదయమందు చేరునది కాదనియు, అది ఒకరిచ్చునది ఒకరు పుచ్చుకొనునది అంతకంటె కాదనియు, వారికి వారే పరిశ్రమచేసి, ప్రయత్నము సలిపి పొందదగినది యనియు భగవానుడు స్పష్టీకరించెను. అర్జునుడు శ్రీకృష్ణునకు పరమమిత్రుడు, సన్నిహితుడు, సఖుడు, ప్రీతిపాత్రుడు. 'ఇష్టోఽసి మేదృఢమితి'- అని ఆతడొకసారి చెప్పివేసినాడుకూడ. అట్టివానికి అర్జునుడు 'నామనస్సు నిలుచుటలేదు బాబో' అని విలపించుచుండ, 'మిత్రుడవగు ఓ అర్జునా! నీవు మహావిపత్తులోనున్నావు; నేను సర్వశక్తిమంతుడను; మదీయప్రజ్ఞాప్రభావముల నుపయోగించి నీ మనస్సును ఒక్కనిమిషములో అరికట్టివైచెదను' - అని కృష్ణుడు చెప్పలేదేమి? అంత అన్యాయుడుకదా! ఈ కొంచెము సహాయ మాతనికి ఏల చేయలేదు? 'అభ్యాసము చేసుకొమ్ము నాయనా మహానుభావా' అని ఆతనిమీదనే ఏల భారముంచెను? దీనికి కారణము-ఎవరి ఆకలిని వారే భుజించి పోగొట్టుకొనవలెను. ఎవరిబరువును వారే తమనుకొని సుఖపడవలెను. ఎవరికండ్లతో వారే చూడవలెను. మహాత్ములు ఒకింత సహాయము చేయగలరే కాని ప్రయత్నించి సాధించవలసినది వారికి వారే.

శ్రీ శంకరాచార్యులవారు ప్రపంచములోని బాధలన్నిటిని ఒక తరగతిగను, ఆకలి బాధను మాత్రము మఱియొక తరగతిగను విభజించెను. ఏలయనగా ప్రపంచములోని బాధలన్నియు ఇంకొకని సహాయముచే తొలగిపోగలవు. కాని ఆకలిబాధ మాత్రము మఱియొకనిచే తొలగదు. తనకుతాను భుజించి నివారించుకొనవలసినదే.

(1) మస్తకన్యస్తభారాదేర్దుఃఖమన్యైర్నివార్యతే
క్షుధాదికృతదుఃఖంతు వినాస్వేన న కేనచిత్.

(2) పథ్యమౌషధసేవా చ క్రియతే యేన రోగిణా
ఆరోగ్య సిద్ధిర్దృష్టాఽస్య నాన్యానుష్ఠిత కర్మణా.

(3) ఋణమోచన కర్తారః పితుస్సన్తి సుతాదయః
బన్ధమోచన కర్తాతు స్వస్మాదన్యోనకశ్చన.

(వివేక చూడామణి)

తలపై కట్టెలమోపు బరువుగనున్నచో, ఆ బరువును మఱి యొకని సహాయ్యమున దింపించుకొని బాధను తొలగించు కొనవచ్చును. కాని తనకు ఆకలి అయినచో ఆ బాధను ఎవరు తీర్చగలరు? ఎవరైన భుజించిన తన ఆకలి తీరునా? తీరదు. తనకుతానే భుజించి ఆ బాధను నివారించుకొనవలెను. తనకు రోగమువచ్చినచో మఱియొకడు మందుతినిన ఆ బాధపోవునా? పోదు. తానే స్వయముగ ఔషధమును సేవించి పథ్యాదులను జరుపవలసియుండును. తండ్రి అప్పుచేసినచో ఆ అప్పును కుమారుడు తీర్చవచ్చును, కాని తండ్రి అజ్ఞానబంధనమునందున్నచో దానిని కుమారుడు పోగొట్టలేడు. తండ్రిజ్ఞానోపార్జనద్వారాతనకు తానే దానిని తొలగించుకొనవలెను-' అని ఈ ప్రకారముగ శ్రీశంకరాచార్యులవారానతిచ్చిరి. కావుననే అర్జునుడు మన శ్చాంచల్యమునుగూర్చి ఫిర్యాదుచేసినపుడు శ్రీకృష్ణపరమాత్మ 'అభ్యాస వైరాగ్యములద్వారా దానిని నీవు నీవే పోగొట్టుకొన వలెను'ని సమాధానమొసంగుటకు కారణము. 'ఉద్ధరేదాత్మనాఽ త్మానం' (తన్ను తానే ఉద్ధరించుకొనవలెను) అని ఈ అధ్యాయ ప్రారంభములో భగవానుడు హెచ్చరిక చేసియేయున్నాడు. ముముక్షువులగువారు సద్గురువులయొద్దకేగి 'మహాత్మా! అజ్ఞా

నము బాధించుచున్నది. మనస్సు చపలముగా నున్నది. దుఃఖ నివారణోపాయములను సెలవిండు' అని ప్రశ్నించినపుడు, గురువులు 'నాయనలారా! ఆ అజ్ఞానమునుకొని తెచ్చుకొనినది ఎవరు? మనస్సునకు చాంచల్యమును అలవాటు చేసినది ఎవరు ? అనాది కాలమునుండి దృశ్యవాసనలచే మేపి ఆ మనస్సును చెడగొట్టినది యెవరు ? అసుర సంప్రదాయమైన నిషిద్ధాహారము మీ ద్వారా కడుపునిండ దానికి లభించుటవలన, అది బాగుగ తిని మరిగి, క్రొవ్వెక్కి మీపైననే తిరుగబడుచున్నది. కావున బంధన మెట్లు పోవునో, మమ్ములను అడుగుటకు పూర్వము ఆ బంధనము ఎట్లువచ్చినదో మీరే యోచించుకొనుడు. మనస్సు చపలముగా నున్నదని మాతో విన్నవించుటకు ముందు ఆ చాపల్యమును ఎవరు కలుగజేసికొనిరో మీరే విచారించుడు. అపుడు తన్నివారణము సులభముగ జరుగగలదు' అని వచించుచున్నారు.

'ఆలివర్ గోల్డుస్మిత్' అను ప్రముఖుడు 'వికార్ ఆఫ్ వేక్ ఫీల్డ్' (Vicar of Wakefield) అను గొప్ప నవలను రచించెను. అందులోని ఒక చక్కని కథను ఈ సందర్భమున తెలుపుట సమంజసముగా నుండునని తోచుచున్నది. ఒక గ్రామములో నొక రైతుకుటుంబము కలదు. వారికి ఆ గ్రామములో నొకస్వంతఇల్లుకలదు. దానిని వారిపూర్వీకులలో నెవరో చాలకాలము క్రిందటనే నిర్మించియుండిరి. దానిలోనుండి ఆ కుటుంబమువారు మఱియొక ఇంటిలోనికి ఇపుడు మారవలసి వచ్చెను. కావున సామానులన్నిటిని అందుండి బయటకు తరలించుచుండిరి. అన్ని వస్తువులను బయటకుతీయగల్గిరి. కాని ఒక

పెద్ద అద్దము మాత్రము బయటకు రాలేదు. గది గుమ్మము చిన్నది, అద్దము పెద్దది. వచ్చిన చిక్కు అది. ఎందఱో ఎన్ని విధములో ప్రయత్నించిరి. కాని సఫలము కాలేదు. పెద్దచిక్కు సమస్య వారికి ఏర్పడినది. ఆసందర్భమున చుట్టుప్రక్కలనున్న నలుగురు పెద్దలు ఒకచోట చేరి ఉపాయమును అన్వేషింపదొడం గిరి 'గదిగుమ్మమును వెడల్పు చేయవలసినదే!'—అని ఒకరిసలహా. "కాదు, అద్దమును రెండుగా చీల్చి బయటకుతీసికొనివెళ్ళి మరల జోడించుకొనవచ్చును'-అని మఱియొకరి సలహా. ఇట్లు పలువుగు పరిపరివిధముల పలుకుచుండ అందొక వ్యక్తి లేచి "Let us think over how it ever came in'— "అసలిది లోపలికి ఎట్లు రాగల్గెను?'-అని ప్రశ్నించెను. గంభీరములగు ఆ వాక్యములు అచటచేరినవారినందఱిని ఆలోచనా నిమగ్నులుగ జేసివైచెను. ఆప్రకారముగనే అజ్ఞానముయొక్క గాని, మనశ్చాంచల్యముయొక్క గాని నివారణోపాయముల నన్వేషించుటకు పూర్వము అవి జీవున కెట్లు సంభవించినవో యోచించుకొనిన చాలును. జీవుని అజాగ్రతవలన ప్రయత్న రాహిత్యమువలను అవి యేర్పడినవి. కావున ఇపుడు జాగ్రత గలిగి ప్రయత్నమునాచరించినచో అవి తొలగిపోగలవు. ఇకా్కరణముననే శ్రీకృష్ణమూర్తి అర్జునునిప్రశ్నకుసమాధానముగ, "నీకు నీవే వైరాగ్యపూర్వకమగు అభ్యాసమును, ప్రయత్నమును సలుపుకొనుము-అప్పుడు మనస్సుఅదుపులోనికి వచ్చును' అని సెలవిచ్చెను. కాబట్టి ముముక్షువులందఱున్ను భగవానుని యూదేశప్రకారము వారివారి మనంబులను సుస్థిరములుగను,

నిశ్చలములుగను నొనర్చుటకై మహత్తర సాధన ప్రయత్నమును గావింపవలసియున్నది.

ఆధ్యాత్మికరంగమందు మనోనిగ్రహము ప్రముఖస్థానమాక్రమించియున్నది. జీవుని పై బంధవిమోచనములందును అతిచాల ప్రధానమైనదిగ చెప్పుచున్నది. కావున దాని నెట్లు నిగ్రహింపవలెనో సాధకుడు తప్పక తెలిసికొనవలసియున్నది. మనస్సును జయించినచో అన్నియును జయించినట్లే. దానిని జయించనిచో ప్రపంచములో నెన్ని జయించినను వ్యర్థమే యగును. కావున ముముక్షువునకు అతిముఖ్యమైనదియు, మోక్షప్రాప్తికి హేతుభూతమైనట్టిదియునగు ఈ మనోజయమును గూర్చి ఒకింత విచారించి ముందునకు సాగెదము. (1) అభ్యాసము (2) వైరాగ్యము-అను రెండు ఉపాయములచే మనస్సనుగూర్చి, ఆటను కట్టివేయవచ్చునని పరమాత్మ వచించెను. కేవలము అభ్యాసము మాత్రముండి వైరాగ్యము లేకున్నను, వైరాగ్యముండి అభ్యాసము లేకున్నను మనస్సు పూర్ణముగ నిలుకడనొందజాలదు. కావున రెండింటిని చక్కగ సాధింపవలెను.

ఒకానొక కార్యమును సాధించుటకై మరల మరల నొనర్పబడు ప్రయత్నమునకే అభ్యాసమని పేరు.

'స తు దీర్ఘకాల నైరన్తర్య సత్కారసేవితో దృఢభూమిః'

అని పతంజలిమహర్షి నుడివినట్లు దీర్ఘకాలము, నిరంతరము శ్రద్ధాపూర్వకముగ యత్నమాచరించిననే మనోనిగ్రహము సాధ్యపడగలదు. అనేక జన్మలయందు మనస్సు మాయాప్రవాహమున నెమ్మదిగ కొట్టుకొనిపోవుచుండెను. ఇపుడు సద్గురూపదేశమునచే మాయను, ప్రకృతిని, అజ్ఞానమును ధిక్కరించి ప్రవర్తింపవల..

యుండుటచే ప్రవాహమునకు ఎదురీదవలసివచ్చుచున్నది. ఎన్ని కోట్ల వత్సరములు, జన్మలు దృష్టవాసనావలంబనము నందు వినియోగింపబడినవి. ఇప్పుడు సద్వాసనాశ్రయమందు కొలది వత్సరములైనను నియోగింప నక్కఱలేదా? కావున మరల మరల అభ్యాసముద్వారా మనస్సును లొంగదీయ వలెను. కోతి, ఎలుగుబంటు, పులి మొదలగు క్రూరజంతువు లనుకూడ మరల మరల నేర్పుటద్వారా సర్కసు యజమాని వానిని స్వాధీనపఱచుకొని ఇష్టమువచ్చినట్లు ఆడించుటలేదా? ఇక ఎంతయో ప్రజ్ఞగలిగిన మానవుడు ఏల దారికి రాడు? అతనిమనస్సు ఏల లొంగదు? తప్పక లొంగును. కాని ఏకైక యత్నముతో, దీక్షతో అభ్యసించుచు రావలెను.

అజ్ఞోఽపి తజ్జ్ఞతామేతి శనైః శైలోఽపి చూర్ణ్యతే
బాణోఽప్యేతి మహాలక్ష్యం పశ్యాభ్యాస విజృమ్భితమ్.

(యోగవాసిష్ఠము)

'ఓ రామచంద్రా! మరలమరల (జ్ఞానము) అభ్యసించుటవలన అజ్ఞానియు జ్ఞానియగుచున్నాడు; పెద్ద పెద్ద కొండలున్ను పిండి చేయబడుచున్నవి. బాణమున్ను అతిసూక్ష్మమగు లక్ష్యమును భేదించివేయుచున్నది. చూచితివా; అభ్యాసముయొక్క ప్రాబల్యము!'- అని వసిష్ఠమునీంద్రుడు శ్రీరామునకు తెలిపి యున్నాడు. 'రసరీ ఆవత జాతతే శిల్‌పర్ హోతనిశాన్' అని హిందీభాషయందు ఒక సామెత కలదు. అనగా 'శిలపై రోజూ చీమలు ప్రాకుచుండినచో దానిపై దారి ఏర్పడగలదు' అని యర్థము. కఠినమైన శిలనుగూడ అల్పమగు చీమ భేదించ గలిగినది దేనిచేత? నిరంతర గమనరూపమగు ప్రయత్నము

చేత. కొన్ని గ్రామములలో బావులకు చుట్టును కట్టబడు రాతి కట్టడముపై జనులు నీళ్లుతోడుకొను కుండలు పెట్టుటవలన కొంతకాలమునకు ఆ రాతిపై గుంటలు ఏర్పడుచుండుట మనము చూచుచున్నాముగదా! కుండ ఎచట, కఠినమగురాయి యెచట! కాని ఆ కుండయే ప్రతిరోజు కొంచెము కొంచెము అరగదీసి కాలక్రమమున కఠినశిలను నిర్జించివేయుచున్నది. దీనినే అభ్యాసమందురు. ఇట్టి అభ్యాసమునే మనోజయమున కుపయోగించవలెనని భగవానుని ఆజ్ఞ.

మనోజయోపాయములలో ఇక రెండవది వైరాగ్యము. అనగా విషయవిరక్తి. ఇది లోపించినందువలననే అనేకులకు మనస్సు నిలకడలేకయున్నది. ఇంద్రియములు ఇంద్రియార్థములగు శబ్దస్పర్శాదులపై పరుగిడుచున్నంతవరకు మనస్సునకు నిశ్చలత్వ ముండగలదా? ఇంద్రియములు విషయములవెంట పోవునప్పుడు మనస్సున్ను వాని ననుసరించిపోవును. కావున కిటికీలు తెరచియున్న ఇంటియందుగల ప్రమిదదీపము గాలి వలన కదలుచునేయుండునట్లు అట్టిమనస్సు నిరంతరము చంచలముగనే యుండును. కావున విషయములయందు దోషదృష్టిని చూచుటద్వారా మనస్సును వానినుండి మరల్చి అంతర్ముఖ మొనర్పవలెను. ఆత్మయందు చేర్చవలెను. దీనినే వైరాగ్య మందురు. అయితే విషయములందు దోషమును అనవసరముగ కల్పించవలసిన అగత్యములేదు. వానియందు స్వతః దోషము ఉండనేయున్నది. దానిని చింతించిన చాలును. ఆ దోషమేమి? నశ్వరత్వము, పరిణామశీలత్వము, వినాశము. ఇవియే ప్రాపంచిక పదార్థములందుగల దోషములు.

పూర్వమొకపుడు ఒకానొక మహారాజునకు ప్రపంచ ములో నంతవఱకు కని విని యెఱుఁగనట్టి అద్భుతమగు భవన మొకదానిని నిర్మింపజేయ సంకల్పముదయించెను. లోకాధీశుడు కనుక డబ్బున కేమి కొదువ? కావలసిన ధనమును వెచ్చించి గొప్పగొప్ప శిల్పులను రప్పించి కొన్ని సంవత్సరములు తదేక దీక్షతో పనిచేయించి తుట్టతుదకు అతిసుందరమైన రాజభవన మును తయారు చేయించెను. చూచినవారికి కన్ను మిఱుమిట్లు కొల్పుచుండెను. విశాలమైన గదులు, ధగధగ మెఱయుచున్న రత్నకాంతులు, గోపురములు, అందమును చిందుచున్న దీప ప్రభలు - వెయ్యేల దేవేంద్రుని వైభవమునుగూడ తిరస్క రించుచున్నదా యనునట్లుండెను ఆ భవ్యప్రాసాదము. నిర్మా ణము పూర్తి అయినపిదప సాంప్రదాయ ప్రకారము ఒక సుదిన మున గృహప్రవేశ మేర్పాటు కాబడెను. ఆ సుముహూర్తము నకు వేలకొలది బ్రాహ్మణోత్తములు, రాజప్రముఖులు, వణి క్శ్రేష్ఠులు, ఇంజనీర్లు, శిల్పులు ఆహ్వానింపబడిరి. గృహప్రవేశ సుముహూర్త మేతెంచెను. భవనమందలి మధ్యభాగమంతయు ఆహూతులచే కిటకిటలాడుచుండెను. విఘ్నేశ్వరపూజ, నవ గ్రహారాధన, హోమము, అర్చన పూర్తి అయినవి. అపుడా సభామధ్యమున మహారాజు లేచి నిలబడి సభ్యులందఱిని సంబో ధించి యిట్లు పలికెను- "ఓ పుణ్యాత్ములారా! ఈ గొప్పభవన మును ఎంతయో ధనము వెచ్చించి, శ్రమచేసి నిర్మించినాను. మీలో గొప్పగొప్ప శిల్పులు, వాస్తుశాస్త్రవేత్తలు, భవన నిర్మాణకుశలురు కలరని నాకు తెలియును. కాబట్టి అట్టివారందఱు నున్ను బాగుగ యోచించి ఈ భవనమునం దేవైన లోపములు

కాని, దోషములుకాని యున్నచో ఇప్పుడే తెలిపిన, సవరించి వేసెదను. ఏలయనగా ఈ ప్రాసాదమును సర్వాంగసుందరముగ నొనర్చవలెనని నాసంకల్పము. కావున ఎవరైన లేచి దోషము లున్నచో తెలుపప్రార్థన." రాజుయొక్క ఆ వాక్యములను విని సభ్యులు ఆశ్చర్యచకితులైరి. అందములు చిందుచున్న ఆకట్టడ మెచట, దోషమెచట! అయినను ఆలోకేశునిమాట త్రోసివేయ లేక ప్రముఖ శిల్పులు, ఇంజనీర్లు మరికొందరు పర్యాయము భవన మంతయు తిరిగిచూచి సభాస్థానమునకువిచ్చేసి ఐక్యకంఠముతో "రాజా! ఈ కట్టడమందు దోషమేమాత్రమును లేదు. ముమ్మాటికిని లేదు" అని వచించిరి. రాజు చాల సంతసించెను. సభ యంతయు స్తబ్ధముగ నిశ్చలముగ నుండెను. ఇంతలో ఒక మూలనుండి ఒక సాధువుగారు లేచి నిలబడి 'అయ్యా! మహా రాజుగారూ! ఈభవనమునందు రెండుదోషములు కలవు' అని గంభీరముగ నుడివెను. వెంటనే రాజుగారు 'మహాత్మా! దయ చేసి వానిని తెలుప వేడెదను' అని కోరగా, సాధుపుంగవుడు 'ఓ మహారాజా! ఈభవనమును కట్టించినవాడు ఎప్పటికైనను చనిపోవును-ఇది మొదటి దోషము. ఈ భవనము కాలగర్భ మున ఎప్పటికైనను శిథిలమైపోవును-ఇది రెండవదోషము' అని తెగవేసి చెప్పెను. ఆవాక్యములనువినగనే రాజునకు కనువిప్పు కలిగెను. వైరాగ్య ముదయించెను. 'అయ్యా! మృత్యువున మఱచి, ప్రాపంచిక వైభవములనే సత్యమని నమ్మి, పంచ భూతాత్మకములేయగు ఈ జడపదార్థములను, ఈ భవనము లను, బంధుజాలమును, భృత్యవులను గొప్పగ తలంచుచు ఎంత అజ్ఞానమున నుంటిని' అని తలపోయుచును సభను విరమించి

జేసి, ఏకాంతప్రదేశము నాశ్రయించి శేషించినజీవితమును భగవద్ధ్యానమందు గడపివేసెను.

కాబట్టి దృశ్యపదార్థము లన్నిటియందును-అవి ఎంతటి మహిమాతిశయముతో గూడుకొనినవి అయినప్పటికిని-వినాశము, మృత్యువు మున్నగుదోషములుండనే యున్నవి. నశించు పదార్థమునందు సౌందర్యమెచట? నాశశీలమగువస్తువు ఎంతటి ఆనందమును ఒసంగగలదు? ఒకవేళ ఒసంగినను ఆ ఆనందమెంత పర్యంత ముండగలదు? అనుభవించు వ్యక్తి, అనుభవింపబడు పదార్థము రెండును కొంతకాలమునకు శైథిల్యమునే పొందుచుండ ఇక వానిసంయోగమువలన కలుగు సుఖము ఎంత చంచలమైనదో క్షణికమైనదో యోచించుకొనుడు. మఱియు అట్టి తుచ్ఛసుఖమునకై వాపోవు మనుజుడెంతటివిజ్ఞానవంతుడో ఊహించుకొనుడు. ఈ ప్రకారము దృశ్యపదార్థము లందలి దోషములను చక్కగవిచారించి పూర్వకాలమున ఉద్దాలకాది మహర్షులు, జనక, బలి, ప్రహ్లాదాది రాజశ్రేష్ఠులు విషయవిరక్తి గలిగి సత్యవస్తువగుపరమాత్మనాశ్రయించుటద్వారా పరమోన్నతిని బొందియుండిరి. 'యద్దృశ్యంతన్నశ్యం' (ఏదిదృశ్యమో అది నశించియే తీరును)- అను శాస్త్రోక్తి ముమ్మాటికిని సత్యము. ప్రపంచములో ద్రష్టవగు ఆత్మతప్ప దృశ్యరూపమగు ఈసంసారమంతయు కాలునికరాళవదనమునకుపాహారమై నా ఆహుతి కావలసినదే. మహామహారాజులు, వారి రాజ్యములు, వారి వైభవములు, వెయ్యేల-బ్రహ్మాండములన్నియు తద్గత వస్తుజాలమంతయు కాలగర్భమున అంతరించియే పోవుచున్నవి. "The spider weaves its web where Caesars ruled"

'ఒకనాడు రోమన్ చక్రవర్తులు రాజ్యమేలిన దివ్యభవనము లందు ఈనాడు సాలీళ్ళు గూళ్ళుపెట్టుచున్నవి' అను సామెత కలదు. అనగా అవియన్నియు శిథిలములై పోయినవని భావము. ఎంతయో వైభవముతో తులతూగిన విజయనగర సామ్రాజ్య మిపుడేమైనది? నాగార్జునుని కాలమున వెలసిన ఆ విశ్వవిద్యాలయకట్టడములు, రాజప్రాసాదములు, భూమిలో పూడిపోవ ఇపుడు పురావస్తుశాఖవారు వెల్లగించుచుండుట మనము చూచుచున్నాముకదా! ఇవియన్నియు విచారించి చూచినచో ప్రపంచములో దైవము (ఆత్మ) ఒక్కటితప్ప తక్కిన పదార్థములన్నియు నాశశీలములని స్పష్టము కాగలదు. ఇట్టిలౌకిక భోగజాలములపై ఆశవదలి, మనస్సును సత్యమగు పరమాత్మ ధ్యానమందు వినియోగించవలెను. ఇవ్విధముగ వైరాగ్య భావన కలిగియున్నచో మనోనిగ్రహము సులభతరము కాగల దని శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు ఈఅధ్యాయమునబోధించెను.

ఇంతవఱకు మనస్సును బయటకుపరుగెత్తకుండ చేయుటకు వలయు వైరాగ్యాది సాధనసంపత్తినిగూర్చి విచారించితిమి. బాహ్యవస్తువులయందలి నశ్వరస్వభావము, ఆపాతరమణీయత్వము, చంచలత్వము, అల్పసుఖత్వము, జడత్వము లను పరిశీలించినచో వివేకవంతునకు సహజముగనే వానియెడల విరాగము జనింప మనస్సు దృశ్యములపైనుండి మఱలును. ఈప్రకారముగ మనస్సు బహిర్ముఖము కాకుండుట ఆధ్యాత్మిక సాధనలయందు గొప్ప సహాయమేయగును. కాని అంతమాత్రముతో మనపనిపూర్తికాలేదు. బాహ్యమునుండి మఱలించిన ఆ మనస్సును అంతర్ముఖము చేయునట్టి పని ఇంకను మిగిలి

యున్నది. ఇది చాల ముఖ్యమైనది. అసలు ప్రధానమైన పని ఇదియే. అనగా మనస్సును అంతర్ముఖముచేసి ఆత్మయందు స్థాపించుట అన్నిటికంటెను ముఖ్యమైన కార్యము. ఇక్కార్యమును సాధించుటకు విషయవిరక్తి, దృశ్యవిముఖత్వముసహాయ పడును. అంతమాత్రమే. ఏలయనిన, మనస్సు ఒకవేళ బహిర్ముఖముకాకుండఉండినను ఊరకతమస్సునందుపడియుండినచో నేమిప్రయోజనము ? ఆ విరక్తచిత్తమును ఆత్మధ్యానమందు ప్రవేశింపజేయవలెను. అపుడే జీవుని కర్తవ్యము పూర్ణముగ నెరవేరగలదు. జన్మసార్థకముకాగలదు. కావున విషయవిరక్తి ఆత్మాసక్తి రెండును అవసరములు. మొదటిదిమాత్రముండి రెండవది లేనిచో సాధన అపూర్ణముగనే యుండును. కనుకనే 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' అను బ్రహ్మసూత్రము వైరాగ్యాది సాధనచతుష్టయసంపత్తినిబొందినపిదప ఊరక యుండక బ్రహ్మచింతన, ఆత్మధ్యానము, ఆత్మవిచారణము తప్పక చేయవలెనని శాసించుచున్నది. బ్రహ్మసాక్షాత్కారమునకు వైరాగ్యమొక్కటియే చాలదని ముముక్షువులు జ్ఞప్తియందుంచుకొందురు గాక ! వైరాగ్యానంతరము మనస్సును అంతర్ముఖమొనర్చి ఏకాగ్రతతో నిష్ఠతో ఆత్మయందు నెలకొలుపవలయును. ఆత్మధ్యానమును గావింపవలయును. ఒకడు అప్పుచేసెననుకొనుడు. ఋణబాధచే పరితపించుచున్న యాతడు హాయిగా నుండవలెననిన; కేవలము అప్పుమాత్రము తీర్చివేసినచాలదు. అప్పుతీర్చినంతమాత్రమున తినుటకు తిండి యెచట దొరకును? కావున అప్పుతీర్చవలెను. సొంతముగ మఱికొంత ధనమును సంపాదించవలెను. ఈ రెండును జరిగినపుడే ఋణగ్రస్తునకు పూర్ణశాంతి కలుగ

గలదు. ఆ ప్రకారముగనే జీవుడు దృశ్యమును బుద్ధిపూర్వకముగ ముందు తొలగించవలెను. ఆ పిదప దృక్స్వరూప (ఆత్మ) చింతనమును ఆ స్థితిని సంపాదించవలెను. మొదటిది వైరాగ్యముచే కలుగును. రెండవది ధ్యానముచే సిద్ధించును. కావున శ్రీకృష్ణపరమాత్మ సాధకులకు అత్యవసరమైన ఈ ఆత్మసంయమయోగమను అధ్యాయమునందు ఆ రెండింటిని గూర్చియు ప్రస్తావించెను. ఇంతవఱకు మొదటిదియగు వైరాగ్యమును గూర్చి తెలిసికొంటిమి. ఇక ధ్యానపద్ధతి యెట్టిదో, గీతాచార్యుడు దానిని యెట్లు విశదీకరించెనో తెలిసికొందము.

పరమార్థపథమును పురోగమించు సాధకునకు ధ్యానాభ్యాసము అత్యావశ్యకమైయున్నది. ఒక వస్తువును గూర్చి తదేకనిష్ఠతో ధ్యానించునపుడు ధ్యాతయొక్క చిత్తమంతయు ధ్యేయాకారముగ పరిణమించిపోవును. ఇది ప్రకృతియందుగల నియమము. కీటకము (పురుగు) భ్రమరమును (తుమ్మెదను) నిరంతరము చింతన జేయుటవలన భ్రమరాకారముగ మారుచుండునని లోక ప్రతీతి. దీనినే భ్రమరకీటన్యాయమనియు అందురు. చిత్తము ఒక అద్దమువంటిది. అద్దము తనపురోభాగమున నేదియుండునో దానిని తనయందు ప్రతిబింబింపజేసికొని తద్రూపమును బొందుచుండును. అట్లే చిత్తము కూడ. అసురసంపత్తి, దయ్యపు స్వభావము దానియందుంచిన చిత్తము ఆ యసురరూపమునే పొందును. దైవసంపత్తి, సత్త్వగుణస్వభావము దానియందుంచిన చిత్తము ఆ సత్త్వగుణరూపమునే పొందును. కావున పారమార్థిక శ్రేయముకొరకై, సత్యశుద్ధబుద్ధము క్రమగు హృదయస్థ పరమాత్మనే ధ్యానించుచు చిత్తమును అద్దానియందే

ప్రతిష్ఠింపజేయవలెనని భగవాను డీ యధ్యాయమున తెలిపి యున్నాడు.

ఆత్మ సంస్థం మనః కృత్వా న కించిదపి చిన్తయేత్. (6_25)

"మనస్సును బాహ్యమునుండి మఱల్చి అంతర్ముఖమొనర్చి ఆత్మ యందు స్థాపించి ఆత్మేతరమగు యద్దానిని చింతింపరాద"ని ఆదే శించెను. ధ్యానమందు ఏమి చేయవలెనో ఈ శ్లోకపాదము స్పష్టముగ పేర్కొనినది. ఈప్రకారముగ మనస్సు ధ్యాననిష్ఠచే క్రమముగ తనయందలి రజోగుణ, తమోగుణములను, వాసనా మాలిన్యమును పారద్రోలి క్రమముగ ధ్యేయాకారమగుఆత్మ స్వరూపమునే పొందుచున్నది. ఉప్పుకల్లు సముద్రములో పడి సముద్రాకారమును జెందునట్లు సామాన్యమగు చిత్తము ధ్యానాదులచే ఆత్మయందు విలీనమై మహత్తరమగు ఆత్మ రూపముగనే మారిపోవుచున్నది. అదియే మోక్షము. ఈ ప్రకారము ధ్యానము మోక్షప్రాప్తికి హేతుభూతమగుటచే సర్వులకును ఇయ్యది అత్యావశ్యకమైయున్నది. 'జ్ఞానాద్ధ్యానం విశిష్యతే' (వాచాజ్ఞానముకంటె ధ్యానము ఎన్నియోరెట్లు అధికమైనది) అని భగవానుడు దీని యాధిక్యతను గూర్చి తెలిపియున్నాడు. కావున అట్టి ధ్యానము నెట్లు శీలించ వలెనో ఇపుడు తెలిసికొందము—

గృహమందుగాని, మఠమందుగాని ధ్యానించుట కొక చోటు నెన్నుకొని దానిని చాల పవిత్రముగ నుంచవలెను. "బాహ్యాభ్యన్తరశ్శుచిః" అనునట్లు అంతఃకరణ శుద్ధియే ముఖ్యము కాని తక్కినదానితో మన కేమి పని యని తలంచక బాహ్యపరిసరములున్ను శుద్ధముగా నుండునట్లు చూడవలెను. మలినప్రదేశములందుండువారికి మలినసంకల్పములేఉదయించు

చుండును. దేవాలయములను ప్రతిరోజు ఊడ్చి, కడిగి, ధూప దీపములు వెలిగించి పవిత్రవంతముగ నుంచుటకు కారణ మేమి? అచట ప్రవేశించిన వారికి అందరికిని ఆ శుచిశుభ్రతల వలన, దైవసాన్నిధ్యమువలన ఉదాత్తభావములు కలుగుట కొఱకే. కనుకనే ధ్యానపద్ధతిని చెప్పుట కుపక్రమించుచు భగవానుడు 'శుచౌదేశే' - (నిర్మలప్రదేశమునందు) అని సూచనిచ్చెను. దేశే - 'ప్రదేశమందు' అని సర్వసామాన్యము (General) గ చెప్పుటవలన ఇల్లుకాని, వనముకాని, మఠముకాని, పర్వతగుహకాని, ఏదియైనను సరియే ధ్యానమునకు యోగ్యమేయని తెలియుచున్నది. అట్లుకానిచో 'వనే, ఆశ్రమే, ఆరామే, పాతాలే' అని చెప్పియుండెడివాడు. అట్లు చెప్పలేదు. కాబట్టి గృహస్థాశ్రమమునందున్నవారు ఇండ్లలో ధ్యానము జరుగునా! అను సందియ మేమాత్రము పెట్టుకొనక ఇంటిలో నొక గదిని ప్రత్యేకముగ పూజార్చనాధ్యానాదులకై నియమించి భగవానుడు తెలిపినట్లు దానిని శుచివంతముగ నుంచుకొనవలెను. దానిని గోమయముతో అలికి, ముగ్గులుపెట్టి, అగరువత్తి, సాంబ్రాణి మొదలగు సుగంధద్రవ్యములను చేర్చుకొని, దీపారాధనగావించి, అవతారపురుషులు మహనీయులు నగువారి పటములతో నా ప్రదేశము నలంకరించి దేవమందిరముగ తయారుచేసికొనవలయును. చంటిపిల్లలను లోనికి రానీయగూడదు. ఏలయనగా వారు శబ్దము చేయుదురు. పశువికారములను కలుగజేయు శృంగారపటములను వేనిని అట చేర్చరాదు. ఒక వ్యక్తి ఏ స్థితియందున్నాడో, ఏ గుణము నాశ్రయించియున్నాడో, అతని యింటిలో తగిలించియుండు

పటములను చూచి చెప్పవేయవచ్చును. సత్త్వగుణము నాశ్రయించియుండువ్యక్తి తనయింటిలో రామకృష్ణాద్యవతారముల యొక్కయు, ఇతర దేవతలయొక్కయు, మహాత్ములయొక్కయు పటములను తగిలించుకొనును. రజోగుణము నాశ్రయించి యుండు వ్యక్తి రాజకీయవేత్తలయొక్కయు, ప్రాపంచిక మిత్రులయొక్కయు పటములను తగిలించుకొనును. తమోగుణము నాశ్రయించియుండు వ్యక్తి పాశవికభావములను రగుల్కొల్పు బూతుబొమ్మలను తగిలించుకొని ఆనందించుచుండును. కాబట్టి తరింప నుద్దేశముకల సాధకుడు తన పరిసరములను పునీతముగ నొనర్చుకొని అపవిత్రవస్తువులను జేర్చక, ఉన్నతభావములకు అవకాశమిచ్చు కార్యములనే చేయుచు, క్రమముగ ధ్యానమును అభ్యసించవలెను.

ధ్యానము చేయునపుడు సాధ్యమైనంతవఱకు ఒంటరిగ నుండుటయే మంచిది. సామాన్యముగ ఇద్దఱు ముగ్గురు కలిసి ఒకేచోట ప్రక్కప్రక్కన కూర్చుండి ధ్యానము ప్రారంభించినచో, వాడేమి చేయుచున్నాడో చూడవలెనని వీనికి, వీడేమి చేయుచున్నాడో చూడవలెనని వానికి సంకల్పములు కలిగి విక్షేపము జనించుచుండును. 'ఏక్ నిరంజన్'—అను సామెత మీరు వినియే యున్నారుకదా. 'దో గడబిడ్'-అనిమాత్రము జ్ఞాపకముంచుకొనిన చాలును. కనుకనే గీతాచార్యుడు ధ్యానమెట్లు చేయవలెనో చెప్పుటకు ప్రారంభించుచు 'రహసిస్థితః'-(ఏకాంతముగ ధ్యానము సలుపవలయును)-'ఏకాకీ' (ఒంటరిగ ధ్యానింపవలెను)- అని హితవు పలికియున్నాడు. కొందఱు ధ్యానించునపుడుకాని సంధ్యావందనము చేయునపుడుకాని

బహిరంగస్థలములందు కూర్చొనుచుందురు. తాను పరమ భక్తుడని పలుగురు తెలిసికొనవలెనని వారి ఉబలాటము. ఇట్టి ప్రదర్శన (exhibition) స్వభావము ధ్యాతకు ఉండరాదు. ధ్యానముకాని, ప్రార్థనకాని, జపముకాని, పూజకాని, భక్తునకు భగవంతునకు సంబంధపడిన క్రియయే కాని, దారినపోయే వారితో సంబంధపడినది కాదు. పైగా ఒకరి మెప్పుకొఱకు చేయబడునదియు కాదు. తానుధ్యానించుచున్నాడని పత్రికలలో పడవలసిన అగత్యమున్ను లేదు. మన హృదయసాక్షియగు సర్వేశ్వరు డొకడు తెలిసికొనిన చాలును. ఆతనికో, మనము ఏమూలధ్యానించినను తెలిసికొనుశక్తి ఉండనే ఉన్నది కాబట్టి సాధకుడు ఏకాంతముగ, ఒంటరిగ ధ్యానించుట శ్రేయస్కరము.

మిక్కిలి యెత్తుగాను, మిక్కిలి పల్లముగాను లేనట్టి స్థానమున (అనగా ఒకింత ఎత్తులోనున్న చిన్నపీట మొదలగు వానిపై) దర్భాసనము పఱచుకొని, దానిపై జింకచర్మము కాని పులిచర్మముకాని వేసికొని, దానిపై గుడ్డపఱచి - ఈ ప్రకారముగ మెత్తగ, కదలకయుండు ఆస్తరణముపై తనకు అనుకూలమైన ఆసనము వైచికొని కూర్చుండి ధ్యానము ప్రారంభింపవలెను.

స్థిర సుఖ మాసనమ్

అని పతంజలి నుడివినట్లు ఏ ఆసనము వేసికొనిన తాను కదలక నుండగలడో ఏది తనకు అనుకూలముగనుండునో దానినే ధ్యాన కాలమున సాధకుడు అవలంబించవచ్చును. అయితే కూర్చొనునపుడు శరీరము కంఠము శిరస్సు ఏమాత్రమువంగకుండనిటారు (Perpendicular) గ నుండవలెను. ఏలయనిన బొడ్డుక్రింద

మూలాధారమున నిద్రించుచునుండు కుండలినీశక్తి తీవ్ర ధ్యానముయొక్క ప్రభావముచేలేచి ఊర్ధ్వముఖముగ ప్రవహింప జొచ్చును. మూలాధారమునుండి బయలుదేరి స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞేయ, సహస్రారములను షట్చక్రములగుండ ప్రవహించును. అత్తఱి శరీరాద్యవయవములు తిన్నగ నున్నచో ప్రవాహము నిరాటంకముగ జనును. వంకరగ నున్నచో కొంత ప్రతిబంధము కలుగవచ్చును. కనుకనే శ్రీకృష్ణపరమాత్మ 'సమంకాయశిరోగ్రీవం' అని పేర్కొనెను. ఈప్రకారముగకూర్చుండి, దృష్టిని ముక్కుచివర (నాశికాగ్రమునందు) ఉంచి దిక్కులను చూడకుండ మనస్సును ఏకాగ్రపఱచి పరమాత్మచింతనమును ప్రారంభించవలెను. గీతయందు నాశికాగ్రదృష్టి చెప్పబడినది. కొందఱు భ్రూమధ్యమందు దృష్టిని నిలిపి ధ్యానింతురు. మఱికొందఱు హృదయస్థానమందు నిలుపుదురు. వేఱొకరు సహస్రారమందు నిలుపుదురు. వారి వారి అనుకూలమునుబట్టి ఏదియో యొకచోటు స్థిరపఱచుకొని అచ్చోట దృష్టినుంచి మనస్సును దృశ్యవిషయములపై చెదరనీయక ఏకాగ్రముగ దైవధ్యానము సలుపవలెను.

కాని కొందఱికి ప్రారంభములో మనస్సు ధ్యేయవస్తువగు పరమాత్మయందు నిలుకడను బొందక పూర్వవాసనాబలముచే బయటకు పరుగెత్తుచుండును. వారికి పాపము ధ్యానము చేయవలెనను కుతూహలముండునుగాని మనస్సుచంచలముగా నున్నదై వేధించుచుండును. లక్ష్యమందు నిలువక పారిపోవుచుండును. అపుడు సాధకు డేమి చేయవలెను? దానికి శ్రీకృష్ణమూర్తి ఇట్లు సమాధాన మొసంగెను.

యతో యతో నిశ్చరతి మనశ్చంచల మస్థిరమ్
తత స్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్. (6-26)

'మనస్సు చంచలముగను, అస్థిరముగ నున్నదై ఏయే విషయములపైకి పరుగెత్తునో, ఆయా విషయములనుండి దానిని మరల్చి, దానికిబుద్ధిచెప్పి, మరల ఆత్మయందే యుంచవలెను'. 'లాలయేత్ చిత్తబాలకమ్' అని పెద్దలు చెప్పినట్లు, చిత్తమను బాలుని హితవాక్యములచే మెల్లగ లాలించి దారికి తీసుకొనిరావలెను. అంతేకాని బలాత్కారముచేసినచో అయ్యది తిరుగబడును. ప్రతిక్రియ (Reaction) కలుగజేయును. అట్టి సాధనపద్ధతులను ధ్యానసిద్ధు లెన్నటికిని అవలంబించకూడదు. ఉద్దాలకుడు తన ఇంద్రియములకు, మనస్సునకు ఎంత నయముగ బోధించి వానిని స్వాధీనపఱచుకొనెనో సాధకులు జ్ఞాపకమునకు తెచ్చుకొనవలెను. 'ఓ మనస్సా! ఓ ఇంద్రియములారా! మీ రెచటికి పరుగెత్తెదరు? విషయములపైకా? చాల పొరపాటు. అయితే అది మీ తప్పుకాదు. అనేకజన్మార్జితములగు ప్రాపంచికవాసనల వలననే మీ కట్టి బుద్ధి కలుగుచున్నది. ఇంతకాలమువఱకు మిమ్ములను ప్రేరేపించిన యీ బుద్ధి అవిద్యావృతమై అంధకారమున బడియున్నది. ఇప్పుడు సద్గురు కటాక్షమున జ్ఞానముదయింపఁ అవిద్య అంతరించిపోవ వస్తువుయొక్క యథార్థత్వము గోచరించినది. మీరింతగ నభిలషించుచున్న యీ పదార్థములు సత్యములుకావు. ఎల్లప్పుడునుండునవికావు. ఆనందజనకములు అంతకంటెనుకావు. క్షణికపదార్థము ఆనంద మెట్లు కలుగజేయ గలదు? నాశశీలమగు వస్తువునుండి నిరతిశయసుఖ మెట్లావిర్భవించగలదు? ఒకవేళ ఆ పదార్థములు రమణీయములుగనున్న

వనియందురా! అది ఆపాతరమణీయత్వమే కాని వాస్తవ సౌందర్యముకాదు. పంచభూతాత్మకములై కాలక్రమమున నశించిపోవునవియు, క్రుళ్ళి కృశించిపోవునవియు నగు పదార్థములందు ఏలాటి రమణీయత్వముండునో మీరే యోచించుకొనుడు. మోసపోవద్దు. బంగారులేడిని చూచి సీత మోసపోయినది. అది సత్యమని భ్రమంచి దానిని కాంక్షించినది. ఫలితమేమైనదో మీకు తెలియునుగదా! శ్రీరామచంద్రుని పోగొట్టుకొనినది. ఆత్మారామునకు (సుఖము నకు) దూరమైనది. శోకమావరించినది. కావున మీరున్ను ప్రపంచముయొక్క తళుకుబెళుకులనుజూచి మురిసిపోయి వాని వెంట పరుగెత్తితిరా, మోకాటిదెబ్బలుతప్ప మరేవియుమీకు మిగులవు. ఎండమావులను జూచి చెంబులు తీసుకొని పరుగెత్తు వారికి ఎన్ని నీళ్ళు లభించునో మీకును అన్నియేలభించును! మీ జన్మహేతుకమగు ఆత్మానందము ననుభవించుటకై సన్నద్ధులు కండు. దానికొరకై మీరు దూరముగ పరుగిడనవసరములేదు. అది మీచెంతనేయున్నది. బహిఃప్రవృత్తిని వదలి అంతర్ముఖులు కండు. మీకది కరతలామలకమైపోవును. జన్మ సఫలమగును. కావున ఓ ఇంద్రియములారా! ఓమనస్సా! అనేకజన్మలయందు బాధపడినది చాలును. ఇప్పటికైనను బుద్ధి తెచ్చుకొని, చెంపలు వాయించుకొని, భగవానుని యీ దేశమును పాటించి 'న తేషు రమతే బుధః' అనునట్లు భోగజాలమందు రమింప కుడు. పదార్థవ్యామోహమును విడనాడుడు. జీవితము అతి స్వల్పమైనది. మృత్యువు శరీరమును కబళించుటకు పూర్వమే మీలక్ష్యమగుపరమాత్మను చేరుకొనుడు. 'ఉత్తిష్ఠత, జాగ్రత,

ప్రాప్యవరాన్ నిబోధత-లెండు! మేలుకొనుడు! పెద్దల నాశ్రయించి అవిద్యనుండి తెప్పరించుకొనుడు!'-అని యీ ప్రకారముగ ఆ యింద్రియమనంబులకు మెల్లగా హితబోధచేసి దృశ్య విషయములనుండి వానినెట్లైన మఱల్చి ఆత్మయందు స్థాపితము చేయవలెను. ఇంత బోధించినప్పటికిని మనస్సు ఒప్పకున్నట్లు ఒప్పుకొని, కొంతసేపటికి మరల తటాలున జారిపోవును. అత్తరి నిరుత్సాహపడకుండ మరల వెనువెంటనే దానిని తీసుకొనివచ్చి అధిష్ఠానమగు ఆత్మయందు హృదయమందు చేర్చవలెను. ఇంతకు మినహా వేఱొక దారిలేదు. ఇట్లు చేయుచు రాగా రాగా, కొంతకాలమున కిక ఆ మనస్సు తన పాతపద్ధతులను మార్చుకొని, పాతదారులను వదలిపెట్టి స్వాధీనపడగలదు.

పూర్వము శ్రీరామకృష్ణపరమహంసను ఒక భక్తుడు సమీపించి 'అయ్యా! నా మనస్సు ధ్యానకాలములో నిశ్చలముగా నుండుటలేదు. ఏదైన ఉపాయము సెలవిండు' అని ప్రార్థింప, నాతడిట్లనియె- "మీ యింటికి ఒకరోజున ఒక కుక్క వచ్చినది యనుకొనుడు. అది చూచుటకు బాగుగ నున్నదని తలంచి ఒక పిడికెడు అన్నము దానికి పెట్టినచో అది యేమి చేయును? తినివెళ్ళి మరుసటిరోజు మరలవచ్చును? మరల ఒక పిడికెడు అన్నము మీరుదానికిపెట్టినచో, ఇక ప్రతి రోజునూ మీయింటికి వచ్చుచునేయుండును. ఈ ప్రకారముగ కొన్ని సంవత్సరములు దానిని బాగుగ మేపినచో, అలవాటుపడి ఇక మీయిల్లు వదలనే వదలదు. కొట్టినను తిట్టినను పోదు. దానిని వదిలించుకొనవలెననిన మీరేమి చేయవలెను? ఒకటే ఉపాయము కలదు. దానికి అన్నము పెట్టకుండుడు. అది దాగానే

బెత్తముఁ దీసికొని తరిమివేయవలెను. ఇవ్విధముగ కొన్నిరోజులు వరుసగా దానిని దండించుట మొదలుపెట్టినచో, అది చూచి చూచి విసుగెత్తి మరల రాకుండును. ఆప్రకారముగనే అనేక జన్మలనుండి మనస్సునకు దృశ్యపదార్థములయందు మేపు లభించుచుండెను. అది అడిగినది యంతయు మనము ఇచ్చుచుంటిమి. కోరినదియంతయు కిక్కురుమనకుండ సమకూర్చుచుంటిమి. ఇవ్విధముగ శబ్దస్పర్శాది విషయభోగములను అది బాగుగ తినమరిగినది. ఇక సది చెప్పినమాట వినునా? బయటకు పోవలదనిన ఒప్పుకొనునా? ధ్యానమందు నిశ్చలముగనుండుమని హితము చెప్పిన పాటించునా? పాటింపదు. తనకు అలవాటుపడిన త్రిభువనసంచారమునే ఆశ్రయించును. ప్రాపంచిక భోగ్యవస్తువులపైననే వ్రాలుచుండును. అప్పుడేమి చేయవలెను? కుక్కబెడద తప్పించుకొనుటకు ఏమిచేసితిరో అదియే చేయవలెను. మనస్సు విషయములపై వ్రాలినపుడు దానికి ఆ విషయాహార మొసంగక, భోగముల ననుభవింపజేయక వివేకమను కఱ్ఱ చేబూని అటనుండి తరిమివేయవలెను. అట్లు తరిమినను, పూర్వాభ్యాసవశమున మరల పోవుచునేయుండును. కాని ప్రయత్నము వదలక మరల మరల గెంటివేయుచుండినచో కొన్నాళ్ళకిక మరల నచ్చోటికి వెడలకుండును. ఈప్రకారముగ మనస్సెపుడు బాహ్యవస్తువ్యామోహమును వదలించుకొనునో అపుడుస్వస్థానమగుహృదయమందే (ఆత్మయందే) నిలుకడకలిగి యుండును. అత్తఱి పరమాత్మధ్యానము చక్కగ జరుగును.

కొన్ని ఇండ్లలో దొంగపశువు లుండును. అవి పగలు కాని, రాత్రిళ్ళుకాని ఇతరుల చేలలోపడి దొంగమేపు మేయు

చుండును. పొలముల యజమానులు వానిని తరిమివేసినచో దూరముగ పారిపోయి మరల ఏ తోటలోనో జొరబడి అల్ల కల్లోలము చేయుచుండును. దానిచే పశువుల సొంతదారునకు ఊరివారినుండి ఫిర్యాదులు వచ్చుచుండును. ఆ యవమానమును భరింపలేక ఆతడేమిచేయును? బయట ఏ గడ్డి దొరకుచుండునో దానికంటె మంచిగడ్డిని ఇంటియొద్దనే వేసి మేపును. అపుడిక నయ్యది బయటకుపోక ఇంటనే కనిపెట్టుకొని యుండును. అట్లే తుచ్ఛమై, క్షణికమై, నశ్వరమై, దుఃఖమిశ్రితమై, ప్రతిబింబరూపమైనట్టి అల్పానందమునుండి మనస్సును విరమింపజేయవలెనినిన అనంతమై, శాశ్వతమై, బింబభూతమైనట్టి ఆత్మానందమునందు దానిని ప్రవేశపెట్టవలెను. దాని మహిమను మనస్సునకు చవిచూపవలెను. ఒక్కపర్యాయము రుచిచూచెనా, ఇక వదలదు. కాబట్టి అట్టి సచ్చిదానందమునుగూర్చి చిత్తమునకు బోధించి, బాహ్యవిషయములనుండి దానిని మరల్చవలెను. దీనినే ప్రత్యాహారమందురు.

ఇవ్విధముగ ఇంద్రియమనంబులకు హితము చెప్పవలెననిన బుద్ధి ఎంతయో తీక్ష్ణముగను ధైర్యోత్సాహ సమన్వితముగను నుండవలెను. 'బుద్ధ్యా ధృతిగృహీతయా' (ధైర్యముతో గూడిన బుద్ధిచే మనస్సును స్వాధీనపఱచుకొని ఆత్మయందుంచవలెను) అని భగవానుడు తెలిపియున్నాడు. అధైర్యమునకు పిరికితనమునకు అధ్యాత్మరంగమున తావులేదు. ప్రకృతిని, అవిద్యనుజయించుట సామాన్యమైనపనికాదు. అపనికి

"Muscles of iron, nerves of steel, and gigantic wills"

"ఇనుపకండరములు, ఉక్కునరములు, గంభీరబుద్ధులు" అవసరములై యున్నవి. ఉపనిషత్తులన్నియు ఈసత్యమునే ఘోషించుచున్నవి. ఆత్మ బలహీనునిచే పొందబడజాలదని ముండకోపనిషత్తు తెగవేసి చెప్పినది. ఒకానొక ధీరుడుమాత్రమే దృష్టిని అంతర్ముఖముగ మరల్చి ప్రత్యగాత్మను దర్శింపగలుగుచున్నాడని కఠోపనిషత్తు పలుకుచున్నది. ధైర్యమును జేబట్టినచో మాయను తరిమికొట్టవచ్చును. ధైర్యమొకింతేని సడలినచో మాయ మనలను తరిమికొట్టును. ఇదియే ఇచటగల రహస్యము. ఒక పిల్లవానిని కోతి తరుముచుండెను. వాడు పారిపోవుచుండ త్రోవలో నొక పెద్దమనిషి 'నాయనా! పారిపోవద్దు; వెన్నుచూపినచో అది ఇంకను నిన్ను తరుమగలదు. కావున వెనుకకుతిరిగి కోతిని ధైర్యముతో ఎదుర్కొనుము (Face the devil)' అని చెప్ప నాతడట్లే చేయగా తత్క్షణమే కోతి భయపడి పారిపోయెను. ప్రకృతితోటి మనముచేయు సంగ్రామమున్ను ఇట్లే యుండును. ధైర్యము, నిర్భయత్వము, నిర్విచారత్వము - ఇవియే పరమార్థరంగమున మూలమంత్రములు. ఇవి కలవానికే అట దారి దొఱకును, తక్కినవారికి దొఱకదు.

కావున భగవానుడు తెలిపినట్లు ధైర్యము నవలంబించి, మెల్లమెల్లగ మనస్సును స్వాధీనపరచుకొనవలెను. గడిబిడపడగూడదు. కంగారుపడువాడు తన కర్తవ్యమునుకూడ మఱచిపోగలడు. ఉరిత్రాటిని నెమ్మదిగా ఊడదీసుకొనవలెను. తొందఱపడినచో ఉచ్చు ఇంకనుబిగిసి ప్రాణాంతమును కలుగజేయగలదు. కనుకనే గీతాచార్యుడు సాధకుని ఉద్దేశించి "శనైః శనైః" (మెల్లమెల్లగా) అని ఉపదేశించెను. కొందఱు తీవ్ర వైరాగ్య

ముచే ప్రేరితులై అంతయును వదిలిపెట్టి ఒక పర్యాయము అమాంతముగ మోక్షమునకు గంతువేయ వలెనని తలంచి, తుదకు తన మనస్సును జయింపనేరక, దేహమును మాత్రము ఉపవాసాదులచే క్షోభపెట్టి ఉభయభ్రష్టతను బొందుచున్నారు. అదిచూచియే శ్రీకృష్ణమూర్తి 'సాధకుడా! ఒక్కొక్క నియమమును ఆచరణలో పెట్టుకొనుచు, తొందరపడక, మనస్సును ప్రశాంతముగ లొంగదీసికొనుము' అని హితము చెప్పెను.

ఇంతియేకాదు, ధ్యానకాలమున సాధకు డవలబించవలసిన మఱికొన్ని జాగ్రతలనుగూడ భగవాను డీయధ్యాయమున పొందుపఱచెను. అవి యేవియనిన, అధికముగ తినగూడదు. తిండిలేకుండను ఉండరాదు; అధికముగ నిద్రించరాదు. నిద్రలేకుండను ఉండరాదు. ఇవ్విధముగ మధ్యమార్గ మవలంబించవలెనని గీతాచార్యుని యభిప్రాయము. అధికభోజనమువలన కడుపు బరువెక్కి ధ్యానము సరిగా జరుగదు. ధ్యానముమాట అట్లుండనిండు, కొంచెముసేపు కూర్చుండుటకు కూడ సాధ్యపడదు. క్రిందపడి దొర్లుచు నానావస్థలు పడుచుండును. ఆయాసమును పోగొట్టుటకు భోజనమేర్పడినది. కాని మితిమీరి తినినచో ఆ భోజనమే ఆయాసమును కలుగజేయును. దాని పేరే భుక్తాయాసము. జనులు కోరి తెచ్చుకొను జబ్బు ఇది. దానివలన మూడు అనర్థములు కలుగుచున్నవి-(1) భుక్తాయాసము తీర్చుకొనుటకు క్రిందపడి దొర్లుటలోను, నిద్రించుటలోను ఒకటి రెండు గంటల సమయము అమూల్యమగు ఈ మానవ జీవితములో ప్రతి దినము వ్యర్థమగుచున్నది. (2) తాను అధికముగా తినుట వలన, ఒక ప్రాణియొక్క ఆహారములో కొంతిభాగము తన్క

రించినట్లే యగుచున్నది. తాను మితముగ భుజించినచో తనకు మిగిలిన ఆహారమువలన అన్నమో రామచంద్రాయని అల్లాడు బీదజనుడొకడు పోషింపబడునుగదా! కావున అధికభోజనము వలన పరప్రాణియొక్క ఆహారమును దొంగిలించిన మహాపాతకము సంభవించుచున్నది. (3) తన ఆరోగ్యము భంగమైపోవుచున్నది. డాక్టర్లను అడిగినచో ఎక్కువరోగములు సమయము తప్పి భుజించుటవలననే కలుగుచున్నవని చెప్పుదురు. ఇవి యన్నియు ఇచ్ఛాప్రారబ్ధమువలన కలుగు రోగములు, కొని తెచ్చుకొను వ్యాధులు. కావున ఈ మూడు అనర్థములున్ను లేకుండుట కొఱకై సాధకుడు ఆహార విషయములో బహు జాగ్రత వహింపవలసియుండును. మితాహారమును సేవించవలెను. మితాహార లక్షణము లేవి యనిన-

ద్వాభాగౌ పూరయేదన్నైః తోయేనైకం ప్రపూరయేత్
మారుతస్య ప్రచారార్థం చతుర్థ మవశేషయేత్.

కడుపు మొత్తమును నాలుగు భాగములుగ చేసినచో, అందు రెండు భాగములను, అనగా సగము కడుపును అన్న శాకాదులతో నింపవలెను. ఒక భాగము అనగా పాతిక కడుపును నీళ్ళతో నింపవలెను. మిగతా పాతికభాగమును గాలియాడుట కొఱకు ఖాళీగా నుంచవలెను. శాస్త్రము ఈప్రకారముగ చెప్పుచుండ, మనవారు రెండు భాగములుకాదు, మూడుభాగములు కాదు, నాలుగు భాగములున్ను అన్నముతో నింపి, నీళ్ళు త్రాగుటకుకూడ చోటులేక, గాలి ఆడుటకు అసలే లేక, త్రేపువచ్చినచో కొంత ఖాళీకాగా దానినికూడ ఒకటి రెండు గారెలతో

తిరిగి నింపుటకు యత్నించుచుందురు. ఇట్టివారికి ఎన్ని జన్మలకు ధ్యానమబ్బునో భగవంతునకే తెలియక.

అయితే, ఆహారము ఏమాత్రము స్వీకరింపక కేవలము నిరాహారులుగ నుండువారికిన్ని ధ్యానము కుదరదని గీతయందు చెప్పబడినది. ఏలయనగా, శరీరము ఆహారముయొక్క స్థూలాంశముచేతను, మనస్సు సూక్ష్మాంశముచేతను ఏర్పడును. ఎప్పుడు ఆహారమే లేకయుండునో, అపుడు తత్ఫలితముగ శరీరము, మనస్సు రెండును శుష్కించును. అ త్తరి చింతనకే అవకాశ ముండదు. జడముగ రాతివలె పడియుండవలసియుండును; లేక నిద్రించవలసివచ్చును. తమోగుణసంబంధమగు అట్టి స్థితివలన జీవునకేమాత్రమున్ను ప్రయోజనములేదు. పూర్వము ఉరూవ లారణ్యమున తపస్సు చేయునపుడు బుద్ధదేవు డిట్లే పొరబడి ప్రారంభమున ఆహారము నేమియు గ్రహింపక శరీరమును క్షీణింప జేసెను. దానివలన మనస్సును జడత్వమునొంది ధ్యానమే కొన సాగలేదు. కూర్చొనుటకున్ను శక్తిలేక యుండెను. ఆ త్తరి సమీప గ్రామమునకు బహుప్రయాసతో జని కొంచెము పిడు గన్నము భుజించి తెప్పరించుకొనెను. అప్పటినుండియు బుద్ధ దేవుడు "యుక్తాహార విహారస్య యుక్తచేష్టస్య కర్మసు" - [ఆహార విహార వ్యవహారములన్నియు మధ్యగతముగ నుండ వలెను]- అను గీతాచార్యుని యుపదేశమును కార్యాన్విత మొనర్చుచు నిరాటంకముగ ధ్యాననిష్ఠ నలువదొండగెను. ఆహారమునకు తెలిపిన ఈ నియమము నిద్రకుకూడ వర్తించునని గుర్తెరుంగవలెను. అనగా ధ్యానశీలుడు అతినిద్రను, కేవల జాగరణమును రెండిటిని విడనాడి మితమైన నిద్ర కలిగియుండ

వలెను. దీనినిబట్టి సాధకుడు ధ్యాననిష్ఠాదులందు పురోభివృద్ధినిబడయుటకు ఇరువురు డాక్టర్లను ఆశ్రయించవలసి వచ్చునని యు, వారిరువురునుక్రమముగ("Doctor Diet, Doctor Quiet") - ఆహారమును, విశ్రాంతి అనియు తేలుచున్నది. వారిరువురి చక్కని సలహాలను పాటించినచో ధ్యానము సాఫీగా జరిగిపోగలదు.

ఇంతవఱకు ధ్యాననిష్ఠుడు అవలంబించవలసిన పద్ధతులు, తీసుకొనవలసిన జాగ్రతలు, మున్నగునవి చెప్పబడినవి. అనగా ధ్యాన ముపక్రమించుటకుముందు గైకొనదగు ఏర్పాట్లన్నియు (Preliminary arrangements) వివరించబడినవి. క్షేత్రమును దున్ని, కలుపుతీసివేసి శుద్ధపఱచినాము. ఇక విత్తనము నాటవలెను. అదియే ధ్యానము. ధ్యానమనగానేమి? దేనిని ధ్యానించవలెను? ఎట్లు ధ్యానించవలెను? అను ప్రశ్నలను సాధకుడు ముఖ్యముగ తెలిసికొనవలసియున్నాడు. భగవద్గీతాను సారము సంక్షేపముగ వాని నిచట వివరించుటకుయత్నించెదను.

'తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్.'

'ఇతరత్ర మనస్సును పోనీయక ధ్యేయవస్తువుపైననే నిలుపుట ధారణ యనబడును. ఆ వస్తువునుగూర్చి తదేకనిష్ఠతో చింతన జేయుట, తదీయ భావనా ప్రవాహము కలిగియుండుట ధ్యానమనబడును'-అని పతంజలి నుడివియున్నాడు. సాకారధ్యానమందు మనుజులు, వారివారి ఇష్టదైవములయొక్క మూర్తిని మనస్సుననిలబెట్టి,తద్రూపమునేచింతనచేయుచు, తచ్చరిత్రలనే భావించుచునుందురు.నిరాకారధ్యానమందు జనులు హృదయస్థమగు పరమాత్మను గూర్చి చింతనజేయుచు, ఆతని నిత్యత్వ

నిర్వికారత్వ, అనంతత్వ, శుద్ధత్వ, నిరతిశయానందత్వములను భావించుచుందురు. జీవుడు వాస్తవముగ ఆత్మస్వరూపుడే కనుక ఈ ప్రకారముగ ఆత్మధ్యానము చేయుచురాగా క్రమముగ మనస్సు అధిష్ఠానమందు లయింప తన సహజ (ఆత్మ) స్వరూపమునే జీవుడు పొందుచున్నాడు. ప్రారంభములో ఆత్మానుభవము కలుగకపోయినప్పటికిని ఆ ఆత్మనే (బ్రహ్మమునే) నిరంతరము చింతన చేయుచుండవలెననియు, కొంతకాలమునకు ఆత్మసాక్షాత్కారము తప్పక కలుగగలదనియు శ్రీ విద్యారణ్యస్వాములవారు సెలవిచ్చిరి—

అనుభూతేరభావేఽపి బ్రహ్మాస్మీత్యేవ చిన్త్యతాం
అప్యసత్ప్రాప్యతే ధ్యానాత్ నిత్యాప్తం బ్రహ్మ కిం పునః.

(పంచదశి, ధ్యానదీపం)

"అనుభవము కలుగకున్నను బ్రహ్మమునే (ఆత్మనే) చింతన జేయవలెను. ధ్యానముద్వారా అసద్రూపములగు దృశ్యపదార్థములే లభించుచుండ, ఇక సత్యమై వాస్తవముగ తనస్వరూపమే అయియున్నట్టి బ్రహ్మ మేల పొందబడదు?" కావున శ్రీకృష్ణపరమాత్మ సాధకులకు ధ్యానపద్ధతిని బోధించుచు, మనస్సును బాహ్యప్రపంచమునుండి మరల్చి అంతర్ముఖమొనర్చి హృదయస్థమగు చైతన్యాత్మనే లెస్సగ భావించుచుండవలెనని చెప్పెను. 'మచ్చిత్తో యుక్త ఆసీతమత్పరః' అను వాక్యముయొక్క అర్థ మిదియే. శ్రీకృష్ణమూర్తి సర్వజీవుల హృదయాంతర్వర్తి, సర్వాంతర్యామి.

అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః (10-20)

అనునట్లు ఆతడు సమస్తచరాచర ప్రాణికోట్లయందును ఆత్మస్వరూపుడై వెలయుచున్నాడు. కావున తనయందు చిత్తమును

నిలుపుమని చెప్పినపుడు దేహబుద్ధీంద్రియాదులకుసాక్షిగ వెలుగొందుచున్న ప్రత్యగాత్మయందు మనస్సును నిలుపవలెనని యర్థము. లేక, ప్రారంభస్థితిలో శ్రీకృష్ణమూర్తియొక్క ఆకారమును హృదయమున భావించియైనను భక్తితో నాతనిని ధ్యానింపవచ్చును. ధ్యానమనునది క్రొత్తగ ఒకరు నేర్చుకొనవలసినదికాదు. అందఱికిని ఇదివరకే అభ్యాసమై యున్నది. అయితే ఇంతవఱకు వారు ధ్యానించుచున్నది ప్రాపంచికదృశ్యవిషయములను, నశ్వరభోగవిలాసములను. ఇప్పుడో, ఆధ్యానమునే పరమాత్మవస్తువుపై మార్చుకొనుచున్నారు. అంతియే.

యా చిన్తా భువి పుత్రపౌత్ర భరణ వ్యాపార సంభాషణే
యా చిన్తా ధనధాన్యభోగ యశసాం లాభే సదా జాయతే
సా చిన్తా యది నందనందన పదద్వంద్వారవిన్దేక్షణం
కా చిన్తా యమరాజ భీమసదనద్వార ప్రయాణే ప్రభో.

"జనులకు తమ పుత్రపౌత్రాదులను పోషించుటయందును, ప్రాపంచిక సంభాషణలయందును, ధనధాన్యభోగయశస్సులను సంపాదించుటయందును ఎంతప్రీతిగలదో, వానినిగూర్చి యెట్టి చింతకలదో, అట్టిచింత శ్రీకృష్ణపరమాత్మయొక్క పాదారవిందములపై క్షణకాలముండినచో ఇక యమధర్మరాజుయొక్క భీషణగృహద్వారమున ప్రవేశింపవలసిన అగత్యముండదు."
కావున ధ్యానప్రవాహమును దృశ్యవైభవములనుండి మఱలించి ఆత్మవైపు, భగవంతునివైపు ప్రవేశపెట్టవలయును. విద్యార్థి పరీక్షలు దగ్గఱకు వచ్చినపుడు మిగుల ఏకాగ్రతతో, తదేకదీక్షతో, పట్టుదలతో పాఠ్యవిషయములను ధ్యానించుచుండును. ఉత్సవ సమయములందుకాని, సంత జరుగునపుడు

కాని, వ్యాపారికి తుమ్ముటకుకూడ సమయముండదు. అతని చిత్తమపుడు వ్యాపారమందే పూర్ణముగనిమగ్నమైయుండును. ఇంటిలో వివాహమేదైన తటస్థించునపుడు, దానికి ముందు ఒక నెల రెండు నెలలనుండి మగవారికిగాని, ఆడవారికిగాని ఊపిరి తిరగదు. తదేకధ్యానముతో పనులు చేసికొనుచుందురు. తక్కిన విషయములన్నియు మఱచిపోదురు. పతివ్రతయగు స్త్రీ తనభర్త దూరదేశములకు వెళ్లినపుడు నిరంతర మాతనినె ధ్యానించుచుండును. అట్లే భార్యపై మక్కువగల భర్త భార్య పుట్టింటికిగాని, బంధువుల యిండ్లకుగాని వెళ్ళినపుడు ఆమెనే సతతము ధ్యానించుచుండును. అత్తఱి తక్కిన కార్యములను అంతగా పట్టించుకొనడు.

అన్యాశ్రయాణాం త్యాగో అనన్యతా. (నారద భక్తిసూత్రములు)

అని నారదులు చెప్పినట్లు ఇతర విషయములను విడిచి తదేకనిష్ఠతో ఒకానొక వస్తువును ధ్యానించుటవలన పైన తెలిపిన వారికి అనన్యత్వము సిద్ధించునదేయగును. కాని యేమిలాభము? వారు ధ్యానించునవన్నియు అశాశ్వతపదార్థములు. నశ్వరవస్తువుల చింతన మోక్షమొసంగనేరదు. కావున ఆక్రియలు వారికి పారమార్థిక ఫలమును గలుగచేయకున్నవి. కనుకనే వరము కోరుకొనుమని విష్ణుభగవానుడు ప్రహ్లాదునితో జెప్పినపుడు అతడు తన యభీష్టము నిట్లు తెలియజేసెను-

యా ప్రీతిరవివేకానాం విషయేష్వనపాయినీ
త్వామనుస్మరతస్సామే హృదయాన్మాపసర్పతు.

"మహాప్రభూ! నాకు ఇతరవరములతో పనిలేదు. అవివేకులగు వారికి చంచలములగు విషయభోగములందెట్టి ప్రీతికలదో, అట్టి

ప్రీతిని నీ పాదారవిందములను సంస్మరించుటయందు నాకు కలుగజేయుము. మఱియు అట్టి ప్రీతి నా హృదయకుహరము నుండి యెన్నటికిని వీడనట్లు అనుగ్రహింపుము." దీనినిబట్టి సర్వులకును ధ్యానపద్ధతి తెలిసియేయున్నను, అజ్ఞానమువలన ఆ ధ్యానమును, ఆ యేకాగ్రతను, ఆ పట్టుదలను, ప్రాపంచిక వస్తువులపై వినియోగించుచు, శాశ్వతఫలమును జన్మరాహిత్యమును పొందకయున్నారు.

పూర్వమొకపుడు దత్తాత్రేయులవారెచటికో యాత్రగ బోవుచుండిరి. ఒకచోట మూడుదారులు కలిసియుండెను. ఏ మార్గముగుండా పోవలెనో వారికి తెలియక, చుట్టుప్రక్కల యెవరైన యుండినచో కనుగొందమని యోచించిచూచెను. కాని అచట యెవ్వరునులేరు. సమీపమున ఒక నది ప్రవహించుచుండెను. దానియొడ్డున ఒక బెస్తవాడు గాలమును నీళ్ళలో వైచి చేపలు పట్టుచుండెను. దత్తాత్రేయులు దూరమునుండి వానిని పిలచెను. కాని పలుకలేదు. మరల పెద్దగ పిలచెను. కాని యాతడు వినిపించుకొనలేదు. మూడవపర్యాయము యింకను పెద్దగ కేకవేసెను. కాని బెస్తవాడు కిక్కురుమనలేదు. అపుడు దత్తాత్రేయులు వాని సమీపమునకు బోయి వీపుతట్టి 'ఏమయ్యా! మూడుసార్లు కేకవేసినను పలుకలేదేమి' అని యడుగ 'మహాత్మా! నా దృష్టియంతయు బెండుపైనున్నది. అది మునుగునేమో, చేప పడునేమో యను చింతయందే యుంటిని కావున మీ కేకలు వినిపించలేదు, క్షమించుడు' అని యాతడు ప్రత్యుత్తరమిచ్చెను. వెంటనే దత్తాత్రేయు లిట్లు యోచించిరి. 'ఆహా! అల్పమగు చేపకొఱకు బెస్తవాడెంతటి

యేకాగ్రతను - దీక్షను సంపాదించినాడు ! ఓహో ! తాపసు లందును నిట్టిసంయమము, ఏకాగ్రత అపురూపమే! ఈ యేకాగ్రతలో, పదునాఱవ పాలైనను భగవంతునియందుంచి ధ్యానించినచో జనులు ఎప్పుడో మోక్షమును పొందియుండెడి వారు. చక్కటిపాఠమును ఈతడు నాకు నేర్పినాడు. ఈతడు నాగురువు'-అని వచించుచు నాతనికి సాష్టాంగ దండప్రణామం బాచరించి వెడలిపోయెను.

కావున జనులు ప్రపంచకార్యములందు అనవసరముగ వ్యర్థముచేయు కాలమును, శక్తిని, బుద్ధినైపుణ్యమును కొంతనైనను పరమాత్మ చింతనమునందు వినియోగించి ధన్యతను జెందవలెను. ప్రారంభములో కొంత సమయమును ధ్యానమునకు ప్రత్యేకించి, క్రమముగ దానిని పెంచుచు రావలెను. కోరికలను తగ్గించుకొనుచు, క్రమముగ పూర్తిగ నిర్మూలింపవలయును. ఒకవైపు ధ్యానము, ఒకవైపు కామము; ఒకవైపు యోగము, ఒకవైపు భోగము-ఈ రెండింటికిని పొత్తు కుదరదు. కావుననే భగవానుడు—

సంకల్పప్రభవాన్కామాం స్త్యక్త్వా సర్వాన శేషతః (6-24)

ధ్యానమునందు చక్కని నిలుకడ బొందవలెననిన, సంకల్పజనితములగు కోరికలన్నిటిని సంపూర్ణముగ తొలగించివేయవలెనని హెచ్చరిక చేసెను. మొదటిలోనే అన్నియు తొలగకపోయినను క్రమముగ ఆ స్థితిని అభ్యాసము చేసికొనవలెను. అపుడిక చిత్తము బహిర్ముఖముకాక, నిశ్చలముగ దైవచింతనమందు లగ్నమైయుండును. గాలి వీచని స్థలమందలి దీపము వలె అచంచలముగ నుండును.

ఈ ప్రకారముగ వైరాగ్యము నవలంబించి దృష్టినంత స్సమ్ముఖమొనర్చి పరమాత్మధ్యానము చేయువారికి కలుగు ఫలిత మేమి ? ప్రయోజనములేక మందుడున్ను ఏ కార్యమందును ప్రవృత్తుడు కాడుకదా. ఇపు డెవరినైనను కొంచెముసేపు దైవచింతన చేయుమని యడిగినచో దానివలన మాకువచ్చు లాభమేమి? అని వెంటనే ప్రశ్నించుదురు. లాభము లేనిదే ఎవరును ఏ కార్యమును చేయరు. చివరకు వర్తకుడు ధాన్యమును కొలచునపుడుకూడ 'లాభం' అనియే ప్రారంభించును. కావున పరమార్థసాధనకు ఈ ధ్యానాదులవలన కలుగు ఉపకారమేమి యనగా-దానిని గీతాచార్యుడే చెప్పివైచెను.

శాన్తిం నిర్వాణపరమాం మత్సంస్థా మధిగచ్ఛతి. (6-15)

బ్రహ్మరూపమై, పరమనిర్వాణ (జననమరణనివృత్తి) దాయకమైనట్టి శాంతినే ధ్యానయోగి పొందుచున్నాడు. ప్రపంచము లోని అన్ని లాభములకంటెను అది ఉత్తమమైన లాభము. అన్ని వస్తువులకంటెను శ్రేష్ఠమైన వస్తువు. అన్ని పదవుల కంటెను శ్రేష్ఠమైనపదవి. ముల్లోకములందలి ఎంత గొప్ప పదవిని పొందినను మనుజుడు పుట్టుక చావులనుండి మాత్రము తప్పించుకొనలేడు. కావున పరమార్థదృష్టిలో అవి గొప్పవి అనిపించుకొనవు. దేనిని పొందినచో మరల ఈ సంసార చక్రమున మనుజుడుతగుల్కొనడో, ఏస్థితియందుమహత్తరదుఃఖము సంప్రాప్తించినను చలింపకయుండునో, దేనిని పొందిన పిదప నుండి చతుర్దశభువనములందలి ఏ వస్తువుపైనను అపేక్ష కలుగకయుండునో, ఏది ఆత్యంతిక సుఖస్వరూపమో అదియే ప్రపంచములోకెల్ల గొప్పవస్తువు. దానినేధ్యానయోగి పడయు

చున్నాడు. అంతకుమించి ఇక జీవునకు కావలసినదేమి? జన్మ సార్థకమైనట్లే. మఱియొక విశేషమేమియనిన ప్రపంచములోని జీవరాసులన్నియు సుఖమెక్కడ, సుఖమెక్కడ అని సుఖము కొఱకై అల్లాడుచు వెతకుచుండ, సుఖము దానియంతటనదియే బ్రహ్మనిష్ఠుని వెతకుకొనుచువచ్చి వానిపాలిట పడుచున్నది.

ప్రశాన్తమనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్
ఉపైతి శాన్తరజసం బ్రహ్మభూతమకల్మషమ్. (6-27)

'ప్రశాంతచిత్తుడును, రజోగుణ వికార రహితుడును, బ్రహ్మస్వరూపుడును, పాపరహితుడు నగు ధ్యానయోగిని ఉత్తమ సుఖమువచ్చి పొందుచున్నది.' మోక్షలక్ష్మి వచ్చి ఆతని మెడలో పూలహారము వేయుచున్నదని యర్థము. వడగళ్ళు సముద్రములోపడి సముద్రరూపమేయగునట్లు, చిత్తము ప్రత్యగాత్మను అనవరతముచింతించుచు ప్రత్యగాత్మరూపమేయగుచు నిరతిశయసుఖమును జేబట్టుచున్నది. ఇంతటి అమూల్య సుఖము తన జన్మహక్కు అయియున్నను దానికొఱకు అన్వేషించక మనుజుడు క్షుద్రవిషయ సౌఖ్యములకొఱకై అఱ్ఱులు చాచుట చాల శోచనీయము! కావున భోగవాంఛలను త్యజించి భగవానుడు గీతయందు తెలిపిన విధముగ సంయమమును, ధ్యానయోగమును అభ్యసించి బ్రహ్మానందవారాశిలో నోలలాడుదురుగాక!

ఇక ధ్యాననిష్ఠుడగు యోగిపుంగవుడు తననిత్యజీవితమునం దెట్లుప్రవర్తించునో, లోకమునం దెట్లువ్యవహరించునో, ఎట్టి యాచరణకలిగియుండునో తెలిసికొందము. ఇది తెలిసికొనుట చాల ముఖ్యమైనది. ఏలయనగా ఇపుడు లోకములో 'వాచా

జ్ఞానము ప్రబలి అనుష్ఠానము సన్నగిల్లుచున్నది; మఱికొందఱు ధ్యానకాలమున మాత్రము యోగులవలె ప్రవర్తించి, తదుపరి నిత్యజీవనమున భోగులవలె మెలఁగుచున్నారు. ఇది సరికాదు. దీనిని భగవానుడు ఒప్పుకొనడు.ఏశాస్త్రమున్ను ఒప్పుకొనదు. కనుకనే ఆత్మసంయమయోగమను ఈ అధ్యాయమందు శ్రీకృష్ణమూర్తి ధ్యానపద్ధతి, ధ్యానఫలితము మున్నగునవి యన్నియు చెప్పి, అంతటితో ఊరుకొనక ధ్యాననిష్ఠుని కైనందిన వర్తనమునుగూడ పేర్కొనుటకు కారణము.

(1) సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః (6-29)

(2) ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః (6-32)

"ధ్యాననిష్ఠుడు, లేక యోగి సమస్తప్రాణికోట్లయందును సమబుద్ధి కలిగియుండును. ఏలయనగా నాతడు తనయందు (ఆత్మయందు) సర్వభూతములను, సర్వభూతములందు తన్నును గాంచుచుండును. ఓ అర్జునా! ఎవడు సుఖమునందుగాని, దుఃఖమునందుగాని తనవలెనే ఇతరులనుగూడ చూచుకొనునో సర్వత్ర సమదృష్టిగలిగిన అట్టి యోగియే శ్రేష్ఠుడని నా యభిప్రాయము"- అని గీతాచార్యుడు యోగుల ప్రవర్తనను విశదీకరించెను. ఈ గుఱుతులనుబట్టి ఇక దంబాచారులను (Pseudo yogins), మిథ్యాచార్యులను ఉదరనిమిత్తబహుకృతవేషులను సాధుసంఘమునుండియు, భక్తసంఘము నుండియు ఏరి పారవేయవచ్చును. తనవలె పరప్రాణులను చూచుకొనుచు,పరోపకారము, దయ, ప్రేమ, కరుణ మొదలగు ఉదాత్తగుణములు కలిగియుండనిచో, ఇక నాతడు చేసిన

ధ్యానసమువలన ఫలితమేమి? ఆధ్యానము ద్వైతధ్యానమా, లేక దేహధ్యానమా? సర్వభూతకోట్లయందును 'సూత్రేమణిగణా ఇవ'—అనునట్లు మణులందు దారమువలె అనుస్యూతుడైయున్న పరమాత్మను మనస్సులో ధ్యానించిన పిదప బయటకు వచ్చి పరప్రాణులకు అపకారము చేసినచో, తాను ఇంతవఱకు ధ్యానించిన పరమాత్మకు అపకారము, తద్ద్వారా అపచారము చేసిన ట్లేకదా! ధ్యానకాలమందలి ద్వైతదృష్టిధ్యానకాలమునకే పరిమితమై యుండరాదని సాధకులు జ్ఞప్తియందుంచుకొనవలెను గాక! ఆ దృష్టి ఎల్లకాలమందును ఉండవలెను. మఱియు భగవంతుడు ధర్మస్వరూపుడు, ధర్మమూర్తి. ధర్మము పతనమైన నపుడు దాని నుద్ధరించుటయే ఆతని పని. "శాశ్వతధర్మగోప్తా" (ఎల్లప్పుడు ధర్మమును రక్షించువాడు) అను బిరుదుకూడ కలవాడు. అట్టి ధర్మస్వరూపుని ధ్యానకాలమందు, పూజాకాలమందు చింతనజేసి బయట ప్రపంచములోనికి వచ్చి అధర్మాచరణ గలిగియుండినచో వారు ధర్మద్రోహులు కాను, దైవద్రోహులే యగుదురు. శాంతము అక్రోధము మున్నగు దైవీగుణములు ఇంటిలోని పూజామందిరపు హద్దువఱకేయని కొందఱు జనులు తలంచుకొనుచున్నారు. కనుకనే వారు ఇంటిలో యోగులుగను బయట రాక్షసులుగను ప్రవర్తించు చుందురు. అట్టివారిని చూచినచో సామాన్య జనులకు సాధుసంఘము మొత్తముపైననే ఒకవిధమైన ఏహ్యభావము కలుగగలదు. కావున భగవానుని ఆదేశము ననుసరించి యోగులు, ధ్యాననిష్ఠులు, భక్తులు, జ్ఞానులు మున్నగువారంద ఱున్న తమతమ ధ్యాన, పూజా, జప, తపాదులతోపాటు

సర్వభూతదయ, జీవకారుణ్యము, మొదలైన పవిత్రగుణములు కలిగి యుండవలెను. మందు తినినంత మాత్రముచే చాలదు. పథ్యముకూడ ఆచరించవలెను. అపుడే రోగము నయమగును. అట్లే దైవచింతన ఔషధమువంటిది. ధర్మాచరణ పథ్యము వంటిది. భవరోగవినాశమునకు రెండును అవసరములే అని జ్ఞాపకముంచుకొనవలెను.

పాశ్చాత్య దేశములలో 'సౌభ్రాతృత్వము' (Brotherhood) అను ధర్మమునకు ఎక్కువ ప్రచారము కలదు. తోటి మానవుని తన సోదరునిగ తలంచుకొని ప్రేమ, సహృదయత కలిగియుండుటయే ఆ పదముయొక్క అర్థము. పూర్వము ఫ్రాన్సు దేశమందు చెలరేగిన క్రాంతి (French Revolution) సమయమున ప్రజలు తమ విజయముకొఱకు ఎన్నుకొనిన 'సమత్వము, స్వాతంత్ర్యము, సోదరత్వము (Equality, liberty, fraternity) అను మూడు నినాదములలో ఈ సౌభ్రాతృత్వము ప్రముఖస్థానము నాక్రమించినది కాని గీత 'ఈ సోదరత్వము'తో తృప్తిపడలేదు. ఏలయనగా నూటికి నూరుపాళ్ళు ప్రేమ అందు కనిపించుటలేదు. సోదరుడు సోదరుడు కలహించుకొను సంఘటనలు ఎన్నియో వార్తాపత్రికలయందు మనము చూచుచున్నాము. ప్రత్యక్షముగను అట్టివి ఎన్నియో మన ఇరుగుపొరుగులలోనే సంభవించుచున్నవి. ఒక వకీలుగారిని ప్రశ్నించినచో ఇక్కాలమున వారికివచ్చు ఎక్కువ కేసులు సోదర సోదరుల కలహములు, భార్యాభర్తల పేచీలు, తండ్రీకొడుకుల స్పర్ధలు-వీనికి సంబంధించినవే యని తడుముకొనకుండ చెప్పివేయును.

ఈమధ్య ఒకరియింటియందు తండ్రి చనిపోగా, అతనికి గల యిరువురు కుమారులు తండ్రి ఆస్తిని సరిసమానముగా పంచుకొనుటకు నిశ్చయించి సామానులన్నియు విభజించు చుండిరి. రెండు ఇండ్లు ఉండగా చెరియొక ఇల్లు తీసికొనిరి. రెండుబీరువాలుండగా చెరియొకబీరువా తీసికొనిరి. రెండురోళ్ళు ఉండగా చెరియొక రోలు పంచుకొనిరి. కాని రోకలిమాత్రము ఒక్కటే ఉండెనట. అక్కడే పేచీ వచ్చిపడినది. అది ఎవరికి పోవలెననునది తేలలేదు. ఎవరికి వారు మాకు కావలెను. మాకుకావలెను అనుచుండిరి. మధ్యవర్తులువచ్చిరి. ఎంతయో నచ్చచెప్పిరి. కాని ఆ మహావస్తువును వదలుకొనుట కెవడును అంగీకరింపలేదు. తుదకు విధిలేక ఆ రోకలిని రెండుగా త్రుంచి చెరియొకసగము ఇచ్చుటకు మధ్యస్థులు తీర్మానించిరి. కాని అక్కడకూడ మఱియొక ధర్మసమస్య ఉదయించినది. రోకలి పైభాగ మెవరికిపోవలెను, క్రిందిభాగ మెవరికి పోవలెను అని. క్రిందిభాగపు రోకలికి పొన్ను ఉన్నది. కావున 'పొన్ను ఉండే సగము నాకు కావలెను'-అని ఆ సోదరులిరువురు స్పర్థ యొనర్చు కొన దొడగిరి. అపుడు సమీపమున ఒక గొప్ప న్యాయ వాది యుండెను. అతనికి 100/-రు. ఫీజు ఇచ్చి పిలిపించు కొనిరి. అతడు వచ్చి పరిస్థితిని సాకల్యముగ జీర్ణము చేసుకొని ఈ క్రింది విధముగ తీర్పు నిచ్చెను-సోదరులారా! తొందరపడ కుడు. ఇరువురకు న్యాయము కలుగగలదు. ఈ రోకలిని అడ్డముగాగాక, నిలువుగా రెండుబ్రద్దలుచేసి చీల్చివైచినచో, పొన్నులో సగము ఒకరికి, సగము మఱియొకరికి సరిసమాన ముగ రాగలవు. కావున ఆ ప్రకారముగ చేయవలసినది. పేచీ

ఉండదు. మీ వైమనస్యము శమించుట కిది యొకటియే మార్గము! అని చెప్పి వెడలిపోయెను. వారట్లేచేసి సంతుష్టిపడిరి. కాని రెండుగా నిలువున చీల్చుటవలన ఆ రోకలి యెవరికిని ఉపయోగపడలేదు. సోదరత్వముయొక్క అధునిక వికటస్వరూపమెట్టిదో మచ్చునకిచట తెలుపబడినది. దైనందిన జీవితమునందిట్టి ఘటనలు లోకములో నెన్నియో జరుగుచున్నవి. సోదరులు పరస్పర మెంత ఆప్యాయముగ నున్నను, ఒకరికి మఱియొకరు వేరుగానున్నవారేకదా ! అందుచేత 'ద్వితీయాద్వైభయం భవతి'-అనునట్లు తనకంటె వేఱుగానున్న వానికై పరిపూర్ణముగు (100%) ప్రేమ యంకురించుట చాల యరుదు. ఏవియో భయాదులు మధ్య అడ్డుపడి పీడించును.

కావున గీత 'సోదరత్వము'ను దాటి ఒక మెట్టు పైకి పోయి 'ఆత్మౌపమ్యేన' - 'నీవలె ఇతరులను చూచుకొనుము'- అను మహోన్నత ధర్మమును ప్రతిపాదించినది.

ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః (6-32)

'సుఖమునందుగాని, దుఃఖమునందుగాని తనవలెనే యితరులను సమానముగ చూచువాడే నిజమైనయోగి. అట్టివాడే సర్వోత్కృష్టుడని నా యభిప్రాయము' - అని గీతాచార్యుండీయధ్యాయమున ఆనతిచ్చెను. ఈ శ్లోకము గీతకు మకుటము వంటిది. వైరులకు, ద్వేషులకు గొడ్డలిపెట్టు వంటిది. ఎవడును ఏకాలమందును, ఏ పరిస్థితియందును తనపై తాను ప్రీతిలేకయుండడు. మఱియు తనకు సుఖమును వాంఛింపడు. కనుకనే గీత, ఉపనిషత్తులు అట్టి "ఆత్మౌపమ్యము' నే ప్రేమకు,

స్నేహములను, సాదృశ్యముగ తీసికొనినవి. అంతియేగాని 'సోదరత్వము'ను తీసికొనలేదు. ఏలయనిన, సోదరత్వము గొప్ప లక్ష్యమైనను, పవిత్రమైనది అయియున్నను ప్రేమయొక్క పూర్ణత్వమును, పరాకాష్ఠను అయ్యది దిగ్దర్శనము చేయజాలదు.

## 'Do as you would be done by'

'నీవు నీకేమి యొనర్పదలంచుకొందువో దాని నితరులకు చేయుము'-నిన్ను నీవు సుఖపెట్టుకొనదలంచుచో అట్టి సుఖమును ఇతరులకు కలుగజేయుము. నీవు హాయిగ నుండదలంచుచో, అట్టి హాయిని ఇతరులకున్ను కలుగజేయ యత్నింపుము. ఒకరు నిన్ను బాధించకూడదని తలంతువా, అట్లే ఇతరులకున్ను నీవు బాధను కలుగజేయకుము.

ఒరులేయవి యొనరించిన
నరవర యప్రియము తన మనంబునకగు దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మ పథములకెల్లన్. (మహాభారతము.)

భారతమంతు తెలుపబడిన ఈధర్మమే గీతయందు తెలుపబడిన 'ఆత్మౌపమ్య' దృష్టి. ఇట్టి దృష్టి కలిగియున్నచో ఇక మనుజుడు భక్తియందుగాని, యోగమందుగాని, జ్ఞానమందుగాని ఆరితేరినట్లు లెక్క. అదిలేనిచో, ఇంకను ఆయా యోగములు సరిగ అబ్బలేదని తెల్సుకొనవచ్చును. దేవుని భజించి, జీవుని భుజించినచో ఏప్రయోజనమున్ను లేదు. నారాయణుని పూజించి నరనారాయణుని దూషించినచో లాభములేదు. విష్ణువును ధ్యానించి ధర్మమును ధిక్కరించినచో ఆ ధ్యానమునకు విలువ

అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః
తే హరేర్ద్వేషిణః పాపా ధర్మార్థం జన్మ యద్ధరేః

లేదు. సత్యమును, ధర్మమును తృణీకరించి 'కృష్ణా,కృష్ణా' యని నోటితో పలికినంతమాత్రమున ఎవడును భక్తుడు కానేరడు. పైగా ఒకదృష్టిలో నాతడు కృష్ణుని ద్వేషించినవాడే యగును. ఏలయనిన కృష్ణునిజన్మ ధర్మోద్ధరణకొఱకే అయియున్నది కదా! కావున కృష్ణుని నామస్మరణతోపాటు కృష్ణుడు బోధించిన ధర్మములను ఆచరణలో పెట్టుటయు, ఆ కృష్ణుని రూపములే యగు సమస్త ప్రాణికోట్లయెడల దయగలిగి యుండుటయు నాచరింపవలెను.

పూర్వమొక గురువుండెడివాడు. అతనికి ఒక ఆశ్రమము, ఒకశిష్యుడుకూడ నుండెను. శిష్యునకు ప్రతిదినము ఆ గురువు శాస్త్రములను బోధించుచు ఒకరోజున గురుభక్తిని గూర్చి, గురుపూజనుగూర్చి గురుసేవామహిమనుగూర్చి విశేషించి చెప్పెను. మరుసటిరోజున గురువు ఆశ్రమకార్యార్థము బయటికిపోయి సరిగ మిట్టమధ్యాహ్నము మఠమునకు వచ్చెను. తలుపు వేసియుండెను. శిష్యుడు లోన గురువుగారి పటమునకు పూజచేయుచుండెను. 'ఒరే నాయనా! తలుపుతీయరా!' అని గురువు కేకవేసెను. లోనుండి శిష్యుడు-'స్వామీ! అష్టోత్తరము పూర్తి కాలేదు. పూర్తి చేసి వచ్చెదను' అనెను. 'ఒరే, కాళ్లు కాలుతున్నవిరా, త్వరగారారా,' అని మరల గురువు ప్రాధేయపడెను. కాని ఆ పరమానందయ్యశిష్యుడు, 'స్వామీ! పూజ మధ్యలో ఎట్లాలేచేది' అని పలికెను. 'ఎవరిపూజరా నాయనా' అని గురువడిగెను. 'తమరి పూజయే స్వామీ' అని యూఅంతే వాసి బదులుచెప్పెను. చాలసేపటికి ఎట్టకేలకు తలపు తీసెను. అపుడు గురువు శిష్యుని చీవాట్లుపెట్టి, గురువును ఎండగొట్టి

గురుపూజయేమిరా?' అని మందలించి గురువాక్యమును పాలించుటయే నిజమైన గురుపూజయనియు, దైవప్రోక్తమగు ధర్మమును ఆచరించుటయే నిజమైన దైవపూజయనియు బోధించెను.

ఇట్టి తత్త్వము తెలియక అనేకులు పై పై పూజలు, ధ్యానములు, నమస్కారములు చేయుచు హృదయమును మాత్రము కఠినముగ నుంచుకొనుచున్నారు. కొందరు ఎవ్వరైన దప్పికగొన్నవాడువచ్చి వారిని 'కొద్దిగ మంచినీళ్ళు పోయ్యండి మహాప్రభో' అని వేడినప్పటికి 'ఛీ పోరా!' అని ఈసడించు కొనుచుందురు. 'అన్నమో రామచంద్రా!' యని అల్లాడుచు వచ్చిన అన్నార్తుని ద్వేషించి వెడలగొట్టుదురు (ఇచ్చుటకు శక్తికలిగికూడ). ఇవి చిన్నవిషయములని యెవరును ఉపేక్ష చేయరాదు. పెద్ద పెద్ద పూజలకంటె హెచ్చుగ ఇట్టివంటి (పరోపకార సంబంధమైన) చిన్నవిషయములకే మహాత్ములు ప్రాధాన్యము నొసంగుచుందురు. భగవంతుడున్ను వానినే అధికముగ మెచ్చును.

**"The greatness of a man lies not in doing great things in a great way, but in doing small things in a great way"**

'మనుజునియొక్క గొప్పతనము పెద్ద పెద్ద కార్యములను ఆర్భాటముగ చేయుటలోలేదు. చిన్నచిన్న కార్యములనుగొప్ప మనస్సుతో చేయుటలోనే కలదు'-అని ఆంగ్లభాషలో నొక సామెతకలదు. ఒకడు పరోపకారమునుగూర్చి బ్రహ్మాండమైన ఉపన్యాసముచేసి ఇంటికి వెడలుచుండె ననుకొనుడు. ప్రక్కనే మఱియొకడు వీథినిబోవుచురోడ్డుమీదఒకరాయి పడియుండుట

చుంచి 'ఇది యెవరికైన తలిగినచో బాధపడుదురు' అని యెంచి దానిని తీసి దూరముగ పారవేసెననుకొనుడు. వీరిరు వురిలో రెండవవాడే చాల గొప్పవాడు. ఒక్కవాక్యము పలుకకున్నను గంభీరమైన ధర్మోపన్యాస మాతడు కావించిన వాడేయగును. ఏలయనగా అతడు బోధించినది అనుభవ వేదాంతము (Practical vedanta). ఈరహస్యములన్నింటిని ఆలోచించియే భగవానుడు ఈ అధ్యాయమునందు చక్కటి ధ్యానయోగమును గూర్చి ముందు బోధించినను, అంతటితో వదలిపెట్టక తదుపరి అమూల్యమగు ఆచరణ వేదాంతములు ("ఆత్మౌపమ్యేన..." ఇత్యాది శ్లోకములద్వారా) గూడ వ్యక్తపఱచెను. మందుతోపాటు పథ్యమునుగూడ బోధించె నన్నమాట. ఈరెండును చెప్పుటవలన బోధ సమాప్తమైనది. పరిపూర్ణత్వమును బొందినది.

ఈ ప్రకారముగ శ్రీకృష్ణపరమాత్మ చిత్తైకాగ్రత ప్రాధాన్యముగ గల ధ్యానయోగమును, తత్ఫలితమును, ఆ పిదప సర్వభూతహితమగు ధ్యానయోగియొక్క బాహ్యానుష్ఠానమును గంభీరముగ నుపదేశించుచు పోవుచుండ, మధ్యలో అర్జునుడు అడ్డుతగిలెను. 'అయ్యా! కృష్ణా! ఆగండి! అంతస్తుపైన అంతస్తు మేడకట్టులైతే తాము నేర్పుచున్నారు. కాని నా విషయ మొకింత ఆలోచించుడు. పై మేడసంగతి దేవుని కెఱుక, పునాదియే సరిలేదే నాకు. ధ్యానమునకు అత్యావశ్యకమైన చిత్తైకాగ్రత నాకు కుదురుటలేదు. నా మనస్సు మహా చంచలముగ నున్నది. అది దారికి వచ్చుటకు ఏదైనయుపాయమును ముందు సెలవిండు' అని శ్రీకృష్ణు నడిగెను. అది విని

పరమవాత్సల్యపూరితుఁడగు అమ్మహానీయుడు అభ్యాసము చేతను, వైరాగ్యముచేతను ఎటువంటి మనస్సైనను కుదుట పడునని ప్రేమపూర్వకముగ వచించెను. దీనిని గూర్చి ఈ అధ్యాయ ప్రారంభములో విపులముగ చర్చించడమైనది. ఇచ్చోట మనోనిగ్రహమునకై సాధకు డవలంబించవలసిన పద్ధతులను మాత్రము సూత్రప్రాయముగ చెప్పి ఇక నేటి ఉపన్యాసమును ఉపసంహరించుచున్నాను.

## మనోనిగ్రహోపాయములు :—

(1) మనస్సు బయటకు పోయినప్పుడెల్లా దానికి హితవు చెప్పి మరల లోనికి తీసికొని రావలెను. ("యతో యతో నిశ్చరతి..." పద్ధతి)

(2) ఆత్మేతరములగు దృశ్యవస్తువులు నశ్వరములని తలంచి వానియెడల వైరాగ్యము గలిగియున్నచో ఇక మనసు వానిపై పరుగిడదు.

} అభ్యాస, వైరాగ్యములను ఈ రెండు ఉపాయములున్నా గీతయందు తెలుపబడినవి.

(3) మనస్సు ఎచటకైనను పోవుచున్నచో, దానిని విరోధించక, సాక్షిగ చూచుచు, దాని చర్యలను మాత్రము గమనించుచుండవలెను. దాని యిష్టమువచ్చినట్లు చేయుటకు అధికారము (license) ఇచ్చి వదలివేయవలెను. కాని తాను మాత్రము దాని దొంగచేష్టలను కనిపెట్టుచుండవలెను. అట్టి సందర్భములో ఇక మనస్సునకు తాను తలంచిన పిచ్చిపనులు చేయుటకు సాహసముండదు. దొంగను చూచుచుండినచో నాతడుదొంగతనము చేయునా? ఒకవేళ మనస్సుకొంతదూరము

ఇష్టమువచ్చినట్లు పరుగెత్తినను మరల తనచిలిపిచేష్టలను, గంతు లను నిలిపివేయును. దృష్టాంతమునకు - ఎవరికైనను కోపము వచ్చినది యనుకొనుడు-'ఇదిగో, కోపము వచ్చుచున్నది.' అని ఆ కోపరూప మానసిక తరంగము నాతడు చూడగల్గుచో, లేక తెలిసికొనగల్గుచో, ఇక ఆ కోపము వెంటనే చల్లబడి పోవును. మహాత్ములు అట్లు చూడగలరు. కావున కోపాదులు వారికి అదుపులో ఉండును. అజ్ఞాని ఆ కోపతరంగముతో ఐక్యమై పోవును. కావున దానిని జయింపలేడు. మనస్సును మనస్సుచేతనే జయింపవలెను. కాలిన ఇనుమును చల్లని ఇనుముచే కొట్టి వంచుటలేదా ? అట్లే మనస్సుయొక్క ఒక భాగము (శుద్ధభాగము) సాక్షిగ చూచుచుండినచో, మఱి యొకభాగము (అశుద్ధభాగము) బయటకు పోయినను, వెంటనే తిరిగి వచ్చును; తనతప్పిదమునకు సిగ్గుపడును. ఈ పద్ధతి సాధనయందు ఒకింత పరిపక్వత పొందినవారు మాత్రము అవలంబించగలరు. ప్రారంభస్థితిలో భగవానుడు తెలిపిన పై రెండు పద్ధతులు చాల అనుకూలముగ నుండును.

(4) అంతయు భగవత్స్వరూపముగ (ఆత్మస్వరూప ముగ) భావన చేయవలెను. అత్తఱి ఇక మనస్సు ఎక్కడికి పోవును ? తనకంటె వేఱుగ (లేక దైవముకంటె వేఱుగ) అనుభవించదగిన, చూడదగిన, పోదగిన, కోరింపదగిన వస్తువు మఱియొకటి ఉండినగదా దానిపై పరుగెత్తుటకు ?

విష్ణు వుపవిష్టుడయ్యెను విష్ణుగూడి
విష్ణు వన్నమిడుచునుండె విష్ణువునకు

విష్ణువా యేల నవ్వేదు విష్ణుజూచి
విష్ణువేకద యెదిచూడ విష్ణుసములు.*

ఇది సాధనలో చాల పై అంతస్తు. దీనికి తీక్ష్ణబుద్ధి, మనోబలము అవసరము. రామదీర్థులు మొదలైనవారిట్టి సాధననేవిశేషముగ నాశ్రయించిరి. సన్న్యసించి యేకాంతముగ సంచరించుచున్న రామతీర్థుల నొకరు 'పూర్వాశ్రమములోని మీధర్మపత్నిగారు మీకెప్పుడైన జ్ఞాపకమునకు వచ్చుచుండురా!' అని ప్రశ్నించిరి. అందులకాతడు 'ఆమె నాకంటె వేఱుగనుండినగదా! ఆ ప్రశ్న ఉదయించుటకు? ఆమెకాదు. సర్వము నాకు ఆత్మస్వరూపము గనే గోచరించుచున్నద'ని నుడివెను. ఇది చాల గొప్పసాధన.

(5) కేవలాద్వైతస్థితిలో అసలు మనసనునదియే ఉండదు. ఒకే ఆత్మస్వరూపము సర్వత్ర వెలయుచుండును. లేని మనస్సు ఒక చోటికి పోవుటయేమి? తనకే ఉనికి లేనపుడు, తాను మఱియొక చోటికి పోవుటగాని, మఱియొక వస్తువును వాంఛించుటగాని యెట్లు సంభవించును? ఇట్టి స్థితిని బాగుగ అభ్యసించినచో మనస్సుయొక్క దుడుకుతనముపోయి క్రమముగ అధిష్ఠానమగు ఆత్మయందు లయించిపోవును.

ఈ ప్రకారముగ అనేక ఉపాయములద్వారా మనస్సును లొంగదీసికొని ఆత్మస్థితికై అభ్యాసనిని వినియోగించుకొనవలెను. తీవ్రసాధనలను జేసి ఈ జన్మయందే ఆత్మసాక్షాత్కారమను చరమలక్ష్యమును బొందుటకై యత్నింపవలెను.

---

* విష్ణూపరిస్థితో విష్ణుః విష్ణుః ఖాదతి విష్ణవే
కథం హససి రే విష్ణో సర్వంవిష్ణుమయం జగత్.
(రామకృష్ణబోధామృతము)

ఒక వేళ ఈజీవితములో తాను చేయవలసిన పరమార్థకార్యము పూర్తికాకమునుపే అకస్మాత్తుగ మరణించినచో అతనిగతి యేమగును? అనునదికూడ ఆలోచించదగిన ప్రశ్నయే. ఈ ప్రశ్నను మనకంటె ముందుగ అర్జునుడే అడిగివేసెను. అర్జునుని యాప్రశ్నకు భగవానుడేమి సమాధాన మొసంగెనోచూతము. ఏలయనిన చాలమంది సాధకులను ఈ ప్రశ్న బాధించుచున్నది. కొంత సాధనజేసి ప్రారబ్ధవశమున మృత్యువాతబడినవారి యొక్క ఆ ఒకింత సాధన వ్యర్థమైపోవునా? లేక రాబోవుజన్మ యందు కలిసివచ్చునా? అతనిస్థితి మరణానంతర మేమగును? ఇత్యాది సంశయములనుదీర్చుచు శ్రీకృష్ణపరమాత్మ కరుణాళువై అర్జునున కిట్లు బోధించెను - (ఈ బోధతో ఈ ఆ అ వ అధ్యాయము పూర్తియగును.)

'ఓ అర్జునా! మంచి చేసినవానికి ఎచటను చెడ్డలేదు. దైవకార్యము ఒకింత ఆచరించినప్పటికిన్ని దానికి తగిన సత్ఫలముసే ఆతడు పొందును. ఎచటగాని, లేక ఏచటనైనగాని, రవ్వంత ధర్మముగాని, రవ్వంత ఆధ్యాత్మిక సాధనగాని చేసినప్పటికిని అది అక్షయముగనే ఉండి భావికాలమున ఉత్తమఫలములను గలుగజేయును. అట్టివారికి దుర్గతికాని, వినాశముకాని ఎన్నటికిని కలుగదు—

'న హి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి' (6-40)

ఈప్రకారముగ సాధకుని భవిష్యచ్ఛ్రేయమునుగూర్చి భగవానుడు హామీా నిచ్చెను. ఈ జన్మలో సాధన ఎంతవఱకు చేసియుండునో, అక్కడనుండియే మఱుజన్మలో ప్రారంభించును. అంతియేకాని పూర్వపుసాధన నశింపదు. వర్తకుడు తనలెక్కల పుస్తకములో ఒక పేజీ పూర్తికాగానే ఆ పేజీ మొత్తమునుకూడి

ఆ అంకెను మఱునటిపేజీపైన వేసెదను. దానినే 'బ్రాటోవరు' [Brought forward (B.F.)] అందురు. అట్లే ఈ జీవితములోని పుణ్యమును, పాపమును, ధర్మమును, అధర్మమును భగవానుని అకౌంటెంట్ జనరల్ (Accountant General) అగు చిత్రగుప్తుడు కూడికట్టి ఆ మొత్తమును మఱుజన్మ ప్రారంభమువనే ఆయాజీవుల కొసంగివేయును. వారు ఆయాసంస్కారములతో గూడి పుణ్యవంతులుగనో, పాపవంతులుగనో, జ్ఞానులుగనో, అజ్ఞానులుగనో ప్రవర్తించుచుందురు. పూర్వజన్మపుబుద్ధిసంయోగము వారికి అప్పుడులభింపతదనుగుణ్యముగ నాచరించుదురు. పూర్వాభ్యాసముచేత వారు బలాత్కారముగ ఆ యా సంస్కారోచిత కార్యములను గావించుచుందురు. ఇది ప్రకృతియందలి అప్రతిహతమగు నియమము. భగవచ్ఛాసనము. దీనికి వ్యతిరిక్తముగ ఎచటను జరుగదు. జీవునిసంసారయాత్రయందలి కోట్లకొలది జన్మలలో ఒక్కొక్క జన్మ ఒక్కొక్క పేజీగా మనము భావించవచ్చును. గ్రంథము చదివి పూర్తియైనను పిదప దాని నెట్లు దూరముగ నుంచుదుమో, అట్లే జీవుడు అనేక జన్మలయం దనుభవమునుబొంది, తుట్టతుదకు జ్ఞానమును సముపార్జించి ఆ జనన మరణరూప సంసార గ్రంథమును విసిరి పారవేసి పరమశాంతిని (మోక్షమును) బడయుచున్నాడు. ఇందు ఒక్కొక్క జన్మయందలి సంస్కారము మఱుజన్మకు బీజరూపముగ నగుచున్నది. ఆ సంస్కారమే - అది పుణ్యముకాని, పాపముకాని - తిరిగి విజృంభించుచు తదనురూప ఫలములను కలుగజేయుచున్నది.

ఈ జన్మయందు ధ్యానాది భగవత్సంబంధమైన (పారమార్థిక) సాధనలను కొన్నిటిని గావించి అసంపూర్తిగ విడిచి

పోయినవాడు, మఱుజన్మలో పవిత్రులగు శ్రీమంతుల గర్భము నందు జన్మించి పుట్టుకతోనే సచ్ఛీలవంతుడై సదాచార పరాయణుడై మెలగుచుండును. 'శుచీనాం శ్రీమతాం' అని రెండు విశేషణములను భగవానుడిచట ప్రయోగించెను. పవిత్రవంతులు, శ్రీమంతులునగువారి కుటుంబమున నాతడు జన్మించునని భావము. పవిత్రులైనను బీదవారైనచో భోజనాదులకు ఇబ్బందికలిగి, సాధనలందు ఒకింత కష్ట మనుభవించవచ్చుననియు లేక కేవలము శ్రీమంతులైనచో భోగవిలాసములందు పడి చెడిపోవచ్చుననియు ఊహించి సర్వేశ్వరుడు అట్టి సాధకులను 'శుచి, సంపత్తి' రెండును సమకూడియున్న గృహములందే జన్మింపజేయుచున్నాడు. ఇది మధ్య తరగతి సాధకులనుగూర్చి చెప్పిన విషయము. ఉత్తమ తరగతి సాధకులు పుట్టుకతోనే ఏ ధీమంతులగు యోగులయొక్క సంప్రదాయముననే చేరిపోవుదురు. వారొకవేళ గృహస్థుల యిండ్లయందు జనించినప్పటికిని కొంత వయస్సు వచ్చులోపల ఇంటియందు చెప్పియో, లేక చెప్పకనో ఆశ్రమములకు, మఠములకు, ఏకాంతప్రదేశములకు పారిపోవుదురు. ఈ ప్రకారముగ చిన్నకాలములోనే యోగుల సాన్నిధ్యశ్రీని అనుభవింపజేయగల ఉత్తమజన్మ ఈ ప్రపంచమున మహా దుర్లభమని, సర్వశ్రేష్ఠమని గీతాచార్యుడు వచించెను—

ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్ (6-42)

అని యాతడు సెలవిచ్చెను. దీనినిబట్టి మనుజుడు పుట్టినపిదప దేనిని అన్వేషించవలెనో, సర్వోత్తమస్థితి యెట్లు చేకూరునో స్పష్టమగుచున్నది. ప్రపంచములో కుక్కజన్మ, నక్కజన్మ, పందిజన్మ, కోతిజన్మ, రాక్షసజన్మ, మానవజన్మ, దేవతాజన్మ-

ఇట్లెన్ని యోజన్మలున్నప్పటికిని, భగవానుడు వాకొనియున్నట్లు లోను యోగియగు మానవునిజన్మనే మహాదుర్లభముగ, సర్వోత్కృష్టముగ చిత్రించుట గాక అన్ని స్థానములకంటెను, పదవులకంటెను యోగిత్వమే, దైవత్వమే, శ్రేష్ఠమని ఋజువగుచున్నది. కాబట్టి భూలోకమందు అగ్రజన్మను బొందిన మానవుడు దానికై యేల ప్రయత్నింపరాదు. ప్రయత్నించి జన్మసాఫల్యమును ఏల కలుగజేసికొనరాదు? జీవితమంతయు చంచలసుఖములకై భ్రష్టమొనరించుట విజ్ఞులకు పాడిగాదు. ఏది అన్ని లాభములకంటెను గొప్పలాభమో, అన్నిసుఖముల కంటెను గొప్పసుఖమో, అన్ని స్థానములకంటెను గొప్ప స్థానమో, అట్టి ఆత్మపదవిని గీతాచార్యుడు తెలిపిన మార్గముద్వారా చక్కగ సాధించి, మోక్షసామ్రాజ్యాధిపతులై జన్మసాఫల్య మొందుట పరమశ్రేయస్కరము. మన మతియే మన గతిని స్థిరపఱచును-మన చేతలకు మనమే బాధ్యులము-మన గతులకు మనమే నిర్మాతలము. ఈనాడు మనము పాపము చేసినచో రేపు ఏడ్చుచు దుఃఖ మనుభవింపవల వచ్చును. ఆ పాపమేమి? భగవంతుని మఱచుటయే పాపము! ఆత్మను విస్మరించుటయే పాపము. కావున ముముక్షువు లెల్లరు తమ హృదయస్థమగు పరమాత్మను ఈ జన్మయందే సాక్షాత్కరించుకొనుటకై సర్వశక్తులను వినియోగించి జనన మరణ రూపమగు ఈ మహాభయంకర సంసారదుఃఖదావాగ్నిని ఆత్మజ్ఞానమను శీతలవర్షధారలచే నుపశమింపజేసి నిరతిశయ బ్రహ్మానంద మనుభవించి ధన్యులయ్యెదరుగాక!

ఓం తత్ సత్

ఓం కృష్ణార్పణమస్తు.

ఓమ్

# 7-వ అధ్యాయము

# విజ్ఞాన యోగము

నేడు భగవద్గీత ద్వితీయషట్కము*నందు అడుగుపెట్టబోవుచున్నాము. దీనికి భక్తిషట్కమని స్థూలముగా నామకరణము చేయబడినది. కర్మ, భక్తి, ధ్యానము, జ్ఞానము, మున్నగునవియన్నియు కైవల్యపదప్రాప్తికి ఆవశ్యకములైన అంగములే. జీవుని చిత్తమును శుద్ధపఱచి, స్వస్వరూపపరిజ్ఞానమునుగలుగజేయుటద్వారా అతనికిశోకరాహిత్యమును, ఆనందప్రాప్తిని కలుగజేయుటయే ఈ యన్ని సాధనలయొక్కయు పరమలక్ష్యము. అట్టి శోకరాహిత్యరూప పరమలక్ష్యమును దిగ్దర్శనము చేయుటకేకాబోలు గీతాప్రబోధము "అశోచ్యాన్" (శోకింపతగనివారినిగూర్చి) అను పదముతో ప్రారంభమై 'మాశుచః' (శోకింపవద్దు) అను పదముతో సమాప్తమైనది. ఇట్టి అశోకశక్తిప్రదాయినియగు భగవద్గీత సంసార దావానలమున తగుల్కొని త్రివిధతాపములచే దగ్ధులగుచున్న జనసముదాయమునకు ఎంతయో శాంతిని ఆనందమును చేకూర్చుచున్నది. కన్నీరు కార్చుచున్నవారిని ఓదార్చుచున్నది. ఆపద్గ్రస్తుని వీపు తట్టి అతని హృదయమున ధైర్యసంచారమును కలుగజేయుచున్నది. నిరాశా నిస్పృహలచే పరివేష్టితుడైనవానికి ఉత్సాహమును జనింపజేయుచున్నది. కాబట్టియే ఎందఱో గీతా

---

* 7-వ అధ్యాయము మొదలుకొని 12-వ అధ్యాయము వఱకుగల 6 అధ్యాయములను ద్వితీయషట్కమందురు.

మూలే సన్నిధిఁజేరి అద్భుతమైన హృదయపరిణామమును బడసి ధన్యులై రి. అగుచునున్నారు. మఱియు అట్టివారు నిత్య పారాయణమునందు అర్థానిని విని యోగించి తమ స్మృతిపథమును ఎన్నడును అయ్యది వీడకుండులాగున యత్నించుచున్నారు. ఈ ప్రకారముగ జనులు గీతాశ్రయముచే తమ జన్మలను పునీత మొనర్చుకొని పరమశాంతిని అనుభవించుచున్నారు.

అట్టి పవిత్ర గ్రంథమందలి 7-వ అధ్యాయమునుగూర్చి ఇపుడు విచారింపబోవుచున్నాము. ఈ అధ్యాయమునకు విజ్ఞానయోగమని పేరు. గీతాచార్యుడు జ్ఞానముతో సంతృప్తి నొందలేదు. విజ్ఞానమునుగూడ నుపదేశించెను. విజ్ఞానమన అనుభవ సంబంధమైన జ్ఞానము (Practical knowledge). గీతాగ్రంథమును మొదలునుండి తుదివఱకు సాకల్యముగ పరీక్షించి చూచినచో అనుభవమునకే ఎక్కువ ప్రాధాన్య మొసంగుచు పోయినట్లు స్పష్టముకాగలదు. అనుభవమునకు రాని విద్య వృథా. అందును అధ్యాత్మవిద్య నూటికి 95 వంతులు అనుభవాత్మకమే అయియున్నది. కావున మామూలు జ్ఞానములో పరమార్థక్షేత్రమున ఏపాటి విలువయుండునో విజ్ఞు లూహించుకొనవచ్చును.

ఒకానొక మామిడితోటలోనికి ఇరువురు మిత్రులు వెళ్ళిరి. అందొకడు ఒక్కొక్క చెట్టుయొద్దకు వెళ్ళి దాని ఆకులను లెక్కించుచు, కాయలను పరీక్షించుచు పోవుచుండెను. మఱియొకడు ఒక పండును చెట్టునుండి కోసుకొని ఒకమూల కూర్చొని తినుచుండెను. వీరిరువురిలో ఎవడు సుఖవంతుడు? చెట్లయొక్క వివరములను (Statistics) గ్రహించువాడా

ఫలము ననుభవించువాడా? అట్లే ఆధ్యాత్మిక విషయములను తెలిసికొనుట, చెప్పుట అంత గొప్ప కాదు. అనుభవించుట గొప్ప. వినిన దానిని, తెలిసికొనిన దానిని, చెప్పిన దానిని వెంటనే అనుభవమునకు తెచ్చుకొనుటకై యత్నించవలెను.

**"Man must realise God, feel God, see God, talk to God. That is religion."**

"మానవుడు భగవంతుని సాక్షాత్కరించుకొనవలెను. భగవంతుని అనుభవించవలెను. భగవంతుని చూడవలెను. భగవంతునితో మాట్లాడవలెను. అదియే మతము" - అని వివేకానందులు సెలవిచ్చిరి. మఱియు వాచావేదాంతులకు "ఆకులు లెక్కపెట్టువారు" **(Leaf counters)** అను బిరుదునుగూడ వారొసంగియుండిరి. కావున ముముక్షువు జ్ఞాన, విజ్ఞానముల రెండింటిని సముపార్జించవలెను. పట్టణములోనున్న ఒకానొక మిత్రునకు పల్లెటూరునందున్న ఒక వ్యక్తి తన గ్రామమునకు రమ్మని జాబు వ్రాయుచు వచ్చునపుడు 5 శేర్లు మిఠాయి, 2 పట్టువస్త్రములు, 3 నోటుపుస్తకములు, 1 ఫౌంటెన్ పెన్ కొని తీసుకొని రావలసిందిగా తెలిపెననుకొనుడు. అపుడా పట్టణములోని మిత్రుడు జాబు చదువుకొని క్రింద పెట్టును. ఇక ఆ జాబుతో పనిలేదు. మిగిలిన పనియంతయు ఆచరణాత్మకమైనదే. అనగా బజారునకు పోవుట, వస్తువులను కొనుట, వానిని ఇంటికి తెచ్చుట మొదలైనవి. కేవలముజాబుమాత్రము నిరంతరము చదువుకొనుచు నుండినచో ఎవరికిని ఏ ప్రయోజనమున్ను ఉండదు. అట్లే అధ్యాత్మపరిజ్ఞానమును మహనీయుల వలనగాని, శాస్త్రాదులవలనగాని ముస్ముందు తెలిసికొని వెను

వెంటనే దానిని అనుష్ఠించుచు రావలెను. ఇట్టి అనుభవజ్ఞానమునకే భగవానుడు విజ్ఞానమను పేరుపెట్టి, 'జీవులారా! జ్ఞాన విజ్ఞానముల రెండింటిని సముపార్జించవలెన'ని ఈ అధ్యాయ ప్రారంభములో హితవుచెప్పెను (జ్ఞానం తేఽహం స విజ్ఞానం).

ఈ జ్ఞాన విజ్ఞానములయొక్క విలువ యెట్టిది? దాని మహిమ యేమి? అను ప్రశ్నలకు శ్రీకృష్ణపరమాత్మ యెట్టి ప్రత్యుత్తర మిచ్చెనో చూడుడు! "దానిని తెలిసికొనినచో సకల ప్రపంచములో తెలిసికొనదగినది ఏదియు మిగిలియుండదు. అనగా సర్వము తెలిసికొనబడును" (యజ్జ్ఞాత్వా నేహ భూయో ఽన్యజ్జ్ఞాతవ్య మవశిష్యతే)-అని నుడివెను. ప్రపంచములోగల విజ్ఞానమునకు అంతులేదు. ఎన్నియో శాస్త్రములు, ఎన్నియో విద్యలు, ఎన్నియో కళలు కలవు. ఒక్కొక్క దానిని బట్టుకొని దానిలో పూర్ణకుశలత్వమును సంపాదించవలెనని; లేక దాని అంతమును జూడవలెననిన, ఈ ఆయువు చాలదు. ఇక అన్ని విద్యల విషయమై వేఱుగ చెప్పవలెనా!

అనన్తశాస్త్రం బహువేదితవ్యం
స్వల్పశ్చకాలో బహవశ్చవిఘ్నాః
యత్సారభూతం తదుపాసితవ్యం
హంసో యథా క్షీర మివాంబుమిశ్రమ్.

"శాస్త్రము అనంతమైనది. తెలిసికొనదగినది ఎంతయో యున్నది. జీవితకాలము అతి స్వల్పముగా నున్నది. విఘ్నములు లెక్కలేనన్ని వచ్చి పడుచున్నవి. ఇట్టి స్థితిలో జీవుడేమి చేయవలెను? నీళ్ళు కలిసిన పాలనుండి సారమగు పాలనే హంస గ్రహించునట్లు, అన్ని విద్యలయొక్క సారమగు పర

మాత్మనే ఉపాసించవలెను." పరమాత్మ సంబంధమైన విజ్ఞానమునే గ్రహించవలెను. అట్లు దానిని గ్రహించినచో సమస్త ఇతర విద్యలను గ్రహించినట్లేయగును. ఏలయనగా అన్నిటికిని అయ్యది ఆధారభూతమై కారణమై యొప్పుచున్నది.

యథా సోమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యా
ద్వాచారమ్భణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్.
(ఛాందోగ్యోపనిషత్తు)

"మట్టియొక్క స్వరూపమును బాగుగ తెలిసికొనినచో కుండలన్నిటిని తెలిసికొనినట్లే యగును. మట్టి సత్యమైనది. కుండలయొక్క నామరూపములు అసత్యములైనవి." అని ఛాందోగ్యోపనిషత్తు తెలిపిన చందమున ప్రపంచమునకంతటికిని ఆధారభూతమై, బీజభూతమై, హేతురూపమైనట్టి ఆత్మవస్తువునెఱింగినచో, ఇతర సమస్త విద్యలను, కళలను, ధర్మములను తెలిసికొనినట్లే యగుచున్నది. ఇక తెలిసికొనదగినది ఒకింతైనను మిగిలి యుండదని గీతాచార్యుడు పలుకుచున్నాడు. ఓహో! ఎట్టి మహిమ కలది ఈ బ్రహ్మవిద్య!

పూర్వమొకపుడు శివుడు తన యిరువురు కుమారులగు విఘ్నేశ్వర, కుమారస్వాములకు పరుగుపందెము (Running race) ను ఏర్పాటుచేసెనట! 'ఇరువురు చేరియొకవైపుబయలు దేరి భూప్రదక్షిణము చేసి శివునియొద్దకు రావలెను. ఎవరు ముందు వచ్చెదరో వారికి చూతము'-అని శివుడుతలంచి తన తనయులిరువురిని పిలిచెను. వారు, వారి వారి వాహనములగు నెమలి, ఎలుకలతో సిద్ధమైరి. సుముహూర్తమును నిర్ణయించి ఇక బయలుదేఱవలసినదిగా ఆదేశించెను. తత్క్షణమే కుమారస్వామి తన వాహనమగు మయూరము నధిరోహించి వాయువేగమున

బయల్వెడలెను. కాని విఘ్నేశ్వరుడు ఒక్క అడుగైనను ముందుకు పెట్టక గంభీరముగ నిట్లు తలపోయసాగెను. 'అస్మజ్జనకుడగు ఈ శివుడు సర్వలోకైకనాథుడు. చరాచర జగత్తులన్నియు ఈతని కుక్షియందేయున్నవి. కనుక ఈతనికి ప్రదక్షిణము చేసినచో బ్రహ్మాండములన్నింటిని ప్రదక్షిణము చేసినట్లే యగునుగదా!' అని నిర్ణయించి వెంటనే భక్తిపూర్వకముగ నాతనికి ప్రదక్షిణముచేసి పితృసమ్ముఖమున నట్లే నిలబడెను. చాల సేపటికి కుమారస్వామి భూప్రదక్షిణము పూర్తిచేసికొని రాగా తనకంటెముందె విఘ్నేశ్వరుడచటికి వచ్చియుండుటచూచి సంభ్రమాశ్చర్యములలో మునిగి, తండ్రిని ప్రశ్నింప, జరిగిన సమాచారము నాతడు తెలిపెను. ఈ పౌరాణిక గాథయందు విఘ్నేశ్వరు డవలంబించిన పద్ధతిని విజ్ఞుడగు ముముక్షువు అవలంబించును. తక్కినవారు కుమారస్వామి చేబట్టిన మార్గము ననుసరింతురు. అనగా తెలివిగల సాధకుడు గీతాచార్యుడీ యధ్యాయ ప్రారంభమున తెలిపినలాటి పరమాత్మ విజ్ఞానమొకటి కలిగియున్నచో, ఇక తెలిసికొనదగినది ఏదియు మిగులక అన్నియును తెలిసికొనబడినట్లే యగుచున్నది గ్రహించి దానినే తన జీవితకాలమున పొందుటకు యత్నించును. తక్కినవారు ఈ సత్యము నెఱుంగక, ఆత్మేతరములగు లౌకిక కార్యములందే, లౌకిక విద్యలయందే కాలమును గడుపుచు బ్రహ్మప్రభూతిని బడయక జీవితములను అంతము చేసికొను చున్నారు. తత్ఫలితముగ పూర్ణశాంతి, దుఃఖరాహిత్యము బడయజాలకున్నారు. కాబట్టి జీవితకాలములో ఏదిముఖ్యముగ తెలిసికొనవలెను? అను ప్రశ్న బాల్యకాలములోనే ప్రతివారు

వేసికొని, తదనుగుణముగ ప్రవర్తించవలెను. చెట్టుయొక్క ఒక్కొక్క ఆకునకు నీళ్ళు పోయుటకంటె చెట్టు మొదలునకు నీళ్ళుపోయుట శ్రేయస్కరము. అపుడు అన్ని ఆకులకు నీళ్ళు పోసినట్లే యగుచున్నది.

> జ్ఞాతే తు కస్మిన్విదితం జగత్స్యాత్
> సర్వాత్మకే బ్రహ్మణి పూర్ణరూపే. (శంకరాచార్యులు)

"దేనిని తెలిసికొనినచో ఈ జగత్తంతయు తెలియబడినదియగుచున్నది?" అను ప్రశ్నకు శ్రీ శంకరాచార్యులవారు 'సర్వరూపమై, పరిపూర్ణమైనట్టి బ్రహ్మమును తెలిసికొనినచో జగత్తంతయు తెలియబడినది యగుచున్న'దని సమాధానమొసంగిరి. సముద్రములో అన్ని నదులయొక్క తీర్థములు వచ్చి కలియుచున్నవి. కావున సముద్రస్నానముచే సర్వతీర్థనిమజ్జనపుణ్యము లభించగలదను ఉద్దేశ్యముతో శాస్త్రకారులు అప్పుడపుడు సముద్రస్నానమును ఏర్పఱచిరి. అట్లే పరమాత్మవిజ్ఞానమునందు అన్ని యితర విజ్ఞానములున్ను అంతర్భూతములే అయియున్నందున, దాని యనుభూతిచే సర్వ శాస్త్రానుభూతియుకలుగుచున్నది. కావున బాల్యకాలమున జనులు తమ పిల్లలయొక్క విద్యాభ్యాసకాలమున బాగుగ యోచించి, జీవితమున కంతటికిని ప్రకాశమును గలుగజేయునదియు, ఉత్తేజమునొసంగునదియు,ఆనందమునొసగూర్చునదియునగు బ్రహ్మవిద్యయొక్క పరిచయమును వారికి కలుగజేయుట భావ్యము.

అయితే బ్రహ్మవిజ్ఞాన మిట్టి మహత్తర ప్రభావము కలిగియున్నను జనులేల అందు ఎక్కువ ప్రవర్తించుటలేదు? ఏదైన గొప్పలాభసాటివస్తువున్నచో ప్రజలద్దానికొఱకై పఱుగు

లేదుండుదురుకదా! దైవముతోఁ జిక్కి అల్లాడుట పనిగెల్చుటలేదు? అది అన్నిటికంటె విలువైనవస్తువుకదా! ఈ ప్రశ్న చాల ముఖ్యమైనది. భగవానుఁడీ యధ్యాయమున దానికి సమాధానము వచించెను. అనేక జన్మార్జితమగు పాపము చిత్తమునందు న్నంతవఱకు మనుజునకు దైవముయెడల కాని, దైవకార్యములయెడలకాని, అధ్యాత్మవిద్యయెడల కాని, మోక్షసిద్ధివిషయమునఁగాని, ప్రీతిజనింపదు. ఒకవేళ జనించినను ఎక్కువకాలము నిలువదు. వెంటనే జారిపోవును. ఇదియొక ధర్మరహస్యము.

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః (7-3)

'వేలకొలది మనుష్యులలో మోక్షసిద్ధి (పరమాత్మానుభూతి) కొఱకు ఏ ఒకానొకఁడో ప్రయత్నించును. అట్లు ప్రయత్నించిన వేలకొలదిమనుష్యులలో ఏ ఒకానొకఁడో నన్ను (పరమాత్మను) యథార్థముగ తెలిసికొనగల్గును.' అని శ్రీకృష్ణభగవానుఁడు నెల్లడించెను. ఎవరెవరికి పాపబుద్ధి శమించుచుండునో, తమోగుణ రజోగుణములు నశించి సత్త్వగుణ మావిర్భవించుచుండునో, అట్టివారికి దైవముయెడల, మహాత్ములయెడల, బ్రహ్మవిద్యయెడల భక్తి ఉదయించుచుండును. అయితే ఆ పాపబుద్ధి యెట్లు శమించును? పాపము నశించు మార్గమేది? పుణ్యకార్యములచే పాపము నశించును. ఋణ మెట్లుతొలగును? ధనసంపాదనచే. గణితశాస్త్రములో '-6' (మైనస్ ఆఱు) అను సంఖ్య ఉన్నదనుకొనుఁడు. దానిని నశింపజేయవలెననిన '+6' (ప్లస్ ఆఱు) అను సంఖ్యకాని అంతకుమించిన (ప్లస్) సంఖ్యగాని తీసికొనిరావలెను. ఇదియొకటియే ఉపాయము. లేకున్న

ఎన్ని ఇతర ఉపాయముల చేతను ఆ 'మైనస్' సంఖ్య నశింపదు. నీటిలో కొద్దిగ ఉప్పుపడి నీరు ఉప్పుగానున్నచో ఆ ఉప్పదన మును పోగొట్టవలెననిన, ఎక్కువ చక్కెర కాని బెల్లముకాని ఆ నీటిలో వైచిన చాలును. ఆ ఉప్పదనముపోయి నీరు తీపిగా మారును. అట్లే ఎవరి హృదయమందైన పాపవాసనలు తాండ వించుచున్నచో, వారు ప్రయత్నపూర్వకముగ పుణ్యకార్యము లాచరించవలెను. పాపము పోవుటకు వేఱుదారి లేదు.

యేషాం త్వన్తగతం పాపం జనానాం పుణ్యకర్మణాం
తే ద్వన్ద్వ మోహనిర్ముక్తా భజన్తే మాం దృఢవ్రతాః. (7-28)

'ఏ జనులయొక్క పాపము పుణ్యకార్యములద్వారా నశించి పోయినదో అట్టి పుణ్యాత్ములు మాత్రమే సుఖదుఃఖాది ద్వంద్వ హేతువగు అవివేకమును పోగొట్టుకొని నన్ను (పరమాత్మను) దృఢవ్రతములతో సేవించుచున్నారు' అని భగవానుడు పలికెను. ఈ శ్లోకము గీతయందు మహత్తరమగు ప్రాముఖ్యత కలిగి యున్నది. ఏలయనగా, ఇపుడు జనులలో కొందఱికి "శుష్క వేదాంతము" అంటుకొనుటచే పుణ్యమేమి, నీతియేమి, నిష్ఠ యేమి, ఇవియన్నియు చాల క్రింది అంతస్తులు. నిత్యశుద్ధనిరా కారమగు ఆత్మయే మనకు కావలసినది. ఆత్మ పుణ్యపాపము లకు అతీతముకదా! ఇక పుణ్య మేల ఆచరించవలెను?- ఇత్యాది ప్రగల్భములు పలుకుచుందురు. అట్టి పండితమ్మన్యులకు శ్రీకృష్ణభగవాను డీ శ్లోకముద్వారా చక్కటి గుణపాఠమును నేర్పెను. "ఓ జీవులారా! మీరు పుణ్యకార్యములను విరివిగ జేయుడు. జన్మార్జితపాపజాలమును భస్మీభూతమొనర్చుట కది 'రామబాణ' దివ్యౌషధము. పాపము పూర్తిగగాని, లేక

ఒకింతగాని తొలగనిదే మీకు పరమార్థవిషయము లనుభూతములుకావు. ఒకవేళ పాపము నశింపక మీరు ఆత్మాన్వేషణకై వ్రతము బూనినచో, ఆవ్రతము క్రమక్రమముగ దిగజారి, పృథక్త్వములేక, భంగమైపోగలదు. పుణ్యాచరణముచే వినష్టపాపులైనవారే ఆత్మాన్వేషణమున, లేక భగవదారాధనమున పృథగ్వ్రతత్వమును బడయుగలరు. ఈ విషయము ముమ్మాటికిని సత్యము. కావున పుణ్యకార్యములను ద్వేషింపకుడు. పుణ్యాత్ములను విమర్శింపకుడు" అని యీ శుష్కవేదాంతులకు తీవ్ర హెచ్చరిక (warning) చేసెను.

పాపమును దాటి - పుణ్యమునుజేరి - తద్ద్వారా పుణ్యపాపాతీత జ్ఞానస్థితిని (ఆత్మను) పొందవలెను.

తమోగుణ రజోగుణములనుదాటి - సత్త్వగుణమును జేరి - తద్ద్వారా గుణాతీతస్థితిని జేరవలెను.

ఇదియే మార్గము. ఇంతియేకాని పాపమునుండి అమాంతము ఆత్మను ఎవరును చేరలేరు. ఒకవేళ చేరుటకు పైకి ఎగిరినను తలక్రిందులుగ పడిపోవుదురు. ఇంతియే ఫలితము.

జన్మాన్తరసహస్రేషు తపోధ్యాన సమాధిభిః
నరాణాం క్షీణపాపానాం కృష్ణేభక్తిః ప్రజాయతే.

"అనేక జన్మలయందు గావింపబడిన తపోజపధ్యానాది పుణ్యకార్యములచే పాపములు నశించినవారికి మాత్రమే ఈ జన్మయందు శ్రీకృష్ణునియందు భక్తి ఉదయించును. తక్కినవారికి కాదు' అని శాస్త్రములు పలుకుచున్నవి. జనులయందు పాపరూపదోషము తరతమభేదముతో నుండుటవలననే నూటికి కోటికి ఒకడు ఈమార్గమందు ప్రవేశించుటయు, అట్లుప్రవేశించిన

వారిలో ఏ ఒకానొకడో భగవంతుని (ఆత్మను) యథార్థముగ తెలిసికొనుటయు సంభవించుచున్నది. టిక్కెట్టు లేనివారిని రైలులో ఎక్కనివ్వరు. ఒకవేళ ఎవరైన ఎక్కినను టికెట్ కలెక్టరు వెంటనేవచ్చి దింపివేయును. లేక మెడపట్టి బయటకు గెంటివేయును. అట్లే పుణ్యము లేనివారిని దేవదూతలు భగవత్సాన్నిధ్యమునకు పోనివ్వరు. ఒకవేళ ఎవరైన పోవుటకు యత్నించినను వారిని వెనుకకు (సంసారకూపములోనికి) నెట్టివేయుదురు. కొందఱు గృహస్థాశ్రమమునందుండువారు ఇంటిలో రచ్చపడలేక అకస్మాత్తుగ ఆశ్రమములకు, మఠములకు పరుగెత్తుకొని వచ్చుచుందురు. వారిలో ఎవరికి పుణ్యబలముండునో అట్టివారు మాత్రమే ఆశ్రమములలో, ఏకాంతస్థలములలో నుండి ధ్యాననిష్ఠ నిరంతరాయముగ సలుపగల్గి యుందురు. తక్కినవారిని అనగా పుణ్యసంపద లేనివారిని మాయ వెనుకకు లాగివైచి మరల సంసారగర్తమున కూలద్రోయును. పరుగు పందెమునందు అందఱును పాల్గొనరు. ఏ కొద్దిమందియో పాల్గొందురు. వారిలోను గమ్యస్థానమునకు ఏ ఒక్కడో, ఇద్దరో చేరగల్గుదురు. తక్కినవారిలో కొందరు చాల వెనుకగా వచ్చుచుందురు. మఱికొందరు దారిలోనే నిలిచిపోవుదురు. అట్లే మోక్షసిద్ధికై ప్రయత్నించువారరుదు. అట్లు ప్రయత్నించువారిలో గమ్యమును జేరువారు ఇంకను అరుదు. అని పరమాత్మ నుడివిన వాడై అటుపిమ్మట తనస్వరూపమునుగూర్చి వర్ణింపదొడగెను.

ఏలయనిన, భగవంతుని ధ్యానింపవలెననిన భగవత్స్వరూపమెట్టిదో బాగుగ తెలిసియుండవలెను. కావున తాను ఎచట ఏ రూపముతో ఏ ప్రకారముగ వర్తించుచుండునో

భగవానుడిచట తేటతెల్లమొనర్చెను. ప్రపంచములో దృశ్యము, దృక్కు అను రెండుపదార్థములు కలవు. వానినే ప్రకృతి, పురుషుడు అనియు అందురు. ప్రకృతి జడమైనది, పురుషుడు చైతన్యస్వరూపుడు. 'వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతి సంభవాన్'-అని గీతాచార్యుడు తెలిపినట్లు వికారములన్నియు ప్రకృతికి చెందినవే. పురుషుడు (పరమాత్మ) నిర్వికారుడు. ఆ ప్రకృతియు రెండువిధములనున్నది అపరాప్రకృతి, పరాప్రకృతి-అని. పృథివ్యప్తేజోవాయురాకాశములను పంచభూతములు, మనోబుద్ధ్యహంకారములు-అను ఈ యెనిమిదిటితో కూడినది అపరాప్రకృతి. జీవరూపమై చిదాభాసస్వరూపమైనది పరాప్రకృతి. ప్రపంచములోని చరాచర ప్రాణికోట్లన్నియు ఈ రెండువిధములగు ప్రకృతిచే కలుగుచున్నవి. ఆ ప్రకృతిద్వయముద్వారా పరమాత్మ జగత్తుయొక్క సృష్టిప్రళయములను గావించుచున్నాడు. ప్రకృతి స్వతః జడమైనది, కావున ఏకార్యమును చేయలేదు. చైతన్యమగు ఆత్మయొక్క సంయోగమువలననే ఈజగన్నాటకమును అదిఆడుచున్నది. సామాన్యముగ పంచభూతములుఅనగా భూమి, జలము, అగ్ని మొదలైనవి జడములని అందరికిని తెలియును. కాని మనస్సు, బుద్ధి మొదలైనవికూడ జడములని అందరికిని తెలియదు. అవి చైతన్యవంతములని వారు భావించుచుందురు. కాని అది సరి కాదు. అవికూడ జడములే. అవికూడ దృశ్యపదార్థములే. అవియు చపలత్వము, రాకడ, పోకడగలిగియున్నవే. ఈ సత్యమును గీతాచార్యుడిచట బహిర్గత మొనర్చివేసెను. మనస్సును, బుద్ధినిగూడ దృశ్యవస్తువులుగ జూచుటలోనేఉన్నది సాధకునియొక్క తెలివియంతయు. అట్టిసామర్థ్యము /

సిద్ధించినచో ఇక మోక్షము కరతలామలకమైనట్లే: అజ్ఞానులు మనోబుద్ధ్యాదులతో తాదాత్మ్యమొంది అవి వికారయుక్తములగునపుడు తామే వికారవంతులగుచున్నట్లు ఊహించి సంసారమున బంధింపబడుచున్నారు. జ్ఞానులు అట్లుచేయక, శ్రీకృష్ణపరమాత్మ యిచట తెలిపినలాగున ఆ మనోబుద్ధ్యాదులను, వాని వికారములను తమకంటె వేఱుగ, ప్రకృతిజన్యములుగ గూంచుచుందురు. కనుకనే వారు సదా దృక్స్వరూపమగు ఆత్మయందే నిలకడగలవారై సంసారబంధమున తగుల్గొనక యుందురు. ఈప్రకారముగ మనస్సు, చిదాభాసుడుకూడ ప్రకృతియందంతర్గతములేకావున అవి ఆత్మకావనియు, అవి దృశ్యపదార్థములేయనియు, కాబట్టి మనస్సుతో తాదాత్మ్యమునొందక మనస్సాక్షి యగు ఆత్మయందు నిలుకడకలిగియుండవలెననియు, ప్రతిబింబరూపమను చిదాభాసునితో ఐక్యమొందక బింబభూతమగు శుద్ధచైతన్యాత్మయందే స్థితిగలిగియుండవలెననియు బోధించునట్టి మహోన్నత సత్యములను భగవాను డీ యధ్యాయప్రారంభమున వ్యక్తముజేసి సాధకలోకమునకు గొప్ప ఉపకారమును గలుగజేసెను. ఈప్రకారముగ ప్రకృతి జడమైనప్పటికిని ఆ ప్రకృతికి ఆధారభూతుడై, ఆ ప్రకృతియందు సర్వత్ర వ్యాపించి పరమాత్మయే విలసిల్లుచున్నాడు. ఆధారములేనిచో ఆధేయము నిలువదు. (రజ్జుసర్పభ్రాంతియందు) రజ్జువులేనిచో సర్పము నిలువదు. వాస్తవముగ సర్పమునందంతటను రజ్జువే వ్యాపించియున్నది. రాత్రి తనయందు జనించిన స్వప్నములోని పురమందు, జలమందు, భవనములందు, జీవులందు తానేయంతటను వ్యాపించియున్నాడుకదా! అట్లే పరమాత్మ ఈచరాచర

జగత్తులోని సమస్తపదార్థములందును 'సూత్రే మణిగణా ఇవ' అనునట్లు మణులయందు దారమువలె వ్యాపించియున్నాడు.

దేవుడు అంతట నున్నచో కనిపించుటలేదేమి యని కొందఱడుగుదురు. పుష్పమాలలోని దారము కనిపించునా? పాలలోని వెన్న కనిపించునా? నువ్వులలోని నూనె కనిపించునా? కనిపించనంతమాత్రముచేత అవి లేకపోయినవా? అవి ఉన్నవి. కాని ఈ నేత్రములకు కనిపించవు. వివేకనేత్రమునకు కనిపించును. చంటిపిల్లవానికి పుష్పమాల చూపినచో పుష్పములు సత్యము, దారము అసత్యము అని చెప్పును. దారము లేనేలేదని వాదించును. స్థూలనేత్రమే అతనికి ప్రమాణాధారము. వివేకనేత్రము అతనికి లోపించినది. పెద్దవారికి అది కలదు. కావున కంటికి కానరాకున్నను దారము కలదనియే వారు చెప్పుదురు. అంతియేకాదు, ఆ పువ్వులన్నిటిని క్రిందపడకుండ పట్టియుంచి, వానికి ఆధారభూతమై యున్నదనియు వచింతురు. అట్లే ఈ చరాచరజగత్తు అంతటికిని ఆధారభూతమై, ప్రాణప్రదమై యొప్పుచు పరమాత్మ ఎల్లెడలను వ్యాపించియున్నాడు. అతడు లేని వస్తువే లేదు.

భగవంతుని ఆస్తిత్వమును గూర్చి రామతీర్థస్వామి అమెరికాలో ఉపన్యసించుచున్న సందర్భములో, సభామధ్యము నుండి ఒక నాస్తికుడులేచి 'మీరు చెప్పినది యంతయు తప్పు; దేవుడు లేనేలేడు' అని హుంకరించెను. రామతీర్థులు ప్రశాంత చిత్తముతో ఆతనిని పిలిచి 'అయ్యా, ఆ మీ అభిప్రాయమును బోర్డుపై వ్రాయుడు' అని చెప్పెను. వెంటనే అతడు సీమ సున్నము తీసికొని బోర్డుపై పెద్ద అక్షరములతో "God is

nowhere" (దేవుడు ఎక్కడను లేడు) అని వ్రాసిపెట్టెను. రామతీర్థులంతట బోర్డుకడకేగి సీమసున్నముతో ఆవాక్యములో 'now' ప్రక్కన ఒకనిలువుగీటు పెట్టెను. తత్క్షణమే ఆవాక్యము 'God is now here.' (దేవుడు ఇప్పుడు ఇక్కడే ఉన్నాడు) గా మారిపోయెను. 'అయ్యా, మీరు వ్రాసిన వాక్యము దేవుని అస్తిత్వమునే చక్కగ నిరూపించుచున్నదే' అని రామతీర్థులాతనికి చమత్కారముగ హితబోధచేసి పంపివైచెను. అట్లే దైవముయొక్క అస్తిత్వమును ఎవరును నిరాకరించజాలరు. తన ఆత్మను, తన మనస్సాక్షిని యెవరైన లేదనగలరా? ఈ సత్యమునే గీతాచార్యుడు నిరూపించుచు 'మత్తః పరతరం నాన్యత్కించిదస్తి ధనంజయ'. 'ఓఅర్జునా! నేను లేని పదార్థమే ప్రపంచమున లేదు'-అని ఉగ్గడించెను.

ఈ పరమసత్యము హృదయమున బాగుగ జీర్ణమైనచో ఇక మనుజుడు ఏపాపమున్ను చేయజాలడు. ఏలయనిన, ఒక్క అణువైనను దైవేతరముగ లేనపుడు దైవదృష్టిలో పడకుండ ఎవడైన ఏ కార్యమైన చేయగలడా? భగవంతుడు మన హృదయముననే దాగి అతి సూక్ష్మములగు సంకల్పములను గూడ వీక్షించుచుండ ఇక బాహ్యకార్యములనుగూర్చి వేఱుగ చెప్పవలెనా? కావున దేవుని ఎవరును మోసగింపలేరు. ఒక వేళ మోసగించుటకు యత్నించిరా, వారే మోసపోవుదురు.

ఇటీవల ఒక కాలేజి విద్యార్థి పెద్దపరీక్షలు (Annual examinations) సమీపించినపుడు తాను గణితశాస్త్రములో చాల వెనుకబడియుండుటవలన ఇకగట్టెక్కుట కష్టమని తలంచి

తన గ్రామములోని దేవాలయమునకుబోయి దేవునకు నమస్కరించి 'మహానుభావా! రేపటిదినము గణితపరీక్ష. నాకు ఆ విద్యతో ప్రావీణ్యములేదు. పరీక్ష తప్పినచో విద్యార్థి సంఘములో నగుబాట్లపాలగుదును. కావున దయయుంచి అద్దానియందు నన్ను కడతేర్చినచో నీకు పులిహోర, చక్కెరపొంగలితో చక్కని నైవేద్యమును సమర్పించుకొందును. దేవా! పాహి, పాహి' అని మొరపెట్టుకొని ఇంటికి వెడలిపోయెను. మరుసటి రోజు పరీక్ష ఏతెంచెను. ప్రశ్నపత్రములు అందఱికిని పంచిపెట్టిరి. మన కథానాయకుడగు విద్యార్థికిన్ని యిచ్చిరి. కాని ఏమని చెప్పవచ్చును! అతని ఆనందమునకు మేరయే లేదు. అన్నియు తనకు తెలిసిన లెక్కలే! కావున అత్యానందముతో భగవానునకు లోలోన తన జోహారులర్పించుకొనుచు చకచక ఒక్కగంటలో అన్ని లెక్కలను నిర్దుష్టముగ చేసిపారవైచెను. పరీక్షాకాలము 3 గంటలు ఏర్పాటుచేయబడెను. కావున మన విద్యార్థికి ఇంకను రెండుగంటల కాలము మిగిలియేయున్నది. ఊరకనే కూర్చొనుట దేనికనితలంచి అతడు కొన్ని తెల్ల కాగితములను తీసికొని దానిపై మఱుసటిరోజు భగవంతునకు సమర్పించవలసిన నైవేద్యమునకు కావలసిన వస్తువుల జాబితా తయారుచేయ నారంభించెను. పులిహోరకు బియ్యము, నూనె, చింతపండు, మిరపకాయలు, పసుపు మున్నగునవియు; చక్కెర పొంగలికి బియ్యము, చక్కెర, పెసరపప్పు, నెయ్యి, జీడిపప్పు, ద్రాక్ష, ఇత్యాదులను ఏయే పరిమాణములలో కావలెనో, అంతయు వ్రాసిపెట్టెను. ఇంతలో అతనికొక ఆలోచనతట్టెను. భగవంతునకు రుచులెందుకు? విలాసము లెందుకు? కావున

ద్రాక్ష అనవసరం, జీడిపప్పు అంతకంటె అనవసరం, అని తలచి ఆ రెండు పేర్లను, దానికగుఖర్చున్ను జాబితాలో కొట్టివేసెను. మఱల కొంతసేపు దీర్ఘాలోచన చేసి చక్కెర సగానికిసగం తగ్గించెను. పిదప గీతయందలి "కట్వామ్లలవణాత్యుష్ణ..." అను శ్లోకము జ్ఞాపకమునకురాగా, దేవునకు పులుపు, కారం ఇష్టముండదని నిశ్చయించి, ఆ యా వస్తువులను తీసివేసెను. ఈ ప్రకారముగ తాను వ్రాసిన వస్తువులన్నిటిని కొట్టివేయుటయో తగ్గించుటయో జరుపుచుండెను. తుట్టతుదకు అతనికొక విచిత్రమగు ఊహ జనించెను-"అసలు దేవునకు ఈగొడవ అంతయు దేనికి? ఇంత ఖర్చు ఎందులకు? 'పత్రం పుష్పం ఫలం తోయం' అని చెప్పియేయున్నారుగదా, అవి యిచ్చుకుంటే చాలదా?" అని భావించి ఇతఃపూర్వము వ్రాసిన జాబితా మొత్తం కొట్టి పారవేసెను. మరల యోచించి, 'పత్రపుష్పఫలాదులలోకూడ ఫలము, పుష్పములు, పత్రములు ఈ కాలములో డబ్బు ఇచ్చినగాని దొఱకవు. ఒక్క తోయమే (నీరు) అందుబాటులో ఉన్నది. దొడ్డిలో బావిఉన్నంతవఱకు దానికి దిగులులేదు' అని తలంచి దేవునకు తోయము (జలము) మాత్రము సమర్పించుటకు తీర్మానించెను. మరల దానినిగూడ రద్దుచేసి 'నీళ్ళుతోడు సట్టి ఆ ప్రయాసకూడ ఏల? మానసికముగ నీళ్ళుసమర్పించినట్లు భావించిన చాలదా?' అనుకొనెను. ఇవ్విధమున నతనిమనంబున భావనాపరంపరలు పరుగెత్తుచుండ, పరీక్షాసమయము పూర్తి కాగా, పరీక్షాధికారి ఆ విద్యార్థియొద్దకువచ్చి 'Answer Papers Please, Quick ! (జవాబు కాగితములు త్వరగా ఇవ్వండి) అని అరచెను. ఆ తొట్రుపాటులో ఆ విద్యార్థి పులి

హార చక్కరపొంగలి బాపతు కాగితమును మడతపెట్టి అధి కారికి ఇచ్చివేసి, తాను వ్రాసిన అసలు లెక్కలకాగితములను మడతపెట్టి ఇంటికి తీసుకొని వెళ్ళెను. ఇంటికి రాగానే తండ్రి 'ఏమిరా లెక్కలు బాగుగ వ్రాసినావా ?' అని యడుగ "అద్భుతముగ వ్రాసితిని. భగవంతుడు కరుణించినాడు. అన్నియు తేలిక లెక్కలే వచ్చినవి" అని కుమారుడు బదులుచెప్పెను. ఇంతలో తండ్రి 'ఏదిరా ! ప్రశ్నపత్రము చూతము. ఇటు తెమ్ము' అని యడుగ, కుమారుడు తాను తెచ్చిన కాగితము లను చూపెను. అవిచూచి తండ్రి సంభ్రమచిత్తుడయ్యెను. 'ఇది యేమిరా, నీవు పరీక్షలో వ్రాసిన లెక్కల కాగితములు **(Answer Papers)** అధికారికి ఇవ్వక ఇంటికి తెచ్చినావేమి? అయ్యో ! ఎంత పొరపాటు చేసితివి ?' అని మందలింపగా కుమారుడదిచూచి లోలోన దుఃఖముచే కుమిలిపోవుచు 'నేను దేవుని మోసగించుటకు యత్నించితిని, ఫలితముగ నేనే మోసపోతిని. ఇకమీద ఎన్నడును ఇట్టి మోసకృత్యమును చేయను. దయామయుడు, భక్తవత్సలుడు నాపై కరుణామృత వర్షము కురిపించి, నన్నుగట్టెక్కించినప్పటికిని నేనే చేతులారా దానిని జారవిడుచుకొంటిని. ఇట్టి దుర్బుద్ధి ఇకమీదట నాకెన్న డును కలుగకుండుగాక !' అని పరితపించెను.

కావున, భక్తమహాశయులారా ! భగవంతుని యునికి ఏదియో యొకచోటునమాత్రమే కలదని తలంపక బ్రహ్మాండ మందలి ప్రతి అణువునందును, జీవులయొక్క ప్రతిసంకల్పము నందును ఓతప్రోతమై వెలయుచుండునని నిశ్చయింపవలయును. నీటియందలి రసము ఆతడే, సూర్యచంద్రులయందలి ప్రకాశ

మాతడే. ఆకాశమందలి శబ్దమాతడే. జీవులయందలి చైతన్య శక్తి ఆతడే. వెయ్యేల సమస్త చరాచర ప్రపంచము ఆతని యందే కల్పించబడియుండుటచే సర్వము భగవన్మయమై యున్నది. ఈ సత్యమును తెలిసికొనినవాడు ధన్యుడు. అట్టివాడు పాపాచరణమున కెన్నడును ఒడిగట్టక దైవప్రాప్త్యుపాయములనే అన్వేషించుచుండును.

కాని అందరికిని ఇట్టి సద్బుద్ధి యేల కలుగుటలేదు ? శ్రీకృష్ణమూర్తి అందులకు చక్కని సమాధాన మొసంగెను. త్రిగుణాత్మకమగు మాయచే జనులు ఆవరింపబడియుండుటచే, త్రిగుణములకు అతీతముగనున్న భగవంతుని స్వరూపమును వారెఱుగజాలకున్నారని వచించెను—

త్రిభిర్గుణమయైర్భావై రేభిః సర్వమిదం జగత్
మోహితం నాభిజానాతి మా మేభ్యః పర మవ్యయమ్. (7-13)

సత్త్వరజస్తమోగుణములను మూడుత్రాళ్ళచే పెనవేసికొనియుండుటచే ఈ మాయ చాలా దుర్భేద్యముగ నున్నది. దీని ప్రభావమువలననే జనులు జనన మరణాది ఈ సంసారసముద్రమున దరిగానక ఈదులాడుచున్నారు. ఈ మాయావశముననే మలమాంసములతో గూడిన ఈ శరీరమును జీవుడు తానుగా భావించుచున్నాడు. మఱియు నశ్వరములగు భోగవిలాసములందు పరమప్రీతితో రమించుచున్నాడు. క్షణికములగు దృశ్యపదార్థములందు శాశ్వతత్వబుద్ధికలిగి వానివెంట పరుగిడుచున్నాడు. ఉన్న దేవుని లేడనుచున్నాడు. లేని జగత్తును ఉన్నదనుచున్నాడు. తత్ఫలితముగ-కట్టుపుల్ల నదీప్రవాహమునబడి

కొట్టుకొనిపోవుచు కొంతసేపు ఒక ఒడ్డునుతాకి, మరల కొట్టు కొనిపోయి మఱియొక యొడ్డును తాకునట్లు-ఒక జన్మ నాశ్ర యించి, అటనుండి మఱియొక జన్మను పొందుచు, ఇట్లు అనాది కాలమునుండి భవదుఃఖ ప్రవాహమున కొట్టుకొని పోవు చున్నాడు. ఈ ప్రకారముగ బలీయమగు మాయయొక్క-ప్రభావముచే మనుజుడు భగవంతుని తెలిసికొనజాలక జనన మరణములకు లోనగుచున్నాడు. అయితే ఇక జీవునియొక్క-గతి యింతియేనా? ఈమాయనుండి తప్పించుకొనుటకు తెరువు లేదా? ప్రకృతియొక్క- గుప్పిటనుండి విడివడుటకు ఉపాయము లేదా? తరతరములు జీవు డిట్లు బాధపడవలసినదేనా? కాదు. తప్పించుకొనుటకు ఉపాయము కలదు. మాయ భయంకర మైనదే, దాటుటకు కష్టసాధ్యమైనదే, కాని అసాధ్యము మాత్రముకాదు. మాయను దాటుటకు చక్కని యుపాయ మును భగవానుడు సెలవిచ్చెను-

> దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా
> మామేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తితే. (7-14)

'నన్ను ఎవరు శరణుజొచ్చెదురో అట్టివారు ఈ మాయనుదాటి వేయగలరు'అని శ్రీకృష్ణపరమాత్మ జనులందఱికిని అభయమొ సంగెను. ఈశ్లోకము సాధకులకు అతిముఖ్యమైనదిగా నున్నది. ఏలయనిన, ప్రతిజీవియు త్రిగుణాత్మకమై, దుఃఖప్రదమైనట్టి ఈ మాయచే నానాబాధలుపడుచు, దానిపీడను వదలించుకొను టకై తబ్బిబ్బులుపడుచున్నాడు. కాని ఏ వేవో ప్రయత్నములు చేసినను, ఆత్యంతిక దుఃఖరాహిత్యము వానికి కలుగుటయేలేదు. సర్వదుఃఖనివారణకు, సమూలమాయావినాశమునకు సరియైన

యుపాయమాతనికి గోచరింపక అవస్థపడుచున్నాడు. అట్టి సంద ర్భమున శ్రీకృష్ణభగవానుడు జీవరాసులపై కరుణగలిగి జనన మరణ ప్రవాహమునుండి వానిని తప్పించుటకై, భవసాగర మును దాటించుటకై ఈప్రకారముగ అమూల్యమగు సాధనను వెల్లడించెను. భగవంతుని శరణుబొందుటయే ఆసాధన. సత్య వస్తువును ఆరాధించుటయే ఆ యుపాయము. శ్రీశంకరభగవ త్పాదాచార్యులను ఒకానొక శిష్యు డిట్లు ప్రశ్నించెను.

అపార సంసార సముద్రమధ్యే
సమ్మజ్జతో మే శరణం కిమస్తి
గురోకృపాలో కృపయావదైతత్.

'కరుణామయుఁడవగు ఓగురుదేవా! అపారమగు సంసారమహా సముద్రమున మునిగిపోవుచున్న నాకు శరణ్యమేది? దయచేసి వచింపుడు.' అందులకు గురువర్యుడగు శ్రీ శంకరు లిట్లు సమాధాన మొసంగిరి—

'విశ్వేశపాదామ్బుజ దీర్ఘనౌకా'

'లోకేశుఁడగు భగవానుని పాదపద్మము లను విశాల నావయే అట్టివారికి శరణ్యము.' కదలుచున్న వానికి కదలనివస్తువే శర ణ్యము. అనిత్యమైనవానికి నిత్యవస్తువే శరణ్యము. దేశ కాల క్రియలకు లోబడినవానికి దేశకాలక్రియాతీతుడే శరణ్యము. అట్టివాడు భగవంతు డొకడే. కావున జీవరాసులకు అతనిని ఆశ్రయించుటతప్ప వేఱుమార్గములేదు. దానినే శ్రీకృష్ణ మూర్తి ఈ యధ్యాయమున సెలవిచ్చెను. కొన్నికొన్ని ఉత్సవ ములు జరుగునపుడు అనేక వినోదవస్తువులు, ఆటవస్తువులు ప్రదర్శింపబడుచుండును. అందులో 'రంగులరాట్నం' అను

యంత్రముపిల్లలను విశేషముగ ఆకర్షించుచుండును. కొయ్యతో చేసిన ఏనుగు, ఒంటె, గుఱ్ఱము మొదలైనవి ఇనుపకమ్ములకు బిగింపబడియుండును. పిల్లలు కొంత డబ్బు చెల్లించి వానిపై నెక్కి-కూర్చుందురు. యంత్రము త్రిప్పబడును. వాహనములు, వానిపై గూర్చున్న పిల్లలు అందఱు గిరగిర తిరుగుచుందురు. ఇంతలో ఒక పిల్లవానికి కండ్లు తిరిగినవి యనుకొనుడు; ఆతడేమిచేయును? ఇనుపకమ్మిని వదలివేసినచో క్రిందపడి మరణించును. అట్లే కూర్చున్నచో కండ్లు తిరుగుచున్నవి-అత్తఱి యాతడు యంత్రమును త్రిప్పువానిని కేకవేయును. 'ఓయీ, యంత్రమును నిలుపుము' అని యఱచును. ఇది తప్ప వేఱొక యుపాయ మాతనికి లేనేలేదు. పిల్లవాని యాక్రందనమును విని యంత్రగాడు దానిని నిలుపును. అట్లే ఈసంసారచక్రమున తగుల్కొని, కర్మప్రభావముచే నూర్ధ్వాధోలోకములకు జనుచు, దుఃఖాతురులై యున్న జీవకోటికి శాంతిసుఖములు లభించవలెననిన, ఆ చక్రమును త్రిప్పుచున్న చైతన్యశక్తిని ఆశ్రయించవలెను. ఆతడే పరమాత్మ; అతనిని శరణుబొందినవాని కిక భవభీతి యుండనే యుండదు. ఎట్లనిన—

కొన్ని గొప్పగొప్ప భవనములందు, బంగళాలలో ద్వారముకడ కావలికాచుకుక్క-యుండును. అది వీధిలోతిరుగు సామాన్య శునకమువలె మత్తుగా నుండదు. మహాపౌరుషముతో గూడి యుండును. ఇంటివారుతప్ప క్రొత్తవారెవరువచ్చినను అఱచును. సందర్భపడినచో కఱచునుగూడ. ఒకపర్యాయ మొక పెద్ద మనిషి ఒకానొక బంగళాయొద్దకురాగా ద్వారముకడనున్న కుక్క- అడ్డుపడెను. అది చాల భయంకరముగ నుండెను. ఆతని

కేమియు తోచలేదు. దాని నెదుర్కొనుటకు తగిన శక్తిసాహస ములులేవు. వెంటనే ఆ ఇంటియజమానిని కేకవేసెను. యజ మాని లోపలినుండి రాగానే కుక్క తన భీషణాకృతిని వదలి శాంతిరూపమును ధరించి ఆ క్రొత్తవానిని లోపలికి పోనిచ్చు టయేగాక అతనికి మిత్రుడుగ వ్యవహరించెను. ఈ యాను కూల మెట్లేర్పడెను? యజమానిని ఆశ్రయించుటవలన. అట్లే మోక్షసౌధములోనికి పోనీయక మాయయను భయంకర శున కము జీవుని యడ్డగించుచున్నది. క్లేశములపాలుచేయుచున్నది. అట్టిసమయమున మోక్షాధీశుడగు పరమేశ్వరుని శరణు బొందుటయే జీవులకు ఏకైకమార్గము. ఈ మార్గము నవలం బించియే యెందఱో మహానీయులు పూర్వము తరించియుండిరి. తరించుచున్నారు. తరింపగలరు. ఇట్టిమార్గమునే భగవానుడు గీతయందు ప్రకటించి జనులకు పరమశ్రేయము నొనగూర్చెను.

ఇట్టి శ్రేయోమార్గము నేల అవలంబించరాదు? అనం తానంద మొసంగు పరమేశ్వరుని యేల శరణుబొందరాదు? క్షణిక భోగవిలాసములందు జీవితములను ధారబోయనేల? ఎంతయో పుణ్యమను డబ్బు వెచ్చించి ఈ మానవశరీరమను నౌకను జీవుడు కొనియున్నాడు. నౌక ఎల్లకాలము చక్కని స్థితిలోనుండునా? ఉండదు. కొంతకాలమునకు చిల్లులుపడును. శైథిల్యమునొందును. అట్లు కాకపూర్వమే సముద్రమును దాటి వేయవలెను. నావ చక్కని స్థితిలో నున్నపుడే నావికుడు జాగ రూకుడై దాటవలసిన జలములను దాటివేయునుగదా! అట్లే-

మహతా పుణ్యపణ్యేన క్రీతేయం కాయనౌ స్త్వయా
పారం దుఃఖోదధేర్గన్తుం తరయావన్న భిద్యతే.

మహత్తర పుణ్యమును ఖరీదు చెల్లించికొనినటువంటి ఈమానవ దేహము శిథిలముకాకపూర్వమే సంసారమహాదుఃఖసాగరమును జీవుడు తరించివేయవలెను. బాల్యము అతిత్వరితముగ దాటిపోయి యౌవన మేతెంచుచున్నది. 'ఆహా, యౌవనవైభవ మెంత చక్కగనున్నది ?' అని అనుకొనుచుండగనే శరీరము ముడతలుపడ నారంభించుచున్నది. జుట్టు తెల్లబడుచున్నది. పండ్లు ఊడుచున్నవి. చూపు తగ్గుచున్నది. వ్యాధులు బాధించుచున్నవి. క్రమముగ వార్ధక్యము జొరబడి తాను ముందు బోవుచు 'ఓయీ! మృత్యువా! ఇకనీవు వెనుకరావచ్చును' అని అంతకుని ఆహ్వానించుచున్నది. ఈ విషయములన్నిటిని గరుడ పురాణము ఎంత చక్కగ వర్ణించి చెప్పినదో చూడుడు-

జరా దర్శితపన్థానం ప్రచణ్డవ్యాధిసైనికం
మృత్యుశ్శత్రురధిష్ఠోఽసి త్రాతారం కిం న పశ్యసి. (గరుడపురాణము)

'వార్ధక్యము దారిచూపుచుండ, భయంకరరోగములను సైనికులతో గూడి మృత్యువను శత్రువు నీమీదికి దండెత్తివచ్చుచున్నాడు. రక్షించువానికొఱకు ఏల ప్రయత్నించుటలేదు?' అని ఈ శ్లోకార్థము. శరీరము బుద్బుదము (బుడగ) వంటిది. అది దీర్ఘకాలము ఉండనేరదు. ఉండిన కొద్దికాలముకూడ ఎన్నియో మరమ్మత్తులు చేసిననే ఒకదారికి వచ్చుచుండును. ఒకరోగము పోయిన ఇంకొకరోగము తగుల్కొనుచుండును. వాటికి 'మందులు, మాకులు' వేయుటలోనే పుణ్యకాలము యావత్తు గడచిపోవుచున్నది. పోనిండు, సాంసారిక స్థితిగతులు చూతమా, అవికూడ అంతచక్కగనే యుంటున్నవి. కుటుంబములో ఒకరి పొత్తు ఒకరికి గిట్టక ఎన్నియో కలహములు, చర్చలు, రగడలు

చెలరేగుచున్నవి. కాబట్టి అశాంతకరమగు ఈ వాతావరణ ములో పడియున్న జీవుడు శాంతికి మార్గమును అతిశీఘ్రముగ వెతకవలసియున్నది. భావికాలశ్రేయస్సునుగూర్చి యోచించవలసియున్నది. వర్తమానకాలమునుమాత్రము చూచునది పశువు. భూతభవిష్యత్తులనుగూడ చూచువాడు మానవుడు. ఎన్ని యో జన్మలు ఇప్పటికి గడచినవి. ఎన్ని యో జన్మలు రానున్నవి. ఈఅనంతజీవితముఒక పెద్దగొలుసువలెనున్నది. ఒక్కొక్క జన్మ ఒక్కొక్క రింగువంటిది. గొలుసులోని రింగునకుఈప్రక్కన ఆప్రక్కనగూడ అనేక రింగులున్నట్లు ఈ జన్మకు వెనుక ముందు అనేకజన్మలున్నవి. అయితే వెనుకటిజన్మలు దాటిపోయినవి. కనుక వానిని మనమేమియు జేయజాలము. రానున్న జన్మలుమాత్రము ఇపుడు మనచేతిలో నున్నవి. వానిని అంతమొందించుటకు తగిన శక్తిసామర్థ్యములు మానవునకు కలవు. శమదమాది సాధనసంపత్తిని అలవఱచుకొని వైరాగ్యము, భక్తి మున్నగు దైవగుణములను పెంపొందించుకొని క్రమముగ జ్ఞానాగ్నిని రగుల్కొల్పినచో కర్మకట్టెలన్నియుదగ్ధములుకాగా, ఇక భవిష్యజ్జన్మలకుపూర్ణావిరామము(Fullstop)ఏర్పడిజన్మరాహిత్యము సిద్ధించగలదు. కావున శరీరము ఆరోగ్యముగ నున్నపుడే, వార్ధక్యమురాకమునుపే, ఇంద్రియములశక్తి క్షీణించక పూర్వమే, ఆయుస్సు క్షయించకముందే తన శ్రేయస్సును గురించి తాను యోచించవలెను. అట్లుకాక, ఇంకను చాల సమయమున్నదిలే, ముసలి అయినపిదప దేవుని విషయము ఆలోచించెదములే, ఇప్పుడేమితొందర ? అని అనుకొని భగవ

ద్విషయమును వాయిదా వేయుటకై యత్నించువారిపరిస్థితి కథ లోని పల్లెటూరివాని పరిస్థితివలె అతిదారుణమైయుండును.

ఒకానొక గ్రామములో నొక అర్ధరాత్రి సమయమున గుడిసెలకు నిప్పంటుకొని భగభగమండిపోవుచుండెను. గ్రామస్థులందఱును నిద్రలేచి వారివారి సామానులన్నియు బయటకు లాగి ఆపిదప ఏమిచేయవలెనో తోచక అందఱు ఒక రచ్చబండపై జేరి కర్తవ్యమును ఆలోచింపదొడగిరి. గ్రామశాసనసభయొక్క అత్యావసరసమావేశమది. అందొకడు లేచి 'మహాజనులారా! ఇది తామసించుటకు సమయముకాదు. వెంటనేఇంటికి ఒక్కొక్కరుచొప్పున వెళ్ళి తాటాకులు పెరికివేసి నిప్పును ఆర్పవలెను' అను అభిప్రాయమొసంగెను. మఱియొకడు తక్షణమే లేచి 'గౌరవసభ్యుని అభిప్రాయముతో నేనేకీభవించను. ఏలయనగా, ఆకార్యమువలన నిప్పు పూర్తిగా శమించదు. కావున సమీపముననే పట్టణము కలదు. ఎవరైనను అచటికి పరుగెత్తి వెళ్ళి నిప్పుచల్లార్పు యంత్రము (Fire Engine) ను తీసికొని వచ్చినచో ఒక్కనిముషములో అది నిప్పంతయును చల్లార్చి వేయగలదు' అని చెప్పి కూర్చుండెను. ఈప్రకారముగ ఒక్కొక్కరు వారివారికి తోచిన అమూల్యభావములను, సలహాలను చెప్పుచుండగా అత్తరి సభామధ్యమునుండి ఒక పెద్దమనిషి లేచి 'అయ్యా! ఈమాటలన్నియు కట్టిపెట్టుండి. మీరిచ్చిన సలహాలలో ఒకటియు సందర్భోచితముగ లేదు. నేనెంతయో ఆలోచించి చక్కని యుపాయమును చెప్పుచున్నాను. దానిని విని ఆచరణలోపెట్టితిరా, గ్రామమును అగ్నికి ఆహుతికాకుండ తప్పించగలరు. లేకున్న మొత్తము పరశురామప్రీతి కాకుండ

మానదు. నేను చెప్పబోవు ఉపాయ మేమనగా, గ్రామస్థు లందఱున్ను వారివారి పలుగులు పారలు తెచ్చి సమీపముసే ఒక బావి త్రవ్వినచో కావలసినన్ని నీళ్ళుదొరకును. ఆ నీటిచే ఎంతటి అగ్నినైనను సులభముగ ఆర్పివేయవచ్చును. కావున కర్తవ్యమునకు గడంగుడు' అని ఆనతిచ్చెను. అదివినిఅందఱును పక్కనన్విరి. అట్లే నవద్వారములతో గూడిన ఈదేహమను పంజరమున ప్రాణమను పక్షి ఏక్షణములోనైనను ఎగిరిపోవు టకు సిద్ధముగనున్న ఈసమయమున, వ్యాధులు, విఘ్నములు, వియోగములు, అశాంతికర పరిస్థితులు తండోపతండములుగ వచ్చి మీదపడుచుండ, మీనమేషములు లెక్కపెట్టుచు, కడ తేరు మార్గమునుగూర్చి ఆలోచించక 'దైవధ్యానమునకు ఇంకను చాల సమయమున్నదిలే' అని తామసించు జనుల యొక్క యోచన బావిత్రవ్వ ఘనునియొక్క యోచనవలెనే యుండును. కనుకనే భర్తృహరి—

'సందీప్తే భవనే తు కూపఖననం ప్రత్యుద్యమః కీదృశః'

అని గంభీరముగప్రశ్నించి, అట్టిదీర్ఘసూత్రులను పరిహాసించెను. పైనదెల్పిన కూపసాదృశ్యముసే యాతడు తన యీవాక్యముల ద్వారా వ్యక్తముచేసెను. కావున విజ్ఞుడగువాడు బాగుగ యోచించి అమూల్యమగు ఈమానవజీవితమునుభోగములందు గాక యోగమునందేవినియోగింపవలెను. ఆత్మజ్ఞానమును శీఘ్ర ముగ సంపాదించి జన్మసాఫల్యము బొందవలెను. భగవంతుని పాదపద్మములను ఆశ్రయించి భవరోగమును బాపుకొనవలెను.

అచిన్త్యరూపో భగవాన్నిరంజనో
విశ్వంభరో జ్యోతిమయః పరాత్మా

స భాషితో యేన హృది క్షణేన
వృథాగతం తస్య నరస్య జీవనమ్. (శుకుడు)

'అతిసూక్ష్మరూపుడును, నిర్మలుండును, విశ్వాధారుడును, ప్రకాశస్వరూపుడునగు పరమాత్మను ఎవరు తనహృదయమందు ఒక్కక్షణకాలమైనను ధ్యానింపరో, అట్టివాని జీవితము వ్యర్థమ'ని శ్రీశుకులవారు రంభకు హితవు చెప్పిరి. ప్రాపంచిక భోగవిలాసములందును, శృంగారకృత్యములందును, కామవికారములందును నిమగ్నుడుగాని మనుజునిజీవితము నిరర్థకమని రంభ పలుకగా, ఆమెవాక్యములను ధిక్కరించి శుకుడు పై విధముగా తన యభిప్రాయమును వెలిబుచ్చెను. శుకుని వాక్యములు పరమ సత్యములు. రంభ పలుకులు అజ్ఞానిభావమునే ప్రతిబింబింపజేయుచున్నవి. శుకుని పలుకులు శాస్త్రసమ్మతములై జ్ఞానియొక్కభావమునే ప్రతిబింబింపజేయుచున్నవి. అజ్ఞాని మాయకు లోబడియున్నాడు. కావున దృశ్యపదార్థములనే సత్యమనినమ్మి విషయానందమునే తన జీవిత లక్ష్యముగ నొనర్చుకొనుచున్నాడు. బాగుగ విచారించి చూచినచో, ఆ విషయములందలి సుఖము కేవలము మనఃకల్పితముగనే తేలుచున్నది. "రోగశాంతికరకృత్యము భోగమనంగ జెల్లునే" యని భర్తృహరి ప్రశ్నించుట చాల సమంజసముగ నున్నది. అనగా భోగము వాస్తవముగ భోగముకాదు; అది రోగమును శమింపజేయుటకు గావించుకార్యము మాత్రమే అని యాతడు వచించెను. ఎట్లనిన, 'దప్పిక' అను రోగము వచ్చినపుడు చల్లటి పానీయములు, సోడా, లైమ్‌జ్యూస్, క్రష్-ఇత్యాది పదార్థములను త్రాగి ఆరోగమును తొలగించుకొనుచున్నాడు. అట్టిచో

ఆ పదార్థములు ఔషధములే యగునుగాని భోగ్యవస్తువు లెట్లగును ? అటేవిధముగ 'ఆకలి' అను రోగము తగులుకొనునపుడు అన్నము, కూరలు, పిండివంటలు మున్నగు వస్తువులను సేవించి ఆ రోగమును తొలగించుకొనుచున్నాడు. కావున అన్నము, ఫలహారములు మున్నగునవి మందులే యగును.అట్లే కామాగ్ని యగు జ్వరము తగులుకొనినపుడు శృంగారచేష్టలను ఔషధమును సేవించి దానిని శమింపజేసికొనుచున్నాడు. కాబట్టి మనుజుడు తాను గొప్పగ తలంచునట్టి ఆ యా భోగములన్నియు రోగనివారణ కృత్యములే యగుచున్నవి.

ప్రతీకారో వ్యాధేస్సుఖమితి విపర్యస్యతి జనః

అట్టి వ్యాధి ప్రతీకార చర్యనే సుఖమని తలంచి మానవుడు భ్రమించుచున్నాడు. వాస్తవముగ అది సుఖముకాదు. సుఖాభాసమే. సుఖము భగవంతుని పాదపద్మములను సేవించుటయందే కలదు. హృదయమందు వెలుగొందుచున్న పరమాత్మను భజించుటయందేకలదు. 'సుఖమక్షయమశ్నుతే'అని భగవానుడు తెలిపినట్లు అట్టి పరమాత్మను ఆశ్రయించినవారు అక్షయసుఖమును పొందుచున్నారు. కనుకనే శ్రీకృష్ణమూర్తి గీతయందు సమయము దొరికినపుడెల్లా 'మయ్యాసక్తమనాః'- నాయందే ఆసక్తిగల మనస్సుకలవాడవై యుండుము; 'మదాశ్రయః'-నన్నే ఆశ్రయింపుము; మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తితే'-నన్ను ఎవరు శరణుబొందుదురో వారే మాయను దాటగలరు-ఈ ప్రకారముగ మరల మరల నొక్కి చెప్పుటకు కారణము. కాబట్టి తుచ్ఛవిషయములపై కి

మనస్సును పోనీయక అరికట్టి-శాశ్వతమగు ఆత్మపైనె మనసు అద్ధా నిని మఱల్చవలెను. శివాలయములలో నందికేశ్వరుడు, విష్ణ్వాలయములలో గరుత్మంతుడు, రామాలయములలో హనుమంతుడు ఏ ప్రకారముగ ఆసీనులై యుండురో మీరు చూచియే యుందురు. వారి ముఖములు భగవంతునకు నెదురుగా నుండును (Directly opposite). వారు కొంచెము కుంచి వంకరగా కూర్చొనరు. అనగా దృశ్యవిముఖత్వము, దైవసుముఖత్వము వారి వైఖరిలో దృగ్గోచరమగుచుండును. వారి ముఖపద్మముల యందు భక్తిప్రపత్తులు, వినయవిధేయతలు, ఆధ్యాత్మిక తన్మయత్వము ఉట్టిపడుచుండును. ఆ విధముగ వారు కూర్చుండి సర్వజనులకును ఈ ప్రకారమగు చక్కటి బోధ యొనర్చుచున్నారు. 'ఓ జీవులారా! సత్యవస్తువు నాశ్రయింపుడు. క్షణిక జీవితమును ఇంద్రియార్థముల ననుభవించుటయందే వ్యర్థము చేయక, శాశ్వత సచ్చిదానంద పరబ్రహ్మము నవలోకించుట యందు వినియోగించి ధన్యులుకండు. ఎండమావుల కొఱకై పరుగెత్తకుడు. ఊర్ధ్వదృష్టి కలిగి యుండుడు. దైవదృష్టి నవలంబింపుడు' అని వారు ప్రబోధించుచున్నారు.

**There is but one the free, the knower, Self**
**Without a name without a form or stain**
**In Him is Maya dreaming all this dream**
**The witness, He appears as Nature, Soul**
**Know Thou art That, Sannyasin bold**
**Say 'Om Tat Sat Om'**

ఉండునది యెల్ల దానదై యొక్కటుండు
అతడే జ్ఞాతముక్తుండు ఆత్మ యతడె

అతనిలో నొక్క-మాయ దానలరుచుండు
కలల నెన్నియొ యద్దియె గనుచునుండు
కాని ఆ యాత్మ సాక్షియై కాంచుచుండు
అదియెనీవ ను సత్యంబు మది నెఱింగి
యె త్తిపాడుము ! కంఠము ఎ త్తిపాడు !
యతివరా ! ధీర ! ఓం తత్సదనుచు పాడు !

అని వివేకానందులు యతిగీతమున బాడినట్లు 'ఉన్నది ఒకే వస్తువు', మాయాప్రభావమున అదియే నానావిధజగజ్జాలరూపమున ప్రకల్పితమై కానవచ్చుచున్నది. అట్టి (ఏకమేవాద్వితీయం) బ్రహ్మమును ఆశ్రయించువారు, ధ్యానించువారు జీవితమున కృతార్థతను బడయగలరు. స్వల్పవస్తువుల నాశించువారు, స్వల్పసుఖములను వెన్నంటువారు తుదకు పశ్చాత్తాపపడవలసి వచ్చును.

**"Aim at a lion and miss it rather than hunt a jackal and catch it."**

'గురితప్పినను సింహమునేకొట్టుము కాని, నక్క-నువేటాడి పట్టుకొనవలదు' అను సామెత ఆంగ్లభాషయందు కలదు. అట్లే చంచలసుఖములయందు జీవితమును ధారబోయక, నిరతిశయాత్మానందమునే గ్రోలుటకు యత్నించవలెను. "ఓ దేవా! 'అసతోమా సద్గమయ' - అసద్వస్తువునుండి సద్వస్తువునకు గొనిపొమ్ము. 'తమసోమా జ్యోతిర్గమయ' - అజ్ఞానమునుండి జ్ఞానములోనికి తీసికొనిపొమ్ము. 'మృత్యోర్మా మమృతంగమయ' - మృత్యువునుండి అమృతత్వస్థితిని పొందింపజేయుము" అని భగవానుని ప్రార్థించవలెను. ఇట్టి భగవదాశ్రయముచే

అచిర కాలములోనే జీవుడు పరమశాంతిని, జీవన్ముక్తిని సొప్పక బడయగలడు.

ఈ ప్రకారముగ భగవంతుని ఆశ్రయించి సేవించువారలు నాలుగు తెరంగులుగ నుందురు. కొందరు ఏదైన బాధకలిగినప్పుడు, రోగము సంభవించినప్పుడు, ప్రమాదము వాటిల్లినప్పుడు మాత్రము భగవంతుని కేక వేయుదురు. ప్రార్థించుచుందురు. ఏడుకొండలవానికి మ్రొక్కుకొందురు. ఇదివరలో జ్ఞాపకమునకురాని దేవుడు ఆసమయమున మాత్రము వారికి చక్కగ జ్ఞాపకమునకు వచ్చును. అనేక ఇతర ప్రాపంచిక ఉపాయముల ద్వారా ఆబాధలను నివారించుటకు వారు మొట్టమొదట ప్రయత్నించుదురు. కాని విఫలురైనపుడు ఇక విధిలేక సర్వశక్తిమంతుడగు భగవానుని శరణు వేడెదరు. 'నీవేతప్ప ఇతఃపరంబెఱుగ' నని అప్పుడుకీర్తింప మొదలుపెట్టుదురు. ప్రాపంచికశక్తులకంటె, భౌతిక వస్తుసముదాయముకంటె భిన్నమగు దైవశక్తి ఒకటి కలదని వారపుడు గ్రహించి అద్దాని నాశ్రయించుదురు. ఎందరో నాస్తికులు, దేవునిమాట వినగనే పెదవి విఱచువారు కూడ భయంకర విపత్సముదాయము నెత్తినవచ్చిపడునపుడు ఉక్కిరిబిక్కిరి అయి 'కరుణింపుముతండ్రీ!' అని కేక వేసి ఆస్తికులుగ మారిపోవుచున్నారు. దీనినిబట్టి కష్టములుకూడ ఒకవిధముగ మానవునకు తారకోపాయముగ పరిణమించుచున్నవి. భగవత్సాన్నిధ్యమునకు గొనిపోవుటకు ఉపకరణములుగ వర్తించుచున్నవి. అందులకే కాబోలు కుంతీదేవి, శ్రీకృష్ణమూర్తి ఏదైన వరము కోరుకొమ్మని యడిగినప్పుడు—

విపదస్సన్తు నః శశ్వత్తత్ర తత్ర జగద్గురో
భవతో దర్శనం యత్స్యాదపునర్భవదర్శనమ్. (భాగవతము)

"తండ్రీ! జగద్గురూ ! నాకు ఎల్లప్పుడు ఆపత్తులు కలుగునట్లు వరమిమ్ము. ఏలయనగా, ఎద్దానిచే జపుడు మరల సంసార బంధమున తగుల్కొనడో, అట్టి నీయొక్క దర్శనము వాని ద్వారా నాకు లభించగలదు. (సుఖములందు నీ వెవ్వడైన మాయొద్దకు వచ్చినావా ! దుఃఖములందు మేము నిన్ను పిలుచుటయు, నీవు మాకడకు వచ్చుటయు సంభవించుచున్నది కదా!)'- అని వేడుకొనుట తటస్థించినది. కండ్లు మూసికొని యున్నవానికి విపత్పరంపర వచ్చి కండ్లు తెఱచునట్లు చేయుచున్నవి. అయితే అట్టి ఘోరదుఃఖములందు గూడ సర్వేశ్వరుని మాట యెత్తని మందమతులు, ఘనీభవించిన తమోమూర్తులు కొందఱుండవచ్చును. కాని అట్టివారితో మనకిచట పనిలేదు. ఏదియో యొక విధముగ దైవమును సంస్మరించు పుణ్యశీలురనుగూర్చియే మన మిపుడు విచారించుచున్నాము. ఈ మొదటి తరగతివారిని, అనగా విపత్తులలో భగవంతుని స్మరించి సేవించువారిని 'ఆర్త' భక్తులని గీత పేర్కొనినది.

ఇక రెండవ తరగతివారు 'జిజ్ఞాసువులు'- దేవుని తెలిసికొనవలెనను కుతూహలము కలవారు. భగవంతు డెచట నున్నాడు? ఏరూపముననున్నాడు? ఏమిచేయుచున్నాడు? ఆతని స్వభావమెట్టిది?-మున్నగు సంశయములు కలవారై తత్సంశయ నివారణకై పెద్దల నాశ్రయించువారు, శాస్త్రముల నధ్యయనము చేయువారు ఈ జిజ్ఞాసభక్తులలో చేరుదురు. వీరున్ను ఏదియో నెపమున పరమాత్మను సేవించుదురు. కావున పుణ్యా

త్మ్రలే యగుదురు. మూడవతరగతివారు 'అర్థార్థులు' - అనగా ధనముకొఱకు, ఐశ్వర్యముకొఱకు, సంపదలకొఱకు దేవుని భజించువారు. 'భగవంతుని కృపయున్నచో మనకు గొప్ప లాభమువచ్చును, వ్యాపారము జోరుగాజరుగును, సంతానము కలుగును, పరీక్ష ప్యాసుకావచ్చును, పెద్ద ఉద్యోగము దొరకును-'అని తలంచి వారు ఆ యా భౌతిక పదార్థాపేక్షలచే ప్రేరితులై దేవుని పూజించుదురు. సత్యనారాయణవ్రతములు చేయుదురు. తీర్థయాత్రలు సలుపుదురు. అశ్వత్థాదివృక్షములకు ప్రదక్షిణములు చేయుదురు. నాగేంద్రునకు పొంగళ్ళు పెట్టుదురు. తిరుపతి వేంకటేశ్వరునకు ముడుపులు చెల్లించుకొందురు. ఏదియోరూపమున పరమాత్మను సేవించుచుందురు. కావున వీరున్ను భక్తుల క్రిందనే జమకట్టబడిరి శ్రీకృష్ణునిచే.

ఇక నాల్గవతరగతివారు జ్ఞానులు. తక్కినముగ్గురికంటె వీరు విలక్షణమైన స్వభావము కలవారు. మొదటి ముగ్గురు ఏదియో యొక కోరికతో భగవంతుని అర్చించువారు. వారు సకాములు. వీరో నిష్కాములు. వీరికి (జ్ఞానులకు) ఏకోరికయు ఉండదు. అన్ని కోరికలను దాటినవారు. భగవంతుని ఏల భజించుచున్నారని యెవరైన వారిని అడిగినచో, అట్లు భజించుట మాధర్మము. మాకు దానిలో ఆనందమున్నది. అందుచే భజించుచున్నామని మాత్రము చెప్పుదురు. ప్రహ్లాదుని విష్ణు భగవానుడు వరము కోరుకొనుమని యడిగినపుడు—

'అహం త్వకామః త్వద్భక్తః త్వం స్వామీ అనపాశ్రయః'

'నాకు ఏకోరికయులేదు, నేను నీభక్తుడను, నీవు నాప్రభువు, అంతమాత్రమేచాలును'అని బదులు చెప్పెను, మహానుభావుడు

కనుక. ఇది జ్ఞానియొక్క లక్షణము. ధ్రువుడు ప్రారంభములో కామ్యబుద్ధితోనే భగవంతునిగూర్చి తపస్సుజేసి, తీరా దైవము ప్రత్యక్షమై వరము కోరుకొనుమని యడిగినపుడు భగవత్సాన్నిధ్య మహిమచే హృదయసంస్కారము కలుగగా-

'స్వామిన్ కృతార్థోఽస్మి వరం న యాచే'

'మహాప్రభూ! తమ దర్శనముచే కృతార్థుడనయితిని! ఇంతియే చాలు. ఇక ఏ వరమున్ను నాకక్కఱలేదు' అని వచించెను. ఇవ్విధముగ సకామబుద్ధితో ధ్యానించువారున్ను కాలక్రమమున హృదయమున మార్పు జనింప నిష్కామబుద్ధికలవారై కోరికలన్నిటిని తొలగించి దైవప్రాప్తియే చరమలక్ష్యముగ గలిగి యుందురు. అనగా మొదటి ముగ్గురు భక్తులున్ను (ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి) సాధన పరిపక్వతచే తుట్టతుదకు నాల్గవ భక్తుడుగా (జ్ఞానిగా) మారిపోవుదురు. అట్టి 'జ్ఞాని' స్థితియే సర్వోన్నతమైనది.

'సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే'

'సమస్తసాధనలు' కర్మలు, జపములు, తపములు - తుదకు జ్ఞానమునందే పర్యవసించును. జ్ఞానోత్పత్తిని కలుగజేసి అవి విరామమును బొందును' - అని శ్రీకృష్ణమూర్తి జ్ఞానము యొక్క ఉత్కర్షతను చాటెను. ఇంతియేకాదు. 'జ్ఞానీత్వాత్మైవ మే మతమ్' - 'జ్ఞానియు నేనును ఒకటే - మాయిరువురికిని భేదములేదు' అను మహోన్నత సత్యమును వెల్లడించెను. ఓహో! జ్ఞానియొక్క మహిమ యెట్టిది? సాక్షాత్ భగవంతుడే యతడగుచున్నాడు!

'బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి'

"బ్రహ్మమును తెలిసికొనువాడు బ్రహ్మమేయగుచున్నాడు" అను ఉపనిషద్వాక్య మీసత్యమునే చాటుచున్నది. జ్ఞానియగువాడు పంచకోశములను చక్కగ విచారణచేసి వాటికి సాక్షిగనున్న ప్రత్యగాత్మను సాక్షాత్కరించుకొనును. దృశ్యసముదాయమున కంతటికిని తాను విలక్షణుడని, కేవలము దృక్స్వరూపుడని అనుభూతి నొసర్చుకొనును. 'అహం బ్రహ్మాస్మి' 'తత్త్వమసి' మున్నగు మహావాక్యములను బాగుగ మననముచేసి, నిదిధ్యాసనము గావించుకొని, తాను బ్రహ్మస్వరూపముకంటె నన్యముకాదను సత్యమును ప్రత్యక్షముగ నవగతముచేసికొనును. ఇక్కారణమున జ్ఞానికి, పరమాత్మకు అవినాభావ సంబంధ మేర్పడుచున్నది. ఇరువురును ఒకే వస్తువుగ ప్రకాశింపదొడగుదురు. నది సముద్రమునందుజేరి తన నదీరూపమును వదలి సముద్రరూపమే యగునట్లును, కీటము భ్రమరమును ధ్యానించి భ్రమరరూపమే యగునట్లును, జ్ఞాని తత్త్వవిచారణ చేసిచేసి, భగవంతుని భజించి భజించి తుదకు భగవద్రూపమే యగుచున్నాడు. కాబట్టి పైన దెల్పిన నలుగురు భక్తులలో జ్ఞాని సర్వోత్తమస్థాన మలంకరించుచున్నాడు.

'ఉదారాస్సర్వ ఏవైతే జ్ఞానీత్వాత్మైవ మే మతమ్'

"మొదటి ముగ్గురు భక్తులు (ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి) చాల మంచివారే. పుణ్యాత్ములే. సుకృతము నాచరించినవారే కాని జ్ఞానియూ నేనే - అతడు నాకంటె వేఱుకాదు - ఇది ముమ్మాటికి నానిశ్చయము' అని భేరీ మ్రోగించినట్లు శ్రీకృష్ణమూర్తి సెలవిచ్చుటవలన ప్రపంచమున గల సమస్త స్థానములందును,

పదవులయందును, వ్యక్తులందును, పదార్థములందును - జ్ఞాని యొకడే సర్వోత్తముడని స్పష్టమగుచున్నది. ఆహా! భగవాను డింతటి చక్కని బహుమానమును జ్ఞాని కొసంగినాడు! సార్వభౌమత్వముకాదు, ఇంద్రత్వముకాదు, చంద్రత్వము కాదు, బ్రహ్మత్వము కాదు, బ్రహ్మాండాధిపత్యము కాదు, సాక్షాత్ పరమాత్మత్వమునే అనగా తన్నే జ్ఞానికి సమర్పించు కొనెను.

**"We are the greatest God that ever was or will be, Christs and Buddhas are but waves on the boundless ocean which 'I' am."**

'ఇంతవఱకుఉన్నట్టికాని, ఇకముందు వుండబోవునట్టికాని అన్ని దేవుళ్ళకంటెను మనము(ఆత్మ) పెద్దదేవుళ్ళము. క్రీస్తుప్రభువులు బుద్ధదేవులు మన అనంత మహా 'ఆత్మ' సముద్రమునందలి చిన్న తరంగములే యగుదురు' - అని వివేకానందులు ప్రబుద్ధుడగు జ్ఞానియొక్క దివ్యానుభవమును వెల్లడించెను. ఆత్మను సాక్షాత్కరించుకొనినట్టి మహానుభావుల ధైర్యవచనము లట్లే యుండును. సమస్త బ్రహ్మాండములున్ను భగవంతునియందు వర్తించుచున్నవి. జ్ఞానియో భగవంతునిలో నైక్యమొందిపోవుచున్నాడు కనుక సమస్తబ్రహ్మాండస్వరూపుడేయగుచున్నాడు!

నాథేనః పురుషోత్తమే త్రిజగతా మేకాధిపే చేతసా
సేవ్యే స్వస్యపదస్యదాతరి సురే నారాయణే తిష్ఠతి
యం కం చిత్పురుషాధమం కతిపయగ్రామేశ తల్పార్థదం
సేవాయై మృగయామహే నరమహో మూకావరాకా వయమ్.

(ముకుందమాల)

'పురుషోత్తముండు, ముల్లోకములకు ఏకైకప్రభువునగు నారాయణుని చిత్తమునందు తలంచినంతమాత్రమున మనకు స్వాధీనుడై తన దివ్యపదము (భగవత్స్వరూపము)ను యావత్తు మనకు ఇచ్చివేయుచుండ, ఏవియో కొన్నిగ్రామములకు అధికారియైన ఒకానొక అల్పమనుజునకు 'దాసోఽహం'బనచ్చుచు వానిమట్టు తిరుగాడుచుండు మనము ఎంత మూఢులమై యున్నాము! ఎంత హీనస్థితియందు మెలగుచున్నాము' అని కులశేఖరాళ్వారు 'జ్ఞానీత్వాత్మైవ మేమతమ్' (జ్ఞాని నేను ఒకటే) అను ఈ గీతాభావమును చాల చక్కగ వర్ణించి యున్నాడు. కాబట్టి అట్టి మహోన్నతమగు జ్ఞానియొక్క పదవికే సర్వులును ప్రయత్నించవలెను. అల్పపదవులకై దేవులాడరాదు. 'Look up, aim high' (పైకిచూడుము, పైకి గురిపెట్టుము) - అను ఆంగ్లోక్తిని చరితార్థ మొనర్చవలెను. ఊర్ధ్వదృష్టి, ఊర్ధ్వలక్ష్యము గలిగి యుండవలెను. మానవుడు దానవుడగుటకు పుట్టలేదు. దేవత యగుటకు పుట్టలేదు. దేవుడగుటకు మాత్రమే పుట్టెనని మనము జ్ఞప్తియందుంచుకొనవలెను. మఱియు అట్టి స్థితికై అనవరతము యత్నశీలురము కావలెను. వెనుకచూపు ఉండరాదు. భగవంతుడు మన నేత్రములను పిలకదగ్గరకాక శిరస్సుయొక్క ముందుభాగముననే ఏర్పాటుచేయుటకు కారణమేమి? 'జీవులారా! ముందుచూపు మాత్రమే కలిగియుండి ముందునకు కొనసాగుడు' అని బోధించుటకొఱకే యగును. నిరుత్సాహమునకు తావీయరాదు. గీత మనకు ధైర్యమును బోధించుచున్నది. మహాపాపినికూడ గీత నిర్లక్ష్యము చేయలేదు. ఇక పుణ్యాత్మునిమాట వేఱుగా

చెప్పవలెనా ? జీవుడు దేవుడు కాగలడు (జ్ఞానీత్వాత్మైవ మేమతమ్) అని భగవానుడు ప్రతిజ్ఞచేసి చెప్పిన గొప్ప అధ్యాయమగుటచే ఈ అధ్యాయమునకు 'విజ్ఞాన' యోగమను పేరు ఎంతయో సార్థకమై యున్నది. గీతయందు అనేక హితబోధల ద్వారా శ్రీకృష్ణమూర్తి సామాన్య జీవుని పైకి తీసికొని పోయి తీసికొనిపోయి తుట్టతుదకు ఈ అధ్యాయమున తనలో కలిపివేసికొని ఇక భక్తుడు భగవంతుడు అనువారు వేఱు వేఱుగ లేరు, గురువు శిష్యుడు అనువారు వేఱువేఱుగ లేరు, ఒకే వస్తువు (పరబ్రహ్మము) కలదు అని బోధించి భగవద్గీతయందు 'అద్వైతవాదము'నకు కూడ సముచితస్థానము కలదని లోకమునకు చాటెను. గీతయందు ద్వైత, విశిష్టాద్వైతముల యొక్క ఉనికి సర్వులకును తేలికగనే ప్రత్యక్షమగును గాని అద్వైతముమాత్రము ఎంతయో సూక్ష్మబుద్ధితో పరిశీలించిన గాని బయటపడనేరదు. ఈ విజ్ఞానయోగమున దాని యునికి స్పష్టముగ తెలియుచున్నది. ఇవ్విధముగ ద్వైత, విశిష్టాద్వైత, అద్వైతముల మూడింటికిని ప్రమాణగ్రంథ మగుటచే గీత సర్వజనాదరణీయంబై తనరుచున్నది.

అయితే ఇట్టి మహోన్నతజ్ఞానస్థితి ఒక్కపర్యాయము అమాంతముగ జీవునకు కలుగనేరదు. 'బహూనాం జన్మనామన్తే'-అని గీతాచార్యుడు సెలవిచ్చినట్లు బహుజన్మలందు చేసిన కృషి ఫలించి ఒకానొక జన్మయందు జ్ఞానమావిర్భవించును. అత్తఱిసమస్తము భగవన్మయముగను ఆత్మస్వరూపముగను వాసుదేవుడుగను అతడు గుర్తించును. దైవవ్యతిరిక్తమగు ఒక్కవస్తువేని అతనికి కానరాదు. అంతయు చిన్మయమై, సన్మ

యమై, ఆనందమయుడై గోచరించుచుండును. అనేకమందు ఏకత్వమును గాంచుచు, విభక్తమందు అవిభక్తత్వమును వీక్షించుచు 'ఏకమేవా ద్వితీయంబ్రహ్మ' 'నేహ నానాస్తికించన' ఇత్యాది ఉపనిషద్వాక్యముల దివ్యానుభూతి గలిగియుండు మనుజునకు 'మహాత్మ' అను బిరుదు వచ్చును. ఇతఃపూర్వము అల్పాత్ములుగ నుండువారు తీవ్ర ఆధ్యాత్మిక పరిశ్రమచే, సాధనాతిశయముచే మహాత్ములుగ మారిపోవుదురు. 'స మహాత్మా సుదుర్లభః' అని గీత వచించినట్లు అట్టి మహనీయులు లోకములో చాల అరుదుగ నుందురు. అంతమాత్రముచేత ఆ స్థితి అసాధ్యమని యెవరును తలంపనక్కఱలేదు. వాల్మీకి, భగీరథుడు మున్నగువారు కార్యసిద్ధియందు ఏ పట్టుదలచూపిరో, అట్టి పట్టుదల, సహనశీలత్వము, పూర్ణదైవ విశ్వాసము, నిత్యనియమిత ఆచరణ కలిగియున్నచో అచిరకాలములోనే-ఈ జన్మయందే జ్ఞానసిద్ధిని, 'మహాత్మ'త్వమును బడయగలరు. 'బహూనాం జన్మనామన్తే' అను వాక్యమును గూర్చి ఎవరును బెదరిపోరాదు. 'అయ్యో! ఇంక చాల జన్మలుపట్టునే' అని వ్యసనపడరాదు. ఇంతవఱకు గతించిన జన్మలన్నియు సాధనజన్మలనియు ప్రస్తుత జన్మ సాధ్యజన్మయనియు తలంచి దీనినే తుదిజన్మగ చేసికొను యత్నములో నుండవలెను. ఇదియే గీతయొక్క ఆశయము.

అట్టి జ్ఞానరూపమగు పైస్థితిని అందుకొనలేనివారు, నిరాకారమగు సచ్చిదానంద పరమాత్మను ఉపాసింపలేనివారు, వారివారి అంతస్సునుబట్టి, సంస్కారమునుబట్టి, ఇతర దేవతలను, వ్యక్తులను ధ్యానించుచుందురు. కాని శ్రద్ధతో ఆచరించినచో, ఆ పూజలకు, ఉపాసనలకు తగిన ఫలితమును

వారు బొందుచునేయుందురు. ఏయేవిధముగ వారు ధ్యానించు చుందురో ఆ యా విధముగ వారికి ప్రతిఫలమును పరమాత్మ ఒసంగుచుండును. ఒకే దేవతను ఒకే ఉపాసనను ఒకే పద్ధతిని గీత అందఱికిని శాసించుటలేదు. వారివారికి తగిన దేవతలను వారువారు ఏరుకొనవచ్చుననియు, వారివారికి తగిన ఉపాసనాపద్ధతిని వారువారు అవలంబించవచ్చుననియు, కాని అన్నిటికిని శ్రద్ధ అవసరమనియు గీత వక్కాణించుచున్నది. తుట్టతుదకు ఏకమగు సచ్చిదానంద పరబ్రహ్మమును హృదయస్థ పరమాత్మను ప్రతివారున్ను ఆశ్రయించియే తీరవలెననియు నుద్బోధించుచున్నది. అదియే జ్ఞానియొక్క స్థితియనియు, అట్టిస్థితిని ప్రతివారు ఈ జన్మయందే అభ్యాస వైరాగ్యములద్వారా, శమదమాది సాధనసంపత్తిద్వారా, ఈశ్వరానుగ్రహముద్వారా, గురుసేవాదులద్వారా పడసి ఆనందధామమును జేరవలయుననియు ఆదేశించుచున్నది. కావున ఇట్టి గీతావాక్యములను చక్కగ శ్రవణముచేసి, భగవదాదేశప్రకారము అతిత్వరలో సాధన నుపక్రమింపవలయును. మట్టిము బంగారము బాగుగ పుటముచేయబడినచో మేలిమి బంగారమగునట్లు శ్రవణమననాదులచే జీవుని మలిన చిత్తము నిర్మలమగుచున్నది-

శ్రవణాదిభిరుద్దీప్త జ్ఞానాగ్ని పరితాపితః
జీవస్సర్వమలాన్ముక్తః స్వర్ణవద్ద్యోతతే స్వయమ్.

(శ్రీ శంకరాచార్యులు)

అని శ్రీశంకరాచార్య లీవిషయమునే ఆత్మబోధయందు తెలిపి యున్నారు. కావున దైవమునుగూర్చియే చింతనజేయుట,

దైవమునుగూర్చియే బోధించుకొనుట, దైవమునుగూర్చియే భాషించుట,దైవకార్యములనే చేయుట-ఇత్యాది ప్రయత్నములచే హృదయము దైవవాతావరణమయమై, క్రమముగ దైవత్వము నొందగలదు. నిమ్మకాయ పుల్లగానున్నను, మామిడికాయ వగరుగనున్నను,ఉప్పునందు ఊరవేసినచో చాలకాలము ఉప్పునందుండుటవలనను, క్రింద, పైన, ప్రక్కల ఉప్పుతప్ప అన్యమేమియు ఉండనందుచేతను, క్రమముగ వాని పులుపుతనము, వగరుతనము పోగొట్టుకొని ఉప్పుగుణములనే స్వీకరించును. అట్లే సాధకుడు తనచుట్టు పరమార్థవాతావరణమును సృష్టిచేసికొని, కనీసము కొన్నిగంటలసేపైనను ఆ దైవస్మృతియందున్నచో శరీరము, మనస్సు, ఇంద్రియములు ఆధ్యాత్మిక అణువులచే పరిపూర్ణములై, దివ్యత్వమును బొందుచుండును. అదియే దివ్యజీవితము. దీర్ఘజీవితమున్నను లేకున్నను దివ్యజీవితమున్న చాలును.జీవుడుకడతేరును. దుఃఖవిముక్తుడు కాగల్గును. ముఖ్యముగ మూడు మహాదుఃఖములు ఈ సంసారమున జీవుని బాధించుచున్నవి. అవియే జన్మ, జరా, మరణములు. జన్మదుఃఖము, జరాదుఃఖము, మరణదుఃఖము- ఈ మూడింటిలో జన్మదుఃఖము అజ్ఞానములో గడచిపోవుచున్నది.కావున మనకు తెలియుటలేదు. ఇక మిగిలినవి జరా (వార్ధక్య) మరణదుఃఖములు. ఇవి ఉన్నంతవఱకు ఇక జీవునకు శాంతియెచట?కావున వానిని త్వరగా పోగొట్టుకొనవలసినదిగా శ్రీకృష్ణపరమాత్మ జనులను హెచ్చరించుచున్నాడు (జరామరణమోక్షాయ). అయితే అనాదిగావచ్చుచున్న ఆ భయంకర క్లేశములను వదలించుకొనుట ఎట్లు? ఆ యుపాయమును భగవంతుడే ఇచ్చోట

చెప్పెను. 'మామాశ్రిత్య' - 'నన్ను ఆశ్రయించుడు' ఇదియే యుపాయము.

కావున విజ్ఞులగువారు ఈ నశ్వర ప్రపంచమునందు దేని నాశ్రయించవలెనో బాగుగాయోచించి, దేనిని త్యజించవలెనో అదియును నిశ్చయించి తదనురీతి వ్యవహరించవలెను. పరమాత్మను ఆశ్రయించుట, విషయభోగములను త్యజించుట అను రెండు కార్యక్రమములను చక్కగ అమలుపఱచవలెను. ప్రభుత్వమువారు పంచవర్ష ప్రణాళిక అని యేర్పాటుచేసి పెక్కు కార్యములనెట్లు నియమానుసారము జరుపుచున్నారో, సాధకుడును 3సం॥లు కాని, 6సం॥లు కాని, లేక 12సం.లు కాని ఒక చక్కటి ఆధ్యాత్మిక కార్యక్రమము నేర్పాటుచేసికొని దానిని తు. చ. తప్పకుండ పాలించునట్లు దీక్షబూనినచో మాత్రమే ఈ మాయ స్వాధీనపడును. మాటలచే ప్రకృతి లొంగదు. మంత్రములచే చింతకాయలురాలవు. కఠోరనియమముల నవలంబించి దృఢవ్రతములను జేపట్టి క్రమముగ అగాధమగు దైవశక్తిని సమకూర్చుకొని, అసురశక్తినిపారద్రోలవలెను. ఇదియే సాధకు డవలంబించవలసిన పద్ధతి. విజ్ఞాన సముపార్జన కిదియే గీతాచార్యుడు చూపినత్రోవ. ఈ 'విజ్ఞానయోగము'యొక్క సారమున్ను ఇదియే.

ఓం తత్ సత్

ఓమ్

# 8-వ అధ్యాయము

# అక్షరపరబ్రహ్మయోగము

గీతాప్రాసాదములోని ఎనిమిదవ గదిలోనికి నేడు ప్రవేశించు చున్నాము. గీతాభవనమును తిలకించుటకేతెంచు పుణ్యశీలుర భాగ్యమేమని చెప్పవచ్చును! ఏలయనిన, జన్మతరించుటకు కావలసిన వస్తుసామగ్రి, సాధనసంపత్తి వారికి అచట లభించు చున్నది. సామాన్యముగ ఒక గొప్ప భవనమును చూచుటకు వెళ్ళినపుడుగాని ఒకానొక ప్రదర్శనము (Exhibition) నవ లోకించుటకేతెంచునపుడుగాని, గేటువద్ద అందఱిని పోనీ యరు. అనుమతి, లేక ప్యాసు, లేక టిక్కెట్టు ఉన్నవారిని మాత్రమే పోనిచ్చెదరు. పైగా, లోనికి వెళ్ళువారు అచటనున్న వస్తువులనేమియు తాకగూడదు. ఇంటికి తీసుకొని వెళ్ళకూడదు. ఇది కఠిన నియమము. కాని గీతాభవన సందర్శకుల కీనియమ మేమియులేదు. ఎవ్వరైనను లోనికి పోవచ్చును. దేనినైనను నిరాటంకముగ చూడవచ్చును. ఇదియేకాదు. చేతికి చిక్కిన వస్తువులనెల్ల గైకొని యింటికి పోవచ్చును. నిషేధములేదు. అడ్డుపెట్టువారుండరు. కాని విచిత్రమేమనగా, ఇంతవఱకు ఎన్నికోట్లమందియో ఆయావస్తువులను తీసుకొని వెళ్ళినను, గీతాభవన సామగ్రి మాత్రము తరగలేదు. కొరతపడలేదు. అక్షయమై తనరుచున్నది. మఱియొక విశేషమేమి యనిన, ప్రాపంచిక భవనమందలి పదార్థములు జడములు, నిర్వీర్యములు, క్షరములు. గీతాభవనమందలి వస్తువులో,

చైతన్యవంతములు, మహాచ్ఛక్తియుతములు, అక్షరములు. అయితే పుణ్యవశముననే అద్దాని దర్శనమును జనులు నోచుకొనగలరు.

ఈ అధ్యాయము పేరు అక్షరపరబ్రహ్మయోగము. శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు దివ్యమంత్రోపదేశము చేసిన అధ్యాయమిది. గురువు శిష్యునకు మంత్రదీక్షనొసంగినఅధ్యాయము అగుటచే ఉపాసకులదృష్టియందియ్యది మహత్తరప్రాధాన్యము గలిగియున్నది. ఆ మంత్రమేదియో, దాని యర్థ మేమియో తదుపరి విచారించెదము. ప్రస్తుత మీ యధ్యాయ మెట్లుపక్రమింపబడినదో తెలిసికొందము. అర్జునుడు వరుసగా ఏడు ప్రశ్నలనడిగెను. ఒకటికాదు, రెండుకాదు. అతని పారమార్థిక జిజ్ఞాస ఎంత తీవ్రముగా నున్నదో ఆప్రశ్నల వైఖరివలననే మనము తెలిసికొనవచ్చును. లేనియెడల ఇన్ని ప్రశ్నలను వేయడు. తెలిసికొనవలెననుఅపేక్ష శిష్యునకు ఎంత అధికముగ నుండునో, గురువునకు దానిని చెప్పుటయందు అంత ఆనంద ముండును. మందమతులు, మెదడు పనిచేయనివారు, అలసులు నగు శిష్యులకు బోధించుట గురువులకు ఒక పెద్దసమస్య. ఆ పని వారికి చాల బాధాకరముగనుండును. సరియైన శిష్యుడు, సరియైన గురువు ఏకీభవించినచో మందుగుండు, అగ్ని కలిసినపుడు బ్రహ్మాండమైన శబ్దమావిర్భవించుచందమున దివ్యానుభూతులు వికసితములగును. ఇపుడట్టి సంయోగమునే మనము శ్రీకృష్ణార్జునుల సంభాషణమునందు గాంచుచున్నాము. అర్జును డడిగిన ఏడుప్రశ్నలలో మొదటియారింటికిని శ్రీకృష్ణమూర్తి ఒక్కొక్క మాటతో సమాధానము చెప్పి కడపటిప్రశ్నకుమాత్రము విపుల

మైన సమాధాన మిచ్చెను. అదియే ఈ అధ్యాయముయొక్క ప్రధాన విషయము. అర్జునుని యేడు ప్రశ్నలలో మొదటిది, చివరిది చాల ముఖ్యములైనవి కనుక వానిని గూర్చి ఒకింత యోచించెదము.

మొదటి ప్రశ్న బ్రహ్మమనగా ఏది? అనగా భగవంతు డెట్టివాడని ప్రశ్న. పరమాత్మ యొక్క స్వరూపమును తెలిసికొనవలెనని ప్రపంచములోని సర్వమతములున్ను యత్నించుచున్నవి. ప్రతి మానవుడున్ను దైవమెట్టివాడో తెలిసికొన కుతూహలముగా నున్నాడు. కొందఱాతడు వైకుంఠమందు శంఖచక్రాదులతో గూడి భాసించుచుండునని తెలుపుదురు. కొందఱు కైలాసమున త్రినేత్రుడై వెలుగొందుచుండునని పలుకుదురు. కొందఱు(క్రైస్తవులు)స్వర్గమున తిష్ఠవేసికొనియుండునని చెప్పుదురు. అతని పేరు 'అల్లా' అని కొందఱు, రాముడని కొందఱు ఇట్లు వివిధముగ పేర్కొనుచుందురు. ఈ ప్రకారముగ వారివారి సంస్కారముననుసరించి, భక్తిప్రపత్తులనుబట్టి పరమాత్మకు జనులు భిన్నభిన్నరూపములను, భిన్నభిన్న నామములను నిశ్చయించుచున్నారు. అవియన్నియు వారివారి దృష్టియందు సత్యములుగనేయున్నవి. కాని సర్వులకును అంగీకారయోగ్యమైన భగవంతుని రూపము, భగవంతుని నామము మనకు కావలసియున్నవి. వానినే శ్రీకృష్ణమూర్తి ఈయధ్యాయమున తెలియజేసి గీతాగ్రంథము సర్వమతములను, సమస్త సంప్రదాయములను పరిపోషించుచున్నదను విషయమును స్పష్టపఱచెను. ఏ మతమువారికిని ఆక్షేపణీయముకానట్టియు, సర్వమతములవారికి అంగీకారయోగ్యమైనట్టియు రూప,నామము లిచట భగవంతు

నకు నిర్ణయింపబడినవి. అవి యేవి యనిన - భగవంతుని రూపము 'అక్షరము', నామము 'ఓంకారము'. శైవులదేవుడు వైష్ణవులకు అంగీకారయోగ్యము కాకపోవచ్చును. హిందువుల దేవుడు మహమ్మదీయులకు సమ్మతము కాకపోవచ్చును. కాని ఈ అక్షరస్వరూప భగవంతుడు సర్వులకును ఇష్టుడే యగును. దేవుడనగా ఎవరు? ఏది నాశరహితమైనదో అదియే దేవుడు అని శ్రీకృష్ణమూర్తి యిచ్చట పేర్కొనెను.

గాంధిమహాత్ముడు రౌండు టేబిల్ కాన్ఫరెన్సునిమిత్తము లండన్ వెళ్ళినపుడు కొలంబియా బ్రాడ్ కాస్టింగ్ కంపెనీడైరెక్టరు గారు 'దేవు డెవరు?' అని వారిని ప్రశ్నించిరి. అందులకాతడు 'నాచుట్టునున్న ప్రపంచములోని సర్వచరాచరవస్తువులుపుట్టుట లయించుట మున్నగుపరిణామములు జెందుచున్నను, వీనికి ఆధారమై యెట్టిపరిణామమున్ను జెందనట్టి చైతన్యశక్తియే దేవుడు' అని సమాధాన మొసంగెను. అమోఘమగు ఆద్వైతనిర్వచనము (Definition of God)ను విని అమితానందభరితుడై ఆడైరెక్టరుగారుతత్క్షణమే మహాత్మునకు లక్షరూప్యములను పారితోషికముగ సమర్పించి కృతకృత్యుడనైతిననివిన్నవించెను. గీతయందు తెలుపబడిన ఆ అక్షరత్వమునే మహాత్ముడు వివరించి చెప్పెను. క్షరమనగా నశించునది. అక్షర మనగా నాశరహితమైనది. ప్రపంచములో దృశ్యమానమగు ప్రతిపదార్థమున్ను క్షయశీలమైనది. పుట్టుక చావు కలది. తుట్టతుదకు అతిసూక్ష్మములైన మనోబుద్ధి చిత్తాహంకారములుకూడ ఒకానొక సమయమున నశించిపోవునవియే! కాని ఆత్మ (బ్రహ్మము) మాత్రము ఏకాలమందును నశింపదు. అట్టిదానినిగూర్చి బోధింపబడు విద్యనే

బ్రహ్మవిద్యయందురు. అదియే అక్షరవిద్య. దానినిగూర్చియే శ్రీకృష్ణపరమాత్మ ఈ యధ్యాయమందు వచించెను. అనగా అందఱికిని అక్షరాభ్యాసము చేసెననిభావము. 'ఓ పండితులారా! ఓ కవిశేఖరులారా! ఓ విద్యావాచస్పతులారా! మీరందఱును పలక, బలపం తెచ్చుకొనుడు. అక్షరాభ్యాసము చేసెదను', అని అనుచున్నాడుగీతాచార్యుడు ఈయధ్యాయములో. అక్షరమగు పరబ్రహ్మమును తెలిసికొనినగాని అక్షరాభ్యాసము పూర్తి అయినట్లుకాదు. లేనిచో ఎన్నిలౌకికవిద్యలు సంపాదించినప్పటికిని, భౌతికశాస్త్రములందు ఎంత దిగ్దంతులైనప్పటికిని "ఓ, న, మా" లు రానివారే యగుదురు.

> షడంగాదివేదో ముఖే శాస్త్రవిద్యాః
> కవిత్వాది గద్యం సుపద్యం కరోతి
> హరేరంఘ్రిపద్మే మనశ్చేన్న లగ్నం
> తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్.(శ్రీశంకరాచార్యులు)

వేదములను సాంగోపాంగముగ చదివినప్పటికిని, సమస్తవిద్యల యందును ఆరితేరినప్పటికిని, అనర్గళముగ కవిత్వము చెప్పగలిగి యున్నప్పటికిని, భగవంతుని పాదపద్మములందు మనస్సు సంగల్నముకానిచో, వాటివలన మనుజునకు ఏమి ప్రయోజనము? అంత్యకాలమున అవి జీవుని ఏమి రక్షింపగలవు? అని శ్రీశంకర భగవత్పాదాచార్యులవారుద్ఘోషించిరి. ఏది చావును తప్పించ గలదో అదియే నిజమగు విద్య. ఏది బంధమునుండి విడిపించ గలదో అదియే నిజమగు శాస్త్రము. తక్కినవి యన్నియు 'భుక్తయే న తు ముక్తయే' అనునట్లు భుక్తికి ఉపయోగపడు నవియే గాని ముక్తికికాదు. అయితే భుక్తిమార్గము చూచు

పోనఁగూడదని కాదు; ముక్తిమార్గమునుగూడ మఱువరాదని చెప్పుటయే యగును. అన్ని సంపదలు, అన్ని విద్య లుండియు తన ఆత్మను తాను తెలిసికొననిచో, అక్షరపరబ్రహ్మమును గూర్చిన పరిచయము లేనిచో అవి యన్నియు శవాలంకార సదృశములుగనే యుండును. ప్రాణములేని శవమును ఎంత అలంకరించిననేమి ప్రయోజనము? ఒక సుందరమైన కార్డు ఉన్న దనుకొనుడు. దానిచుట్టును అనేక నగిషీలు, కత్తిరింపులు, తళుకుబెళుకులు చేయబడినవి. కానిస్టాంపుఅతికించకుండ దానిని పోస్టులో వేసినచో గమ్యస్థానము చేరునా? చేరదు. అతి సామాన్యమైన కార్డు అయినను, స్టాంపు వేసినచో ఎన్ని వేల మైళ్లైనను ప్రయాణముసాగించగలదు. అట్లే ప్రాపంచికచదువు సంధ్యలులేకపోయిననుపవిత్రత,హృదయనైర్మల్యము,బ్రహ్మను భూతి కలిగియున్నచో ప్రపంచమునకంతకును అతడు వెలుగును ప్రసాదించగలడు. తాను తరించి ఇతరులను తరింపజేయగలడు. శాంతిసుఖములను ఈ జీవితమునందే యనుభవింపగలడు.

> నిరక్షరస్యాపి తు యస్య కుక్షౌ
> బ్రహ్మైవ చాభాతి స ఏవ సాక్షరః
> సర్వాక్షరస్యాపి తు యస్య చిత్తే
> బ్రహ్మైవ నాభాతి స వై నిరక్షరః.

'విద్యాగంధము లేకున్నను ఎవని హృదయమున బ్రహ్మము భాసించుచుండునో(బ్రహ్మనుభూతికలిగియుండునో)అతడు సర్వ విద్యాపారంగతుడేయగును. అన్ని విద్యలు తెలిసికొనియున్నను ఎవ్వనిచిత్తమునందు బ్రహ్మము భాసింపకుండునో అతడు అక్షర శూన్యుడే యగును' అని తాత్పర్యము. ఇంతమాత్రముచేత లౌకికవిద్యలను చిన్నచూపుచూచిరని యెవరును భావింపరాదు.

సంసారతారణ హేతువగు బ్రహ్మవిద్యనుగూడ వానితోపాటు కలిగియుండుడని ప్రబోధించుటయే యగును. మఱియు రెండింటిలోఏదియో ఒకటి మాత్రము ఏరుకొనవలసినపరిస్థితివచ్చినచో జరామరణ విమోచనకరమగు ఈపరమాత్మవిద్యనే ఎన్నుకొనవలసియుండును. ఏలయనగా జన్మించిన ప్రతివానియొక్క ప్రథమ కర్తవ్యము మరల జన్మింపకుండనుండుటకు వలసిన సాధనసామగ్రిని సంపాదించుటయే యగును. దానిని ముందు సంపాదించి, అటుపిదప తక్కినవియన్నియు యోచింపవచ్చును. మహాత్ము లనుసరించుపద్ధతియిదియే. అట్లుకాక, జీవితమంతయు చతుష్షష్టి కళలసముపార్జనయందే ముందుగ వినియోగించినచో, ఆకస్మాత్తుగ మృత్యువాసన్నమైనచో అపుడు మనుజుడేమిచేయగలడు? ఆ విద్యలు వానిని అంత్యకాలమున రక్షించునా? లేక యమబాధలను అవి తప్పింపగలవా? లేవు. అట్టిశక్తి ఒక్క బ్రహ్మవిద్యకు, అధ్యాత్మవిద్యకు మాత్రమే కలదు. కావున అట్టిదాని సంప్రాప్తియందే విజ్ఞుడు తన సర్వశక్తులను ధారబోయును.

పూర్వమొకానొకపండితుడు, సర్వవిద్యాపారంగతుడు యాత్రచేసికొనుచు పాదచారియై పోవుచుండెను. ఒకచోట నది యడ్డమురాగా దానిని దాటవలసివచ్చెను. నదిలో నీరు వెల్లువలుగ ప్రవహించుచుండెను. ఒడ్డున ఒకబెస్తవాడు చిన్నపడవ నొకదానిని ఉంచుకొనియుండుటఁజూచి ఆపండితుడు వానితో సంభాషించి ఆవలియొడ్డునకు పోవుటకు ఏర్పాటు చేసికొనెను. ఇరువురును తెప్పలోనికి ఎక్కిరి. బెస్తవాడు పడవను నడుపుచుండెను. పండితుడు నావలోకూర్చొని దీర్ఘాలోచనలత్పరుడై యుండెను. ఏమి ఊహ జనించినదోకాని అకస్మాత్తుగ నాతడు

ఆపల్లెవానిని పిలిచి 'ఓయీ! తర్కవిద్య నీవేమైన అభ్యసించి నావా!' యని యడిగెను. బెస్తవాడు పడవను నడుపుచునే 'లేదని' జవాబిచ్చెను. అటుపిమ్మట వారిరువురిమధ్య ఈక్రింది సంభాషణము నడిచెను.

పండితుడు :- ఛీ! ఛీ! తర్కవిద్య నేర్వని జీవితము జీవితమేనా! అట్టి అపూర్వవిద్యను నేర్చుకొననందువలన నీజీవితములోని పాతిక భాగము వ్యర్థమైపోయినదని నేనుతలంచుచున్నాను. భద్రం! ఇప్పుడైనను నాబోటివారిదగ్గఱ నేర్చుకొని బాగుపడు! అయితేసరికాని, 'మీమాంస' ఏమైనచదివినావా ?

బెస్తవాడు :- బాబూ ! మీమాంస సంగతి నాకు ఏమీ తెలియదు. మా మాంసం సంగతి మాత్రం తెలుసును.

పం :- ఓరీ వెట్టివాడా! ప్రపంచములో మీమాంస నేర్చుకొనని వాడెవడైన ఉండునా ? అది నేర్వనందువలన నీ జీవితములో మఱియొక పాతికభాగము వృథా అయినదని నేను భావించుచున్నాను. పోనీ జ్యోతిషము చదివినావా ?

బె :- బాబూ! అది అంతకంటెను చేతకాదు.

పం :- నారాయణ ! నారాయణ !! జీవితములో ఇంకొక పాతికభాగము నాశనము చేసికొనినావురా వెట్టివాడా ? తర్క, మీమాంసా, జ్యోతిషము లను మూడు శాస్త్రములను తెలియనివాడు ముప్పాతిక జీవితము దండుగ చేసికొనినట్లేయని గ్రహింపుము !

ఈ ప్రకారము వా రిరువురిమధ్య సంభాషణము జరుగుచుండ పడవ సరిగా నదీ మధ్యభాగమునకు చేరెను. నీటిప్రవాహము

చాల వడిగా నుండెను. ఇంతలో పెనుగాలి వీవదొడగెను. తుపాను చెలరేగెను. నదీజలము ఉత్తాలతరంగసంయుక్తమై భీతిని గొలుపుచుండెను. పడవ తరంగముల తాకిడికి డోలాయమానమగుచుండెను. ఇంతలో పడవలోనికి నీరు ప్రవేశించెను. తత్ఫలితముగ పడవ నెమ్మదిగా మునుగజొచ్చెను. ఆ ఘోర విపత్సమయమున బెస్తవాడు పండితుని పిలిచి 'బాబూ! తమకు ఈతవిద్య వచ్చునా?' యని యడుగగా 'రాద'ని జవాబిచ్చెను. అదివిని యూ పల్లెవాడు 'మహాప్రభో! తర్క మీమాంసా జ్యోతిషములు చదువనందున నాజీవితములో ముప్పాతిక భాగము మాత్రమే నాశనమైనది. ఈతవిద్య రానందువలన తమ జీవిత మిప్పుడు మొత్తము మొత్తముగానే నాశనమై పోయినది!' అని పలికి యూరకుండెను. ఇంతలో పడవ మునిగి పోయెను. పండితుడు గంగార్పణమయ్యెను. బెస్తవాడు ఈదుకొని ఒడ్డుచేరెను. చూచితిరా! నదీప్రవాహ మధ్యమున కావలసిన విద్య యేది? ఈతవిద్య. ఆ సమయమున తర్కముకాని, మీమాంసగాని, జ్యోతిషముగాని, హిష్టరీకాని, జాగ్రఫీకాని, అల్జిబ్రాకాని, జ్యామెట్రీకాని ఏదియు జీవుని రక్షింపజాలదు. మునుగువానికి ఈతవిద్య యొక్కటియే శరణ్యము. అట్లే జీవుడు సంసారసాగరమధ్యమున గ్రుంకులిడుచున్నాడు. జననమరణ ప్రవాహమునబడి నానాదుఃఖముల ననుభవించుచున్నాడు. అట్టివానికి తారణోపాయము బ్రహ్మవిద్యయే. అక్షరపరమాత్మతత్త్వమే. ఆవిద్య యొక్కటియే జీవుని తరింపజేయగలదు. కనుకనే దానికి 'తారకవిద్య'యని పేరువచ్చినది. భవదుఃఖశమనమునకై మనుజు డద్దానిని తప్పక పరిగ్రహించ

పలయును. అట్టి అక్షరపరబ్రహ్మవిద్యనే భగవాను డీ యధ్యాయమున నుపదేశించుచున్నాడు.

ఇంతవఱకు భగవంతుని రూపమునుగురించి విచారించినాము. భగవత్స్వరూపము అక్షరమని (నాశరహితమని) గుర్తించినాము. ఇక భగవానుని నామమునుగూర్చి యోచింతము. పరమాత్మకు అనంతకోటి నామములుకలవు. కాని ఏ మతమునకు, ఏ సంప్రదాయమునకు జెందనిదియు, సమస్తమును తనయందు ఇముడ్చుకొనినదియు, వేదసారమైనదియు, ఉచ్చారణ మాత్రముచే జీవుని పునీతునిగ నొనర్చునదియునగు ఓంకారము (ఓం)వానియన్నింటికంటెను మిన్నయై యొప్పుచున్నది. అకార, ఉకార, మకార, అర్ధమాత్రలతో గూడిన ఆ నామము సర్వశాస్త్రార్థసంగ్రహమని చెప్పవచ్చును. వేదశాస్త్రపురాణేతిహాసములు దానిమహిమను వేనోళ్ళవర్ణించినవి. దాని కీర్తిని శ్లాఘించినవి. కనుకనే ప్రణవములేని మంత్రముకాని, ప్రణవముతో ప్రారంభించని శాస్త్రముకాని, పూజకాని, హైందవమతమున లేనేలేదు. ప్రణవము (ఓంకారము) తక్కిన శబ్దములన్నిటికిని చైతన్యమును ప్రసాదించును. కనుకనే భగవానుడు గీతయందు 'ప్రణవస్సర్వవేదేషు-సమస్త వేదములందును నేను ఓంకారమును', 'గిరామస్మ్యేకమక్షరమ్-వాక్కులలో ఏకాక్షరమగు ఓంకారమే నేను' అని ప్రణవముయొక్క ప్రాధాన్యతను వెల్లడి చేసెను. క్రైస్తవులు ప్రార్థనాంతమున చెప్పు "Aumen" ఆమెన్, అనుపదము ఓంకారముయొక్క రూపాంతరమే అయియున్నది. సర్వమతములందును ఏదోయొకరూపమున ఈ ఓంకారనాదము ఉచ్చరింపబడుచునేయున్నది. అట్టి పవిత్రమగు భగవన్నామము

యొక్క ఉచ్చారణచే జీవుని స్థూలసూక్ష్మ శరీరములు రెండును శుద్ధపడుచున్నని.

'తస్య వాచకః ప్రణవః'

పరమాత్మయొక్క నామధేయము ప్రణవము (ఓంకారము) అని పతంజలిమహర్షి నుడువుచు, ఆ ప్రణవమును జపించువారు, దానియర్థమును చక్కగ మననము చేయువారు సాధకులు జన్మజన్మల విఘ్నపరంపరలన్నిటిని అధిగమించి అచిరకాలములోనే ప్రత్యగాత్మను సాక్షాత్కరించుకొనగలరని ఘంటాపథముగ చెప్పియున్నాడు. శ్రీకృష్ణమూర్తి 'స యాతి పరమాంగతిమ్'- ప్రణవమును ధ్యానించువాడు పరమగతియగు మోక్షము నొందునని ఈయధ్యాయమున తెలిపియున్నాడు. కావున సాధకులగువారు మోక్షసాధనమగు అట్టి మంత్రరాజము నవలంబించి, అద్దాని జపధ్యానాదులచే అక్షరమగు పరబ్రహ్మమును ఈ జన్మయందే సాక్షాత్కరించుకొని సంసారబంధ విముక్తులై పరమశాంతిని బడయవలయును.

అయితే అట్టి ప్రణవధ్యానమును ఏప్రకార మాచరింపవలయును? దానిపద్ధతియేమి? ఆ వివరములన్నిటిని గీతాచార్యుడిచట చక్కగ తెలిపియున్నాడు. ముముక్షువులు వానిని శ్రద్ధగా గమనించవలెను. భ్రూమధ్యమునదృష్టినినిలిపి భక్తిసమన్వితులై ఇంద్రియములను బహిర్ముఖములుగ పోనీయక అరికట్టి నిశ్చల మనస్సుతో ప్రణవోచ్చారణపూర్వకముగ భగవంతునిధ్యానింపవలెనని శ్రీకృష్ణమూర్తి యాదేశించెను. ఆఱవ అధ్యాయమున నాసికాగ్రదృష్టియు, ఇచట (భ్రువోర్మధ్యే) భ్రూమధ్యదృష్టియు చెప్పబడెను. ఎవరికి ఏది అనుకూలముగనుండునో దాని నవలం

బించవచ్చును. దృష్టి చెదరక ఒకచోట నిలుకడగనుండుట ప్రధానము. 'భక్త్యాయుక్తో'-'భక్తితోగూడియుండి' అని చెప్పుట వలన సాధకునకు భక్తి అత్యావశ్యకమైన అంగమని తేలుచున్నది. నిర్మలభక్తికలవాడు సర్వేశ్వరుని కృపచే మాయను అవలీలగ దాటివేయగలడు. ఈసత్యమును ఇతఃపూర్వమే భగవానుడు తెలిపియున్నాడు. జ్ఞానమే ప్రధానముకదా, ఇక భక్తితో పనియేమి? అని తలంచువారు పొరబడుచున్నవారే యగుదురు. అది అనుభవముతో చెప్పిన వాక్యము కాదు. జ్ఞానము, స్వస్వరూపవిచారణ, ఆత్మచింతన ప్రధానములైనప్పటికిని, అనేక జన్మార్జిత పాపరూపపంకిలమును, మాయా ప్రతిబంధమును ఎదుర్కొనుటకు, వానిని నిర్జించుటకు భగవత్కృప అత్యావశ్యకము గనుక, పరమార్థరంగమున భక్తి యొక్క సముచితస్థానము ఎప్పుడును తొలగనేరదు. దాని యావశ్యకత్యమును ఎవరును కాదనలేరు. వెయ్యేల—

పురుషః స పరః పార్థ భక్త్యా లభ్య స్త్వనన్యయా. (8-22).

'ఆ పరమపురుషుడగు పరమాత్మ అనన్యమగు భక్తి చేతనే లభించుచున్నాడు' అని శ్రీకృష్ణమూర్తి ఈయధ్యాయముననే వచించి, భక్తియొక్క యాధిక్యతను వెల్లడించెను. మఱియు 'మాయాం తు ప్రకృతిం విద్ధి మాయినం తు మహేశ్వరమ్' అను ఉపనిషద్వాక్యానుసారము పరమేశ్వరుడు మాయను, ప్రకృతిని స్వాధీనపఱచుకొనినవాడు కనుక, మాయాధీనులగు చరాచర ప్రాణులందఱికిని ఆతడే ఆరాధ్యుడగుచున్నాడు. ప్రకృతిని జయించుటకు ఆతని సహాయ్యము,అనుగ్రహము జీవునకు ఎంతేని అవసరమైయున్నది కనుకనే సందర్భము వచ్చినప్పు

గాల్ల గీతయందు భక్తియొక్క ప్రస్తావన జరుగుటయు, అద్దానిని ప్రోత్సహించుటయు సంభవించినవి. సర్వేశ్వరుని అండదండలు లేనిచో సాధకుడు పరమార్థక్షేత్రమున ఉపరిస్థానము నలంకరించుట కట్లు, వృద్ధికి వచ్చుట అసంభవము. స్తంభమును పట్టుకొని తిరుగు పిల్లవాడు ఎన్నటికిని క్రిందబడడు. పడుటకు అవకాశమే లేదు. దానిని వదలివేసి తనంతట తాను తిరుగు పిల్లవాడు అమాంతముగ పడిపోవును. అట్లే ప్రపంచములో కెల్ల నిశ్చలమై స్థిరమైనట్టి ఏ సద్వస్తువగు పరమాత్మ గలడో అతని నాశ్రయించి చేయు ఏ కార్యముకాని, ఏ సాధనకాని విజయవంతముగ జరుగగలదు. అతనిని వదలివేసినవాడు తప్పక పతనమును పొంది పోవును. విశ్వమందుగల ప్రతివస్తువు దేశకాలక్రియలకు లోబడి చపలమై, అస్థిరమైయున్నది. అట్టివానిని నమ్ముకొనియుండువాడెట్లు శాంతిని, సుస్థిరత్వమును బొందగలడు? చలించువస్తువును పట్టుకొనువాడెట్లు నిశ్చలముగ నుండగలడు? సుఖమును నోచుకొనగలడు?

భవదుఃఖ ఘరట్టేన పిష్యన్తే సర్వమానవాః
దుఃఖముక్తస్సదానందః కృష్ణభక్తో హి కేవలః

'సంసారదుఃఖ మను తిరుగలియందుబడి మానవులందఱున్ను నలిగిపోవుచున్నారు (పిండిపిండిఅయిపోవుచున్నారు). భగవంతుడగు శ్రీకృష్ణుని ఆశ్రయించినవాడు మాత్రము దుఃఖరహితుడై సాంసారిక క్లేశవర్జితుడై పరమానందమున సదా ఓలలాడుచున్నాడు'. తిరుగలిలో పెసలు, కందులు, సెనగలు మొదలైనవి వేసి విసరుచుందురు. అందు వేయబడిన గింజలన్నియు దాదాపు నలిగిపోవునుగాని మధ్యభాగమునగల కొయ్యపిడికి

దగ్గరగానుండు ఒకటి రెండు గింజలు మాత్రము నలుగక యుండును. తిరుగలిఎత్తి చూచినచో ఈసత్యముబోధపడగలదు. అవి మాత్రము ఏల నలుగలేదు. నిశ్చలమగు కొయ్యపిడికి దగ్గ అగా నున్నందువలన, దానికి దూరముగా నున్నవియన్నియు ధ్వంసమైపోవును. అట్లే స్థిరమగు పరమాత్మను ఆశ్రయించిన వాడు ధన్యుడు. ఆతడెల్లపుడు సురక్షితుడేయగును. తదితరులు మహాప్రమాదమున నున్నవారే యగుదురు. కావున భగవద్భక్తి సాధకునకు అత్యావశ్యకమై యున్నది.

ఈ ప్రకారముగ (ప్రణవ) ధ్యాత సర్వేశ్వరుని యెడల అచంచలమగు భక్తికలవాడై మనస్సును అన్యత్రపోనీయక, అనగా దృశ్యపదార్థములపైకి వ్యాపింపనీయక, హృదయము నందు (ఆత్మస్థానమందు) స్థాపితమొనర్పవలయును. 'మనసాఽచలేన' - (నిశ్చలమనస్సుతో), 'చేతసా నాన్యగామినా'- (దైవమందు తప్ప ఇతర విషయములందు ప్రవర్తింపని మనస్సుతో)-ఇత్యాది వాక్యములద్వారా భగవానుడు సాధకుని మనఃస్థితి యెట్లుండవలెనో చక్కగ విశదీకరించెను. మనస్సు మర్కటమును బోలి మహాచపలముగా నుండును గావునను, ఇంద్రియములద్వారా ఆయాశబ్దాదివిషయములపైకి పరుగెత్తు చుండును గావునను, దానిని నయముగా, ఉపాయముద్వారా విషయములందలి దోషమును బోధించుటద్వారా మెల్లగా నిశ్చల మొనర్పవలయునని భావము. మనస్సు నిశ్చలముగ లేనిచో ధ్యానము సరిగ కుదరదు. కనుకనే గీతాచార్యు డీ మనోనిశ్చలత్వమునుగూర్చినొక్కి చెప్పుటకుకారణము. 'సర్వద్వారాణిసంయమ్య'-ఇంద్రియద్వారము లన్నిటిని మాయవల

సినదిగా (సంయమన మొనర్పవలసినగా) ఆదేశించుచున్నాడు. కిటికీతలుపులు, ద్వారబంధముల తలుపులు బార్లగా తెఱచి యుంచినచో లోపలనున్న ప్రమిదెదీపము ఆరిపోవుటయో, లేక చంచలముగ నుండుటయో తటస్థించునట్లు శరీరగృహమున దశేంద్రియములద్వారములు బాహాటముగ తెఱువబడియున్నచో, ఇక మనోదీపము ఏమాత్రము నిశ్చలముగనుండ నేరదు./

ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావ మివాంభసి. (2-67)

"విషయములయందు సంచరించుచున్న ఇంద్రియములలో ఏ యింద్రియమును మనస్సు అనుగమించునో ఆ యింద్రియము అతని వివేకమునంతను - ఓడను ప్రతికూలవాయువువలె-కుంల ద్రోయుచున్నది' అని గీతాచార్యుడు ప్రారంభముననే సెల విచ్చియున్నాడుకదా! కావున మనోనిశ్చలత్వమునకు ఇంద్రియ సంయమము ఆవశ్యకమైయున్నది. ఆ యింద్రియములు, విషయములందలి దోషములను గ్రహించినచో మరల అందు ప్రవర్తింపవు—

ప్రదృశ్యతే వస్తుని యత్ర దోషః
న తత్ర పుంసోఽస్తి పునః ప్రవృత్తిః.

కావున పదార్థములందలి అశాశ్వతత్వము, అపాతరమణీయత్వము, అల్పసుఖత్వము మనస్సునకెక్కునట్లుగా ప్రబోధింపవలెను. ఉద్దాలకుడు చేసిన విధముగా, తనకుతానే బోధించుకొనవలెను. తన యింద్రియములకు తానే హితబోధనొనర్చుకొనవలెను. ఏసుఖమును దృశ్యమైభవములందు జీవుడుపొందుచున్నాడో, అది కేవలము మనఃకల్పితమై, ప్రియ, మోద,

ప్రమోదము లను మూడువిభాగములుగ గలిగి, చంచలముగ నుండుచున్నది. దృష్టాంతమునకు - ఒక చక్కటి తీపిమామిడి పండు బజారులోనుండగా తానింటియందు కూర్చొని అద్దానిని స్మరించినపుడు నోటిలో నీళ్ళూరును. ఒకింత సుఖమును అనుభవించును. దాని పేరు 'ప్రియ' సుఖమందురు. అది కేవలము కల్పిత సుఖమేకదా! పిదప దానినిగూర్చిన కోరికను చంపుకొనలేక వెంటనే బజారునకు పరుగెత్తుకొనివెళ్ళి ఆ పండును కొనివేసి ఇంటికి తెచ్చి తనముందు పెట్టుకొనియుండును. అపుడు పూర్వముకంటె ఇంకను అధికమైన సుఖమును అనుభవింప జొచ్చెను. దీనిపేరు 'మోద' సుఖమందురు. వస్తువును ఇంకను అనుభవింపలేదు కనుక యీ సుఖమున్ను కేవలము మనోరథ కల్పితమేయగును. తదుపరి కోరికను ఆపుకొనలేక అమాంతముగ ఆపండును తినివేసెను. అపుడింకను హెచ్చైనసుఖమును పొందెను. దానిపేరు 'ప్రమోద' సుఖమందురు. పండును భుజించినపుడు మనస్సు క్షణకాలము ఏకోరికయు లేక శమించుటచే, అధిష్ఠానమునగల ఆత్మానందము అనిశ్చలమనస్సునందు ఒకింత ప్రతిబింబించుటచే జీవుని కాయల్పానంద మనుభూతమాయెను. దీనినిబట్టి అదియు ప్రతిబింబానందమే కాని బింబానందముకాదని స్పష్టమగుచున్నది. ఈ ప్రకారముగ జనులు స్రక్చందనవనితాద్యనేకదృశ్యపదార్థములపై మోజుకలిగి, ప్రియమోదప్రమోదములను కల్పితానందములనే యనుభవించుచు వానినే గొప్పగ తలంచుచు మురిసిపోవుచున్నారు. శాశ్వతమై, నిశ్చలమై, బింబభూతమైనట్టి ఆత్మానందమును విస్మరించి, ఆభాస సుఖములకై అట్టులు చూచుచున్నారు.

వృథా మనోరథ శ్రేణీమాధుర్యాన్మోహితో దివా
రాత్రౌ స్వాప్నం సుఖం భుంజన్నరో నయతి జీవితమ్.

‘పగలు కల్పితమనోరథసుఖముల మాధుర్యమును గ్రోలుచు, రాత్రి కల్పితస్వప్న సుఖము ననుభవించుచు మూఢమనుజుడు తన అమూల్యమగు జీవితమును వ్యర్థముగ గడిపివేయుచున్నాడు. సత్యసుఖముయొక్క లవలేశమైనను అనుభవింప నోచుకొనలేకపోవుచున్నాడు. పైపై తళుకుబెళుకులు చూచి భ్రమించి గోతిలో పడుచున్నాడు.

పూర్వ మొక ధనికుడు చక్కని గృహమును నిర్మింప దలంచి తన సేవకునకు కొంత ద్రవ్యమునిచ్చి గరుకుతనములేక నున్నగా, సొంపుగానున్న కొన్ని కొయ్యస్తంభములను అక్కార్యమునకై కొని తీసికొనిరావలసినదిగా ఆదేశించెను. వాడు అనేక గ్రామములు, పట్టణములు తిరిగితిరిగి, ఎచట చూచినను కొయ్యలు ఒకింత గరుకుగానే యుండుటవలన అవి యన్నియు తన యజమానికి పనికిరావని నిశ్చయించుకొనెను. అద్భుతమగు టేకుకొయ్యనుగూడ పై నెపమువలన తిరస్కరించివేసెను. తుట్టతుదకు ఒకానొక గ్రామము చివరగల అరటితోటపై అతని దృష్టిపడెను. ఆ అరటి స్తంభములనుజూచి ‘ఆహా! ఇవి ఎంత నునుపుగానున్నవి! ఎంత సొగసుగా కన్పించుచున్నవి! గరుకుతనము ఏకోశమునగూడ లేదే! చూచినవారి మనస్సులనెల్ల తమ సౌందర్యాతిశయముచే నెట్లు ఆకర్షించివేయుచున్నవి! మా యజమాని అదృష్టము పండినది! దైవికముగ అద్భుతమగు స్తంభములు దొరికినవి. ఇక వీనిని వదలగూడదు’ అని నిశ్చయించుకొని అత్యధిక మూల్యము చెల్లించి వానినన్నింటిని

ఖరీదుచేసి బండ్లపై వేసుకొని యజమానియొద్దకు గొనిపోయెను. ధనికు డదిచూచి 'ఏమిరా! ఎందులకు పనికిరానివి తెచ్చినావు?' అని వాని నడుగ, 'మహాప్రభో! తమ యదృష్టవశమున ఇంతవఱకు ఎవరికిని దొఱకనట్టి చక్కని నునుపైన స్తంభములు దొఱికినవి' అని భృత్యుడు పలికెను. ధనికు డంతట 'ఓరీ వెఱ్ఱివాడా! పైపై సౌందర్యముచూచి నీవు మోసపోయితివి- ఈ స్తంభములకు లోన చేవలేదు, సత్తువలేదు, ఒట్టి పట్టలు మాత్రమే ఇందు కలవు. ఇట్టి తుచ్ఛపదార్థములపై ఎంత డబ్బు తగులబోసితివిరా మూర్ఖుడా!' అని సేవకుని మందలించి అతని అవివేకమునకు అచ్చెరువొందెను.

ప్రాపంచిక జనులయొక్క స్థితి సరిగా ఇదేవిధముగ నున్నది. పైపై మెరుగులు చూచి వారు మోసపోవు చున్నారు. దీర్ఘముగ విచారించుటలేదు. సున్నపు ముద్దలను జూచి వెన్నముద్దలని భ్రమించుచున్నారు. విచారించి చూచి నచో దృశ్యవస్తువులందు వాస్తవమగు సౌందర్యముకాని, వాస్తవమగు సుఖముకాని లేవు. నశించిపోవు పదార్థములకు సౌందర్యమెచట ? అట్టి వానియందు సుఖమెచట ? ఒకవేళ సౌందర్యమనునది వానియందున్నచో, త్రికాలములందును అది మారకుండ యుండవలెను. ఈదినము ఎంతయో చక్కగనున్న పూలమాల రేపటికి ముకుళించుకొని పోవుచున్నది. ఈదినము సుగంధమును వెదజల్లిన ఆ వస్తువే కొలది దినములకు క్రుళ్ళి దుర్గంధమును వ్యాపింపజేయుచున్నది. నేడు యౌవనమున లోకైకసుందరి (Miss universe) యని ఖ్యాతి బడసిన మగువ కొంతకాలమునకు వార్ధక్యముచే కబళింపబడి కురూపిణి

యగుచున్నది. లేక వ్యాధులచే నాక్రమింపబడి అందవిహీన యగుచున్నది. ఈ దినము మనలను ఎంతయో ఆకర్షించిన స్వాదుభోజనము రేపటికి పాచిపోవుచున్నది. ఎల్లుండికి బూజుపట్టి దగ్గరకు వచ్చినంతమాత్రమున వాంతిని గలుగ జేయుచున్నది. ఇట్టి వస్తువులయందా మనము సౌందర్యమును జూచునది! ఒకవేళ చూచినను అది ఏపాటిది?

'A thing of beauty is a joy for ever.'

'సుందరవస్తువు ఎల్లప్పుడు సుఖమును గలుగజేయును' అను సూక్తి కలదు. అయితే వస్తువే అస్థిరమై, కొంతకాలమునకు నామరూపములు లేకుండ దాటిపోవుచుండగా ఇక నది ఎల్లప్పుడు ఎట్లు సుఖమునుగలుగజేయగలదు. కావున ఎల్లకాలములందును ఉండుపరమాత్మ ఒకటియే ఈప్రపంచమున సుందరమైన వస్తువు కాని, నశ్వరములగు పాంచభౌతిక పదార్థములు కావు. ఒకవేళ దృశ్యవస్తువులందెవగైన రమణీయత్వమును జూచినచో అది ఆపాతరమణీయత్వమగునేకాని శాశ్వత సౌందర్యము కానేరదు. అట్టిదానివలన ముముక్షువుల శ్రేప్రయోజనమున్ను లేదు.

ఈప్రకారముగ దృశ్యపదార్థములందు, భోగవిలాసములందు 'దుఃఖదోషానుదర్శనము'ను గావించుచు, ఇంద్రియములను, మనస్సును వానినుండి మరలించి, హృదయమందు స్థాపించి పరమాత్మను ధ్యానించవలెను. పరమాత్మయొక్క వాచకము (నామధేయము) అగు ఓంకారమును ఉచ్చరించుచు దాని యర్థమును బాగుగ మననము చేయవలెను.

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్ (8-13)

"అనుస్మరన్' అని చెప్పుటవలన ఓంకారముయొక్క ఉచ్చారణ మాత్రము చాలదనియు, దానిభావమునుగూడ హృదయమున మరల మరల చింతన జేయవలెననియు స్పష్టమగుచున్నది. ఇక్కాలముల అనేకులు మంత్రజపము చేయుచున్నను, వారు ఆశించిన ఫలములను పొందకపోవుటకు కారణమిదియే. వారు మంత్రము నుచ్చరించుచున్నారే కాని మంత్రార్థమును చక్కగ భావించుటలేదు.

మంత్రో హి భావేన యుతః ఫలప్రదః
మౌర్వ్యా సుసజ్జీకృత బాణవద్ధ్రువమ్
భావేన హీనస్తు వినిష్ఫలో భవేత్
కీరస్య వాగీరిత రామశబ్దవత్.

భావముతోగూడి జపముచేయబడు మంత్రము, ఎక్కుపెట్టబడిన బాణమువలె లక్ష్యమును చేరి ఫలప్రదము కాగలదు. భావయుక్తముకాని మంత్రజపము చిలుకచెప్పు రామనామము వలెవ్యర్థముకాగలదు. కనుకనే ప్రణవజపమునుగూర్చి చెప్పుచు భగవానుడు 'వ్యాహరన్' (ఉచ్చరించుచు) అను పదముతో సంతృప్తిపడక 'మామనుస్మరన్' (నన్ను మరల మరల చింతన జేయవలెను, ధ్యానించవలెను) అను పదమునుగూడ కలిపెను. ఇపుడు జపము చేయువారిలో కొందఱు 108 పూసలు ఎప్పుడు తిరిగిపోవునా, కొలికిపూస ఎప్పుడు చేతికి తగులునా యను ఆందోళనలో నేయుందురు. వారిదృష్టిమంత్రార్థముపై నుండదు. నోరుమాత్రము మంత్రము నుచ్చరించుచుండును. ఇక్కారణమున వారు పూర్ణ ఫలమును పొందలేక పోవుచున్నారు.

పూర్వము భద్రాచలరామదాసుగారు శ్రీరామచంద్రుని స్తుతించుచు కొన్ని వేలపద్యములను వ్రాసియుంచెను. అవన్నియు పూర్తి అయిన పిదప అతని మనంబున నొక విచికిత్స జనించెను. 'నేను వ్రాసిన ఈపద్యములన్నిటిలో శ్రీరామచంద్రునకు ప్రీతి పాత్రములైన పద్యములేవియైయుండును? ఆ ప్రభువును మనంబున నిడుకొని వ్రాసిన పద్యములు వీనిలో నెన్నియుండునో?'-అని పర్యాలోచించుకొని తాను పద్యములు వ్రాసిన తాటియాకు పత్రములన్నిటిని ఒక్కపర్యాయము గోదావరీ ప్రవాహమున బడవైచెననియు, అందులో నూరు పత్రములు మాత్రము ప్రవాహమునకు ఎదురీదిరాగా వానినిమాత్ర మాతడు గైకొనెననియు చెప్పుకొనుచుందురు. ఆ నూరు పద్యములే యిప్పుడు శ్రీరామశతకముగా పేరొందియున్నవి. ఏకాగ్రచిత్తముతో భగవద్భావముతో, ఇతర చింతలులేక వ్రాసిన పద్యములు కాబట్టి వానికి విలువ యేర్పడినది. కావున ప్రణవజపముగాని, ఇతరములగు ఏమంత్రములయొక్క జపముగాని భావయుక్తముగ నున్నపుడే అధికఫలములను గలుగజేయును. మఱియు ఈ ప్రణవధ్యానమునుగూర్చి ఈఅధ్యాయమున తెలిసినపుడు 'యః ప్రయాతి'-అని యచ్ఛబ్దప్రయోగము చేయుటవలన ఎవ్వడైనను వానిని భక్తితో జపించి, ధ్యానించి తరించవచ్చునని స్పష్టముగు చున్నది. ఇచ్చట జాతి, మత, కుల, లింగ వివక్షత యేమియును తెలుపబడలేదు. భక్తి, శ్రద్ధ యుండిన చాలును. కావున ఈ మహోన్నత మంత్రరాజమగు ఓంకారమును ముముక్షువు లెల్లరు శ్రద్ధాభక్తులతో ధ్యానించి పరమగతియగు మోక్షమును బొందవచ్చునని శ్రీకృష్ణపరమాత్మ ఆనతిచ్చుచున్నాడు.

శరీరము పతనముకాకపూర్వమే ఈ మహత్తర కార్యమును జీవుడు సాధించివేయవలయును. ఏలయనగా ఒక పెద్ద ప్రయాణము ప్రతివానికిన్ని వేచియున్నది. జీవితకాలములో రైళ్ళమీద, బస్సులమీద, విమానములమీద చేయు ప్రయాణములు చిన్నవి. జీవితాంతమున చేయు ప్రయాణము పెద్దది. ఆప్రయాణమును ఎవరును తప్పించుకొనలేరు. అది జరిగితీరును. ఆ ప్రయాణమును గూర్చియే ఈ అధ్యాయమున ప్రస్తావింపబడినది. అజ్ఞానవశమున జీవుడు దానిని మరచి లోకమున ప్రవర్తించుచున్నాడు. అన్నియు జ్ఞాపకముంచుకొనునుగాని తనకొక దీర్ఘప్రయాణము కాచుకొనియున్నదని మాత్రము మరచును. కనుకనే ప్రమాదమున పడిపోవుచున్నాడు.

**'Think of death always and you will realise the truth of every word I say.'**

'మరణమును సదా జ్ఞాపకమునందుంచుకొనినచో నేను చెప్పు వాక్యములన్నియు చక్కగ బోధపడగలవు' అని వివేకానందులు తన శిష్యునితో నొకప్పుడు పలికియున్నాడు. గూడ్సు పెట్టెలపై 'Return' (త్రిప్పిపంపవలెను) అని వ్రాసి దాని ప్రక్కన ఒక తేది వేయుదురు. అనగా ఆ తేదీనాటికి ఆ పెట్టె అరిగిపోవునుగాన దానిని గూడ్సు పెట్టెను 'రిపేరు'కు గాను త్రిప్పి పంపవలెనని అర్థము. ఆ త్రిప్పిపంపు తేదీని గూడ్సుపెట్టె తయారైన దినమే నిర్ణయించి దానిపై వేయుదురు. అట్లే బ్రహ్మదేవుడు ఈదేహపంజరమును సృష్టిచేసి ప్రపంచమున వదలినదినమే దాని నొసటపై 'త్రిప్పిపంపవలసిన దినమును'కూడ వ్రాసియుంచును. అయితే భేదమేమియనగా, గూడ్సుపెట్టెలపై తేది కనిపించును.

జీవునినొసట కనిపించదు. దానినే బ్రహ్మవ్రాత, విధిలిఖితము అందురు. కనిపించనంతమాత్రమున అది లేకపోలేదు. పుట్టినది గిట్టక మానదు. 'జాతస్య హి ధ్రువో మృత్యుః' మహనీయు లందఱున్ను తమ జీవితకాలములోనే ఈ మహాప్రయాణమును గుఱించి యోచించుదురు. వార్ధక్యము రాకపూర్వమే అనగా బాల్యయౌవనములందే దానినిగూర్చి చింతించి తన్నివారణకు తగినమందు కనిపెట్టుదురు. నచికేతుడు హఠముపట్టి యమధర్మ రాజునుండి ఆ రహస్యమును ఊడబెఱికికొనెను. 'ఓ నచికేతా! నీకు ముల్లోకములందలి భోగములు, ఐశ్వర్యములు, సంపదలు అన్నిటిని ఇచ్చెదను. 'మరణంమాను ప్రాక్షీః'-మరణానంతర విషయమును మాత్రము అడుగవద్దు'-అని యముఁడెంత చెప్పి నను వినక జన్మరాహిత్యమునకు ఔషధమగు ఆత్మవిజ్ఞానమునే కోరుకొనెను. మన అర్జునుడుకూడ ఈ కోవకు చెందినవాడే. కనుకనే శ్రీకృష్ణపరమాత్మను—

ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః (8–2)

'అంత్యకాలమునందును నియతచిత్తులు నిన్నెట్లు తెలిసికొన గలరో వచింపుము'అని యడుగుటకు కారణము. ఈ ప్రకారము తమ జీవితకాలముననే మరణము సంగతి జ్ఞాపక ముంచుకొని, మరల ఎన్నటికిని జన్మింపక, మరణింపక యుండు స్థితిని పొందు టకై యత్నించువారు ధన్యులు. అట్టివారే మానవత్వమును సార్థక పఱచుకొనినవారు.

**జాతా స్త ఏవ జగతి జ న్తవస్సాధు జీవితాః**
**యే పునర్నేహ జాయన్తే శేషా జరఠగర్ధభాః** (యోగవాసిష్ఠము)

**'ఓ రామచంద్రా! మఱల పుట్టకుండ చేసికొనగలుగు మహాత్ము**

లెవరు కలరో, అట్టి ఉత్తమ శీలసంపన్నులు మాత్రమే ఈ ప్రపంచమున పుట్టినవారిక్రింద జమ, తక్కినవారు ముసలి గాడిదలవలె వ్యర్థజీవితులే యగుదురు' అని వసిష్ఠులు శ్రీరామ చంద్రునకు బోధించెను.

కాని ఇక్కాలమున జనులు కాయము శాశ్వతమని యెంచి, ప్రయాణముమాట పూర్తిగ మఱచిపోయి, అనేక సాంసారిక వ్యామోహములందు మునిగి కాలము గడచిపోవు చుండ దేబరించి చూచుచు, పారలౌకికప్రయత్న విరహితులై మెలగుచున్నారు. ప్రజల ఈ అవివేకమును భర్తృహరి యెంత చక్కగ వర్ణించెనో చూడుడు—

ఆదిత్యస్య గతాగతై రహరహ స్సంక్షీయతే జీవితమ్
వ్యాపారై ర్బహుకార్యభారగురుభిః కాలో న విజ్ఞాయతే
దృష్ట్వా జన్మజరావిపత్తిమరణం త్రాసశ్చనోత్పద్యతే
పీత్వా మోహమయీం ప్రమాదమదిరామున్మత్తభూతం జగత్.

(భర్తృహరి)

"సూర్యుని ఉదయాస్తమానములచే రోజురోజుకు జీవితము తఱిగిపోవుచున్నది. కాని ఎడతెగని పనులలో మునిగి తేలుచు జనులావిషయమును గుర్తెఱుంగకున్నారు. పుట్టుచున్నవారిని, మరణించుచున్నవారిని, ముసలివారిని, బాధల నొందుచున్న వారిని చూచికూడ భయపడకయున్నారు. అజ్ఞానమును కల్లు త్రాగి జగమెల్ల మతిదప్పియున్నది!" - నిజముగ లోకపరిస్థితి ఇట్లేయున్నది. భగవద్ధ్యానము చేసికొనుటకు తీరికయే లేదని వారు చెప్పుదురు. ఉదయము నిద్రలేచినది మొదలు మరల పరుండువఱకును ఒక్కపర్యాయమైనను దైవస్మరణకు తావీయక

నశ్వర ప్రాపంచిక వస్తుసంపాదనమునందే వారు నిమగ్నులై యుందురు. ఈమధ్య ఒకాయన వ్యాపారములో మునిగితేలుచు- ఎవరో ప్రశ్నించుసరికి 'I have no time even to die' - 'నాకు చావటానికి కూడా తీరిక లేదు' - అని చెప్పివేసెను. ఇట్లుండును ఆధునికమానవుని మనఃస్థితి. ఇక దైవచింతనకు వారి జీవితములో చోటెచట ? కాబట్టియే అట్టివారు మానవుల వలె మరణించక, క్రిమికీటకాదులవలె మరణించుచున్నారు. వారి జన్మము నిరర్థకమై పోవుచున్నది.

కాబట్టి విజ్ఞుడగువాడు తన జీవితకాలముననే అంత్యకాల ప్రయాణమును గుఱించి యోచించి ఆధ్యాత్మిక సాధనల ద్వారా భవరోగదుఃఖమును బాపుకొనవలెను. అర్జునున కట్టి యోచనయే కలిగినది. కనుక తత్క్షణమే శ్రీకృష్ణపరమాత్మకు తన సంకల్పమును వెలిబుచ్చి శరీరవియోగ సమయమునగూడ జీవు డెట్టిభావనతో గూడియుండవలెనో, భగవంతుని యెట్లు ధ్యానించవలెనో ప్రశ్నించెను. అందులకు శ్రీకృష్ణమూర్తి విపులమగు సమాధాన మొసంగి అక్షరపరబ్రహ్మ తత్త్వమును, ప్రణవధ్యానమును బోధించెను. దీనినిగూర్చి ఈ యధ్యాయ ప్రారంభమున వివరముగ తెలిపియున్నాను. "అంత్యకాలమున గూడ ఎవరు నన్నే స్మరించుచు దేహమును వీడుదురో అట్టి వారు పరమగతియగు నన్నే పొందుదురు. ఈ విషయము ముమ్మాటికిని సత్యము." అని భగవానుడు పలికెను. అదే విధముగ అంత్యకాలమున ఇతరమగు ఏరూపమును స్మరించినను, సంస్కారబలమువలన ఆ రూపమునే మఱుజన్మయందు జీవుడు పొందుచుండును. తుచ్ఛ విషయమును చింతించినచో

తుచ్ఛరూపమునే పడయును. మరణకాలమున నికృష్టమగు లేడిని భావించినందున జడభరతుడు లేడిజన్మమెత్తవలసి వచ్చెనుగదా! చిత్తము అద్దమువంటిది. దానియెదురుగ ఏ రూపమునుంచిన ఆ రూపమే అందు ప్రతిబింబించును. కాబట్టి మఱుజన్మకు హేతుభూతమైనట్టి అంత్యకాల సంస్కారము బహుపవిత్రముగ నుండవలెను. దీనికి ఉపాయమేమి? అంత్యకాలమున అకస్మాత్తుగ మంచిగుణము మనుజులపై ఊడి పడదు. జీవితకాలమంతయు ఎంతయో కృషిజేసి పవిత్రగుణములను సంపాదించినవారికి మాత్రమే చిత్తము సత్త్వగుణమయమై అంత్యకాలమున భగవత్స్మరణ సంభవించగలదు.

విద్యార్థి సంవత్సరకాలమంతయు బాగుగ చదివిననే పరీక్షాసమయమున చక్కగ వ్రాయగలడు. సంవత్సరము పొడుగునా సోమరియై తిరుగుచు సరిగా పరీక్షాసమయమున మాత్రము పుస్తకము తెఱచినచో ఏమి బోధపడును? ఏమి వ్రాయగలడు? ఎట్లు కృతార్థుడు కాగల్గును? ఒకవేళ ఈ ప్రాపంచిక పరీక్షలలో దొంగతనముగ 'కాపీ' కొట్టి ఎవరైన ప్యాసు కావచ్చునేమో కాని, అంత్యకాల పరీక్షయందుమాత్రము అది సాధ్యపడదు. ఒకడు ఇంకొకని సంస్కారమును తెచ్చుకొనలేడు. తన చిత్తమును తానే బాగుచేసికొనవలయును. అదియో ఒక్కరోజుతో జరుగు పనికాదు. అనేక జన్మార్జిత ఘనీభూత పాపవాసనలుగల చిత్తము సద్వాసనామయము కావలసియున్నచో, భగవదున్ముఖమై చక్కగా ధ్యానము చేయుసమర్థతనుబొందవలసియున్నచో జీవితకాలమంతయు తీవ్రతరప్రయత్నమావశ్యకమై యున్నది. రైలుయాత్ర చేయదలంచువాడు ప్రయాణకాలమునకు ఎన్ని

గంటల ముందునుండియో మాట, ముల్లె సర్దుకొని సిద్ధపడు చుండుట మనము చూచుటలేదా? అట్లే దీర్ఘప్రయాణ మగు మరణమునకై బాల్యకాలమునుండియే తగుసంస్కారము నేర్పఱచుకొనవలెను. అంత్యకాలమున అప్పటికప్పుడు ధ్యానము సిద్ధించవలెననిన అది సాధ్యపడు విషయముకాదు. అంత్యకాలమునమాత్రము భగవద్ధ్యానముచేసిన-చో మోక్షముకలుగునని శ్రీకృష్ణమూర్తి చెప్పెనుగదా యని కొందఱు సోమరులు అపోహపడి 'ఇకనరవాలేదు జీవితమంతయు పాపముచేసినప్పటికి అంత్యకాలమునదేవునకులాంఛనముగఒకదణ్ణముపెట్టినచో కైవల్యప్రాప్తికలుగగలదని' భావించున్నారు. వారివాదనను బలపఱచుకొనుటకు అజామిళుని దృష్టాంతముగ గైకొందురు. ఇటువంటి అలసులవిషయమై బాగుగ ఆలోచించియేఅర్జునుడు, శ్రీకృష్ణుడు ఇరువురు బహుజాగ్రత్తగ మాట్లాడిరి. వారికి అవకాశమే ఇవ్వ లేదు. అర్జునుడు 'ప్రయాణకాలేచ కథం జ్ఞేయోఽసి' (మరణకాలమునకూడ నిన్నెట్లు తెలిసికొనగలరు?) అని ప్రశ్నింప శ్రీకృష్ణుడు 'అన్తకాలేచ మామేవస్మరన్' (అంత్యకాలమునకూడ నన్నేస్మరించువాడు ముక్తిని బొందగలడు.) అని జవాబిచ్చెను. ఇరువురి వాక్యములలోను 'చ'కారముండుట గమనింపదగినది. 'చ'అనగా సంస్కృతములో 'కూడ' అని అర్థము. 'అంత్యకాలములోకూడ నన్ను ధ్యానించువాడు' అనిచెప్పిరి. కాని 'అంత్యకాలములోనే' అనిచెప్పలేదు. 'అంత్యకాలఏవ' అని శ్రీకృష్ణుడు చెప్పియుండినచో కొంపమునిగియుండెడిది. సోమరులు శ్రీకృష్ణుని బ్రహ్మరథముపట్టియుండెడివారు. కాని భగవానుడు వారి ఆటలను సాగనివ్వలేదు. 'చ'కార ప్రయోగముచే సోమరుల

గుండెలను ఛేదించి వేసెను. ఇంతియేకాదు ఆచొకారమును సరిగా వారు అర్థము చేసికొందురో, లేదో యని భావించి వెంటనే ఈ క్రిందిశ్లోకముద్వారా అర్థానికి భాష్యమునుగూడ చెప్పివైచెను.

తస్మాత్సర్వేషు కాలేషు మా మనుస్మర యుధ్యచ
మయ్యర్పిత మనో బుద్ధిర్మామేవైష్యస్యసంశయః (8-7)

'కాబట్టి ఓ అర్జునా! ఎల్ల వేళలయందును నన్ను స్మరింపుము. నీ స్వధర్మమగు యుద్ధమునుగూడ జేయుము. నాయందు అర్పింపబడిన మనస్సు, బుద్ధి కలవాడవైనచో నీవు నన్నుతప్పక పొందగలవు- ఇట సంశయ మేమియును లేదు' అని భగవానుడు 'అంత్యకాలములోకూడ' అనుపదమునకు వివరణము చెప్పెను. ఎల్లకాలములం దనగా బాల్య, యౌవన, వార్ధక్యములందని భావము. సామాన్యముగ వార్ధక్యములో ఎక్కువమందిమనస్సు స్వతః దైవకార్యములందు ప్రీతిగొనుచుండును. ఏలయనగా, ప్రపంచములోని భోగ్యవస్తుజాలమంతయును అనుభవించి అనుభవించి, విసుగు జనింప, వాటినుండి మరలి దైవమువైపునకు తిరుగుదురు. దృశ్యపదార్థములందు, దారాపుత్రాదులందు, ధనధాన్యారామక్షేత్రాదులందు, ఏమో సుఖము, శాంతి కలదని భ్రమించి పరుగిడినవారికి ఎదురుదెబ్బలు తగులగా, వాటినుండి చల్లగా మరలుదురు. ప్రవృత్తినితగ్గించి నివృత్తినిజేబట్టుదురు. మఱియు ఉద్యోగములనుండి రిటైర్ (Retire) అగుదురు. కావున బోలెడు సమయము వారికి మిగులును దైవచింతనకు. ఈ ప్రకారముగ వార్ధక్యమునమాత్రము దైవాన్వేషణచేయుట అసలు లేనిదానికంటె మంచిదే అయినను అది చాలదు. ఏలయనిన ఆసమయమున ఇంద్రియములన్నియు శక్తినిగోల్పోయి

దుర్బలములై భగవద్ధ్యానమునకు, దైవస్మరణకు, విచారణాదు లకు, తీవ్రతర సాధనలకు బాగుగ నుపయోగపడకుండును. విస్తరినిండ పంచభక్ష్యపరమాన్నములు వడ్డించి రాక్షసులకు పెట్టి, వారు తినగా మిగిలినపదార్థములను, ఎంగిలివిస్తరాకును దేవతలకు సమర్పించినట్లుగా నుండును, వార్ధక్యమున ధ్యానము ప్రారంభించుట. ఈ శరీరమను విస్తరిలోగల జవసత్వమును, బల వీర్యాదులను బాల్యయౌవన కాలములలో కామక్రోధాదిరాక్ష సులకు నివేదించి, వారుపీల్చి పిప్పిచేసిన పిదప ఆ నిర్వీర్య దేహ మును వార్ధక్యములో భగవానునికర్పించినట్లుండును! అయితే దీని యర్థము వార్ధక్యములో దైవచింతన చేయరాదని కాదు; చేయవచ్చును. (శుభము ఒకింతైనను మంచికొఱకేయగును), కాని అదిచాలదు. 'సర్వేషుకాలేషు' (ఎల్లకాలములందు) అను భగవానుని ఆదేశమును కని సరిగా అన్వయించవలెను. నిజముగ విచారించినచో ఈ భగవత్కార్యము, ఈ దైవధ్యానము, ఈ పరమార్థసాధన బాల్యయౌవనములందే పూర్తి చేయవలసి యున్నది. అపుడు మంచి ఆరోగ్యము, శక్తిసామర్థ్యములు ఇంద్రియపటుత్వము, జ్ఞాపకశక్తి, ధీరత్వము ఉండును. వయస్సు పెరిగినకొలది అవి క్రమక్రమముగ తగ్గిపోవుచుండును.

మఱియు జీవితము క్షణభంగురము కనుక వార్ధక్యమును నది రాకపూర్వమే అయ్యది అంతముకావచ్చును. అట్లైచో ఇక జీవుడుసాధించినది ఏమియుండును. అమూల్యమగు ఈ మానవ జీవితము నిష్ఫలమైపోవునుగదా. కనుకనే బాల్యయౌవనము లందుగూడ భగవత్స్మరణ చేయుము, ఎల్లకాలములందును తన్ను ధ్యానింపవలసినదిగా గీతాచార్యుడాదేశించుచున్నాడు.

దేవ త్వదీయ పదపంకజ పంజరాన్తః
మద్యైవ మే విశతు మానసరాజహంసః
ప్రాణప్రయాణసమయే కఫవాతపిత్తైః
కంఠావరోధన విధౌ స్మరణం కుతస్తే.

'దేవా ! నీపాదపద్మములందు నామనస్సను రాజహంస ఇప్పుడే ప్రవేశించుగాక ! ఏలయనిన, ప్రాణప్రయాణసమయమున కఫవాతపిత్తములచే కంఠము నిరుద్ధముకాగా నిన్ను గూర్చిన స్మరణ అపుడు సంభవింపదు' అని ఒకానొక భక్తుడు భగవంతుని వేడుకొనెను. కావున శరీరము ఆరోగ్యముగ నున్నపుడే, ఇంద్రియములు వికలములు కాకపూర్వమే, యౌవనము క్షీణించకమునుపే, పరిస్థితులు అనుకూలముగ నున్నపుడే జీవితలక్ష్యమగు పరమాత్మ సాక్షాత్కారమునకై మహత్తరమగు యత్న మాచరింపవలయును.

ప్రాప్తేన యేన నో భూయః ప్రాప్తవ్య మవశిష్యతే
తత్ప్రాప్తౌ యత్నమాతిష్ఠేత్కష్టయాపి హి చేష్టయా (వసిష్ఠగీత).

'దేనిని పొందినచో ఇక పొందదగినది ఎయ్యదియు మిగిలియుండదో, అట్టి ఆత్మప్రాప్తికై కష్టపడియైనను ప్రయత్నము చేయవలయును' అని వసిష్ఠమునీంద్రులు శ్రీరామచంద్రునకు హితము చెప్పిరి. మరల మరల దైవవస్తువును చింతనజేయుట వలన అభ్యాస ప్రాబల్యముచే మనుజుడు దైవమునే పొందుచున్నాడు. దీనికే 'అభ్యాసయోగ' మని గీతాచార్యుడు పేరుపెట్టెను.

అభ్యాస యోగయుక్తేన చేతసా నాన్యగామినా
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచిన్తయన్. (8-8)

'ఓ అర్జునా! మనస్సును ఇతర విషయములపై పోరనీయక, అభ్యాసయోగము నవలంబించి, పరమాత్మను మరల మరల చింతన జేయుచుండినచో మనుజుడు దివ్యమగు ఆ పరమ పురుషుని (భగవానుని) తప్పక పొందగలడు' అని చెప్పుటవలన ధ్యానమును, దైవచింతనను జీవితములో ఎల్లవేళలందును లెస్సగ అభ్యసించిననేతప్ప మాయాబంధము నిర్మూలింప బడ నేరదని తేటతెల్ల మగుచున్నది. కర్మయోగము, భక్తియోగము, జ్ఞానయోగము మొదలగునవిగాక మఱియొక క్రొత్తయోగము నిచట భగవానుడు సృష్టించెను. అదియే 'అభ్యాసయోగము'. పై యోగములన్నియు ఈ అభ్యాసయోగముతో కూడిననే పన్నుకెక్కును. ఇది ప్రత్యేకమగు ఒక యోగముకాదు. అన్నియోగములతో చేరియుండి అనుష్ఠానమును ద్విగుణీకృతమొనర్చు క్రియయే ఈ అభ్యాసయోగము. జీవితమంతయు ఏ క్రియ నభ్యసించుదురో, అదియే సంస్కారరూపముగ నేర్పడి అంత్యకాలమున అక్కఱకు వచ్చును. జీవితములో ఒక్కపర్యాయమైనను దైవచింతన చేయనివానికి తుదిఘడియలయందు దైవస్మరణ కలుగదు. ప్రపంచములో అజామిళులు చాల తక్కువ. జీవితమంతయు పాపముచేసి అంత్యసమయమున నారాయణ యనగలుగువారు ఎందఱున్నారో చెప్పుడు? అట్లు అనగలిగి యుండినచో, గీతాచార్యుడు అంత్యకాలములో మాత్రము దైవస్మరణ చేసిన చాలునని చెప్పియుండెడివాడుకదా? అట్లు ఏల చెప్పలేదు? 'సర్వేషు కాలేషు' - ఎల్లవేళలయందు తన్ను స్మరించవలసినదిగా ఏల ఆదేశించెను? గాంధిమహాత్మునకు దేహావియోగ

సమయమున 'హే రామ్' అను రామనామస్మరణ యెట్లు సంభవించినది ? జీవితకాలమున సమయము దొఱికినపుడెల్ల "రఘుపతిరాఘవ రాజారాం పతితపావన సీతారామ్" అను పావన నామమును స్మరించుచుండుట వలన. కావున భగవత్స్మరణను అంత్యకాలమువఱకు ఆపియుంచక, వార్ధక్యము వఱకువాయిదా వేయక విజ్ఞులగువారు ఈఅక్షరపరబ్రహ్మయోగమున తెలుపబడిన చందమున ప్రణవాది దివ్యమంత్రములను, పవిత్రములగు భగవన్నామములను సదా సర్వకాలములందును జపించుచు, స్మరించుచు, భావనచేయుచు పావప్రక్షాళన మొనర్చుకొని, హృదయశుద్ధిని బడసి జీవితకాలముననే సర్వోత్తమ బ్రహ్మపదవి నలంకరించుదురుగాక !

అట్టి బ్రహ్మపదవి నొందినచో కలుగు ఫలితమేమియని కొందఱు ప్రశ్నించవచ్చును. దానికి భగవాను డీ యధ్యాయము చివఱ విపులమగు సమాధాన మొసంగెను.

మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతం
నాప్నువన్తి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః (8-15)

"ఓ అర్జునా ! నన్ను పొందిన మహాత్ములు పరమసిద్ధిని (మోక్షమును) బడసినవారై, దుఃఖనిలయమై అశాశ్వతమైనట్టి ఈ జన్మను మరల ఎన్నటికిని బొందకయే యుందురు. (జన్మరాహిత్యమును బొందుదురని భావము) - ఈ ప్రకారముగ ఆత్మస్థితి యొక్క మహిమను భగవానుడుద్ఘాటించెను. ఓహో ఎట్టి మహత్తరమగు దివ్యపదమది! మాయాంతర్గతమగు సంసారస్థితి యొచట! మాయాతీతమగు పరమాత్మపదమెచట! ఒకటిదుఃఖాలయము,మఱియొకటి సుఖాలయము; ఒకటిఅశాశ్వతము, మఱి

యొకటి శాశ్వతము. రెండిటికిని హస్తిమశకాంతరము (భేదము) కలదు. కాని పూర్వపాపఫలితమోకాని జనులు దుఃఖ భాజనమైన ఆ సంసారస్థితినే కోరుకొనుచు పరమానందనిలయు మగు దైవమును ఉపేక్షించుచున్నారు. వారి స్థితిని వర్ణించుచు శ్రీరామకృష్ణపరమహంస చక్కని ఇతిహాసమును జెప్పెను.

పూర్వము కొందఱు పల్లెవారు సముద్రములో చేపలు పట్టుకొని గంపలయందు వేసికొని ఊరిలో అమ్ముకొనుటకు తీసికొని వచ్చుచుండిరి. అది సాయంసమయము. చుట్టునుక్రమ ముగ అంధకారము అలముకొనుచుండెను. అకస్మాత్తుగ బ్రహ్మాండమైన వర్షము కురిసెను. ఆ పల్లెవారు వానలో తడు చుచు పరుగెత్తుకొని వచ్చుచుండ త్రోవలో నొకగుడిసె కాన పింప అందఱును దానిలో దూరిరి. ఆ గుడిసె ఒకానొక పూల వర్తకునిది. పట్టణములో పుష్పాలమ్ముకొని జీవించువాడతడు. అతని యింటినిండా పూలగంపలుండెను. పల్లెవారాతనిని ప్రాధే యపడి చీకటిపడినదికనుకను, వర్షము కురియుచున్నది కనుకను ఆ రాత్రి తలదాచుకొనుట కొంత యాశ్రయ మిప్పించవలసి నదిగా ప్రార్థించిరి. అతడందుల కంగీకరించెను. తరువాత ఆజాల రులు తమతమ చేపలగంపలను బయటనే విడియుంచి వారు మాత్రము లోపల గదిలో పరుండిరి. ఆగదిలో నేపూలగంపలు కూడ నుండెను. సంపెంగ, గులాబి, చామంతి, మల్లె మొదలైన పుష్పజాతులన్నియు నుండుటవల ఆ గదియంతయు గుమగుమ లాడుచుండెను. జాలరులకు నిద్రపట్టలేదు. చేపలకంపునకు అల వాటుపడిన పెద్దమనుష్యులు కనుక సుగంధము వారికి ప్రాణ సంకటముగ నుండెను. ఒక్కొక్కరు లేచి కూర్చొనిరి. కర్తవ్య

మేమియని ఆలోచింపదొడగిరి- ఏకగ్రీవముగ నొకతీర్మానము చేసిరి. అది యేమియనిన, బయట చావడిలోనున్న వారివారి చేపలబుట్టలను లోపలికి తెచ్చుకొని వారివారి ముక్కులదగ్గఱ పెట్టుకొని పరుండవలెననియే. తీర్మానము తత్క్షణమే అమలులో పెట్టిరి. ఆ చేపలకంపు వారి నాసికాపుటములలోనికి ప్రవేశించు సరికి ఆనందములో తన్మయులై గుఱ్ఱుపెట్టి నిద్రపోదొడఁగిరి. ఈ ప్రకారముగనే మాయాధీనులగు అజ్ఞానజనులు దుఃఖ భూయిష్టమగు ఈసాంసారికస్థితిని సుఖకరముగ భావించి, ఒక్క నిముషము ఆ భోగజాలములనుండి దూరముగనున్నచో పరితపించిపోవుచున్నారు. ఆనందమయమగు పరమాత్మతత్త్వమునిన ఏవగించుకొనుచున్నారు, కథలోని జాలరులవలె.

కావున వివేకవంతులగువారు గీతాది సద్గ్రంథములను, సచ్ఛాస్త్రములను ఆశ్రయించి యుక్తాయుక్త వివేచనకలవారై భగవద్వాక్యములందు విశ్వాసముగలిగి సత్యమగు దైవత్వమునే ఆశ్రయించి అసత్యమగు దృశ్యమునందు వ్యామోహమును తొలగించుకొనుచుండవలెను. ఈ దృశ్యప్రపంచమును, ఈ జన్మాదివైభవమును మనము గొప్పగ తలంచవచ్చునేకాని భగవంతుడట్లు తలంపడు. 'దుఃఖాలయం, అశాశ్వతం'-అని దానిని కొట్టివేసెను. ఆలయమనగా మందిరము, లేక దేవాలయము అని అర్థము. దుఃఖదేవతకు ఈ ప్రపంచము (జన్మాదులు) మందిరమని శ్రీకృష్ణుడు వ్రాకుచ్చెను. సాక్షాత్ శ్రీకృష్ణ పరమాత్మయొక్క అభిప్రాయమెట్లుండెనో చూచితిరా! అజ్ఞాన పంకపరిమగ్నులగు జనులను వీక్షించి దయార్ద్రహృదయుడై ఆ యవతారమూర్తి వారికిట్లు ప్రబోధించుచున్నాడు. 'ఓజీవు

లారా! జననమరణ ప్రవాహమునబడి మీరు నానాయాతనల ననుభవించుచున్నారు. నన్ను ఆశ్రయించినచో ఆ దుఃఖబాధలు మీకు శమించిపోవును. మీరు కైవల్యపదవి నొందెదరు. నన్ను పొందినవారి కిక దుఃఖభూయిష్టమగు సంసారస్థితి యుండదు. జననమరణములు లుండవు. పునరావృత్తిరహిత శాశ్వతబ్రహ్మ స్వరూపమును వారు బడయుదురు. ఎక్కడికి వెళ్ళినను, ఏ లోకమునకు జనినను మరల తిరిగిరావలసినదే, మరల పుట్టవలసినదే. కాని నన్ను పొందినవాడు (పరమాత్మ నాశ్రయించిన వాడు) తిరిగి రాడు. అతనికి పునరావృత్తిలేదు. సమస్త జీవ రాసులు నశించినను ఏది నశింపకయుండునో అట్టి నాయొక్క సనాతన దివ్యపదము నాత డలంకరించును. అది జ్యోతిర్మయ స్వరూపము. తమస్సుకాదు. పుణ్యాత్ములే, భగవద్భక్తులే, ధ్యాన శీలురే అద్దానికడ కేగుటకు నోచుకొందురు. అజ్ఞానులు కాదు. అట్టి విశ్వాధారమగు నాయొక్క పరమతత్త్వమును, దివ్యాత్మ స్వరూపమును ప్రణవధ్యానాదులద్వారా నిరంతరాభ్యాసవశ మున చక్కగ తెలిసికొను యోగిపుంగవునకు లభించుపుణ్యము ఇంత అంత యని చెప్పుటకు వీలులేదు. వేదముల నభ్యసించుట చేతను యజ్ఞాదుల నాచరించుటచేతను పెక్కు దానముల నొసర్చుటచేతను ఏ పుణ్యము మనుజునకు లభించునో, దానిని మించినపుణ్యము నన్ను ధ్యానించుటవలన, నన్ను తెలిసికొనుట వలన ఆతనికి లభింపగలదు. కావున ఓ ప్రాణికోటులారా! దీర్ఘ ముగ విచారించి కర్తవ్యమునకు గడంగుడు. దైవచింతన నాశ్రయించి ధన్యులుకండు!' - అని తెలుపుచు భగవాను డీ యధ్యాయమును పరిసమాప్తము గావించెను. కావున మహా

సీయులారా! భగవద్వాణి ఈ ప్రకారము మార్మ్రోగుచుండ నిక యేల తుచ్ఛవిషయములందు ప్రవర్తించి జీవితమును వ్యర్థముగ ధారబోయవలెను? అయినదేమియో అయినది. ఇక మీదనైనను జీవితమును సరిదిద్దుకొని సన్మార్గమున వర్తించి భగవదాదేశ ప్రకారము భక్తి, ధ్యానాది పరమార్థసాధనల నభ్యసించినచో మనుజుడు అచిరకాలములోనే నిరతిశయానందాత్మానుభూతినిబడసి కృతార్థుడు కాగలడు. జన్మతరించి పోగలడు. ఇంతకుమించిన కార్యము ఈప్రపంచమున వేఱొకటి లేదు. ఇంతకు మించిన లాభము మఱెక్కడను దొఱకదు. కావున దైవమార్గమున కర్తవ్యశీలురగుదురుగాక!

ఓం తత్ సత్

ఓమ్

# 9-వ అధ్యాయము

# రాజవిద్యా రాజగుహ్యయోగము

నేడు గీత తొమ్మిదవ అధ్యాయమునందు ప్రవేశించుచున్నాము. ఈ అధ్యాయముతో గీత సగముభాగము పూర్తి యగును. విద్యలలోకెల్ల శ్రేష్ఠమైనదియు, రహస్యములలోకెల్ల పరమరహస్యమైనదియునగు అధ్యాత్మవిద్యను పరమాత్మ యీ అధ్యాయమునందు బోధింప నుద్యమించెను. కనుకనే దీనికి రాజవిద్యారాజగుహ్యయోగమను పేరు వచ్చినది. 'రాజ' పదము ఆధిక్యతను, గొప్పతనమును సూచించును. భగవంతుని దృష్టిలో ప్రపంచములోని విద్యలన్నిటిలో నేదియుత్తమమైనదో ఇచట సుస్పష్టమగుచున్నది. పిల్లవాడు పుట్టిన ఐదవసంవత్సరమునకు తల్లిదండ్రులు వాని విద్యావిషయమై యోచింప మొదలిడుదురు. కాని ఎచట చూచినను ప్రాపంచిక విద్యలందలి ప్రవేశమే కాన్పించుచున్నది. కాని, ఏది సర్వవిద్యలకును మకుటప్రాయమైయున్నదో అట్టిపరమార్థవిద్యయుపేక్షింపబడుచున్నది. రాజును విడిచి సామాన్యుని నాశ్రయించుట ఎట్టిదో, రాజవిద్యను విడిచి యితర విద్యల నాశ్రయించుట అట్టిదేయగును. బ్రహ్మవిద్యకు 'రాజత్వ' మాపాదించి శ్రీకృష్ణుడేల అద్దానికి ప్రాధాన్యత నొసంగెనో విజ్ఞులొకింత యోచింపవలెను. ఏది దుఃఖమును ఆత్యంతికముగ నివారించునో, ఎద్దానియందు ప్రీతి గల్గియున్నచో భీషణతాపములు, క్లేశములుకూడ మనుజుని

చిత్తమును వ్యాకులమొనర్పజాలవో* ఏది జీవితకాలముననే పరమానందము నొందగల్గునో, అట్టి అధ్యాత్మవిద్యను ఉపేక్షించిన కారణమువలననే, జనులు తక్కిన ఎన్ని విద్యలున్నప్పటికిని దుఃఖమును దాటలేకున్నారు. నిరతిశయానందము ప్రతి జీవి యొక్క పరమావధి. అద్దానిని నోచుకొనలేని జీవితము జీవితము కాదు. కావున అట్టి ఆనందమునకు మార్గమును యోచించుకొనువాడు ధన్యుడు. ఎప్పుడో వార్ధక్యములో అన్ని శక్తులు ఉడిగిన పిదప దానికొరకై అన్వేషించుట అంత శ్రేష్ఠమైన పనికాదు. బాల్యములోనే యౌవనములోనే ఆ రాజవిద్యను హస్తగత మొనర్చుకొనవలెను.

పూర్వము మదాలసయను రాణి తనకు పుట్టిన బిడ్డలకు ఉగ్గుపాలతోనే ఆత్మవిద్య నుపదేశింపదొడగెను. ఇపుడు తల్లులు బిడ్డలను ఊయెలలో పరుండబెట్టి ఏవియో అర్థములేని జోలపాట లన్నియు పాడుచుందురు. కాని ఆ సాధ్వి బిడ్డలను ఊయెలలో నుంచి, ఊపుచు ఈ క్రింది పాటను పాడదొడంగెను—

శుద్ధోఽపి రే తాత న తేఽస్తి నామ
కృతం హి తే కల్పనయాఽధునైవ
పంచాత్మకం దేహమిదం న తేఽస్తి
నైవాస్య త్వం రోదిషి కస్య హేతోః.

(మార్కండేయ పురాణము)

"ఓరీ! నాయనా! నీవు పరిశుద్ధమగు ఆత్మస్వరూపుడవు. నీకు నామరూపములులేవు. అవి కేవలము నీకిపుడుకల్పింపబడినవి. ఈ పంచభూతాత్మకమగు దేహము వాస్తవముగ నీకులేదు. నీకును

* యస్మిన్స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే (6-22)

దానికి సంబంధమున్నూ లేదు. నీవు శుద్ధబుద్ధముక్త స్వరూపుడవు. అట్టిచో వల నీవు ఏడ్చుచున్నావు?' ఈ ప్రకారముగ అఖండ జ్ఞానోపదేశమును పుట్టుకతోనే తన బిడ్డల కొసంగి, వారిని జన్మపరంపరలనుండి కడతేర్చిన ఆ యిల్లాలుమాతృలోకమునకు ఆదర్శప్రాయముగ నున్నది. మాయ యను బలవత్తరమగు శత్రువును ఎదుర్కొనవలెనన్న శక్తివంతమగు ఆయుధమును మొట్టమొదటనే మనము సంపాదించుకొనవలెను గాని, కాలయాపన చేసినచో ఉపయోగము లేదు. ఆ మదాలసా పుత్రులు తల్లివలన జన్మనొక్క వసంతముననే రాజవిద్యను బడసి జీవితమునంతను వసంతముగ నొనర్చివేసికొనిరి. తరించి మానవజన్మను సార్థకపఱచికొనిరి. 'మోక్ష్యసేఽశుభాత్' అనునట్లు అశుభరూపమగు సంసారబంధమును త్రుటిలో ఛిన్న భిన్న మొనర్చుకొనిరి.

అట్టి మహోన్నత బ్రహ్మవిద్యను గీతాచార్యుఁ డిపుడు ఉపదేశింపబోవుచున్నాడు. అది 'పవిత్ర' మైనది, 'ఉత్తమ' మైనది, 'అవ్యయ' మైనది. ప్రత్యక్షముగ తెలిసికొనదగినది. ఆచరించుటకు సులభసాధ్యమైనది—

ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్.

వ్యాపారములు రెండురకములు. అప్పు (credit) వ్యాపారము, నగదు (cash) వ్యాపారము అని. ఈ దైవవిద్య నగదువ్యాపారమువంటిది. ఫలితము, అనుభవము ఎప్పుడో గలుగునది కాదు. ఇప్పుడే ఈక్షణముననే దాని ఫలితము, దాని యనుభవము జీవునకు కలుగగలదు. కనుక 'ప్రత్యక్షావగమం' అని భగవాను డద్దానిని స్తుతించినాడు. పరోక్షఫలితముల నొసంగు

వానిపై జనులకంత విశ్వాసముండదు. ఎప్పుడో పుణ్యము వచ్చును, ఎప్పుడో మోక్షము కలుగును అని చెప్పునపుడు జనులు వాటి నాశ్రయించుటకు వెనుకాడుదురు. సంశయగ్రస్తులగుదురు. కాని ఈ రాజవిద్య (బ్రహ్మవిద్య) అట్టిది కాదని భగవానుడు మొదటనే సాధకుల కాశ్వాసమొసంగుచున్నాడు. ఒకవేళ ఆచరించుటకు కష్టసాధ్యమాయనిన, అదియును లేదు. 'సుసుఖం'-చాల తేలిక. యుక్తితో, భక్తితో ప్రారంభించినచో శీఘ్రముగ అంతుపట్టగలదు. అయితే అసూయ మొదలగు దుష్టగుణములకు మాత్రము హృదయమున తావీయరాదు. 'అనసూయవే' - అసూయ, ద్వేషము మున్నగునవి లేనివానికి మాత్రమే గురువు లిద్దానిని బోధించుచుందురు. అట్టివానికే అది ఒంటపట్టును. తక్కినవారికి కాదు. అర్జునున కాదుర్గుణములు లేవు. కావున శ్రీకృష్ణు డాతనికి ఉపదేశించుటయు, అది అతని హృదయములో ప్రవేశించుటయు సంభవించినది.

అట్టి పరమపవిత్రమగు అధ్యాత్మవిద్య నుపదేశించుటకు పూర్వము శ్రీకృష్ణపరమాత్మ శ్రోతకుండవలసిన ముఖ్యలక్షణము నొకదానిని పేర్కొనెను. అదియే శ్రద్ధ. దీని విషయమై సందర్భము వచ్చినపుడెల్ల గీతాచార్యుడు నొక్కిచెప్పుచుండుట మనము గాంచుచున్నాము. ఇపు డిట్టి సందర్భమే తెంచినది. కావున ఆ యవకాశమును భగవానుడు వదలలేదు. తాను చెప్పబోవు బ్రహ్మవిద్యారూపమగు పరమధర్మమునం దెవరికి శ్రద్ధకాని విశ్వాసముకాని యుండదో, అట్టివారు తన్ను (పరమాత్మను) పొందక పోవుటయే కాక

జననమరణరూపమగు ఈ సంసారాంభోధియందు పడిపోవు చున్నారని నుడివెను. 'నాకు ప్రకాశము వద్దు' అని తలంచు వారికి అంధకారమే గతి. నాకు 'దైవము అక్కఱలేదు' ని యనుకొనువారియొద్దకు దయ్యము వచ్చి చేరును. ప్రాపంచిక జనులు మాయాకార్యములగు భోగవిలాసములందు నశ్వరపదార్థముల సముపార్జనమునందు క్షణికానందముల యాస్వాదమునందు పెక్కుజన్మలు బాగుగ రుచిమరగినందు వలన, ఇపుడెవరైన 'చక్కటి జ్ఞానమును బోధించెదము రండు' యని ఆహ్వానించినను తిరస్కరించి 'మాకిదియే పరమానందముగ నున్నది. పొమ్మందు' అని పలుకుచున్నారు. వారి స్థితి యెట్లున్న దనిన—

పూర్వకాలమున చైనాదేశమున నొక హంతకుడు హత్యానేరమునకై యావజ్జీవ కారాగార శిక్షను బడసెను. ప్రభుత్వమువారాతనిని ఒక చీకటికొట్టునందు పడవేసి తలుపులు బంధించి వెడలిపోయిరి. ఎప్పుడో ఒక పర్యాయము ఒకింత ఆహారముమాత్రము దానిలో ఉంచుచుండిరి. ఇవ్విధముగ ఆ హంతకునకు జీవితకాలమంతయు నిబిడాంధకూపముననే గడచుచుండెను. ఇట్లుండ నొకదినమున ఆదేశపురాజు అకస్మాత్తుగ మరణించెను. క్రొత్తరాజు సింహాసన మధిష్ఠించెను. ఆతని పట్టాభిషేకసమయమున దేశమంతటను ఆనందోత్సవము ప్రకటింపబడెను. ఆబాలగోపాలము ఉత్సవములందు పాల్గొనుటకై ఆదేశింపబడిరి. కారాగృహములందు బంధింపబడిన వారందరి యొక్క విడుదల ఆజ్ఞాపింపబడెను. తత్ఫలితముగ మన యీ హంతకునకును విడుదల ఉత్తరువువచ్చెను. జైలుఅధికారులు

తలుపు తెరచి వానిని బయటకు తీసికొని వచ్చుచుండిరి, కాని ఎన్నియోసంవత్సరములు అంధకారమునపడి, ప్రకాశమెట్టిదో తెలియక, చీకటికి అలవాటుపడియున్న ఆ ఘనుడు ఒక్కపర్యాయము సూర్యకాంతిలోనికి వచ్చుటవలన అపరిమితమగు బాధనొంది కండ్లు మూసికొని 'మహాప్రభో! క్షమింపుడు. నాకీప్రకాశము బాధాకరముగనున్నది. నన్ను ఆ చీకటి గుహలోనే ఉండనిండు. దయచేసి అక్కడే నివసించుటకు అనుజ్ఞ నొసంగుడు. ఈప్రకాశమును నేను భరింపలేను. ప్రకాశములో ఉండి బాధ నొందుటకంటె చీకటిలో ఉండి సుఖపడుటమేలు. మీకు వెయ్యినమస్కారములు. నన్ను ఆచీకటిలోనికే తీసికొనిపొండు!' అని వారిని ప్రార్థేయపడెనట! చూచితిరా! నేటి అజ్ఞానుల స్థితి ఈ ప్రకారముగనే ఉన్నది. దైవవాక్యములపై, దైవకార్యములపై వారికి విశ్వాసములేదు. శ్రద్ధలేదు. వెలుగు వారికి సరిపడదు. అజ్ఞానజనులసహవాసము,అజ్ఞానకార్యములు, చీకటి, చీకటిబజారు (Black Market) వారికి ప్రీతి. కనుకనే భగవానుడు అట్టివారిని హెచ్చరించుచు—

అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాస్య పరన్తప
అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని. (౯-౩)

'ఈబ్రహ్మవిద్యారూపమగు ధర్మమునందెవరికి శ్రద్ధ,నమ్మకము ఉండదో అట్టివారు నన్ను పొందజాలక, మృత్యురూపమగు ఈ సంసారమార్గమున పడిపోవుదురు'- అని ఉద్బోధించిరి. పరమార్థక్షేత్రమున విశ్వాసము, శ్రద్ధ గొప్ప స్థానమును అలంకరించుచున్నవి. అవిలేనిదే అసలు దైవవిషయమై ప్రవృత్తియే సంభవింపదు.కనుకనే సాధనచతుష్టయ సంపత్తియందలి ప్రము

ఖాంగమగు శమాదిషట్కసంపత్తియందు (శమము, దమము, ఉపరతి, తితిక్ష, శ్రద్ధ, సమాధానము) శ్రద్ధను విధిగా చేర్చిరి. భగవద్వాక్యమందు, గురువాక్యమందు, శాస్త్రవాక్యమునందు మొట్టమొదట విశ్వాసముంచి దాని నాచరించుటకై యత్నింపవలెను. అటుపిదప ఆవాక్యముయొక్క సత్య నిజానుభవమందు తనకే తెలియగలదు. విశ్వాసముసడలినచో, ధైర్యము సడలును; ధైర్యము సడలినచో సాధన కుంటుపడును; సాధనకుంటుపడినచో లక్ష్యము దూరమైపోవును. కావున లక్ష్యప్రాప్తికి అకుంఠిత విశ్వాసము, అపరిమితశ్రద్ధ అత్యవసరములై యున్నవి.

తుమ్మెద, చేవగలిగిన కొయ్యకుకూడ రంధ్రము చేయగలదు. దాని ముక్కు అంతవాడిగా నుండును. ఆ తుమ్మెదయే కమలమునందు ప్రవేశించి మధువు నాస్వాదించు సమయమున, సూర్యాస్తమయసమయముఅయి కమలము ముడుచుకొనినచో దానియందు చిక్కుకొని అధైర్యపడి తన శక్తిపై విశ్వాసము గోల్పోయి, తత్ఫలితముగ కర్తవ్యమునుమఱచి దిగులుతో చనిపోవును. చేవకొయ్యకు రంధ్రము వేయగల వాడిముక్కు తన యొద్దనే యుంచుకొనియుండి, తన శక్తిపై విశ్వాసమును గోల్పోయినందువలన, కోమలకమలపత్రమునుగూడ అది భేదింపజాలకున్నది. అట్లే మనుజునియందు అఖండమైన శక్తిసామర్థ్యములు కలవు. అవి నిద్రాణములై యున్నవి. అవి ఉన్నవని మనకు తెలియదు. ఎవరైన చెప్పినను వారి వాక్యములందు నమ్మకముండదు. అట్టిచో ఆశక్తులెట్లు జాగృతములు కాగలవు. అట్లు అవి జాగృతములు కానందువలననే మనుజుడు అధోగతిని జెందుచు, మృత్యుసంసారపథమునపడి గిలగిల తన్నుకొను

చున్నాడు. నవలలపై విశ్వాసముకలదు. నాటకములపై విశ్వాసముకలదు. వార్తాపత్రికలపై విశ్వాసముకలదు. దారినపోయే దాసరయ్యవాక్యమునందు విశ్వాసముకలదు. కాని దేవునిపై గాని, దేవునివాక్యముపై గాని విశ్వాసములేదు. ఇది మన స్థితి.

అద్యాష్టమీతి నవమీతి చతుర్దశీతి
జ్యోతిష్కవాచోపనసన్తి భక్త్యా
శ్రుతేస్త్వహో తత్త్వమసీతి వాక్యం
న విశ్వసన్త్యద్భుతమే తదేవ. (మహావాక్యదర్పణము)

'నేడు అష్టమి, నేడు నవమి, నేడు చతుర్దశి'-అని ఈ ప్రకారముగ జ్యోతిష్కుడు చెప్పగా విని ఆ వాక్యములను నమ్మి, భక్తితో ఆ యా తిథులందు ఉపవాసము మున్నగునవి జనులాచరించుచున్నారు. కాని 'తత్త్వమసి' (ఆ పరమాత్మవే నీవు) అని శ్రుతిభగవతి చెప్పిన వాక్యమునుమాత్రము జనులు నమ్ముటలేదు. ఆహా! ఎంత ఆశ్చర్యము! అని శ్రీ శంకరాచార్యులవారు తాము వ్రాసిన మహావాక్యదర్పణ మను గ్రంథమున ఉల్లేఖించిరి.

'We trust the man in the street, but there is one being in the universe we never trust and that is God.'

'దారినపోవు మనిషినికూడ మనము నమ్ముదుము; కాని ఈ జగత్తునందు మనమెన్నటికినినమ్మనిఒకవ్యక్తి కలదు.అతడేదేవుడు'- అని వివేకానందస్వామి పలికియున్నాడు. నిజముగ ప్రపంచముయొక్కస్థితి అట్లేయున్నది. ఈ వైపరీత్యము తొలగిననేతప్ప లోకమున శాంతిసుఖములకు ఆస్కారములేదు. ఏనాడు జనులు

సర్వేశ్వరుని యొక్కయు అనుభవజ్ఞులైన పరమఋషుల యొక్కయు వాక్యములను నమ్ముదురో, నమ్మి ఆచరించుదురో ఆనాడే దేశమునకు శ్రేయము కలుగగలదు. తనకున్ను మహత్తర శుభము చేకూరగలదు. కనుకనే శ్రీకృష్ణపరమాత్మ అతి రహస్యమగు ఈ రాజవిద్య నుపక్రమింపబోవు సమయమున దానిపై శ్రద్ధ గలిగియుండవలెననియు, అట్లు శ్రద్ధలేనివారు మృత్యురూపమగు ఈ సంసారచక్రములనుండి విడివడక దానియందే తగుల్కొని దుఃఖములపాలగుదురనియు చెప్పుటకు కారణము. 'మృత్యుసంసారవర్త్మని' 'మృత్యుసంసారసాగరాత్'- అని ఈ ప్రకారముగ భగవానుడీ సంసారచక్రము మృత్యుగ్రస్తమని, మృత్యుముఖమున వర్తించుచున్నదియని వర్ణించుచుండుట గమనింపదగినది. జను లీ సంసారస్థితిని ఆనందమాయముగ వర్ణించుకొందురు. కాని కాలుని కరాళవదనమున స్థితి నొందియుండు పదార్థమునందైన ఆనందముండునా? నాశశీలమగువస్తువునం దానందమెచట? కావున అవివేకముచే వారట్లు సంసారమును, జన్మలను సుఖమయములుగ భావించుకొందురు. వాస్తవస్థితి అట్లు లేదు. 'విలగ్నా దశనాన్తరేషు'- అనునట్లు కాలస్వరూపుని కోరలలో జనులు చిక్కుకొనియున్నారు-ఇది వాస్తవస్థితి. ఆ స్థితినే భగవానుడిచట 'మృత్యుసంసారవర్త్మని' అని వర్ణించి ప్రాపంచిక వైభవములు, భోగములు, కీర్తులు, విహారములు, జన్మలు-గొప్పగా తలంచవద్దు. అవి మృత్యురూపములు అని హెచ్చరించుచున్నాడు. మఱియు భగవద్వాక్యములందు శాస్త్రవాక్యములందు నమ్మకము లేనివారు, ఆనందధామమగు తన్ను పొందజాలనివారై పై పెచ్చు మృత్యురూప

మగు ఈ సంసారాఘాతమున బడిపోవుదురని ఘోషించుచున్నాడు. కావున జనులు సచేతస్కులై శ్రీకృష్ణపరమాత్మ చెప్పబోవు ఈ అఖండ జ్ఞానోపదేశమునందు శ్రద్ధగలిగి ఆచరించి తరించుదురుగాక !

పరమాత్మ సమస్త బ్రహ్మాండములందంతటను వ్యాపించియున్నాడు. ఆకాశమునందు వాయువువలె చరాచరప్రాణికోట్లన్నియు ఆతనియందే స్థితిగలిగియున్నవి. అణువుఅణువునందును అతని మహాత్మ్యము ప్రకటమగుచున్నది. ప్రకృతి జడమైనది. పరమాత్మయొక్క చైతన్యశక్తివలననే ఆప్రకృతి తన కార్యములను నెరవేర్చుకొనుచున్నది. ఈ జగద్రూపమహాసభకు పరమాత్మ అధ్యక్షుడు. స్థావరజంగమప్రాణికోట్లన్నియు సభ్యులు.* ప్రకృతి సభాసంచాలకుడు (Convener). ఇతరు లెందఱున్నను అధ్యక్షుడు లేనిదే సభ రంజింపదు. సభకు చైతన్యమే యుండదు. అట్లే ఈదృశ్యజగత్తును ఆధారభూతుడగు పరమాత్మ లేనిచో నిర్వీర్యమై, శక్తిరహితమై, క్రియాశూన్యమై యుండును. పరమాత్మ ఎలెక్ట్రిక్ కరెంటువంటివాడు. చరాచర ప్రాణికోట్లు బల్బులవంటివి. బల్బులలో కొన్ని చిన్నవి, కొన్ని పెద్దవి, కొన్ని తెల్లవి, కొన్ని ఎఱ్ఱవి, కొన్ని పొడుగువి (tube lights), కొన్ని పొట్టివి, కొన్ని లావువి (dome lights), కొన్ని సన్నవి ఎట్లుండునో అట్లే ప్రాణికోట్లలోను వివిధరూపములు, వివిధ పరిణామములు, వివిధరంగులు కలవు. కరెంటు లేనిచో ఎన్ని బల్బులున్నను ఏమి ప్రయోజనము. అట్లే చైతన్యస్వరూపుడగు పరమాత్మ లేనిచో జగత్తు నిష్ప్రయోజనము. ఆధారము లేనిచో

* మయాఽధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్. (9-10)

ఆధేయము నిలువదు. భగవానుడు ఆధారము. జగత్తు ఆధేయము. కావున పరమాత్మ లేనిదే జగత్తు అసలు నిలువనే నిలువదు. ఇక్కారణముననే శ్రీకృష్ణమూర్తి ఈ అధ్యాయమున తన్ను 'భూతభృత్'*- (ప్రాణికోట్లను భరించువాడు) - అని పేర్కొనెను. ఇంతియేకాదు 'భూతస్థ' (ప్రాణికోట్లయందు నివసించువాడు) అనియు వచించెను. దీనినిబట్టి ఒక్కమానవుని యందేకాక, కుక్కయందును, నక్కయందును, ఈగయందును, దోమయందును, పశుపక్ష్యాదులందును, క్రిమికీటకాదులందును, జీవరాసులందును సర్వత్ర అతడు వెలయుచున్నాడని స్పష్టమగుచున్నది. ఈ సత్యము నెఱింగినచో ఇక జనులకు ప్రాణికోట్లయెడల కారుణ్యబుద్ధి యుదయించగలదు. మఱియు భగవానుడు తమతమ హృదయములలో అంతర్యామిరూపముగ వర్తించుచుండుటవలన పాపముచేయుటకును జనులు భయపడుదురు. మఱియు ధ్యానాది సాధనలద్వారా అతిసమీపమున (హృదయముననే) నున్న ఆ పరమాత్మను సాక్షాత్కరించుకొనుటకున్ను యత్నించుదురు. ఇన్నివిధముల ఈ ఆత్మజ్ఞానము, బ్రహ్మవిద్య (రాజవిద్య) లోకులకుపకరించుచున్నది. ఇద్దానినే ఈ అధ్యాయమున శ్రీకృష్ణభగవానుడు అర్జునునకు విశదీకరించెను.

ఈప్రకారముగ పరమాత్మ విశ్వవ్యాపకుడైయున్నప్పటికిని అజ్ఞానులాతనిని తెలిసికొనుటలేదు. అతని అస్తిత్వమును వారంగీకరించుటలేదు. 'భగవానుడు లేడు' 'ప్రపంచమే సత్యము' అని వారు పలుకుచున్నారు. వారిదృష్టి సంకుచిత

* భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః. (9-5)

మైనదికాబట్టి వారికి అట్లే కానిపించును. 'విచేతసః'- విగత చేతస్కులు-(చిత్తము చెడినవారు -brainless fellows) అని భగవానుడు వారికి సరియైన నామధేయ మొసంగెను. చిత్తము సరిగా నున్నచో, దృష్టి చక్కగా నున్నచో మనుజుడు సరిగా తెలిసికొనును, సరిగా చూచును. చిత్తము వక్రమైనచో అంతయు నతనికి వక్రముగానే కనిపించును. కనుకనే శ్రీశంకరాచార్యులు-

'దృష్టిం జ్ఞానమయీం కృత్వా పశ్యేద్బ్రహ్మమయం జగత్'

దృష్టిని జ్ఞానమయముగ నొనర్చుకొని జగత్తును బ్రహ్మమయముగ వీక్షింపుమని ఆనతిచ్చిరి. శ్రీకృష్ణపరమాత్మ ఈఅధ్యాయ ప్రారంభమున దెల్పిన భగవంతుని సర్వవ్యాపకత్వము, సర్వాంతర్యామిత్వమును ఎవరు లెస్సగ నెఱుఁగుదురో అట్టివారిదృష్టి పవిత్రమై, జ్ఞానమయమై యొప్పును. మఱియు నట్టివారు ఆ తమ జ్ఞానదృష్టిచే సర్వత్ర వెలయు సచ్చిదానంద పరమాత్మను లెస్సగ గాంచగల్గుదురు.

సర్వగం సచ్చిదానందం జ్ఞానచక్షుర్నిరీక్షతే
అజ్ఞానచక్షుర్నే క్షేత భాస్వన్తం భానుమన్ధవత్. (ఆత్మబోధ).

'సర్వవ్యాపకమగు సచ్చిదానందాత్మను జ్ఞాననేత్రము కలవాడు చూచుచున్నాడు. సూర్యుడు దేదీప్యమానముగ ప్రకాశించుచున్నను గ్రుడ్డివాడుచూడజాలనట్లు,అజ్ఞాననేత్రము కలవాడట్టి సర్వవ్యాపక పరమాత్మను చూడజాలకున్నాడు' - అని శ్రీ శంకరాచార్యులు తమ 'ఆత్మబోధము'నందు తెలిపియున్నారు. పుష్పమాలలో పుష్పములు కనిపించును. లోని త్రాడు కనిపిం

చదు. అక్కడ బల్బులు కనిపించును. కరెంటు కనిపించదు. కాని పుష్పములకు ఆధారము త్రాడు; బల్బుల ప్రకాశమునకు ఆధారము కరెంటు. వివేకనేత్రముచే జనులు ఆధారభూతములగు ఆ రెండిటిని గాంచగలరు. దానినే జ్ఞానదృష్టి యందురు. అది లేనివారు నేత్రము లున్నను గ్రుడ్డివారే యగుదురు. (పశ్యన్నపి న పశ్యతి).

సామాన్యముగ జనులలో రెండుతరగతులవారుందురు. దైవీప్రకృతిని ఆశ్రయించినవారు, ఆసురీప్రకృతిని ఆశ్రయించినవారు అని. వీరిరువురిని గూర్చియు గీతాచార్యు డీ యధ్యాయమున ప్రస్తావించిరి. ఇందు మొదటిరకమువారు భగవంతునియం పరిపూర్ణ విశ్వాసముగలిగి, ఆతనిని అవ్యయునిగ, ఆదిపురుషునిగ, లోకైకప్రభువుగ నెఱింగి అనన్యచిత్తముతో సేవింతురు. మఱియు పెక్కుదృఢవ్రతము లవలంబించి నిరంతరము భగవంతుని కీర్తించుచు, భక్తిప్రపత్తులతో ఆరాధించుచు, నమస్కరించుచు తీవ్రతరసాధనలు సల్పుదురు. అట్టి మహాత్ములు అచిరకాలములోనే తమ ధ్యేయవస్తువగుపరబ్రహ్మమును చేరగలరు.

'ఉద్యోగినం పురుషసింహముపైతి లక్ష్మీః'

'ప్రయత్నశీలుడగు పురుషపుంగవునే లక్ష్మి వరించును' - అను ఆర్యోక్తి యథార్థమునే చాటుచున్నది. ఎవడు ఏ మార్గమున ఎట్టిప్రయత్నమాచరించునో ఆతడామార్గమున అట్టి ఫలితమునే పొందగలడు. ఈ సత్యము లౌకిక, పారమార్థిక క్షేత్రముల రెండిటికి అన్వయించును. ఎవడుత్యాగశీలుడై దృశ్యపదార్థములందు, భోగవిషయజాలమందు విరక్తి గలిగి, అంతరాత్మనే

ఆశ్రయించి దృఢమగు పట్టుదలతో సాధించునో, అట్టివాడు గమ్యమును తప్పక చేరగలడు.

'సతతం కీర్తయన్తోమాం యతన్తశ్చ దృఢవ్రతాః (9-14)

అను ఈభగవద్వాక్యమునందు రెండు విశేషములు తెలుపబడినవి. అవి యేవి యనిన- (1) భగవంతుని ఎప్పుడో ఒకప్పుడు కీర్తించుటచాలదు. ఎల్లప్పుడును కీర్తించుచుండవలెను(2) దేవుని పొందుటకు సామాన్యవ్రతములు చాలవు. దృఢవ్రతములు శీలించవలెను-అని. బలపడిన పెద్దమ్రాను నరుకుటకు రేకు గొడ్డలి పనికిరాదు. ఉక్కుగొడ్డలి కావలయును. అట్లే కోట్లకొలది జన్మలనుండి వేళ్ళుతన్నుకొని బాగుగ దృఢపడియున్న వాసనారూపమగు ఈ సంసార వృక్షమును ఛేదించుటకు తీవ్ర సాధనారూపమగు ప్రచండపరశువు కావలసియున్నది. భగవంతుని ఒక్క పర్యాయమైనను స్మరించనివాని నుద్దేశించి శాస్త్రములు 'నాయనా! రోజునకు సంధ్యాకాలములు మూడు వచ్చెను. ప్రాతఃకాలము, మధ్యాహ్నసమయము, సాయంత్రము - ఈ మూడు వేళలందును నీవు సంధ్యావందనము చేయుము' అని ఆదేశించినవి. అంతమాత్రము చేత తక్కిన సమయములందు దేవుని మఱువుమని చెప్పుచుండుటకాదు. శుభమగుదానిని ఎంతెంత అధికముగజేసిన అంతంత అధికఫలము చేకూరును. కావున తీవ్రప్రయత్నశీలురకు నిరంతరభగవత్స్మరణయే ఆచరింపదగినది. సందుదొరికినచో మాయవచ్చి ప్రవేశించును. కావున మాయకు, అజ్ఞానమునకు చోటీయక 'సతత' భగవత్సంకీర్తనను, సతతదైవస్మరణను విజ్ఞులాశ్రయించవలెను. పాపమనగానేమి ? అని పూర్వము విద్వాంసులగోష్ఠిలో నొక

ప్రశ్నవచ్చెను. అసత్యము పలుకుట పాపమని కొంద అనిరి. వ్యభిచరించుటపాపమని మఱికొందఱనిరి. పరులను బాధించుట పాపమని కొందఱు పలికిరి. కాని, రామతీర్థస్వామి లేచి—

**'To forget God is sin'**

'దేవుని మఱచుటయే పాపము' అని గంభీరముగ నుడివెను. ఈదైవవిస్మరణమునుండియే అన్ని పాపములున్ను ఆవిర్భవించును.

యన్ముహూర్తం క్షణమపి వాసుదేవో న చిన్త్యతే
సాహానిస్తన్మహచ్ఛిద్రం సాభ్రాన్తి స్సా చ విక్రియా.

'ఏ క్షణమందు వాసుదేవుడగు పరమాత్మ స్మరింపబడడో, ఆ క్షణమందే గొప్ప హాని, గొప్ప ఆపద, గొప్ప భ్రాంతి, గొప్ప వికారము వచ్చిపడినట్లే కాగలదు' - అని శాస్త్రవాక్యము.

అయితే గృహస్థాశ్రమమునన్న వారీసందర్భమున నొక ప్రశ్న వేయుదురు. 'అయ్యా! సన్న్యాసులు, సాధువులు అంతయు విడిచిపెట్టి ఏకాంతమున ధ్యానించుచుందురు. కావున వారికి నిరంతర దైవస్మరణ సాధ్యపడగలదు. మేమో గృహస్థులము. పిల్లి, జెల్ల, మేక, ఉద్యోగము, సంపాదన మున్నగు గొడవలు లెక్కలేనన్ని మాకు కలవు. అట్టి మాకు నిరంతర దైవచింతన ఎట్లు సాధ్యపడగలదు?'- ఈ ప్రశ్నకు ప్రత్యుత్తరము గీతయందనేక చోట్ల కలదు. 'మామనుస్మర యుధ్య చ'-నన్ను చింతన చేయుచు నీస్వకీయకార్యము (యుద్ధాదులు) నొనర్చుకొనుము.

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్
యత్తపస్యసి కౌన్తేయ తత్కురుష్వ మదర్పణమ్. (9-27)

నీవు ఏమి చేసినను,ఏది భుజించినను, ఏమి హోమము చేసినను, ఏది యిచ్చినను, ఏమి తపస్సు చేసినను, దానిని నాకర్పణము

చేయుము' - ఈ ప్రకారముగ సర్వజీవులకు అనుకూలమైన సాధనలను భగవానుడు గీతయందు అనేకములు తెలియజేసెను. ఇటువంటి సాధనలు ముఖ్యముగ గృహస్థులకు చాల అనుకూలముగ నుండును. వారు కార్యములను పూర్తిగ విడనాడలేరు కనుక, కార్యములనుచేయుచు, ఫలితములను ఈశ్వరార్పణము గావించినయెడల ఆకార్యములన్నియు యజ్ఞములుగ మారి నిరంతర భగవత్సంబంధముగలవారినిగ వారిని మార్చివేయును. అత్తఱి ఏకాంతమున అహర్నిశము దైవస్మరణ చేయువారితో వారు సమానులగుదురు. గీతయొక్క మహోపదేశమిదియే. కావున ఏదియో రూపమున భగవంతునితో నిత్యసంబంధము నేర్పరచుకొనువారి చెంతకు ఇకమాయ ప్రవేశింప సాహసింపదు. దీపము నిరంతరము వెలుగుచుండినచో చీకటి దానిదరికి చేర నేర్చునా ? కనుకనే కొందరు కొన్ని దేవాలయములందు, సప్తాహములందు, వ్రతాదులందు అఖండదీపమును వెలిగించుదురు. అది ఆరిపోకుండ రాత్రింబగళ్లు కడుజాగరూకులై యుందురు. అట్లే సాధకుడు తనహృదయమందలి జ్ఞానజ్యోతిని ఏకాలమందును ఆరకుండ చూచుకొనుచుండవలెను. నిరంతర దైవస్మరణ,దైవచింతన, దైవకార్యనిర్వహణ మున్నగునవి అద్దానికి చాల సహాయము చేయును. కనుకనే భగవానుడు 'సతతంకీర్తయన్తోమాం' అని మహనీయుల కార్యక్రమమును నిర్దేశించెను.

ఇక రెండవది 'దృఢవ్రతత్వము'.పట్టుదలచేగాని ఏకార్యమున్ను సాధింపబడదు. సామాన్యముగ జనులకు ప్రాపంచికపదార్థములను సంపాదించుటయందు పట్టుదల, దృఢ వ్యవసాయము ఉండును! 'ఇంగ్లీషుఛానెల్'ను ఈదుటయందు, ఎవరెష్టు పర్వ

తము నెక్కుటయందును, సైకిల్ పై ప్రపంచయాత్ర చేయుట యందు, రాకెట్లద్వారా చంద్రుని దగ్గఱకు చేరుటయందును, జనులకు పట్టుదల యుండుటయు మంచిదే. కాని పూర్ణశాంతిని, శాశ్వత దుఃఖరాహిత్యమును, నిరతిశయానందమును ఏది యొసంగగల్గునో, అట్టి ఆత్మవస్తువును సంపాదించుటయందు గూడ గొప్ప పట్టుదల యుండవలెను. తక్కినవి ఉన్నను, లేకున్నను దీనిని మాత్రము తప్పక సాధించవలెను. భయంకరమైన మాయ నోటిమాటలతో లొంగదు. కనుక, దానిని నిర్జించుటకు మహర్షులు కొన్ని వ్రతముల నేర్పఱచిరి. ఏ కారణము చేతను వ్రతభంగము కలుగనీయరాదని యాదేశించిరి. ఏకాదశీవ్రతము, మౌనవ్రతము, చాతుర్మాస్యవ్రతముమున్నగునవి యన్నియు దీనికి జెందినవే. బుద్ధదేవుడు రాజ్యపరిత్యాగము చేసి 'ఉరూవెలా' రణ్యమున ఏకాంతముగ ధ్యానము సల్పుచుండె. ఎంతకాలమునకు బుద్ధత్వము కలుగమి, పిసుకువృత్తి ఒకానొక ధీరసంకల్పము గావించెను—

ఇహాసనే శుష్యతు మే శరీరం
త్వగస్థిమాంసం ప్రలయం చ యాతు
అప్రాప్య బోధిం బహుకల్పదుర్లభాం
నైవాసనాత్కాయమతశ్చలిష్యతే.

'ఈ ఆసనముపై నాయొక్క శరీరము శుష్కించిపోవుగాక! చర్మము, ఎముకలు, మాంసము శిథిలములై పోవుగాక! బహుకల్పదుర్లభమగు ఏనిర్వాణస్థితికలదో, అద్దానిని పొందకుండ నాశరీర మీయాసనముపైనుండి లేపనే లేవను!' - ఇవ్విధమున బుద్ధదేవుడు భగీరథసంకల్పముగావించి ధ్యానము ప్రారంభించు

సరికి మారుడు (మాయ) గడగడలాడిపోయి అతనికి దారి యొసంగెను. తత్ఫలితముగ బుద్ధుడు శీఘ్రముగ లక్ష్యమును జేరుకొనగల్గెను. శ్రీరామచంద్రుడు సీతాన్వేషణసమయమున సముద్రమును దాట నుంకించినపుడు అది ఉత్తుంగ తరంగ యుతమై, కల్లోలముగ నుండ శాంతించుమని శ్రీరాము డెంత వినయముగ చెప్పినను సముద్రుడు వినలేదు. అత్తటి శ్రీరామ చంద్రుడు తన కోదండమును గైకొని ఎక్కుపెట్టగనే 'పాహి పాహి' యని సముద్రుడు శరణుబొందినవిషయము సర్వులకును విదితమే కదా! అట్లే దృఢవ్రతము నవలంబించి—

ధనుర్గృహీత్వౌపనిషదం మహాస్త్రం
శరంహ్యుపాసా నిశితం సన్ధీయత
అయమ్య తద్భాగవతేన చేతసా
లక్ష్యం తదేవాక్షరం సోమ్యవిద్ధి (ముండకోపనిషత్తు II-2-3)

"ఉపనిషద్వాక్యము లను ధనుస్సునుగైకొని ఉపాసన, ధ్యానము అను తీక్ష్ణ బాణమును అందు సంధించి, భగవద్భక్తియుతమగు చిత్తముచే లాగి (మాయప్రతిబంధకమును భేదించి) అక్షర పరమాత్మయను లక్ష్యమును చేరవలెను". దైవీప్రకృతిని అవలంబించిన మహాత్ముల స్వభావ మిట్లే నిరంతర దైవచింతన, దైవ స్మరణలతో గూడి, దృఢవ్రతసంయుతమైయుండును. ఇక ఆసురీ ప్రకృతినవలంబించువారు వ్యర్థములగుకోరికలు (మోఘాశాః), వ్యర్థములగు కర్మలు, వ్యర్థములగు తెలివితేటలు గలవారై యుందురు. వారిదృష్టియంతయు భౌతిక వస్తుసంపాదనమునందే యుండునుగాని పారమార్థిక లాభమునందుకాదు. క్షణికదృశ్య పదార్థములకొఱకు, విలాసములకొఱకు వారు తమజీవితములను

ధారబోయుదురు. కావున శాశ్వతమగు ఆత్మశాంతిని వారు పొందకయే యుందురు.

ఈ రిరువురికి మధ్యలో మఱియొక తెగవారు కలరు. వారు కేవలము దైవప్రకృతికలవారు కాదు. కేవలము అసుర ప్రకృతి కలవారు కాదు. వారు యజ్ఞయాగాదులచే దేవతలను సంతుష్టి పఱచి స్వర్గలోకమును బొంది పుణ్యము క్షయించు వఱకు అచటనేయుండి దేవభోగము లనుభవించుచుందురు. ఆ ఒకింతపుణ్యము ఎపుడు క్షయించిపోవునో—

క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి

అనునట్లు అపుడు స్వర్గలోకమునుండి భూలోకమునకు అమాంతముగ పడిపోవుదురు. ఈ ప్రకారముగ వారు క్రిందకు పైకి ఘటీయంత్రమువలె ఆవాగమనములు సల్పుచుందురు. ఈ పద్ధతి ఏమంత శ్రేష్ఠమైనదిగాదు. పరమార్థదృష్టియందు స్వర్గమునకుగాని, స్వర్గభోగములకుగాని ఏపాటి విలువయు లేదు. స్వర్గమనగా ఉత్తమతరగతి 'జైలు' ('A' Class Jail) అని చెప్పవచ్చును. లేక బంగారపుసంకెళ్ళు అనవచ్చును. బంధనము బంధనమే, అది ఇనుపదికాని, బంగారపుదికాని—

Strike off thy fetters bonds that bind thee down
Of shining gold, or darker baser ore
Love, hate-good, bad-and all the dual throng
Know Slave is slave caressed or whipped not free
For fetters though of Gold are not less strong to bind

Then off with them Sannyasin bold say
'Om tat sat' om

పట్టి త్రెంపుము నీ బంధనముల
ఇనుపవేకాని మఱి యవి యేవియైన
మించు బంగారువేకాని మించకుండ
ద్వంద్వములు మంచిచెడ్డలున్ బంధనములె
వైరరాగాదులునుకూడ బంధనములె,
కొట్టబడినను మఱి ప్రేమచే జుట్టబడిన
దాస్య మెట్లుండినను దాస్యమె కద
కట్టజాలదె గొలుసు బంగారుదైన
కాన తెగద్రుంపవలయును వీనిగూడ
ఎత్తిపాడుము కంఠము యెత్తిపాడు
యతివరా ! ధీర ! ఓం తత్సత్ అనుచు పాడు !

అను వివేకానందుల ప్రవచన మీ భావమునే వ్యక్తీకరించుచున్నది. స్వర్గభోగములుకాని, మఱి యేలోకభోగములైనకాని ఇంద్రియములను తృప్తిపఱచుకొనుటకేకాని మోక్షముకొఱకు కావు. ఆపాటిభాగ్యమునకు వానికొఱకై ఇంత ప్రయాస పడనేల? చావుపుట్టుకలనుండి తప్పించుకొను ఉపాయమును వెతకవలెగాని, మరల తిరిగి పుట్టుటకు అవకాశమిచ్చు క్రియలచే నేప్రయోజనమున్నులేదు. 'యంప్రాప్య న నివర్తన్తే' - దేనిని పొందిన మరల తిరిగి రాడో (తిరిగి జన్మింపడో) - అట్టి పరమాత్మపదమునకై ఈలోకమున యత్నించువాడు ధన్యుడు. స్వర్గమేకాదు, అన్నిలోకములు పునరావృత్తి కలిగియున్నవే. కావున ఆయా లోకముల నివాసము కాని, వాని కొఱకగు యత్నముకాని విజ్ఞులచే శ్లాఘింపదగినదికాదు. ఇక్కారణముననే భగవానుడు గీతయందు దచటచట స్వర్గ భోగాదులను ఘోరముగ విమర్శించుచు బోయెను.

ఒకరైలుబండి కలదు. అది 'శ్మశానము' అను స్టేషనుకు బయలుదేరబోవుచున్నది. ఆబండిలో మూడుతరగతుల పెట్టెలు కలవు. ఫస్టుక్లాసు, సెకండుక్లాసు, థర్డుక్లాసు అని. అనేకులు ఆయాపెట్టెలలోనికి ఎక్కికూర్చుండిరి. కొందఱు మొదటితరగతి (1st class) పెట్టెలలో ప్రవేశించిరి. వారే స్వర్గభోగముల నపేక్షించి యజ్ఞయాగాదులను జేసినవారు. వారు ఎక్కిన పెట్టెలు బహురమ్యముగ నున్నవి. ఎలక్ట్రిక్ పంకాలు, మెత్తలు, పరుపులు, అద్దములు-వెయ్యేల, ఇంద్రభోగముల నతిశయింపజేయుచున్నవి. ఇన్నియున్నను ఏమిలాభము ? వారందఱు ఉన్నది శ్మశానమునకు పోవలసినదే. ఏలయనగా ఆ రైలు శ్మశానమునకు దారితీయుచున్నది. పుట్టుక, చావులతోగూడిన ఈ జనన మరణ సంసార ప్రవాహమున కొట్టుకొనిపోవువాడు మధ్యలో కొన్ని భోగములను అనుభవించినంత మాత్రమున వానికి ఒరిగినదేమి ? భవరోగమహాబాధ వానికి ఉండనే ఉన్నది. అట్టి భోగములవలన మనుజునకు పారమార్థికముగ కలుగుప్రయోజనమిసుమంతేని లేదు. పైగా వాసనలనుసంస్కారములను బలపఱచి అవి అనర్థమునకే హేతువు కాగలవు. కాబట్టి శ్మశానమునకుపోవురైలులో మొదటితరగతిలో ఎక్కినను, రెండవతరగతిలో ఎక్కినను, మూడవతరగతిలో ఎక్కినను-అంతయు ఒకటే. అనగా స్వర్గభోగము లనుభవించినను, మర్త్యభోగము లనుభవించినను, లేక క్రిమికీటాదుల భోగము లనుభవించినను-చావును తప్పించుకొననంతవఱకును వానిలో భేదమేమియును లేదు. కనుకనే గీతాచార్యుడగు శ్రీకృష్ణభగవానుడు స్వర్గభోగములకొఱకై కక్కుర్తిపడు

మానవులను గూర్చి రెండవ అధ్యాయమందును, * మరల ఈ తొమ్మిదవ అధ్యాయమందును అపహసించెను. ఏ పట్టుదల, ఏ పరిశ్రమ, ఏ ఆసక్తి, ఏ అభినివేశము ఆ క్షణిక స్వర్గభోగ సంపాదనమున వారికి కలదో, అద్దానిలో ఏ పదునాఱవవంతై నను, పరమాత్మను పొందుటయందు వినియోగించినచో పరమానందరూపకైవల్యపదవి వారికి యెప్పుడో లభించియుండెడిది. "కావున ఓ జనులారా! వ్యర్థముగ అట్టి నశ్వరపదార్థములకై దేవులాడవద్దు. స్వర్గమునకేగి అటనుండి (పుణ్యక్షయముచే) క్రిందబడి కాళ్లు విరగకొట్టుకొనవద్దు. బాలచేష్టలుచేయరాదు. కాలసర్పముతో చెరలాటము మీకు పనికిరాదు. ఈ భోగ సంపాదనమునందు మీయొక్క అమూల్యమైన కాలమంతయు వ్యర్థమైపోవుచున్నది. ఆయువుయొక్క ఒక్క క్షణకాలము గడిచిపోయినచో, ప్రపంచములోని రత్నము లన్నిటిని ఒసంగి నప్పటికిని అది తిరిగి మనకు చిక్కనేరదు.• కావున అట్టి అమూల్య సమయమును ఎవరు (భోగాదులందు) వ్యర్థముగ గడపివేయుచున్నారో, వారు మహాప్రమాదము చేయుచున్న వారే యగుదురు - కావున జీవితమును సంస్కరించుకొని, భోగాపేక్షను వదలి, శ్రేయోమార్గమును జేబట్టుడు" - అని భగవానుడు జీవులను హెచ్చరించుచున్నాడు.

'అయ్యో! భూలోక వైభవములు, సంపదలు, భోగములే ఎంతయో ఆనందకరముగనుండ, ఇకస్వర్గభోగముల

---

* కామాత్మానః స్వర్గపరాః (1-43)

• ఆయుషః క్షణ ఏకోఽపి సర్వరత్నైర్నలభ్యతే,
నీయతే తద్వృథాయేన ప్రమాదః సుమహానహో. (శ్రీవసిష్ఠగీత)

విషయము వేఱుగ చెప్పవలెనా? మఱిఅట్టివానిని భగవానుఁడేల చిన్నచూపుచూచెను?' అని కొందఱడుగవచ్చును. ఏ పదార్థమైనను మంచిదా, చెడ్డదా యను ప్రశ్న వచ్చినప్పుడు అది పారమార్థిక లక్ష్యమును చేరుటకు, భగవంతుని పొందుటకు, ఆత్మసాక్షాత్కారమునకు సహాయపడునా, లేదా యని విచారించవలెను. సహాయపడునది యగుచో అది గొప్పదని,అడ్డుపడునదియగుచో నికృష్టమని నిర్ణయించవలెను. ఈ స్వర్గాదిభోగములు అడ్డుపడునవియేకాని సహాయపడునవి కావు.

'గతాగతం కామకామా లభన్తే' (9-21)

'కోరికలు కోరువారు, భోగాదుల నపేక్షించువారు జననమరణములను పొందుచుందురు' - అని గీతాచార్యుడు తెలిపినట్లు ఆ స్వర్గాదిభోగములు చావుపుట్టుకలను కలుగజేయునవే కాని వానిని తొలగించునవి కావు. భవరోగమును పొడిగించునవే కాని నివారించునవి కావు. ఆత్మసాక్షాత్కారమునకు అడ్డుపడునవే కాని సాయమొనర్చునవి కావు. దీనిని ప్రతివాఁడు తమ తమ యనుభవములచే పరీక్షించుకొనవచ్చును. పైగా,

> "If your desires are increased in Arithmetical Progression, your miseries will be increased in Geometrical Progression."

'నీ కోరికలు 1, 2, 3, 4-ఈ ప్రకారముగ వృద్ధినొందినచో, నీ దుఃఖములు 1, $2^2$, $3^2$, $4^2$, (అనగా 1, 4, 9, 16)- ఈ ప్రకారముగ వృద్ధినొందగలవు' - అని యొక మహనీయుఁడు తెలిపినట్లుగ, విషయభోగములు మొదట రుచికరములుగ నున్నను తుట్టతుదకు క్లేశదాయకములుగనే పరిణమించును.

“పరిణామే విషమివ” అని శ్రీకృష్ణమూర్తి చెప్పనే చెప్పినాడు. మఱియు అనుభవించినకొలది, భోగసంస్కారము బలపడి, అనేకజన్మలకు హేతుభూతమై, ఇంకను అనర్థమును గలుగ జేయుగలదు. ఆశయొక్క స్వభావమేమి యనిన, అది అనుభ వించినకొలది పెరుగునేకాని తరగదు.

స జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే. (భాగవతము).

‘మండుచున్న అగ్నిహోత్రముపై నెయ్యిగాని, హోమ ద్రవ్యములుగాని వేసినచో అది ఇంకను ప్రజ్వలించునేకాని ఆరనట్లు, కోరికలను అనుభవించినకొలది అభివృద్ధినొందునేకాని శమింపనేరవు’ అని యయాతి మహారాజు అనుభవపూర్వక ముగ పలికిన వచనములను ముముక్షువు లెన్నటికిని విస్మరింప రాదు. శుక్రాచార్యుని వరమువలన యయాతి రెండు యౌవన ములను (double youth) అనుభవింపగల్గెను. ఇది ప్రపంచ చరిత్రలోనే అపూర్వమైన విషయము. అట్టిది యెవనికిని సంభ వింపదు. అందరికిని ఒక్క యౌవనము మాత్రమే యుండును. ఆ ఒక్కయౌవనములోనే జనులు ఎన్నియో భోగము లనుభ వించుచున్నారు. ఇక ‘డబుల్’ యౌవనమును నోచుకొనిన యయాతిమాట వేఱుగ చెప్పవలెనా ? ముందుగనే ప్రపం చములోగల భోగములన్నిటిని ఒక ‘లిస్టు’ వ్రాసికొని ఒక్కొ క్కటిగ వాని నన్నిటిని అత డనుభవించవలెను. పోనిండు, అనుభవించినపిదప అవి శమించెనా ? వానిపై నతనికి రోత కలిగెనా ? లేదు. పైపెచ్చు అవి వృద్ధికాజొచ్చెను.

మనోరథానాం న సమాప్తిరస్తి
వర్షాయుతై రప్యథవా౽పిలక్షైః
పూర్ణేషు పూర్ణేషు పునర్నవానా
ముత్పత్తయస్సన్తి మనోరథానాం.

"కోరికలకు అంతులేదు. వేలకొలదిసంవత్సరములు లక్షలకొలది కోరిక లనుభవించినను, మరల క్రొత్తక్రొత్తకోరికలు జనించు చునేయుండును - ఇది నా స్వవస్థితి. ఇట్లుండ నిక ఇహలోక భోగములు, స్వర్గాదిభోగములు అనుభవించుచు కాలయాపన చేయుచుండుట మానవునకు తగునా ? జననమరణ సంసార చక్రమును ఆపుటకుబదులు ఇంకను వేగముగ త్రిప్పుచు జీవుని క్లిష్టపరిస్థితులలోనికి తీసుకొనిపోవు ఈయీ స్వర్గాది వైభవముల వలన ప్రయోజనమేమి ? రోగమునుపోగొట్టుపని చేయవలెనా, లేక ముదురగొట్టుపని చేయవలెనా - విజ్ఞులొకింత సాలోచింతు రుగాక ? పైగా, ఆ స్వర్గమునందు లభించునవి ఏవి? ఏదైన అపూర్వవిషయములా ! మన విజ్ఞానమునకు, పారమార్థికతకు మెరుగు పెట్టుగల పదార్థములా ! కావు. ఇక్కడను అందఱును అనుభవించు కాంతాన్నపానములే అచటను గలవు. అయితే ఇక్కడకంటె అక్కడ పదార్థములు ఒకింత నాణ్యముగ నుండును. అంతియే. (నలువులో నాణ్యము అన్నట్లు).

కించిత్కాన్తాన్నపానాదికలిలం కోమలం గృహే
వ్రణేకీట ఇవాసాద్య వయః కుర్యాన్న భస్మసాత్. (శ్రీవసిష్ఠగీత)

'ఓజనులారా ! స్వల్పములగు స్త్రీ, అన్నపానాదిభోగములందు మునిగి వ్రణమందు పురుగువలె వానియందే గిరగిర తిరుగుచు అమూల్యమగు ఆయుస్సును బూడిదపాలు చేయకుడు!' అని

శ్రీవసిష్ఠమునీంద్రులు బోధించిన హితవాక్యములను ముముక్షువులు శ్రద్ధతో నాలకింపవలెను. కాబట్టి చంచలములై, అనర్థహేతువులైనట్టి భోగాదులకై (అవి ఇహసంబంధమైనవి కాని, స్వర్గసంబంధమైనవికాని) పరువిడక, జీవితమును శాశ్వతానంద సంపాదనమునందే వినియోగించవలెను.

అట్టి శాశ్వతానందప్రదమగు వస్తువెయ్యది? అదియే పరమాత్మ. ఆతడు నిత్యశుద్ధబుద్ధముక్తరూపుడు. సచ్చిదానందమూర్తి.

'యస్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి' (8-20)

అనుసట్లు ప్రపంచములోని సమస్తపదార్థములు, సమస్తభూతకోట్లు నశించినను నశింపనివాడు. ఆతనిని పొందినచో అన్నియు పొందినట్లే. ఆతనిని చూచినచో అన్నియు చూచినట్లే. ఆ పరమాత్మను సాక్షాత్కరించుకొనినవాడు ప్రపంచములోని అన్నిలాభములకంటెను గొప్పలాభమును పొందినట్లేయగును. ఏలయనగా ఆతడు సర్వస్వరూపి. బ్రహ్మాండములన్నిటిని తన కుక్షియందుంచుకొనినవాడు. ఆతనిని చింతించుటయే జన్మసాఫల్యత. ఆతనిని స్మరించుటయే జన్మసార్థకత. ఎచ్చోటనుండి జీవుడు బయలుదేరెనో అచ్చోటికి తిరిగి చేరుటయే జీవితలక్ష్యము. అదియే సర్వమతముల సారము. కావున అనన్యభక్తితో అట్టి పరమాత్మను సేవింపవలయును. మనుజుడు దేవునివైపు ఒక్క అడుగువేసినచో, దేవుడు మనుజునివైపు పది అడుగులువేసి ముందుకు వచ్చునని శాస్త్రములు వచించుచున్నవి. తన కర్తవ్యమును జీవుడు చేసినచో దేవుడు తన

కర్తవ్యమును తాను చేయును. కొండదగ్గఱకు వెళ్ళి కొండ పలుకలేదే అని అనవద్దు. నీవు పలికినచో కొండ పలుకును. నీవు ధ్వని (Sound) చేసినచో కొండ ప్రతిధ్వని (Resound) చేయును. కొండ ప్రతిధ్వని చేయనిచో నీవు ధ్వని చేయలేదని అర్థము. కావున నిన్ను రక్షించని తప్పు దేవునిదికాదు, నీదే.

ఈమధ్య ఒకరింటిలో గొప్ప అపత్తు సంభవింప ఆ యింటియజమాని యేడ్చుచు 'దేవుడా! నన్నేల మఱచినావురా తండ్రీ!' అని విలపించుచుండ అది విని దేవుడు 'నీవు నన్నేల మఱచినావురా నాయనా!' అని ప్రత్యుత్తర మిచ్చెనట! కావున తప్పు మానవునిదే కాని దేవునిది కాదు. బైబిల్‌లో ఒక చక్కని వాక్యము కలదు—

"Ask and it shall be given, seek and you shall find, knock and it shall be opened."

'అడిగినచో ఇవ్వబడును, వెతకినచో పొందబడును, తట్టినచో తెరువబడును'-అని. అడగనిచో అమ్మయైనను పెట్టదుకదా! ఇక దేవుని మాట యేల? వెతకనిచో ఏ వస్తువు మాత్రము లోకములో పొందబడును? తట్టనిచో ఎవరుమాత్రము తలుపు తీయుదురు? కాబట్టి అడుగవలెను, వెతకవలెను, తట్టవలెను. అయితే జీవులు అడుగుటలేదని, వెతకుటలేదని, తట్టుటలేదని యెవరును భావింపరాదు. వారు అడుగుచున్నారు, వెతకుచున్నారు, తట్టుచున్నారు కూడను. కాని దేవుని యడుగుటలేదు; దయ్యమును (ప్రకృతిని, మాయను) అడుగుచున్నారు. భగవంతుని వెతకుటలేదు; భోగైశ్వర్యములను వెతకుచున్నారు. మోక్షద్వారము తట్టుటలేదు; నరకద్వారము తట్టుచున్నారు.

ఇది వచ్చిన తిప్పలు. కావున పద్ధతిని మార్చుకొనవలెను. సత్యమైన మార్గమును అవలంబించవలెను. ఎన్నికోట్ల జన్మలు దృశ్యపదార్థముల నాశ్రయించినను, ప్రకృతిని సేవించినను, భౌతిక వస్తువులను పరిగ్రహించినను శాంతిసుఖములు కలుగజాలవు. 'తేషాంసుఖంశాశ్వతం నేత రేషామ్'-అనుఉపనిషద్వాక్యానుసారము సత్యవస్తువగు పరమాత్మ నాశ్రయించినవారికి మాత్రమే సుఖము, శాంతి, జన్మరాహిత్యము లభించును.

'యే భజన్తి తు మాం భక్త్యా మయితే తేషు చాప్యహమ్'(9-29)

'ఎవరు నన్ను భక్తితో సేవించుదురో వారు నాయందును, నేను వారియందును ఉందును' అని భగవద్వాక్యము. భగవంతుడు పక్షపాతరహితుడు. ఒకనియందు ద్వేషముగాని, రాగముగాని అతనికి లేదు. అతడు అందఱియందును సమానముగ నుండును. అయినను ఆతనిని తెలిసికొననివారు ఆతని పూర్ణ ప్రయోజనమును బొందలేకయున్నారు. నిధి ఇంటియందేయున్నను అది యేస్థానమందున్నది తెలియనివారు దానివలన నెట్లుపయోగమును పొందలేరో, అట్లే భగవంతు డందఱియందును ఉన్నప్పటికిని ఆతని యునికిని తెలిసికొనలేనివా రాతనివలన పూర్ణలాభమును బడయలేరు. దేవుడు అందఱియందు నున్నాడు, కాని అందఱు దేవునియందు లేరు. ఇది వచ్చినచిక్కు. కాబట్టి దేవుని యందు నివసించుటకై అనన్యభక్తితో నాతనిని ధ్యానింపవలెను, సేవింపవలెను, ఉపాసించవలెను. అట్లు సేవించువారి నాతడు వేయికండ్లతో కనిపెట్టుచు వారికి కావలసినసౌకర్యము లన్నిటిని సమకూర్చుచుండును. వారి యోగక్షేమములను విచా

రించుచుండును. గీతయందు శ్రీకృష్ణభగవానుడు కావించిన గంభీర ప్రతిజ్ఞ నాలకింపుడు—

అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ (9-22)

'ఏ జనులు అనన్యభక్తితో నన్ను ధ్యానించుచుందురో, అట్టి నిరంతరధ్యానపరాయణులగు మహానీయులయొక్క యోగక్షేమములను నేను వహించుచుందును.' ఆహా! ఎట్టి అమోఘవాక్యము! దీనిచే భక్తులకు ఎంత ఆశ్వాసము లభించినది! «అయ్యో! నన్ను కాపాడువాడెవడు? నాకు అన్నముపెట్టువాడెవడు? నన్ను విచారించువాడెవడు?» అని ఏ భక్తుడున్ను ఏడ్వ నవసరములేదు. భక్తుడు కావలెనేకాని ఇక వానికేమి కొదువ! కల్పవృక్షము నాశ్రయించినవానికి దిగులేల? అయితే భక్తునికి మాత్రమే ఈ సౌకర్యము లభించును గాని భుక్తునికికాదు. కావున తాను భక్తుడో, భుక్తుడో (యోగియో, భోగియో) వారికి వారే యోచించుకొనవలయును.

Rights and responsibilities - అని ఇంగ్లీషులో రెండు పదములు కలవు. బాధ్యతలు, హక్కులు అని వాని యర్థము. ఎక్కువమంది హక్కులకొరకే పోరాడుచుందురు కాని, వాటికి తగిన బాధ్యతలను మాత్రము విస్మరించుచుందురు. హక్కులకై పోరాడువాడు వాటికి సంబంధించిన బాధ్యతలనుకూడ తప్పక స్వీకరించవలెను. 'మాకు హక్కులు కావలెను. అధికారము కావలెను. కాని బాధ్యతలు వద్దు' అని యెవరైన అనినచో, అది సంభవమగు విషయముకాదు. అట్లే 'మాకు దేవుడు కావలెను, యోగక్షేమములు కావలెను, కాని భక్తి

మాత్రము వద్దు. ధ్యానము మాత్రము వద్దు' అని యెవరైన పలికినచో అది అసంభవమగు వాక్యము. భగవంతుడు అంత వెఱ్ఱివాడు కాదు. అట్టివారి సోమరివాక్యములను అంగీకరించుటకు మనకంటె రెండు ఆకులు ఎక్కువ చదివినవాడు దేవుడు. కాబట్టి ఎవరున్ను ఇట్టి భ్రమలో నుండ నవసరము లేదు. సామాన్యమగు అంగడిలోనే ఏదియైనవస్తువును కొనవలెననిన, ముందుగా డబ్బు చెల్లించవలసివచ్చుచున్నది కదా! ఇక భగవంతునినుండి ఒక వస్తువును పొందవలెననిన, అతడుమాత్రము దానిని తేరగావిడిచిపెట్టునా? 'పెట్టవయ్యా దానికితగిన విలువ!' అని ముందుగానే చేయిజాపి యడుగును. 'ఓ జీవుడా! నీవు మోక్షముకోరుచున్నావు. నిరతిశయానందము కోరుచున్నావు. బంధరాహిత్యము కోరుచున్నావు-ఏది వాటికి తగిన పణము? వానిని యడుగుటకు పూర్వము వాని పణము (విలువను) ముందుగా నాకు చెల్లింపుము. త్యాగమే దానివిలువ. భక్తియే దాని విలువ. అనన్యదైవచింతనయే దాని విలువ!' అని భగవానుడు పలుకుచున్నాడు.

గీతాచార్యుడు నుడివిన ఈ 'అనన్యాశ్చిన్తయన్తో మాం'- అను శ్లోకము భగవద్గీతయందు అత్యంత ప్రాముఖ్యత గలిగియున్నది. దాదాపు ప్రతివానికిని ఇది కంఠస్థమై యుండును. గీతను ఒక పుష్పమాలతో పోల్చినచో ఆ మాలయొక్క మధ్యభాగమున క్రింద వ్రేలాడు చెండువంటి పెద్దపుష్పముగ దీనిని వర్ణించవచ్చును. ఈశ్లోకము గీతయొక్క మధ్యభాగమున నున్నది. అర్థగాంభీర్యముతో గూడియున్నది. వికసితకుసుమరాజమువలె సుగంధమును వెలిగ్రక్కుచున్నది.

సాధకులలో పెక్కండ్రకు హృదయములందు వేధించుచుండు గొప్పసంశయమునిది నివారించుచున్నది. అన్నియు వదలుకొని, భగవంతుని ఆశ్రయించినచో లోకములో మాకు జరుగుబాటు ఎట్లు? మాజీవితయాత్ర యెట్లు కొనసాగగలదు ? - ఇత్యాది సందేహము లన్నిటిని ఈ శ్లోకము నివారించుచున్నది. ఈ శ్లోకము ముముక్షులోకమునకు ప్రాణప్రదమై, సాధకప్రపంచమునకు సంజీవినియై యొప్పుచున్నది. ఇక భక్తులకష్టములన్నియు గట్టెక్కినట్లే. బ్రహ్మదేవుడు తలంచుకొనినచో ఆయువునకు కొరవా యనునట్లు, జగత్పతి యగు భగవానుడే మనపాలిటి సంరక్షకుడై నిలచినపుడు ఇక మన కేమికొదువ? అని తలంచి భక్తుడు ఆనందపరవశు డగుచున్నాడు. 'అలనాడు అంబరీషుని కాపాడినవాడు, ద్రౌపదిని సంరక్షించినవాడు, గజేంద్రుని యుండజేర్చినవాడు. ప్రహ్లాదుని పరిరక్షించినవాడు మనలను మాత్ర మేల మఱచును ?' అను ధీమా గలిగియుంటున్నాడు.

మార్జాలకిశోరము (పిల్లిపిల్ల) తల్లినే నమ్ముకొని యుండును కష్టసుఖములందు. కావున ఆ తల్లియే తన పిల్ల యొక్క క్షేమబాధ్యతను స్వీకరించును. అట్లే సమస్తప్రాణికోట్లు భగవంతుని బిడ్డలు. ఆతడు తండ్రి (పితాసి లోకస్య చరాచరస్య), తల్లి, జగత్పిత, జగన్మాత. ఆతని నెవ రాశ్రయించుదురో, వారిని ఆతడు కాపాడును; వారి యోగక్షేమములను చక్కబెట్టును. ఈ విషయమై భగవానుడు చక్కని అభయము నొసంగెను. కావున ఇక ముముక్షువులు, భక్తులు, సాధకులు నిర్భయులై వెనుకముందు లేక, జంకుగొంకులు వదలి, అనన్యచిత్తముతో భగవానుని సేవించుదురు

గాక! 'అనన్య' అని చెప్పుటవలన దైవముమీద తప్ప ఇతర మగు ఏదృశ్యపదార్థమునందును మనస్సును తగుల్కొననీయక చూడవలెను. మనస్సును ముక్కలు ముక్కలుచేసి అన్నిటి మీద వెదజల్లి ఒకానొక ముక్కను దైవముపై నుంచుట ధ్యానమనఁబడదు. అది అనన్యత్వ మనిపించుకొనదు. కావున దృశ్యపదార్థములం దాసక్తిని తగ్గించుకొనుచు వచ్చి దైవముపై ఆసక్తిని పెంపొందించుకొనవలెను. అభ్యాసముచే నియ్యది క్రమముగ సాధ్యపడగలదు. మఱియు 'యేజనాః-' 'ఏజనులైనను'-అని చెప్పుటవలన జాతి, మత, వర్ణ, లింగ, ఆశ్రమ విచక్షతలేక సర్వజనులున్ను భగవంతుని ఆశ్రయించి తరింపవచ్చునని స్పష్టమగుచున్నది.

భగవానుని పూజించుటయందు, ధ్యానించుటయందు, అర్చించుటయందు భక్తి ప్రధానమైనదే కాని తదితరములు కావు. కొండంత పత్రితో దేవుని పూజించినను, భక్తిలోపించి నచో దైవము సంతుష్టినొందదు. ఒక్క ఆకుగాని, ఒక్క పువ్వు గాని, ఒక్కపండుగాని, ఒకింత జలముగాని నిర్మలభక్తితో భగవంతునకు సమర్పించినచో ఆత డెంతయో సంబరపడును. ఈ విషయమును తానే గీతయం దిట్లు చెప్పెనొనెను—

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః. (9-26)

ధ్యాన, జప,పూజాదులందుసంఖ్య, పరిమాణము(Quantity) గొప్పదికాదు. నిర్మలత్వము, ఏకాగ్రచిత్తత్వము (Quality) గొప్పది. జపమాలపైకొని గిరగిర త్రిప్పుచు మనస్సుమాత్రము మార్కెట్టులోనో, లేక కోర్టులోనో తిరుగుచుండ లక్ష నామ

ములు జపము చేసినను ఆక్రియ భగవానునకు ప్రీతిపాత్రము కానేరదు. నిర్మల, నిశ్చలఏకాగ్రచిత్తముతో, అనన్యభక్తితో ఒక్కనామము జపించినను సర్వేశ్వరుడు ప్రీతిజెందును. భాగవతములో శ్రీకృష్ణమూర్తి పలికిన పలుకుల నాలకింపుడు—

> అణ్వప్యుపాహృతం భక్తైః ప్రేమ్ణాభూర్యేవ మే భవేత్
> భూర్యప్యభక్తోపహృతం న మేతోషాయ కల్పతే. (భాగవతము)

'భక్తికలవారు ప్రేమతో నాకు రవ్వంత ఇచ్చినను, అది నాకు అనంతమే యగును. భక్తిలేనివారు అనంత మొసంగినను నాకు ఏమాత్రమునంతోషము లేదు.' కావున భగవద్విషయమైనప్రతి కార్యమందును లోతు (depth) చూడవలెనే కాని వైశాల్యము (surface) చూడరాదు. కొందఱు భగవన్నామమును కొన్ని కోట్లు జపింతురు; రామనామమును, శివనామమును, విఠల్‌నామమును అర్బుదములు లిఖింతురు. కాని ఆయా కార్యములను వారు ఏకాగ్రచిత్తముతో, నిర్మలభక్తి భావముతో నొనర్పనిచో ఆశించినఫలము వారికి చేకూరదు. పరిపూర్ణమగు దైవానుగ్రహము లభించదు. ఇదియంతయు యోచించియే భగవాను డీయధ్యాయసమాప్తియందు అర్చన, జప, పూజాదులను గావించు పద్ధతిని చెప్పి, సాధకులు తాముచేయు భగవత్కార్యములందు భక్తివిషయమై కడు జాగరూకులుగ నుండులాగున హెచ్చరించిరి.

ఇదియంతయు పుణ్యాత్ములవిషయమై చెప్పినది. అయితే, ఎవరైన పాపాత్ములుకాని, దురాచారపరులుకాని యున్నచో, వారికీ భక్తివలన ఏమైనప్రయోజనముండునా యనిన, తప్పక యుండునని భగవానుడు సెలవిచ్చెను. ఎటువంటి పాపాత్ము

డైనను అనన్యభావముతో సర్వేశ్వరుని చింతించుచో, ఆతడు క్రమక్రమముగ తనదుష్టస్వభావమును గోల్పోయి ధర్మాత్ము డగును. సాధుశీలు డగును. కావున 'పాపి ఎల్లప్పుడు పాపియే' యను సిద్ధాంతమును గీతాచార్యుడు ఖండించివేసెను. ప్రతిజీవి హృదయమునందును పరమపావనమగు ఆత్మ వెలయుచున్నది. కావున ఏనాటికైనను ఆ ఆత్మప్రకాశము సర్వులయందును బహిర్గతముకావలసినదే. అయితే కొందఱికి శీఘ్రముగ వ్యక్త మగును. మఱికొందఱికి నిదానముగ వ్యక్తమగును. కావున ఎటువంటి పాపాత్మునిగూడ ఉపేక్షింపక వానిలో నిగూఢముగ నున్న దివ్యత్వమును లేపుటకై చక్కని బోధ గావించుట యుచితము. అట్టి బోధచే నిద్రాణమై యున్న శక్తులు మేలు కొనును. సప్తర్షులు దారిదోపిడిగాడు (Highway robber) అను రత్నాకరునకు చక్కని హితవాక్యములు చెప్ప, కాల క్రమమున నాతడు వాల్మీకిగా మారిపోయెనుగదా! ఇట్లెందఱో పాపాత్ములు, 'సుదురాచారులు' దైవచింతనచే, పశ్చాత్తాప ముచే మహాపుణ్యాత్ములుగ మారిపోవుట చరిత్ర ప్రసిద్ధమై యున్నది. కావున ఎవరిని 'నీవు అల్పుడవ'ని కించపరచరాదు. ఎవరును తాను పాపిని (పాపోఽహం) అని అనుకొనరాదు.

'పాపోఽహం పాపకర్మాహం పాపాత్మా పాపసంభవః'

అని నిరంతరము అనుకొనుటకంటె

'అచ్యుతోఽహం అనన్తోఽహం గోవిందోఽహం సదాశివః'

అని నిరంతరము అనుకొనుట ఉత్తమము. అయితేదానికితగినట్లు వర్తించవలెను. అనుకూలచింతన (Positive thoughts) వలన

అనుకూలుడుగను, ప్రతికూలచింతన (negative thoughts) వలన ప్రతికూలుడుగను మనుజుడుమారిపోవు అవకాశముకలదు. ఇంటియందు కొంటెచేష్టలుచేయు పిల్లవానిని పట్టుకొని 'నీవు అల్లరివాడవు, నీవు ఎందుకు పనికిరావు, నీవుశుంఠవు'అని ఒకే మోపున ఊదరపెట్టుచుండినచో, అతని అల్లరి తగ్గకపోవుట అట్లుంచి, కాలక్రమమున నతడు గజదొంగగా మారిపోగలడు. ఈమధ్య ఒకరింటిలో నొక పెద్దమనిషి ఒక పిల్లవానిని 'ఓరీ మూర్ఖుడా! ఏల అల్లరిచేయుచున్నావు?' అని ప్రశ్నింప, ఆపిల్ల వాడు 'అయ్యా! నేను మూర్ఖుడను గనుకనే అల్లరిచేసినాను. తామ పెద్దవారు గనుక బాగుగ ప్రవర్తించండి!' అనెనట. కావున ఎవరిని కించపఱచు యత్నము చేయరాదు. ఇది భగవదాదేశము. ప్రతివానిలోను దాగియున్న అఖండశక్తిని లేపుటకే సర్వులును ప్రయత్నించవలెను. పశ్చిమ దేశములలో కొన్ని జైళ్ళయందు దొంగలను సంస్కరించుటకు చక్కని బోధనాపద్ధతులను కనిపెట్టిరి. భారతదేశమునందును కొన్ని చోట్ల అట్టిప్రయత్నములు జరుగుచున్నవి. కావున 'అపిచేత్సు దురాచారో' (9-30) అను గీతాశ్లోకము ననుసరించి ప్రతి మానవుని దైవమార్గమున అగ్రేసరుడగులాగున ప్రోత్సాహ పఱచుచుండవలెను. ఎపుడు దైవభక్తుడగునో, ఇక నాతనికి దుర్గతి యెన్నటికిని కలుగదు. అచిరకాలములోనే పరమ శాంతిని ఆతడు పడయగల్గును. (శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి). ఈ సత్యమును వెల్లడించుచు శ్రీకృష్ణభగవానుడు అమోఘమగు ప్రతిజ్ఞ చేసెను.

'కౌన్తేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి' (9-31)

'ఓ అర్జునా ! నా భక్తున కెన్నటికిని దుర్గతి కలుగదు. ఆత డెన్నడును చెడడు. ఇది సత్యమని ముమ్మాటికిని ప్రతిజ్ఞ చేయుము' అని గంభీరముగ బలికెను. కావున భక్తుడు కావలెనే కాని, అయినచో ఇక నాతని పంట పండినట్లే. అట్లు భక్తుడగుటకు ఉపాయమేమి ?

'మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు' (9-34)

'చిత్తమును దైవమునందు నిలుపుము. దైవభక్తుడవుకమ్ము, దైవమును పూజింపుము, దైవమునకు నమస్కరింపుము'— ఇదియే భక్తుడగుటకు గీతాచార్యుడు సూచించిన పద్ధతి. మనస్సును భోగవిలాసములనుండి వివేకముచే మరలించి ఆత్మయందు, దైవమునందు స్థాపించవలయును. కామక్రోధాది రూపమగు పిశాచమునకు నమస్కరింపక, పరమానందరూపమగు పరమాత్మకే నమస్కరింపవలయును. ఈ ప్రకారముగ సాధించుచు రాగారాగా, చిత్తమునందలి దృశ్యవాసనలన్నియు క్రమక్రమముగ క్షీణించిపోవ, ఆవరణము నశింప, హృదయాంతర్వర్తియగు ఆత్మజ్యోతి తెన్నగ ప్రకాశింపదొడంగును. అంతవఱకు నరుడుగా నున్నవాడత్తఱి నారాయణుడుగ మారిపోవును. జీవుడు శివుడై యొప్పును. మానవుడు మాధవుడుగా విలసిల్లును. అదియే మోక్షము, అదియే కైవల్యము, అదియే నిర్వాణము.

ఓం తత్ సత్

ఓమ్:

# 10-వ అధ్యాయము

# విభూతి యోగము

భగవద్గీత పదియవ అధ్యాయమునకు విభూతియోగ మని పేరు. విభూతి యనగా ఐశ్వర్యమని అర్థము. చరాచర జగత్తంతయు భగవంతుని స్వరూపమే కనుక అదియంతయు భగవద్విభూతియే యని చెప్పవలసియున్నది. అయితే ఉపాసకుల సౌకర్యార్థము కొన్ని కొన్ని ప్రముఖ పదార్థములను, ప్రముఖ వ్యక్తులను చెప్పి వానియందు తాను విశేషముగ విలసిల్లుచున్నానని భగవానుడు సెలవిచ్చెను. సత్తాసామాన్య రూపమున పరమాత్మయొక్క ఉనికి ఎల్లెడలను కలదు. ఆరోపింపబడిన సర్పమునందు రజ్జువు సర్వత్ర వ్యాప్తమైయున్నది కదా! అట్లే స్వప్నప్రపంచమునందలి సమస్త పదార్థములందును జాగ్రద్వ్యక్తి ఉండియే యున్నాడుకదా! కాని, సాధకుని మనస్సుయొక్క శక్తి పరిమితమైనది. ప్రారంభముననే 'సర్వం ఖల్విదం బ్రహ్మ' - అను వాక్యముయొక్క అనుభూతి అతనికి కాజాలదు. 'వాసుదేవ స్సర్వమితి' - అని భావింపగల్గు మహాత్ముడు సుదుర్లభుడని యిదివరకే గీతాచార్యు డానతిచ్చియున్నాడు. కావున భక్తులకు, ఉపాసకులకు, ధ్యాననిష్ఠులకు అనుకూలముగ నుండుటకొఱకై ఆ అనంతకోటి వస్తుసముదాయమునందు కొన్నిటిని మాత్రము ఏరి, వానిని తన విభూతులుగ భగవాను డిచట వర్ణించుచున్నాడు.

నాన్తోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరన్తప
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరో మయా. (10-40)

"ఓ అర్జునా! దివ్యములగు నాయొక్క విభూతులకు అంతులేదు. కావున సంక్షేపముగ కొన్నిటిని మాత్ర మిచట సూచించితిని" అని యీ అధ్యాయముయొక్క చివఱ భగవానుడు చెప్పనే చెప్పెను. కావున యిందు తెలుపబడిన వస్తువులందుదప్ప ఇతరత్ర భగవంతుడు లేడని యెవరును అపోహపడరాదు-దేవాలయములు, విగ్రహారాధనలు, తీర్థస్థానములు మున్నగునవి యన్నియు ఎందుకొఱకు ఏర్పడినవో విజ్ఞులోకింత యోచించవలెను. సామాన్యునిచిత్తము భగవంతుని సర్వవ్యాపకస్వరూపమును ఊహింపజాలనిస్థితియందుండును. అందుకొఱకై మనస్సు నిలుచుటకుగాను కొన్ని పవిత్రస్థానములు ప్రత్యేకించబడినవి. ఊరంతయు తిరిగితిరిగి సంచరించినను, ఎక్కడనైన దేవాలయము కనిపించినచో అక్కడమాత్రము మనుజుడు నమస్కారము చెల్లించును. తక్కిన చోట్ల నమస్కరింపడు. దేవుడు దేవాలయమునందుమాత్రము కలడని వానియుద్దేశ్యము. అసలు దేవుడే లేడనువారికంటె యీతడెంతయో ఉన్నతస్థితికి వచ్చినవాడేయగును. క్రమముగ మహాత్ముల యొక్క సాంగత్యము చేతను, సచ్ఛాస్త్రముల పరిశీలనము చేతను మనస్సు వికసింప దేవుడు ఒక్క దేవాలయములోనేకాదు, బ్రహ్మాండమంతటను అణువణువునందును వ్యాపించియున్నాడని తెలిసికొనగల్గును.

**'Man travels not from untruth to truth-but from lesser truth to higher truth.'**

అని వివేకానందులు వచించినట్లు హిందూమతమున సాధకుడు అసత్యమునుండి సత్యమునకు ఎన్నడును ప్రయాణము చేయడు.

చిన్నసత్యమునుండి పెద్దసత్యమునకు మాత్రమే ప్రయాణము చేయును. ఏలయనగా, విగ్రహమునకు నమస్కరించునపుడు అతని దృష్టిలో అది సాక్షాత్ భగవత్స్వరూపమే యను భావన యుండునుగాని, రాయి - రప్ప అనుభావన యుండదు. అట్లే గంగాది తీర్థములకు నమస్కరించునపుడు అవి కేవలము $H_2O$ (హైడ్రోజన్, ఆక్సిజన్ కలిసిన వస్తువు) అను భావన యుండదు. కావున ప్రారంభస్థితిలో ఏదియోయొక ప్రతీకము సాధనయందు మనుజున కావశ్యకమైయున్నది. ఇక్కారణముననే 'మత్తః పరతరంనాన్యత్కించిదస్తి ధనంజయ'- ఓ అర్జునా! మద్వ్యతిరిక్తముగ యీ ప్రపంచమున ఏ వస్తువున్ను లేదు. నేనేసమస్త భూతములయొక్క ఆదిమధ్యాంతమును అని నుడివినప్పటికిని, ఉపాసకుల ధ్యానానుకూలతకొఱకై ఈ అధ్యాయమున కొన్ని ప్రధానవస్తువులను తెలియజేసెను. అవియే భగవద్విభూతులు!

వానినిగూర్చి వర్ణించి చెప్పుటకు ముందుగా 'ఓ అర్జునా! పరమోత్కృష్టములగు వచనములను మరల చెప్పుచున్నాను, వినుము'* అని శ్రీకృష్ణపరమాత్మ హెచ్చరిక చేసెను. అధ్యాయ ప్రారంభశ్లోకమగు ఈ 'భూయ ఏవ...' అను దానియందు ఉత్తమగురువుయొక్క లక్షణము, ఉత్తమశిష్యునియొక్క లక్షణము, బోధయొక్క స్వభావము మూడున్ను తెలియజేయబడినవి. ఉత్తమగురువు శిష్యునిహితమునే మనస్సునం దుంచుకొని మరల మరల నాతనికి బోధించుచుండును. అట్లు పదేపదే చెప్పుటయందు విసుకు, మనస్తాపము పొందకయే యుండును. శిష్యుని మనోభావములను ముందుగనేగమనించి సంశయ నివా

---

* భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః (10-1)

రణ మొనర్చుచుండును. కనుకనే శ్రీకృష్ణమూర్తి అర్జునుడు అడుగకపూర్వమే ('భూయ ఏవ-) మరల చెప్పుచున్నాను వినుము అని ప్రారంభించెను.

ఇక శిష్యుని లక్షణము 'ప్రియమాణాయ'-('సంత సించెడి') - అను పదముద్వారా వెల్లడిచేయబడెను. గురు ముఖతః వెలువడు వాక్యములనువిని శిష్యుడు మహదానందము నొందుచుండును. ఎప్పుడెప్పుడు గురుదేవుని వచనామృతమును గ్రోలుదునా అని యువ్విళ్ళూరుచుండును. అంతేకాని ఇప్పటి కాలపు కొందఱి శిష్యులవలె బోధను బాధగా స్వీకరింపడు. తరింపవలెనను తీవ్రకుతూహల మెపుడేర్పడునో అపుడు సల్లక్ష ణము లన్నియు వానియంతట నవియేవచ్చి శిష్యుని వరించును. ఈ సంసారజంజాటము బాధాకరముగతోచి, దావాగ్నియందు తగుల్కొనిన హరిణము చందమున ఎప్పుడెప్పుడు ఆ తాపము నుండి విముక్తిని బొందుదునా యను తీవ్రతరమగు అభిలాష జనించునో, అపుడే మనుష్యునకు గురువునందు భక్తియు, గురు వాక్యములందు శ్రద్ధయు, దైవకార్యములందు ప్రీతియు నుద యించును. కనుకనే శాస్త్రములలో సాధనచతుష్ట సంపత్తి యందు ముముక్షుత్వమునకు అమిత ప్రాధాన్యము నొసంగిరి.

శిరో వివేకమత్యన్తం వైరాగ్యం వపురుచ్యతే
శమాదయష్షడంగాని ముముక్షా ప్రాణ ఇష్యతే.

'నిత్యానిత్యవస్తువివేకము శిరస్సు; ఇహాముత్రార్థఫలభోగ విరాగము శరీరము; శమాదిషట్కసంపత్తి ఆఱుఅవయవములు; ముముక్షుత్వము ప్రాణము' అని చెప్పబడినది. శరీరమునందు ప్రాణమున కెంత ప్రాముఖ్యత కలదో మోక్షసాధన సామాగ్రి

యందు ముముక్షుత్వమున కంత ప్రాముఖ్యత కలదు. అట్టి తీవ్ర మోక్షేచ్ఛకల శిష్యుడు గురువాక్యములందు అమిత ప్రీతి శ్రద్ధ గలిగియుండును.

పూర్వకాలమున నొకగురువుయొద్దకు ఒకానొక భక్తుడు వెళ్ళి దైవసాక్షాత్కారమునకు మార్గమును బోధింపుడని ప్రార్థించెను. గురువు బోధించలేదు. ఆ భక్తుడు ప్రతిదినమువచ్చి అడుగుచున్నను 'ఇప్పుడు కాదు, మరల రమ్మ' అని చెప్పి పంపివేయుచుండెను. ఒకదినమున ప్రాతఃకాలమున ఆ భక్తుడు మరల రాగా, వారిగురువును కలసి స్నానార్థము నదీతీరమునకు బోయిరి. భక్తుడు నీటియందు మునిగి స్నానము చేయుచుండ, ఆ గురువు అతని తలను నీటియందు అణచిపెట్టి పైకి లేవకుండ చేతితో నొక్కిపట్టెను. శిష్యుడు నీటిలో గిలగిల తన్నుకొనుచుండెను. కొంతసేపటికి గురువు చేయి పైకెత్తగా శిష్యుడు తటాలున పైకిలేచి శ్వాస వేవేగముగ గైకొనుచుండెను. అతడు గురువునుచూచి 'మహాత్మా! ఉపదేశము చేయుడని నేనడుగుటయేమి, తాముచేసిన యీపనియేమి?' అని ప్రశ్నింప నంతట గురుదేవుడు 'నాయనా! నేనిప్పుడు చేసినది మహోపదేశము. నీటిలోనున్నప్పుడు నీవు దేనినిగూర్చి చింతించుచుంటివో చెప్పుము?' అని యడుగ, 'శ్వాసతప్ప మఱేదియు నామనస్సునకు తట్టలేదు. ఎపుడు నీటిలోనుండి పైకివచ్చెదునా, ఎపుడు ప్రాణవాయువు పీల్చెదునా అని తహతహపడుచుంటిని. రెండవవస్తువెద్దియు నామనంబునకుస్ఫురింపలేదు' అని శిష్యుడు ప్రత్యుత్తర మిచ్చెను. అది విని గురువు శిష్యునితో - అట్టి స్థితియే ఈసంసార సముద్రమున మునింగియున్నవానికి ఉండ

వలెను. సంసారబాధలచే తల్లడిల్లి ఎపుడెపుడు ఈబంధమునుండి తప్పించుకొని స్వాతంత్ర్యవాయువు పీల్చుదునా యను తీవ్రతర యభిలాషయుండవలెను. నీటిలోనున్నవానికి ప్రాణవాయువును గూర్చిన స్మరణతప్ప అనన్యమగు దేనియందును ప్రీతియుండనట్లు దైవ మొకదానియందుతప్ప ముల్లోకములందును మఱి దేని యందుగూడ ప్రీతి లేకుండవలెను. అపుడే గురువు చేయు ఉపదేశము సార్థకము కాగలదు - అని బోధించెను. కావున శిష్యునకు దైవమును తెలుసుకొనవలెనని, ధర్మమును గ్రహించవలెనని తీవ్రతరేచ్ఛ యుండవలెను. అట్టివానికి చాతకపక్షికి వర్షజలముపై ఎంత ప్రీతియుండునో - అంతప్రీతి గురువాక్యములందుండును. మన యదృష్టవశాత్తు అట్టి ఆదర్శ గురుశిష్యులే ఈగీతాగ్రంథమున ప్రత్యక్షమయిరి. 'నాయనా! నీకు మరల మరల ('భూయ ఏవ') చెప్పెదను. నీ హితమును కోరెదను ('హితకామ్యయా') అని గురువు పలుకుటయు,

భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్. (10_18)

'తండ్రీ! మరల చెప్పుడు; మీ యమృత వాక్యములను ఎంత వినినను తనివితీరుటలేదు' అని శిష్యుడు ప్రార్థించుటయు, ఫల స్వరూపముగ సర్వోత్తమమగు బోధామృతము (పరమంవచః) గురుముఖతః వెలువడుటయు ఇచట సంభవించినది. ఇక ఆబోధ యెట్టిదో ఒకింత విచారించెదము.

పరమాత్మ అనాది, అనంతస్వరూపుడు, జన్మరహితుడు, సర్వలోక మహేశ్వరుడు, సమస్తమునకు ఆధారభూతుడు, ఆతనినుండియే ఈవిశ్వమెల్లను ఆవిర్భవించి స్థితిగల్గియున్నది.

మహర్షులు, దేవతలు, సమస్తప్రజలు - వెయ్యేల చరాచర ప్రపంచమంతయు ఆ పరమాత్మవలననే ప్రవర్తించుచున్నది (మత్తః సర్వం ప్రవర్తతే). ఆధారములేనిదే ఆధేయము నిలువదు. పరమాత్మ ఆధారము, జగత్తు ఆధేయము. కావున జగత్తుయొక్క ఉనికి, వ్యవహారము అంతయు పరమాత్మవలననే సంభవించుచున్నది. అజ్ఞానులకు ఈ తత్త్వము తెలియదు. వారు భౌతికపదార్థములకే స్వతః సత్త కలదని భావించుదురు.

భక్ష్యసంయత్తు మాధుర్యం కేవలం నైవ శర్కరా
అవశిష్టం తు యద్ద్రవ్యం తత్పిష్టం న తు శర్కరా.

(మహావాక్యదర్పణము)

"గోధుమపిండి, చక్కెర కలిపి భక్ష్యము(పిండివంట)ను తయారుచేసి భుజించినచో పిండి తీపిగా నున్నట్లు తోచును. కావున అజ్ఞానులు గోధుమపిండి తీపిగానున్నదని వచించుదురు. అది సరికాదు. తీపిదనము చక్కెరదేకాని పిండిదికాదు." జ్ఞానులగువారు పదార్థతత్త్వవివేచన కలవారై పిండిని, చక్కెరను వేఱువేఱుగచూచుదురు. అట్లే అజ్ఞానులు దృశ్యపదార్థములందలి ఉనికిని, ఆనందమును వానియొక్క గుణములుగనే భావించుదురు. జ్ఞానులట్లుకాక, అధిష్ఠానమగు సచ్చిదానంద పరమాత్మవలననే అయ్యవి ఉనికి కలిగియున్నట్లు తెలిసికొందురు. అట్లు తెలిసికొని ఆ పరమాత్మను సాక్షాత్కరించుకొనుటకై ఒకానొక కార్యక్రమమును ఏర్పాటుచేసికొందురు. ఆకార్యక్రమ మేమియో ఈ అధ్యాయమందు శ్రీకృష్ణమూర్తి సెలవిచ్చెను. సాధకుడిద్దానిని తప్పక తెలిసికొనవలసి యున్నది.

1. అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే
ఇతి మత్వా భజన్తే మాం బుధా భావసమన్వితాః. (10-8)

2. మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్
కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తి చ రమన్తిచ. (10_9)

(1) దైవభావముతో గూడి భగవంతుని భజించుట.

(2) చిత్తమును భగవంతునియందే సంలగ్న మొనర్చుట.

(3) భగవంతునిగూర్చియే పరస్పరము బోధించుకొనుట, సంభాషించుట.

(4) దైవమునందే సంతుష్టినొందుట, క్రీడించుట, ఆత్మానందము నొందుట.

విజ్ఞులయొక్క కార్యక్రమ మీవిధముగా నుండునని శ్రీకృష్ణ భగవానుడు సూచించెను. పరమాత్మయొక్క మహిమను ముందుగ తెలిసికొనినచో ఆతనియందు భక్తి లెస్సగ ఏర్పడ గలదు. ఒక వస్తువుయొక్క గొప్పతనమును మున్ముందు గ్రహించనచో దానియందు జనుల కాసక్తి యెట్లేర్పడగలదు? కావుననే ఈ అధ్యాయమునందు ప్రారంభముననే భగవానుని యొక్క విశ్వాధారత్వము, ఆద్యంతరహితత్వము, జన్మరాహిత్యము మున్నగు మహిమలు తెలుపబడినవి. ఈప్రకారముగ పరమాత్మయొక్క నిత్య శుద్ధ బుద్ధముక్త స్వరూపమును బాగుగ తెలిసికొనినవాడు-

సోఽవికమ్పేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః (10_7)

నిశ్చల మనస్సుతో భగవానుని సేవించును. ఇట ఏసంశయము మున్ను లేదు. ఇక్కాలమున ప్రపంచములో నాస్తికులెవరైన యుండినచో, భగవత్తత్త్వమును భగవత్స్వరూపమును బాగుగ అవగాహనము చేసికొనకపోవుటయే అందులకు కారణము. ఏక్షణమున వారద్దానిని తెలిసికొందురో వెంటనే

అస్థిరులుగ, మహాభక్తులుగ మారిపోవుదురు. కావున వస్తు స్వరూపమును ముమ్ముందు చక్కగ తెలిసికొనవలయును. గ్రుడ్డిగ నమ్ముమని యెవరును చెప్పరు. చెప్పినను ఈ విజ్ఞాన యుగమున ఆ వాక్యమునకు విలువే యుండదు. దైవత్వము హేతువాదము (logic) నకు విరుద్ధముకాదు. పైపెచ్చు దానిని పోషించి ఇంకను పైకిపోవును. కనుకనే దానికి మనోబుద్ధ్యతీత స్థితి (Super conscious state) అని పేర్కొనిరి. మనస్సు పవిత్రముగ నున్ననే జనులు దాని నర్థము చేసికొనగలరు. కేవలము తెలివిమాత్రముచాలదు. కావున సర్వేశ్వరునియొక్క అనంతవిభూతిని, మహిమాతిశయమును గూర్చి తెలిసికొని, తుచ్ఛములగు ప్రాపంచిక విషయభోగములనుండి మనస్సును మరలించి, ఆ దైవమునందే ప్రవేశపెట్టవలెను.

మనస్సు ఊరకనున్నచో ఏవియోదుష్టచింతనలు చేయుచుండును. కావున ఏదియోయొక దైవకార్యమును దానికి ఒప్పగించవలెను. భక్తుల సౌకర్యార్థము భగవానుడిచట చక్కని సాధనామార్గమును తెలియజేసెను. భగవంతుని జగత్ప్రభువుగా గుర్తించి దైవభావముతో నాతనిని భజించవలెను, సేవించవలెను అని శ్రీకృష్ణమూర్తి పలికెను. 'భావ సమన్వితాః' అని చెప్పుటవలన అర్థరహితమగు జపముగాని భావవర్జితమగు చింతనగాని ఎక్కువ ప్రయోజనకరముగ నుండదని తెలియుచున్నది. కావున భావయుక్తముగ చింతన జేయవలెను. మఱియు మనస్సు నిరంతరము పారమార్థిక విషయములందే నిమగ్నమైయున్నచో, ఇక దైవేతరవస్తువులను గూర్చి తలంచుటకే దానికి అవకాశముండదు. కనుక

కొంతసేపు పూజాదులొనర్చి, పిమ్మట జపముచేసి, ఆపిదప ధ్యానముసల్పి, తదుపరి భక్తులందఱుకాని, లేక ఒకరిద్దఱు కాని చేరి పరస్పరము భగవత్కథలనుగూర్చి కాని, ఆత్మతత్త్వమును గూర్చికాని సంభాషించుకొనుచు ఒకరికొకరు బోధించుకొనుచునుండినచో, ఈ ప్రకారము సంతత సావధానులై యున్నచో, ఇక మాయ ఎట్లు ప్రవేశించగలదు? చేతిలో నిరంతరము దీపమున్నచో చీకటి ఏకాలమందును దరికి చేర సాహసింపనట్లు హృదయమందు అఖండ భావన గలిగి యున్నచో అజ్ఞానము ప్రవేశించుటకుగాని, జీవుని బాధించుటకుగాని అవకాశమే ఉండదు.

> తననావహితం చిత్తం కామః కవలయిష్యతి
> సావధానస్య బుద్ధస్య పిశాచః కిం కరిష్యతి. (యోగవాసిష్ఠము)

'ఓ రామచంద్రా! అజాగ్రతగనున్నచో నీచిత్తమును కామ పిశాచము మ్రింగివేయగలదు; జాగ్రతగనున్నచో (నిరంతర ఆత్మచింతన గలిగియున్నచో) ఇక నిన్నది యేమిచేయగలదు? అని శ్రీ వసిష్ఠమునీంద్రుడు శ్రీరామచంద్రునకు బోధించెను.

ప్రాపంచిక మనుజునియొక్క చిత్తము అహర్నిశము ఇంద్రియార్థముల ననుభవించుటయందు, భోగసంపాదనము నందు, నశ్వరవస్తుసేకరణమునందు గడచిపోవును. ప్రపంచము అనిత్యమని, దైవము (ఆత్మ) నిత్యమని తెలియక దృశ్య పదార్థములందే అతడు సదా రమించుచుండును. మేడిపండు నందు పురుగులు పుట్టి గిట్టునట్లు ఈ బ్రహ్మాండమను ఉదుంబర స్థలమున ఇట్టి జీవరాసులు అనేకములు పుట్టుచుగిట్టుచునున్నవి.

వారికి పుణ్యము లేదు పురుషార్థము లేదు. ఎంత ఆసక్తితో వారు భౌతికప్రపంచమున, భౌతిక కార్యములందు, వ్యవహారము లందు మెలంగుచుందురో, అంత ఆసక్తితో భగవద్భక్తులు, జ్ఞానులగు మహనీయులు పరమార్థ కార్యములందు మెలంగు చుందురు. ఒక క్షణమైనను మనస్సునకు విషయాదులను చింతించుటకు వారు అవకాశమివ్వరు.

పూర్వము దయానందసరస్వతీస్వాములవారు ఆర్య సమాజసిద్ధాంతములను నొకచోట బోధించుచుండిరి. బోధ అంతయు పూర్తిఅయిన వెనుక ఒకవ్యక్తి యాతనిసన్నిధికివచ్చి 'మహాత్మా! మేము ఒక్కవలచగానున్నప్పటికి కామవికారములు మమ్ములను మిక్కుటముగ బాధించుచున్నవి. తాము పుష్టిగా నున్నారు. తమరిని అవి యేమియు బాధించుట లేదా?' యని ప్రశ్నించెను. అందుల కమ్మహర్షి 'ఆ వికారము లెట్లుండునో చింతన జేయుటకు నాకు తీరికయే లేదు. నేను నిరంతరము దైవకార్యము లందు పరోపకార క్రియలందు నిమగ్నుడనై యుందును'-అని ప్రత్యుత్తరమిచ్చెనట! కావున సాధకుడు గీతయందు తెలిపిన లాగున పూజాదులందో, జపమునందో, ధ్యానమునందో, సేవ యందో, దైవకథాశ్రవణమునందో, దైవసంభాషణమునందో చిత్తమును నియుక్త మొనర్చి దైవేతరములగు అసురచింతలు జొరబడుటకు అవకాశమే లేకుండ చేయువలెను. మహాత్ముల జీవితములను పరికించినచో గీతోక్తమగు ఈ ధర్మమును వారెట్లు కార్యాన్వితమొనర్చిరో తేటతెల్లము కాగలదు.

ఈ ప్రకారముగ భక్తిపూర్వకముగ అనవరతము పర మాత్మను సేవించుచుండినచో ఆతడు ప్రీతినొందును. మఱి

ప్రీతినొందినవాడు ఊరకుండునా? సామాన్యమగు వ్యక్తియే తన్నెవరైనను స్తోత్రముచేసినను, తనకెవరైన సేవచేసినను సంతుష్టాంగతరంగుడై ఏదోయొక ప్రతిఫల మాతనికి ముట్ట చెప్పచుండ ఇక భగవంతుని విషయమై వేఱుగ చెప్పవల యునా? ఆతడున్ను తన భక్తునియొక్క అపూర్వ సేవానిర తికి, నిర్మల భక్తికి మెచ్చి ఏదియైన బహుమాన మివ్వవలెనని ఆలోచించును. ఏమి బహుమానము? రత్నవైడూర్యములా? ధనకనకవస్తువాహనములా? త్రిలోకాధిపత్యమా? కాదు. ఇవి యన్నియు దైవదృష్టిలో పరిగణనకువచ్చుపదార్థములు కావు. మఱి యే మొసంగును? మోక్షమా? కాదు. సర్వేశ్వరుడు తన భక్తునకు మోక్షము నొసంగగల సమర్థత గలిగియున్నను తనకుతానై అద్దానిని సామాన్యముగ నివ్వడు. ఆయా భక్తుల చేతనే మోక్షమునకు వలసిన ప్రయత్నములను చేయించి వారి యంతట వారే స్వయముగ ముక్తి నొందునట్లు చేయును. కనుక తన్ను నిరంతరము ధ్యానించుచుండు భక్తవర్యునకు మోక్షప్రాప్తికై వలసిన తత్త్వవిచారణా సామగ్రిని, ధీశక్తిని ప్రసాదించును. దానిచే నతడు సులభముగ ముక్తిధామమును చేరగలడు.

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తితే.

"ఎవరు నిరంతరము ప్రీతిపూర్వకముగ నన్ను భజించు చుందురో, అట్టివారికి మోక్షప్రాప్తికి వలసిన బుద్ధిబలమును, విచారణాశక్తిని నేనొసంగెదను. దానిచే వారు నన్ను పొంద గలరు" అని భగవానుడు అర్జునునకు ఈ సందర్భమున తెలియ

జేసెను. గీతలో అతిముఖ్యమైన శ్లోకములలో నిదియొకటి. భక్తి జ్ఞానములు రెండును పరస్పరముకరచాలనము(Shake hand) గావించుకొనిన దృశ్యమిది. రెండును ఏకీభవించిన ఘట్టమిది. భక్తి వేఱు జ్ఞానము వేఱు అని అల్పజ్ఞులు మాత్రము తలంచుదురు. పూవు వేరు, కాయ వేరు అని తలంచువారి ప్రజ్ఞ యెట్టువంటిదో, వీరి ప్రజ్ఞయు అంతమాత్రమే. విచారించి చూచినచో పూవు నుండియే కాయ ఉద్భవించుచున్నది. అట్లే భక్తియనుపుష్పము వికసించినచో, అందుండి జ్ఞానమనుఫల మావిర్భవించుచున్నది. ఈ సత్యమును భగవానుడీశ్లోకమున తేటతెల్లమొనర్చెను. నిరంతరము భగవంతుని ప్రీతిపూర్వకముగ చింతించుట, సేవించుట భక్తియొక్క లక్షణము. అట్టి అవ్యభిచారభక్తి కలిగియుండు సాధకునకు పరమాత్మ బుద్ధియోగము 'జ్ఞానయోగము' ఒసంగెదనని హామీయిచ్చినాడు. 'దదామి' యిచ్చుచున్నాను - అని అసందిగ్ధముగ చెప్పినందువలన, ఇక సాధకున కావస్తువు వర ప్రసాదమువలె లభించుననేయగును. ఇది భగవంతుడు కావించిన ప్రతిజ్ఞ కావున తు. చ. తప్పకుండా అది జరిగితీరును. ఒకింత విజ్ఞానము, ధర్మబుద్ధి కలిగియున్న మానవులే తాము కావించు ప్రతిజ్ఞలను, వాగ్దానములను భంగ మొనర్పరు. ఇక భగవంతు డొనర్చునా? ఎన్నటికిని ఒనర్పడు. కావున ఇక భక్తులు, భగవత్సేవకులు మోక్షవిషయమై ఏమాత్రము భయ పడనవసరములేదు. ఏలయనిన మోక్షప్రాప్తికి ముఖ్యముగ అవసరమైనట్టి జ్ఞానశక్తిని, విచారణాబలమును, బుద్ధియోగమును పరమాత్మ వారికి ఒసంగెదనని 'గ్యారంటీ' యిచ్చెను.

ఇక్కాలమున జనులలో పెక్కురిహృదయమున నొక సందేహము పీడించుచున్నది. అది యేదియనిన, దేవళములందు, తీర్థములందు, పుణ్యప్రదేశములందు విగ్రహాదులకు పూజాపురస్కారములను చేయుచున్నాముకదా! అర్చనలన్నియు బాహ్యముననున్న వస్తువునకేకదా జరుగుచున్నవి. మఱి ఉపనిషత్తులయందును, శాస్త్రములందును భగవంతుడు హృదయమునందధివసించియున్నాడనియు, దృష్టి నంతర్ముఖ మొనర్చవలెననియు చెప్పబడియున్నది కదా! ఎప్పటికైనను మనుజుడు బహిర్ముఖత్వమును వీడవలెననికదా వేదశాసనము. దృశ్యమానమగునదియంతయు నశించునది ('యద్దృశ్యంతన్నశ్యం') కావున ఏనాటికైనను దృక్స్వరూపమును అంతరంగమున అనుభూతి మొనర్చుకొనుటయే నిజమైన బ్రహ్మానుభూతియని శాస్త్రములు పేర్కొనుచున్నవే. మఱి మేమందరమున్ను బాహ్యమున దేవుళ్ళను పూజించుచున్నామే. మాకట్టి అంతర్ముఖదృష్టి, జ్ఞానప్రకాశము ఎప్పుడు కలుగగలదు? బాహ్యదృష్టి, అంతర్దృష్టిగ నెప్పుడు మారగలదు-ఈమున్నగు సంశయములు జనులను వేధించుచున్నవి. వానియన్నిటికిని గీతాచార్యుడువచించిన ఈమహత్తరశ్లోకమున సమాధానము లొనంగబడియున్నవి. 'ఓ సాధకులారా! ఓ భక్తులారా! మీరేమియు దిగులుపడనవసరములేదు. అలాగుననే బాహ్యమున విగ్రహాదులకు దైవభావనతో పూజల నొనర్చుకొనుచుండుడు. మీభక్తికిమెచ్చి నేనే మీకు కావలసిన అంతర్ముఖ దృష్టిని, జ్ఞానప్రకాశమును కలుగజేసెదను. దానిచే మీరు హృదయమున దేదీప్యమానముగ వెలుగుచున్న సచ్చిదానంద

పరబ్రహ్మమును సాక్షాత్కరించుకొనగలరు. మీరు కావించు నిరంతర జపతప పూజాదులచేతను, ప్రీతిపూర్వకమగు భజన సంకీర్తనములచేతను నాకానందము కలుగ (‘అనుకంపార్థం’) మిమ్ములను ననుగ్రహించు తలంపుతో మీ యజ్ఞానతమస్సును ప్రకాశమానమగు జ్ఞానదీపముచే హరించివేసెదను’అని భగవానుడు అట్టిభక్తులందరికిని అభయహస్త మొసంగెను. అయితే ఇచట భక్తుల కుండవలసిన రెండు విశేషములు ప్రధానముగ పేర్కొనబడినవి. (1) ‘సతతయుక్తానాం’ అని చెప్పుటచే ఎల్లప్పుడు భగవచ్చింతన చేయుచుండవలెనని భావము, (2) ‘ప్రీతిపూర్వకమ్’ అనుటచే ఆ చేయు దైవచింతన ప్రీతిపూర్వకముగ (హృదయపూర్వకముగ) నుండవలెనని అర్థము. ఎవరో చేయుమనినారని బలవంతముగ చేయుటగాని, అనిష్టముగ నొనర్చుటగాని ఉండగూడదని తాత్పర్యము. ఈ రెండు సల్లక్షణములతో గూడిన భక్తినే భగవానుడు అంగీకారము (Recognise) చేసి తగిన జ్ఞానరూపప్రతిఫలమునొసంగును.అట్టి భక్తిపైననే తనముద్ర (Divine Stamp) వేయును. సర్కారువారు రిజిష్టరు చేసిన పత్రమునకు ఎట్లు విలువయుండునో, తక్కినవానికి యుండదో పరమాత్మసంతు నొందిన భక్తికి, భక్తునకుకూడ అట్లు విలువ యుండును. తదితరులకు కాదు. కనుకనే సామాన్యమైన వ్యక్తులుకూడ తమ నిరంతర పరిశ్రమచేతను, ఆధ్యాత్మిక సాధనలచేతను, భగవదనుగ్రహమును బొంది క్రమముగ జ్ఞానవంతులై ‘జ్ఞానీత్వాత్మైవ మే మతమ్’ అను ప్రమాణమునుబట్టి తుదకు సాక్షాద్భగవత్స్వరూపులే యగుచున్నారు.

మనుజుడు అధ్యాత్మవిద్యయందు ప్రావీణ్యము నొంద వలెననిన సమ్యక్-జ్ఞానవిచారణయందు ప్రవేశమును బడయ వలెననిన ఈశ్వరానుగ్రహమును తప్పకబొందవలసియున్నాడు. భగవదనుగ్రహములేనిదే ఎవరికిని పరమార్థ తత్త్వము బోధ పడదు. ఏలయనగా మాయను స్వాధీనపఱచుకొనిన మహనీయుని (భగవానుని) ఆశీస్సు లేనిదే మాయాంతర్గతుడగు మనుజునకు మాయాతీత వస్తు వెట్లు బోధపడగలదు?

ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైతవాసనా
మహాభయ పరిత్రాణా ద్విప్రాణా ముపజాయతే. (అవధూతగీత)

'ఈశ్వరానుగ్రహమువలననే జనులకు అద్వైతవిచారణయందు చక్కని ప్రవేశముకలుగగలదు. దానిచే మహాత్తరమగుసంసార భయము తొలగిపోగలదు.' అని దత్తాత్రేయులవారు తాము రచించిన అవధూతగీత ప్రారంభముననే తెలియజేసిరి. చూచితిరా! అఖండాద్వైతసిద్ధాంతప్రతిపాదకుడగు దత్తాత్రేయులు కూడ భక్తికి ఎంత ఆధిక్యతనొసంగెనో! అనుభవజ్ఞులగు మహనీయుల వాక్యము లిట్లేయుండును. అట్లుకాక మొట్టమొదటనే మహావాక్యములనుజపించవలెను, దృగ్దృశ్య విచారణమాత్రమే చేయవలెను,జీవబ్రహ్మైక్య యోగము నేపరిశీలించవలెను,పూజా జపతపాదులచే నేమి ప్రయోజనము? అవి యన్నియు బహిర్ముఖములు-అని వచించువారి వాక్యములు ప్రారంభస్థితిలో నున్న సాధకులను పెడదారిపట్టించినట్లేయగును. ఇట్టి బోధలచే పాపము వారు ఉభయభ్రష్టులగుచున్నారు. అటు జ్ఞానమును అందుకొనజాలక,ఇటు చేతనున్న భక్తిని జారవిడుచుకొని వారు రెండిటికి చెడ్డ రేవడులగుచున్నారు. కావున వారివారి స్థితిని

యోచించుకొని, భగవదనుగ్రహమును, మహాత్ములయొక్క, సద్గురువులయొక్క ఆశీర్వాదములనుబొందుటకై యత్నించుచు క్రమోన్నతిని బొందుట శ్రేయస్కరము. 'జ్ఞానాదేవతు కైవల్యమ్'-అని యిట్లు జ్ఞానముచేతనే మోక్షము కలుగునని శ్రుతులు చెప్పినప్పటికిన్ని అట్టిజ్ఞానసముపార్జనమువలసినభక్త్యాది పరికరములను సాధకుడు మొట్టమొదట తప్పక సంపాదించవలసి యున్నాడు. కనుకనే శ్రీకృష్ణభగవానుడు 'ప్రీతిపూర్వకముగ తన్ను నిరంతరము భజించుట' యను ద్వైతకార్యమునకు (భక్తికి) ఎంతయో ప్రాధాన్యతనొసంగి, అట్టిద్వైతక్రియచేతనే అద్వైతసామగ్రియగు బుద్ధియోగము (జ్ఞానయోగము) లభించ గలదనియు, అట్టిజ్ఞానవిచారణచేక్రమముగ సాధకుడు తానెవరో జగత్తేమియో తెల్లగ తెలిసికొని స్వస్వరూపమున నిలుకడ కలిగి కైవల్యప్రాప్తిని బడయగలడనియు స్పష్టముగ చెప్పి వేసెను. కాబట్టి యిక యీ భక్తిజ్ఞానముల విషయములో ఎవరికిని ఏ అపోహలున్ను ఉండనక్కరలేదు.

ఇవ్విధముగ భక్తిచే సంతుష్టుండైన భగవానుడు ఏ ప్రకారమా భక్తునకు జ్ఞానయోగమును ప్రసాదించునో యోగవాసిష్ఠమున ప్రహ్లాదోపాఖ్యానమున చక్కగ నిరూపింప బడినది. ప్రహ్లాదుడు తన పూజాగృహమున అనన్య భక్తితో శ్రీమన్నారాయణుని పూజించుచు ధ్యానించుచునుండెను. చాలకాలమట్లు అనవరతము నారాయణుని సేవించుచునుండ ఒకనాడు అకస్మాత్తుగ అతని ధ్యేయమూర్తియగు శ్రీమన్నా రాయణుడు శంఖచక్రగదాధారుడై ప్రహ్లాదుని పూజామందిర మున ప్రత్యక్షమయ్యెను. బహుకాలవాంఛితము నెరవేర,

ప్రహ్లాదుడు మహదానందభరితుడై విష్ణుభగవానుని స్తోత్రము జేసెను. నారాయణుడు సంతుష్టుడై ఏదియైన వరమును కోరుకొనుమని ప్రహ్లాదుని యాదేశించెను. ప్రహ్లాదున కేమియు తోచలేదు. "ఏవరమును కోరుకొందును? ముల్లోకములందును అతిశ్రేష్ఠమగు వస్తువెద్దియో దానిని కోరవలెను. జీవునకు శాశ్వతసుఖప్రాప్తికి సహాయపడునది యేదియో దానినే యడుగవలెను. అట్టివస్తు వెయ్యది? ధనధాన్య వస్తుసంపదలా? స్వర్గభోగములా? కావు. అవి నశ్వరసుఖమునే కలుగజేయును. మఱి అనంతసుఖసంపాదకమగు పదార్థ మేదియై యుండును? సర్వజ్ఞుడగు పరమాత్మకే ఆ విషయము లెస్సగ తెలిసి యుండును. కావున అతనినే యడిగెదను" అని నిశ్చయించి శ్రీమన్నారాయణునకు నమస్కరించి 'మహాప్రభో! అన్ని వరములలోను ఉత్తమమైన వరమేదియో తామే యోచించి నాకు ప్రసాదింపుడు!' అని ప్రార్థించెను. అత్తఱి విష్ణుభగవానుడు బాగుగ ఆలోచించి ప్రహ్లాదున కీవరము నొసంగెను- 'ప్రహ్లాదా! ఆత్మసాక్షాత్కారమగువఱకు నీయందు చక్కని జ్ఞాన విచారణ కలుగుగాక!' అని చెప్పి విష్ణువంతర్ధానమయ్యెను. భగవానుడు ప్రహ్లాదునకు నేరులో మోక్షమును ప్రసాదించక మోక్షప్రాప్తికి వలసిన బుద్ధియోగము నొసంగెనన్నమాట. 'దదామిబుద్ధియోగం'-అను గీతావాక్యము ప్రహ్లాదుని విషయములో చరితార్థమయ్యెను. ఒక్క ప్రహ్లాదుని విషయమేల, ఏ యే భక్తులు ప్రీతిపూర్వకముగ నిరంతరము సర్వేశ్వరుని స్మరించుచుందురో అట్టి వారందఱికిని పరమాత్మ ఇట్టి జ్ఞాన విచారణాశక్తిని ప్రసాదించగలడు. తద్ద్వారా వారు మోక్షము

నొందగలరు. విష్ణుభగవాను డంతర్ధానమయిన వెంటనే ప్రహ్లాదుడు 'నేనెవరు ? ఈ జగత్తు ఎట్లు ఆవిర్భవించినది ? జీవుని వాస్తవస్వరూపమెద్ది ? పంచకోశములనుండి ఆత్మను వేఱుపఱచుట ఎట్లు ?' - ఈ ప్రకారముగ తత్త్వవివేచనముచేసి, దృశ్యరూప ఆవరణముచే కప్పబడియున్న దృక్స్వరూపమగు ఆత్మను బాగుగ తెలిసికొని, ఆవరణభంగ మొనర్చుటద్వారా అట్టి ఆత్మను లెస్సగ సాక్షాత్కరించుకొని జీవన్ముక్తుడై నిరతిశయానందము నొందెను. ఈ ప్రకారముగ ప్రహ్లాదుని కైవల్యప్రాప్తికి అతని అనన్య భక్తియే మూలకారణమై యున్నట్లు విజ్ఞులు తెలిసికొనగలరు. కాబట్టి సాధకులగువారు భక్తిని ఆధారముగ తీసికొని తద్ద్వారా భగవదనుగ్రహముచే జ్ఞానము (బుద్ధియోగము)ను బడసి అట్టి జ్ఞానముచే స్వస్వరూప సాక్షాత్కారమునొంది తరించుట శ్రేయస్కరము. ఇదియే చక్కని రాజమార్గము.

శ్రీకృష్ణపరమాత్మ యీ ప్రకారముగ బోధించుచుండ అర్జునుడు మధ్యలో ఆపి భగవద్విభూతులను తెలిసికొన నిచ్ఛగల వాడై ఆ విషయమై తనగురుదేవుని సముచితరీతి ప్రశ్నించెను. 'దేవా ! అన్నియు నీస్వరూపములేఅయియున్నను ప్రధానముగ ఏయేవస్తువులను నేను ధ్యానింపవలెనో తెలియజేయుడు. ఏయే పదార్థములందు తమయొక్క అధ్యాత్మవిభూతి, దైవతేజము లెస్సగ ప్రకటితమైయుండునో తెలుప వేడెద' అని అర్జునుడు పృచ్ఛజేయ నంతట భగవానుడు విస్తారముగ చెప్పుటకు వీలు పడనందున సంక్షేపముగ సెలవిచ్చెను. 'ఓ అర్జునా! నాయొక్క దివ్యవిభూతులకు అంతులేదు. అయినను ప్రధానముగ కొన్ని

మాత్రము చెప్పెదను వినుము - నేను సమస్తభూతకోట్లయందును స్థితిగలిగియున్నాను. నదులయందు నేనుగంగను, వృక్షములందు రావిచెట్టును, వాక్కులందు ఏకాక్షరమగు ప్రణవము (ఓంకారము)ను, యజ్ఞములందు జపయజ్ఞమును, దైత్యులందు ప్రహ్లాదుడను, శస్త్రములనుధరించినవారిలో శ్రీరామచంద్రుడను, విద్యలలో అధ్యాత్మవిద్యను, మాసములలో మార్గశీర్షమాసమును, యాదవులలో వాసుదేవుడను, పాండవులలో అర్జునుడను, మునులలో వ్యాసుడను...' అని ఈప్రకారముగ తన దివ్యవిభూతులలో కొలదిమాత్రము వచించెను. ఆయా పదార్థములలోను వ్యక్తులలోను పరమాత్మ విశేషముగ నభివ్యక్తుడగుటవలననే వాటిని మనమిపుడు పూజించుచు, శిరోధార్య మొనర్చుకొనుచున్నాము. వేలకొలది మైళ్ళు యాత్రసాగించి ఆసేతుహిమాచలపర్యంతము ఎందరో పుణ్యాత్ములు గంగను సందర్శించి, స్పర్శించి, అందు స్నానముచేసి ధన్యతను జెందుచున్నారు. ఎచట రావిచెట్టు కనిపించినను దానికి ప్రదక్షిణలు చెల్లించుకొనుచున్నారు. ఓంకారమును జపించుచున్నారు. ఏలయనగా భగవద్విభూతి వానియందు లెస్సగ ప్రకటితమైయున్నది. ఈ రహస్యమును గీతాచార్యుడే తెలిపియున్నాడు.

యజ్ఞములలో జపయజ్ఞము తానని భగవానుడు తెలుపుట గమనింపదగినది. ఇది ఖర్చులేనియజ్ఞము. మఱియు అందఱికిని అందుబాటులోనున్నది. పైపెచ్చు అన్నియజ్ఞములకంటెను ప్రధానమైనది ('జపయజ్ఞమును నేన'ని శ్రీకృష్ణమూర్తి తెలిపెనుగావున), దీనికిఅంగబలము అక్కఱలేదు. అర్థబలము అంతకంటెను అక్కఱలేదు. ఋత్విక్కులతో పనిలేదు. ఫలితమా

అన్నిటికంటెను ఎక్కువైనది. ఇట్టి సర్వజనానుకూలమగు సర్వోత్కృష్టమగు యజ్ఞమును జను లేల ఆచరించరాదు? సోమయాజులకంటె జపయాజులు శ్రేష్ఠతములని భగవానుడే సెలవిచ్చెనుగదా! కాబట్టి సులభతరమైన యీ జపయజ్ఞము నవలంబించి జనులు పాపక్షయమొనరించుకొని* అధ్యాత్మమార్గమున పురోగమించుదురుగాక! ఇక దైత్యులలో ప్రహ్లాదుడు తానని భగవానుడు చెప్పియున్నందున, భగవదృష్టియందు జాతిమతవర్గ సంప్రదాయ విభేదమేమియును లేదనియు, అతిక్రూరులైన రాక్షసులైనను భక్తిమార్గమును జేబట్టి దైవము నాశ్రయించినచో అక్రూరులై భగవద్విభూతిరూపమగు అత్యున్నతస్థానమును బడయగలరనియు విస్పష్టమగుచున్నది.

ఇక, విద్యలలో అధ్యాత్మవిద్య తానని చెప్పటవలన, ప్రపంచములోగల విద్యలన్నిటిలోను ఏది శ్రేష్ఠమైనవిద్యయో వేఱుగ చెప్పనక్కఱలేదు. ఏవిద్యవలన శాంతిసుఖములు లభించునో, ఏది ఆత్యంతిక దుఃఖరాహిత్యమును కలుగజేయగలదో, సంసారతాపములన్నియు దేనివలన అణగిపోగలవో అదియే ఉత్తమమైనవిద్య. ఏది జనన మరణ ప్రవాహమునుండి జీవుని తప్పించగలదో అదియే విద్యలలో శిరోమణి యనదగును.

తత్కర్మ యన్న బన్ధాయ సా విద్యా యా విముక్తయే
ఆయాసాయాపరం కర్మ విద్యాన్యా శిల్పనైపుణమ్.

"ఏది బంధనమునుగలిగించదో అట్టి కర్మయే కర్మ; ఏది మోక్షమును గలుగజేయునో అట్టి విద్యయే విద్య. ఇతరకర్మలన్నియు ఆయాసమును గలుగజేయునవియు, ఇతర విద్యలన్నియు శిల్ప

* జపతో నాస్తి పాతకమ్

నై పుణ్యమాత్రములును అగును.' భవసాగరమున గ్రుంకు లిడుచు ముక్కులలోనికి, చెవులలోనికి నీళ్ళుపోయివిలవిలతన్ను కొనుచుండు జీవుని ఒడ్డునకుచేర్చి వాస్తవసుఖమెట్టిదో యతనికి చవిచూపగలశక్తి ప్రపంచములోని యేవిద్యకైన కలదా యని గీత 'సవాల్' చేయుచున్నది! విశ్వమందలి విద్య లన్నిటిని త్రాసుయొక్క ఒకపళ్లెరమునపెట్టి అధ్యాత్మవిద్య ఒక్కదానిని మాత్రము రెండవపళ్లెరమున బెట్టినచో మొదటిపళ్లెరము పైకి లేచి తన లాఘవత్వమును చూపగలదు. దేనిచే జీవునియందలి దైవత్వము వికాసము నొందగలదో, దానికే ప్రాధాన్యతకలదు కాని తక్కినవాటికి కాదు. 'నహినహి రక్షతి డుకృఞ్ కరణే'- లౌకికవిద్యలు జననమరణములనుండి రక్షింపజాలవుకనుక 'భజ గోవిందం భజగోవిందం'- గోవిందుని భజింపుము, భజింపుము. దైవవిద్య నభ్యసింపుము,అధ్యాత్మవిద్యను జేపట్టుము - అని శ్రీశంకరభగవత్పాదులవారానతిచ్చియున్నారు. ఆయా ప్రాపంచిక విద్యలను దూషించుటకాదు పెద్దల యభిప్రాయము; పరమార్థవిద్యయొక్క ప్రాధాన్యమును నిరూపించుటయే యగును. తీరికనుబట్టి ప్రపంచములోగల ఎన్నివిద్యలనైనను అభ్యసించవచ్చునుగాని, అన్నిటికంటె ముందుగా బ్రహ్మవిద్యయొక్క పరిచయము తప్పక పొందియే తీరవలెను.

తావన్మాయా భవభయకరీ పండితత్వం న యావత్
తాత్పాండిత్యం పతసి న పునర్యేన సంసారచక్రే
యత్నం కుర్యాదవిరతమతిః పండితత్వేఽమలాత్మ
జ్ఞానోదారేభయమితరథా నైవవః శాన్తిమేతి. (యోగవాసిష్ఠము)

'పాండిత్యమును పొందనంతవరకు మాయ సంసార భయమును కలుగజేయుచునేయుండును. దేనిని పొందినచో జీవుడు మరల

యీ సంసారచక్రమున తగుల్కొనకయుండునో అదియేపాండి త్యముకాని మఱియొకటికాదు. కావున మనుజుడు నిర్మల చిత్తుడై అట్టి భవదుఃఖభేషజమగు బ్రహ్మజ్ఞానమను పాండిత్య మును సంపాదించుటకై నిరంతరము ప్రయత్నము సలుపవల యును. సర్వోత్కృష్టమగు అట్టిజ్ఞానము చేదప్ప మఱిదేని చేతను గూడ ఆసంసారభయము శమింపనేరదు' - అని వసిష్ఠులవారు శ్రీరామచంద్రున కుపదేశించిరి. దీనినిబట్టి ప్రపంచములో ఏ విద్య ప్రధానమైనదో, దేనిని ముందు అభ్యసించవలెనో స్పష్ట ముగ తెలియుచున్నది. ఇట్టి ప్రధానవిద్యను యిక్కాలమున జను లుపేక్షించుట కడుంగడు శోచనీయము. ముఖ్యముగ చిన్ననాటినుండియే యిట్టివిద్యయొక్క పరిచయము జనులకు కలుగవలసియున్నది. ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత పాఠశాలలలోను, కాలేజీలలోను ఇట్టి విద్యకు స్థానమును కలుగజేయవలసియున్నది. పశ్చిమదేశీయులు, క్రైస్తవులు తమతమ పాఠశాలలలో కొద్దిసేపైనను బైబిలుగ్రంథమును విద్యార్థులకు విధిగా బోధించుచుందురు. భారతదేశములో కూడ యీపద్ధతి అనుసరింపబడి పాఠశాలలందు గీతాది సద్గ్రంథములు బోధింపబడుట శ్రేయస్కరము.

ఏలయనిన, భవిష్యత్కాల దేశశ్రేయస్సంతయు ఇప్పటి బాలురపైనను, విద్యార్థులపైనను ఆధారపడియున్నది. వారే భావికాలపౌరులు (Future citizens) కాగలరు. వారి భుజ స్కంధములపైననే దేశక్షేమముయొక్క బాధ్యత ప్రతిష్ఠింప బడియున్నది. అట్టివారికి నైతికచింతన, పరమార్థబుద్ధి ఒకింతైనను లేనిచో దేశములో కేవలము అసురత్వమే

తాండవించుచుండును. సత్యము, దయ, కరుణ, నిస్స్వార్థబుద్ధి, పరోపకారము మున్నగు దైవగుణములకు జనుల హృదయసీమలలో స్థానమున్నంతవఱకే లోకములో శాంతి సుభిక్షములు వర్ధిల్లుచుండును. అవి శూన్యమైనచో అశాంతి, హింస, విద్వేషము, వైరము మున్నగునవి స్వైరవిహారము సల్పుచుండును.

**"Take off religion from human society and what will remain?-nothing but a forest of brutes"**

"మానవసమాజమునుండి మతమును, దైవత్వమును వేఱుచేసినచో యిక మిగులునది యేమి? పశువులగుంపు మాత్రమే'- అని వివేకానందులు వాస్తవికతను ఋజువుచేయుచు పలికిన అమోఘవాక్యములు యీ సందర్భమున స్మరింపదగియున్నవి. కావున మానవుని దానవునిగ, పశువుగ తయారుచేయు సామగ్రిని విడనాడి, మానవుని మానవునిగనే యుంచుటలో సంతుష్టి పడక దేవునిగకూడ మార్చివేయగల స్తోమత గలిగిన యీ అధ్యాత్మవిద్యను, ఈ బ్రహ్మవిజ్ఞానమును జనులాదరించి తాము తరించి యితరులనుకూడ తరింపజేయుదురుగాక !

'భగవద్గీతను బోధించినది కృష్ణుడు, వినినది కృష్ణుడు, వ్రాసినది కృష్ణుడు'-అని యొక మహనీయుడు పలికెను. ఆ వాక్యము ముమ్మాటికిని సత్యము. ఈ విభూతియోగము ద్వారా ఆ సత్యమును మనము నిరూపించవచ్చును. ఎట్లనిన- గీతను బోధించినది కృష్ణుండని అందఱికిని తెలియును. వినినది యెవరు? అర్జునుడు. అర్జునుడు కృష్ణు డెట్లగును ? ఇది విప

రీతముకాదా ? కాదు. 'పాండవానాం ధనంజయః'-'పాండవు లలో నేను అర్జునుడను' అని శ్రీకృష్ణమూర్తి ఈ అధ్యాయము ననే వచించియున్నాడు. కాబట్టి అర్జునుడు=కృష్ణుడు అని తేలినది. ఇక గీతను వ్రాసినది యెవరు? వ్యాసులు. వ్యాసులు కృష్ణు డెట్లుకాగలడు ? ఇది సంభవమా ? సంభవమే. మునీనా మప్యహం వ్యాసః'-'మునులలో నేను వ్యాసుడను' అని శ్రీకృష్ణమూర్తి తెలిపియే యున్నాడు. కావున వ్యాసులు= కృష్ణుడు అని స్పష్టమగుచున్నది. ఈ ప్రకారముగ గీతను చెప్పినది, వినినది, వ్రాసినది కృష్ణుడే యగుచున్నాడు. ఒకే మూర్తి మూడురూపములుగ ప్రత్యక్షమై లోకములో గీతా వతరణమునుగావించి మహోపకార మొనర్చెనని యర్థము. కనుకనే గీతకు ఇంతమహత్తరశక్తి యేర్పడుటకు కారణము.

ఈప్రకారముగ శ్రీకృష్ణభగవానుడు తన విభూతులలో కొన్నింటినిమాత్రము తెలియజేసి, తుట్టతుదకు ఒక సామాన్య సూత్రమును (General Aphorism) చెప్పి వైచెను. అది యేది యనగా,

యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశ సంభవమ్. (10-41)

'ఓ అర్జునా ! ఏదేది ఐశ్వర్యయుక్తమై, ప్రకాశవంతమై, ఉత్సాహ సమన్వితమైయుండునో, అది యది యంతయు నా శక్తియొక్క ఒకానొక అంశమువలన కలిగినదానినిగనే నీ వెఱుంగుము. అనగా నాయొక్క విభూతిగనే భావింపుము" అని భగవద్వాక్యము. దీనినిబట్టి ప్రపంచములో ఆనందము, ఉత్సాహము, సచ్ఛీలము, ధైర్యము, నిర్భయత్వము మున్నగు

దైవగుణము లెచట నుండునో అచట దైవమే కాపురముండు నని చెప్పవచ్చును. అపవిత్రత, కామక్రోధాది దుర్గుణములు, తమస్సు, అజ్ఞానము మున్నగునవి యుండుచోట భగవానుడు వసింపడు. భగవద్విభూతి యట కానరాదు. దయ్యములు మాత్ర మచట కాపుర ముండును.

సదా భోగభాజాం సుదూరే వసన్తం
సదా యోగభాజా మదూరే విభాన్తమ్
చిదానన్దకన్దం సదా రాఘవేశం
విదేహాత్మజానందకన్దం ప్రపద్యే.

అని శ్రీరామచంద్రుని గూర్చిన స్తోత్రమొకటి కలదు. దీని అర్థము-భోగలాలసులకు సదా అతిదూరమున నుండువాడును, యోగలాలసులకు అతిసన్నిహితముగ వర్తించువాడును, చిదానందస్వరూపుడును, సీతాదేవికి సంతోష మొనగూర్చువాడు నగు శ్రీరామచంద్రుని నిరంతరము శరణుబొందుచున్నాను. కావున భగవద్భక్తి, జ్ఞానవైభవము, మనోనిర్మలత మున్నగునవి యుండుచోట పరమాత్మ తప్పక వసించును. వ్యక్తులందు వలె పదార్థములందును, జంతుజాలములందును గూడ ప్రపంచములో ఎచ్చటెచట దివ్యత్వము, ఉత్సాహము, సాత్త్వికత వెల్లివిరియునో అచటచట భగవద్విభూతి యలరారునని శ్రీకృష్ణపరమాత్మ తెలిపివైచెను. కాబట్టి భగవంతుని అస్తిత్వమును, విభూతిని, గోరువారందఱున్ను తమ యిల్లు, తమ ఒళ్ళు, తమ యంతఃకరణము నిర్మలముగ నుంచుకొనవలసియున్నది. పరమాత్మ సూర్యునివలె సర్వత్ర వెలుగొందుచున్నప్పటికిని, ఉపాధుల నైర్మల్యము ననుసరించి

కొన్ని కొన్ని చోట్ల లెస్సగ స్ఫురించుచుండును. సూర్యకిరణములు రాతియందుపడి ప్రతిబింబించవు; గోడయందుపడి ఒకింత ప్రతిబింబించును; అద్దమునందుపడి లెస్సగ ప్రతిబింబించును; సూర్యకాంతమణిపైబడి జ్యోతిరూపముగ పరిణమించును. అట్లే పరమాత్మ మూఢునియందు ఏమాత్రము స్ఫురింపకయు, సామాన్యునియందు ఒకింత స్ఫురించియు, సాధకునియందు విశేషముగ స్ఫురించియు, జ్ఞానియందు పరిపూర్ణముగ స్ఫురించియు నుండును. భగవంతుని నివాసము స్వర్గమునందుకాదు, పాతాళమునందుకాదు, మఱి యేలోకమునందు కాదు. ఎచట దివ్యత్వము విరాజిల్లుచుండునో, ఎచట శమదమాది సాధనసంపత్తి యలరుచుండునో, ఎచట విశుద్ధసత్త్వగుణము వర్తించుచుండునో, ఎచట భక్తి జ్ఞాన వైరాగ్యములు స్థితి బొందియుండునో అచట భగవంతుడు తనకుతానై వచ్చి చేరును. కావున అట్టి సద్గుణములను అలవఱచుకొని, భగవద్విభూతికి నిలయముగ తన చిత్తమును గావించుకొని మానవుడు, ఈ జన్మయందే పరమానందప్రాప్తినొంది ధన్యుడు కావలయును. జన్మ సార్థక మొనర్చుకొనవలెను.

ఈ ప్రకారముగ శ్రీకృష్ణభగవానుడు తనయొక్క విభూతులను అర్జునకు వర్ణించిచెప్పి, కట్టకడను ఈ సమస్త ప్రపంచమున్ను తనలోని యొక భాగమున మాత్రమే యునని చెప్పి ఈ అధ్యాయమును విరమించెను.

విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్. (10-42)

"ఓ అర్జునా! అధికముగ జెప్పనేల! ఈజగత్తంతటిని నాయొక్క ఒక్క అంశముచేతనే వ్యాపించియున్నాను"-అని భగవానుడు

సెలవిచ్చెను. ఓహో! ఎంత గంభీరమైన వాక్యము! ఇన్నికోట్ల జీవరాసులతోగూడి, అనంతములైన బ్రహ్మాండములతో వెలయుచు, వ్యవహార సంకులితమైయున్న ఈ సమస్తప్రపంచము భగవంతునియందొక్క అంశమేయట! 'పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి' అను వేదవాక్యమున్ను ఈయర్థమునే ద్యోతకము జేయుచున్నది. విశ్వమంతయు భగవంతుని ఒక్కపాదముచే (స్వల్పభాగముచే) వ్యాప్తమైయున్నదనియు, మూడుపాదములు (అధికభాగము) అమృతరూపమై వెలయుచున్నదనియు భావము. కావున ప్రపంచ సంపర్కము లేని భాగము ఇంకెంతనో ఉన్నదని స్పష్టమగుచున్నది. 'అత్యతిష్ఠద్దశాంగులమ్'- బ్రహ్మాండమంతయునుదాటి ఇంకను పదిఅంగుళములు(కొంత) అధికముగనేయున్నాడు భగవంతుడు అనియు వేదవాక్కు తెలుపుచున్నది. ఇట్టి వర్ణనయంతయు సామాన్యులకు భగవంతుని అనంతస్వరూపముయొక్క పరిచయమును స్థూలముగ నొనర్చుటకొఱకే యగును. వాస్తవముగ పరమాత్మ కొన్నిభాగములుగ విడగొట్టబడువాడుకాడు. ఆతడు అవిభక్తుడు. దృశ్యప్రపంచముయొక్క సంపర్కమేమాత్రము లేనివాడు. అసద్రూపమగు జగత్తు సద్వస్తువగు పరమాత్మలో నొకభాగమెట్లుకాగలదు! లేనిది ఉన్నదానిలో ఏ భాగమునకు జెందును? ఇది వాస్తవస్థితి. కాని ఇట్టి అతీత బోధ జనసామాన్యమునకు అందుబాటులో నుండదు. కావున, స్వప్నలోకమునందంతటను జాగ్రత్పురుషుడు వ్యాపించి ఇంకను దానికి అతీతుడుగనే యుండులాగున పరమాత్మ ఈ విశ్వమంతటను ఒక భాగముచే వ్యాపించి తక్కిన భాగములచే ఇంకను

అతీతముగనే యున్నాడని వర్ణించి చెప్పబడినది. ద్వైతరూపముగ భావించినను, అద్వైతరూపముగ భావించినను పరమాత్మ బ్రహ్మాండమంతయు వ్యాపించు విశ్వాతీతుడుగ వెలయుచున్నాడను విషయము మాత్రము స్పష్టము.

దైవము విశ్వాతీతుడనుసత్యము తెలుసుకొనుటకుముందుగా విశ్వముయొక్క స్వరూపమునొకింత అవగాహనముచేసికొనుట ఉత్తమము. కోట్లకొలది మైళ్ళదూరములో తేజోవంతములగు బ్రహ్మాండమైన గోళములు, సూర్యులు, చంద్రులు, ఎన్నియో మనదృష్టికి అందనివి వానివాని కక్ష్యలందు నిర్దుష్టముగ పరిభ్రమించుచున్నవి. అగణితములగు గ్రహములు ఉపగ్రహములు అనంతకోటి జీవరాసులకు నెలవులై యొప్పుచు విశాలాకాశమున సంచరించుచున్నవి. ఇట్టి అనంతమగు భూతాకాశము, సూక్ష్మమగు చిత్తాకాశమున నొకమూల తిరుగాడుచున్నది. అట్టి అనంత చిత్తాకాశము అత్యంతసూక్ష్మమగు చిదాకాశమున కేవలము కల్పితమై ఒక మూల నక్కియున్నది. చూచితిరా! చిదాకాశస్వరూపుడగు పరమాత్మయొక్క మహిమాతిశయము! అట్టి అనంతకోటిబ్రహ్మాండములకు నాయకుడై చిదాకాశ స్వరూపుడైన పరమాత్మ కావలెనా? లేక ఎక్కడో భూతాకాశమున, ఎక్కడో జంబూద్వీపమున, భరతవర్షమున, భరతఖండమున, మేరుపర్వతముయొక్క దక్షిణదిగ్భాగమున ఏకదేశమున వర్తించు అల్పభోగసముదాయము కావలెనా? విజ్ఞులే యోచించుకొనవలసినది.

నాథేనః పురుషోత్తమే త్రిజగతామేకాధిపే చేతసా
సేవ్యే స్వస్య పదస్య దాతరి సురే నారాయణే తిష్ఠతి

యం కించిత్పురుషాధమం కతిపయగ్రామేశమల్పార్థదం
సేవాయై మృగయామహే నరమహో మూకావరాకా వయమ్.

(ముకుందమాల)

'పురుషోత్తముడును ముల్లోకముల కేకైక ప్రభువునగు శ్రీమన్నారాయణుని మనసార సేవించినంతమాత్రమున తన యొక్క అనంతబ్రహ్మపదమునే ఇచ్చివేయుచుండ, దానినివదలి ఏవియో కొన్నిగ్రాములకధికారియైన ఒకానొక అల్పమనుజుని చుట్టూ చేతులుకట్టుకొని తిరుగాడుచున్నాము. ఎంత మూఢులము మనము!' అని కులశేఖరాళ్వారు విస్తుపోయెను. కావున పరమాత్మయొక్క అనంతవిభూతులనుగూర్చి, విశ్వవ్యాపక విశ్వాతీత స్వరూపమునుగూర్చి బాగుగ మననముచేయుచుండినచో, జనులయొక్క అహంకారము అణగిపోగలదు. గర్వము నామరూపములు లేకుండ పోగలదు. 'దాసోఽహం' భావన చక్కగ అలవడగలదు. భగవద్భక్తి అభివృద్ధి నొందగలదు.

దైవశక్తిముందు మానవునిశక్తి ఎంత అల్పమైనది! గాలిలేనప్పుడు విసనకఱ్ఱలతో విసరుకొందుము. కాని ఎంత అవస్థపడినను ఒకింతమాత్రమే గాలివచ్చును. ఒక్క ఝంఝూమారుతము వీచినచో గ్రామగ్రామములుకూడ వ్యాపించునంతటి మహావాయువు ఉద్భూతముకాగలదు. ఇది దైవశక్తి; మొదటిది మనుష్యశక్తి. అట్లే బావిలో తోడుకొనినగాని, మోటార్లతో పంపుచేసినగాని కొన్ని నీళ్ళుమాత్రమే వచ్చును. బ్రహ్మాండమైన వర్షము కురిసినచో ఊళ్లు, చెఱువులు ఏకమగునంతటి జల మావిర్భవించును. ఇది దైవశక్తి; మొదటిది మనుష్యశక్తి. రాత్రి చీకటిలో ఒక దీపముగాని, ఎలక్ట్రిక్

లైటుగాని వెలిగించినచో కొద్దిచోటమాత్రము ప్రకాశము కలుగును. ఉదయము సూర్యుడుదయించినచో సర్వదిక్కులు ప్రకాశమానములై పోవును. ఇది దైవశక్తి; మొదటిది మానవశక్తి. ఈ ప్రకారముగ భగవానుని అనంతశక్తి సమ్ముఖమున మానవుని యల్పశక్తి వెలవెల పోవుచున్నది. కావున తన యల్పత్వమును తెలిసికొని విఱ్ఱవీగక, భక్తిప్రపత్తులతో తన చిత్తమును దైవమునందు, హృదయస్థ పరమాత్మ యందు విలీనము చేయవలెను. మానవుడు చేయగలిగినది ఇంతియే. తన్ను భగవంతునికి సమర్పించుకొనుటకంటె నధికముగ ఆతడు చేయగలిగినది యేది? అట్లు చేయుటవలన తనకు ఏమాత్రము తగ్గినదిలేదు. పైపెచ్చు ఆ అనంత భగవచ్ఛక్తికి తానే వారసుడగుటవలన, జలబిందువు సముద్రములోపడి తనవ్యష్టిత్వమును, అల్పత్వమునుగోల్పోయి విశాల సముద్రరూపమే యగునట్లు - దైవరూపుడే యగుచున్నాడు. భగవద్విభూతియొక్క చింతనచేగలుగు మహోపకార మిది. కాబట్టి తమతమ అల్పప్రాపంచిక వైభవములను, సంపదలను జూచి మురిసిపోక, జనులు సర్వేశ్వరుని అనంతమహిమాతిశయమును, దివ్యవిభూతిని అనవరతము సంస్మరించుచు, తద్ద్వారా అహంకారమును చంపుకొని విశ్వాత్మయందు తల్లీనులై బ్రహ్మానందస్వరూపులుగా వెలయుదురుగాక!

ఓం తత్ సత్

ఓమ్

# 11-వ అధ్యాయము

# విశ్వరూప సందర్శనయోగము

---

నేడు భగవద్గీత పదునొకండవ అధ్యాయమునుగూర్చి విచారింపవలసి యున్నాము. విశ్వరూపసందర్శనయోగ మని దీనికి పేరు. 7-వ అధ్యాయము నుండి 12-వ అధ్యాయమువఱకు భక్తిషట్కమని యిదివఱలో చెప్పియుంటిమి. వీనియందు ప్రధానముగా భక్తి ప్రతిపాదింపబడియున్నది. భగవద్విభూతులను గూర్చి శ్రీకృష్ణపరమాత్మ గత అధ్యాయమందు తెలిపియున్నప్పటికిని, అర్జునుడు వాని శ్రవణమాత్రముతో సంతృప్తిపడక ఆ విభూతులన్నియు ఏపరమాత్మయొక్క శరీరమున వ్యాపించియున్నవో, ఆ విశ్వరూపమును ప్రత్యక్షముగ గాంచవలెనని కుతూహలపడి అందులకై శ్రీకృష్ణుని అర్థించెను. భగవానుడందుల కంగీకరించి తన విశ్వరూపమును అర్జునునకు ప్రత్యక్షముగ జూపెను. అట్టి విశ్వరూపవర్ణనయే ఈ అధ్యాయమునందలి ప్రధాన విషయము.

అర్జునునకు గలిగిన 'ధర్మసమ్మూఢచిత్తత్వ'మను రోగమును బాపుటకు శ్రీకృష్ణమూర్తి 'గీతామృతరసాయన'మను దివ్యౌషధమును ఒసంగ ప్రారంభించి ఇప్పటికి సగముప్రక్రియకు పైగా ఒకింత నడచినది. రోగికి మొత్తము 18 ఔన్సులమందు త్రాపవలసియున్నది. భగవానుడు వేసికొనిన అంచనా అది.

ఔషధము మొత్తమును స్వీకరించినచో అర్జునుని మోహరూప వ్యాధి సమూలముగ నశించిపోగలదని శ్రీకృష్ణునకు నమ్మిక గలదు. కాని ఆ 'రామబాణ' దివ్యౌషధముయొక్క ఎనలేని మహిమ యేమియోకాని, 10 డోసులు (10అధ్యాయములు) మందు మాత్రము త్రావగనే రోగియొక్క వ్యాధి సంపూర్ణముగ శమించిపోయెను. ఆహా! ఎట్టి అనుపమభేషజము! ఎట్టి అపూర్వ భిషగ్వర్యుడు! రోగియొక్క ముఖతః స్వయముగ వెలువడిన వాక్యములే యిందులకు నిదర్శనము-

మదనుగ్రహాయ పరమం గుహ్య మధ్యాత్మ సంజ్ఞితమ్
య త్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ. (11-1)

'ఓ శ్రీకృష్ణపరమాత్మా! నాపై అనుగ్రహము కలిగి ఏ అతి రహస్యమైన పరమజ్ఞానోపదేశమును తాము కావించితిరో ఏ అధ్యాత్మజ్ఞాన విషయికములగు మహావాక్యములను బోధించితిరో వానిచే నాయొక్క అజ్ఞానమంతయు పలాయనమై పోయినది' అని అర్జునుడు తన స్వానుభవమును బాహాటముగ వెల్లడించెను. ఇప్పటికి 10 అధ్యాయముల జ్ఞానోపదేశము మాత్రమే నడచినది. ఇంకను చాల చెప్పవలసియున్నది. అయినను ఆ కొంచెమే సద్యఃఫలితమును గలుగజేయజాలినది. అర్జునుని హృదయమున కలిగిన గొప్ప ఆధ్యాత్మిక పరిణామమే అతడుచ్చరించిన పై వాక్యములందు తెల్లగ ద్యోతకమగుచున్నది. మందు బాగుగ పనిచేసినది. రక్తనాళములందు ప్రవేశించి రోగక్రిములను సంహరించివేసినది. విరోధాణువులను రూపుమాపినది. ఫలితము పూర్ణారోగ్యము.

గీతాపాఠకులలో చాలమందికి అర్జునుని మోహము (అజ్ఞానము) భగవద్గీత 18 అధ్యాయములు వినిన తరువాత చిట్టచివరకు ['నష్టోమోహః' నా అజ్ఞానము వినష్టమైనది- అను వాక్య ముచ్చరించు సమయమున] నశించినది యను అభి ప్రాయము కలదు. కాని అంతదూరము పోనక్కఱలేదు. అర్జునుని మాయా మోహాంధకారము బోధమధ్యకాలముననే అంతరించిపోయినట్లు అతని స్వానుభవ వాక్యములద్వారా ఋజువగుచున్నది. ఈ అధ్యాయ ప్రారంభములో అర్జునుని భవరోగ వినాశమునకు సంబంధించిన ప్రబలప్రమాణము లభించుచున్నది. గురువునకు బోధనాశక్తి అవసరమైనట్లు శిష్యునకు గ్రహణ, ధారణాశక్తియు అవసరమైయున్నది. శిష్యునకు అట్టి శక్తి లేనిచో గురుబోధ బధిరశంఖారావ సదృశమై వ్యర్థమైపోగలదు. టెలిఫోనులో మాట్లాడువాడు యంత్రమును నోటియెదుట ఉంచుకొని మాట్లాడవలెను. విను వాడు యంత్రము (Receiver) ను చెవిలో పెట్టుకొని విన వలెను. అపుడుమాత్రమే సమాచారప్రచారము, సమాచార శ్రవణము సంభవించును. కృష్ణుడు ఏకాగ్రతతో చెప్పెను. అర్జునుడు ఏకాగ్రతతో వినెను. కార్యము ఫలించెను. ధృత రాష్ట్రుడున్ను వినెను. కాని యతనికి భక్తిశ్రద్ధలు సున్న. అందుచే నాతనివిషయమున బోధ నిష్ఫలమై పోయెను.

ఒకే గురుబోధ శిష్యులమనస్తత్త్వము ననుసరించి వారి యందు భిన్నభిన్నముగ ప్రతిఫలించుచుండును. పూర్వము దేవ తల ప్రతినిధియొకడు, మనుష్యుల ప్రతినిధియొకడు, రాక్షసుల ప్రతినిధియొకడు బోధనిమిత్తము ప్రజాపతికడ కేగిరి. ప్రజాపతి

యగు ఆ బ్రహ్మదేవుడు 'ద, ద, ద' అని పలికి అంతర్థానమై పోయెను. అంతట దేవత యిట్లాలోచించెను - బ్రహ్మదేవుడు వచించిన 'ద' కారము యొక్క అర్థమేమైయుండును? దేవతల మగు మేము భోగవిలాసములలో మునిగి ఇంద్రియనిగ్రహము తప్పియున్న కారణముచే బహుశః బ్రహ్మదేవుడు 'నాయన లారా! దమము(ఇంద్రియనిగ్రహము) గలిగియుండుడని మాకు బోధించి యుండవచ్చును' అని తలంచి అప్పటినుండియు దమన శీలురై వర్తింపసాగిరి. మనుష్యు డిట్లు విచారింపసాగెను. మానవులగు మనము పిసినిగొట్టుతనము కలిగి దానధర్మములు చేయక వర్తించుచున్నాము. బ్రహ్మదేవుడు బహుశః మనల నుద్దేశించియే 'నాయనలారా! మీరు దానముచేయుడు' అని 'ద' కారముద్వారా హెచ్చరించి యుండవచ్చునని నిశ్చయించి అప్పటినుండి దానశీలురై మెలంగసాగిరి. అంతట రాక్షసు డిట్లు తలపోయసాగెను - 'మనము క్రూరస్వభావము కల వారము. ఒకరిని హింసించుటయే మన పద్ధతి. కావున బ్రహ్మ దేవుడు బహుశః మనల నుద్దేశించియే 'ఓజీవులారా! 'దయ' కలిగియుండుడు అని 'ద' కారోచ్చారణద్వారా తెలిపియుండ వచ్చునని భావించి అప్పటినుండియు దయాశీలురై వర్తింప సాగిరి. చూచితిరా! ఒకే అక్షరము, ఒకేవాక్యము, భిన్న చిత్తవృత్తులు కలవారియం దెట్లట్లు ప్రతిబింబించినదో! కావున హృదయ మెంత నిర్మలముగ నుండునో, శ్రద్ధాభక్తియుతమై యలరుచుండునో గురుబోధ అంత తొన్నగ, అంత శీఘ్రముగ సఫలత్వమును గలుగజేయుచుండును. అర్జును డట్టి శ్రద్ధా భక్తులు కలిగియుండెను గావున బోధ వెంటనే ఫలించినది.

వేఁకొనిన అంచనాకంటె ముందుగనే కార్యము నెరవేరినది. బోధకుని బోధనావిశిష్టత్వము, బోధితుని శ్రద్ధాపూర్వకమగు తీవ్ర ఆధ్యాత్మిక ఆకాంక్ష, బోధయొక్క అమృతపటిమ-యీ మూడును ఏకీభవించినచో ఇక ఫలితము విషయమై వేఱుగ జెప్పవలెనా ?

ఈ ప్రకారముగ 10 అధ్యాయముల గీతామృతపాన మాత్రముచే అర్జునుని మానసికవ్యథ ఉపశమింప జ్ఞానముద యించెను. మోహ మంతరించిపోయెను. అత్తఱి యాతనికి సర్వేశ్వరునియొక్క విశ్వవ్యాపక స్వరూపమును కళ్ళారచూడ వలెననుకాంక్ష పొడమెను. భగవంతుని విభూతులలో కొన్ని టిని ఇప్పుడే యాతడు వినియుండెను. అనగా వ్యష్టిరూపములగు పదార్థములను తెలిసికొనెను. విజ్ఞుల మనస్సు ఎల్లప్పుడును ఊర్ధ్వగాములై పరుగిడుచుండును. కావున అర్జునుని చిత్తము వ్యష్టి నెఱిఁగిన వెనువెంటనే సమష్టిపైకి ఉరికెను. 'ఓ కృష్ణా! నీ విభూతులను విని యానందించితిని. ఇక, ఆ విభూతులన్నియు ఎచ్చోటను నాశ్రయించుకొనియున్నవో, ఆ నీ విశ్వవ్యాపక దివ్యస్వరూపమును, సమష్టితత్త్వమును, ఒకపర్యాయము చూడ బుద్ధి పొడముచున్నది. చూచుటకు నేనర్హుడనని నీవు భావించినచో దయచేసి చూపుము' అని అర్జునుడు భగవానుని ప్రార్థించెను. శ్రీకృష్ణమూర్తి తక్షణమే అంగీకరించెను. అనగా అర్జీ దాఖలుచేసిన వెంటనే 'ఆర్డరు' వచ్చెనని భావము. మఱి యొకరైనచో శ్రీకృష్ణుడు తటపటాయించెడివాడేమో, కాని అర్జునుడు ఉత్తమాధికారి, మఱియు 'ఇష్టోఽసి మే దృఢమితి'- నీవు నాకు చాల ప్రియుడవు అని భగవాను డిదివఱలో

చెప్పియేయున్నందున గీతాచార్యుని దృష్టియందు అర్జునుడు విశిష్టస్థానము నాక్రమించుకొనియే యున్నాడు. అందుచేత అడుగుటయే తడవుగా అతిదుర్లభమైనట్టిదియు, దేవతలకుకూడ అందుబాటులోలేనిదియు 'సుదుర్దర్శనమై' నదియు నగు విశ్వరూపమును భగవాను డర్జునునకు చూపింప సమకట్టెను.

ఈ విశ్వరూపమును అందఱును చూడగలరా? అను ప్రశ్నకు 'చూడలేరు' అని భగవానుడు ఖచ్చితముగ చెప్పివైచెను.

న తు మాం శక్యసే ద్రష్టుమనేనైవ స్వచక్షుషా
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్. (11-8)

'ఓ అర్జునా! ఈచర్మచక్షువుచే నీవునాయొక్క విశ్వరూపమును చూడలేవు. కావున దివ్యనేత్రమును (జ్ఞానదృష్టిని) నీకొసంగుచున్నాను. దానిచే నీవా యీశ్వరరూపమును గాంచుము'అని విశ్వరూప సందర్శనమునకు ముందుగా అధికారినిరూపణము గావించెను. జ్ఞానదృష్టి, జ్ఞాననేత్రము ఎవరు కలిగియుందురో అట్టివారెవరైననుసరియే భగవత్స్వరూపమును వీక్షించగలరు. చర్మనేత్రములచే, ప్రాకృతబుద్ధిచే, అజ్ఞానదృష్టిచే ఎవరును దైవమును వీక్షింపలేరు. నీటిలోకోట్లకొలది అతిసూక్ష్మములగు క్రిములుండును. వానిని నేత్రములచే మనము చూడజాలము. భూతద్దము వేసుకొని చూచినచో మాత్రమే అవి కనిపించును. అట్లే ఆకాశములో అగణితములైన చిన్న చిన్న నక్షత్రములు అసంఖ్యాకములు కలవు. 'పాలవీధి' **(Milky way)** అని చెప్పబడు నక్షత్రపుంజము ఆకాశములో పాలు అలికినట్లుగా తెల్లగ కనిపించునేకాని విడివిడిగ కనిపించవు. శక్తివంతమైన గొప్ప

దూరదర్శినియంత్రము (Telescope) తో చూచినచో అవి వేఱ్వేఱుగ స్పష్టముగ గోచరించును. శరీరముయొక్క ఉపరిభాగమును వీక్షించినచో లోపలనున్న ఎముకలు మొదలైనవి కానిపించవు. 'ఎక్స్‌రే' ('X'ray) అను యంత్రముగుండా చూచినచో అవి అన్నియు దృగ్గోచరములగును. స్థూలములగు పాంచభౌతిక పదార్థములవిషయమే యిట్లుండ, ఇక సూక్ష్మాతిసూక్ష్మరూపుడగు భగవంతుని విషయమై వేఱుగ చెప్పవలెనా? కనుకనే ఈ ప్రాకృత నేత్రములచే జనులు తన్ను చూడజాలరని భగవానుడు స్పష్టముగ చెప్పివైచెను.

దేవుడున్నాడా? ఉన్నచో మాకేల కనిపించడు? మాకు కనిపించుటలేదుకనుక అతడులేనేలేడని మేమునమ్ముచున్నాము అని నాస్తికులు చెప్పుచున్నారు. కనిపించనివస్తువే లేదనుట సిద్ధాంతమైనచో, వాయువు కనిపించునా ? ఆకాశము కనిపించునా ? వెయ్యేల, తనకన్ను తనకు కనిపించునా? తన నడినెత్తి తనకు కనిపించునా? తనవీపు తనకు కనిపించునా? పగలు నక్షత్రములు కనిపించునా? అంతమాత్రముచేత అవి లేవనవచ్చునా ? ఈ స్థూలనేత్రములేనా మనకు ప్రమాణములు! కాదు. వివేకనేత్రముతో చూడవలెను. జ్ఞానదృష్టితో వీక్షించవలెను. పాలలోని వెన్న స్థూలనేత్రములకు గోచరించదు. వివేకనేత్రములకు గోచరించును. పుష్పమాలలోని దారము చర్మచక్షువులకుకానరాదు. వివేకనేత్రముతో చూచిన కానవచ్చును. కాబట్టి స్థూలనేత్రములకు గోచరింపనంతమాత్రముచే దేవుడు లేడని యెవరును చెప్పరాదు. సూర్యుడు దేదీప్యమానముగ వెలుగుచున్నను అంధుడు చూడజాలనట్లు భగవంతుడు సర్వత్ర

వ్యాపించియున్నప్పటికిని విజ్ఞాననేత్రవిహీను డాతనిని గాంచలేడు. కనుక భగవద్దర్శనాభిలాషులందఱున్ను సులోచనములు తెచ్చుకొనవలసియుండునని గీతాచార్యుడు ఆనతిచ్చియున్నాడు. అయితే అది బజారులో దొఱకు వస్తువుకాదు. ఎవరికివారే దానిని తయారుచేసికొనవలసియున్నది. మఱియు భగవత్కృపచే లభ్యము కావలసియున్నది. అదియే జ్ఞాననేత్రము. ఎన్నియో సాధనలుచేసి, ఇంద్రియ నిగ్రహమును సంపాదించి భక్తిప్రపత్తులచే భగవంతుని యనుగ్రహమును బడసినవారికి మాత్రమే అయ్యది లభ్యముకాగలదు. అర్జును డట్టి స్థితిని అలవరచుకొనెను గావున అయాచితముగ అతనికి భగవంతుని ద్వారా అట్టి దివ్యనేత్రము (Divine eye-sight) జ్ఞానదృష్టి సులోచనములు లభించినవి.

భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున (11-54)

'ఓ అర్జునా! అనన్యమగు భక్తిచే నాయొక్క ఈ విశ్వరూపమును చూచుటకు వీలుపడును' అని భగవాను డీ అధ్యాయమున తెలిపియున్నాడు. కావున - ఒక్క అర్జుననకే కాదు, ఎవరికైనను అట్టి అనన్యభక్తిరూప సాధనను సమకూర్చుకొనినచో భగవద్దర్శనము లభ్యము కాగలదని స్పష్టమగుచున్నది. కావున దేవుని యస్థిత్వమునుగూర్చియు, దేవదర్శనమునుగూర్చియు ప్రశ్నించువారు ముందుగా దానికి అవసరమైన ఆధ్యాత్మిక సామగ్రిని చేకూర్చుకొనవలసియున్నది.

అర్జునునకు దివ్యదృష్టి ప్రసాదించినపిదప శ్రీకృష్ణపరమాత్మ అతనికి తన విశ్వరూపమును జూపెను. అనేక బాహు

వులు, ముఖములు, నేత్రములు కలదై, సర్వత్ర వ్యాపించి యున్నదై, కోటిసూర్యప్రభాభాసమానంబై యలరుచు ఆ దివ్యస్వరూప మాతనికి గోచరించెను. పరమాత్మయొక్క అనంతస్వరూపమున బ్రహ్మాండమంతయు ఏకదేశమున నున్నదిగ నతనికి కానిపించెను. (తత్రైకస్థం జగత్కృత్స్నం) అనగా ఒకానొక అవయవముపగిది, ఒకానొక అంశమువాడ్కి గోచరించెనని భావము. దీనినిబట్టి భగవంతునిస్వరూపము ప్రపంచమంతయును వ్యాపించి ప్రపంచమును దాటికూడ వర్తించుచున్నదని సుస్పష్టము. దృశ్యమంతయు మాయాంతర్గతము, పరమాత్మ మాయాతీతుడు (తమసస్తుపారే). కావున దృశ్యమంతయును వ్యాపించి దృశ్యాతీతుడుగ నతడు వెలయుచున్నాడు. పరమాత్మయొక్క యిట్టి అనంతస్వరూపభావన మనస్సును సువిశాల మొనర్పగలదు. సంకుచితమైన భావములనుండి తప్పించి పరిధులను దాటించి, విశాల దైవవాతావరణమునందది ప్రవేశపెట్టగలదు.

మానవుడు ప్రారంభస్థితిలో ఏ చెట్టునో, పుట్టనో, విగ్రహమునో పూజించుచుండును. అది మంచిదేకాని, ఎల్లప్పుడు అదే స్థితిలో నుండుట చాలదు. ఇంకను పైకిపోవలెను. దైవముయొక్కస్వరూపము సువిశాలమని, ప్రపంచవ్యాప్తమని తెలిసికొని, అట్టి విరాడ్రూపమును అర్చించవలెను. ఆ విరాడ్రూపములో సమస్త చరాచరప్రాణికోట్లు యిమిడియున్నవి. కావున, అత్తఱి భూతదయ లెస్సగ అలవడును. ఒకప్రాణిని క్లేశపెట్టినచో దైవమునకు అపచారముచేసినట్లే యను భావ మపుడు పొడమును. మఱియు దేవు డెల్లెడల వ్యాపించియున్నాడు.

కావున తాను చేయు పుణ్యపాపములు యావత్తు అతడు గమనించుచునేయున్నాడను సత్యమును గ్రహించియుండుటచే పాపమెన్నటికిని చేయకుండును. ఇక్కాలమున 'భగవంతుడు సర్వవ్యాపి'అని వాచాగా పెక్కురు నమ్ముచున్నారే కాని అనుభవపూర్వకముగగాదు. మఱికొందఱు అసలుదేవుడనగా ఏ దేవాలయములోనో, ఏ కొండమీదో, ఏ తీర్థమందో, ఏ స్వర్గములోనో, ఏ వైకుంఠములోనో మాత్రము తిష్ఠవేసికొని యుండువాడని తలంచుచుందురు. అట్టివారు ఆ యా పుణ్యప్రదేశములందే తప్ప తక్కినచోట్ల పాపాచరణముచేయుచుందురు. ఇది చాల పొరపాటు. దైవమునుగూర్చిన సంకుచితభావములే ఇట్టి లోపములకుదారితీయును. విగ్రహాదులు ప్రారంభస్థితిలోనున్న వారికి చిత్తైకాగ్రత, భక్తిభావము నలవఱచుటకొఱకుఏర్పడినవని మఱువరాదు. క్రమముగ మనస్సును విశాలమొనర్చి విశ్వమంతటను దైవముయొక్క అస్తిత్వముకలదని నిశ్చయించుకొనవలెను. గీతయందలి యీవిశ్వరూప సందర్శనయోగముయొక్క అభిప్రాయ మిదియే. సాధకుల మనస్సును అల్పములగు పరిధులను దాటించుటయే దానియొక్క లక్ష్యము. భగవానుని యీ సర్వవ్యాపకత్వమును ప్రతివారు అనుభవపూర్వకముగ గ్రహించవలెనేకాని నోటిమాటలతో కాదు.

పూర్వ మొక గురువుండెడివాడు. అతనికి పదిమంది శిష్యులు కలరు. వారందఱికిని ప్రతిరోజు భగవత్తత్త్వమును గుఱించి గురువు బోధించుచుండెడివాడు. 'పరమాత్మ సర్వవ్యాపకుడు, అణువు అణువునందును ప్రకాశించుచున్నాడు, జీవుల పుణ్యపాపములను గమనించుచున్నాడు.'-అని యీ

ప్రకారముగ వానికి జ్ఞానోపదేశము చేయుచుండెను. తాను బోధించిన తత్త్వమును శిష్యు లెంతవఱకు గ్రహింపగల్గిరో పరీక్షింపవలెనని నిశ్చయించి ఒకనా డాగురువు తన పదిమంది శిష్యులను దగ్గఱకు పిలిచి, ఒక్కొక్కరికి ఒక్కొక్క అరటి పండునిచ్చి 'ఎవ్వరును చూడకుండ తినిరండు' అని చెప్పి అంద ఱిని పంపివేసెను. వారందఱు గురుభక్తులు కనుక గురువాక్య మును తు. చ. తప్పకుండా ఆచరించవలెనని కృతనిశ్చయులై వెడలిరి. ఒకడు ఏకాంతముగనున్న ఒక కుటీరములో ప్రవే శించి తలుపులువేసికొని ఎవరును చూడకుండ పండును అమాంతముగ తినివైచెను. మఱియొకడు నిర్జనమగు కీకా రణ్యమున జొరబడి ఇటునటుచూచి ఎవరులేరని నిశ్చయించు కొని గురుదత్తమగు ఆ కదళీఫలమును 'స్వాహా' చేసెను. వేఱొకడు మింటినంటుచున్న ఎత్తైనవృక్షము నధిరోహించి, చిటారుకొమ్మకు ఎగబ్రాకి 'ఇదిగదా ఎవరును కానరాని చోటు,' అని భావించి అచ్చోట తీరికగ కూర్చొని అరటిపండు నారగించెను. ఇంకొకడు భూతలముపై ఎట జూచినను ప్రాణి కోట్లు తిరుగాడుచున్నవి. ఎవరుచూడనిచోటు ఇటసాధ్యపడదు. గురువాక్యమును లెస్సగ పాలించవలెను. అని యోచించి నీటిలోమునిగి పండుపని తృటిలో పూర్తిచేసికొని బయటకు విచ్చేసెను. ఈ ప్రకారముగ వారివారి ఊహలనుబట్టి ఒక్కొ క్కరు ఒక్కొక్కవిధముగ ఆచరించి తుదకుఅందఱును గురువు యొద్దకు చేరిరి. వారందఱున్ను ఫలమును భుజించియే వచ్చిరి. కాని అందొక్కడు మాత్రము భుజింపక పండును వెంటదీసి కొని వచ్చెను. "ఏమిరా నాయనలారా! నేను చెప్పినట్లు

చేసినారా ?' అని గురువు అందఱిని ప్రశ్నింప 'అట్లే చేసినాము. తమవాక్యము పొల్లుపోకుండ చూచినాము' అని తొమ్మిదిమంది చెప్పిరి. పండును వెంట తెచ్చినవాడు మాత్రము 'మహాత్మా! తమ ఆజ్ఞను నేను పాలింపలేకపోయితిని. క్షమింపుడు! ఎవరును చూడనిచోటు నాకు దొఱకలేదు. ఊరూరు తిరిగితిని. పల్లె పల్లె గాలించితిని. కాని ఎచటచూచినను చరాచర ప్రాణికోట్లంతటను వ్యాపించి బ్రహ్మాండమంతయు నిండి నిబిడీకృతమై విలసిల్లుచున్న పరమాత్మయే గోచరించుచున్నాడు. ఆతడు చూచుచుండ నేనెట్లు భుజింతును ? తమరు మొన్న నే దైవతత్త్వమును గుఱించి ఆప్రకారముగ మాకు బోధించి యున్నారుకదా ! ఆ బోధయే నాహృదయఫలకమున సదా మెఱయుచున్నది.' అని గురువుతో విన్నవించుకొనెను. ఆ వాక్యములను విని గురుదేవుడు తక్కిన శిష్యుల నందఱిని ఉద్దేశించి యిట్లు పలికెను- 'పరమానంద శిష్యులు అంటే మీరేరా! మీరందరు సోమరులు. చెప్పిన బోధను ఆచరణయందుంచలేని వారు. మీరు భుక్తికొఱకు వచ్చినవారేకాని ముక్తికొఱకు గాదు. మీలో నిగ్గుతేరినది ఈత డొకడే. దేవుడు లేనిచోటు ఏదియైన కలదా! కావున ఎవ్వరును చూడకుండ మీరెట్లు భుజింపకలరు?' అని వారిని మందలించి ఇకమీదట చెప్పిన బోధను బాగుగ జీర్ణము చేసికొనులాగున హెచ్చరించిరి.

ఈ ప్రకారముగ భగవానుని విశ్వరూపతత్త్వమును బాగుగ తెలిసికొనినవాడు సర్వత్ర దైవముయొక్క ఉనికిని అనుభూత మొనర్చుకొనుచు పాపాచరణములేక యుండును. సర్వప్రాణులయెడల దయగలిగి యుండును. ఎవరితోను విరో

ధము, వైరము లేక యుండును. సామాన్యజనులు ప్రపంచ మును విభక్తముగ గాంచుదురు. సృష్టిని ముక్కలు ముక్కలుగ జేసి ఏముక్క కాముక్కను విడివిడిగా జూచుదురు. అందుచే క్రోధము, ద్వేషము మున్నగునవి సంభవించుచున్నవి. పరప్రాణులయెడల అసూయ జనించుచున్నది. కాని 'పరప్రాణియెవడు ? నే నెవడను ? అందఱము విరాట్స్వరూపుని అవయవములమే. మనందఱిది ఒకే అవిభక్త స్వరూపము' అను సత్యమెఱుఁగువాడిక ద్వేషమునకు తావెట్లీయ గలడు ? ఒకే శరీరములో చేయి, కాలు, ముక్కు, కన్ను వేఱువేఱుగా కనిపించినప్పటికిని వాస్తవముగ ఒకే రూపము లోని వివిధాంగములే యగును. చేయి కాలితో కొట్లాడదు. కాలు కంటితో పోట్లాడదు. ఏల యనిన అన్నియు ఒకే మానవుని వివిధస్వరూపములు. భిన్నత్వములో ఏకత్వమును వీక్షించుటయే జ్ఞానము.

అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్. (18-20)

"విభజింపబడిన వస్తువులందు అవిభక్తత్వమునుజూచుట యేది కలదో అదియే సాత్త్వికజ్ఞానమ'ని గీతాచార్యుడు స్పష్టముగ తెలిపియుండెను. కనుకనే మహనీయులు 'ఒకరిని నీవు ద్వేషించినచో నిన్ను నీవే ద్వేషించినట్లగును' అని సెలవిచ్చిరి. ఇది పరమ సత్యము.

ఆత్మానం యది నిన్దన్తి నిన్దన్తి స్వయమేవహి
శరీరం యది నిన్దన్తి సహాయాస్తే మతా మమ.

"ఎవరినైనను నీవు నిందించినచో అతని ఆత్మను నిందించుచున్నావా ? లేక శరీరమును నిందించుచున్నావా? అను ప్రశ్న

ఉదయించును. అతని ఆత్మనేకనుక నిందించినట్లైన నిన్ను నీవే నిందించుకొనుచున్నావని అర్థము. (అందఱి ఆత్మ ఒకటే కావున). అతని శరీరమును నిందించినట్లైన, అది యాతని వైరాగ్యమునకు సహాయకారియే యగును. (శరీరము రక్త మాంసాదులతో గూడి నింద్యము కావున)' - మహానీయు లీ ప్రకారముగ విశ్వముయొక్క, సర్వజీవరాసులయొక్క ఏకత్వమునే ప్రతిపాదించుచుందురు. తోటిమానవులను నీవలె చూచుకొనుచు వారియెడ దయచూపుమని చెప్పుటయే కాక శాస్త్రములు ఇంకను పైకిపోయి జంతుజాలములందును పశుపక్ష్యాదులందునుగూడ ప్రేమగలిగి, వానియెడల దయార్ద్ర హృదయముతో వర్తింపవలసినదిగా బోధించుచున్నవి. భాగవతమున తెలుపబడిన పరమధర్మమును జూడుడు-

విసృజ్య స్మయమానాన్ స్వాన్ దృశం వ్రీడాం చ లౌకికీమ్
ప్రణమేద్దండవద్భూమా వాశ్వ చండాలగోఖరమ్. (భాగవతము)

'సిగ్గువదలి గుఱ్ఱము, చండాలుడు, గోవు, గాడిద-మున్నగు వానికిగూడా సాష్టాంగ నమస్కార మాచరింపవలయును'-దీని భావమేమి? ఉపాధిభావమును వదలి లోన వెలుగుచున్న అంతర్యామి పరమాత్మ చైతన్యమునకు వందన మాచరింపుమని బోధించుటయగును. అనేకత్వమును జూచువాడెపుడును వైర రాగాదులచే సంసారబంధనమునందు తగుల్కొనియే తీరును. అనేకత్వమునం దేకత్వమును వీక్షించువాడు బంధనమును విచ్ఛిన్న మొనర్చి కైవల్యపదవిని బొందగలడు.

మృత్యోస్స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి

'ఈ ప్రపంచమున భిన్నత్వమునుజూచువాడు జననమరణ రూపమగు సంసార చక్రమున తగుల్కొనును' అని ఉపనిషత్తు లుద్ఘోషించుచున్నవి. కాబట్టి ఈ విశ్వరూపసందర్శన యోగమున తెలుపబడిన చందమున భగవంతునియొక్క విరాడ్రూపమును దృష్టియందుంచుకొని లోకమున వ్యవహరించినచో మనుజునకు చక్కని శీలసంపత్తి ఉదయించగలదు. అసూయాద్వేషములు అంతరించిపోగలవు. అనన్యభక్తిభావము హృదయమున పొంగి పొరలుచుండును. ఇట్టి హృదయ నైర్మల్యమెప్పుడు చేకూరునో ఇక మోక్షము దరిదాపుననున్నట్లే. అనతికాలములోనే యాతడు తన వినిర్మలచిత్తమున ఆత్మానుభూతినిబడసి ధన్యుడు కాగలడు. ప్రారంభస్థితిలో వ్యష్టిరూపము నారాధించుట, తదుపరి సమష్టి రూపము నాశ్రయించుట, ఆ పిమ్మట వ్యష్టి సమష్టుల రెంటినిదాటి త్రిపుటీరహితమగు నామరూపవివర్జిత కేవలసచ్చిదానందపరమాత్మను సాక్షాత్కరించుకొనుట - ఇది సాధకునిదారి. కావున మొట్టమొదట (విభూతియోగమున తెలుపబడినటుల) భగవంతుని చెట్టునందు, పుట్టయందు పూజించుచు, క్రమముగ పైకిపోయి భగవంతుని విశ్వరూపమున భావించుచు, ఇంకను పైకిపోయి భగవంతునకు రూపమేలేదు, అఖండ ప్రజ్ఞాన ఘనస్వరూపమే యాతడు అని చింతించుచు ఉప్పుకల్లు సముద్రమున కలిసిపోవునట్లు, ధ్యేయమగు అట్టి పరమాత్మయందు కలసి ద్వైతవర్జితమగు కేవల పరమాత్మగ శేషించుటయే జీవుని చరమలక్ష్యము, పరమధర్మము.

ఈ ప్రకారముగ భగవంతుని విశ్వరూపముయొక్క భావన జీవుని ఆత్మోన్నతికి లెస్సగ ఉపకరించుచున్నది. పరమాత్మ దేశకాలాతీతుడు. అనంతదేశము, అనంతకాలము ఆతనియందు కల్పింపబడియున్నవి. అనంతదేశ మేప్రకారముగ భగవంతుని విశ్వరూపమున నొకచోట ఏకదేశమున కల్పితమైయున్నదో, (ఇహైకస్థం జగత్కృత్స్నం) అనంతకాలమున్ను ఆ ప్రకారముగనే నొకచోట విశ్వరూపమున కల్పింపబడియున్నది. ఈ సత్యమును శ్రీకృష్ణభగవానుడే ఈ యధ్యాయమందు స్వయముగ పొందుపఱచియున్నాడు.

ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథాఽన్యానపి యోధవీరాన్
మయా హతాం స్త్వం జహి మా వ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్. (11-34)

'ఓ అర్జునా! చూడుము! ఈ నా విశ్వరూపమున ద్రోణుడు, భీష్ముడు, జయద్రథుడు, కర్ణుడు, ఇంకను ఇతర యుద్ధవీరులు నా చేత ఇదివఱకే చంపబడియున్నట్లు కాంచగలవు. కావున నీవేమియు బెదరకుము, యుద్ధము చేయుము. శత్రువులను తప్పక జయింపగలవు' అని శ్రీకృష్ణమూర్తి యర్జునునితో పలికెను. యుద్ధమింకను ప్రారంభింపలేదు. ఒకరినొకరు ఇంకను కొట్టుకొనలేదు, తిట్టుకొనలేదు, చంపుకొనలేదు. అయినను, భీష్మద్రోణాదులు చచ్చిపడియున్న దృశ్యము విశ్వరూపమున జూపబడెను! అనగా జరుగబోవునది జరిగినట్లుగనే చిత్రింపబడెనని యర్థము. కాలాతీతునియందు భూతభవిష్యద్వర్తమానముల భేదముండదు. భూతము భవిష్యత్తు వర్తమానము

మూడును ఏకకాలముగనే యుండును. కనుక భగవంతుని యందు భవిష్యత్తు వర్తమానముగ తయారైనది.

పూర్వేషామపిగురుః కాలేనానవచ్ఛేదాత్. (పాతంజలి యోగసూత్రము) 'భగవంతుడు పూర్వీకులకున్ను గురువు అయియున్నాడు. ఏలయనిన, ఆతడు కాలముచే పరిచ్ఛిన్నము కానివాడు' అని పతంజలి ఈశ్వరునియొక్క నిర్వచనము గావించుచు కాలాతీతునిగ అతనిని వర్ణించినాడు. సామాన్యజను లందఱున్ను 'వర్తమానకాలము'లోనే నివసించుచుందురు. వారిదృష్టి వర్తమానమువఱకు మాత్రమే పరిమితమై యుండును. భవిష్యత్తునుగూర్చిన విచారణయే వారికి ఉండదు. కురుక్షేత్రమున రణరంగమున సమావేశమైన యోధులలో పెక్కురికి భీష్మద్రోణాదులు జీవించియున్న వర్తమానకాలమే కండ్లకు కనిపించుచుండెనుగాని వారు మరణించిన భవిష్యత్కాలము కాదు. శ్రీకృష్ణమూర్తియొక్క దృష్టి భవిష్యత్తుపై ప్రసరిల్లినది. మహాత్ములదృష్టి చాల ముందునకు పరుగులిడుచుండును. వారిది దూరదృష్టి. తక్కినవారిది హ్రస్వదృష్టి. అజ్ఞాను లిట్టి హ్రస్వదృష్టివలననే కూపస్థమండూకములుగ ప్రవర్తించుచు, వర్తమానమే పరమగమ్యముగ భావించుచు, తినుట, త్రాగుట, గంతులిడుట వీనిలోనే కాలయాపన చేయుచుందురు. విజ్ఞాను లట్లుకాదు. వారు దీర్ఘముగ యోచింతురు. 'ఈ శరీరము ఇపుడు రమ్యముగ నున్నది. మంచిదే కాని ఎప్పుడును ఇట్లే యుండునా? కొంతకాలమునకు ఏమైపోవును? ముడుతలించుకొనిపోవును. ఈ జుట్టు నల్లగ కాటుకవలె, భ్రమరమువలె, ఉంగరములు తిరిగి మిసమిసలాడుచు సొంపును

వెలిగ్రక్కుచున్నది. కాని ఎప్పుడును ఇట్లే యుండునా? భవిష్య త్కాలములో, వార్ధక్యములో తెల్లబడి వికృతరూపమును ధరించును.' మహాత్ము లీ ప్రకారముగ వర్తమానస్థితినుండి గంతువేసి భవిష్యదాలోచనచేయుచు దేహాదులందు అభిమానమును, మమత్వమును వీడి వైరాగ్యయుతులై, దేశకాలాదులకు లోబడని అవికార చిదాత్మనుమాత్రము ఆశ్రయించి ధన్యులగుదురు.

పూర్వకాలమున శుద్ధోదనమహారాజు తనకుమారుడగు బుద్ధదేవుడు సన్న్యసించి భిక్షాటన మొనర్చుచు గ్రామగ్రామములందును సంచరించుచున్నాడని విని, చాల దుఃఖించి ఈ క్రింది సందేశ మతనికి ఒకానొక వార్తాహరునిద్వారా పంపెను. 'నాయనా! నీవు మహారాజుల కుటుంబమునందు జన్మించితివి; రాజపాలన నీ జన్మహక్కు; భోగైశ్వర్యములు నీపంతు; నా తండ్రి రాజాధిరాజు; నాతండ్రి తండ్రి మహారాజు; నేనున్ను రారాజును. ఇక నాకు బుట్టిన నీవున్ను రాజువేకాని మఱియొక డెట్లగుదువు. బాగుగ యోచించుకొనుము. బిచ్చగానివలె తిరుగుచు దౌర్భాగ్యజీవితము గడుపకుము. వెంటనే తిరిగి రమ్ము. నీ జన్మహక్కగు సామ్రాజ్యాధిపత్యమును స్వీకరింపుము.' తండ్రి యాదేశమును విని బుద్ధదేవుడు తీవ్రముగ యోచించి యా వార్తాహరునిద్వారా మరల ఈ క్రింది సందేశమును జనకునకు పంపివైచెను - బుద్ధుని మహత్తరమగు యీ దివ్యసందేశము ముముక్షువు లెల్లరకును వెలుగును ప్రసాదించునది కావున దానిని తప్పక గమనించవలసియున్నది.

'తండ్రీ ! నీవు మహారాజువు, నిజమే. పూర్వజన్మలో కూడ నీవు మహారాజువే. అంతకు పూర్వజన్మలోకూడ నీవు మహారాజువే. నేనో నా పూర్వజన్మలో సన్న్యాసి. అంతకు పూర్వజన్మలో సన్న్యాసి. ఇపుడును సన్న్యాసి నైతిని. నీది మహారాజపరంపర; నాది భిక్షుపరంపర. ఎవరిదారి వారిదే. ఏదియో కాకతాళీయముగ, లేక ఋణానుబంధముచే ఈ జన్మ యందు మనమిరువురము కలిసికొంటిమి. ఈ కలయిక మరల యెక్కువకాలముండదు. మరణానంతరము తిరిగి నీదారి నీదే, నాదారి నాదే. ఒక నదీప్రవాహమున అనేకములగు పుల్లలు, చెత్త, చెదారం కొట్టుకొని పోవుచుండును. ఒక్క క్షణకాలమున ఏవియో రెండుపుల్లలు కలిసికొని మరల తరంగముల తాకిడికి వెంటనే విడిపోవును.

ఇదం కాష్ఠమిదం కాష్ఠం నద్యాం వహతి సంగతః
సంయోగాచ్చ వియోగాచ్చ కా తత్ర పరిదేవనా.

సంసారమున జీవులయొక్క స్థితియు అట్టి ప్రవాహస్థకాష్ఠముల పగిదియేయుండును. పూర్వజన్మములందు ఎక్కడెక్కడనున్న వారో వచ్చి ఒకే కుటుంబమునందు జేరి కొంతకాలము జగన్నాటకమాడి ఎవరిదారిన వారు చక్కాపోవుదురు. కావున విజ్ఞులగువారు ఇట్టి సంయోగ వియోగములకు దుఃఖింపరాదు. పై పెచ్చు నీ మహారాజత్వమునకే కాలమందును భంగము కలుగలేదు. నీ రాజపరంపర తెగకుండగనే వచ్చుచున్నది. అట్టిచో నా సన్న్యాసి పరంపర ఏల తెగవలెను ?

పోనిండు, నాపై మక్కువచే నన్నచటికి ఆహ్వానము చేయుచున్నారేమో, మంచిది. అట్లే వచ్చెదను కాని-

న భవేన్మరణాయ జీవితం మే
విహరేత్ స్వాస్థ్య మిదం చ మే న రోగః
న చ యౌవనమాక్షి పేజ్జరా మే
న చ సంపత్తిమిమాం హరేద్విపత్తిః.

'తండ్రీ! నాకు మరణము ఎన్నడును కలుగకుండ చేయవలెను. అట్లు నీవు చేయగలవా? చేయగలశక్తి నీకు ఉండిననే నన్నాహ్వానింపుము. పోనీ, నాకు రోగమెన్నడును జీవితములో సంభవింపకుండ చేయగలవా? అట్లు చేయగలస్తోమత నీకుండిననే నన్ను పిలువుము. పోనీ, నాకు ముసలితనము రాకుండ చేయగలవా? అట్టి అలౌకికశక్తి నీకున్నదా? ఉండినచో నేను వచ్చుటకు ఏ ఆక్షేపణయులేదు. పోనీ,నాకువిపత్తు లేకాలమునందును సంభవింపక ఎల్లప్పుడు, సదా సర్వకాలములందును సంపదలయందే మునిగియుండులాగున చేయగల ధీమా నీ కున్నదా? ఈ నా ప్రశ్నలకు ముందుగా జవాబీయుము. తదుపరి నా రాక విషయమై ఆలోచించెదను'-అను ఈ వాక్యములను బుద్ధదేవుడు వార్తాహరునిద్వారా తనతండ్రియగు శుద్ధోదనునకు తెలిపెను. తనయుని విజ్ఞానభరితములగు అమృతవాక్యములను విని శుద్ధోదనుడు నిరుత్తరుడై తన యాలోచనను విరమించుకొనెను.

శుద్ధోదనుడు భవిష్యత్కాలమునుగూర్చి విచారింప లేదు. మృత్యువు అనునది ఒకటి యున్నదని పూర్తిగ మఱచి పోయెను. రోగము, వార్ధక్యము, విపత్తులు-వీనినిగూడ మఱచి పోయెను. బుద్ధదేవుడు దూరదృష్టిగలిగి, భవిష్యత్కాలమును సంస్మరించి, రాబోవు మహావిపత్కర పరిస్థితులను తండ్రికి జ్ఞాపకము చేసెను.

'Death is a most important event of life,
Man has sufficient time to know how to die'

'మృత్యువనునది జీవితములో అతి ముఖ్యమైన సంఘటన. తానెట్లు మరణించవలెనో ఆలోచించుటకు మనుజునకు బోలెడు సమయముకలదు'-అని యొక మహనీయుడు నుడివియున్నాడు. కావున విజ్ఞుడగువాడు తన జీవితకాలముననే మరణమును గూర్చి యోచించి, మరణరహితమగు అమృతపదవికి మార్గమును వెతకవలయును. భీష్ముడు ద్రోణుడు మున్నగువారు జీవించియుండగనే శ్రీకృష్ణపరమాత్మ అమాంతముగ భవిష్యత్కాలములోనికి దూకి వారి మృతదేహములను విశ్వరూపమున అర్జునునకు చూపెను. శ్రీకృష్ణమూర్తి వలెనే ఈప్రకారముగ వర్తమానమున భావికాలచిత్రములను చూడగల, లేక కనీసము ఊహించగల మానవులెవరైన కలరా? ఉన్నచో వారు ధన్యులు. మోక్షముయొక్క కీలకము వారికిలభించినదేయగును.

జనులు ప్రాపంచిక విషయ భోగలాలసులై అహర్నిశములు వానివెంటనే పరుగులిడుచుండుటకు హేతువేమి? ఏమియో మునిగిపోయినట్లు రోజంతయు ఊపిరి తిరుగకుండ లౌకిక కార్యకలాపములందు మగ్నులై యుండుటకు కారణమేమి? దైవమును విస్మరించుటకు, పాపకార్యములను చేయుటకు నిమిత్తమేమి? శబ్దస్పర్శాది విషయములు వారికి ఆనందముగ తోచుటకు కారణమేమి? ముందు జరుగబోవు దానిని మఱచుటయే కారణము. దూరదృష్టి లేకుండుటయే కారణము. మరణమును ఉపేక్షించుటయే కారణము.

స్వదన్తే తావదేవైతే భావా జగతి ధీమతే
యావత్స్మృతిపథంయాతి న వినాశ కురాక్షసః. (యోగవాసిష్ఠము)

"వినాశము,మృత్యువు అను దుష్టరాక్షసుడు జ్ఞాపకము రానంత వఱకే ఈ ప్రపంచమునందు పదార్థములు, భోగములు అన్నియు రుచించును. అది జ్ఞాపకమునకువచ్చెనా, ఇవియన్నియు చప్పబడిపోవును" అని వసిష్ఠులు శ్రీరామచంద్రునకు బోధించిరి.

యది జన్మజరామరణం న భవేత్
యది చేష్టవియోగభయం న భవేత్
యది సర్వమనిత్యమిదం న భవేత్
ఇహ జన్మని కస్య రతిర్న భవేత్.

"జన్మదుఃఖము, వార్ధక్యమరణబాధలులేనిచో, ఇష్టపదార్థముల యొక్క వియోగము సంభవించనిచో, ఈ సమస్త ప్రపంచము అనిత్యము కాకుండినచో, ఇక ఈజన్మమునందు (ఈసంసారమునందు) ఎవరికి ప్రీతియుండదు' అని మహనీయులు పలుకుచున్నారు. నిజమే,పైనచెప్పినదోషములులేనిచో యిక మోక్షమునకై జనులు ప్రయత్నింపవలసినపనియే లేదు. ముక్తి సర్వులకును ఈ దృశ్యపదార్థములందే దొరికియుండెడిది. కాని అట్లు లేదు. ఏది పుట్టినదో అది గిట్టుచున్నది. వికారములకు లోనగుచున్నది. కావుననే దృశ్యవస్తువుల యెడల విరక్తి గలిగి విజ్ఞానవంతులు నిర్వికారమై జననమరణ రహితమైనట్టి ఆత్మవస్తువు కొఱకు అన్వేషించుచున్నారు. పాంచభౌతికమగు యీ శరీరము ఎల్లప్పుడును నవయౌవనశ్రీని నోచుకొనలేదనియు, కొంతకాలమునకు శిథిలమై కృంగి కృశించి పోగలదనియు, మరికొంతకాలమునకు రూపమే లేకుండ తొలగిపోగలదనియు

(మృత్యుగ్రస్తమై పోవుననియు) ఎంచి వివేకవంతులగువారు యిప్పటినుండియే దైవసాక్షాత్కారముకొఱకు అహర్నిశములు పాటుపడవలెను.

తల్లిగర్భమున నున్నపుడు దాదాపు ఏడవమాసమున జీవునకు భగవానుడు క్షణకాలము దివ్యదృష్టిని ప్రసాదించునట! అత్తఱి తానింతవఱకు అనుభవించిన జన్మలన్నిటిని, పొందిన యాతన లన్నిటిని ఒక్కపర్యాయము సినిమాబొమ్మలనువలె తన చిత్తఫలకమున జూడగల్గును. అపుడు తత్క్షణమే యతనికి యీ సంసారముయెడల రోతగలిగి భగవానునకు నమస్కరించి యీ ప్రకారముగ ప్రార్థించును-'మహాప్రభో! దీనదయాళో! చాలు, చాలు! ఇక ఈ సంసార బాధలు చాలు! అయ్యో! ఎన్ని గర్భనరకము లనుభవించితిని. ఎన్ని యమయాతనలను స్వీకరించితిని! ఎన్ని ఘోరసంకటములను పొందితిని! అన్నియు చాలకనా మరల యిపుడు గర్భనరకము ననుభవించుచుండుట?

ధిగజ్ఞానం ధిగజ్ఞానం ధిక్కామక్రోధసంకటమ్
సంసారశృంఖలం ధిగ్గిగాచార్యాజ్ఞానమాప్నుయామ్. (గరుడపురాణము)

'అజ్ఞానమునకు ధిక్కారము! దుఃఖజనకములగు యీ కామక్రోధాదులకు ధిక్కారము! సంసారబంధనమునకు ధిక్కారము. ఇక నేను వీనిని వదలివైచి సద్గురువు నాశ్రయించి ఆత్మజ్ఞానమును బొందెదను. తండ్రీ! ప్రభో! నన్ను యీ బాధాకరమగు గర్భనరకమునుండి బయటకు త్రోసివేయుము. నేనిక తట్టుకొనలేను. ఈ గర్భమునుండి బయటకు రాగానే నేను

మహనీయుల చెంతజేరి నిన్ను పొందుటకు మార్గమును వెతకి కొందును!' అని ఈ ప్రకారముగ కడు దీనచిత్తముతో మొఱ పెట్టుకొనును. అందువలననే కాబోలు పుట్టునపుడు మానవుడు చేతులు రెండును కలిపి నమస్కరించుచున్న పద్ధతిలో నుండును. జీవుని యీ మొఱ ఆలకించి సర్వేశ్వరుడు కొలది దినములలో ఆ ప్రాణిని తల్లిగర్భమునుండి బయటకు త్రోసి వేయును. కాని తత్క్షణమే 'వైష్ణవీమాయ' ఆవరింప జీవుడు తానిదివఱలో చేసిన వాగ్దానములన్నిటిని మఱచిపోయి కేవలము విషయలంపటుడుగ నాస్తికుడుగ తయారగు చున్నాడు. సామాన్య మానవునియొద్ద చేసిన వాగ్దానమును భంగ మొనర్చుటయే గొప్ప యపరాధముగనుండ, యిక సాక్షాద్భగవంతునియొద్ద గావించిన ప్రతిజ్ఞను వమ్ము చేయుట ఎంత ఘోర అపచారము! కావున మహాశయులారా! ఇప్పటికైనను కాలము మించిపోలేదు. చేసిన ప్రతిజ్ఞను కార్యాన్వితమొనర్చుట సర్వజీవులయొక్క విధ్యుక్తధర్మము. కాబట్టి సద్గురువును శీఘ్రమే ఆశ్రయించి భవరోగమును బాపు కొనుటకు మార్గముల నన్వేషించవలయును. వార్ధక్య మరణములు బెబ్బులివలె పొంచియున్నవను సంగతిని ఎవరును మఱవ రాదు. ఆపదలు, రోగములు, వియోగదుఃఖములు మీదపడి జీవుని కొఱికి తినివేయుటకు సిద్ధముగనున్నవను సత్యమును విస్మరించరాదు. కావుననే శ్రీకృష్ణభగవానుడు తన విశ్వరూపమున బ్రతికియున్నవారి (భీష్మద్రోణాదుల) శవములను జూపించి "బహుపరాక్", 'తస్మాజ్జాగ్రత, జాగ్రత!' అని సర్వజీవులను హెచ్చరించెను. ఈ ప్రకారముగ భావికాలమున జరుగబోవు

మృత్యువును, వార్ధక్యమును ఇప్పుడే జ్ఞాపకము తెచ్చుకొని తదనుగుణ్యముగ వ్యవహరించి, ఆ జరామరణముల బారినుండి కలకాలము తప్పించుకొని పొవుటకై, భక్తిజ్ఞానాదులను క్షుణ్ణముగ అభ్యసించుచు రావలెను.

అర్జునుడు విశ్వరూపమును తిలకించి సంతుష్టాంతరంగుడైనను, అందు భయంకరదృశ్యములను వీక్షించుటచే భయకంపితుడై పూర్వపు ప్రశాంతరూపముతోనే తిరిగి సాక్షాత్కారమగునట్లు శ్రీకృష్ణుని వేడుకొనెను. అతడట్లే కావించి అర్జునుని శాంతపఱచెను. అటుపిదప భగవానుడు విశ్వరూపముయొక్క మహిమను సుదుర్దర్శత్వమును అర్జునునకు తెలిపి యానందపఱచెను.

భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున
జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుం చ పరన్తప. (11-54)

"ఓ అర్జునా! యజ్ఞయాగాదులచేగాని, తపస్సుచేగాని యిట్టి విశ్వరూపమును జనులు కాంచలేరు. అనన్యమగు భక్తిచేతనే దీనిని యథార్థముగ తెలిసికొనగలరు, చూడగలరు, ప్రవేశింపగలరు". దీనినిబట్టి భక్తియొక్క మహిమాతిశయమెట్టిదో మనమూహింపవచ్చును. సామాన్యజను లెవరును చేయజాలని పనిని అది సాధించివేయుచున్నది! సాక్షాద్భగవంతుని దర్శింపజేయుచున్నది. ఇంతకు మించి ఇక కావలసినది యేమున్నది? అయితే ఆ భక్తియొక్క విశేషణమగు 'అనన్య' అను పదమును బాగుగా జ్ఞప్తియందుంచుకొనవలసియున్నది. గీతయందీ 'అనన్య' పదము పెక్కుచోట్ల ప్రయోగింపబడినది. కావలెననియే అది అట్లు చేయబడినది. భక్తిచాలమందికి యుండును

గాని, అది అనన్యముగ, అవ్యభిచారముగనుండదు. సామాన్యముగ నుండును. అట్లుండుట మంచిదేకాని, ఎదురెదురుగ దైవమును చూచుటకు, లేక అనుభవించుటకు అది చాలదు. తీవ్రభక్తి, అచంచలభక్తి, అనన్యభక్తి అవసరము. అన్య మనగా ఇతరము. అనన్యమనగా ఇతరము లేనిది. దైవము తప్ప ఇతరమగు దేనియందును ప్రీతి లేనంతటిస్థితిని అనన్య భక్తి యందురు. సామాన్య మానవుని మనస్సు అనేక విభాగములు చేయబడి, ఒక్కొక్క విభాగము ఒక్కొక్క దృశ్య పదార్థముపై అర్పితమై పోవుచున్నది. ఇక దేవునకు ఏమియు మిగులుటలేదు. ఒకవేళ మిగిలినను $\frac{1}{10}$ భాగము మిగుల వచ్చును. ఇట్టిది అనన్యభక్తి ఎన్నటికిని కానేరదు. ప్రారంభమున ఒకింత భక్తియున్నను దానిని క్రమక్రమముగ నభివృద్ధి పఱచి నిప్పుయొక్క చిన్న మిణుగురును దూది, పుల్లలు మున్నగునవి వేయుటద్వారా క్రమముగ పెంచి మహాజ్వాలగా మార్చునట్లు-అనన్యభక్తిగ రూపొందించవలెను. చిత్తమున అనన్య దైవచింతనను ఏప్రకారముగ సాధింపవలెనో శ్రీ వసిష్ఠ మునీంద్రులు తెలిపిన పద్ధతిని ఆలకింపుడు-

చిత్తస్య భోగై ర్ద్వౌభాగౌ శాస్త్రేణైకం ప్రపూరయేత్
గురుశుశ్రూషయా చైక మవ్యుత్పన్నస్యసత్క్రమే. (యోగవాసిష్ఠము)

ప్రాథమికదశ యందు - సాధకు డవలంబించవలసిన పద్ధతి (Elementary Course):- మనస్సును నాలుగు భాగములుగ విభజించి రెండుభాగములను వారి వారి జీవనోపాధినిమత్తము లైన కర్మలందు(సంపాదన, భోజన, ఆశ్రమోచిత వ్యవహారము లందు) వినియోగించవలెను. ఒకభాగమును శాస్త్రవిచారణ,

యందును మిగిలిన ఒక భాగమును గురుసేవ, దైవసేవల యందును ఉపయోగించవలెను. $(\frac{1}{2}+\frac{1}{4}+\frac{1}{4}=1)$ దైవకార్యములందే నిరంతరము యత్నించినచో ఇక మా జీవన మెట్లు జరుగును ? మా భార్యాబిడ్డలను పోషించుకొనుటయెట్లు? అని ప్రశ్నించువారికి ఈ మార్గము అనుగుణ్యముగ నుండగలదు. కాని మానవుడు ఎల్లప్పుడును ఒకేస్థితియం దుండజాలడు. క్రమముగ సాధనచేతను, పురుషప్రయత్నముచేతను ఊర్ధ్వముగ కొనసాగిపోవును. కావున చిత్తము ఒకింత పరిపక్వము కాగా

కించిద్వ్యుత్పత్తియుక్తస్య భాగం భోగైః ప్రపూరయేత్
గురు శుశ్రూషయా భాగౌ భాగం శాస్త్రార్థ చిన్తయా.

మాధ్యమికదశయందు సాధకు డవలంబించవలసిన క్రమము (Secondary course):- మనస్సుయొక్క నాలుగుభాగములలో ఒక భాగమును శరీర, కుటుంబ నిర్వహణాదులందును, అత్యవసర లోకవ్యవహారములందును వినియోగించవలెను. రెండు భాగములను గురు దైవముల చింతనయందును, ఒక భాగమును శాస్త్రవిచారణయందును వాడుకొనవలెను. ఈ స్థితియందు సాధకుడు సాంసారికవ్యవహారములను తగ్గించుకొని ఆ శక్తిని, యుక్తిని, సమయమును భగవద్విచారణయందు ఖర్చుపెట్టుచుండును. ఒకింత మనఃపరిపాకమునొందిన విరక్తుల యొక్క దినచర్య యిట్లే యుండును. $(\frac{1}{4}+\frac{1}{2}+\frac{1}{4}=1)$ ఈ ప్రకారముగ సాధనచేయుచురాగా కాలక్రమమున చిత్తము ఉత్తమ పరిపాకమును బొందుచుండును. అత్రశ్లో-

వ్యుత్పత్తిమనుయాతస్య పూరయేచ్చేతసోఽన్వహం
ద్వౌభాగౌ శాస్త్రవైరాగ్యైర్ద్వౌధ్యానగురుపూజయా.

ఉత్తమదశయందు సాధకు డవలంబించవలసిన పద్ధతి (**Higher course**):-ముముక్షువు ఇక బాహ్యవ్యవహారములను కట్టిపెట్టి మనస్సుయొక్క రెండుభాగములను శాస్త్రవిచారణా వైరాగ్యములచేతను, తక్కిన రెండుభాగములను గురుపూజా, దైవ ధ్యానములచేతను నింపవలెను. ఇక నీతడు ప్రాపంచిక వ్యవహారములతో సంబంధమును పెట్టుకొనడు. ఏలయనిన, నిరంతరము దైవచింతనయందును, పరమార్థ విచారణయందును మనస్సు సంలగ్నమగుటచే ఇక విషయచింతనకు మనస్సులో చోటేలేకుండును. ($\frac{1}{2}+\frac{1}{2}=1$) గీతయందు తెలుపబడిన అనన్య భక్తియనగా నిట్టిదే. ఇట్టి తీవ్రతరభక్తి కలిగియున్నవానికే భగవద్దర్శనము లభింపగలదు. విశ్వరూపసందర్శన భాగ్యము చేకూరగలదు అని శ్రీకృష్ణపరమాత్మ సెలవిచ్చియున్నాడు.

సందర్శనమేకాదు, ప్రవేశనముకూడ లభించగలదని చెప్పబడినది. అనన్యభక్తిచే దేవుని తెలిసికొనుట, దేవుని చూచుట, దేవునియందు ప్రవేశించుట-అను నీ మూడున్ను సంభవింపగలవని గీతాచార్యుడు తెలిపెను (జ్ఞాతుం, ద్రష్టుం, ప్రవేష్టుం). ఈ ఒక్క వాక్యమునందు సాధకుని పారమార్థిక క్రమవికాసము లెస్సగ చిత్రింపబడినది. ప్రారంభమున శాస్త్ర గురువాక్యములద్వారా సాధకుడు భగవంతుడెట్టివాడో తెలిసికొనును. అత్తరి భగవంతుని చేరుటకు భక్తుడు తన ఆధ్యాత్మికయాత్రను ఉపక్రమించెనన్నమాట. ఉపక్రమించెనేకాని ఆతనిని ఇంకను సమీపించలేదు. కావుననే ఆతనిని తెలిసి కొనుట (జ్ఞాతుం) సంభవించెనేకాని చూచుట సంభవించలేదు. ఇది ప్రాథమికదశ, ద్వైతస్థితి. ఈ స్థితిలో భగవంతుడు వేఱు,

భక్తులు వేఱుగ నుండును. భక్తి మాత్రము కుంటువడక యుండును. కాని ఇట్టిస్థితి చాలదు. సాధనను, భక్తిని తీవ్రతర మొనర్చి ఇంకను ముందునకు కొనసాగి పోవలెను. ఇట్లు చేయుచుండ చిత్తపరిపక్వత ననుసరించి కొంతకాలమునకు దేవుని అతి సమీపమునకు వచ్చును. దేవుని స్పర్శించును. దేవునితో మాట్లాడును. దేవునిలో తానొక భాగముగా (అంశముగా) తయారగునంతటి దశకు వచ్చును. అత్తఱి దేవుని తెలిసికొనుట అను స్థితిని దాటినవాడై దేవుని ప్రత్యక్షముగ (face to face) చూచునట్టి స్థితికి వచ్చును. (ద్రష్టుం) ఇది మాధ్యమికదశ. విశిష్టాద్వైత స్థితితో దీనిని పోల్చవచ్చును. అయితే ఇదియును చాలదు. దేవుని చూచుట మాత్రముతో సంతుష్టిపడక దేవునిలో ప్రవేశించుటకై ప్రయత్నించవలెను. (ప్రవేష్టుం) ఇది చరమస్థితి. అభ్యాస వశమున, సాధనయొక్క తీవ్రతచేత, భక్తియొక్క పరాకాష్ఠ చేత ఇట్టి సాక్షాత్కారదశ జీవునకు లభించగలదు. దేవుని ఎంతగా తెలిసికొనినను, ఎంతగా చూచినను, దేవునిలో ప్రవేశించినంతటిపౌష్కల్యదశ వానికి ఉండదు. దేవుడు, తాను వేఱుగా నున్నంతవఱకు ఏదోవిధముగ భయము ఉండుచునే యుండును. (ద్వితీయాద్వై భయం భవతి). కావున దేవునిలో ఐక్యమైపోయినపుడే, దేవునియందు ప్రవేశించినపుడే పూర్ణ నిర్భయత్వము, పూర్ణానందము జీవునకు సంప్రాప్తించ గలవు. ఇదియే అద్వైతస్థితి. ఈప్రకారముగ గీతాచార్యుడు 'జ్ఞాతుం, ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరన్తప'-అను యీ మహోన్నత వాక్యముద్వారా లోకమునకు ద్వైత, విశిష్టాద్వైత

అద్వైతములను మూడిటిని ప్రతిపాదించి ఒక్కొక్క మెట్టు పైకిపోయి తుదకు భగవంతునిలో ప్రవేశించుటయను చరమాద్వైతస్థితిని సర్వులును పొందులాగున ఆదేశించెను.

అట్టి పరిపూర్ణ అద్వైతస్థితియందే జీవునకు సర్వదుఃఖములున్ను శమించిపోయి పరమానందప్రాప్తి కలుగును. అత్తఱి ఇక మానవుడు మానవుడుగానుండడు. మాధవుడుగా మారిపోవును. వ్యష్టి సమష్టియందు విలీనమై సమష్టిరూపముగనే శేషించును. ఉప్పుకల్లు సముద్రములో ప్రవేశించి సముద్రరూపముగనే పరిణతమగునట్లును, అగ్నియందాహుతి ప్రవేశించి అగ్నిరూపముగనే మారునట్లును, జీవుడు పరమాత్మయందు ప్రవేశించి పరమాత్మరూపముగనే చెన్నొందును. కాబట్టి సాధకుడు దేవుని తెలిసికొనుటమాత్రముతో సంతుష్టిపడక, చూచుటమాత్రముతో తృప్తిపడక, ఇంకను పైకిపోయి దేవునిలో ప్రవేశించి తానే దేవుడై ఇక విశ్రాంతినొందవలెను. ఒక మామిడిపండు కలదనుకొనుడు. అది ఇంటియొద్దలేదు. బజారులోనున్నది. దాని రుచి, రూపురేఖలను గూర్చి ఎవరో చాల గొప్పగా చెప్పగా విని తెలిసికొని ఆనందించితిమి. ఇది మొదటి దశ. వినుట మాత్రముతో, తెలిసికొనుట మాత్రముతో తనివితీరనందున వెంటనే బజారునకు పరుగెత్తి దానిని కొని యింటికి తెచ్చినాము. తెచ్చి దానిని ఎదురుగ పెట్టుకొని దాని అందచందములనుచూచి ఆనందపడుచున్నాము. ఇది రెండవ దశ. అంతటితో మనస్సు ఆగక ఒక కత్తితెచ్చి దానినికోసి లక్షణముగ ఆరగించినాము. ఇక ఆ పండు బయటలేక మనలో ప్రవేశించినది. పండు మనము

నకత్త్వమైపోయినాము. దాని మధుర్యముచే పరమానంద మనుభవించినాము. ఇది మూడవ దశ. మొదటి రెండుదశలు దాటి మూడవదశ వచ్చినపుడే ఆనందముయొక్క పరాకాష్ఠ చేకూరును. అట్లే దేవుని మొమ్మొదట తెలిసికొని, తదుపరి ప్రత్యక్షముగ చూచి, ఆ పిమ్మట అతనిలో ప్రవేశించి 'జ్ఞానీ త్వాత్మైవమేమతమ్' అనునట్లు భక్తుడు భగవంతుడు ఒకటే అయిపోవలెను. అపుడే 'అహం బ్రహ్మాస్మి' అని గుండెపై చేయివేసి ధైర్యముగ చెప్పగలుగును. అపుడు కలుగు ఆనందము వర్ణనాతీతము. ఆనందమే తానై పోవును. ఆనంద ఘనస్వరూపుడై విలసిల్లును. శ్రీ శంకరాచార్యు లా స్థితిని యెంత చక్కగ వర్ణించిరో చూడుడు-

వాచావక్తుమశక్యమేవ మనసా మన్తుం నవాశక్యతే
స్వానందామృతపూరపూరిత పరబ్రహ్మాంబుధేర్వైభవమ్
అంభోరాశి విశీర్ణవార్షిక శిలాభావం భజన్మే మనో
యస్యాంశాంశలవే విలీనమధునాఽఽనందాత్మనా నిర్వృతమ్

(వివేకచూడామణి)

ఆత్మానందమగు అమృతప్రవాహముతో నిండిన పరబ్రహ్మ సాగరముయొక్క వైభవమును నోటితో వర్ణించుటకుగాని, మనస్సుతో తలంచుటకుగాని అలవికాదు. సముద్రమునందు పడి కరగిపోయిన వడగండ్లవలె ఆ బ్రహ్మమునందు లీనమైన నా మనస్సు బ్రహ్మానందముయొక్క ఒకానొక భాగములోని లవలేశములో జేరి పరమసుఖ మనుభవించుచున్నది.' భగవంతునియందు (ఆత్మయందు) ప్రవేశించిన చిత్తముగల జీవుల పూర్ణానందస్థితి ఇవ్విధముననే యుండును. దీనినే అమనస్కస్థితి

యందురు. అయితే ఇట్టి అమనస్కము సిద్ధించవలెననిన తారక, సాంఖ్యములందు తెన్నగ ఆరితేరి యుండవలెను. ద్వైత విశిష్టాద్వైతములందు ప్రావీణ్యము సంపాదించనిదే అద్వైతస్థితి ఎవరికిని లభింపజాలదు. కాబట్టి భక్తిని అభివృద్ధి పఱుచుచు, తత్త్వవిచారణ గావించుచు మనస్సును క్రమముగ ఊర్ధ్వముఖముగ గొనిపోవలెను. 'తస్యైవాహం' 'తవైవాహం' అను రెండు స్థితులను అతిక్రమించి 'త్వమేవాహం' అను స్థితికి రావలెను. అనగా 'నేను దేవునిభక్తుడను' అను స్థితికి మొట్టమొదటవచ్చి, పిమ్మట 'నేను నీభక్తుడను' అని ఎదురెదురుగా దేవునితో చెప్పగల్గునట్టి స్థితికి చేరి, ఆ పిదప 'ఓ దేవా! నీవే నేను'అని అనగల్గు ధైర్యమును బడయవలెను. సాధకునియొక్క యీ మూడు దశలను వివేకానందులు వైజ్ఞానిక భాషలో నిపుణముగ ఇట్లు వర్ణించి చెప్పెను-

**Dwaitism = Small circle different from the big circle only connected by Bhakti.**

**Visistadwaitism = Small circle within the big circle motion regulated by the big circle.**

**Adwaitism = Small circle expands and coincides with the big circle.**

"రెండు వృత్తములు (సున్నలు) కలవు. ఒకటి పెద్దది, ఒకటి చిన్నది. పెద్దది దేవుడు. చిన్నది జీవుడు. ద్వైతస్థితియందు పెద్దసున్న చిన్న సున్న వేఱ్వేఱుగ నుండును. కాని భక్తిచే కట్టబడి యుండును. విశిష్టాద్వైతస్థితియందు పెద్దసున్నలోపలచిన్నసున్న

యుండును. పెద్దదియే చిన్నదానిని త్రిప్పుచుండును. అద్వైత స్థితియందు చిన్నసున్న పెరిగిపెరిగి నెమ్మదిగ పెద్దదానిలో నైక్యమైపోవును.' కాబట్టి సాధకుడు అభ్యాసమును వదలక అనన్యభక్తిని చేకూర్చుకొనుచు ఒక్కొక్క మెట్టు పైకిపోయి తుట్టతుదకు ధ్యేయవస్తువగు పరమాత్మయందు విలీనమై పోవలెను. అప్పుడే మానవజన్మ సార్థకమైనట్లు.

ఇట్టి మహోచ్చదశను మాబోటి వారెట్లు పొందగలరు ? అని యెవరును నిరుత్సాహపడవలసిన పనిలేదు. అది మహర్షుల ఒక్కరిసొత్తుకాదు. ప్రతిజీవియొక్కయు జన్మహక్కు. తనజన్మ హక్కు కొఱకై ప్రతివాడును పాటుపడవచ్చును, పొంద వచ్చును కూడను. తాను ఆధ్యాత్మికరంగమున ఎక్కువ అను భవము, ప్రవేశము లేనివాడైనప్పటికిని ప్రయత్నము విడువక శ్రద్ధతో ఒకింతైనను ప్రతిదినము సాధన చేయుచుండినచో గమ్యస్థానమును తప్పక చేరగలడు. దుఃఖించవలసిన పనిలేదు. అధైర్యపడవలసిన అవసరము లేదు. 'నేను చేయునది స్వల్ప సాధనకదా, ఇంత గొప్ప సంసారసాగరమును ఎట్లు తరించ గలను ? ఇంత దట్టమైన అజ్ఞానాంధకారమును ఎట్లు ఛేదింప గలను ?' అని గృహస్థులు మున్నగువారు దిగులుపడవలసిన పనిలేదు.

పూర్వమొక అమాయకుడగు పల్లెటూరిమనిషి మూడు మైళ్ళదూరములో నున్న తన గ్రామమునకు బోవుచుండెను. సాయంసమయమైనది. చీకటి పడుచుండెను. క్రమముగ దట్ట మైన అంధకారము నలుదెసల వ్యాపించెను. వెనువెంటనే యతడు తన చేతియందున్న లాంతరు వెలిగించి ఏదియో

యొక్క భావన అకస్మాత్తుగ మనంబు నావరింప అట్లే చతికిలబడి కూర్చొండి ఏడ్చుచుండెను. సమీపముననే పోవుచున్న ఒకా నొక పాంథు డతని దీనస్థితిజూచి దగ్గఱకు వచ్చి 'ఏమయ్యా ఏడ్చుచున్నావు?' అని యడుగ నాతడిట్లు ప్రత్యుత్తర మొసంగెను. 'బాబూ! ఏమని చెప్పుదును. గొప్ప సంకటమేర్పడినది. నేను పోవలసినగ్రామమింకను రెండు మైళ్ళదూరములోనున్నది. కాటుకవలె దట్టమైన చీకటి యావరించినది. చేతిలో ఈ చిన్న లాంతరు కలదు. దీని ప్రకాశము పదిగజముల దూరమువఱకు మాత్రము పోవుచున్నది. రెండుమైళ్లెచట! పదిగజములెచట! రెండుమైళ్ళ చీకటిపోగొట్టగల బ్రహ్మాండమైన లైటు ఉండిననే నేనిపుడు ఊరుచేరగలను. లేకున్న నాగతియింతే. ఈ దౌర్భాగ్యపు లాంతరుకు అంతశక్తి లేకపోయె. ఏమిచేయుదును? ఘోరవిపత్తువచ్చి మీదపడినది మహాప్రభో!' అని చెప్పి వెక్కి వెక్కి యేడ్వదొడగెను. ఆ వాక్యములను విని పాంథుడు పక పక నవ్వి 'ఓయీ వెఱ్ఱివాడా! లెమ్ము! లాంతరు చేతితో బట్టుకొని నడకసాగింపుము. దానికాంతి అల్పమైనను, పదిగజములదూరమే పోగలిగినను, దానిని చేతబూని నడువ సాగినచో పదిగజములు, మరల పదిగజములు - ఈ ప్రకారముగ దారియంతయు వెలుగును జిమ్మును. ఒకచోటకూర్చొనినచో మాత్రము ఈపని సాధ్యపడదు. కాబట్టి కార్యశీలుడవు కమ్ము. సోమరితనమును దూరీకరింపుము!' అని హితవు చెప్పి వెడలిపోయెను. ఆతడట్లే ఆచరించి గమ్యస్థానము చేరి సుఖించెను. కావున ఏ ఒకింత భక్తిగాని, వైరాగ్యముగాని, విచారణగాని యున్నప్పటికిని ఆ చిన్న ప్రకాశమును ఆలంబనగా

దీసికొని సాధనను ప్రతినిత్యము విడువకుండ చేయుచున్నచో, విశాల సాంద్ర అజ్ఞానాంధకారమంతయు పటాపంచలై జీవునకు మోక్షస్థితి కలుగగలదు. అయితే పరిశ్రమ వదలగూడదు. సాధన విరమించగూడదు.

యోజనానాం సహస్రాణి యాతి గచ్ఛన్ పిపీలికః
అగచ్ఛన్ వైనతేయోఽపి పదమేకం న గచ్ఛతి.

"నడక సాగించుచుండినచో చీమకూడ వేలకొలది మైళ్ళ దూరమును దాటిపోగలదు. నడక సాగించనిచో గరుత్మంతుడైనప్పటికిని ఒక్క అడుగైనను దాటలేడు. కాబట్టి ఎవరికైనను శక్తి, యుక్తి, విజ్ఞానము, శాస్త్రపాండిత్యము అల్పమైనప్పటికి దానివలన భయపడవలసిన పనిలేదు. ఆ ఉన్న ఒకింతశక్తితోనే ప్రారంభించి తనపైనను భగవంతునిపైనను అచంచలవిశ్వాసము గల్గియుండి సాధనను విడువకుండ ఆచరించుచుండినచో అచిరకాలములోనే మహామహాధురంధరులు పొందిన లక్ష్యమును అతడుకూడ పొందగల్గును. 'న మేభక్తః ప్రణశ్యతి' - నా భక్తుడు చెడడు-అని భగవానుడు హామీ నిచ్చియున్నాడుగదా! ఇక భయమేల?

ఈ ప్రకారముగ అనన్యభక్తిచే భగవద్విజ్ఞానము, భగవద్దర్శనము, భగవదైక్యముకూడ లభించగలవని ఘంటాపథముగ జెప్పి శ్రీకృష్ణభగవానుడు ఈ విశ్వరూపసందర్శన యోగమను అధ్యాయమును ఉపసంహరించుచు తుట్టతుదకు అమోఘములగు రెండు వచనములను బలికెను.

మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సంగవర్జితః
నిర్వైరస్సర్వభూతేషు యస్సమామేతి పాండవ. (11-55)

'ఓ అర్జునా! ఎవడు నాసంబంధమైన కార్యములనే (దైవకార్యములను దైవప్రీత్యర్థము) చేయుచు, నన్నే పరమపురుషార్థముగనెంచి, నాయందు తత్పరుడై నాయెడల భక్తిగలిగి, సంగరహితుడై, సమస్తప్రాణులయెడల దయగలిగియుండునో, అట్టివాడు నన్నే పొందుచున్నాడు!' ఈ శ్లోకమును శ్రీ శంకర భగవత్పాదాచార్యులవారు గీతయందలి అతి ముఖ్యమైన దానినిగ వర్ణించిరి. ఏలయనిన, బోధలన్నింటియొక్క సారము దీనియందు గలదు. కర్మ, భక్తి, ధ్యాన, జ్ఞానమార్గములు నాల్గున్ను దీనియందు ప్రతిపాదింపబడుటయేగాక, ఆ మార్గములన్నిటికిని అత్యావశ్యకమైన అంగమగు సర్వభూతదయయొక్క-ప్రాధాన్యతకూడ నిరూపింపబడినది. ఎట్లనిన-

1. నా కర్మలను చేయుము = కర్మయోగము.

2. నాయందు తత్పరుడవై యుండుము = ధ్యానయోగము.

3. నాయెడల భక్తిగలిగియుండుము = భక్తియోగము.

4. దృశ్యపదార్థములందు సంగములేక యుండుము = జ్ఞానయోగము.

5. సమస్తప్రాణులయెడ వైరములేక యుండుము = భూతదయ.

ఈ ప్రకారముగ ఒకే శ్లోకములో సర్వవేదాంత సిద్ధాంత సార సంగ్రహమును భగవానుడు చెప్పివేసెను. ప్రముఖ ఆధ్యాత్మిక సాధనా విధానములన్నియు దీనియందు పొందుపఱుపబడి యున్నవి. ప్రతిమార్గమునకును, ప్రతియోగమునకును, ప్రతిక్రియకును అత్యవసరమైనట్టి వస్తువగు జీవకారుణ్యముకూడ లెస్సగ బోధింపబడినది. ఏ మార్గము నవలంబించినను దీనిని మాత్రము ఎవరు వదలరాదని హెచ్చరిక చేయబడినది. కర్మ భక్త్యాదియోగములన్నియు మందులైనచో భూతదయ పథ్య

ముగా నుండును. మందును సేవించి పథ్యమును అనాదరించు వానిగతి యెట్లుండునో అట్లే గొప్ప గొప్ప యోగము లాశ్రయించినను ఆచరణయందు భూతకోట్లయెడల ప్రేమజూపనిచో ఆ యోగములు నిర్వీర్యములై తగిన ఫలితము నొసంగజాలకుండును. కాబట్టియే గీతయందు దచటచట ఈ జీవకారుణ్యమును, భూతదయను గూర్చి నొక్కిచెప్పుటకు కారణము. పరమార్థసాధకులలో అనేకులు ఈ సత్య మెఱుగక పొరపడుచున్నారు. వారు కష్టపడి అనేక యోగములను, ధ్యానములను శీలింతురు. కాని పరప్రాణిపై స్నేహరహితులై మెలగుదురు. ఈ పద్ధతి భగవానునకు నచ్చదు. శాస్త్రములు దీని నంగీకరింపవు. వాచావేదాంతము గీతాచార్యునకు సమ్మతముకాదు. ఏధర్మమైనను అనుష్ఠానమందు దానిని ప్రతిబింబింప జేసికొనినమాత్రమే సత్ఫలితముల నొసంగగల్గును. దేవుని భజించి జీవులను హింసించినచో భగవంతుడు ప్రీతినొందునా? జీవరాసు లన్నియు భగవద్రూపములు. విరాడ్రూపములోని అంగములు. విశ్వరూప సందర్శనమున ఈ సత్యము యింకను బాగుగ తేటతెల్లమైనది. కాబట్టి 'ఓ సాధకులారా! దేవునిపొందదలచు మీరు మున్ముందు జీవుని ప్రేమింపుడు. సర్వజీవులలో వెలుగొందుచున్న పరమాత్మతోటి మిత్రత్వమును నెరపుడు' అని శ్రీకృష్ణమూర్తి ఆదేశించుచున్నాడు.

ఇట్టి సర్వభూతదయ జీవునకు అలవడుట ఎట్లు? విశ్వప్రేమ మానవునియం దెట్లు అంకురింపగలదు? చరాచరప్రాణికోట్లన్నియు భగవత్స్వరూపములే యను నిశ్చయముచేతను,

బ్రహ్మాండమంతయు భగవంతుని శరీరమేయను భావనచేతను అయ్యది సాధ్యపడగలదు. అనగా విశ్వరూపసందర్శన తత్త్వము నెఱింగినవానికి విశ్వప్రేమ సహజముగనే ప్రాదుర్భవింపగలదు. ఈ ప్రకారముగ విశ్వరూప సందర్శనయోగము జీవుని శీలాభివృద్ధికి, దృఢభక్తి సంపాదనకు మిక్కుటముగ నుపకరించుచున్నది. సన్న్యాస స్వీకరణసమయమున నూతన యతిపుంగవునిచే యీ ఏకాదశాధ్యాయమందలి కొన్ని శ్లోకములను పఠింపజేయు ఆచార మొకటి కలదు. ఈ అధ్యాయ శ్లోకములందు బీజాక్షరములున్న ఎక్కువగ కలవని పెద్దలు చెప్పుకొనుచుందురు. తక్కిన అధ్యాయములందు భగవంతు డెట్టివాడో వర్ణింపబడినది. ఈ అధ్యాయమునందు వర్ణింపబడినది, చూపబడినది కూడను. అత్యద్భుతమగు ఈ విశ్వరూపమును తలంచుకొని తలంచుకొని సంజయుడు (హృష్యామి చ పునః పునః)మరల మరల ఆనందాంబుధి నోలలాడిన విషయమును గీతాంతమున నాతడే స్వయముగ జెప్పుకొనెనుగదా! కావున యిట్టి మహిమాతిశయముతో గూడిన యీ పరమపవిత్రమగు ఏకాదశాధ్యాయమును - యీ విశ్వరూప సందర్శనయోగమును — ముముక్షువులు అత్యంత శ్రద్ధతో పఠించి, స్మరించి, అనుభవించి, అర్జున, సంజయాదుల వలె బ్రహ్మానందానుభూతిచే పులకితగాత్రు లగుదురుగాక!

ఓమ్ తత్ సత్.

ఓమ్

# 12-వ అధ్యాయము

# భక్తియోగము

ఆధ్యాత్మికోపన్యాసములు వినునపుడు, పురాణశ్రవణముచేయునపుడు, హరికథల నాలకించునపుడు, జనులకు సహజముగ వైరాగ్యోద్దీపనము, భక్తిపరవశత్వము కలుగుచుండును. కాని ఎక్కువమందికి అది పాలపొంగువలె ప్రాదుర్భవించుచుండును. వక్త తనభాషణము ముగించుసరికి శ్రోత తన వైరాగ్యమునుగూడ కట్టిపెట్టుచుండును. ఉపన్యాస స్థలము వదలి యింటికి వెళ్ళువఱకైనను దానికి ఆయుర్దాయముండదు. ఎవరో చెప్పినట్లు గురువిచ్చిన దానిని గురువుకే ఒప్పగించినట్లుండును. దీనికే పురాణవైరాగ్యమనుపేరు. ఇట్టి తాత్కాలికావేశములు సాధకులకు, ముముక్షువులకు తగవు. ఏ ఒకింత భక్తి, విరాగము మహాత్ముల వాక్యములను వినుటవలన హృదయమున జనించినవో వానిని కడుజాగ్రతతో కాపాడుకొని, వృద్ధినొందించి జన్మసాఫల్యము నొందవలెను. ఆధ్యాత్మిక రంగమున సోమరితనమునకు ఏమాత్రమున్ను చోటీయరాదు. పరమార్థసాధన నిప్పుతోటి చెర్లాట వంటిది. బెబ్బులితోటి యుద్ధమువంటిది. ఏ ఒకింత అజాగ్రతచూపినను పొంచియున్న మాయ అమాంతముగ మీదపడి జీవుని భవసాగరమున ముంచివేయును.

ప్రమాదో బ్రహ్మనిష్ఠాయాం న కర్తవ్యః కదాచన
ప్రమాదో మృత్యురిత్యాహ భగవాన్ బ్రహ్మణఃసుతః. (వివేకచూడామణి).

"బ్రహ్మనిష్ఠయందు, తత్త్వవిచారణయందు, ఆధ్యాత్మికసాధనలయందు మందత్వము, సోమరితనము పనికిరాదు. సోమరితనమే మరణమని భగవంతుడగు సనత్కుమారుడు పలికెను"- అని శ్రీశంకరాచార్యులవారు వ్రాసిచ్చిరి. కాబట్టి ముముక్షువు తన లక్ష్యమగు పరమాత్మ సాక్షాత్కారము చేకూరువఱకును వెనుకచూపులేక వైరాగ్యాదిసాధనలను తీవ్రముగ అభ్యసించుచుండవలెను. 'ఇంకను చాల సమయమున్నదిలే' అని ఏమఱుపాటు కలిగియుండరాదు.

భారతము శాంతిపర్వమునందు భీష్ముడు ధర్మరాజునకు ఒక చక్కటి ఇతిహాసమును బోధించెను. ఒక చిన్న చెఱువు కలదు. దానిలో జలము పరిమితముగనుండెను. అందు మూడు చేపలు కాపురముండెను. ఒకదానిపేరు దీర్ఘదర్శి, ఇంకొకదానిపేరు ప్రాప్తకాలజ్ఞుడు, వేఱొకదానిపేరు దీర్ఘసూత్రి. ఇట్టి మూడును పరస్పరము ఐకమత్యముగ చాలకాలము ఆ చెఱువులో నివసించుచుండెను. ఇట్లుండ గ్రీష్మర్తువేతెంచెను. మార్తాండుని ప్రచండ తాపప్రభావముచే దిక్కులెల్లను కంపించిపోవుచుండెను. ఎల్లెడల ఉష్ణవాయువులు హోరున వీచుచుండెను. బావులలోను, చెఱువులలోను, నదులలోను నీరు ఇంకిపోవుచుండెను. అత్తఱి దీర్ఘదర్శియను చేప తక్కిన రెండుచేపలను పిలిచి 'సోదరులారా! కాలవిపర్యయము చేమన చెఱువులోని నీరు క్రమక్రమముగ తగ్గిపోవుచున్నది. పూర్తిగ తగ్గిపోక పూర్వమే మనము ముఖ్యద్వారమును సమీపముననున్న బ్రహ్మాండమైన చెఱువులోనికి ప్రవేశించెదము. అందు నీరెన్నడునుతరగదు. ఏ పనియైనను వేళకుచేసినపుడే శోభించును. కాబట్టి త్వరపడుడు.

ఆలస్యము చేసినచో రేపు జాలరివారువచ్చి వలలుపన్ని మనలను యమసదనమునకు పంపగలరు' అని బోధించెను. అద్దాని హితవును విని రెండవదియగు ప్రాప్తకాలజ్ఞుడు- 'నీవు చెప్పినది చాల బాగుగ నున్నది. అయినను యింత తొందరేల. నెమ్మదిగ పోవచ్చును. లేక జాలరివాడు వలవేసినపుడు అందులోతగుల్కొనినచో మన తీక్ష్ణదంతావళులచే వలనుకొఱికి పారిపోవచ్చును'అని నుడివెను. మూడవదియగు దీర్ఘసూత్రి 'మీకిద్దఱికిని వెఱ్ఱిపట్టినది. కనుకనే ఇట్టి చాదస్తపువచనములను పల్కుచున్నారు. నీరు ఇంకుటయేమి? జాలరివాడు వచ్చుటయేమి? వలపన్నుటయేమి? మనము తగుల్కొనుటయేమి? అంతయు బూటకము. అట్లెన్నడును సంభవింపదు. ఒక వేళ సంభవించినచో అప్పుడు చూచుకొనెదములే'అని దబాయించెను. 'విననివారితో మన కేమి పోత్రు, వారికర్మ వారిది'అని నిశ్చయించుకొని మొదటిచేప నాటిరేయి మెల్లగ చెఱువువీడి గంతులు వేసికొనుచు ప్రక్కనున్న పెద్దమడుగులోనికి దూకెను. మరుసటిరోజు అనుకొనిన ప్రకారము జాలరివాడు వలగైకొని యచ్చోటికివచ్చెను. రెండవచేప వలలోతగుల్కొనెనుగాని దానిని కొఱికివైచి యెట్లో తప్పించుకొని ప్రాణమునుకాపాడుకొనెను. మూడవదియగు దీర్ఘసూత్రి వలలోపడి ప్రాణములను గోల్పోయెను. ఈ దీర్ఘసంసారమే చెఱువు; ఆయువే అందలిజలము; జీవులే చేపలు. చేపలందువలె జీవులలో మూడు తరగతులవారు కలరు. ఆయువు తరిగిపోకమునుపే, మృత్యువనుజాలరివాడు రాకపూర్వమే,బాల్యయౌవనములందే సంసారతారణోపాయమును వెదకికొనువాడు ఉత్తముడు.అతడు వాస్తవముగదీర్ఘదర్శియేయగును. వార్ధక్యములో

గాని మరణ మాసన్న మగుటకు ఒకింత ముందుగాగాని 'కృష్ణ', 'రామ' యని మొదలుపెట్టువాడు మధ్యముడు. ఈతడు అసలు లేనిదానికంటె కొంత మేలు. చివరికాలములోనైనా కొంత తెప్పరించుకొనును గనుక. ఇక ఏకాలమందును భగవద్విష యమై పట్టించుకొననివాడు అధముడు. ఈతడు ఏమాత్రము భక్తిజ్ఞానములు సంపాదించక మృత్యువాతబడి ఘటీయంత్రము వలె 'పునరపి జననం పునరపి మరణం' అను కీర్తన పాడు కొనుచు పాతాళనరకములకు తిరుగాడుచుండును. అట్టివాని పేరు దీర్ఘసూత్రి. అనగా సోమరియని భావము. దీర్ఘసూత్రి యనగా అర్థమేమియని ఈమధ్య ఒకరడిగిరి. దానికి మఱి యొకరిట్లు సమాధానము చెప్పిరి. 'One that has a long rope to tie himself'- 'తన్ను తాను బంధించుకొనుటకు పొడవైన త్రాడుకలవాడు' అని. ఈ నిర్వచనము చాల సొంపుగనున్నది. సోమరి తన మెడకు తానే ఉచ్చు తగిలించు కొనునని తాత్పర్యము (విషాదీదీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే). కావున వివేకవంతుడగువాడు అలసత్వమును పార ద్రోలి భవదుఃఖమును బాపుకొనుటకై శ్రద్ధాపూర్వకముగ తీవ్రతరయత్నము గావింపవలయును.

నేడు భగవద్గీత పండ్రెండవ అధ్యాయమునుగూర్చి విచారింపవలసియున్నాము. భక్తిషట్కములోని చివఱి అధ్యా యమిది. గీతలో అన్నిటికంటెను చిన్న అధ్యాయములు రెండు కలవు. అందులో ఈ భక్తియోగ మొకటి. మఱియొకటి పురు షోత్తమప్రాప్తియోగము (15 అధ్యా). ఇవి ముచ్చటగా 20 శ్లోకములు మాత్రము కలిగియున్నవి. చిన్న అధ్యాయము

లగుటచే కంఠస్థము చేయుటకివి చాల అనుకూలముగానుండును. భగవద్గీతను 'ఓం ప్రథమం'గా ప్రారంభించువారు కొందఱు ప్రథమాధ్యాయమునుండి కాక, ఈ ద్వాదశాధ్యాయమునుండియే మొదలిడుదురు. ఇట్టి సాంప్రదాయము కొన్ని చోట్ల కలదు. మొదటి అధ్యాయము విషాదముతోను, యుద్ధవార్తలతోను గూడియుండుటచేతను, పన్రెండుసంఖ్య శుభప్రదమైయుండుటచేతను, అందు ప్రతిపాదింపబడిన భక్తి అందఱికిని సులభసాధ్యమైనది అగుటచేతను, పైపెచ్చు అన్నిటికంటెను చిన్న అధ్యాయ మగుటచేతను వారట్లు ద్వాదశాధ్యాయము నుపక్రమించు నాచారము గలిగియుండవచ్చును. గీతాకోశాగారములో ఈ అధ్యాయము ధగద్ధగాయమానముగ వెలుగొందు తేజోవంతమగు రత్నము. ఇట్టిరత్నమును కంఠమందు గాని శిరమునందుగాని హృదయమునందుగాని ధరించువారు* ధన్యులు.

భూషలుకావు మర్త్యులకు భూరిమయాంగదతారహారముల్
భూషిత కేశపాశ మృదుపుష్ప సుగంధ జలాభిషేకముల్
భూషలుగావు పూరుషుని భూషితుజేయు పవిత్రవాణి వా
గ్భూషణమే సుభూషణము భూషణముల్ నశియించు నన్నియున్
(భర్తృహరి)

అని భర్తృహరి చెప్పనేచెప్పెను. ఇట్టి నశింపనిభూషణమును జను లేల ధరింపరాదు? తమపిల్లలకు లేనిపోని బంగారపు సంకెళ్లు తగిలించుటకంటె ఈచక్కనిరత్నముచే వారల నేలయలంకరింప

* 'కంఠస్థము చేయువారు, బుద్ధియందు ప్రవేశింపజేయువారు, హృదయంగమ మొనర్చువార'ని యర్థము.

రాదు ? చంటిపిల్లలకు జ్ఞాపకశక్తి యెక్కువ. కావున చిన్న వయస్సులో వారు దేనినైనను సులభముగ కంఠస్థము చేయ గలరు. అటువంటి స్థితిలో మనస్సును కలుషిత మొనర్చు శృంగారగీతములు, వినోదపుపాటలు వారికి నేర్పుటకంటె హృదయక్షేత్రమును పావనమొనర్చునట్టి ఈ గీతాగానము వారికి ఏల నేర్పరాదు ? కావున తల్లిదండ్రులు కొంచెము హెచ్చరిక గల్గి తమబిడ్డలు ఇహపరములయందును బాగుపడుట కొఱకై కనీసము ఒకటి రెండు అధ్యాయములైనను గీతను వారికి కంఠస్థము చేయించవలెను. ఇంటిలో యేదైన పుణ్య కార్యములు తటస్థించినపుడు అందఱును కలసి ఈ 12వ అధ్యాయముగాని, 15-వ అధ్యాయముగాని, లేక మఱి యే అధ్యాయముగాని గానము చేసినచో ఆ దైవవాణియొక్క శబ్దతరంగములు తద్గృహమును గృహపరిసరములను వ్యాపించి శుద్ధమొనర్చును. చెప్పినవారికి వినినవారికి పుణ్య ముదయించును. మానసములు పవిత్రము లగుచుండును. ఇది యొక విధమైన వేదఘోష. గీత ఉపనిషత్సారము కనుకను, ఉపనిషత్తులు వేదసారము కనుకను, గీతాగానము వేదగానముతో సమానము. గీతాపఠనము వేదపఠనముతో సమానము. వేదాధ్యయనమువలన గలుగు మహత్తర ఫలితము గీతాధ్యయనము వలన గూడ తప్పక కలుగ గలదు.

గీతా గంగా చ గాయత్రీ గోవిందేతి హృది స్థితే
చతుర్గకారసంయుక్తే పునర్జన్మ న విద్యతే.

'ఎవరిహృదయమున నాలుగు 'గ' కారములు [అనగా 'గ'కారముతో ప్రారంభింపబడిన ఈ నాలుగు వస్తువులు] గీత, గంగ,

గాయత్రి, గోవిందుడు-ఉండునో అట్టివారికి మరల జన్మలేదు. (జన్మరాహిత్య రూపమగు మోక్షము వారికి సిద్ధించునని భావము). గీతయొక్క ప్రభావ మిట్టిదై యున్నది. కావున అచ టచట గీతాపరీక్షలు పెట్టి, గీతాసంఘములను స్థాపించి, గీతా మందిరములను నిర్మించి, బాలురకు, బాలికలకు గీతయందు చక్కని ప్రవేశమును కల్పించవలయును. పెద్దవారు తాము చిన్నప్పుడట్లు చేయకపోయినను తమ పిల్లలకైనను అట్టి అవకాశము నిపుడు కలుగజేసి కృతార్థులు కావలయును. 'గీతాశ్రయోఽహం తిష్ఠామి' - 'నేను గీత నాశ్రయించు కొనియున్నాను' అని శ్రీకృష్ణమూర్తి తెలిపెను గావున, గీత నాశ్రయించువారు భగవానుని తమయింటికి ఆహ్వానించి నట్లేయగును. అత్తటి ఇక ఆయిల్లు ఇల్లుగానుండునా? ఉండదు. దేవాలయముగ మారిపోవును. ఆ మనుష్యులు మనుష్యులుగా నుందురా ? ఉండరు. దేవతలుగ మారిపోవుదురు. దేవతలు గనేకాదు, దేవుడుగకూడ మారు అవకాశము కలదు. కాబట్టి పెద్దలు, పిన్నలు యీ భక్తియోగమును (12అధ్యా) బాగుగ కంఠస్థము చేయవలెను.

ఇక యీ అధ్యాయముయొక్క లోతుపాతులను విచా రించెదము. ప్రారంభములో అర్జునుడు శ్రీకృష్ణమూర్తిని ఒక ప్రశ్న యడిగెను-సాకారోపాసకులు గొప్పా, నిరాకారోపాస కులు గొప్పా అని. అందులకు శ్రీకృష్ణుడు బహు చాకచక్యముగ జవాబిచ్చెను. - 'ఎవరు నన్నాశ్రయించి నిరంతరము అతి శ్రద్ధతో నన్ను ధ్యానించుచుందురో వారేగొప్ప' అని. దీనిని బట్టి సాకారము నర్చించినను, నిరాకారమును సేవించినను

శ్రద్ధ అతి ముఖ్యమని తేలుచున్నది. దైవముపై పరిపూర్ణ విశ్వాసముంచి, అత్యంతశ్రద్ధతో సేవించినపుడు సాకారముకాని నిరాకారముకాని - ఉత్తమఫలితమును కలుగజేయగలదు. శ్రద్ధలేనపుడు, నిరంతరయత్నము ('నిత్యయుక్తత్వము') కావింపనపుడు సాసాక్షాత్ నిరాకారబ్రహ్మము నాశ్రయించినను సాధకుడు ఫలమును బొందజాలక యే యుండును. కావున సాకార నిరాకారములనుగూర్చిన ప్రశ్నగాని, సగుణ నిర్గుణములను గూర్చిన ప్రశ్నగాని భగవంతునకు ప్రధానముకాదు. ఉపాసించుపద్ధతి ప్రధానము. శ్రద్ధాభక్తులు ప్రధానము. ఈ సత్యమునే గీతాచార్యు డీ యధ్యాయప్రారంభమున తెలియజేసెను. తొలుదొల్త సాధకుడు భగవంతుని సగుణరూపము నాశ్రయించి నిరంతరము ప్రీతిపూర్వకముగ సేవించుచుండినచో చిత్తము శుద్ధముకాగా, నిర్గుణోపాసనకు వలసిన పరమార్థ సామాగ్రి, విచారణాబలము, పరమేశ్వరుని యనుగ్రహమువలన నాతనికి లభించగలదు. ముందు 'దాసోఽహం'తో ప్రారంభించినచో క్రమముగ 'సోఽహం' లోనికి అడుగు పెట్టగలడు.

భక్తిపూర్వకముగ భగవంతుని ఆరాధించుటవలన, 'నే వేతప్ప నితఃపరం బెఱుగన'ని పరమేశ్వరునికి సాష్టాంగ నమస్కారము నాచరించి ప్రపత్తిని చెల్లించుటవలన మనుజుని అహంభావము క్రమముగ చచ్చిపోవును. స్వార్థబుద్ధి (**Selfishness**) అంతరించిపోవును. దేహాభిమానము పటాపంచలగును. అత్తఱి నిర్గుణోపాసనకు చక్కని ప్రాతిపదిక ఏర్పడును. దేహాభిమానము చావక, దేహమందు అహం మమత్వబుద్ధి సజీవముగ నుండియుండ నిర్గుణోపాసనను మనుజుడు

ప్రారంభించినను, 'అహం బ్రహ్మాస్మి' యని మరల మరల చింతించుచుండినను ఎక్కువ ప్రయోజనము చేకూరదు. కను కనే అట్టి దేహాహంభావయుతులకు నిరాకారోపాసన చాల కష్టప్రదముగా నుండునని శ్రీకృష్ణమూర్తి ఆనతిచ్చెను.

శ్లో॥ క్లేశోఽధికతరస్తేషా మవ్యక్తాసక్త చేతసామ్
అవ్యక్తాహి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే. (12-5)

కావున సగుణధ్యానముద్వారా సాధకుడు ముమ్ముందు దేహాభిమానమును పోగొట్టుకొనవలెను. ఈశ్వరార్పణబుద్ధితో కర్మల నాచరించుచు కర్తృత్వమును విడనాడవలెను. సమస్తము భగవంతుడే నడుపుచున్నాడను భక్తిభావముతో 'అహం' కారమును పారద్రోలవలెను. ఇట్టి అర్హతలు కలవాడు నిరాటంకముగ అవ్యక్తోపాసన జరుపగలడు. ఇవి లేనందువలననే అనేకులు నిర్గుణధ్యానమున సఫలతను బొందజాలకయున్నారు. కావుక సాధకుడు భక్తిని ముమ్ముందు అభివృద్ధిపఱచుకొని ఆధ్యాత్మికమార్గమును సుగమ మొనర్చుకొనవలెను.

భక్తియనగానేమి? భగవంతునియందు మిక్కుటమగు ప్రీతికలిగియుండుటయే భక్తి. (సా పరానురక్తి రీశ్వరే). ప్రాపంచిక వస్తువులందు, దృశ్యపదార్థములందు ప్రీతికలిగి యుండుటను రాగమందురు. ప్రేమ అను ఒకే వస్తువు నశ్వర పదార్థముపైకి వ్యాపించినపుడు బంధరూపమును, శాశ్వత పరమాత్మపై వ్యాపించినపుడు ముక్తిరూపమును అగుచున్నది. ఆ ప్రేమయే మొదటిదానియందు కామము, రాగము అని పిలువబడుచు, రెండవదానియందు భక్తియని కీర్తింపబడు చున్నది. ఈ భక్తియు సామాన్యమనియు, విశేషమనియు

రెండు విధములు. పుష్పములతో భగవంతుని పూజించుట, ధూప దీప నైవేద్యాదులతో సేవించుట, తీర్థయాత్రలుగావించుట మున్నగునవియన్నియు సామాన్యభక్తియొక్క లక్షణములు. 'భక్తి' అనగనే ఈ పూజాది వివిధ కర్మకలాపములన్నియు స్మృతిపథమునకువచ్చుచుండును. కాని 'భక్తియోగ'మని పేరు పెట్టినప్పటికిని శ్రీకృష్ణభగవానుడు అట్టి ధూపదీపాది యుక్తములగు పూజలను వేనిని ఈఅధ్యాయమునందు చెప్పలేదు. మనోనిగ్రహమును గూర్చియు, చక్కని శీలమును (Ethics) గూర్చియు మాత్రమే ప్రవచించెను. 'అద్వేష్టృత్వాదుల'ను ఇరువదియారు సద్గుణములను బోధించి, వానిని గలిగియుండువాడే తనకు మిక్కిలి ప్రియుడని బాహాటముగ నుడివెను. ఇట్టి సచ్ఛీలము, సదాచారము లెస్సగ పొందియుండుటయే 'విశేషభక్తి', లేక పరాభక్తియగును. కాబట్టి యీ భక్తియోగమున ప్రతిపాదింపబడిన భక్తి సామాన్యమైనది కాదనియు, విశేషమైనదనియు విజ్ఞులు వెంటనే గ్రహించవచ్చును. ఎల్లపుడు సామాన్యస్థితియందుండుట ప్రగతిశీలుడగు మానవుని లక్షణముకాదు. పాఠశాలలో విద్యార్థి నిరంతరము ఒకే తరగతియందుండునా ? ఉండడు. ఒక్కొక్క సంవత్సరము ఒక్కొక్క క్లాసు దాటిపోవుచుండును. అట్లే అధ్యాత్మక్షేత్రమున పురోగమించుచుండు సాధకుడు ఎల్లకాలములందును పిల్లల తరగతి (Kindergarten) లో నుండకూడదు. 'ద్వైతము'నందే కాలక్షేపము చేయగూడదు. క్రమముగ విశిష్టాద్వైతమునకు, అద్వైతమునకు ఎగబ్రాకవలయును. మహాత్ముల జీవితములందిట్టి క్రమవికాసమే గోచర

మగుచుచుండును. అయితే ఒక్కొక్క స్థితిని దాటి పైకిపోవు చుండినచో దాని యర్థము క్రిందిస్థితులను అల్పదృష్టితో చూడ వలెనని కాదు. వికాసమునొందుచుండువార లెన్నటికిని చేయరు. పైదానిని గ్రహించుచు క్రిందిదానియందు విశ్వాసము గలిగి వర్తించుచుందురు. కావున పరాభక్తిశీలురు సామాన్య భక్తియందు విశ్వాసము కలిగియే యుందురు.

జనులు ప్రారంభములో విగ్రహాదులను బాహ్యపుష్పా దులచే పూజించుచు, క్రమముగ మనోవికాసము సిద్ధించినపుడు సద్గుణములచే, సదాచారములచే, ఆత్మదేవుని పూజించుచు నుందురు. అదియే పరాపూజయనబడును. బాహ్యపుష్పములు ఎప్పటికైనను వాడిపోవును. కాని పరాపూజయందు, ఆత్మ దేవుని పూజయందు వాడబడు పుష్పము లెన్నడును వాడవు, ముకుళింపవు, శిథిలముకావు. పైపెచ్చు దినదినము నవనవోన్మేష యుతములై సొంపులను వెదజల్లుచుండును. అవియే అహిం సాది పుష్పములు. అవియే అద్వేష్టృత్వాది కుసుమరాజములు.

అహింసా ప్రథమంపుష్పం పుష్పమిన్ద్రియనిగ్రహః
సర్వభూతదయాపుష్పం క్షమాపుష్పం విశేషతః
శాంతిపుష్పం తపఃపుష్పం ధ్యానపుష్పం తథైవచ
సత్యమష్టవిధం పుష్పం విష్ణోః ప్రీతికరం భవేత్.

అహింస, ఇంద్రియనిగ్రహము, సర్వభూతదయ, క్షమ, శాంతి, తపస్సు, ధ్యానము, సత్యము - యీ యెనిమిది విధములైన పుష్పములు భగవానునకు ప్రియతమములైనవి! బాహ్య కుసుమములను దేవునకు భక్తిపూర్వకముగ సమర్పించుట మంచిదేకాని, వానికంటె ఉత్తమములైన ఈ అహింసాది

పుష్పములను సమర్పించుట ఇంకను శ్రేష్ఠతరమైనది. జనులీ సత్యమును నెఱుంగజాలక ఎల్లప్పుడును సామాన్యస్థితియందే యుండుచున్నారు. అట్టివారి కనువిప్పుకొఱకై శ్రీకృష్ణ భగవానుడు భక్తియొక్క పై అంతస్తును యీ అధ్యాయమందు బోధించెను. 'ఓ జనులారా! ఎల్లప్పుడును ప్రాథమికావస్థయందేయుండుట వికాసశీలుర స్వభావముకాదు. క్రమముగ నూర్ధ్వస్థితికి పొందుడు. మీ చిత్తములను శుద్ధముచేసికొనుడు. అద్వేష్టృత్వాదిగుణముల నవలంబించి హృదయమును సత్త్వగుణవంతముగ నొనర్చుకొనుడు. మనస్సును మలినముగనుంచుకొని బాహ్యపుష్పములచే నన్నారాధించినను విశేషఫలితము లభించదు. కాబట్టి బాహ్యపూజతో బాటు అభ్యంతరపూజయు అలవాటు చేసికొనుడు. అనగా అహింసాది పుష్పములతోను, అద్వేష్టృత్వాది సంభారములతోను నన్నర్చింపుడు' అని భగవానుడు కరుణతో నుపదేశించుచున్నాడు.

బాహ్యపుష్పములను, పత్రిని మనుజుడు తయారు చేయుటలేదు. అది సర్వేశ్వరునిసృష్టి. దేవుడు నిర్మించినదానిని దేవునకు సమర్పించుటలో అంతగొప్పతనములేదు. మానవుడు తాను సొంతముగ నిర్మించిన పుష్పములను, భగవంతునకు అర్పణచేసినచో అది అమోఘమైన అర్చనయగును. తన మనస్సును నిర్మలమొనర్చుకొని, అట్టి నిర్మల మనఃకుసుమమును సర్వేశ్వరుని పాదపద్మములందు సమర్పించినచో భగవంతు డెంతయో సంతుష్టినొందును. 'భక్తాస్తేఽతీవ మే ప్రియాః'- అట్టి భక్తులు నాకు అపరిమితప్రియులు - అని గీతాచార్యుడు

తెలిపియేయున్నాడు. ఈ సందర్భమున శ్రీశంకరభగవత్పాదుల హృదయకుహరమునుండి వెల్లుబికిన భావనాప్రవాహమును వీక్షింపుడు—

గభీరే కాసారే విశతి విజనే ఘోరవిపినే
విశాలే శైలే చ భ్రమతి కుసుమార్థం జడమతిః
సమర్ప్యైకం చేతస్సరసిజ ముమానాథ భవతే
సుఖేనావస్థాతుం జన ఇహ న జానాతి కిమహో.

(శివానందలహరి)

'ఆహా! మానవు డెంత వెఱ్ఱివాఁడు. పుష్పములకొఱకు అడవుల లోను, కొండలలోను, చెఱువులలోను, దొఱువులలోను తిరుగాడుచు నానా అవస్థలు పడుచున్నాడు. ఓ గౌరీనాథా! తన మనస్సను పద్మమును నొక్కదానిని నీ పాదారవిందము లందు సమర్పించి హాయిగా నుండుటను అతడు తెలిసికొనలేక యున్నాడే! ఏమి యాశ్చర్యము!!' కావున హృదయోద్యానమున సత్యము, అహింస, భూతదయ, వైరాగ్యము, భక్తి మున్నగు అద్భుత పుష్పపంక్తులను తయారుచేసికొని వానిని భగవంతునకు సమర్పించుట నేర్చుకొనినచో, ఇక మానవుడు ముక్తిధామముయొక్క అంచులను జేరినట్లే యగును. అధ్యాత్మరంగమున చక్కని యభివృద్ధి సాధించినట్లేయగును. ఈ సత్యమును జనులకు తేటతెల్లమగునట్లు బోధించు నిమిత్తమే గీతాచార్యుడు భక్తియొక్క వాస్తవస్వరూపమును దిగ్దర్శనము చేయుచు శీలాభివృద్ధిని నొక్కి వక్కాణించి యున్నాడు.

భగవానుడు కరుణామయుఁడు. మఱియు సాధకుల యొక్క కష్టనిష్ఠురములను బాగుగ తెలిసికొని యున్నవాడు.

అందుచే ఈ అధ్యాయమున తన్ను జేరుటకు (మోక్షమునొందుటకు) ఏయే సాధనములను జీవు డవలంబించవలయునో, వానినన్నింటిని వారివారి శక్తికి తగినట్లు బోధింపదొడగెను. పాఠశాలలో ఒకేతరగతిలో చదువుచున్నప్పటికిని విద్యార్థుల తెలివితేటలలో భిన్నత్వము గోచరించుచుండును. తెలివిగల ఉపాధ్యాయు డది గమనించి ఎవరెవరికి ఏయే విధముగ బోధింపవలెనో అట్లు బోధించును. బోధనయందు భిన్న భిన్న పద్ధతుల నవలంబించును. అట్లే శ్రీకృష్ణపరమాత్మయు భక్తులపై కరుణ కలిగి సాధనలో వివిధరీతులను ఇచ్చుట తెలియజేసెను. ముందు పెద్ద పాఠమిచ్చి, అది చదువలేనిచో చిన్న పాఠమిచ్చి, అదియు చదువలేనిచో ఇంకను చిన్నపాఠమిచ్చి, ఏదోవిధముగ భక్తుని తన సన్నిధికి జేర్చుకొనవలెనని భగవాను డభిలషించెను.

(మొదటిపాఠము):- 'మయ్యేవ మన ఆధత్స్వ'- నాయందే మనస్సును స్థిరముగ నిలుపుము. - అని మొట్టమొదట శ్రీకృష్ణు డాదేశించెను. మోక్షమును కాంక్షించువారందఱున్ను ఈ పని చేసితీరవలసినదే. అనగా దృశ్యప్రపంచమున తిరుగాడు మనస్సును భక్తియను త్రాటిచే బంధించి భగవంతుని పాదపద్మములయందు నెలకొలుపవలెను. నిజముగా విచారించినచో మోక్షము మనస్సునకే కాని ఆత్మకు కాదు. ఆత్మకు బంధ మోక్షములతో ఏలాటి సంబంధమున్ను లేదు. అది నాటకమందలి దీపమువలె నిర్వికారముగ, తటస్థముగ, సాక్షిభూతముగ నున్నది. కష్టసుఖములను, బద్ధత్వ ముక్తత్వములను పాత్రధారులే యనుభవించుచుందురుగాని,

దీపము కాదు. అట్లే ఆవాగమనములు సలుపుట, సుఖదుఃఖములల ననుభవించుట, బంధమోక్షములను జెందుట మనస్సే కాని ఆత్మ కాదు. కావున ఈ సంసారమున బంధింపబడునది మనస్సే; సాధనలద్వారా యత్నించి ముక్తి నొందునదియు మనస్సే.

మన ఏవ మనుష్యాణాం కారణం బన్ధ మోక్షయోః

అని ఉపనిషత్తు లీవిషయమును స్పష్టముగ నిరూపించినవి. కాబట్టి మోక్షము నభిలషించు జీవుడు తన మనస్సును ఏదియో విధముగ లొంగదీసికొని అధిష్ఠానమగు ఆత్మయందు నెలకొల్పవలయును. అట్లు కానిచో ఎన్ని జన్మలకైనను అశాంతినే నోచుకొనగల్గును గాని శాంతిని కాదు. ఈ శరీరమున ఆత్మయను భర్త, మనస్సను భార్య కలరు. ఆత్మ పరమ పవిత్రమైనది, స్థిరమైనది. మనస్సో అపవిత్రమైనది, అస్థిరమైనది. ఇక ఈ రెండింటికి పొత్తు ఎట్లు కుదురగలదు. రెండింటికిని ఉత్తరధ్రువ, దక్షిణధ్రువములంత వ్యత్యాసమున్నచో వాని కలయిక, ఐకమత్యము ఎట్లు సంభవించును. భర్త ఒక రకముగను, భార్య ఒక రకముగను నున్నచో యిక ఆ సంసార మెట్లు నడచునో అందఱును ఎఱిగిన విషయమే కదా! భర్త ఆధ్యాత్మికదృష్టిగలిగి, భార్య ప్రాపంచికదృష్టి కలిగియున్నగాని; భార్య ఆధ్యాత్మిక దృష్టిగలిగి, భర్త ప్రాపంచికదృష్టి గలిగియున్నగాని గృహస్థాశ్రమము కల్లోలయుతముగనే యుండును. ఇపుడీ శరీరమను గృహమున అట్టి వైపరీత్యమే సంభవించుచున్నది.

నిర్దోషో నిశ్చలో నాథః సదోషా చంచలా వధూః
దంపత్యోరసయోర్ధ్యానం రసభంగో భవిష్యతి.

"భర్త పవిత్రుడు, నిశ్చలుడు; భార్య అపవిత్ర, చపల. ఇక వారి దాంపత్యజీవితము రసాభాసముగ నుండక మఱెట్లుండును ?" కావున భర్తయగు ఆత్మ యెంత నిర్మలుడుగను, నిశ్చలుడుగను నుండియున్నాడో, భార్యయగు మనస్సు అంత నిర్మలముగను నిశ్చలముగను తయారు కావలెను. అపుడే రెండు చక్రములు సమానముగనున్న బండివలె ఈ శరీరరథము ఒడుదుడుకులు లేక జీవయాత్ర జరుపగల్గును. కాబట్టి ఇపుడు తేలిన అంశమేమి యనిన-మనస్సు తనయందలి దోషములను పోగొట్టుకొని శుద్ధపడవలయును. 'చిత్త'ము విషయాధ్యాసము లేనిదై, రజోగుణ తమోగుణములను పారద్రోలి పవిత్రవంతముగ ఎప్పు డుండునో అపుడు ఆ చిత్తమే 'చిత్' స్వరూపముగ మారి పోవును. 'చిత్త' పదములోని 'త' వత్తు (విషయాధ్యాసము) తొలగిపోయినపుడు 'చిత్త'ము చిత్ (చైతన్యము) అగును గదా! [(చిత్ + త = చిత్త) చిత్త - త = చిత్]

చిత్తం చిదితి జానీయా త్తకారరహితం యథా
తకారో విషయాధ్యాసో జపారాగో యథా మణౌ
జ్ఞేయవస్తు పరిత్యాగా జ్జ్ఞానం తిష్ఠతి కేవలమ్.

అను శ్లోకముద్వారా శ్రీశంకరాచార్యులవారు ఈ యర్థమునే స్పష్టీకరించిరి. కావున చిత్తముయొక్క నిర్మలత్వము పరాకాష్ఠ దశ నందుకొనునపుడు ఆ చిత్తము ఇక తన రూపమును గోల్పోయి చైతన్యాత్మగనే శేషించును. అనగా జీవుడు శుద్ధుడు కాగాకాగా, ఆ శుద్ధత్వము చరమస్థాయి నందుకొను

నప్పుడు జీవుడే శివుడుగ మారిపోవును. నరుడు నారాయణుడుగ శేషించును.

సత్త్వపురుషయోః శుద్ధి సామ్యే కైవల్యమ్.

'మనస్సు, ఆత్మ - ఈ రెండును శుద్ధత్వమున ఎప్పుడు సమానములుగనుండునో, అప్పుడే కైవల్యపదవి జీవునకు సిద్ధించినట్లు'- అని పతంజలి మహర్షి నుడివెను. ఆత్మ సదా సర్వకాలములయందును స్వతః పరిశుద్ధముగనేయున్నది. దాని శుద్ధివిషయమై ఎవరును ఏ ప్రయత్నమున్ను చేయనక్కఱలేదు. ఇక పోతే, మనస్సుయొక్క శుద్ధి ఒక్కటియే మిగిలియున్నది. సమస్త సాధనలున్ను ఈ లక్ష్యమును సిద్ధింపజేయుటకొఱకే యగును.

క్రీస్తుప్రభువుదగ్గరకు ఒక భక్తుడు వచ్చి 'అయ్యా! నాకు మోక్షము ఎప్పుడు లభించును?' అని ప్రశ్నించెను. అంతట క్రీస్తు సమీపముననున్న ఒక పసిబాలుని చూపించి 'నీ చిత్త మెప్పుడీబాలుని చిత్తమువలె తయారగునో అప్పుడే మోక్షము నొందుదువు' అని ప్రత్యుత్తర మొసంగెను. పసిబాలునకు ఈర్ష్యాసూయా ద్వేషములుకాని, కామక్రోధలోభాదులుకాని ఉండవు. చిత్తము అతినిర్మలముగానుండును. ఒకడు కొట్టవచ్చినను, తిట్ట వచ్చినను నవ్వును. దొంగవచ్చినను భయపడడు. కావలెనని కోరడు. పిల్లవాని అట్టి విశుద్ధమానసమును పెద్దవారుకూడ కలిగియుండినచో ఇక వారు మోక్షమునకై దేవులాడనక్కఱ లేదు. మోక్షమే వారిని వెతుకుకొనుచువచ్చును. కాని, జనుల మనస్సు అట్టి నిర్మలస్థితియందు లేదు. కనుకనే ఈ తిప్పలు, ఈ బాధలు, ఈ గొడవలు అన్నియు. అనేక విషయ దోషములందు, వాసనలందు, భోగవిలాసములందు, అరిషడ్వర్గములందు

తగుల్కొని ప్రాపంచిక మనుజుని చిత్తము పాశవికముగ పరిణ మించుచున్నది. ఇది చాల ఘోరము. సాక్షాత్ దేవుడుకాదగిన మానవుడు స్వకీయ దుశ్చేష్టలచే-దేవత్వముమాట అట్లుంచి-మానవత్వమునుండికూడ దిగజారి పశుత్వములోనికి అడుగు పెట్టుచుండుట కడుంగడుశోచనీయము. ఈమధ్య ఎవరోఅనినట్లు ఇక్కాలమున G-o-d (దేవుడు) అగు జీవుడు శీర్షాసనమువేసి (తలక్రిందుగమారి)D-o-g (కుక్క)గ ప్రత్యక్షమగుచున్నాడు! కావున ఇప్పటికైనను తెప్పరించుకొని, మహాత్ములసాంగత్యము ద్వారా, గీతాది సద్గ్రంథముల పరిశోధనముద్వారా తనలోని దివ్యత్వమును ప్రకటించుకొనినచో మానవుడు ధన్యుడు కాగలడు. మనస్సును శబ్దాది విషయములనుండి మరల్చి నిత్య శుద్ధ బుద్ధ ముక్తమగు హృదయస్థ పరమాత్మయందు నెల కొల్పవలెను. 'మయ్యేవ మన ఆధత్స్వ'అను భగవానుని వచనములయొక్క భావ మిదియే.

అయితే ఇది సాధ్యమా? ఒక్కనిముసములో ముల్లోక ములు మూడుపర్యాయములు- 'స్ఫూట్నిక్కులను తలదన్ని'-పరిభ్రమించు ఈ చంచలమనస్సెచ్చట, భగవానుడాదేశించిన నిశ్చలధ్యాన మెచ్చట! వాయు అంశమున ఏర్పడిన ఈమనస్సు నిస్సందేహముగ చపలమైనదే. కాని దాని చాపల్యమును జూచి ముముక్షువు అదిరిపోనక్కఱలేదు, బెదిరిపోనక్కఱలేదు. నాగుపాము మహాప్రమాదకరమగు జంతువైనను మంత్రగాని శక్తిచే నిశ్చేష్టితమై పడియుండును. సింహము మహాహింసా స్వభావము కలిగియున్నను సర్కసులో యజమాని దగ్గఱ పిల్లివలె అణగిపడియుండును. అట్లే ఈ మనస్సునున్న ముల్లో

కములందలి జీవరాసులందఱిని గడగడ లాడించినప్పటికిన్ని, భక్తియను త్రాటిచే భగవంతుని పాదపద్మములకు దానిని కట్టివైచినచో ఇక స్తబ్ధముగ పడియుండును. కిక్కురు మన కుండును. ఇదియే దానిని జయించుటకు ఉపాయము.

చేతోమత్తమతంగజం మదభరభ్రాన్తం భ్రమన్తం దిశో
దుస్సంకల్ప వికల్పదన్త దలిత ప్రోద్ధామ ధైర్యద్రుమమ్
ఉద్యద్గాఢతర ప్రబోధనిగళం భూయస్సమాక్రామితుం
ధాత్రాయోజిత మద్భుతం నరహరే రాలాన మంఘ్రిద్వయమ్.

"బాగుగ మదించియున్నదియు, నలుదిక్కుల పరువిడునదియు, దుస్సంకల్పములను దంతములచే ధైర్యమను మహావృక్షమును పెకలించివేయునదియునగు చిత్తమను మదగజమును పట్టి కట్టి వేయుటకు భగవానుని పాదపద్మములను కట్టుకంబమును బ్రహ్మదేవుడు ఏర్పాటుచేసెను. ఆహా! అద్భుతము!' అని ఒక కవిపుంగవుడు కీర్తించియున్నాడు. కావున బహిఃప్రవృత్తమగు మనస్సును ఆ యా విషయములనుండి మరల్చి అంతర్ముఖ మొనర్చి హృదయస్థపరమాత్మయందు స్థాపిత మొనర్పవలెను. లేక ప్రారంభస్థితిలో ఏదియైన ఇష్టదేవతామూర్తియొక్క ప్రతిమయందైనను నెలకొల్పవచ్చును. శ్రీశంకరభగవత్పాదా చార్యులవారు పరమశివుని కీర్తించుచు నామనస్సను కోతిని భక్తిచే కట్టివైచి నీయధీనము చేసికొనుమని ప్రార్థించెను.

కపాలిన్ భిక్షో మే హృదయకపి మత్యన్త చపలం
దృఢంభక్త్యా బద్ధ్వా శివభవదధీనం కురువిభో (శివానందలహరి)

"ఓ కపాలపాణీ! ఆదిభిక్షూ! పరమశివా! ప్రభూ! మహాచపల మగు నా మనస్సను కోతిని భక్తిచే దృఢముగ బంధించివైచి

నీపాదపద్మములందు చేర్చుకొనుము తండ్రీ!' అని శ్రీశంకరులు నిండుహృదయముతో ప్రార్థించిన పలుకులు భక్తులకు, మనోనిగ్రహపరులకు పరమాదర్శయుతములుగ నున్నవి. ఇట్టి ప్రత్యాహారమే గీతయందు బోధింపబడినది. మనస్సునకు ఏదియో యొక ఆహారము నొసంగుచుండవలెను. ఇంతవఱకు మనస్సు అనేక జన్మలనుండి విషయారణ్యములఁబడి నిర్వీర్యమగు కసవు భుజించుచుండినది; పశులక్షణములతో గూడి యున్నది. కనుక ఆ కసవు దానికి బాగుగ రుచించెను. ఇప్పుడు పశుత్వమును తొలగించుకొని మానవత్వమును, అది దాటి దేవత్వమును బొందుచున్నది. కనుక, ఇక ఆ తృణాహారమును విసర్జించి, చక్కని అమృతరూపమగు పరమార్థ విజ్ఞానమను ఆహారమును, భగవద్ధ్యానమను భోజనమును స్వీకరింపవలెను. అయితే మనస్సును ఊరకమాత్రము ఉంచరాదు. ఏదియో యొకపని దానికి ఒప్పగింపవలెను. ఇంతవఱకు నశ్వర వస్తువులఁగూర్చిన యోచన దాని కొసంగబడెను. ఇప్పుడో భగవద్వాక్యానుసారము, శాస్త్రవాక్యానుసారము, గురువాక్యానుసారము శాశ్వతవస్తువును గూర్చిన చింతన ఒసంగబడుచున్నది.

కాని ఈపని అనుకొనినంత సులభముగ నెరవేరునది కాదు. 'మన్మనాభవ', 'మయ్యేవ మన ఆధత్స్వ', 'మచ్చిత్తస్సతతంభవ' (నాయందే చిత్తమును నిలుపుము) - ఇత్యాది భగవద్వాక్యములను కార్యాన్వితమొనర్పవలెననిన దృఢప్రతిజ్ఞ, గొప్పధీశక్తి (Tremendous will power) సాహసము, ధైర్యము ఆవశ్యకములై యున్నవి. మాయ చులకనగ

లొంగునదికాదు. ఎన్నికోట్ల సంవత్సరముల నుండియో, జన్మలనుండియో మనయందు హక్కు-భుక్తములను ఏర్పఱచుకొనిన శత్రుప్రభుత్వము, స్థిరపడిపోయిన ఆసురికశక్తులు యీనాడు ఒకటి రెండు శ్లోకములను వినినంతమాత్రముతోనే తిరోగమనము ప్రారంభించునా? లేక 'వెనుకకు తరలిపొమ్ము' **(Quit our heart)** అని ఆదేశించినంత మాత్రముతోనే అవి కాలికి బుద్ధిచెప్పునా? ప్రకృతి,మాయ అంతత్వరగా మోసపోవునవికావు. అయితే బలమునకు జవాబివ్వగలిగినది బలమే. ఎట్టిసామర్థ్యమును ఇంతవరకు శత్రువు పేరుకూర్చుకొన గలిగినను దానికి రెట్టింపుసామర్థ్యమును లేక కనీసము దానికంటె ఒక్కవీసమైన అధికమగు సామర్థ్యమును, సాధకుడు సమకూర్చుకొనగలిగినచో ఇక వాని ఆటలు సాగవు. ఒక్క-త్రుటిలో అవి పడిపోవును. అయితే అట్టి అనుపమ సామర్థ్యమును బలమును సాధకులు కలిగియున్నారా? బుద్ధదేవునివలె మాయను తరిమికొట్టగల ధీశక్తి వారికి గలిగియున్నదా? అనునదియే ప్రశ్న. అంతటి శక్తి లేనిచో సాధకు డేమి చేయవలెనను శంక అర్జునునకు కలుగు నేమోయని యెంచి భగవానుడు దానికి సమాధానము చెప్పుచున్నాడు. అర్జునుడు మన అందఱితరఫున'వకాలత్ నామా' పుచ్చుకొని రణరంగమున శ్రీకృష్ణునిముందు హాజరై యున్నాడని ఇదివరలో చెప్పియుంటిమి. కావున మనలో ఎవరెవరు ఏయే సందర్భములలో ఏయే ప్రశ్నలువేయ దలంచుకొనియున్నారో వానిని అర్జునుడే వేయును. ఒకవేళ అర్జును డడుగకున్నను శ్రీకృష్ణుడే ఆప్రశ్నలను ఊహించి వానికి జవాబులుచెప్పును. 'నాయందు మనస్సునిలుపుము' అనిశ్రీకృష్ణు

ముపదేశించగనే అచ్చట ఒక ప్రశ్న యెదురైనది. 'ఒకవేళ నిలుపలేకపోయినచో!'- అది ప్రశ్న. అట్టివా డేమిచేయవలెను? దర్భాసనము విదిలించుకొని, జపమాల గిరాటువేసి బయటకు పోవలసినదేనా? కాదు. మఱి యేమిచేయవలెను?

(2-వ పాఠము):- ఆ చిత్తైకాగ్రతనే 'అభ్యాసయోగ'ముచే ఎట్లైనను సాధించవలెనని భగవానుడు కరుణతో నుపదేశించెను. 'పరమాత్మయందే మనస్సును నిలుపుము' అను సాధననువదలి మఱియొకదానిని చేబట్టుటకంటె దానినే అభ్యాసవశమున అనుభూత మొనర్చుకొనవలెనని యుపదేశించెను. ఆ పాఠము, ఆ సాధన ఎంత గొప్పదియో, ఎంత అమోఘమైనదియో చూడుడు. కనుకనే శ్రీకృష్ణుడు దానిని వదలక ఎట్లైనను పట్టువడు ఉపాయమును సెలవిచ్చెను. ఒక కార్యమును మరల మరల ఆచరించుటకు చేయు యత్నమును అభ్యాసమందురు. భక్తియోగము, జ్ఞానయోగము మున్నగు వానికివలె దీనికిన్నీ ఒక 'యోగ' పదమును తగిలించి 'అభ్యాస యోగమ'ని గీతాచార్యుడు పేరుపెట్టెను. అయితే ఇది ప్రత్యేకమగు ఒక యోగముకాదు. అన్ని యోగములతోను చేరియుండునట్టి విలక్షణమైన వస్తువు. భక్తియోగముకాని, కర్మయోగముకాని, లేక మఱేయోగమైనను గాని ఈ అభ్యాస యోగముతో చేరినపుడే బాగుగ దృఢపడును.

కావున ఓపికతో, పట్టుదలతో, మనస్సును నిలుపుటకై ప్రయత్నించవలెను. అంతరాత్మయందు మనస్సు స్థిరముగ నుండుటకొఱకై మరల మరల అభ్యాసమును చేయవలెను. అనేక లౌకికవిద్యలను, కళలను తీవ్రతర అభ్యాసముచే జనులు

సాధించుచున్నారు. అట్టిచో నిరతిశయానందప్రదమగు ఈ బ్రహ్మవిద్యను ఆధ్యాత్మిక సాధనలను అభ్యాసముచే ఏల సాధించరాదు. కనుకనే భగవానుడు జీవరాసుల క్షేమము నభిలషించి, అభ్యాసవశముచేనైనను ఎట్లైన ఆ మనోనిశ్చల తను సంపాదించవలసినదిగా బోధించెను. మనస్సులో బాగుగ జీర్ణించిపోయిన ఒక దురలవాటును మార్చవలెనన్న ఎంతయో కాలము పట్టుచున్నది. అట్టిచో జన్మాంతరఘనవాసన లనేకములు కాపురముండుచున్న ఈ మనస్సును ఒక పర్యాయమిప్పుడు దైవమునందు స్థాపిత మొనర్చవలెనన్న అది ఎదురు తిరుగును. కాబట్టి తీవ్రతరాభ్యాస మవసరము.

చేతిగడియారమునందు మూడు ముల్లు లుండును. సెకండ్లు చూపుముల్లు, నిమిషములు చూపుముల్లు, గంటలు చూపుముల్లు-అని. వీనిలో సెకండుముల్లు ఎంతయో వేగముగ తిరిగిననే నిమిషములముల్లు కొంచెముగ కదులును. అట్లే నిమిషముల ముల్లు కొంత వేగముగ తిరిగిననే గంటలముల్లు కొద్దిగ జరుగును. కావున గంటలముల్లు లెస్సగ కదలవలెనన్న సెకండు ముల్లు అతి తీవ్రముగ సంచలనము గలిగి యుండవలెను. అట్లే ఈ ఉపాధియందు స్థూల, సూక్ష్మ, కారణదేహములను మూడు దేహములు కలవు. కారణదేహమునందు అనేక జన్మార్జిత ఘనవాసనలు బీజరూపేణ వర్తించుచుండును. అవి మారవలెనన్న, లేక తొలగవలెనన్న, సూక్ష్మదేహమునందు ఎంతయో మార్పురావలెను. సూక్ష్మదేహమునందు మార్పు రావలెనన్న, స్థూలదేహముతో గావించు అభ్యాసము ఎంతయో దృఢముగ నుండవలెను. కాబట్టి గొప్ప అధ్యవసా

యము నవలంబించి మనస్సును బాహ్య విషయాదులనుండి మరల్చి అంతర్ముఖముగ జేసి ఆత్మయందు, దైవమునందు స్థాపిత మొనర్చవలెను. అపజయములను లెక్కచేయరాదు. చంటిపిల్లవాడు నడక నేర్చుకొనునపుడు పెక్కుతూర్లు క్రింద పడును. అయినను వదలకుండ అభ్యాసముచేసి ఎట్టకేలకు సాధించును. చిన్నతరగతులలో 'రాబర్టుబ్రూస్, సాలీడు' (Robert Bruce and the spider) కథ మీరు చదివియే యుందురు. రాబర్టుబ్రూస్ అను రాజుపై శత్రువులు దండెత్తి వచ్చిరి. రాజు ఓడిపోయెను. విచారగ్రస్తుడై యొక మంచముపై గూర్చుండి యోచించుచుండ, ఎదురుగా నొక సాలీడు ఇంటికప్పుమీదనుండి సన్నని పొడుగదారము పట్టుకొని వ్రేలాడుచు క్రిందపడెను. మరల ఆ దారమును పట్టుకొనియే పైకి ఎగప్రాకవలెనని అది ప్రయత్నించి విఫలమైనది. మరల ప్రయత్నించినది. కాని క్రిందపడిపోయెను. ఇట్లు 11 తూర్లు క్రిందపడిపోయి, తుట్టతుదకు 12-వతూరి పైకిపోగలెను. రాబర్టుబ్రూస్ ఇదియంతయు గమనించుచుండెను. 'ఓహో! ఇంత చిన్నక్రిమి ఎంత పట్టుదల, ఎంత పూనిక, ఎంత అధ్యవసాయము గలిగియున్నది! అపజయములను లెక్కసేయక యత్నించి యత్నించి తుట్టతుదకు జయమును వరించినదే! నేనుమాత్ర మేల అట్లు చేయరాదు. ఒక్కపర్యాయము ఓటమికే చేతులు ముడుచుకొని కూర్చుంటినే! కావున సాహసించెదను.' అని యాతడు నిశ్చయించి సైనికులందఱిని సమకూర్చుకొని శత్రువుతో మరలమరల యుద్ధముచేసి కట్టకడకు విజయలక్ష్మిని జేబట్టెను. కావున మోక్షలక్ష్మీకాంక్షులగు

సాధకులందఱున్ను తమ మనస్సు దైవమునందు నిలుకడ బొందనిచో నిర్వేదమును బొందక, నిరుత్సాహమును బడయక అక్కార్యమునే మరల మరల అభ్యాసముచే సాధించివేయవలెనని శ్రీకృష్ణమూర్తి యానతిచ్చెను.

(3-వ పాదము):- 'అట్టి అభ్యాసము కూడ చేతగాదు. ఇక తరించుటకు నాకేమి యుపాయము కలదు!' అని యెవరైన అడుగుదురేమోయని ఊహించి రాబోవునది కలికాలము కావున అట్టి రకమువారు తప్పక ఉద్భవింతురని శంకించి కాబోలు దానికిన్ని భగవానుడు ప్రత్యుత్తర మొసగెను. ఆ ప్రకారము చిత్తైకాగ్రతను అభ్యాసము చేయలేనివారు దైవ సంబంధమైన కార్యములను చేయవలసినదిగా ఆదేశించెను. అట్లు దైవకార్యములను చేయుచురాగా వారి చిత్తము కాల క్రమమున శుద్ధపడి ధ్యానానుకూలత్వమును బొందగల్గును. ధ్యానాభ్యాసముకంటె ఇది సులభమైనది. కావున శ్రీకృష్ణుడిద్దాని నుపదేశించుటకు కారణమైనది.

(4-వ పాదము):- ఇట్లు దైవకార్యములున్ను చేయలేని వారెవరైన యుండినచో అట్టివారున్ను ఉన్నతిని బొందు నిమిత్తము భగవానుడు కరుణతో మఱియొక పద్ధతిని సూచించెను. సమస్త కర్మలయొక్క ఫలమును దైవార్పణము చేయవలసినదిగా బోధించెను. ఫలమును త్యజించి కార్యము నాచరించులాగున నుపదేశించిరి. 'నీవు భుజించినను, నిద్రించినను, నడచినను, మాట్లాడినను - ఏ కర్మ చేసినను తత్ఫలితమును దైవమున కర్పించివేయుము' అని యానతిచ్చెను. ఇది ఇంకను సులభతరమైనది. సర్వులున్ను ఆచరింపగలిగినది.

ఈ ప్రకారముగ ఒక్కొక్క మెట్టు దిగిదిగి వారివారి అంతస్థుకు తగినబోధలను పరమాత్మ కావించెను. జీవరాసులు తరించవలెనని, దుఃఖరహితులు కావలెనని భగవంతుని కెంత ఆవేదనయో యీ వాక్యములద్వారా ఋజువగుచున్నది. ప్రయత్నశీలునకు ఇందులో ఏదియోయొక మార్గము లభించక పోదు. ఏదియో యొకదానిని పట్టుకొని ముందునకు సాగిపో వలెను. పరమార్థసాధన ఏదియు లేనివాడు ఈ భయంకర సంసారరంగమున తప్పక క్లేశమును బొందగలడు. కాబట్టి సర్వేశ్వరునిపై అచంచల విశ్వాసముగల్గి తన సంస్కారమున కనుగుణ్యమైన సాధనను జేపట్టి అవిరళయత్నముద్వారా పర మాత్మ పథమును జేరగలిగినవాడు ముమ్మాటికిని ధన్యుడు.

ఇవ్విధముగ ఈభక్తియోగమను అధ్యాయమున దైవ ప్రాప్తికి వలసిన కొన్ని సాధనలను దెల్పి తదుపరి శ్రీకృష్ణ మూర్తి భక్తుని లక్షణములను పేర్కొనదొడంగెను. ఇయ్యవి గీతాగ్రంథమున ప్రముఖస్థానమును ఆక్రమించియున్నవి. రెండవ అధ్యాయమున స్థితప్రజ్ఞుని లక్షణముల కెంత ప్రాధాన్యత కలదో, వీనికిన్ని అంత ప్రాధాన్యత కలదు. భక్తునకుండవలసిన గుణములన్నియు నిచట పొందుపరుపబడినవి. విద్యార్థి ఒక తరగతియందు ఉత్తీర్ణుడుకావలెనినచో దానికి నిర్ణయించబడిన అన్ని సబ్జక్టులలోను ఎట్లు కృతార్థుడు కావలసియున్నదో, ఏ ఒక్కదానియందు తక్కువ మార్కులు వచ్చినను అపజయ మును ఎట్లు పొందిపోవునో, అట్లే భగవత్ప్రాప్తియను లక్ష్య మును పొందుటకు ఇట తెలుపబడిన సద్గుణములన్నిటిని ముముక్షువు పరిపూర్ణముగ నవలంబించవలెను. ఏ ఒక్కటి

త్గినను అది కొంఱతగనే యుండును. మఱియు భక్తత్వము ఒకానొక 'డిగ్రీ' (పదవి) వంటిది. ఎవరైనను దానికొఱకు యత్నించవచ్చును. యోగ్యతనుబట్టి సఫలతను బడయ వచ్చును. జాతి, మత, కుల, వర్ణ వ్యవస్థలతో దీనికి ఏలాటి సంబంధమున్ను లేదు. ఎవరైనను భక్తుడు కావచ్చును. మానవుడేకాదు, దానవుడైనను భక్తుడు కావచ్చును. ప్రహ్లాదుడు దానవుడైనను భక్తుడు కాలేదా? విభీషణుడు కాలేదా? దానవుడేకాదు తుదకు జంతువుకూడ భక్తుడు కావచ్చును. హనుమంతుడు వానరమైనను భక్తుడు కాలేదా? జటాయువు పక్షియైనను భక్తుడు కాలేదా? భగవంతుడు భక్తిని మెచ్చునే కాని జాతి మత కులాదులనుగాదు.

వ్యాధుని ఆచరణము అందఱికిని తెలిసినదేగదా! ధ్రువుడు పసిబాలుడుకదా! గజేంద్రునకు విద్యలేదుకదా! కుబ్జ వికృతరూపముకలదికదా! కుచేలుడు కడుబీదవాడుకదా! విదురుడు తక్కువకులమున జన్మించినవాడుకదా! వీరందఱు భక్తులు కాలేదా? కాబట్టి,

భక్త్యా తుష్యతి కేవలం న చ గుణైర్భక్తిప్రియో మాధవః

భగవంతుడు భక్తిచే సంతుష్టుడగునేకాని రూపవిద్యాకులధన క్రియాదులచే గాదు. నారదుడు తన భక్తిసూత్రములలోని-

'నాస్తి తేషు జాతి విద్యా రూప కుల ధన క్రియాదిభేదః'

అను సూత్రముద్వారా ఈ సత్యమునే వ్యక్తీకరించెను. హృదయశుద్ధి, చిత్తనైర్మల్యము, భగవద్భక్తి-ఇవి ప్రధానములు. తక్కిన రూప, విద్యాదులు గౌణములు. కనుకనే గీతా

గ్రంథమున నెచటఁజూచినను 'యచ్ఛబ్ద' ప్రయోగము విశేష ముగ కానిపించుచున్నది. (యః=ఎవఁడైనను సరియే అని భావము.) ఈ అధ్యాయమున మరింత స్పష్టముగ కనిపించు చున్నది.

యో మద్భక్తః స మే ప్రియః

'ఎవఁడు నాయెడలభక్తికలియుండునో, వాఁడు నాకు ప్రియుఁడు. అనగా భక్తుని లక్షణములను ఎవరు లెస్సగ గలిగియుందురో వారే నాకు ప్రియులు' అని గీతాచార్యుఁడు విస్పష్టముగ నిట పేర్కొనెను. కావున ఇక ఎవరును తమ పుట్టుకనుగూర్చి చింతపడ నక్కఱలేదు. తమకు విద్యలేదేయని ఏడ్వ నక్కఱ లేదు. తాను సన్న్యాసికాలేకపోతినేయని దిగులుతో నుండ నక్కఱలేదు. తన చిత్తమును భగవానుని పాదపద్మములపై ఏక్షణమున కేంద్రీకరించునో, ఆ క్షణముననే మనుజుఁడు భగ వంతునకు అతి సన్నిహితుఁడై, అతిప్రియుఁడై యుండుటంబట్టి అత్తఱి యాతఁడు సర్వోన్నతకులమును, సర్వోన్నతవిద్యను, సర్వోన్నతపదవిని గ్రహించినవాఁడే యగును. భవదుఃఖసాగర మును దాటినట్లేయగును. ప్రపంచములో ఎట్టి గొప్పపదవిని అలంకరించినవాఁడైనను, సామ్రాజ్యాధీశుఁడైనను, సర్వభౌతిక మానసిక శక్తిసమన్వితుఁడైనను, పరమాత్మకు ఇష్టుఁడు కానిచో, భక్తుఁడుకానిచో, విలువలేనివాఁడే యగును. భౌతిక ముగు ఏశక్తిగాని, యుక్తిగాని, పదవిగాని లేకున్నను దేవు నకు ప్రియుఁడైనచో అతఁడు త్రిలోకములకు చూడామణివంటి వాఁడు. ఒక త్రాసు తెచ్చి అందొక పళ్లెరములో ప్రపంచము లోని సమస్తభోగభాగ్యములను, సమస్తవిద్యలను, శక్తులను

ఉంచి మఱియొక పళ్లెరములో '(శ్రీ)పతి'ని పెట్టినచో ఏది "గురుత్వము" వహించునో మన మూహించవచ్చును. (శ్రీ)కృష్ణ తులాభారముయొక్క రహస్యమిదియే. కావున విజ్ఞుడగువాడు 'భగవంతునకు ప్రియుడగుట' అను మహోచ్చపదవినే యభిల షించునుగాని అన్యమునుగాదు. ముఖ్యముగ ఈ జననమరణ రూప భయంకర దావాగ్నిదాహముచే సంతప్తుడై యున్న జీవుడు మృత్యురహితమగు పరమాత్మను ఆశ్రయించిననే శాంతిని బడయగల్గునుగాని అన్యమగు ఏ క్రియచేతను గాదు. ఆ పరమాత్మయు తన్నెవరాశ్రయించుదురో వారిని దుఃఖోదధి నుండి కాపాడును. వారి జాతివృత్తులను, కులసంబంధములను విచారింపడు. భగవానుని ఈ నిష్పక్షపాత అనుగ్రహాతిశయ మును (శ్రీ)శంకరభగవత్పాదు లెంత చక్కగ వర్ణించిరో చూడుడు—

వటుర్వా గేహీ వా యతిరపి జటీ వా తదితరో
నరో వా యః కశ్చిద్భవతు భవ కిం తేన భవతి
యదీయం హృత్పద్మం యది భవదధీనం పశుపతే
తదీయ_స్త్వం శంభో భవసి భవభారం చ వహసి.(శివానందలహరి)

"ఓ పరమశివా! బ్రహ్మచారియైనను, గృహస్థుడైనను, సన్న్యాసి యైనను, జటాధారియైనను, లేక మఱి యెవ్వరైనను సరియే కానిమ్ము-దానితో నీకు పనిలేదు. ఎవని హృదయకమలము నీ కర్పితమైయుండునో వానికిసంబంధించినవాడవుగనే నీవుందువు. మఱియు నాతని సంసారభారమున్ను వహింతువు.' సర్వేశ్వరుని యిట్టి కరుణాపూరితమగు విశాలభావమువలన, అత్యున్నత దృక్పథమువలన సర్వజీవులున్ను తమ తమ జాతి, కుల సంప్ర

దాయములతో నిమిత్తములేకుండగనే భగవానుని ఆశ్రయించి తరించుటకు చక్కని అవకాశముసిద్ధించినది. మహాపాపాత్ముడు గూడ పశ్చాత్తప్తుడై దైవమార్గము ననుసరించి పుణ్యాత్ము డగుటకు, విముక్తినిపడయుటకు వీలు దొరికినది. చండాలుడు కూడా భక్తి నవలంబించి పరమభాగవతులలో చేరిపోవుటకు అనుకూల్యమేర్పడినది. కాబట్టి ఇక ఎవరున్ను వారివారి పరిస్థితు లనుజూచి హతాశులుకాక, భక్తునకుండవలసిన ఈ సద్గుణము లను అవలంబించి శీఘ్రముగ జన్మను కడతేర్చుకొందురుగాక !

ఇక ఆ సద్గుణము లెవ్వియో విచారింతము. ఎట్టివాడు భక్తుడు కాగలుగును? ఇన్నికోట్లజీవరాసులున్నప్పటికిని భగవం తునకు అందు ప్రియుడెవడు? ఎవనిని అతడు ఎక్కువగ ప్రేమిం చును? ఎవనియెడల ఎక్కువ దయగలిగియుండును ? ఎవడు (1) సమస్తప్రాణులయెడల ద్వేషబుద్ధి లేకుండునో, (2) మైత్రి, కరుణ కలిగియుండునో, (3) అహంకారము, మమకారము లేకుండునో, (4) సుఖదుఃఖములయందు సమభావము కలిగి యుండునో, (5) ఓర్పు గలిగియుండునో, (6) ఎల్లప్పుడు సంతుష్టుడైయుండునో, (7) దైవమార్గమున యత్నశీలుడై మెలగునో, (8) దృఢనిశ్చయము గలిగియుండునో, (9) పర మాత్మయం దర్పింపబడిన మనోబుద్ధులు కలవాడై యుండునో, (10) ఎవడు లోకమును జూచిగాని, లోక మెవనిజూచిగాని భయము నొందకుండునో, (11) ఎవడు హర్ష, క్రోధ, భయ వ్యాకులత్వములు త్యజించియుండునో, (12) దేనియందును అపేక్షలేకుండునో, (13) బాహ్యాభ్యంతర శుచిత్వము (నిర్మ లత్వము) గలిగియుండునో, (14) దక్షుడై (సమర్థుడై) మెల

గునో, (15) ఉదాసీనుడై (తటస్థుడై) వర్తించునో, (16) భయ దుఃఖరహితుడై యుండునో, (17) సమస్త వ్యవహారములను (కామ్యకర్మలను) త్యజించునో, (18) హర్షముకాని, ద్వేషము కాని, శోకముకాని, వాంఛకాని లేకుండునో, (19) ద్వంద్వ రూపములగు శుభాశుభములను పరిత్యజించునో, (20) శత్రు మిత్రులందును, మానావమానములందును, శీతోష్ణము లందును సుఖదుఃఖములందును సమానముగనుండునో, (21)సంగరహితుడై వర్తించునో, (22)నిందాస్తుతులందు సమ ముగ నుండునో, (23) మౌనియై యొప్పునో, (24) లభించిన దానితో సంతుష్టి బొందునో, (25) ఉండుటకు నియతమగు స్థలము లేకయుండునో - (లేక - దేహభావన లేకుండునో), (26) స్థిరబుద్ధి కల్గియుండునో, అట్టివాడు భగవంతునకు మిక్కిలి ప్రియుడు. ఆతనినే పరమాత్మ లెస్సగ ప్రేమించును. కరుణించును. ఇట్టి లక్షణములు కలవాడే భక్తుడనదగును. బంగారమును పరీక్షించుటకు వరిపిడిరాయి యెట్టిదో, భక్తుని తేల్చి చెప్పుటకు ఈగుణము లటువంటివి. ప్రతివారును తమలో ఈ సల్లక్షణములు కలవాయని ప్రశ్నించుకొనవలెను. లేనిచో వాటికొఱకై యత్నించవలెను. కొన్ని యున్నచో తక్కినవాని కొఱకు చేష్టించవలెను. ఇంతకుమినహా భగవానుని కటాక్ష మును సంపాదించుటకు వేఱుదారి లేదు. ముక్తి కావలెనా, భక్తిని సంపాదించవలెను. భక్తి కావలెనా ఈ గుణములన్ని టిని అలవఱచుకొనవలెను. శ్రీకృష్ణపరమాత్మ తెలిపిన ఈ భక్తలక్షణములను సంపూర్ణముగ విచారించుట కిపుడు సమ యము లేదు. కావున ఒకటి రెండు మాత్రము సంక్షేపముగ ప్రస్తావించి ముందుకు సాగిపోయెదను.

నిందాస్తుతులయందు, మానావమానములందు సమాన ముగ నుండవలెనని భగవాను డాదేశించెను. లోకములో సామాన్యముగ తన్నెవరైన స్తోత్రము చేయుచుండినచో మనుజుడు ఉబ్బిపోవును. కన్నుమిన్ను తెలియకుండ ప్రవర్తించును. ఆనందములో తన్మయుడై పోవును. అత్తఱి జీవితము అత్యంతాహ్లాదకరముగతోచును. ఇక ఎవరైన దూషించినచో లేక అపహసించినచో, నిండుమనిషి పాతికమనిషి అగును. క్రుంగిపోవును. తలవంచుకొనును. జగత్తంతయు నీరసముగా తోచును. పరమాత్మ నాశ్రయించ దలంచుకొనువాని కిట్టి అవ లక్షణములు తగవు. ఒకడు స్తోత్రము చేసినచో తనకు ఒరిగిన దేమి ? నిందించినచో తరిగినదేమి? బాగుగ విచారించవలెను. ప్రాపంచిక ఝంఝామారుతములచే అటునిటు చెదరిపోవు దీపకళికలముకాదుతాను, అచంచలమగు మేరుపర్వతమే తానని గుర్తించవలెను. దీర్ఘముగ యోచించినచో అత్యంత పవిత్ర మగు తన ఆత్మ ఒకడు తన్ను సంస్తుతించినచో పెరుగునది కాని దూషించినచో తరుగునదికాని కాదు. ఇక తన దేహమో జడమైనది. కావున పరుల నిందాస్తుతులచే అది ప్రభావితము కానిదే యగును. ఇక మిగిలినది మనస్సు. తన మనస్సు అప విత్రముగా నున్నపుడు ఒకడు దూషించినచో, ఆ దూషణము భూషణముగనే యుండును. ఏలయనిన, తన అపవిత్రతను ఎదుటివాడు వ్రేలుపెట్టి చూపి ఆక్షేపించుచున్నాడు. కావున ఆ దోషమును తొలగించుకొని ఇకమీదట జాగరూకుడై యుండవలెను.అంతేకాని నిందించినాడని క్రుంగికృశింప నక్కఱ లేదు. ఒకవేళ తన మనస్సు పవిత్రముగా నున్నప్పుడు ఎవరైన

దూషించినచో, తన అంతరాత్మసాక్షిగ తాను శుద్ధుడనను భావమున్నందువలన ఆ దూషణను లెక్క-చేయగూడదు. తన హృదయమును సర్వేశ్వరుడొకడు చూచుచున్నాడను ధైర్య ముండినచాలును. తన సుగుణములనుజూచి యెవరైన స్తోత్రము చేసినచో 'భగవంతుని అనంతవిభూతిలో ఈనా ఉపాధి ఒక లవలేశము. ఇందు ప్రత్యేకముగ నా గొప్పతనమేమిటి? నేను నిమిత్తమాత్రుడను. పరమాత్మయొక్క- విశుద్ధత్వముతో పోల్చి చూచిన నేనింకను చాల వెనుకబడియున్నాను. ఇంకను ఎంతెంతో పవిత్రుడనగుటకు గావలసియున్నది.' అని ఈ ప్రకార ముగ తలంచుకొని కర్తృత్వమును పారద్రోలి నిగర్వియై యుండవలెను.

దూషణ భూషణములకు జంకకుండ చేసికొనుట ఒక గొప్పసాధన. పారమార్థిక అభ్యున్నతికి అది ఎంతేని అవసరమై యున్నది. కనుకనే శ్రీకృష్ణమూర్తి ఈ అద్వేష్ట్రత్వాదిదైవిక గుణముల పట్టికలో దానినిగూడ జేర్చెను. మహనీయులందరు అనేకయుక్తులతో ఉపాయములతో తమ మనస్సులను మానావమానములకు అతీతముగ జేసికొనుచుందురు. వారవలంబించువానిలో ఒకటి రెండు యుక్తుల నిచట పొందుపరచెదను. ఏలయనిన సాధకులకు ఇది అవసరమైన ఘట్టము.

మన్నిందయా యది జనః పరితోషమేతి
నన్వప్రయత్న జనితోఽయమనుగ్రహో మే
శ్రేయోర్థినో హి పురుషాః పరతుష్టిహేతోః
దుఃఖార్జితాన్యపి ధనాని పరిత్యజన్తి.

నన్ను తిట్టి ఎవడైన సంతోషపడుచున్నచో అది అప్రయత్నముగ నాకు లభించిన గొప్ప ఉపకారము. ఏలయనగా లోక

ములో జనులు ఇతరులను సంతుష్టిపఱచుటకొఱకై (దానములు చేయుట, చెఱువులు త్రవ్వించుట, సత్రములుకట్టుట మున్నగు కార్యములందు) కష్టార్జితమగు తమ ధనమును ఖర్చుపెట్టవలసి వచ్చుచున్నది. నేనో ఒక్కపైసాకూడా వ్యయము చేయకనే మఱియొకనిని ఈప్రకారముగ సంతోషపెట్టగల్గితిని. ఓహో! ఎట్టి ఉపకారము నాకు గలిగినది? అని ఒక భక్తుడు ఒకానొక దుర్మార్గుడు తన్ను దూషించిన సమయమున పలికి ఆనంద ముతో చిందులుత్రొక్కెను. ఇదియొక యుక్తి. ఇట్టి యుక్తిచే శత్రువు ప్రయోగించిన ప్రాణాంతకమగు అస్త్రమును నిర్వీర్య మొనర్చి సాధకుడు తన కనుకూలముగ అర్థానిని వాడుకొనగల్గెను. దూషణము భూషణముగా మారిపోయెను. శాపము వరముగా పరిణమించెను. మఱియొక యుక్తిని వినుడు-

నమేఽపరాధః కిముకారణం నృణాం
మదభ్యసూయేత్యపి నైవచిన్తయేత్
న యత్కృతా ప్రాగ్భవదిన్న నిష్కృతి
స్తతోఽపరాధః పరమోను కింభవేత్.

నేనేమియు తప్పుచేయలేదు. అకారణముగ వాడు నన్నెందు కు దూషించెను? అని యెవరును చింతపడ నక్కరలేదు. ఏలయనగా నీవొక గొప్ప తప్పుచేసితివి. పూర్వజన్మమునందు మోక్షమునకై, బంధవిముక్తికై తీవ్రప్రయత్నము చేయకుండుటయే ఆ తప్పు. 'ఏమయ్యా! నేను పూర్వజన్మలో మోక్షమునకై తీవ్రప్రయత్నము చేయలేదని మీకెట్లు తెలి యును?' అందువేమో, అట్లు చేసియుండినచో ఇపుడు పుట్టనే పుట్టవుగదా! జన్మించినావు కనుక జన్మరాహిత్య ప్రయత్న ములో పూర్వము లోపము చేసినావని అర్థము. ఈ ప్రకార

ముగ క్రిందటి జన్మయందే మోక్షమును సాధించివేయ కుండుట నీయొక్క గొప్ప అపరాధము. అట్టి అపరాధమును నీవు చేసియు, నాలో ఏ తప్పులేదు. వా డెందుకు నన్ను దూషించెను? అనుచున్నావే! ఈప్రకారముగ నిన్ను దూషిం చుటద్వారా నీ లోపమగు మోక్షప్రయత్న విరహితత్వము నాతడు వ్రేలెత్తి చూపుచున్నాడు. కాబట్టి ఈ జన్మలోనైనా ఆ లోపమును సవరించుకొని గట్టెక్కుము, మహానుభావా! అని దూషకుడు నిన్నాశీర్వదించుచున్నాడన్న మాట.'

వాస్తవముగ విచారించిన నిందగాని, స్తుతిగాని వాయు తరంగములుమాత్రమే యగును. అవి జడములైనవి. అట్టి వానిచే జీవు డేల ప్రభావితుడుకావలెను ? ఆకాశమున శబ్దము పుట్టినది. ఆ శబ్దరూపమే నింద. ఆ శబ్దరూపమే స్తుతి. Censure and praise are mere vibrations of the air ఈ రహస్యమును తెలిసికొనినచో ఇక రోజంతయు ఎవ రైన తిట్టుచున్నప్పటికిని ఆవగింజంతైనను రోషము కలుగదు. ఒక చెవితో విని మఱియొక చెవితో బయటకుసాగనంపుచుండ వచ్చును.

పూర్వము బుద్ధదేవుడు గయలో తపస్సు చేసికొనుచుండ ఒకవ్యక్తివచ్చి ఆదేపనిగ దూషించుట ప్రారంభించెనట! బుద్ధు డేమియూ పలుకలేదు. అతగాడు తనఅక్కసునంతయు వెళ్ళబోసి కొనిన పిదప బుద్ధదేవు డతనిని పిలిచి 'నాయనా! నీ యింటికి ఎవరైన అతిథి వచ్చినపుడు అతని నెవరును లక్ష్యపెట్టక, అత నితో మాట్లాడకయున్నచో అత డేమిచేయును?' అని ప్రశ్నిం చెను. వెంటనే యతడు 'తిరిగి వెళ్ళిపోవును' అని ప్రత్యుత్తర

మిచ్చెను. అట్లే నీవు నన్నెంతయో దూరము అపహసించితివి. నీ దూషణములను నేను స్వీకరింపలేదు. కావున అవి తిరిగి నీ యొద్దకే పోయినవి. వానిని నే నంగీకరించినచో అవి నన్ను బాధించియుండెడివే. కాని నేనట్లు చేయలేదు. నీసొత్తును నీకే సమర్పించితి. అని గంభీరముగ వచింప వాడు తెలివి తెచ్చుకొని తనదారిన తానుపోయెను. ఒకరికి మనియార్డరువచ్చినచో దాని నాతడు స్వీకరించినచో సరి. స్వీకరింపనిచో అది త్రిప్పి వేయబడునుగదా! అట్లే నిందాస్తుతులున్ను. మనము వానిని స్వీకరింపనిచో అవి మనల నేమియు చేయజాలవు. కావున వానిని లక్ష్యపెట్టగూడదు.

**Few only know the Truth, the rest will hate and laugh at thee, but pay no heed.**

> కొందఱే సత్య మెఱుఁగుచుందు రిలను, కాని తక్కినవారు
> ఘనుడ నిన్ను జేరి నవ్విన లక్ష్యంబు సేయబోకు

అని వివేకానందుల గంభీరనినాదము. భౌతికవాదము, నాస్తికత్వము ప్రబలుచున్న ఇక్కాలమున సహజముగనే జనులు పరమార్థ తత్త్వాన్వేషకునిజూచి హేళనచేయవచ్చును. పరిహసించవచ్చును. అత్తఱి సాధకుడు తలక్రిందులుకాగూడదు, తన ఆధ్యాత్మిక దృఢనిశ్చయములను జారవిడువగూడదు. బాణములు పర్వతమును భేదింపజాలనట్లు తన హృదయమును అవి ఏమాత్రము కదలింపజాలనిస్థితియం దుండవలెను. శ్రీకృష్ణపరమాత్మ బోధించిన సమస్థితి యిదియే. నిందాస్తుతులం దట్టి సమభావము కలిగియుండుట భక్తునియొక్క లక్షణము.

గీతాచార్యుడు బోధించిన భక్త లక్షణములలో ఇంకొక్క-దానినిగూర్చి ప్రస్తావించి యిక నేటి ఉపన్యాసమును విరమింప దలంచుచున్నాను. 'సంతుష్టో యేన కేనచిత్'- ఆశకు తావీయక దొరికినదానితో సంతుష్టినొందుట ఒక మహాసద్గుణము. కొందరికి ఎంత లభించినను, ఎంతసంపాదించినను 'ఇంకను చాలదు' అను అభిప్రాయముండును. వారికి ఎప్పుడును అసంతృప్తియే. వారిహృదయము ఎపుడునునిండదు. అసంపూర్తిగనే యుండును. అలకని గంపతో నీళ్లుచేదినట్లుండును వారి పరిస్థితి. అట్టి గంపలో నీళ్ళునిలుచునా? పైకితోడుసరికి అన్నియు కారిపోవును. గంప ఎప్పటికప్పుడు ఖాళీగానే యుండును. అట్లే అట్టి అతృప్తుల హృదయమున్ను ఎన్నివస్తువులు, ఎంతధనము, ఎన్నిభోగములు అనుభవించినప్పటికిన్ని నిండదు. ఇంకను కావలయుననియే వాంఛించును.

నిస్స్వో వష్టి శతం శతీ దశశతం లక్షం సహస్రాధిపో
లక్షేశః క్షితిపాలతాం క్షితిపతిశ్చక్రేశతాం వాంఛతి
చక్రేశః సురరాజతాం సురపతిర్బ్రహ్మాస్పదం వాంఛతి
బ్రహ్మా శైవపదం శివో హరిపదం హ్యాశావధిం కోగతః.

'ఏమియు లేనివాడు 'నాకు నూఱు రూపాయలు లభించినచో బాగుండును' అని కోరుకొనును. నూఱు లభించినచో తృప్తిపడక వెయ్యికి ఎసరుపెట్టును. వెయ్యిదొరికినచో చాలక లక్షకై ప్రాకులాడును. లక్షవచ్చినచో తనివితీరక రాజు కావలెనని కోరుకొనును. రాజు అయినచో తృప్తినొందక చక్రవర్తి కావలెనని ఉబలాటపడును. చక్రవర్తి అయినచో చాలక సృష్టికర్తయగు బ్రహ్మదేవుడు కావలెనని పరితపించును. బ్రహ్మదేవు

డైనచో ఊరుకొనక శివుడు కావలయునని కోరుకొనును. శివుడైనచో తృప్తినొందక విష్ణువు కాజూచును. ఆశకు మితమెక్కడ!!' - అసంతుష్టుని మనస్తత్త్వమిదియే. అట్టివానికి ఏకాలమందును శాంతి లభించదు. ఏలయనగా మనస్సు 'ఇది కావలెను, అది కావలెను, ఇది చాలదు, అది చాలదు' అను ఆందోళనతో నిండియుండి మహాచంచలమై యుండును. చంచలమనస్సు కలవానికి శాంతిసుఖములు ఏనాడును సంప్రాప్తించవు. కావున జీవితములో సర్వేశ్వరుడిచ్చినదానితో సంతుష్టినొంది వ్యవహరించువాడు ధన్యుడు. ఈ కోరికలకు, ఆశలకు అంతు అనునది యుండదు. వానికి లోబడినచో ఎటువంటివారికైనను పతనము తప్పదు.

విష్ణుపురాణములో 'సౌభరి' యను తాపసుని వృత్తాంతమును మీరు వినియేయుందురు. చాలకాల మతడు నీటిలో మునిగి తపస్సు చేయుచుండ ఒకనాడు కండ్లు తెరచి చూచునరికి ఒక మొగచేప, ఒక ఆడచేప, వాని పిల్లలు నీటిలో ఆనందముగ ఇటునటు సంచరించుచుండుటను గమనించెను. విలాసముగ విహరించుచున్న ఆ మత్స్యయుగళమును, ఆనందముతో చిందులుత్రొక్కుచున్న ఆ మత్స్యసంతతిని అవలోకింప ఆ తాపసికి గృహస్థజీవితముపై మక్కువ జనించెను. అష్టసిద్ధులు చేతియందున్న తపస్సంపన్నుల కేమికొదువ? వెంటనే యతడు నీటినుండి బయటికివచ్చి, మాంధాత చక్రవర్తికడకేగి అతని కొమార్తెల నందరిని తనకిచ్చి వివాహము చేయవలసినదిగా కోరెను. చక్రవర్తి ఇరుకున పడిపోయెను. వివాహము చేయుదమా అతని వికృతరూపముజూచి కొమార్తెలందులకు

అంగీకరింతురో, లేదో! చేయకుందుమా, ప్రచండతపస్వి యగుటచే శపించునేమో! ఇట్లు ఉభయపక్షములు ఆలోచించుచు, తుట్టతుదకా మునీశ్వరునితో 'మహాత్మా! పిల్లలు సమ్మతించినచో అట్లే వివాహము చేసికొనుడు!' అని పలికెను. తత్క్షణమే ఆ మునిపుంగవుడు కోటిమన్మథాకార సదృశ లావణ్యముతోఁగూడిన సొంపగురూపమును ధరించి మాంధాతృ దుహితలకడకేగ, వారందఱును ఆతని సుందర రూపురేఖలఁ జూచి హర్షాన్వితచిత్తలై శీఘ్రముగ పరిణయము చేసికొనిరి. వివాహానంతరము సౌభరి వారందఱికిని తన తపశ్శక్తిచే వేఱ్వేఱు భవనములను నిర్మింపజేసి ఒక్కొక్కదానిలో ఒక్కొక్కతెను ఉంచి వారికి వలసిన సమస్తవిలాసములను సమకూర్చెను. ఇట్లు చాలకాలము వారందఱితోఁగూడి పెక్కు భోగములను కేళీవినోదములను అనుభవించెను. సంతానమున్ను కలిగెను. కాని ఎన్ని యనుభవించినను అతనికి తృప్తికలుగలేదు. ఒకటితరువాత మఱియొకటిగా కోరికలు నెన్నంటుచునేయుండెను.ఒకదానిని అనుభవించిన వెనువెంటనే మఱియొకటి సిద్ధముగ నుండుచుండెను.

దృష్ట్వా సుతాస్తత్తనయ ప్రసూతిం
ద్రష్టుం పునర్వాంఛతి మేఽన్తరాత్మా.

"పుత్రులు కావలయుననికోరితిని, పుత్రులు కలిగిరి. అంతటితో ఆగలేదు. వారి సంతానమును (పౌత్రులను) గూడ చూడవలయునను తలంపు నామనస్సునకు కలుగుచున్నది - ఓహో! మాయ ఎంత బలీయమైనది' అని యాతడు తలపోసికొని, భోగములయొక్క, ప్రాపంచిక సంపదలయొక్క క్షణికత్వ

మును ఆశయొక్క దుష్పూరత్వమును మరల మరల విచారించి తుట్టతుదకు విరక్తిని బొందెను.

కావున సంతుష్టి (Satisfaction) లేనిదే జీవితము నిరుపయోగమై పోవును. సంతుష్టి కలవాడే ధనవంతుడు, అసంతుష్టి కలవాడే దరిద్రుడు.

కోవా దరిద్రోహి విశాలతృష్ణః
శ్రీమాంశ్చ కో యస్య సమస్తతోషః (శ్రీశంకరాచార్యులు)

'ఈప్రపంచమున దరిద్రుడెవడు? మిక్కుటమగు ఆశకలవాడే! ఈప్రపంచమున శ్రీమంతుడెవడు? పరమసంతుష్టికలవాడే!' అని శ్రీశంకరభగవత్పాదులు ప్రశ్నోత్తరరూపమున లోకములోని వాస్తవికతను వర్ణించి చెప్పిరి. కాబట్టి సాధకుడగువాడు భగవంతుడిచ్చినదానితో సంతృప్తినిపొంది, గాలిమేడలుకట్టక, పరమార్థపథమున పురోగమించుచు పోవలెను. అప్పుడు మాత్రమే యతడు భక్తుడని యనఁదగును. మఱియు భగవంతునకు ప్రియుడై యొప్పును.

దేవుడు అందఱికిని ఇష్టుడే. దేవునకు అందఱును ఇష్టులా? అనునది ప్రశ్న. భగవంతుడు అందఱికిని ప్రియుడే. కాని అందఱును భగవంతునకు ప్రియులా? అనునది సమస్య. 'దేవుడు గొప్పవాడని నీవనవచ్చును. అది సహజము. కాని నీవు గొప్పవాడవని దేవు డనవలె. "మేప్రియోనరః" అను వాక్యము అతనినోటిగుండా రావలెను. అదియే విశేషము. ఇట్టి స్థితిగలిగినచో ఇక మనుజుడు ధన్యుడైనట్లే. అయితే 'వీడు నాకు ప్రియుడు' అని భగవంతుడు చులకనగా అనివేయునా?

లేక ఇతరుల ప్రోద్బలము వలన అనునా? లేక ఇప్పటికాలమున కొందఱాచరించునట్లు మఱియొక గుమ్మముగుండా వెళ్ళి చేయి తడిపినచో (లంచమిచ్చినచో) అనునా ? ఈ ఆటలు దేవుని యొద్ద సాగవు. ఆతడు మహానియమశీలుడై యుండును. దొడ్డిదారి వ్యవహారమున కచట తావులేదు. గీతయందు తాను చెప్పిన 26 భక్తగుణములు ఎవడు గలిగియుండునో, ఆతని యెడలమాత్రమే అతడు ప్రీతికలిగియుండును. తక్కినవారియెడ ఉపేక్షవహించును. కనుకనే 'భక్తిమాన్ యస్సమే ప్రియః- ఎవడు భక్తుడో వాడే నాకు ప్రియుడు. అనగా ఎవడు పైన పేర్కొనబడిన అద్వేష్టృత్వాది భక్త లక్షణములను కలిగియుండునో వానినే నేను ప్రేమించుదును. వానినే కరుణించుదును' అని శ్రీకృష్ణపరమాత్మ ఈ అధ్యాయమున స్పష్టముగ తెలిపియున్నాడు.

కావున వారివారి ఉన్నతికి, వారివారి అవనతికి వారే కారకులు. ఇన్ని సుగుణములు చెప్పినప్పటికిన్ని అందొక్కటియైనను ఆచరించక పైపెచ్చు విరుద్ధములగు అవగుణములను ఆశ్రయించువారిని భగవంతు డెట్లు కరుణించగలడు ! ఈ సుగుణములన్నియు, ఈ భక్తలక్షణములన్నియు ప్యాసుపోర్టు (Passport) వంటివి. ఒక దేశమునుండి మఱియొక దేశమునకు పోదలంచువారు ముందుగా ఎంతయో శ్రమపడి ప్యాసుపోర్టు (అనుమతి పత్రము)ను సంపాదించుకొందురు. ప్రతికూల లక్షణములేవైన వారియందున్నట్లు అనుమానపడినచో ప్రభుత్వమువారు దానిని ఇచ్చుటకు నిరాకరించుదురు. అపుడిక ప్రయాణము ఆగిపోయినట్లే. అట్లే మోక్షసామ్రాజ్యమునకు

పయనమగుటకు ముందుగా దానికి సంబంధించిన ప్యాసుపోర్టును సమకూర్చుకొనవలెను. శ్రీకృష్ణపరమాత్మ ఈ అధ్యాయాంతమున దెలిపిన చక్కని శీలసంపత్తియే ఆ అనుమతి పత్రము. అది చేతియందు లేనిచో, మోక్షద్వారపాలకులు లోనికి పోనీయరు. మెడపట్టి గెంటి బయటకు త్రోసవేయుదురు. 'నేను గొప్ప ధనవంతుడనే, గొప్ప ఉద్యోగము కలవాడనే, అధికారినే, చాల డిగ్రీలు సంపాదించితినే, నన్నేల లోనికి పోనీయలేదు?' అని యెవరును ఆక్షేపించపనిలేదు, ఏలయనగా, మోక్షద్వారప్రవేశమునకును ప్రాపంచిక వస్తువులగు ధన, జన, అధికార, బలములకును ఏలాటిసంబంధమున్ను లేదు. మోక్ష విషయ మట్లుండనిండు. సామాన్యమగు రైలుప్రయాణమునకు కూడ మనుజుని యితర శక్తిసామర్థ్యములతో డిగ్రీలతో ఏ సంబంధమును లేదు. టిక్కెట్టుమాత్ర ముండినచాలును. అట్లే ఇతర లౌకికసంపత్తు లెన్నియున్నను, లేక అసలు లేకున్నను భగవానుడు తెలిపిన ఈ సుగుణసంపత్తిని ఎవరు కలిగి యుందురో వారే నిరాటంకముగ మోక్షసామ్రాజ్యమున ప్రవేశింప గల్గుదురు. కావున 'ధర్మ్యామృత' మగు ఈదైవీసంపత్తిని ప్రయత్నపూర్వకముగ మనుజుడు సాధింపవలసియున్నాడు. ఈ ప్రకారముగ తన యుద్ధరణను తానే కావించుకొనవలయును.

శ్రీరామకృష్ణపరమహంస బోధించినరీతిగ ప్రతివానికి ఉన్నతపథమున కేగుటకు నాలుగు అనుగ్రహములుండవలెను. (1) భగవంతుని అనుగ్రహము. (2) సద్గురుని అనుగ్రహము, (3) భక్తుల అనుగ్రహము, (4) తన అనుగ్రహము - వీనిలో మొదటి మూడును ఉన్నప్పటికిని నాల్గవది లేనిచో మనుజునకు

ఎక్కువ ప్రయోజనముండదని అమ్మహాసీయుడు పలికినవాక్యములు పరమసత్యములైనవి. అనగా ఎవరెంత ఆశీర్వాదము చేసినను తాను నడక ప్రారంభించినచో, తన ప్రయత్నము లేనిచో గమ్యస్థానము నెట్లు పొందగలడు? కనుకనే శ్రీరామకృష్ణులు అన్ని అనుగ్రహములకంటె 'తన అనుగ్రహము' చాల ముఖ్యమైనదని తెలుపుటకు కారణము. నూఱు అనుగ్రహములు సంపాదించినను తాను సోమరియై పడియున్నచో లక్ష్య మెట్లు పొందబడును? తాను నడక మొదలుపెట్టినచో పైవారు వెనుకనుండి ప్రోత్సాహము (Stimulus) కలుగజేయుచు ముందునకు నెట్టుచుందురు. కాబట్టి బాగుగ పరిశ్రమచేసి, చెమటకార్చి, పట్టుబట్టి, నడుము బిగించి యెట్లైనను ఈ పరమార్థగుణములను సంపాదించవలెను. ఇవి 'అమృతరూపములు' (ధర్మ్యామృతం) అని శ్రీకృష్ణమూర్తి నుడివెను? అనగా జననమరణరూపమగు ఈ 'మృత్యు' సంసారమునుండి జీవుని తప్పించి, మరణరహితమగు పరమాత్మపదవికి చేర్చునవి యని భావము.

ఇట్టి దైవీసంపదను కలిగియున్నచో మాకువచ్చులాభమేమియని కొందఱు ప్రశ్నించవచ్చును. ఏలయనగా తెలివి కలవారు లాభములేని కార్యములందు ప్రవేశింపరు.

ప్రయోజన మనుద్దిశ్య మన్దోఽపి న ప్రవర్తతే.

'ప్రయోజనమును జూడక మందుడైనను కార్యమునందు ప్రవృత్తుడుకాడు' అని ఆప్తవచనము. కావున ఆ ధర్మసూత్రమును గుర్తునందుంచుకొని శ్రీకృష్ణమూర్తియు ఈ అధ్యాయాంతమున అద్వేష్ట్రత్వాది భక్తలక్షణములను శ్రద్ధతో సాధించు

వారికి కలుగు అమూల్యఫలితమును వెల్లడించివేసెను. 'భక్తాస్తేఽతీవ మే ప్రియాః'-ఇదియే ఆ ఫలితము. అనగా భగవానునిఅత్యంతప్రియత్వమును వారు బొందగల్గుదురనిభావము. ఇంతకుమించి జీవునకిక కావలసినదియేమి? సర్వేశ్వరునిదృష్టిలో పడుటకంటె యిక జీవుడు వాంఛింపదగినది యేముండును? 'బ్రహ్మదేవుడు తలంచినచో ఆయువునకు కొఱవా' అనునట్లు మూలవిరాట్ తలంచుకొనినచో ఇక ఏది కొఱతపడును? 'యోగక్షేమం వహామ్యహమ్'-అని ఆతడు చెప్పనేచెప్పెను గదా! కావున ఇక భక్తునకు అన్నియు సమకూడినట్లే. ఏక్షణమున పరమాత్మ 'వీడు నాకు మిక్కిలి ప్రియుడు' అని అనునో ఆ క్షణముననే ఆ జీవుడు చతుర్దశభువనసామ్రాజ్యాధిపత్యముకంటె గొప్పపదవిని పొందినట్లు మన మూహింపవచ్చును. 'వీడు నాకు మిక్కిలి ప్రియుడు'-అను వాక్యములు చెక్కబడియున్న యోగ్యతాపత్రము(Certificate)భగవంతుని చేతులార ఎవనికైన లభించెనా, ఇక ఆతని పంట పండినట్లే. ప్రపంచములోని ఏ విశ్వవిద్యాలయమునందును లభించని మహోన్నతమగు 'డిగ్రీ' అతడు పొందినట్లే. భౌతికవిద్యలకు సంబంధించిన 'డిగ్రీలు' ఈ కాయముతోటి అంతరించిపోవునవే. కాని భగవాను డొసంగు 'మత్ప్రియుడు' అను డిగ్రీ దేహములు పుట్టినను, పెరిగినను, అంతరించినను కలకాలము శాశ్వతముగ నుండి నిరతిశయానంద మొసగూర్చునదియై యున్నది. అట్టి వారికిక ఈ సంసారదుఃఖము శమించినట్లే. ఏలయనగా—

తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్. (12-7)

'అనన్యభక్తితో నన్నాశ్రయించువారిని మృత్యురూపమగు ఈ సంసార మహాసాగరమునుండి పైకిలేవనెత్తి రక్షించుదును' - అని శ్రీకృష్ణమూర్తి గొప్పప్రకటన నొకదానిని గావించెను. కావున సచ్ఛీలము కలిగి, తమచిత్తమును సర్వేశ్వరునియందు లగ్నమొనర్చువారు ఇక జన్మసాఫల్యము నొందినట్లేయగును. మానవత్వమును వారు సార్థకపఱచుకొనినవారే యగుదురు. దుఃఖమును దాటినవారే యగుదురు. కావున భగవానుని యాదేశప్రకారము ముముక్షువు లెల్లరు గీతయం దుపదేశింపబడిన ఈ భక్తిమార్గమును జేపట్టి, నిరంతర సాధనచేతను, సంతతాభ్యాసవశముచేతను దైవసాయుజ్యమును బడయుదురుగాక !

భక్తియను పదము వినగనే 'ఇది చాల తక్కువస్థితి' యనియు, జ్ఞానము అను పదము వినగనే 'ఇది చాల గొప్పస్థితి' యనియు ఎవరెవరు తలంచుదురో వారందఱున్ను భ్రమయం దున్నవారే యగుదురు. 'భక్తియోగము'ను ఈ 12 వ అధ్యాయమును బాగుగ పరిశీలించినచో వారు తమ అభిప్రాయమును మార్చుకొనవలసివచ్చును. భక్తి తక్కువేమి? జ్ఞాన మెక్కువేమి? రెండిటియొక్క లక్ష్యము ఒకే పరమాత్మప్రాప్తి. 13-వ అధ్యాయమగు క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము నందు ఏ అమానిత్వాది జ్ఞానగుణములు పేర్కొనబడినవో, దాదాపు అట్టివేయగు అద్వేష్టృత్వాది గుణము లీభక్తియోగమున తెలుపబడినవి. దీనినిబట్టి భక్తి, జ్ఞానము రెండును సమ ఉజ్జీలని స్పష్టపడుచున్నది. భక్తిమార్గమున సాధకుడు తన స్వార్థము (ego) ను నిర్మూలించుకొని-

అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ

'నీవే నాకు దిక్కు, అన్యమెద్దియునులేదు' అని భగవానుని శరణుబొందుచు ప్రపత్తి నవలంబించుచు, తద్ద్వారా తన చిత్తమును దైవభావనామయముగ నొనర్చుకొనును. జ్ఞానియో, పంచకోశములను బాగుగ విచారించి, దృగ్దృశ్యములను తన ధీశక్తిచే వేఱుపఱచి, మనోబుద్ధి చిత్తాహంకారములనుగూడ దృశ్యవర్గమున పారవైచి, శేషించిన ఆత్మయందు నిలుకడ కలిగి 'చిదానందరూపః శివోఽహం శివోఽహం' అని భావించుచు బ్రహ్మానుభూతిని బడయుచుండును. కావున రెండిటి ఫలితమున్ను ఒకటే.

శ్రీరామకృష్ణపరహంసయొక్క గృహస్థశిష్యులలో నాగమహాశయుడను నాతడు చాల ముఖ్యుడు. సన్న్యాసిశిష్యులలో వివేకానందుడు చాల గొప్పవాడు. నాగమహాశయుడు పరమభక్తుడు. వివేకానంద పరమజ్ఞాని. ఒకడు 'దాసోఽహం' మార్గావలంబి. మఱియొకడు 'శివోఽహం' పథగామి. ఒక పండితోత్తముడు వారిరువురిని దర్శించి ఇరువురి స్వభావములను మన స్తత్త్వములను తత్క్షణమే హృదయంగమ మొనర్చుకొని వారిఁగూర్చి యిట్లు వర్ణించెను-' మాయ అను మహాశృంఖలము (గొలుసు) నాగమహాశయుని, వివేకానందుని ఇరువురిని కట్టివైచినది. కాని నాగమహాశయుడు తన కాయమును చిన్నదిగ, చిన్నదిగ తగ్గించుకొనుచువచ్చి తుట్టతుదకు ఒక చిన్న పురుగువంటి ఆకృతికలవాడై ఆ గొలుసుయొక్క రింగులోని సందుగుండాదూరి తప్పించుకొని పారిపోయెను. వివేకానందుడో తన శరీరమును పెద్దదిగ, పెద్దదిగ కావించుకొని, విజృంభించి ఆ గొలుసును బ్రద్దలుచేసి పారిపోయెను. ఈప్రకారముగ ఇరువు

రును మాయాబంధనమునుండి విముక్తిని బడసిరి' - అనగా భక్తిమార్గావలంబియగు నాగమహాశయుడు 'దాసోఽహం' అను భావన గల్గి తన అహంకారమును చంపుకొని—

త్వద్భృత్య భృత్య పరిచారక భృత్య భృత్య
భృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోకనాథ.

'దేవా! నేను నీ దాసానుదాస తద్దాసానుదాస దాసుడను' - అని భగవానుని కీర్తించుచు తన ఉపాధిని తన మనస్సును చిన్నదిగ, చిన్నదిగ చేసికొని తుదకు పరమాత్మయందు లయింపజేయును. జ్ఞానమార్గావలంబియగు వివేకానందుడు-

మత్తో నాన్యత్కించి దత్రాస్తి విశ్వం
సత్యం బాహ్యం వస్తు మాయోపక్లప్తమ్
ఆదర్శాంతర్భాసమానస్య తుల్యం
మయ్యద్వైతే భాతి తస్మాచ్ఛివోఽహమ్.

'ఈ ప్రపంచము నాకంటె అన్యముగ ఒకింతైనను లేదు. మాయచే ఈప్రకారముగ అది బాహ్యమున కల్పింపబడి యున్నది. అద్దమునందు వస్తువెట్లు కల్పితమై భాసించునో అట్లే అద్వయమగు నాయం దీజగత్తు మిథ్యారూపమున భాసించుచున్నది. కావున వాస్తవముగ ద్వైతములేదు. పరమాత్మయేకలడు. అట్టి అద్వయ శివస్వరూపపరమాత్మనే నేను'—అని ఎలుగెత్తి పాడుచు తన ఉపాధిని (మనస్సును) విశాలమొనర్చి, విశాలమొనర్చి తుట్టతుదకు అనంత పరమాత్మగనే భాసిల్లును-అని భావము. కావున ఏ విధముగ జూచినను ఇరువురును ఏదోయొకవిధముగ తమ మనస్సులను లయముచేసి ఆత్మమాత్రులై శేషించియుండిరి. భక్తియొక్క—

పరాకాష్ఠయు, జ్ఞానముయొక్క పరాకాష్ఠయు రెండును ఒకటియే. మార్గ మొకింత భిన్నముగ కన్పించినను, లక్ష్య మొకటియే. పైన దెల్పిన నాగమహాశయ, వివేకానందులలో ప్రధానమైన గుణము ఎత్తి చెప్పబడినదేకాని, వాస్తవముగ నాగమహాశయునియందు జ్ఞానము లేకపోలేదు, వివేకానందుని యందు భక్తి లేకపోలేదు. కాబట్టి ఇక ముముక్షువులు ఈ భక్తి, జ్ఞానములనుగూర్చిన తర్కవితర్కములందుబడక ప్రధానకర్తవ్యమగు శీలసంపాదన(Ethical training)యందు కాలమును వినియోగించుదురుగాక ! అది సిద్ధించినచో అన్నియు సిద్ధించినట్లే. భగవద్గీతయొక్క హృదయము ఈ సచ్ఛీలసంపాదనయే అయియున్నది. హృదయనైర్మల్యము, చిత్తశుద్ధి, మనఃపవిత్రత ఎచట నుండునో అచట పరమాత్మ దేదీప్యమానముగ ప్రకాశించుచుండును. ఈ అధ్యాయము నందు తెలుపబడిన పరమరహస్య మిదియే. కావున ముము క్షువు లెల్లరును తీవ్రపురుషప్రయత్నము నాశ్రయించి, అనన్య భక్తిసంయుతులై, తమహృదయమందలి అసూయాద్వేషాది దుర్గుణములన్నింటిని పారద్రోలి, భగవంతునకు అతిప్రియులై ఆతని కరుణచే ఈ మహాభయంకరమగు మృత్యుసంసార సాగరమును అవలీలగ దాటివేయుదురుగాక !!

ఓమ్ తత్ సత్.

ఓమ్

# 13-వ అధ్యాయము

# క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము

---

ఇంతదనుక గీతయందలి కర్మషట్కమును భక్తిషట్కమును విచారించినాము. నేటినుండి జ్ఞానషట్కమునందు ప్రవేశించుచున్నాము. శ్రీకృష్ణపరమాత్మ అఖండమగు జ్ఞానోపదేశము చేసిన అధ్యాయము నేటది. జ్ఞేయతత్త్వమును కరతలామలకమొనర్చిన ఘట్టమిది. జీవునకు ఆత్యంతిక దుఃఖవినాశము దేనివలన చేకూరగలదు ? తన స్వరూపమును విస్మరించి దుఃఖించుచున్న వానియొక్క సంతాపము దేనివలన తొలగగలదు ? తన స్వరూపమును స్మరించుటవలన. అట్లే స్వకీయ సచ్చిదానందాత్మ స్వరూపమును మైమఱచి జనన మరణ ప్రవాహరూపమగు సంసారములోబడి దేహభ్రాంతిచే నానా క్లేశముల నొందుచున్న ఈ జీవునియొక్క దుఃఖవినాశము స్వకీయ పరమార్థరూపమును సంస్మరించుటవలననే కలుగుచున్నది. దానినే ఆత్మజ్ఞాన మందురు. అట్టి ఆత్మజ్ఞానమును బడయుటవలననే జీవునకు దుఃఖరాహిత్యము పరమానంద ప్రాప్తి చేకూరుచున్నవి. అట్టి జ్ఞానమునే ఈ అధ్యాయమున శ్రీకృష్ణమూర్తి అర్జునునకు తెలిపియున్నాడు.

ఇదియే జ్ఞాననేత్రము. జ్ఞాననేత్రముతో ('జ్ఞానచక్షుసా') మనుజుడు నిత్యానిత్యములను, ధర్మాధర్మములను, దృగ్దృశ్యములను వివేచించి తెలిసికొనగల సామర్థ్యమును బడయుచున్నాడు.

ఇంతవఱకు చూడజాలని విషయములను చూచుచున్నాడు. తెలియని విషయములను తెలిసికొనుచున్నాడు. భౌతిక నేత్రములు భౌతిక వస్తువులనే వీక్షించును. చర్మచక్షువులు చర్మమునే చూచును. లోనయున్న ఆత్మను చూడజాలవు, అనుభవింపజాలవు. జనులలో పెక్కురికి ఈ తోలుకన్నులే కలవు. కాని విజ్ఞాననేత్రములు లేవు. కనుకనే వారు నశ్వర సౌందర్యమునే చూచి మురిసిపోవుచున్నారు. ఆత్మసౌందర్యము యొక్క లవలేశమైనను వారికి అనుభవము లేకయున్నది. ఇట్టి పరిస్థితిజూచి శ్రీకృష్ణపరమాత్మ కరుణగల్గి జనులకు జ్ఞాన నేత్రమును ప్రసాదింప సమకట్టెను. పతితుల నుద్ధరించుటయే వారి ఆశయముగదా!

ముల్లోకములందలి ముముక్షువులందరియొక్క ప్రతినిధి యగు అర్జునుడు ప్రారంభముననే శ్రీకృష్ణుని ఆఱు ప్రశ్నలు వేసెను. 'మహాత్మా! ప్రకృతియనగానేమి? పురుషు డనగా నెవరు? క్షేత్రమనగానేమి? క్షేత్రజ్ఞు డెవరు? జ్ఞానమనగానేమి? జ్ఞేయమనగానేది? ఈ యాఱు ప్రశ్నలయొక్క సమాధానమే ఈ అధ్యాయమంతయు. వీనిలో మొట్టమొదట క్షేత్రక్షేత్రజ్ఞుల విషయము నెత్తుకొనెను. ఈ అధ్యాయముయొక్క పేరును అదియే. ఆ క్షేత్రక్షేత్రజ్ఞులను తెలిసికొని వానిని విభజించగల శక్తిని నైపుణ్యమును ఎవరు సంపాదించగలరో, వారు సర్వ వేదాంతసిద్ధాంతములను ఆకళింపు చేసికొనినట్లే. శాస్త్రసార మంతయు తెలిసికొనినట్లే. కాబట్టి ముముక్షువు లిద్దానినెఱు గుట అత్యావశ్యకమైయున్నది. ప్రపంచములో రాజకీయ జ్ఞానము, సంగీతజ్ఞానము, అస్త్రజ్ఞానము, శస్త్రజ్ఞానము

ఆయుర్వేదము, మున్నగు జ్ఞానము లెన్నియో యున్న ప్పటికిని-

క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తజ్జ్ఞానం మతం మమ (13-3)

క్షేత్రక్షేత్రజ్ఞులనుగూర్చిన జ్ఞానమే తన సృష్టియందు వాస్తవ మగు జ్ఞానమని భగవానుడు పలికెను. దీనినిబట్టి ఈ అధ్యాయ విషయ మెంత ప్రాముఖ్యత కలదియో విజ్ఞు లూహించుకొనవచ్చును. లౌకికజ్ఞానములు నూఱుబడయవచ్చునుగాక! భౌతిక శాస్త్రముల వెయ్యింటియందు ప్రావీణ్యమును బొందవచ్చును గాక! కాని అవియన్నియు కలిసినప్పటికిని మనుజుని మృత్యు ముఖమునుండి తప్పించజాలవు. సంసారబంధమునుండి విడిపించ జాలవు. దుఃఖమును అంతము చేయజాలవు. జీవితమందలి ప్రధానసమస్య తన్ను తాను తరింపజేసికొనుట. తక్కినసమస్య లన్నియు గౌణములే. ఏలయనగా అవియన్నియు ఈ జన్మకు సంబంధించినవి. ఈ జన్మకుమాత్రమే ముపకరించునవి. రాబోవు జన్మను నివారించుటకుగాని; రాబోవు దుఃఖమును తొలగించు టకుగాని, వానికి శక్తిలేదు. జన్మవచ్చినతరువాత తజ్జనితము లగు బాధలను నివారించుకొనుట సామాన్యమైన పద్ధతి. అసలు జన్మయే రాకుండ చేసికొనుట ఉత్తమ పద్ధతి.

'Prevention is better than cure.'

వ్యాధికలిగినపిదప చికిత్స చేసికొనుటకంటె అసలు వ్యాధియే రాకుండ చేసికొనుట ఉత్తమమని ఆంగ్లభాషయం దొక నానుడి కలదు. మసిఇంటియందు ఎంతజాగ్రతగ మెలగినప్పటికినిగుడ్డలకు ఎప్పుడో ఒకపుడు మసి అంటియేతీరును. ఇంజనులో నున్నవాడు

తమబట్టలు నల్లబడగూడదని నిశ్చయించుకొనునట్లే యుండును, ఈ జననమరణ ప్రవాహములోపడి దుఃఖము కలుగగూడదని యనుకొనువానిస్థితి. చెట్టుయొక్క-కొమ్మలు నఱికినను, ఆకులు త్రుంచివేసినను చెట్టుచావదు. తుదకు మొదలు ఛేదించినప్పటికి చావదు. మరల చిగురువేసుకొని పైకివచ్చును. మూలము పెకలించివేయవలెను. దుంపను త్రెంపవలెను. అపుడే వృక్షము శాశ్వతముగ నశించిపోగలదు. అట్లే ఈసంసార మహావృక్షము నకు బీజము, మూలము అజ్ఞానము. దానినట్లే యుంచి పైపై పూత లెన్నిపూసినను మానవుడు శోభించనేరడు. అది తొలగి ననే మానవునకు దివ్యత్వము, అపునర్భవము లభించును.

శరీరముయొక్క- ఉన్నతాంశము శిరస్సు. అనగా అన్ని అవయవములకంటె శిరస్సు ఉపరిభాగమున వర్తించుచున్నది. అయినను, ఆ శిరస్సుయొక్క- ఉపరిభాగమున నల్లటివస్తువొకటి తిష్ఠవేసికొని యున్నది.అదియేజుట్టు. దానివర్ణము కారునలుపు. నలుపుదనము తమోగుణసూచకము. అజ్ఞానచిహ్నము. 'నేను మానవులందఱి శిరస్సుపై నెక్కి- సవారిచేయుచున్నాను'ని ఆ అజ్ఞానముఘోషించుచున్నదా యనిపించుచుండును, మానవుని యాకృతి పరికించినపుడు. బహుశా అందువలననే కొందఱు కొన్ని మ్రొక్కు-బడులందు దేవాలయ సమీపములో ఆజుట్టును వదిలించి తదుపరి ఆలయములోనికి బోవుచుందురు. జుట్టును తొలగించుట యనగా తమోగుణమును నివారించుట యని అర్థము. అజ్ఞానమును బహిష్క-రించుట యని భావము. 'ఓ జీవులారా! మున్ముందు మీలోనున్న బహుజన్మార్జితమగు తమస్సును, అహంకారమును, అజ్ఞానమును పారద్రోలి ఆపిదప

దై వదర్శనమునకు రండు!' అని చెప్పుటయే యగును. నిజముగ విచారించి చూచినచో వేలకొలది పురుషులు, స్త్రీలు తమ తమ బహుకాలసంవర్ధిత సుందర కేశపాశములను ఒక్క-త్రుటిలో తిరుపతి కొండపై త్యజించివేసి తాత్కాలికముగనైనను తమ దేహాభిమానమునకు తిలాంజలి యొసంగుట ఒక గొప్పపరిణామమే. కాని ఇంతటితో ఆగక తమ మనస్సునందలి వాసనలను, దుష్టగుణములను, దుస్సంకల్పములను, అజ్ఞానవృత్తులనుగూడ గొఱిగించివేసి విశుద్ధహృదయులై భగవద్దర్శనము చేసికొన వలయును. అత్తఱి ఇక భగవద్దర్శనము మాటేమి? తానే భగవంతుడై వెలయును!

కావున మానవుడై పుట్టినపిదప ప్రప్రథమకర్తవ్యము తన అజ్ఞానమును నాశనము చేసికొనుటయే. అదియెట్లునశింపగలదు?

జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః
తేషా మాదిత్యవజ్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్. (5-16)

అను భగవద్వాక్యానుసారము జ్ఞానముచేతనే ఆ యజ్ఞానము దూరీకృతమగునని స్పష్టమగుచున్నది. మేఘము తొలగినపుడు సూర్యుడు దేదీప్యమానముగ ప్రకాశించునట్లు, అజ్ఞానము తొలగినపుడు జ్ఞానమున్ను లెస్సగ ప్రకాశించు చుండును. అత్తఱి ఆత్మ నిరావరణమై భాసించును. కుండమూసి పెట్టిన దీపము చందమున జనుల విజ్ఞానాత్మ తమోగుణ రజోగుణములచే ఆచ్ఛాదింపబడి వెలుగును ప్రసాదింపకయున్నది. ఏక్షణమున జ్ఞానదండముచే ఆ అజ్ఞానరూపఘటము భేదించి వేయబడునో ఆక్షణముననే స్వతస్సిద్ధముగ వెలుగుచున్న ఆత్మ

జ్యోతియొక్క కాంతులు నలువైపుల ప్రసరించును. అట్లు చేయువారే జ్ఞానులు, జీవన్ముక్తులు, బ్రహ్మవిద్వరిష్ఠులు. కాబట్టి జ్ఞాన సంపాదనయే మనుజులకు జీవితమున ముఖ్యకర్తవ్యమని తేలినది. అట్టి మహోన్నతమగు జ్ఞానమునుగూర్చియే ఈ అధ్యాయమున తెలుపబడినది. ఇక దాని స్వరూపమెట్టిదో విచారింతము—

క్షేత్రము, క్షేత్రజుడు-అని రెండు పదార్థములు కలవు. ఒకటి జడమైనది. మఱియొకటి చైతన్యరూపమైనది. ఒకటి చూడబడునది (దృశ్యము). మఱియొకటి చూచునది(దృక్కు). ఒకటి నశ్వరమైనది. మఱియొకటి శాశ్వతమైనది. క్షేత్రమనగా పొలము లేక స్థలము అని అర్థము. క్షేత్రజ్ఞుడనగా ఆ పొలమును చూచువాడు. ఆ స్థలమును వీక్షించువాడని భావము. పొలమునుచూచువాడు పొలముకంటె వేఱుగనుండును. అనగా క్షేత్రజ్ఞుడు క్షేత్రముకంటె వేఱుగనున్నాడని అర్థము. ఇక దార్ష్టాంతమునందు జూచినచో ఈ ఉపాధియే క్షేత్రము. ఉపాధి అనగా దేహముమాత్రమేయని అనేకులు పొరబడుచుందురు. ఆ పొరపాటు లేకుండుటకుగాను గీతాచార్యు డీయధ్యాయ ప్రారంభమున 'మహాభూతాన్యహంకారో......' అను శ్లోకద్వయముద్వారా ఉపాధిని స్పష్టీకరించెను. ఉపాధియనినగాని, దృశ్యమనినగాని, ఈ దేహమేకాదు, పృథివ్యాది పంచమహాభూతములు, అహంకారము, బుద్ధి, అవ్యక్తము, దశేంద్రియములు, శబ్దస్పర్శాది విషయపంచకము, ఇచ్ఛ, ద్వేషము, సుఖము, దుఃఖము, దేహేంద్రియ సమూహము, అంతఃకరణ

వృత్తి, ధైర్యము-మున్నగునవి యన్నియు చేరును. వీనినన్నింటిని తెలిసికొను దృక్స్వరూపమగు ఆత్మయే క్షేత్రజ్ఞుడు.

క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత. (13-3)

సమస్తజీవులయొక్క ఉపాధులయందును ఆ తెలిసికొను క్షేత్రజ్ఞుడు తానేయని శ్రీకృష్ణపరమాత్మ ఆనతిచ్చియుండుటచే బట్టి ఎపుడు జీవుడు చక్కగ ఆత్మానాత్మవివేచన చేసి, క్షేత్రక్షేత్రజ్ఞులను విడదీసి, సాక్షిరూపమగు తన ప్రత్యగాత్మను (త్వం పదార్థమును) అనుభూత మొనర్చుకొనునో, ఆ క్షణముననే యతడు పరమాత్మను ('తత్' పదార్థమును) గూడ సాక్షాత్కరించుకొనినట్లే యగునని స్పష్టమగుచున్నది. ఏలయనిన భగవానుడు తానే అందరి హృదయములందలి క్షేత్రజ్ఞుడనని సెలవిచ్చెను. కాబట్టి సాధకుని ప్రయత్నమంతయు క్షేత్రమును వేఱుచేసి క్షేత్రజ్ఞ (ఆత్మ) స్థితియందు నిలుకడగలిగియుండుటయందే పర్యవసించుచున్నది. ఇక్కార్యమును సాధించుట ఎట్లు? ఇది సామాన్యమైన ప్రయత్నముకాదు. ఎన్నియోకోట్ల జన్మలనుండి కలసియున్న రెండిటిని ఇప్పుడు విడదీయవలసి వచ్చుచున్నది. అట్టి మార్పుకు ఉపాధి మొమ్మొదట అంగీకరింపదు. కావున సాధకుడు భల్లూకపు పట్టుదలతో అభ్యాసమును ప్రారంభించవలెను. అభ్యాస మొకటియే ఇక్కార్య సాధనమున జీవులకు శరణ్యము. ఈ సత్యమును పదే పదే గీతాచార్యుడు ప్రకటించియే యున్నాడు.

'అల్పమగు జీవుడు అనంతమగు పరమాత్మ కాగలడా? మానవు డేకాలమందైనను మాధవుడుగా మారిపోగలడా?

సామాన్యవ్యక్తి ఎన్నడైన కృష్ణుడు కాగల్గునా ? ఇట్లెప్పుడైన సంభవించునా?' అని యెవరును సందేహింపబనిలేదు. తనదేహమందు క్షేత్రజ్ఞుడై వెలుగుచున్న ప్రత్యగాత్మ ననుభూత మొనర్చుకొనిన చాలును. అంతవఱకు వచ్చినచో తక్కినదియంతయు పూర్తి అయినట్లే. అత్తఱి తాను పరమాత్మగనే శేషించును. ఇవ్విషయమున ఏలాటి సంశయమును లేదు. ఉపనిషత్తులు 'అయమాత్మాబ్రహ్మ' 'తత్త్వమసి' ఇత్యాది మహావాక్యములద్వారాను, గీత 'క్షేత్రజ్ఞం చాపిమాంవిద్ధి'- 'జ్ఞానీత్వాత్మైవమేమతమ్' ఇత్యాది మహోచ్చధర్మవాక్యముల ద్వారాను మనలకు అపూర్వమగు ధైర్యమును ప్రసాదించుచున్నవి. తాను ఎన్నటికైనను పరమాత్మ కాగలడనియే ఆ యా శాస్త్రములు, అనుభవజ్ఞులగు మహాత్ములు ముముక్షువునకు హామీ నొసగుచున్నారు.

అయితే గొప్ప పట్టుదల అవసరము. ఇది స్వల్ప ప్రయత్నములవలన తేలు విషయముకాదు. మందాకినిని భూతలమునకు దెచ్చుటకు అలనాడు భగీరథు డెంతటిసాహసమును జూపెనో, రత్నాకరుడను బోయవాడు వాల్మీకియగుటకు ఎంతటి అనవరత తపమును దైవచింతనమును గావించెనో, తన యాశయసిద్ధికై బాలుడగు ధ్రువు డెంతటి పట్టుదల గలిగి సాధనముల నుపక్రమించెనో, అంతటి తీవ్రత యుండవలెను. ఆత్మసాధనమున ముముక్షువు లెంతటి గంభీరబుద్ధిగలిగియుండవలెనో, పట్టుదల వహించవలెనో నిరూపించుటకు శాస్త్రములందు తెలుపబడిన ఒక చిన్న యితిహాసము నిచట తెలిపెదను.

టిట్టిభపక్షియను చిన్న పక్షియొకటి కలదు. (దానినే సంస్కృతములో టిట్టిభమని పేర్కొందురు.) అది యొకనాడు సముద్రతీరమున గ్రుడ్లుపెట్టి ఎచ్చటికో పోయెను. తిరిగివచ్చి చూచుసరికి అవి లేవు. సముద్రతరంగములు వానిని లోనికి ఈడ్చుకొని పోయినవి. ఇక ఆ పక్షియొక్క శోకము నెవరు వర్ణింపగలరు? దుఃఖము పొంగిపొరలెను. మనుష్యజాతియైనను, పక్షిజాతియైనను మాతృహృదయము ఒకటియేకదా! ఎట్టకేలకు గుండెనిబ్బరము చేసికొని ఇక కర్తవ్యమునకుగడంగెను. 'ఈ పాడుసముద్రము నా గ్రుడ్లను తన పొట్టబెట్టుకొనినది. ఇపుడీ సముద్రపు నీరంతయు నా ముక్కుతో తోడివైచి నా గ్రుడ్లను నేను తీసికొందును. బ్రహ్మదేవుడు అడ్డువచ్చిననుసరే ఈపని జరిగి తీరవలసినదే' అని ఘోరప్రతిజ్ఞను బూని తన ముక్కుతో ఒక్కొక్కబొట్టు సముద్రపునీటినిపీల్చి బయట పుక్కిలించి వేయుచుండెను? ఆ సమయమున త్రిలోకసంచారి యగు నారదుడు ఆదారినపోవుచు ఆపక్షియొక్క విచిత్రచర్యను గమనించి సంభ్రమచేతస్కుడై అచటనే నిలిచి ఒకింత సేపు చూచుచుండెను. కాని పక్షి అతనివైపు ముఖముత్రిప్పలేదు. తనపనిలోతాను నిమగ్నమైయుండెను. కొంతసేపటికి నారదుడు దానిని పలుకరించి ఏల యిట్లు నీటినిపుక్కిలించివేయుచున్నావని ప్రశ్నింప, జరిగిన సమాచారమంతయును పక్షి చెప్పెను. నారదుడాశ్చర్యపడి 'ఓసీపిచ్చిదానా! ఇదియెప్పటికైనా సంభవించునా? నీ వెచట, సముద్రమెచట? ఎన్నియుగములకైనను నీ వా సముద్రపునీరంతయు తోడివేయగలవా? అసాధ్యమైన కార్యమును తలపెట్టకు' అని హితము చెప్ప, అంతట నాపక్షి 'మహాత్మా!

కోటియుగములగుగాక ! భూమి తలక్రిందులగుగాక ! సూర్యుడస్త్రాది ఉదయించుగాక ! ఈ పనిమాత్రము నేను విడువను. ఈ ... సముద్రమును హతమార్చువఱకు, నా గ్రుడ్లను నేను తిరిగి తీసికొనువఱకు అన్నాహారములు లేక, కంటిపై కునుకులేక దీనిని సాధించివైచెదను' అని బదులు చెప్పెను. పక్షియొక్క ఆ వాక్యములను విని నారదుని ఒడలు గగుర్పాటునొందెను. 'ఆహా! ఎంతటి సాహసము; ఎట్టి ధీరత్వము ! ఎటువంటి పట్టుదల! మనుష్యజాతిలోనే ఇట్టి దృఢవ్యవసాయశీలురులేరే, ఇక పక్షిజాతిలో నెట్లేర్పడెనో! ఓహో! ముముక్షువులకు చక్కని ఆదర్శమును జూపినది ! ఈ పట్టుదలలో నూఱవభాగమైనను గలిగియుండినచో మానవులందఱును ఎపుడో ముక్తినొంది యుండెడివారు' అని మనంబున తలపోసికొని నారదుడు తన తపశ్శక్తిచే క్షణకాలము సముద్రమును నెండింపజేయ, వెంటనే పక్షి తన గ్రుడ్లను తీసికొని వెడలిపోయెను. కనుకనే శాస్త్రములందు ఆ 'టిట్టిభ' పక్షియొక్క పేరు చిరస్థాయిగ నిలిచిపోయెను.

ఉత్సేక ఉదధేర్యద్వ త్కుశాగ్రేణైక బిన్దునా
మనసో విగ్రహ స్తద్వద్భవేదపరిఖేదతః

కుళింగపక్షి తనముక్కుతో ఒక్కొక్క నీటిబొట్టును పుక్కిలించి వేయుచు సముద్రజలమునంతను రిక్తమొనర్చు ధీరసంల్పము నెట్లు గావించెనో, అట్లే సాధకుడు అఖిన్నుడై తన మనో నిగ్రహమును గూర్చిన సంకల్పమును గావింపవలెను' - అని శాస్త్రములు పేర్కొనినవి. అధ్యాత్మక్షేత్రమున విజయము గావించవలెనన్న మనుజుడు 'పవిత్రత, సహనము, పట్టుదల' అను శీలత్రయము చెక్కబడియున్న పతాకమును ధరించి

ముందునకు సాగిపోవలెను. దీనినే ఆంగ్లమున P³ అందురు. అనగా — P × P × P. Purity, Patience, Perse-verence. ఎవని హృదయము ఈ శీలత్రయముచే పరిప్లావితమైయుండునో, ఇక నట్టి సాధకునకు విజయము విషయమై ఏ సంకోచమున్ను ఉండనక్కఅలేదు. ఆతడు లక్ష్యమును నిరాటంకముగ చేరుకొనగలడు. కాబట్టి ముముక్షువు ధైర్యోత్సాహసమన్వితుడై, గొప్ప పట్టుదలతో గూడి ఈ క్షేత్రక్షేత్రజ్ఞుల రెండింటిని విడదీయవలెను. దేహి, దేహము అను రెండును అజ్ఞానియందు కలిసిపోయినవి. కనుకనే అజ్ఞాని పరమదుఃఖమనుభవించుచున్నాడు. జ్ఞాని ఆ కిటుకు తెలిసికొని ఆరెండింటిని వేఱుచేసి తాను దేహియని నిశ్చయించి దేహమును సాక్షిగ జూచుచున్నాడు. ఇదియే క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ రహస్యము. ఉపనిషత్తులందు దీనినిగూర్చి పెక్కుచోట్ల ప్రస్తావన కలదు. కఠోపనిషత్తునందు యమధర్మరాజు నచికేతునకీ రహస్యమునే బోధించెను—

అంగుష్ఠమాత్రః పురుషోఽన్తరాత్మా
సదా జనానాం హృదయే సన్నివిష్టః
తం స్వాచ్ఛరీరాత్ప్రవృహేన్ముఞ్జాదివేషికాం ధైర్యేణ
తం విద్యాచ్ఛుక్రమమృతం తం విద్యాచ్ఛుక్రమమృతమితి.

'పరమపురుషుడగు పరమాత్మ అంగుష్ఠమాత్రరూపమున సర్వజీవులయొక్క హృదయమున అధివసించుచున్నాడు. ముంజగడ్డినుండి దర్భను వేఱుపఱచునట్లు ఆ పరమాత్మను తన శరీరమునుండి ధైర్యముతో వేఱుపఱచవలెను. ఆ యాత్మ మహాపవిత్రమని, అమృతస్వరూపమని-యెఱుంగవలెను.

క్షేత్రజ్ఞు డొక్కడే. క్షేత్రమో వివిధరూపములనున్నది. దృక్స్వరూపమగు పరమాత్మ ఒకడే. దృశ్యముమాత్రము భిన్న భిన్న ఆకృతులు గలిగియున్నది. కాబట్టి దృశ్యమును వేఱు చేయదలంచువాడు, లేక దృశ్యమును సాక్షిగ వీక్షింపదలంచు వాడు ఆదృశ్యమెట్టిదో, ఏయే రూపములు గలిగియున్నదో, ఏదేది చేరి దృశ్యమనంబడుచున్నదో ముందుగా బాగుగ తెలిసి కొనియుండవలెను. ప్రపంచము, అందలి వస్తువులు కంటికి కని పించుచున్నవి కనుక అవి దృశ్యమని తెలిసికొనుటలో ఏప్రయాస మున్నులేదు. దేహముకూడ కానవచ్చుచున్నదికనుక దానివిష యమైకూడ ఎక్కువ బాధలేదు. ఇక సూక్ష్మములగు మనో బుద్ధ్యహంకారములను దృశ్యమని తెలిసికొనుటలోనే చాల ప్రయాసముకలదు. ఏలయనగా అవి నేత్రములకు గోచరమగు నవికావు. ఆమనోబుద్ధ్యాదులనుగూడా వస్తువువలె ఎవరు పట్టు కొనగలరో, వారే ధీరులు. వారే సాధనయం దారితేరినవారు. అట్టివారికి కోపతాపములుండవు. ఏలయనగా కోపముదయింప గనే దానిని వస్తువువలె పట్టుకొని పీకపిసికి పారవేయుదురు. సంకల్పముదయించగనే 'ఇదిగో సంకల్పముదయించినది' అని తెలిసికొనగలరు. సంకల్పమును చూచునది, తెలిసికొనునది సాక్షియగు ఆత్మకావున, ఎపుడు వారు సంకల్పమును, మన స్సును చూచుట నభ్యసించిరో అపుడు వారు ఆత్మయందు నిలు కడ కలిగియున్నట్లే సిద్ధించుచున్నది. క్రమముగ అట్టి ఆత్మస్థితి దృఢపడ సంకల్ప మెపుడు తొలగిపోవునో ఇక దానిని చూచు నట్టి ప్రక్రియకూడ తొలగిపోవును. అనగా సాక్షిత్వమున్న

అంతరించిపోవును. అపు డాత్మ కేవలము దృశ్యరహితముగ నిరావరణముగ ప్రకాశించును.

పూర్వ మొకపుడు శ్రీ శంకరాచార్యులవారు యాత్ర సలుపుచుండ త్రోవలో నొకవృద్ధుడు అమ్మహనీయునకు దండ ప్రణామ మాచరించి 'మహాత్మా! నేను వృద్ధుడ నయితిని; కాటికి కాళ్ళుచాచుకొనియున్నాను. పెద్దపెద్ద సాధనలనుచేయ లేను. కావున మోక్షము నొందుటకు, ఆత్మస్థితి యనుభూత మగుటకు సులభమైనదియు, అతిశీఘ్రముగ గమ్యమును జేర్చు నదియునగు విధానమేదియైన సెలవిండ'ని ప్రార్థింప మహాను భావుడగు ఆ యాదిశంకరులు సమస్తసాధనలను క్రోడీకరించి ముక్తసరిగా ఒకే ఒక శ్లోకములో ముక్తిమార్గమును తెలియ జేసెను. ఆ శ్లోకము ముముక్షులోకమున చాలా ప్రఖ్యాతి గాంచియున్నది. దానినే ఏకశ్లోకి యనియు అందురు. అయ్యది గురుశిష్య సంవాదరూపమున నున్నది. అది యేది యనిన-

కిం జ్యోతి స్తవ భానుమానహని మే రాత్రౌ ప్రదీపాదికమ్
స్యాదేవం రవిదీపదర్శనవిధౌ కిం జ్యోతిరాఖ్యాహి మే
చక్షు స్తస్య నిమీలనాదిసమయే కిం ధీర్ధియోదర్శనే
కిం తత్రాహమతో భవాన్ పరమకం జ్యోతి స్తదస్మి ప్రభో.

గురువు:- దేనిచే ఈ సమస్తపదార్థములను నీవు తెలిసికొను చున్నావు?

శిష్యుడు:- పగలు సూర్యునిచే, రాత్రిదీపచంద్ర నక్షత్రాదులచే.

గు:- ఆ సూర్యదీపాదులను దేనిచే తెలిసుకొనుచున్నావు?

శి:- నేత్రములచే.

గు:- ఆ నేత్రములను మూసికొనునపుడు ప్రపంచమును దేనిచే తెలిసికొనుచున్నావు ?

శి:- బుద్ధిచే.

గు:- ఆ బుద్ధిని దేనిచే తెలిసికొనుచున్నావు ?

శి:- ఆత్మచే. (నాచే) - ఆత్మయే బుద్ధికి ప్రకాశము.

గు:- కావున, ఆ నీవే - ఆ నీలోని ఆత్మయే పరమప్రకాశము. అదియే నీవనియెఱుఁగుము. అట్లెఱుఁగుటయే మోక్షము.

శి:- మహాత్మా! తమ యనుగ్రహముచే ఆ ఆత్మయే నేనని యెఱిఁగితిని. కృతార్థుడనైతిని.

ఈ ప్రకారముగ శ్రీ శంకరులు సూక్ష్మములో మోక్షమును దిగ్దర్శనము చేసెను. బుద్ధిని ప్రకాశింపజేయునది (తెలిసికొనునది) ఆత్మయని ఈ శ్లోకముద్వారా స్పష్టమగుచున్నది. కావున ప్రాపంచిక దృశ్యపదార్థములనువలె (గోడవలె, చెట్టువలె, పుట్టవలె) మనస్సునుగూడ చూడగల్గు శక్తిని సంపాదించవలెను. సంతతాభ్యాసముచే నిట్టిశక్తి మనుజునకు తప్పక కలుగగలదు. ఇట్టి విధానముచే సాధకుడు సులభముగ ఆత్మయందు స్థితిని సంపాదించగలడు. కాబట్టి బుద్ధితోసహా దేహాది సమస్త సంఘాతమును తనకంటె వేరుగ చూచు ప్రయత్నమును ముముక్షువు ఆచరించుచుండవలెను. ఇదియే ఈ అధ్యాయ ప్రారంభమున క్షేత్రక్షేత్రజ్ఞుల విభజనద్వారా తెలుపబడిన సర్వోత్తమసాధన.

చేట, జల్లెడ అను రెండువస్తువులుకలవు. ఆ రెండిటిలో 'చేటవలె నుండుము కాని జల్లెడవలె నుండకుసుమీ!' అని

శ్రీరామకృష్ణపరమహంస ఆదేశించుచున్నాడు. స్థూలపదార్థములను వెలిగ్రక్కి సూక్ష్మపదార్థములను తనయందుంచు కొనుట చేటయొక్క స్వభావము. అనగా, రాయి రప్ప పొట్టు మొదలగువానిని క్రిందకు త్రోసివేసి నాణ్యమైన సరుకును మాత్రము అది తనలో (చేటలో) నుంచుకొనును. వెయ్యేల, స్థూలములను వదలి సూక్ష్మమును కాపాడుకొనునని సంక్షేపముగ చెప్పవచ్చును. జ్ఞానియగువాడట్లే చేయును. స్థూలములగు దృశ్యపదార్థములను, మనోబుద్ధ్యాదులనుగూడ త్యజించివైచి సూక్ష్మాతిసూక్ష్మమగు ఆత్మను మాత్రము తనయందు అట్టి పెట్టుకొనును జ్ఞాని. అనగా క్షేత్రబుద్ధిలేక క్షేత్రజ్ఞ బుద్ధి గలిగియుండునని భావము. ఇది ఉత్తమ విధానము. అజ్ఞాని అట్లు చేయడు. స్థూలపదార్థములన్నిటికిని తనెత్తిని వేసికొని ఊదులాడుచుండును. 'క్షేత్రమే నేన'ని భావించుచుండును. అంతటితో ఆగడు. సూక్ష్మపదార్థములగు ఆత్మ, దైవము, నాకక్కఱలేదని త్రోసివేయుచుండును. ఇదిజల్లెడయొక్క లక్షణము. జల్లెడ సూక్ష్మమగు పదార్థమును, సున్నితమగు పిండి మొదలైన వస్తువును రంధ్రములగుండ క్రిందకు జారవిడిచి, స్థూలములగు రాయి రప్ప మట్టిగడ్డలు మున్నగువానిని తనయందు (జల్లెడలో) ఉంచుకొనును. దృక్స్వరూపమగు ఆత్మను వదలి దేహధనగృహారామాది దృశ్యపదార్థములందు అహంకార మమత్వాభిమానములు గలిగియుండును. క్షేత్రజ్ఞుని వదలి క్షేత్రమును కౌగిలించుకొనుచుండును. ఇట్టివాడు ప్రకృతికి దాసుడై ఘోరమగు సంసారదుఃఖసాగరమున బడిపోవును. కాబట్టి విజ్ఞుడగువాడు తెలివి తెచ్చుకొని భగవంతుడు తెలిపిన

విధముగ ఏది క్షేత్రమో, ఏది క్షేత్రజ్ఞుడో బాగుగ గమనించి; క్షేత్రరూపమగుదృశ్యపదార్థములందు విరక్తికలిగి క్షేత్రజ్ఞుడగు పరమాత్మయందు స్థితినిబొందుటకై యత్నింపవలయును. బంధ విముక్తికి నిరతిశయానందప్రాప్తికి ఇది ఒక్కటియే మార్గము.

ఇట్టి తత్త్వవివేచనము అందఱికిని సులభముగ లభించదు. అందులకు చిత్తశుద్ధి అవసరము. బ్రహ్మవిద్య తక్కినవిద్యలవలె గాక హృదయ పవిత్రతనుండియే ఆవిర్భవించునని యెవరును మఱువగాదు. ఇక్కారణముననే ఈరంగములోనికి ప్రవేశించు వారరుదు. ప్రవేశించినవారిలో లక్ష్యమును జేరువా రింకను అరుదు*. బ్రహ్మజిజ్ఞాసయొనర్చుటకుపూర్వముసాధనచతుష్టయ సంపత్తియందు ఆరితేరవలసియుండునని బాదరాయణుడు తన బ్రహ్మసూత్రములలో ప్రారంభముననే తెలియజేసియున్నాడు. ('అథాతో బ్రహ్మజిజ్ఞాసా'). పాపముతోగూడి, మలినసంకల్ప యుక్తమై, కల్మషభూయిష్ఠమైనట్టి హృదయము బ్రహ్మవిచా రణకు తగిన క్షేత్రముకాదు. ఒకవేళ అట్టి మలినచిత్తులు తత్త్వ వివేచనమును ప్రారంభించినను అది 'వాచా'గా ఉండిపోవునే కాని అనుభవమునకురాదు. ఇదియొక పరమార్థ రహస్యము.

శ్రుత్వా ప్యేనం వేద నచైవ కశ్చిత్. (2-29)

'ఆత్మస్వరూపమునుగూర్చి వినినప్పటికిని ఎవడును దానిని తెలిసి కొనజాలకున్నాడు' అని రెండవ అధ్యాయమున శ్రీకృష్ణ మూర్తి చెప్పియేయున్నాడు. 'ఎవడును' అనగా ఏ మలిన చిత్తులును, ఏవిషయ వ్యామోహాయుక్తుడును, అని అర్థము.

* మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః. (7-3)

అంటియేకాని అసలు ఎవరును తెలిసికొనజాలరని అర్థము గాదు. 'నిర్ధూత కల్మషులు' తప్పక తెలిసికొనగలరు. కాబట్టి ఉత్తముడగు గురువు తన శిష్యునకు మహావాక్యముల నుపదేశించుటకు పూర్వము, తత్త్వవిచారణయందు ప్రవేశింపజేయుటకు మునుపు తారకము, పంచాక్షరి, అష్టాక్షరి మున్నగు మంత్రముల నుపదేశించి శమదమాదులను అభ్యసింపజేయును. అట్లుకానిచో, శుష్కవేదాంతమునబడి, ఆత్మజ్ఞానము జీర్ణము కాక శిష్యుడు గురువునకే అప్రతిష్ఠ తెచ్చును.

ఈమధ్య ఒకరోగికి జ్వరము, వాంతులు అగుచుండెను. డాక్టరుగారువచ్చి వాంతులకు మందివ్వక, ముందుగా జ్వరమునకు ఔషధము నివ్వగా, ఆరోగి యా ఔషధమును త్రాగి ఎదురుగనున్న డాక్టరుమీాదనే వాంతి చేసికొనెనట! తాను తాగిన మందుకాస్తా డాక్టరుకే తిరిగి ఒప్పగించెనన్నమాట. అట్లే యుండును అపరిపక్వహృదయులకు, పాపచిత్తులకు అమాంతముగ బ్రహ్మజ్ఞానోపదేశము చేసినచో, చేసినవారికే ముప్పు తెచ్చెదరు ఆ పెద్దమనుష్యులు. కాబట్టి మున్ముందు వాంతులు తగ్గుటకు ఔషధము నివ్వవలె. అనగా సాధకుని చిత్తమునందలి పాపమను దోషములను కడిగివేయవలెను. ఆ పిదప అజ్ఞానమను జ్వరమును తాపమను తత్త్వవిచారణచే పోగొట్టవలెను. కనుకనే ఈ అధ్యాయమున శ్రీకృష్ణపరమాత్మ జ్ఞేయవస్తువగు పరబ్రహ్మమునుగూర్చి యుపదేశింపదలంచియు, ప్రారంభముననే ఆపనిచేయక, జ్ఞేయప్రాప్తికి వలసిన సాధనమగు జ్ఞానగుణములను ముందుగా పేర్కొనెను. సాధ్యము (end) ను బొందదలంచువాడు సాధ

నము (means) విషయమై ముందుగా జాగ్రతపడవలయును. అట్లు చేయనందువలననే అనేకులకు లక్ష్యము సుదూరమై పోవుచున్నది. తమ హృదయములందు విష్ణుభగవానుడు శయనించవలెనను అభిలాష ఎవరికైననున్నచో ముందుగా వాటిని క్షీరసముద్రములుగ (సత్త్వగుణసంపన్నములుగ) తయారు చేసికొనవలెను. క్షారసముద్రములుగగాదు. క్షారసముద్రమునందు మొసళ్ళు, తిమింగిలములు (రజోగుణ తమోగుణ జనితములగు కామక్రోధాది రాక్షసులు) శయనించునేకాని విష్ణుభగవానుడుకాదు. ఈ విషయమును ముముక్షువులు బాగుగ జ్ఞప్తియందుంచుకొనవలెను. కావున అనేక పుణ్యకార్యముల చేతను, జపతపదానధర్మములచేతను, పరోపకారముచేతను, శమదమాది సాధనములచేతను, తీవ్ర వైరాగ్యముచేతను చిత్తమందలి దోషములన్నింటిని పరిహరించి, పాపములను నశింపజేసి శుద్ధమొనర్చినచో అట్టి శుద్ధచిత్తమున అధిష్ఠానమగు ప్రత్యగాత్మస్వరూపము లెస్సగ భాసించును. కాబట్టి చిత్తమును నిర్మలము గావించుటయే ముముక్షువుయొక్క ప్రథమ కర్తవ్యము.

పూర్వకాలమున ఒకానొక ధార్మికచిత్తుడగు రాజుండెను. విశాలమగు తన రాజప్రాసాదముయొక్క మహోన్నత కుడ్యముపై మహాభారతయుద్ధసమయమున శ్రీకృష్ణపరమాత్మ రథముపై గూర్చుండి అర్జునునకు గీతోపదేశము చేయుచుండిన పవిత్ర దృశ్యమును చిత్రింపించవలెనని యాతనికి అభిలాష జనించెను. అక్కార్యమునకై యాతడు తన దేశమందలి ధురంధరులగు చిత్రకారులందఱిని రప్పించి వారందరిని పరీక్షించి

అందులో మహాప్రజ్ఞావంతులగు నిరువురిని మాత్రము ఏరు కొనెను. ఆ యిరువురిని తన రాజభవనముయొక్క రెండవ అంతస్తుపైకి తీసికొనివెళ్ళి 'ఓ చిత్రకారులారా! గీతపై నాకు మక్కువ జనించినది. గీతాచిత్రమును నిరంతరము నాకన్నెదుట చూచుకొని ఆనందించవలెనను కుతూహలము కలిగినది. గీతోపదేశము చేయుచుండు పార్థసారథియొక్క పావన ముఖారవిందమును సదా సర్వకాలములందును సందర్శించి కృతార్థుడను కాదలంచితిని. కావున మీరిరువురును చెరియొక గోడ తీసికొని వానిపై గీతోపదేశ చిత్తరువులను లిఖింపుడు. సమయము 6 మాసములు. ఉత్తమచిత్రమునకు బహుమానము 10 వేల రూప్యములు. మీ భోజనము వగైరాలను మేమే భరించెదము. మీరు మాత్రము ఏకాగ్రచిత్తముతో జీవకళ ఉట్టిపడుచుండు విధముగ వాటిని చిత్రింపుడు' అని వారితో పలికెను. వారట్లే యంగీకరించిరి. వారికివ్వబడిన గోడలు ఎదు రెదురుగ నుండెను. మఱుసటిరోజు నిర్ణీతసమయమున పోటీ ప్రారంభమయ్యెను. ఇరువురును వారివారి నైపుణ్యమును జూపుటకు కృతనిశ్చయులైరి. ఒకరిచిత్తరువును మఱియొకరు 'కాపీ' కొట్టకుండ గోడలపై పెద్దతెరలు దించబడెను. ఆ తెరలవెనుక వారు తమ కార్యమును దీక్షతో నుపక్రమించిరి. 6 నెలలు గడచెను. బహుమానమును నిర్ణయించుటకై ప్రముఖులగు నిర్ణేతలు (Judges) రప్పింపబడిరి. మొదటి గోడకు తగిలించిన తెర యెత్తబడెను. చిత్తరువు కండ్లకు కొట్టినట్లు అగుపడెను. సాక్షాత్ శ్రీకృష్ణమూర్తియే ఆ హర్మ్యమున వెలసెనా అనిపించు నంతటి సహజగాంభీర్య

లావణ్యములతో తొణికిసలాడుచుండెను. ఆ చిత్రరాజము చిత్రకారుడు తనపంచప్రాణములను దానియందు ధారబోసెనా యనిపించుచుండెను. అది గాంచి నిర్ణేతలలో చాల మంది 'ఇదియే రెంటిలో ఉత్తమ చిత్రము కావచ్చును' అని మనంబున ఊహాగానము చేసికొనిరి. అయినను తుదినిర్ణయము చేయుటకు చూడవలెనుగదా రెండవదికూడ అని యెంచి దానికి ఎదురుగనే రెండవ గోడను సమీపించిరి.

ఆ రెండవవానిపరిస్థితి యెట్లున్నదనిన, ఆఱునెలలు లక్షణముగా మూడుపూటలు రాజభోజనము ఆరగించుచు చిత్రపుపును ఒకింతైనను లిఖింపక ఊరకనే యుండెను. అయితే ఒక గాజుపెంకును తీసికొని గోడయావత్తు దానితో బాగుగ రుద్దుచుండెను. ఈఆఱునెలలు అదేపనిగ రుద్దగా రుద్దగా చివఱకు ఆగోడ నున్నగా అద్దమువలె తయారయ్యెను. ఏసమయమున ఆ గోడకు తగిలించబడిన తెర యెత్తివేయబడెనో, ఆ సమయముననే అద్దమువలెనున్న ఆగోడలో ఎదుటివాని చిత్రరుప్ర ప్రతిబింబించెను. నిర్ణేతలందఱున్ను ఆశ్చర్యచకితులైరి. ఆహా! ఎట్టిచిత్రము నీతడు లిఖించెను. మొదటివాడు రంగులతో వ్రాసెను. ఈతడు రంగులు లేకనే రంగులను సృష్టించెనే! మొదటివాడు గోడపై గీసెను. ఈతడు గోడలోపలనే గీసెనే! పైగా చిత్రము అద్దమునందువలె తళతళ మెరయుచున్నదే! ఓహో! అద్భుతము! ఎట్టి చాకచక్యము!! అని దానిని మిక్కుటముగ పొగడుచు దానిని లిఖించినవానికే ప్రథమ బహుమానమును సమర్పించివైచిరి!! చూచితిరా! చిత్రరువేమియు లిఖింపకున్నను పారితోషికమును బడయగల ఘనత

నాత డెట్లు సంపాదించగల్గెనో! ఉన్నవస్తువును శుద్ధమొనర్చు టయే ఆతడు చేసినపని. క్రొత్తవస్తువును తెచ్చిచేర్చుటకాదు.

అట్లే ఆత్మసాక్షాత్కారమును బడయగోరు ముముక్షువు క్రొత్తగా ఒకవస్తువును అది దేవుడైనను సరే - తనలో నూతనముగా తీసికొనిరావలసినపనిలేదు. ఆ దేవుడు తనలోనే సిద్ధముగా నున్నాడు. క్షేత్రజ్ఞరూపమున వెలయుచున్నాడు. (అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః) కాని జీవుని మలినమనస్సుచేత కప్పబడి అనుభూతుడు కాకయున్నాడు. అనేక జన్మార్జిత ఘనీభూత వాసనాజాలముచే తిరోహితుడై వర్తించుచున్నాడు. ఎపుడా మనస్సు అభ్యాసవశమున శుద్ధపడునో, నిర్మల ముకురమున ప్రతిబింబమువలె అట్టి నిర్మలాంతఃకరణమున ఆత్మతేజము లెస్సగ భాసించును. కనుకనే శ్రీకృష్ణపరమాత్మ గీతయందు పదే పదే ఈ చిత్తశుద్ధికి వలసిన సామగ్రినే యిచ్చుకొనుచు పోయెను. బాగుగ విచారించి చూచినచో గీతయం దెల్లెడలను సాధ్యవస్తువును గూర్చి మితముగను, సాధననుగూర్చి విశేషముగను భగవానుడు తెలిపియున్నట్లు మనముగమనించగలము. ఈ అధ్యాయమందలి జ్ఞానగుణములగు అమానిత్వాదులున్ను అట్టి సాధననే నిరూపించుచున్నవి. వాసనాక్షయమున కవి యెంతయో సహాయకారులుగ నుండగలవు. ఆ యిరువది గుణములున్ను అతి ప్రధానములైనవి కనుక వానినిగూర్చి ఒకింత తెలిసికొందము. అవి యేవియనగా—

(1) అభిమానము లేకుండుట (2) దంభము వదలుట (3) హింస తొలగించుట (4) ఓర్పుగలిగియుండుట (5) ఋజు

త్వము స్వీకరించుట (6) గురుసేవ చేయుట (7) శుచిత్వము కలిగియుండుట (8) చిత్తస్థైర్యమవలంబించుట (9) మనోనిగ్రహము కలిగియుండుట (10)ఇంద్రియార్థములగు శబ్దస్పర్శాదులందు విరక్తిగలిగియుండుట (11) అహంకారము లేకుండుట (12) జనన, మరణ, వార్ధక్య, రోగములందు గల దుఃఖరూప దోషమును మాటిమాటికి పర్యాలోచించుట (13) ఆసక్తి లేకుండుట (14)పుత్రదారగృహాదులందు తగుల్గొనకయుండుట (15) ఇష్టానిష్టములు సంప్రాప్తించినపుడు సమబుద్ధి గలిగియుండుట (16) భగవంతునియందు అనన్యభక్తి, అచంచల విశ్వాసము గలిగియుండుట (17) ఏకాంతస్థలము నాశ్రయించుట (18) జనసమూహామునందు ప్రీతిలేకుండుట (19) నిరంతరము అధ్యాత్మజ్ఞానముతో గూడియుండుట (20) తత్త్వజ్ఞానార్థమును బాగుగ ననుభూత మొనర్చుకొనుట—

ఈ యిరువది గుణములు జ్ఞానమనబడును. వీనికి విరుద్ధములైనవి అజ్ఞానమని పేర్కొనబడును. కాబట్టి విజ్ఞుడగువాడు ఒక్కొక్కగుణమును బాగుగ వివేచించి, అభ్యసించి దానిని తనసొత్తుగ జేసికొనవలెను. పుస్తకమందున్న ఈ గుణములు మస్తకమున కెక్కవలయును. 'వాచా'గా నున్న ఈ జ్ఞానసంపద అనుష్ఠానరూపముగ మారవలయును. ఇల్లుకట్టుటకుముందుగా, లేక ఆనకట్ట మొదలైన ఏవైన గొప్పనిర్మాణములుచేయుటకు పూర్వము ఇంజనీరులు వానికి సంబంధించిన 'మ్యాపులు' 'చార్టులు' తయారుచేయుదురు. వానినే 'బ్లూప్రింట్' (Blue-print)లు అందురు. వారిపని ఆ మ్యాపులతో పూర్తికాదు.

ఆ మ్యాప్ చూచుకొని దాని ప్రకారము అసలు నిర్మాణమును గావింతురు. అట్లే గ్రంథస్థమగు విషయములను ముమ్ముందు బాగుగ తెలిసికొని తదుపరి ఆచరణయందు వానిని లెస్సగ జీర్ణింపజేసికొనవలయును. 'సద్గుణవిదు'డగుట మంచిదేకాని, అది చాలదు. 'సద్గుణమూర్తి' కావలయును. కావున భగవత్ప్రోక్తములగు ఈవింశతిజ్ఞానగుణములు తనరక్తనాళములలో ప్రవేశించువఱకు సాధకుడు నిదురపోరాదు; తన ప్రయత్నమును విరమింపరాదు. ఈ అద్భుతజ్ఞాన సంపదలోని ఒకటి రెండంశముల నిట విచారించి ముందునకు బోయెదము.

'ఇంద్రియార్థేషు వైరాగ్యం' - ఇంద్రియవిషయములగు శబ్దస్పర్శాదిభోగములందు విరక్తిగలిగి యుండవలెనని భగవాను డుద్బోధించెను. జ్ఞానగుణములు ఇఱువదింటిలోను ఈ వైరాగ్య మొక అతిముఖ్యమగు గుణము. 'జ్ఞేయ' వస్తువగు పరమాత్మయొద్దకు దారితీయునదే 'జ్ఞానము'. కావున ఈజ్ఞానగుణములన్నియు అవశ్యసంపాదనీయములగుటచే అందులో నొకటియగు ఈ విషయవిరక్తి కైవల్యప్రాప్తికి అత్యావశ్యకమని వేఱుగ చెప్పవలసినపనిలేదు. ఇదియున్న నే మనస్సు త్వరలో నిగ్రహింపబడగలదని పూర్వము ఆఱవ అధ్యాయములో శ్రీకృష్ణమూర్తి తెలిపియేయున్నాడు.* ఇంకను గీతయందనేకచోట్ల దీనిగూర్చిన ప్రస్తావనచేయుచువచ్చెను. ఇది (విరక్తి) సాధకులకు పెన్నిధివంటిది. దీని నాశ్రయించినవారు అచిరకాలములో శాంతిసౌఖ్యములను బడసిరి! బడయుచున్నారు. బడయగలరు. ఇంతటి ప్రాధాన్యత కలిగియున్న

* అభ్యాసేన తు కౌన్తేయ వైరాగ్యేణ చ గృహ్యతే. (6-35)

ష్టటికిని, విషయలోలురగు జనులు 'వైరాగ్యమ'ను మాట వినగనే మూతిముడుచుకొనుచుందురు. 'ఎన్ని జన్మల నుండియో మిత్రత్వము నెరపుచువచ్చిన కామాదులను ఏల విడువవలయున'ని వారి భావమేమో! ఎంతయోకాలము ప్రీతితో అనుభవించుచువచ్చిన భోగములను విడుచుటకు వారికి మనస్సొప్పదు.

అయితే ఇంతకాల మనుభవించి అనుభవించి వారు పొందినదేమి? పోనిండు, ఆ భోగములయెడల వారికి తృప్తి యైన కలిగినదా? పోనీ, అనుభవించినమీదట అవి ఏమైన తరిగినవా? అవి తరగకపోగా పైపెచ్చు అనుభవించినవాడే శారీరకముగ, మానసికముగ తరగిపోవుటను మనము గమనించుచున్నాము. ఎన్నియో భోగము లనుభవించిన భర్తృ హారియొక్క అనుభవమును జూడుడు—

భోగా న భుక్తా వయమేవ భుక్తా
స్తపో న తప్తం వయమేవతప్తాః
కాలో న యాతో వయమేవ యాతా
స్తృష్ణా నజీర్ణా వయమేవ జీర్ణాః.

భోగములు మాచే అనుభవింపబడలేదు, మేమే భోగములచే అనుభవింపబడితిమి (తినివేయబడితిమి). తపస్సు మాచే తపింప బడలేదు, మేమే పైపెచ్చు తపింపబడితిమి. కాలము పోవుట లేదు, మేమే పోవుచున్నాము. తృష్ణ (ఆశ) జీర్ణించి పోవుట లేదు, మేమే జీర్ణించిపోవుచున్నాము'-ఈవాక్యములు పరమ సత్యములు. ఏలయనగా తానేమో అనుభవించి ఒరగబెట్టు చున్నాడని భోగి అవివేకముచే అనుకొనుచున్నాడేకాని, వాస్త

వముగా తానే ఆ భోగములచే అనుభవింపబడుచున్నాడు. వాని జీవితమంతటిని అవి పీల్చి పిప్పిచేసివేయుచున్నవి. కనుకనే జీవితమందు పరమానందమును, నిరతిశయశాంతిని అన్వేషింప దలంచిన బుద్ధదేవుడు మొదలగు మహామహులు తమకుగల భోగైశ్వర్యములకు ముందుగా తర్పణము వదలిరి. ఒకచెంప వాటిని అనుభవించుచు, మఱియొకచెంప దేవుని (లేక, నిర్వాణ సుఖమును) అనుభవింపవలెననిన, అది సాధ్యపడు విషయము కాదు. అట్లు సాధ్యపడుచో శ్రీకృష్ణపరమాత్మ పదేపదే వైరాగ్యమునుగూర్చి గీతయందు బోధించియే యుండెడివాడు కాదు. ఉపనిషత్తులన్నియు దానిమాటే ఎత్తుకొని యుండెడివి కావు. శాస్త్రములు దాని జోలికే పోయి యుండెడివి కావు. కాని మహనీయులందఱును, శాస్త్రములన్నియును ముముక్షువులకీ 'ఇంద్రియార్థవిరాగము' అత్యావశ్యకమని చెప్పుచుండుట వలన, మోక్షమార్గ మదియేయని స్పష్టమగుచున్నది.

సత్యమిట్లుండ, నేడు ప్రపంచముయొక్క పోకడ మఱియొక విధముగనున్నది. పెక్కురు దేహమునకు బ్రహ్మరథము పట్టుచు, దేహిని తిరస్కరించివేయుచున్నారు. తినుట, త్రాగుట, నిద్రించుట, గంతులు వేయుట, పాశవికవికృతులు కలిగి యుండుట-ఇవియే పరమార్థములుగ వారికి తోచుచున్నవి.

'యావజ్జీవేత్సుఖం జీవే దృణం కృత్వా ఘృతం పిబేత్'

బ్రతికిన కొంచెముసేపు సుఖముగా బ్రతకవలె. అందులకై అప్పుఅయినాచేసి నేతిని త్రాగవలె - ఇదియే వారి మూలసిద్ధాంతము. ఇట్టివారికి - అనగా అస్థిరపదార్థమును గట్టిగా పట్టుకొని వ్రేలాడువారికి ఎన్నటికైనను పతనము

తప్పదు. 'శవము, శివము' అను రెండు వస్తువులు కలవు ఈ శరీరములో. అందు శవము నాశ్రయించువాడు-అనగా భోగి ప్రకృతిచే చెంపదెబ్బలుతిని మృత్యురూపమగు సంసార మహా అఘాతమున పడిపోవును. 'శివము' నాశ్రయించువాడు-అనగా యోగి అమృతరూపమగు పరమాత్మనుబొంది నిత్యనిరతిశయానంద మోక్షసామ్రాజ్యము నధిష్ఠించును. కావున విజ్ఞుడగువాడు బాగుగ యోచించి దేనియందు ఎక్కువ దృష్టిని ఉంచవలెనో బాల్యకాలముననే నిర్ణయించుకొని తదనురీతి జీవితమంతయు వ్యవహరించవలెను.

శవాకారం యావద్భజతి మనుజస్తావదశుచిః
పరేభ్యః స్యాత్ క్లేశో జనన మరణవ్యాధి నిలయః
యదాత్మానం శుద్ధం కలయతి శివాకారమచలం
తదా తేభ్యో ముక్తోభవతి హితదాహ శ్రుతిరపి (వివేకచూడామణి)

"మనుజుడెంతవఱకు శవమువంటి ఈశరీరమును 'అహం' బుద్ధితో సేవించుచు దానినే పరమార్థముగ భావించుచుండునో, అంతవఱకు అపరిశుద్ధుడై పుట్టుక, చావు, రోగము మొదలగువాని వలన శ్రమ నొందుచుండును. ఎపుడు శుద్ధమై, శివస్వరూపమైనట్టి ఆత్మను సేవించునో, అపుడా జననమరణాదులవలన కలిగిన కష్టములనుండి విముక్తుడగును. వేదము లీప్రకారముగనే బోధించుచున్నవి" - అని శ్రీ శంకరాచార్యులవారు ఆనతిచ్చిరి - ఇట్లని చెప్పుటచే శరీరమును ఉపేక్ష చేయుమని అర్థముకాదు. శరీరమునే చరమలక్ష్యముగ [illegible] భోగాదులందు మునుంగరాదని చెప్పుటయే యగును. మఱియు శరీరాం

తర్గతమగు క్షేత్రజ్ఞుడైన పరమాత్మను ఆశ్రయించవలెననియు భావము.

ఒకవేళ తాని భోగాదులను, ఇంద్రియ విషయములను చేతులార వదలనిచో, బలాత్కారముగ వాటిని వదిలించి వేయు వాడొకడు రాగలడు. ఆతడే మృత్యువు. ఈ విషయమును విలాసపురుషులందఱును జ్ఞప్తియం దుంచుకొందురు గాక ! మహాత్ములు, శాస్త్రములు నయముగా జెప్పినచో నేడు వినకపోయిన రేపు భయముతోనైన వానిని తప్పక అంగీకరించవలసివచ్చును. మృత్యుదేవతవచ్చి వీపుపై పిడి గ్రుద్దులు గ్రుద్దినగాని మనుజునకు తెలివి వచ్చుటలేదు.

ఒక గ్రామములో నొకవర్తకుడు అంగడి తెరచుకొని బేరగాండ్రకు వస్తువులను విక్రయించుచుండెను. ఒకనాడు మధ్యాహ్న సమయమైనది. వర్తకు డేదియో పనిమీద బయటకు వెడలెను. అంగడిలో ఎవరునులేరు. ఆ సమయము కని పెట్టి ఒక కోతి లోనికి ప్రవేశించెను. గదియంతయు తేఱి చూడగా దానికొక ఇనుపకూజా కనిపించెను. దానిలో జీడిపప్పు ఉండెను. కోతియొక్క ఆనందమునకు మేఱలేదు. జీవితము ధన్యమైనదని భావించెను. వెంటనే కూజాలో చేతిని దూర్చి తన గుప్పెటనిండుగా జీడిపప్పును గట్టిగా పట్టుకొని చేతిని పైకి లాగగా చేయి రాలేదు. ఏలయనగా కూజామెడ సన్నగానుండెను. గుప్పెట పెద్దదిగానుండెను. తన శక్తికొలది చేతిని బయటకులాగ ప్రయత్నించినప్పటికిని అది రాలేదు. ఇంతలో దురదృష్టవశాత్తు ఆవర్తకు డచటికివచ్చెను. గదిలో కోతియుండుట జూచి ఒక దుడ్డుకఱ్ఱ తీసికొని దానిని గట్టిగా

బాడెను. అది పారిపోవజూచినది కాని చేయి కూజాలో ఇరుకు కొనిపోవుటచే సాధ్యపడలేదు. ఆ దౌర్భాగ్యవానరము తన గుప్పిటలోని జీడిపప్పును వదలివేసినచో చేయి కూజా నుండి సులభముగ బయటకు వచ్చివేసియుండెడిది. కాని ఆశ అడ్డు పడినది. తృష్ణ బంధించివేసినది. వాటికి లోబడిపోయిన ఆ మూర్ఖశాఖామృగము చేతిని వదిలించుకొనలేక నానా బాధలు పడుచుండెను. వీపుపై ప్రహారములు ఏకధాటిగపడుచుండెను. తుట్టతుదకు ఆ బాధలను సహింపలేక కోతి తన ప్రాణములను వదలెను. ప్రాణములనైన వదలుటకు అది సిద్ధపడినదే కాని జీడిపప్పును మాత్రము వదలలేదు. ఇది నేటి 'విషయదాసుల' పరిస్థితి. ప్రాపంచికభోగలాలసుడే ఆ కోతి. విషయభోగములే (ఇంద్రియార్థములే) జీడిపప్పు. మృత్యువే వర్తకుడు. ఈసంసారమే అంగడి. కావున మృత్యువుచే చావుదెబ్బలు తినక పూర్వమే శాస్త్రగురువాక్యములందు విశ్వాసముగలిగి విషయ వ్యామోహమును పరిత్యజించివేయుట మానవుని కర్తవ్యము. 'ఇంద్రియార్థేషు వైరాగ్యమ్' అను శ్రీకృష్ణపరమాత్మయొక్క హితవచనములందు నమ్మకముంచి పరమార్థసాధకుడు విష ప్రాయములగు విషయభోగములందు విరక్తిని సంపాదించుట పరమశ్రేయస్కరము.

'The eternal interests of the Soul are of much higher value than the fleeting interests of the mundance life the gratification of the senses is but like the thoughtless play of the baby'

చంచలములగు ప్రాపంచికవిషయములకంటె శాశ్వతములగు పారమార్థిక విషయములు చాల గొప్పవి. ఇంద్రియములను తృప్తిపఱచుచు విషయభోగము లనుభవించుట పసిపిల్లల ఆట వంటిదియే యగును' అని వివేకానందులు పలికియున్నారు. ఎంత వఱకు ఇంద్రియములు, మనస్సుబహిర్ముఖములై భోగజాలము లందు మునిగియుండునో, అంతవఱకును హృదయస్థమగు పరమాత్మయొక్క లేశమాత్రమైన అనుభవముకూడ వాటికి కలుగ నేరదు. అంతర్ముఖము చేకూరదు. మనస్సు, ఇంద్రియములు అంతర్ముఖములు కానిచో నిరతిశయ ఆత్మసౌఖ్యమును జీవు డెన్నటికిని నోచుకొనలేడు. కాబట్టి పూర్ణ సుఖమును, జననమరణ రూప బంధరాహిత్యమును, ఆత్మానుభూతిని బడయగోరు ప్రతి మానవుడున్ను తన ఇంద్రియ మనంబుల విషయమై కడుజాగరూకుడై, భగవాను డుపదేశించినవిధముగ ఇంద్రియార్థములగు శబ్దస్పర్శాదులందు విరక్తి గలిగి ఎప్పుడెప్పుడవి భోగానుభవమునకై పైకి లేచుచుండునో అప్పుడప్పుడు వివేకమను దండము (కఱ్ఱ)చే దానిని అదుపులోనికి తీసికొని వచ్చుచుండవలెను.

> ఉత్థితానుత్థితానేతా నింద్రియాహీన్పునః పునః
> హన్యాద్వివేకదండేన వజ్రేణేవ హరిర్గిరీన్. (యోగవాసిష్ఠము)

ఇంద్రియములను సర్పము లెప్పుడెప్పుడు భోగాస్వాదనమునకై పైకి లేచుచుండునో అప్పుడప్పుడు-ఇంద్రుడు వజ్రాయుధముచే పర్వతముల ఱెక్కలను ఛేదించివేయునట్లు-వివేకమను కఱ్ఱచే వాటిని బాది, దారికి తీసికొని రావలయును'-అని శ్రీ వసిష్ఠ మునీంద్రుడు శ్రీరామచంద్రునకు చక్కటి సాధనను బోధించి

యుండెను. ఇంతదనుక గీతాచార్యు డుపదేశించిన అమా నిత్వాదిజ్ఞానగుణములలో 'ఇంద్రియార్థేషు వైరాగ్యమ్' అను ఒక్కదానిని గుఱించి మాత్రము యోచించవలసినది. మరి యొక దానిని గూడ సంక్షేపముగ ప్రస్తావించి ఇక జ్ఞేయ వస్తువునందు ప్రవేశించెదము.

'జన్మమృత్యు జరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్'- జనన, మరణ, వార్ధక్య, రోగాదులవలన కలుగు దుఃఖములను దోషములను మరల మరల చింతన చేయుచుండవలెనని భగవానుడాదేశించెను. ఎంతటి గొప్ప సదుపదేశము! లోకములో ఈజననమరణాదులవలన పెక్కుక్లేశములు సంభ వించునని జనులకు తెలిసియున్నప్పటికిని ఆ విషయమును కప్పి పెట్టుకొని కండ్లుమూసికొని వారివారి వ్యవహారములను సలుపు చున్నారు. పైపైకి సంసారము సుఖమయమని చెప్పుచుందురు. లోలోన దుఃఖములతో, తాపత్రయములతో కుమిలిపోవు చుందురు. ఒకవేళ ఒకింత సుఖము సంప్రాప్తించినను అది సుఖాభాసమే కనుకను, స్వప్నమందలి సుఖమువంటిదే యగుట వలనను, ప్రతిబింబసుఖమే అయియున్నందువలనను, సంసార మహాదుఃఖములలో ఆ కొంచెము సుఖము సముద్రములో ఇంగువవలె ఎచటనో విలీనమై పోవుచున్నది.

ఈమధ్య కొంతకాలము క్రిందట ఒక విద్యావంతుడగు యువకుడు నూతనముగ వివాహము చేసికొని, 'క్రొత్తఒకవింత' అనునట్లు ఆ యౌవనోత్సాహములో, ఆ వైవాహిక క్షణిక సుఖములలో తన్మయుడై, ఆనందోత్ఫుల్లమానసుడై, తన యింటిగోడపై 'సంసారము సుఖమయము' అని పెద్ద అక్షర

ములతో వ్రాసిపెట్టెను. కొన్ని సంవత్సరములు గడచినది. సంసారవృక్షమునకు చిలువలు పలవులు పెట్టినవి. సంతానము అధికము కాజొచ్చెను. '9' సంఖ్యను అది చేరుకొనెను. పిల్లలలో ఒకడు రౌడీగా తయారయ్యెను. మఱియొకనికి ఎప్పుడును ఏదోయొక రోగముపట్టి పీడించుచుండెను. వారిని పోషించలేక, వారి అల్లరిమాన్పలేక, వారి వ్యాధులను పోగొట్టలేక విసుకు పుట్టి, సంసారముపై చీకాకు జనించి ఒకనాడు తటాలున గోడదగ్గఱకుపోయి తా నిదివఱలో వ్రాసియుంచిన 'సుఖమయము' అను పదములోని 'సు' అను అక్షరమును తుడిచివేసి అచ్చోట 'దుః' అను అక్షరమును ఇరికించి 'సంసారము దుఃఖమయము' అను వాక్యముతో సంతృప్తిపడెను.

'Marry in haste and repent in leisure.'

'హడావిడిగ పెళ్ళిచేసికొని సావకాశముగ కూర్చొని ఏడు' అను సామెత అతని విషయములో చరితార్థమయ్యెను. మఱి కొంతకాలముగడిచినది. సంసారముయెడల రోత జనింప క్రమముగ పెద్దల సాంగత్యము నవలంబించి ఆధ్యాత్మిక గ్రంథములను పరిశోధింప నారంభించెను. నామరూపాత్మక ప్రపంచమంతయు మిథ్య అను వాక్యము ఆ గ్రంథములందుండుట జూచి వెంటనే పరుగెత్తి గోడయొద్దకుబోయి 'దుఃఖమయము' అను పదములోని 'దుః' అను అక్షరమును తుడిచివేసి వెడలిపోయెను. అపుడావాక్యము 'సంసారము ఖమయము' అయినది. అనగా ఆకాశమయము. నామరూపరహితము అని భావము. బ్రహ్మమొకటియే సత్యము. దృశ్యప్రపంచము వాస్తవముగ లేనిదేయని యాతడు నిర్ణయించుకొని, వైరా

గ్యమును జేబూని శేషించిన జీవితమును [తత్త్వాన్వేషణమందే గడపసాగెను. కాబట్టి అభోగ రూపములగు ప్రాపంచిక సుఖములనుజూచి యెవరును మురిసిపోరాదు.

గీతయందు సంసారస్థితిని వర్ణించు సందర్భము వచ్చినపుడెల్ల శ్రీకృష్ణభగవానుడు మృత్యుసంసారము*అని పేర్కొనుచుండుట గమనించదగినది. ఏలయనగా దృశ్యమానమగు ప్రపంచమంతయు, దేహాదులన్నియు మృత్యుగ్రస్తములు. మృత్యుదేవత కివియన్నియు 'టిఫిన్' (ఫలహారము) వంటివి. ఏది మరణముచే నావరింపబడియున్నదో, నాశశీలమైవర్తించుచున్నదో, అట్టి దానియందు సుఖమెట్లుండగలదు? అయితే 'మరణము' అనునది ప్రతివస్తువునకు, ప్రతిజీవికి ఖాయమై యున్నప్పటికిని మానవుడు దానిమాటవిని బెదరిపోయి ఎట్లైనను దానిని మఱచిపోవలెనని ప్రయత్నించుచున్నాడు. మఱచుచున్నాడుగూడను. మఱచినంతమాత్రముచే అది తొలగిపోవునా? కండ్లుమూసికొని ప్రకాశము లేదనినంతమాత్రముచే ప్రకాశము తొలగిపోవునా? పుట్టినవాడు చచ్చుట నిశ్చయము. జననమరణములు ఒకదానితో నొకటి పెనవేసికొనియున్నవి.

బుద్ధదేవుడు మొట్టమొదట పెక్కు రాజభోగములందు మునిఁగి ప్రాపంచికవిలాసములందే కాలముగడుపుచు 'చావు, ముదిమి, రోగము' అనునవి ప్రపంచమున లేనేలేవు అనుకొనుచుండెడివాడు. కాని అదృష్టవశాత్తు ఒకనాడు రథమునందు గూర్చొని విహారము సలుపుచుండ ఎచటనో ఒకశవమును, ఒక

---

*'మృత్యుసంసారవర్త్మని, – మృత్యుసంసారసాగరాత్'

వృద్ధుని, ఒకరోగిని, చూచుట తటస్థింప ఇదియేమి ? వింతగా నున్నదే ? ప్రపంచమున మరణ మనునది కలదా ? వార్ధక్య రోగములు కలవా ? అని యోచించి సారథియగు ఛన్నుని ప్రశ్నింప, ఆతడు అవి తప్పక కలవని నుడివెను. తత్క్షణమే బుద్ధుని హృదయమున వైరాగ్య మంకురించెను. అదియే పెరిగి పెరిగి తుట్టతుదకు ఆతని బుద్ధత్వమునకు దారితీసెను. సంసారగర్తమున పడిపోయి దిక్కు తెలియకనున్న బుద్ధదేవుని అందుండి సముద్ధరించి విజ్ఞానపర్వతము నధిరోహింపజేసి సిద్ధార్థుని "బుద్ధునిగ" మార్చివేసినదేది ? సామాన్యమానవుని దేవునిగ జేసివైచినదేది? ప్రతిబింబసుఖములందు మునుకలిడుచున్న వానిని లేపి బింబరూప శాశ్వత నిర్వాణసుఖమును ప్రసాదింప జేసినదేది ? సామాన్యరాజువలె తన జీవితము గడుపనెంచిన ఒకానొక వ్యక్తిని తీసికొని లోకోద్ధారకుడుగ, విశ్వవంద్యునిగ అవతారపురుషునిగ మార్చివేసిన ఘనత దేనిది? ఈ 'వార్ధక్య, రోగ, మృత్యువుల' దోషములగూర్చిన విచారణదే. కనుకనే శ్రీకృష్ణమూర్తి 'జన్మ, మృత్యు, జరా, వ్యాధు'లకు సంబంధించిన దుఃఖములను, దోషములను మరల మరల విచారింపవలసినదిగా ముముక్షువుల నాదేశించెను. మఱియు 'అను దర్శనమ్' అని చెప్పుటద్వారా ఒక్కసారి విచారణ చేసిన చాలదనియు మాటిమాటికి ఆ విచారణను అభ్యసింపవలెనని యు హెచ్చరించెను.

ఈప్రకారముగ భగవానుడు ఒకటికాదు, రెండుకాదు, ఇఱువది చక్కటి జ్ఞానరత్నములనుపార్థునకుబోధించెను. శాస్త్ర వాఙ్మయమునంతను చిలికి చిలికి ఈ మణులను వెలికితీసెను.

అమూల్యమగు ఈ శీలసంపదను ప్రబోధించుటద్వారా గీతాచార్యుడు సాధకలోకమునకు ఎంతటి మహోపకారమొనర్చెనో చెప్పనలవికాదు. అంతఃకరణశుద్ధికి, హృదయపవిత్రతకు వలసిన సామగ్రిని అందించుట గీతయొక్క ప్రత్యేక విశిష్టత. 'సాధ్యవస్తువు'ను లక్ష్యమునందుంచుకొని 'సాధన' యందు దృష్టిని విశేషముగ కేంద్రీకరించుమని అయ్యది ఆదేశించును. కనుకనే ఈలాటి అమానిత్వాది గుణములను పెక్కింటిని తనయందచటచట పేర్కొనుచు పోయెను. ఈ దైవిక గుణములద్వారా మనుజునకు 'వాసనాక్షయము' లెస్సగ సిద్ధింపగలదు. వాసనాక్షయముచే 'మనోనాశము' అవలీలగ యేర్పడగలదు. ఇక మిగిలినది 'తత్త్వజ్ఞానము' అనగా ఆత్మస్వరూప నిర్ణయము. దానినిగూడ బోధించినచో ఇక అధ్యాత్మబోధ పరిపూర్ణత్వమును పొందగలదు. పొందవలసిన లక్ష్యమగు పరబ్రహ్మ మెట్టిదో సాధకుడు ముందుగా తెలిసికొని యున్నచో దానిపై ప్రీతి, ఆసక్తి విశేషముగ జనించుచుండును. ఈ సత్యమెఱిగియే భగవానుడు జ్ఞానగుణము లన్నిటిని పేర్కొని అంతటితో ఆగక 'జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి' - 'జ్ఞేయవస్తువును గూర్చి కూడ చెప్పుచున్నాను వినుము' అని ప్రారంభించెను. అద్దానిని తెలిసికొనినచో అమృతత్వమును (మోక్షమును) పొందగలవని అర్జునునకు దాని ఫలశ్రుతినికూడ వినిపించెను.

జ్ఞేయమగు పరబ్రహ్మము సర్వవ్యాపకమైనది, అనంతమైనది, నిర్గుణమైనది, ప్రాణులయొక్క బాహ్యాభ్యంతరములందు అవిభక్తమై వ్యాపించియున్నది, ప్రకాశరూపమైనది,

తమస్సునకు అతీతముగ వర్తించునది? అది సర్వజీవులయొక్క హృదయాంతరాళములందు జ్యోతిర్మయమై ఆత్మరూపమున వెలుగొందుచుండును. ప్రారంభదశయందు దేవునకు ఏదియో యొకస్థలమో, రూపమో, నామమో నిర్ణయించుకొని చిత్తైకాగ్రతకొఱకు భగవంతుని అచ్చోట ఆయారూపములతో, నామములతో సాధకుడు ధ్యానించునేకాని, వాస్తవముగ పరమాత్మ ఒక్కచోటునందే పరిమితుడై లేడు. ఒక్క నామమునందే సీమాబద్ధుడై లేడు. ఇక్కారణముననే గీతాచార్యుడు పరబ్రహ్మమును వర్ణించునపుడు తొలుదొల్తనే 'సర్వతః పాణి పాదం తత్సర్వతోఽక్షి శిరోముఖం'- (అంతటను చేతులుకాళ్ళు శిరస్సులు నేత్రములు కలవాడు) అని చెప్పుటకు హేతువైనది. 'సహస్రశీర్షాపురుషః. సహస్రాక్షః, సహస్రపాత్' - అను పురుషసూక్త వేదవాక్యమున్ను ఈ యర్థముసే ప్రతిపాదించుచున్నది. ఇదియే వాస్తవమగు భగవత్-స్వరూపము. ఎన్నటికైనను ముముక్షు వీసత్యము నెఱిఁగియే తీరవలెను. భగవానుడు ఒక వ్యక్తిమాత్రమే యను జ్ఞానమును ఎప్పటికైనను దాటవలెను, వ్యష్టి సమష్టి - రెండును ఆతడే యను విశాల భావము హృదయమున అంకురించవలెను. అపుడే జీవుడు అధ్యాత్మలోకమున ఉపరిస్థానమును చేపట్టును.

పాండవులు మాయాజూదమున ఓడిపోయి కౌరవులకు లోబడిపోయిన సమయమున దుర్యోధనుడు నిండు సభయందు ద్రౌపదీదేవిని అవమానపఱుప నిశ్చయించెను. ఎందరో పెద్దలు ఆసీనులై యున్న ఆ మహాసభాస్థలియందు దుశ్శాసనుడు ద్రౌపదిని ఈడ్చుకొనివచ్చి బలత్కారముగ వలువలు

విప్పనారంభించెను పతివ్రతయగు ఆ సాధ్వికి గొప్ప సంకట మేర్పడెను. ఇక కర్తవ్యమేమి? సంకటములో 'వెంకటరమణుడు' అనునట్లు ఒకేమార్గము ఆమెకు గోచరించెను. 'ఇక భౌతికశక్తులను నమ్ముకొని లాభములేదు. మానవమాత్రులను ప్రాధేయపడిన ఉపయోగములేదు; చిన్నచిన్న దేవుళ్ళకు మ్రొక్కిన ఫలితములేదు' అని నిశ్చయించి అంజలి ఘటించి దేవాదిదేవుడైన జగన్నాథుడగు శ్రీకృష్ణపరమాత్మను హృదయపూర్వకముగ ప్రార్థించెను. తన్నురక్షింపవలసినదిగ ఆ యాపద్బాంధవుని ఈ ప్రకారముగ వేడుకొనెను-

గోవింద ద్వారకావాసిన్ కృష్ణ గోపీజనప్రియ
కౌరవైః పరిభూతాం మాం కిం న జానాసి కేశవ. (భారతము)

'ఓ గోవిందా! ద్వారకానిలయా! కృష్ణా! గోపీజనప్రియా! కేశవా! కౌరవులచే అవమానపఱుపబడుచున్న నన్నేల కాపాడకున్నావు' అని ప్రార్థించెను. క్షణకాలము గడచినది. తాను చేసిన ప్రార్థనకు శ్రీకృష్ణుని యొద్దనుండి తిరుగు రసీదు (Acknowledgement) రాలేదు. వెంటనే మరల ఇంకొక స్తోత్రము చేసెను -

కృష్ణ కృష్ణ మహాయోగిన్ విశ్వాత్మన్ విశ్వభావన
ప్రపన్నాం పాహి గోవింద కురుమధ్యేఽవసీదతీమ్.

'కృష్ణా! కృష్ణా! మహాయోగీశ్వరా! విశ్వరూపా! సర్వవ్యాపకా! జగదాత్మకా! గోవిందా! కౌరవులమధ్య సంకటముల నొందుచున్న నన్ను రక్షింపుము తండ్రీ!' అని స్తుతించెను. వెంటనే భగవంతుని యొద్దనుండి తిరుగురసీదు వచ్చెను.

ద్రౌపది ఆపదను దాటగల్గెను ? ఈఘట్టము ముగిసి చాలకాలమైన వెనుక ఒకానొకసందర్భమున ద్రౌపదిశ్రీకృష్ణునితో వార్తాలాపమొనర్చుతఱి మధ్యలో నాతని నిట్లడిగెను-'మహాప్రభూ! నీవు భక్తవత్సలుడవని ప్రఖ్యాతి నొందితివిగదా! అలనాడు నిండు సభలో కౌరవులు నన్నవమానించునపుడు నిన్ను ప్రార్థించగా వెంటనే సహాయ మొనర్చలేదేమి ? ఒకింత ఆలస్యము చేసినావేల!' ఆ వాక్యములను విని శ్రీకృష్ణు డిట్లు ప్రత్యుత్తరమిచ్చెను-'అమ్మా! ద్రౌపదీదేవీ! నేను ద్వారకావాసినిగదా! ద్వారకలోనుండు నేను హస్తినాపురము రావలెననిన మాటలా? ఎంతదూరము! ఎన్నివందలమైళ్ళు! నడచి రావద్దా! ఒకవేళ గరుడవేగముతో వచ్చినను కొంత వ్యవధి పట్టునుగదా!' అని పలికెను. ద్రౌపది ఆ వాక్యముల యంతరార్థమును గ్రహించి సిగ్గుపడెను. "ఓహో! మొదట నేను ప్రార్థించినపుడు 'ద్వారకావాసీ' అను పదమును ప్రయోగించితిని. సర్వవ్యాపకుడగు పరమాత్మను 'ద్వారకయందుండువాడు మాత్రమే' అని చిత్రించి నేను పొరపాటుచేసితిని. అందువలననే కాబోలు ఆతడు పలుకలేదు. రెండవసారి ప్రార్థించినపుడు 'విశ్వాత్మన్'-విశ్వస్వరూపా అను పదమును ప్రయోగించి పరమాత్మను సత్యముగ చిత్రించితిని. అందులకే కాబోలు తత్క్షణమే సహాయమును బంపెను" అని తలంచి ద్రౌపది భగవానుని అపారకారుణ్యమునకు సంతుష్టాంతరంగిణి యయ్యెను. కావున పరబ్రహ్మము సర్వవ్యాపకమైనదని యెఱుఁగవలెను. అణువునందును, బ్రహ్మాండమునందుగూడ

అతిసూక్ష్మముగ నయ్యది వ్యాపించియున్నది. అట్టి పరబ్రహ్మమే 'జ్ఞేయ' మను పేరుతో నిచట వర్ణింపబడినది.

ఈప్రకారముగ శ్రీకృష్ణపరమాత్మ క్షేత్రక్షేత్రజ్ఞులను జ్ఞానజ్ఞేయములను వరించి చెప్పి తదుపరి ప్రకృతి పురుషుల యొక్క స్వరూపమును సంక్షేపముగ వివరింప దొడగెను. పురుషుడనినను, క్షేత్రజ్ఞు డనినను, జ్ఞేయమనినను ఒకే పరమాత్మ వస్తువునకు పేర్లు-ఆ పరమాత్మ అవినాసి. దృక్స్వరూపుడు. సమస్త దృశ్యపదార్థములు నశించినను ఆతడు నశింపడు. ప్రాణికోట్లయందంతటను సమరూపమున నాతడు వర్తించు చుండును. జగత్క్రియలన్నిటిని ప్రకృతియే జరుపుచుండును. పురుషుడు అకర్త. అతడు. చేయడు, చేయింపడు. దీపపు సన్నిధానమున జనులు వారివారి క్రియలను చేసికొనునట్లును, సూర్యోదయముచే ప్రజలు వారివారి వ్యవహారములు జరుపు కొనునట్లును, ఆ యా కార్యములందు ఆ దీప, సూర్యులకు కర్తృత్వకారయితృత్వములు లేనట్లును, పురుషుని (పరమాత్మ యొక్క)సాన్నిధ్యమునందు ప్రకృతియు క్రియాశీలమై వర్తించు చున్నది. మఱియు ఆకాశము, సర్వవ్యాపకమైయున్నప్పటికిని ఏ పదార్థమునందును అంటనట్లు, క్షేత్రజ్ఞుడగు పురుషుడు క్షేత్రమునందంతటను వ్యాపించియున్నను నిర్లేపుడై తనరు చున్నాడు. సూర్యుడు లోకమును ప్రకాశింపజేయునట్లు జడమగు క్షేత్రమునకంతకును వెలుగును ప్రసాదించుచున్నాడు. తిరుగలియొక్క క్రిందిరాయి నిశ్చలముగ నుండును. పై రాయి తిరుగుచుండును. అట్లున్నందువలననే పిండి విసరుటకు వీలు కలుగుచున్నది. రెండును తిరుగుచున్నను, లేక రెండును

నిశ్చలముగ నున్నను పిండి పడదు. అట్లే నిశ్చలుడగు క్షేత్రజ్ఞుడు, చంచలమగు క్షేత్రము-ఈ రెండిటియొక్క-సంయోగము వలననే ఈ స్థావరజంగమాత్మకమగు ప్రపంచమంతయు నావిర్భవించినది. క్రియావంతమై యొప్పుచున్నది.

జీవుడు వాస్తవముగ పురుషుడేకాని ప్రకృతికాదు. క్షేత్రజ్ఞుడగు ఆత్మయేకాని క్షేత్రమగు దేహాదులు కాదు. అవివేకముచే నాతడా ప్రకృతితోను, తద్గుణములతోను తాదాత్మ్యము నొందుచున్నాడు. జీవునియొక్క ఈ ప్రకృతి తాదాత్మ్యమే, ఈ గుణసంగమే ఈ దౌర్భాగ్యసంసారస్థితిని అతనికి కలుగజేసినది; ఈ జననమరణ ప్రవాహమున తగుల్కొనునట్లు చేసినది; దుఃఖసాగరమున మునుంగునట్లు కావించినది.

పురుషః ప్రకృతిస్థో హి భుంక్తే ప్రకృతిజాన్గుణాన్
కారణం గుణసంగోఽస్య సదసద్యోని జన్మసు. (13-22)

అను గీతావాక్యము లీభావమునే స్పష్టీకరించుచున్నవి. కాబట్టి అట్టి గుణసంగములేకుండ, విజ్ఞుడగువాడు సర్వవిధముల ప్రయత్నించవలెను. తాను క్షేత్రముకాదు-క్షేత్రజ్ఞుడగు ప్రత్యగాత్మయని మరలమరల భావన చేయుచుండవలెను. తాను దేహము కాదు-దేహియని నిరంతరము భావించుచుండవలెను.

1. కృశోఽతిదుఃఖీ బద్ధోఽహం హస్తపాదాది వానహమ్
ఇతి భావానురూపేణ వ్యవహారేణ బధ్యతే.

2. నాహం దుఃఖీ నమే దేహో బన్ధః కస్యాత్మని స్థితః
ఇతి భావానురూపేణ వ్యవహారేణ ముచ్యతే. (యోగవాసిష్ఠము)

"నేను కృశించినవాడను, మహాదుఃఖవంతుడను, బద్ధుడను, హస్తపాదాద్యవయవములతో గూడినవాడను'-ఇత్యాదిభావ

ములతో గూడి వ్యవహరించువాడు తప్పక బంధనమును బొందును. అట్లుకాక, నేను దుఃఖినిగాను, నాకు దేహములేదు, నేను ఆత్మస్వరూపుడను, ఆత్మకు బంధ మెచటగలదు? ఇత్యాది భావములతో గూడి వ్యవహరించువాడు తప్పక ముక్తినిబొందగలడు-అని శ్రీవసిష్ఠమునీంద్రులు శ్రీరామచంద్రునకు హితబోధ గావించిరి. గీతయందు దిట్టి భావములు తండోపతండములుగ మనకు లభించగలవు. ముఖ్యముగ తత్త్వవిచారణారూపమగు ఈ క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగమున ఇట్టిఅమోఘములగు దైర్య వాక్యములే మనకు లభించుచున్నవి. ఏనాడు అజ్ఞానవశమున జీవుడుతనకంటె వేరైయున్నట్టి ఈదేహాదిదృశ్యపదార్థములందు అహంభావమును, మమత్వమును కల్పించుకొనుచున్నాడో, ఆనాడే, ఆ క్షణముననే ఆతడు దుఃఖమును, బంధమును కొని తెచ్చుకున్నట్లే యగును. ఏలయనగా అట్టి అసత్యభావనచే వతడు తన ఆత్మను చంపినట్లే యగుచున్నది. ఆత్మహంతకుడగుచున్నాడు. (హినస్త్యాత్మనాత్మానం), చిన్న చిన్న హత్యలకే లోకములో పెద్ద పెద్ద శిక్షలు పడుచున్నవి. ఇక 'ఆత్మహత్యకు' ఒడిగట్టిన అజ్ఞానికి ఎంతటి పెద్దశిక్ష కాచుకొని యున్నదో యోచించుకొనుడు ?

అసుర్యానామ తేలోకా అంధేన తమసావృతాః
తాం స్తే ప్రేత్యాభిగచ్ఛన్తియే కే చాత్మహనోజనాః

(ఈశావాస్యోపనిషత్తు)

'ఆత్మజ్ఞానమునుబొందక తద్ద్వారా తమ ఆత్మను చంపుకొనునట్టి అవివేకులు అంధకారావృతములైనట్టి భయంకరరాక్షస లోకములను (నరకలోకములను) బొంది పెక్కు క్లేశములు

ననుభవించుదురు. జననమరణప్రవాహమున బడి నానావిధ హీనయోనులందు జన్మించుచు యిడుముల పాలగుదురు'- అని ఉపనిషత్తు లుద్ఘోషించుచున్నవి. కాబట్టి యెంతయో తెలివితేటలతోగూడిన ఈ మానవజన్మ లభించిన ఈ గొప్ప తరుణమున జీవుడు భగవంతుడిచ్చిన ఆ తెలివిని, ఆ విజ్ఞానమును సదుపయోగముచేసి తనయందు కలిసిపోయియున్న క్షేత్రక్షేత్రజ్ఞులను విడదీసి, తాను పరమాత్మయేయని యెఱిగి కృతార్థుడు కావలసియున్నాడు.

లబ్ధ్వా కథం చిన్నరజన్మ దుర్లభం
తత్రాపి పుం స్త్వం శ్రుతిపారదర్శనం
యస్త్వాత్మముక్త్యైన యతేత మూఢధీ
స ఆత్మహా స్వం వినిహన్త్య సద్గ్రహాత్॥ (వివేకచూడామణి)

"మహాదుర్లభమైనట్టి ఈ నరజన్మను, అందులో పురుషత్వమును, అందును శాస్త్రపరిజ్ఞానమును బొందియు, ఎవడు తన మోక్షముకొఱకు యత్నించడో, అట్టి మూఢబుద్ధి ఆత్మఘాతకుడేయగును. మఱియు నాతడు అసద్వస్తువును (దేహాదులను) గ్రహించి తన్నుతానే చంపుకొనుచున్నాడు'-అని శ్రీ శంకరాచార్యులవారు ఆత్మజ్ఞానశూన్యులను హెచ్చరించిరి. కావున నిత్యానిత్యములను, సత్యాసత్యములను వివేచించి నిత్యమును, సత్యమును ఆశ్రయించి అనిత్యమును,అసత్యమును ఉపేక్షించుటయందే మానవజన్మయొక్క సార్థకత కలదు. దృగ్దృశ్యమును, క్షేత్రక్షేత్రజ్ఞులను, ప్రకృతి పురుషులను విడదీసి దృక్స్వరూపమగు క్షేత్రజ్ఞుని, పురుషుని ఆశ్రయించి, దృశ్యమగు క్షేత్రమునెడల ప్రకృతియెడల విరాగభావము కలిగియుండుటయే

జీవితముయొక్క విధానము. అయితే ఏ మార్గము ననుసరించి అట్టి ధ్యేయవస్తువగు పరమాత్మను మనుజుడు సాక్షాత్కరించుకొనగడు ! ఇది ముఖ్యముగ తెలిసికొనదగియున్నది.

కొందఱు నిరంతరధ్యానముచే తనయందా పరమాత్మను తెలిసికొనగల్గుచున్నారు. మఱికొందఱు సాంఖ్యవిచారణచే తెలిసికొనుచున్నారు, కొందఱు కర్మయోగముచే చిత్తమును శుద్ధమొనర్చుకొని అట్టి నిర్మలచిత్తముచే వీక్షించుచున్నారు.

అన్యే త్వేవమజానన్తః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే
తేఽపి చాతితరన్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః. (13-26)

'మఱికొందఱు ఆ యా కర్మ, ధ్యాన, జ్ఞాన, యోగరహస్యములను తెలిసికొనజాలనప్పటికిని, పరమాత్మను గూర్చి ఇతరుల వలన విని, ఆ వినినదానిని శ్రద్ధాభక్తులతో ఉపాసించుచుందురు. అట్టి ఆ శ్రవణాభిలాషులుకూడ అచిరకాలములో మృత్యువును లెస్సగ దాటివేయగలరు'-అని భగవానుడు జనులకు అభయమొసంగియున్నాడు. ఏలయనగా, విద్యావంతులు, ప్రజ్ఞావంతులు, శేముషీధురంధరులు శాస్త్రములను పరిశోధించి వివేచించి, ఆ యా ధ్యాన, జ్ఞానాది సాధనలు చేయగలిగియుందురు. కాని చదువురాని అమాయకులు వాని నెట్లు తెలిసికొనగలరు ? ఢొక్కశుద్ధిలేని ప్రజలెందరో కలరుకదా ! వారందఱును శాస్త్రముల నెట్లు అధ్యయనముచేసి సత్యము ననుభూత మొనర్చుకొనగలరు? ఇదియొక గొప్ప సమస్య. ఈ సమస్యను త్రుటిలో నిచట భగవానుడు తేల్చివేసెను. ఆధ్యాత్మికరంగములో నేత్రములకంటె శ్రోత్రము ప్రధానమని

పెద్దలు చెప్పుచుందురు. ఏలయనగా నేత్రముచే చూపబడునది (దృశ్యము) ఎప్పటికైనను నశించును. శ్రోత్రముచే వినినది (హరికథాశ్రవణము, గురువాక్యప్రబోధము) మాత్రము హృదయమునందు ప్రవేశించి మనననిదిధ్యాసనములకు ఆత్మానుభూతికి అవకాశ మొసంగగలదు. అందుచే ఒకవేళ ఎవరికైనను చదువురానప్పటికిన్ని దానివలన చింతలేదు. వారు సద్గురువుల యొద్ద మహాత్ములయొద్ద చక్కగ శ్రవణముచేసి, వారుపదేశించిన విధముగ అనుష్ఠించిన (ఉపాసించిన) చాలును. అట్టి వారుకూడ తరించిపోవుదురు. అని శ్రీకృష్ణమూర్తి హామీనిచ్చి నిరక్షరకుక్షుల కందఱికిని ధైర్యప్రదానము చేసెను. కొందఱు ముసలమ్మలు, ముసలయ్యలు చిన్నపుడు తమ తల్లిదండ్రులు చదువు చెప్పించనికారణమున గీతాపారాయణము చేయలేక, శాస్త్రాధ్యయనము చేయలేక తరించవలెనను కుతూహలము మాత్రము కలిగి లోలోన పరితపించుచుందురు. అట్టివారు గీతావాక్యములచే ఆశ్వాసమునుబొంది శ్రవణమార్గముద్వారా అమృతత్వమును సాధింపవచ్చును. అయితే విద్య ఉండుటయే అన్నిటికంటెను శ్రేష్ఠము. ఏకారణముచేనైన అది లేనిచో ఇక గతులులేవనిమాత్రము తలంపనక్కఱ లేదనియే ఈ వాక్యములయొక్క అభిప్రాయమైయున్నది.

ఇవ్విధముగ శ్రీకృష్ణభగవానుడు ఈ అధ్యాయము నందు బహుభంగుల సాధకులకు అద్భుతమగు ఆత్మజ్ఞానోపదేశమును జేసెను. జనులను అసత్తునుండి సత్తునకు గొనిపోయెను. తమస్సునుండి జ్యోతిలోనికి తీసికొనిపోయెను. మృత్యువునుండి అమృతత్వమును పొందింపజేసెను. ఇంతకు

మించి జీవితములో నిక సాధింపదగినది యేమియున్నది ? బాధాకరమగు ఈ జననమరణ చక్రమునుండి తప్పించుకొని అమరమగు దైవత్వమును పొందుటకంటె ఇక ఈ జీవితములో చేయదగినది యేమికలదు ?

> ఆనందమూలగుణపల్లవ తత్త్వశాఖా
> వేదాన్తమోక్ష ఫలపుష్ప రసాదికీర్ణమ్
> చేతో విహంగ హరితుంగ తరుం విహాయ
> సంసార శుష్కవిటపే వద కిం కరోషి.

'ఓ చిత్తమనుపక్షీ ! ఆనందమే మూలముగ గలిగి సద్గుణములను చిగుళ్ళతోఁగూడి, దైవతత్త్వమను కొమ్మలుగలదై, వేదాంతరహస్యములను పుష్పములతో శోభించుచు, మోక్షమను ఫలములు గల్గియున్నట్టి పరమాత్మయను మహోన్నత వృక్షరాజమును వదలి సంసారమను శుష్కించిన చెట్టు మోడుపై వ్రాలుచున్నావేల? అచట ఏమియున్నదని ఆశించుచున్నావు!' - అని యొక మహనీయుడు తన చిత్తమును సంబోధించినరీతి ప్రతివారున్ను తమ మనస్సులను సంబోధించి శాశ్వతపదార్థమును (ఆత్మను) ఆశ్రయించులాగున నచ్చచెప్పవలెను. ఈకార్యము మరణము రాకపూర్వమే దేహవియోగమునకు పూర్వమే జరిగిపోవలెను. మృత్యువనునది ఎవరిని బొట్టుపెట్టి పిలువదు. అది వచ్చుసమయము ఎవరికిని తెలియదు. పరీక్షాసమయము ఫలాని తేదియని అధికారులు ముందుగానే ప్రకటించుచుందురు. కావునవిద్యార్థులుముందుగనే జాగ్రతపడి దాని నెదుర్కొందురు. కాని ఈజీవితపరీక్ష అట్టిది కాదు, ఇది విలక్షణమైనది. దీని పరీక్షాదిన మెపుడో మనకు

అంతుపట్టకుండ చేసివైచినారు. ఏనాడో యొకనాడు కాలుడు అమాంతముగ వచ్చి మీద విరుచుకుపడును. అప్పుడు గడిబిడ పడినచో లాభములేదు. కాబట్టి ముందునుండియే దానికి సిద్ధపడియుండవలెను. 'తస్మాత్సర్వేషు కాలేషు' అని భగవానుడాదేశించినవిధముగ బాల్యకాలమునుండియు ఈ పరీక్షా విషయమై కడు జాగరూకత వహించి, భక్తివైరాగ్య తత్త్వవిచారణాదుల సహాయముచేతను నిరంతర సాధనచేతను స్వస్వరూపము నవగత మొనర్చుకొని బంధవిముక్తులై శాశ్వతకైవల్యపదవి నధిష్ఠించి ధన్యత జెందవలయును. అట్టి అమరత్వమును సాధించువఱకు ప్రయత్నమును విరమించరాదు. తాను క్షేత్రముకాదనియు, క్షేత్రజ్ఞుడనియు ముమ్మాటికిని నమ్మవలెను. నమ్మి అట్టి అనుభూతిని సాధించవలెను. ఇదియే గీతాచార్యుడీ యధ్యాయమున గావించిన మహోపదేశము. భగవానుని ముఖతః వెలువడిన ఇట్టి అమృతోపదేశమును సర్వులును కార్యాన్వితమొనర్చుకొని పరమానందపదవి నధిష్ఠించి ధన్యులయ్యెదరుగాక !

ఓమ్ తత్ సత్.

ఓమ్

# 14-వ అధ్యాయము

# గుణత్రయ విభాగయోగము

నేటిదినము గీత పదునాల్గవ అధ్యాయమగు గుణత్రయ విభాగయోగమునుగూర్చి విచారింపబోవుచున్నాము. అగాధమగు జ్ఞానములోనికి ఇపుడు ప్రవేశించుచున్నాము. కర్మ, భక్తి, ధ్యానము మున్నగునవియన్నియుదాటి చరమసాధనమగు జ్ఞానవిచారణయందు పాల్గొనుచున్నాము. గీత 13, 14 అధ్యాయములు విశేషించి జ్ఞానమునే ప్రతిపాదించినవి. మనస్సునందలి దోషములు, పాపములు నశించినవారికి, చిత్తశుద్ధి కలవారికి మాత్రమే ఈజ్ఞానము బాగుగ అబ్బగలదని యిదివరలో తెలిపియున్నాము. కావున సాధనచతుష్టయ సంపత్తియందు మున్ముందు ప్రావీణ్యమును సంపాదించి, అనుభూతిని బడసి ఆపిదప తత్త్వపదార్థశోధనరూపమగు జ్ఞానమునందు అడుగుపెట్టుట మంచిది. అట్లుకానిచో బహుజన్మార్జిత పాపవాసనలు అడ్డుపడి జీవుని ఆధ్యాత్మిక పురోగమనమును నిరోధించివేయగలవు. తత్ఫలితముగ సాధకుడు జ్ఞానమునుగూర్చి మాట్లాడునే కాని జ్ఞానానుభూతిని లవలేశమైనను పొందకయే యుండును. కనుకనే జ్ఞానషట్కమునకు ముందుగా కర్మషట్కమును(కర్మసంబంధమైన 6 అధ్యాయముల బోధను), భక్తిషట్కమును (భక్తిసంబంధమైన 6 అధ్యాయములును) గీతాచార్యుడు చెప్పుటకు కారణము.

ఈజ్ఞానమునుగూర్చి, దానిమహిమనుగూర్చి ఇదివఱలో గీతయందచటచట సంక్షేపముగ జెప్పినను మరల దాని నిచట వివరముగ చెప్పబోవుచున్నానని భగవానుడు ఈ అధ్యాయమును ప్రారంభించెను. (పరంభూయః ప్రవక్ష్యామి-). చెప్పినది మరల చెప్పుట సాహిత్యములో దోషముక్రింద జమకట్టుదురు. దానినేపునరుక్తిదోషమందురు. కానిఅధ్యాత్మశాస్త్రములందు చెప్పినది మరల చెప్పుట ఒక గుణముగా పరిగణింపబడును. ఆచరించినది మరల ఆచరించుట ఒక ఆవశ్యక నియమముగా నెంచబడును. కనుకనే గురువులు తమ శిష్యులకు ఒక పర్యాయము బోధించిన విషయములనే మరల మరల బోధించుదురు. ఏలయనగా, అనాదిగా కరుడుకట్టియున్న ఘనీభూతదుష్టసంస్కారములు పౌనఃపుణ్యవిచారణచేతనే మెల్లగ కరగిపోవును. అభ్యాసముచేతనే తొలగిపోవును.

ఆవృత్తిరసకృదుపదేశాత్.

'సాధకుడు తాను శ్రవణముచేసిదానిని మరల మరల చింతనచేయవలెను.' అని బాదరాయణుడు బ్రహ్మసూత్రములందు తెలిపియేయున్నాడు. ఛాందోగ్యోపనిషత్తునందు శ్వేతకేతువునకు అతనితండ్రియగు ఆరుణి 'తత్త్వమసి' మహావాక్యమును అనేక ఉపమానములతోను, సాదృశ్యములతోను 9 పర్యాయములు వర్ణించి చెప్పుట సర్వులకును విదితమే కదా. కావునచెప్పినదిమరల చెప్పుట ఆధ్యాత్మిక క్షేత్రములందు దోషముకాదు. పైపెచ్చు గుణమే అగును. అదియొక కళగా రాణించును! దానిచే దుర్గ్రాహ్యసత్యములను శిష్యుడు తేలికలో గ్రహించుటకు వీలుయేర్పడును. కాబట్టియే శ్రీకృష్ణ

పరమాత్మ గీతయందు తాను ఒక పర్యాయము బోధించిన ధర్మములనే అర్జునుని కోమల మనంబున బాగుగ హత్తుకొను టకుగాను మరల మరల వివరించుచు బోయెను. ఈ అధ్యాయ మున అట్టి స్థితియే సంభవించినది. ఇదివరలో తాను సంక్షేప ముగ నుపదేశించిన జ్ఞానమును తిరిగి భగవానుడు వివరణ సహితముగ నిచట బోధింప నుద్యమించెను.

ఆ జ్ఞాన మెట్టిది? 'జ్ఞానానాంజ్ఞానము త్తమమ్'-జ్ఞానము లలోకెల్ల ఉత్తమమైనది. అద్దాని నెఱిఁగియే మునులందఱును పరమసిద్ధియగు మోక్షమును బడసిరి. మునులు పొందిన మోక్షమును తక్కినవారు ఏల పొందలేరు? మోక్షమనునది పొందజాలని విషయమైనచో అద్దానిని ఎవరు పొందకయే యుండవలెను. కాని అట్లు లేదు. కొందఱు పొందిరి. కావున అందఱును పొందవచ్చును. మోక్షముకాని దైవముకాని ఒకరిసొత్తుకాదు. 'మునులు' అను ఒక తెగవారు గుత్త (Contract) కు తీసికొనిన పదార్థముకాదు అది. అందఱి యొక్కయు సొత్తు. మానవులేకాదు, దానవులే కాదు, పశు వులే కాదు - ఎవరైనను, ఏప్రాణియైనను ఆ పరమాత్మను పొంది, మోక్షమును కైవస మొనర్చుకొనవచ్చును.

ఈమధ్య ఒక చిన్నపిల్లవాడు మొదటితరగతి పుస్తకము లోని 'చందమామ' పాఠమును చదువుచు, ప్రక్కనేఉన్న తన తల్లిని పిలిచి 'అమ్మా! అమ్మా! చందమామ ఎవరిమామ? అని అడిగెనట! అందులకు తల్లి ఏమియు సమాధానము చెప్ప లేకపోయెను. చందమామ అందఱికిని మామయే. అట్లే మోక్షము ప్రతివారియొక్కయు సొత్తు, మునులు నిరంతర

సాధనావశమున దానిని బడయగల్గిరి. మననము చేయువాడు ముని యనఁబడును. ఎవరెవరు పరమాత్మ తత్త్వమును, ఆధ్యాత్మిక రహస్యములను, ధర్మసూక్ష్మములను నిరంతరము చింతనజేయుచు, అభ్యసించుచు నుందురో, వారందరున్ను మునులే యగుదురు. ముని యనునది ఒక బిరుదు. ఋషి యనునది ఒక బిరుదు. ఆ బిరుదులను ప్రయత్నముచే ఎవరైనను పొందవచ్చును. సాధింపవచ్చును. ఐతే ఈ బిరుదులు సనదులు బాహ్యవిశ్వవిద్యాలయములందు లభించునవి కావు. హృదయసామ్రాజ్యమున వారికి వారే అభ్యాసవశమున పొందగల్గునవి అయియున్నవి.

మహనీయులగువారు తాము బోధింపదలంచు పరమసత్యములందు ఆసక్తి జనించుటకై, విశ్వాస మేర్పడుటకై, ప్రారంభముననే వాటివిలువలను శ్రోతల కెఱిఁగించుచుందురు. వానిమహిమను సూక్ష్మముగ వర్ణించుచుందురు. ఈఅధ్యాయ ప్రారంభమున భగవాను డట్లేచేసెను. మహత్తరమగు జ్ఞానామృతమును అర్జుననిచే పానము చేయింపనెంచి, తొలుదొల్తనే దాని మాహాత్మ్యమును సంక్షేపముగ చెప్పివైచెను. "ఓ అర్జునా! ఈచెప్పబోవు జ్ఞానమెట్టిదనగా-(1) ప్రపంచములో గల సమస్త జ్ఞానములలోను ఉత్తమమైనది. (2) దీని నెఱిఁగి మునులందఱును మోక్షమును బడసిరి. (3) దీని నాశ్రయించి ఎల్లరును నాలో నైక్యమొంది జనన మరణ క్లేశములను తప్పించుకొనిరి."-గీతాచార్యుని ఈ పలుకులను వినినపుడు ఎటువంటివానికైనను అట్టి మహోన్నతజ్ఞానమును తెలిసికొనవలెనను కుతూహలము జనింప గలదు. ఏలయగాన,

లోకములో ప్రతి జీవియు దుఃఖము తొలగవలెననియు, ఆనందము గలుగవలెననియు వాంఛించుచుండును. కాని ఆత్యంతిక దుఃఖవినాశము ఏ యుపాయముచేతను అతనికి చేకూరుటలేదు. కర్మయున్నచో జన్మవచ్చును. జన్మయున్నచో దుఃఖము ఏదియోరూపమున బాధించుచునే యుండును. కావున కర్మసంచితమంతయు తొలగిననే తప్ప ఈ జననమరణ క్లేశములు జీవునకు విడుదల కానేరవు. అది యెట్లు తొలగ గలదు.

జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా (4-37)

అనునట్లు ఆ కర్మరాశినంతను భస్మీభూత మొనర్పగల శక్తి ఒక్క జ్ఞానాగ్నికిమాత్రమే గలదు. కాబట్టి పరిపూర్ణ దుఃఖ వినాశమును, నిరతిశయానందమును అభిలషించు ప్రతి జీవియు సర్వప్రయత్నములచేతను అట్టి బ్రహ్మజ్ఞానమును తప్పక సంపాదించవలయును. ఈ అధ్యాయమున అట్టి మహత్తరమగు జ్ఞానోపదేశమునే శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు గావించెను.

క్రిందటి అధ్యాయములో జ్ఞానసంబంధమగు విచారణ ఒకింత కావింపబడెను. ఈ ప్రపంచములోని సమస్తపదార్థములు రెండుగ విభజింపబడినవి. క్షేత్రము, క్షేత్రజ్ఞుడు అని. వీనినే దృగ్దృశ్యములనియు, ప్రకృతి పురుషులనియు ఆత్మానాత్మ లనియు, దేహి దేహములనియు నందురు. క్షేత్రజ్ఞుడగు పరమాత్మ ఒకడే. కాని క్షేత్రము నానావిధములు. దృక్ - స్వరూపమగు పరబ్రహ్మ ఒక్కడే. కాని దృశ్యము వివిధ రూపముల నున్నది. చెఱువులోని నిర్మలమగు జలము పాచిచే

కప్పబడి యుండునట్లును, ప్రకాశవంతుడగు సూర్యుడు మేఘముచే నాచ్ఛాదితుడై యుండునట్లున్ను, అత్యంత శుద్ధమగు ఆత్మ (దేహి), అనాత్మయగు దృశ్యముచే కప్ప బడి యున్నది. ఏక్షణమున ఆవరణరూపమగు ఆ అనాత్మ తొలగునో ఆక్షణముననే అధిష్ఠానమగు సచ్చిదానంద పరబ్రహ్మము, తన నిర్మల నిశ్చల, నిర్వికార, నిరామయ రూపముతో వ్యక్తమగును. కావున మోక్షప్రయత్నమందు అనాత్మను తొలగించుటయే సాధకుని కర్తవ్యముగాని ఆత్మను క్రొత్తగా పొందుటకాదు.

నదిలోనీరు పుష్కలముగనున్నది. కాని పంటకాలువలో ఒక్కచుక్క నీరులేక పొలము లన్నియు ఎండిపోవుచున్నవి. కారణ మేమియని విచారించిన, నదిలో నుండి పంటకాలువ లోనికి నీరువచ్చు ద్వారము-అనగా, లాకు మూసివేయబడి యున్నది. అపుడు వెంటనే ఇంజనీర్లను పిలిచి ఆ లాకు తెరిపిం చినచో నీరు వెల్లువలై ప్రవహించును. క్షేత్రములు సస్య శ్యామలములై యలరారును. ఇచ్చోట మానవుడు నీటిని క్రొత్తగా సృష్టిచేయుటలేదు. ఆ నీటికి యున్న అడ్డును మాత్రము తొలగించెను. అట్లే ఆత్మ సమస్త జీవులందును స్వతస్సిద్ధముగ దేదీప్యమానముగ ప్రకాశించుచు నేయున్నది. ప్రకృతి దానిని కప్పివేసినది. ఆ ప్రకృతిని, ఆ దృశ్యమును మూడు విభాగములు చేయవచ్చును, (1) ప్రపంచము (2) దేహము (3) మనస్సు-అని, దృశ్యమును తొలగించుట యనగా దృశ్యముపై అభిమానమును వదలుట యని భావము.

అనగా ప్రపంచముపై, దేహముపై, మనస్సుపై అభిమానమును, అహంభావమును త్యజించుటయని అర్థము. ప్రాపంచిక వస్తువులతోగాని, దేహముతోగాని, మనస్సుతో గాని తాదాత్మ్యమునొంది 'అవియే నేను' అని భావించక, ఆ మూడిటికి సాక్షిగా నుండు ప్రత్యగాత్మయే తానని భావింపవలయును, జంతువులన్నియును, మానవులలో అజ్ఞులగు కొందఱున్ను నిరంతరము ప్రపంచములో, 'దేహము'లో కాలక్షేపము చేయుచుందురు. కవులు, పండితులు మున్నగువారు 'మనస్సు' లో కాలక్షేపము చేయుచుందురు. కాని ఈ మూడిటిని దాటి వానికి సాక్షియగు ఆత్మలో కాలక్షేపము చేయువారు చాల అరుదు. అట్టివారే జ్ఞానులగు మహనీయులు, వస్తువులయొక్క నశ్వరత్వమును గూర్చి బాగుగ విచారించినచో, ప్రపంచము యెడల విరాగము జనింపగలదు. అనగా ప్రపంచభావన తొలగగలదు. అట్లే దేహముయొక్క జడత్వ, క్షణికత్వ, పాంచభౌతికత్వములను లెస్సగ విచారించినచో దాని యెడలను విరాగము కలుగవచ్చును. అనగా దేహభావనతొలగవచ్చును. కాని దృశ్యములోని మూడవదియగు మనస్సు మాత్రము తొలగించుటకు మహా కష్టసాధ్యముగ నుండును. దానిని తొలగించిన, అన్నియును తొలగింపబడినట్లే. దానిని జయించిన అన్నియును జయింపబడినట్లే. అది తొలగినచో ఇక శేషించినదిమోక్షమే. కావున మనస్త్యాగమే కైవల్యము.

న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వ మానశుః

'కర్మ*లచేగాని, సంతానముచేగాని, ధనముచేగాని మోక్షము లభించదు. త్యాగముచేతనే లభించును.' అని ఉపనిషత్తులు భాషించుచున్నవి. ఇట త్యాగమనగా ముఖ్యముగ మనస్త్యాగ మనియే అర్థము. బాహ్యవస్తువుల త్యాగము ఏమంత గొప్పది కాదు. వాసనాత్యాగము, సంకల్పత్యాగము, దుస్సంస్కార త్యాగము, ఇదియే ముఖ్యమగు త్యాగము. ఇదియే మనస్త్యాగము, అమనస్కము.

పూర్వము జనకమహారాజు మిథిలానగరమున రాజ్యమేలుచుండెను. రాజ్యకార్యములతోపాటు దైవచింతన, పరమార్థవిచారణ ఆతడు లెస్సగ సలుపుచుండువాడు, అధ్యాత్మ తత్త్వజిజ్ఞాస తీవ్రతరముకాగా ఒకనాడాతడు తనదేశములో నలుమూలల నొక ప్రకటన గావించెను. ఈ దేశములో గల పండితులు, తత్త్వజ్ఞులు, వేదాంతులు ఎవరెవరు కలరో వారందఱును రాజధానికి వచ్చి రాజునకు బ్రహ్మజ్ఞానోపదేశము చేయవలెను. అనుభవపూర్వకముగ బోధించవలెనే కాని నోటిమాటలతో కాదు. గుఱ్ఱపురికాబులో ఒకకాలుపెట్టి మరియొక రికాబులో కాలుపెట్టులోపల - అనగా క్షణకాలములో బ్రహ్మానుభూతిని కలిగించవలెను. అట్లు కలిగింపలేనివారందఱున్ను దేశమునుండి వెడలగొట్టబడుదురు-అని దండోరా వేయించెను. రాజుగారి యీ ప్రకటన దేశములో గొప్ప సంచలనమును గలుగజేసెను. పండితులు, కవులు, శాస్త్రవేత్తలు భూపాలునకు ఆత్మతత్త్వానుభూతి కలుగజేయగల్గునంతటి సామర్థ్యము లేనివారగుటచే దేశబహిష్కరణ శిక్షకు

* ఇచట కర్మలనగా కామ్య, నిషిద్ధకర్మలని భావము.

భయపడి అత్యంత చిన్తాక్రాంతులై యుండిరి. భూపతిని సమీపించుట కెవరును సాహసింపలేదు. ఆ తరుణి అష్టావక్రుడను మహర్షి యెచటికో పోవుచుండెను. ప్రజలందఱును విషాదగ్రస్తులై యుండుటజూచి కారణమరయ వారు జరిగిన విషయమును సవిస్తరముగ తెలియజేసిరి. అష్టావక్రుడు వారలకు అభయమొసంగి వెంటనే రాజప్రాసాదమున కరిగి రాజుతో తాను బ్రహ్మజ్ఞానమునుపదేశించెదనని ధైర్యముతో బలికెను. భూపాలుడంగీకరించెను. 'ఉపదేశము ఏకాంతస్థలమందే చేయవలెనుగాని బహిరంగముగగాదు. కావున సమీపారణ్యమునకు బోవుదము రండు' అని యమ్మునీశ్వరుడు పలుక రాజు తన అశ్వమును, కొందఱు సైనికులను వెంటనిడుకొని సమీపకాననమునకు బయల్వెడలెను. త్రోవలో నొకచోట సైన్యమును నిలిపివేసిరి. గురుశిష్యు లిరువురును నిర్జనప్రదేశమునకు బోయిరి. జనకు డచట తన గుఱ్ఱపు రికాబులో కాలుపెట్టెను. రెండవ రికాబులో కాలుపెట్టులోపల బ్రహ్మానుభూతి కలిగించవలెను'-ఇది సమస్య. ఆ తరుణి అష్టావక్రమునీంద్రుడు బోధకు ముందుగా గురుదక్షిణ నివ్వవలసినదిగా రాజు నుకోరెను. తానేది కోరుకొనిన దానిని తప్పక నొసంగెదనని జనకుడు పలికెను. తత్క్షణమే అమ్మునివర్యుడు 'నీమనస్సును నాకొసంగుము' అని యాదేశింప జనకుడట్లేచేసెను. మనస్త్యాగముచే జనకుని శరీరము గుఱ్ఱముపై నిశ్చేష్టముగ నుండిపోయెను. డ్రైవరు లేని బండివలె దేహము కదలక మెదలక నుండెను. అట్టి స్థితిలో నాతని నచట వదలివైచి అష్టావక్రుడు వెడలిపోయెను. దూరముగనున్న సైనికులు రాజు కొఱకై నిరీక్షించి నిరీక్షించి

వారిజాడ యెచటనులేమి వారే స్వయముగ వెతుకుట్కై పయనమైరి. ఒక చోట గుట్టముపై రాజు నిశ్చేష్టుడుగ నుండుట జూచి వారాశ్చర్య నిమగ్నులై, అష్టావక్రుడేదియో సమ్మోహమంత్రమును ప్రయోగించెనని భావించి వెంటనే యాతనిని వెదకి తోడితెచ్చిరి. అష్టావక్రుడు జనకుని స్పృశింపగనే యాతనికి స్పృహకలిగెను. 'జనకమహారాజా! నీవు ధన్యుడవు. త్రుటికాలములో బ్రహ్మానుభూతి కలుగుటకు అనువుగా నీహృదయమును అత్యంత పరిశుద్ధ మొనర్చుకొంటివి. మనస్సును ఒక పదార్థమువలె త్యజించివేయ సమర్థతను బడసితివి. ఇక నీకు క్రొత్తగా బోధించవలసినది లేదు. ఆత్మకు అడ్డుగానున్న మనస్సును తొలగించుటయే అన్నిబోధలయొక్క సారాంశము. అన్నిసాధనలయొక్క పర్యవసానము. అదియే అమనస్కస్థితి. మనస్సు అను అడ్డు తొలగినచో శేషించునదే ఆత్మ. అట్టి ఆత్మానుభూతియే మోక్షము. మనోలయము ద్వారా, మనస్త్యాగము ద్వారా నీవట్టి మహోచ్చస్థితిని బడసితివి కావున ధన్యుడవు' అని యష్టావక్రమునీంద్రుడు జనకునితో బలుక, అంతట జనకుడు తనకిట్టి సులభమగు మోక్షోపాయమును బోధించిన యాసద్గురువర్యునకు సాష్టాంగవందన మాచరించెను. తదుపరి యందఱున్ను తిరిగి నగరమునకు బోయిరి.

అయితే జనకుడు ఉత్తమాధికారి. అనేకజన్మలయందు చక్కగ సాధనచేసినవాడు. పరిపక్వహృదయుడు. కనుకనే త్రుటిలో తన మనస్సును త్యజింపగల్గెను. అందరును అట్లు చేయగలరా! లేదు. ఏలయనగా మనస్సు త్రిగుణాత్మకమై

నది. అది సత్త్వరజస్తమోగుణములతో గూడియుండును. మనస్సును లొంగదీయవలెననిన, ముందుగా ఒక్కొక్క గుణాము దాటి సత్త్వగుణము యొద్దకు చేరవలసియుండును. ఇనుపముక్కనుగాని, సీసపుముక్కనుగాని వంచవలె ననిన; దానిని అగ్నియందు బెట్లు ఎఱ్ఱగా కాచుదురో, అట్లే కఠినమగు మనస్సును శ్రవణ మనన నిధిధ్యాసనములచేతను, భక్తి వైరాగ్యనిష్కామకర్మాచరణాది సాధనములచేతను, మున్ముందు కోమలముగ నొనర్పవలెను. కోమలమనస్సును, అనగా సత్త్వ గుణాధిక్యతల మనస్సును అధిష్ఠానమగు పరమాత్మయందు లయింపజేయుట బహుసులభము. కఠినమనస్సును, అనగా రజస్తమస్సులతో గూడిన ఘనచిత్తమును ఎవరును ఆత్మ యందు లయింపజేయజాలరు. కావున మోక్షప్రాప్తికి ముందుగా ఈ మనస్సును గూర్చిన సంశోధన చాలఅవసరమై యున్నది. ఇట్టి మనస్సంశోధనయే ఈ గుణత్రయవిభాగ యోగమను అధ్యాయముయొక్క ప్రధానవిషయము. కాబట్టి దానినిగూర్చి ఒకింత యోచించుట సమంజసమై యున్నది.

ఒకదీపమునకు మూడు చిమ్నీలు (గ్లాసులు) కలవు. తెలుపువర్ణముకలది యొకటి, ఎఱుపువర్ణము కలది యొకటి, నలుపువర్ణము కలది యొకటి. ఆ మూడును దీపజ్యోతిని ఆవ రించి యున్నవి. ఆయావరణలవలన లోని దీపకాంతి ఇసుమంతైనను బయటకు కానవచ్చుటలేదు. అపుడు మెల్లగా అన్నిటి కంటెను పైన నున్నట్టి నలుపు చిమ్నీని తీసివేసిరి. దానిచే స్వల్పకాంతిమాత్రము బయటకు ప్రసరింపజొచ్చెను. చీకటి పూర్తిగ తొలగలేదు. అత్తటి రెండవదియగు ఎఱుపుగ్లాసును

దీసివేసిరి. తత్క్షణమే ఆ దీపజ్యోతి తన కాంతులను నలువైపుల వెదజల్లెను. అంధకారము చాలవఱకు తొలగినట్లే, అయినను ఇంకను ఒక ఆవరణ దీపమునకు ఉండియేయున్నది. అదియే తెలుపు చిమ్నీ. దానినికూడ ఎపుడు తొలగించివైచుదురో అపుడాజ్యోతి నిరావరణముగ ప్రకాశించుచు తనసహజకాంతి పుంజములను వెదజల్లుచుండును. అట్లే ఆత్మయును అఖండదీపమును సత్త్వరజస్తమోగుణాత్మక మగు మనస్సు అను కాచ త్రయము ఆవరించియున్నది. దానిని తొలగించినచో ఆత్మజ్యోతి నిరావరణముగ ప్రకాశించగలదు.

కొందఱి మనస్సులందు సత్త్వగుణము ప్రధానముగ నుండును. రజస్తమస్సులు గౌణముగనుండును. మఱికొందఱికి రజోగుణము ప్రధానముగను సత్త్వతమములు గౌణముగను నుండును. ఇంక కొందఱికి తమస్సు ప్రధానముగను సత్త్వరజములు అప్రధానముగను నుండును. వారు వారు తమ తమ చిత్తములను బాగుగపరిశోధించి మున్ముందు తమోగుణమును పారద్రోలి, ఆ వెనుక రజోగుణమును వదలివైచి సత్త్వగుణము దగ్గఱకు రావలెను. అప్పటికి జీవుడు చాలవఱకును శుద్ధుడైనట్లే. అయినను ఆ సత్త్వగుణముకూడ ఒకానొక ఆవరణమే కావున దానినికూడ కాలక్రమమున దాటి గుణాతీతస్థితిని జేరవలయును. అపుడు మనస్సు అత్యంత పరిశుద్ధమై ఆత్మయందు లయించి ఆత్మమాత్రముగ భాసించును. అదియే ముక్తస్థితి. దానినే తురీయాతీతస్థితియనియు పేర్కొందురు. గుణాతీతమని అమనస్కమని దానికే పేర్లు. ఒక్కొక్క గుణముయొక్క స్వభావము, వానిని దాటునట్టి ఉపాయములు, ఆ యా గుణ

ములు కలిగియున్నవారికి సంభవించు ఫలితములు మున్నగునవియన్నియు ఈ అధ్యాయమున తెలిపియుండుటబట్టి సాధకలోకమునకు, ముఖ్యముగ జ్ఞానమార్గావలంబులకు, మనశ్శాస్త్ర పరిశోధకులకు ఇయ్యది మిక్కుటముగ నుపకరించునదై యున్నది.

సత్త్వరజస్తమస్సు లను మూడు గుణములతో గూడినదే మనస్సు. ఈ మూడు గుణములే జీవుని అనాదికాలము నుండి బంధించుచున్నవి.

> సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః
> నిబధ్నన్తి మహాబాహో దేహే దేహిన మవ్యయమ్. (14-5)

'ఓ అర్జునా! ప్రకృతిజనితములగు ఈ సత్త్వరజస్తమోగుణములు అవ్యయుఁడగు ఆత్మను దేహమున బంధించివేయుచున్నవని భగవానుడు వ్రాకుచ్చెను.' కావున బంధవిముక్తిని గోరువాడు ప్రయత్నపూర్వకముగ ఈ మూడుగుణములను అతిక్రమించవలసియుండునని స్పష్టమగుచున్నది. అది యెట్లు సాధ్యపడగలదో చూతము. ఒక్కొక్కగుణమును బాగుగ విచారించి దానిని భేదించివేయు ఉపాయమును అన్వేషింతుము. ఏలయనగా మనస్సు శుద్ధపడుటకు, అమనస్కమును బడయుటకు ఇంతకుమించి వేఱొక దారిలేదు.

మొదటిది తమోగుణము. తమస్సనగా చీకటి, అజ్ఞానము "తమస్త్వజ్ఞానజం విద్ధి"-తమోగుణము అజ్ఞానజనితమైనది. అని గీతాచార్యుడు నుడివియే యున్నాడు. దీనిని నలుపు వర్ణముతో పోల్చిరి. చీకటిబజారు, చీకటివ్యవహారము

చీకటి ఆలోచనలు - ఇత్యాదులన్నియు తమోగుణలక్షణ ములే యగును. చీకటిలో నివసించునవి. చీకటి ఇష్టపడునవి తేళ్లు, పాములు, గుడ్లగూబలు, గబ్బిలములు, ఎలుకలు పందికొక్కులు, దయ్యములు, భూతప్రేతపిశాచములు, రాక్ష సులు మున్నగునవి. ప్రకాశమనినచో అయ్యవి అసహ్యించు కొనును. పైగా విమర్శించునుగూడ, ప్రకాశము ఎందులకు పనికిరానివస్తువని. మానవులలో కూడ అట్టివారుకలరు. కుంభ కర్ణుడు వారందఱియొక్క గురువు. నిద్ర, పరాకు, మత్తు, సోమరితనము, అలసత్వము, మోహము, ప్రవృత్తి శూన్య త్వము-ఇవి వారి గుణములు. నల్లమందు భక్షించు వారెట్లు తూగుచుందురో, ఆముదం త్రాగినవారెట్లు కళావిహీనులుగ గన్పట్టుదురో, వీరి తరహాకూడ అట్లేయుండును. తేనెటీగలలో డ్రోన్ (Drone) అను సోమరీగతో వీరిని పోల్చవచ్చును.

ఇట్టి సోమరులనుగూర్చి వర్ణించి చెప్పుచు భారతము శాంతిపర్వములో భీష్మాచార్యులు ధర్మరాజునకొక చిన్న కథ జెప్పిరి. ఒకానొక ఒంటె బయటతిరిగి మేత మేయుటకు పాలు మాలి ఒకేచోట కూర్చుని మేత సంపాదించుటకు యత్నిం చెను. కాని అట్లు సాధ్యపడలేదు. అంతట నక్కార్యసాధ నకై బ్రహ్మదేవునిగూర్చి తపస్సు చేసెను. దాని తపస్సునకు మెచ్చి చతుర్ముఖుడు ప్రత్యక్షమై వరము కోరుకొనుమని యాదేశింప ఆ ఉష్ట్రము 'మహాత్మా! నేను ఎక్కడకును కద లక వున్నచోటునుండియే ఆహారము సంపాదించుకొనుటకు వీలుగా నాకు ఒక వెయ్యి యోజనముల పొడవుగల మెడను దయచేయుము' అని ప్రార్థించెను. అట్లే కానిమ్ము' అని

వచించి బ్రహ్మదేవుఁ డంతర్ధానమయ్యెను. తత్క్షణమే ఒంటెకు అతిదీర్ఘమగు గ్రీవము లభించెను. దాని యానందమున కిక మేరలేదు. ప్రయాసలేకయే అది ఆహారమును పొందగల్గు చుండెను. ఇట్లుండ నొకనాడు బ్రహ్మాండమగు వర్షము కురి సెను. ఒంటెమెడ వానలో చప్పగ తడిసిపోవుచుండెను. దాచుకొనుటకు చోటెచట ? వెయ్యియోజనములమెడ దేని యందు పట్టగలదు? అది కర్తవ్యమును యోచించి తుట్టతుద కొకగుహయందు తన మెడనుదూర్చెను. రాత్రిసమయమున కొన్ని నక్కలచటికి వచ్చి ఆ మెడలోని కొంత భాగమును కొఱికి తినివై చెను. ఆ బాధకు తట్టుకొనలేక ఒంటె మరణిం చెను. సోమరితనమునకు సరియైన శాస్తి లభించెను. కావున తమోగుణజనితమగు అలసత్వము నెవరును దరికి చేర్చరాదు.

An idleman's brain is the workshop of the devil; 'సోమరిమనుజుని చిత్తము దయ్యము యొక్క కర్మాగారము' అను సామెతను జ్ఞప్తియందుంచుకొని మనుజుడు ప్రవర్తించవలయును- తమోగుణ స్వభావముగలవారి నడక, మాట, తిండి, చేష్ట అన్నిటియందును వారి మత్తుగుణము ప్రతిబింబించుచుండును.జంతువులలోకూడ తామసిక ప్రాణులు కలవు. పంది, ఎనుము (బఱ్ఱె). దున్న, మున్నగునవి తమో గుణ ప్రధానములగు జీవులు, వాటికి చురుకుతనముండదు. ఎల్లప్పుడు బురదలోపడి దొర్లుచుండును. ఈ తమోగుణము మహాభయంకరమైన వస్తువు. అజ్ఞానమునకు పుట్టిల్లు. ఊరక యుండుదానికంటె ఏదైన పనిచేయుట ఉత్తమము 'కర్మజ్యా యోహ్యకర్మణః'-'అకర్మకంటె కర్మయే మేలు' అని గీతా

చార్యుడు చెప్పియేయున్నాడు. ఊరక కూర్చుండి తమస్సున మునిగియుండువానికి ఏ దుర్గుణములు లేకున్నను ఏ దుష్టాచరణము నతడు చేయకున్నను, అన్నిదోషములకు నిలయమైయున్న అజ్ఞానము నాశ్రయించి యున్నందువలన ఆతడు గొప్పదోషియే యగును. గోడ అబద్ధము మాట్లాడదు. దొంగతనము చేయదు. ఎవరిని బాధింపదు. అంతమాత్రముచేత దానికి ఆ సుగుణజన్మ పుణ్యము లభించునా! లేదు. ఏలయనిన, అన్నిపాపములకు దోషములకు ఆలవాలమైనట్టి తమస్సు, జడత్వము దాని నావరించియే యున్నది. తురీయస్థితియందుండువాడు, జడుడు, ఇరువురును చూచుటకు పైకి ఒకేరీతి కనిపించినను, వారిరువురికిని ఉత్తర దక్షిణ ధ్రువములంత తేడా కలదు. ఒకడు అజ్ఞానరహితుడు, మఱియొకడు అజ్ఞానమయుడు. కావున తమస్సున పడియుండు వానిని జూచి జ్ఞానియని మోసపోరాదు. మఱియు ఏ కర్మను చేయక తూష్ణీంభూతుడై ఊరకపడియుండు అజ్ఞానికర్మరహితు డెన్నటికిని కాడు. పైగా కర్మబంధనమును నెత్తినవేసికొను వాడే యగును. కావున మహాప్రమాదకరమగు ఈ తమోగుణమునకు ఎవరును తమయందాశ్రయమివ్వరాదు. ఊరక కూర్చుండి వ్యర్థముగ కాలము గడుపుటకంటె ఏదైన పని చేయుట మేలు. అది దైవకార్యమైనచో ఇంకను మేలు. గ్రుడ్డిలోమెల్ల యనునట్లు తమోగుణముకంటె రజోగుణము కొంత మెరుగు. ఏలయనగా రజోగుణముకలవాడు క్రిందపడి నప్పటికిని మరల పైకిలేచు అవకాశముకలదు. తమోగుణములో అది లేదు. అది ఎల్లప్పుడును గోతిలోని కాపురము వంటిది. కావున అది సర్వదా త్యాజ్యమే యగును.

మానవజీవితము అమూల్యమైనది. ఒక్కొక్క క్షణము ఎంతయో విలువగలిగినది. చేయవలసిన సాధన లెన్నియో యున్నవి. మృత్యువు దేహమును కబళించివేయుటకు సంసిద్ధముగ నున్నది. భగవత్సాక్షాత్కారమను మహత్తర లక్ష్యమును ఈ జన్మయందే సాధింపవలసియున్నది. అట్టితఱి వ్యర్థముగ కాలక్షేపము చేయుచు జీవితమును తమస్సున కంకితము చేయుట తగునా ?

సంసార మిమమాసాద్య యస్తిష్ఠత్యవహేలయా
జ్వలితస్యగృహస్యోచ్చైః శేతే తార్ణస్య సంస్తరే (వసిష్ఠగీత)

'ఈ ప్రపంచమున జన్మించి ఎవడు పరమార్థవిచారణ చేయక ఊరక కాలమును గడిపివేయునో, అట్టివాడు ధగ ధగ మండి పోవుచున్న ఇంటిలో గడ్డిపఱకపై నిదురించుచుండువాడే యగును' అని వసిష్ఠమునీంద్రులు శ్రీరామచంద్రునకుబోధించిరి. కాబట్టి తమోగుణమునకు చోటీయక, సోమరిదేవత నుపాసింపక కర్తవ్యశీలుడై జీవితలక్ష్యమగు దైవసాక్షాత్కారమును శీఘ్రముగా పొందులాగున ప్రయత్నించవలెను. 'తరువాత చూచెదము.' 'వార్ధక్యములో కృష్ణ, రామ అనుకొనవచ్చు కదా, రిటైర్ (Retire) అయినపిదప బోలెడు సమయము దొఱకునుగదా. అప్పు డాలోచించుకొనగూడదా-పుణ్యమో పురుషార్థమో' - ఈలాటి వాక్యముల నెవరును ఉచ్చరింప రాదు. ప్రమాదభూయిష్ఠములగు ఇట్టి తామసిక భావముల కెవరును చోటీయరాదు. ఏలయనగా కబీరు చెప్పినట్లు రేపునకు రూపు లేదు. యమధర్మరాజు ఆకస్మిక దండయాత్రలను (Surprise visits) గావించును. 'నేను వచ్చుచున్నాను'

అని ముందుగా సూచించుపద్ధతి అతనియొద్ద లేదు. కనుక నే కాలమనక దేశమనక ఎక్కడపడితే అక్కడ, ఎప్పుడుపడితే అప్పుడు, ఎవరినిపడితే వారిని, వేళాపాళా లేక ఉచ్చుబిగించి ఈడ్చుకొని పోవుచుండును. తిరిగి అప్పీలులేదు. 'ఎందుకురా తండ్రీ యిట్లు చేసినావు' అని ఎవరును అడుగరాదు. అడిగినను జవాబిచ్చువారులేరు. ఇట్టి సందర్భములో కాళ్ళు బారజాపు కొని కూర్చొని గోళ్ళు గిల్లుకొనుచు, వ్యర్థముగ లోకాభి రామాయణములను గావించుచు సమయమును ఊదివేయుట మహాప్రమాదకరమని సర్వులును జ్ఞప్తియందుంచుకొందురు గాక !

రాత్రిర్గమిష్యతి భవిష్యతి సుప్రభాతం
భాస్వానుదేష్యతి హసిష్యతి పంకజశ్రీః
ఇత్థం విచిన్తయతి కోశగతే ద్విరేఫే
హాహన్త హన్త నలినీం గజ ఉజ్జహారం.

"ఒకానొక సరస్సులో బాగుగవికసించియున్న కమలమునందు తుమ్మెద యొకటి మధువు నాస్వాదించుటకై ప్రవేశించెను. ఆనందాతిరేకముచే నయ్యది అచ్చోటనే యుండి మాధుర్యమును గ్రోలుచుండెను. ఇంతలో సూర్యాస్తమయ సమయమే తెంచెను. కమలముముడుచుకొనెను. తుమ్మెద కమలములో చిక్కుకొనిపోయెను. తత్సందర్భమున ఆ భ్రమరము తనలో నిట్లు ఊహాగానమొనర్ప జొచ్చెను-రాత్రి త్వరలో గడిచిపో గలదు. తెల్లవారగలదు. సూర్యు డుదయించ గలడు. అపుడీ కమలము వికసించదొడగును. అత్తఱి నేను తప్పించుకొని పారిపోవుదును-ఈ ప్రకారముగ తలంచుచుండగనే ఇంతలో

నొక ఏనుగు ఆ కాసారమున ప్రవేశించి ఆ కమలమును తన కాలితో త్రొక్కివైచెను. తుమ్మెద చనిపోయెను." గజమట కరుదెంచునని కాని, తాను మృత్యువాతపడవలసి యుండునని కాని తుమ్మెద ఏనాడైన ఊహించినదా ? లేదు. కాని అట్లు జరిగినది. కాబట్టి ఎప్పటికప్పుడే సిద్ధపడి యుండవలెను. అధ్యాత్మరంగమున 'వాయిదాసమాచారము' పనికిరాదు. శ్రీవిష్ణుభగవానుడు గరుత్మంతున కుపదేశించిన విధముగ-

శ్వః కార్యమద్య కుర్వీత పూర్వాహ్ణే చాపరాహ్ణికమ్
న హి మృత్యుః ప్రతీక్షేత కృతం వా హ్యథవాఽకృతమ్.

(గరుడపురాణము)

"రేపు చేయవలసిన పనిని ఈరోజే చేసివేయవలెను. మధ్యాహ్నము చేయవలసిన పనిని ప్రొద్దుననే పూర్తి చేయవలెను. ఏలయనగా, పని ముగిసినను, ముగియకున్నను యమధర్మరాజు దానికొఱకు వేచియుండడు." 'ప్లాటుఫారం' మీదకు రైలు రాకపూర్వమే కొన్ని గంటలు ముందుగా ప్రయాణీకులు తమ మూట ముల్లె, టిక్కెట్టువగైరాలన్నియు జాగ్రత్తపఱచుకొని అచ్చోటి కెట్లువచ్చి చేరుదురో, పరీక్ష ఏతెంచుటకు కొన్ని రోజులు ముందుగనే విద్యార్థులు తమతమ పాఠ్యగ్రంథముల నెట్లు క్షుణ్ణముగ చదివియుంచుకొందురో, అట్లే మృత్యువాసన్నమగుటకు పూర్వమే మనుజులు పరమపురుషార్థమగు మోక్షమునకు వలసిన సాధనసంపత్తిని లెస్సగ సమకూర్చుకొనియుండవలెను. తమస్సునకు తావీయరాదు. సోమరితనమును దరికి జేర్చరాదు. మితిమీరి నిద్రపోరాదు. మితిమీరి

భుజించరాదు. శరీరనిర్వహణమునకు వలసినంతమాత్రము నిద్రాహారములను గైకొనవచ్చును. రోజునకు ఐదారుసార్లు భుజించినచో నిద్రయు ఆ దాహాపహాప్రకారము పెరిగిపోవు చుండును. అత్తటి విలువైన జీవితసమయములో అధికభాగము తమోగుణస్వభావమగు నిద్రయందే గడచిపోగా జీవుడు కర్తవ్యవిహీనుడై అవనతిఁ బొందును. కావున తమస్సును పారద్రోలి, 'అలారం' పెట్టుకొని బ్రహ్మముహూర్తమున (ఉదయం 4 గంటలకు) నిద్రలేచుటను అభ్యసించవలెను. తదుపరి స్నానమో, సంధ్యయో, జపమో, పూజయో, నడచుటో, వ్రాసికొనుటో, చదువుటో - ఏదియో యొక కార్యములో మనస్సును ప్రవేశపెట్టవలెనేకాని ఊరక నుండరాదు. ఏల యనగా ఊరకనున్నచో తమస్సు ఆవరించివైచును. నిద్ర వచ్చినచో చన్నీళ్ళతో ముఖము కడుగుకొనుటగాని, ఒక పాటయో, పద్యమో, కీర్తనయో పాడుటగాని, కొంత దూరము ఇటునటు నడచుటగాని చేయవలెను. ఈ ప్రకారముగ కొన్ని సమయోచితములగు ఉపాయములద్వారా శరీరములో తమోగుణము జొరబడకుండ చేయవలెను.

తమోగుణము కలవానికి 'దీర్ఘసూత్రి' యని గీతాచార్యుడు పేరిడెను. అది యతనికి అన్వర్థకనామధేయము. ఏలయనగా తమోగుణాభిషిక్తుడు ఏపనినిగూడ త్వరగా తెమలనీయక దారమువలె సాగదీయును. ప్రతివిషయము నందును 'ఇప్పుడేమి తొందర' అను జవాబిచ్చుచుండును. పరమార్థక్షేత్రమున ఇట్టి అలసత్వమునకు తావేలేదు.

షడ్దోషాః పురుషే ణేహ హాతవ్యా భూతిమిచ్ఛతా
నిద్రా తంద్రా భయం క్రోధ ఆలస్యం దీర్ఘ సూత్రతా.

'ఉన్నతిని, ఐశ్వర్యమును అభిలషించువాడు - (1) నిద్ర (2) తంద్రత కునుకు, (drowziness) (3) భయము (4) కోపము (5) సోమరితనము (6) తమస్సు-అను ఈ ఆఱు దోషములను పూర్తిగ విడనాడవలెన'ని శాస్త్రము లాదేశించుచున్నవి. 'తస్మాజ్జాగ్రత ! జాగ్రత!' అని పెద్దలు హెచ్చరిక చేయుచున్నారు. జనులారా! అజ్ఞానమను కారుచిచ్చు మీ యుపాధులను గృహములను తగులబెట్టుచున్నది, లెండు, లెండు, అని మహాత్ములు కేకలిడుచున్నారు. 'ఎన్ని జన్మల నుండియో నిద్రించుచున్నారు, చాలదా? ఇప్పుడైనను మేలుకొనరా ?' అని వారు ప్రశ్నించుచున్నారు. కావున ఈ దీర్ఘ సంసారయాత్రను ఇంతటితో అంతముచేసి నిరతిశయ సుఖమును బడయగోరు ప్రతిమానవుడున్ను తమోగుణమును దులిపివేసి, రజోగుణమును ధిక్కరించి, నడుము బిగించి సాధనాపరుడు కావలసియున్నది. అర్ధరాత్రి 12 గం॥కు ఒకచోట మెయిలుబండి (Mail) అతివేగముగ పోవుచుండెను. దానిలో రెండువందలమంది ప్రయాణీకులు, తదితరులు కలరు. అర్థరాత్రి కనుక అందఱిని నిద్రాదేవత ఆవహించినది. కొందఱు గుఱ్ఱుపెట్టి నిద్రపోవుచుండిరి. కొందఱు సగమునిద్రలో నుండిరి. కొందఱు పాతికనిద్రలో ఇటునటు ఊగుచుండిరి. అంతమంది తమస్సులో పడియున్నప్పటికి ఒక్కడుమాత్రము ఆరైలులో మేలుకొనియేయుండెను. నిద్రపొమ్మని ఎందఱు చెప్పినను అతడు వినడు. అతడే 'డ్రైవరు'.

అతడుకూడ నిద్రపోయినచో తక్కినవారి గతి ఏమగును? అధోగతే! ఆప్రకారముగనే ఈ దీర్ఘ సంసారయాత్రయందు అజ్ఞానులందఱున్ను ప్రయాణీకులవలె నిద్రించుచుండ జ్ఞాని యగువాడు డ్రైవరువలె మేలుకొనియుండును.

యానిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ

అని భగవానుడీవిషయమును తొలుతనే చెప్పియున్నాడు. కావున 'డ్రైవరు'వలె నుండవలెనుగాని ప్రయాణీకులవలె నుండరాదు. జ్ఞానివలె వ్యవహరించవలెగాని అజ్ఞానివలెకాదు. ఒకవేళ మహనీయుల ఇట్టి హితవచనములను పెడచెవినిపెట్టి తమోగుణమునే యింకను ఆశ్రయించియుండునో భీషణ సంతాపములకు వారు తప్పక గురి కావలసివచ్చును. జనన మరణములనుండి విడివడక దుర్వార దుఃఖదావాగ్నులచే దందహ్యమానులగుచుందురు.

'అధో గచ్ఛన్తి తామసాః'

'తథా ప్రలీనస్తమసి మూఢయోనిషు జాయతే'

ఇత్యాది భగవద్వాక్యానుసారము అట్టి తమోగుణసంపన్నులు మరణించినపిదప అధోలోకములకుజని నీచయోనులందు జన్మించి రాక్షసులై, కుక్కలై, నక్కలై ఘోరయాపదలను బొందుచుందురు. మరల మానవు లెప్పటికగుదురో! ఎవరి కెఱుక! కావున వివేకవంతులగువారు కడుజాగరూకులై తమ హృదయ ప్రాంగణమున ఈ తమోగుణరూప ఘోర పిశాచమును జొరబడకుండ చూచుచుండవలెను.

అంతటితో మనపని పూర్తి అయినదా? కాదు. ఇంకొక పెనుభూతము కాచుకొనియున్నది. అదియే రజో

గుణము. మానవుని, దుఃఖసాగరమున పడద్రోయుటలో ఇదియు తమోగుణమునకు ఏమంత తీసిపోదు. ఇద్దఱు అన్న దమ్ములవంటివారు. అందులో తమోగుణము పెద్దన్న. దుఃఖ జనకత్వశక్తియందిరువురికిని తరతమభేదముమాత్రము కలదు. రజోగుణముకలవాడు ఒక్కచోట నిలుకడగనుండడు. ఎప్పుడును ఏదియోపనిలో, వ్యవహారములో జొరబడి, తొందర పాటుకలిగి, దుస్సంకల్పములకు తావొసంగుచుండును. కామ క్రోధాద్యరిషడ్వర్గసమన్వితుడై యుండును. తృష్ణచే పరిపూరితుడై యుండును.

లోభః ప్రవృత్తిరారంభః కర్మణామశమః స్పృహా
రజస్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ. (14-12)

'ఓఅర్జునా' రజోగుణము అభివృద్ధినొందినపుడు మనుజునియందు లోభము,ప్రవృత్తి,దుష్కార్యాచరణము, ఇంద్రియలోలత్వము ఆశ మున్నగునవి ప్రాదుర్భవించున'ని శ్రీకృష్ణమూర్తి అర్జునునకు తెలియజేసెను. రజోగుణము కలవారియొక్క ప్రతికార్యమందును వారియాగుణము,గుణస్వభావము ప్రతిబింబించుచునే యుండును. భోజనమునకు కూర్చుండినచో వారు గబగబతిని లేచిపోవుదురు. మాట్లాడుట ప్రారంభించినచో చెడవాగుడు వాగుదురు. వారి సంభాషణలకు అంతువుండదు. నడచుట మొదలుపెట్టినచో రాకెట్ వేగముతో పోవుచుందురు. ఇక సంకల్పములు చూతమా అన్నియు దుష్టాలోచనలే. కామ క్రోధాదులతో నవి నిండినిబిడీకృతములై యుండును. తమోగుణశాలురకు కుంభకర్ణుడు గురువైనట్లు, రజోగుణవంతులకు రావణాసురుడుగురువు. భేదిమందు(విరేచనములకు ఔషధము)

భుజించినవాడు ఇంటిలో నొకచోట నిశ్చలముగ కూర్చుండుట కెట్లు నోచుకొనలేడో, కడుపులో త్రిప్పినప్పుడు బయట కెట్లు పోవలసియుండునో అట్లే రజోగుణము చిత్తమున గలవాడు కొద్దిసేపైనను నిశ్చలముగ, ప్రశాంతముగ కూర్చుండ నభిలషించినప్పటికి ఆ గుణము వాని నట్లు కూర్చుండనివ్వదు. పైకిలేపి ఏవియో వ్యవహారములలోనికి దింపును. కొందఱు ఇంటిలో రచ్చపడలేక అకస్మాత్తుగా ఆశ్రమములకు పరుగెత్తుకొని వచ్చుదురు. భార్యతోనో, బిడ్డలతోనో, బంధువులతోనో కలహించుకొని వచ్చిన కారణముచే వారి రాకకు తాత్కాలిక ఆవేశమే కారణముకాని, వైరాగ్యము కాదు. ఇక్కారణమున ఒకటి రెండు రోజులు ఆశ్రమములో నుండుసరికి, పూర్వపు రజోగుణము చిత్తకుహరమున రేకెత్త, చల్లగా పీఠము కదిలించుదురు. అత్తఱి కొందరుచెప్పియో, కొందరు చెప్పకుండగనో ఆశ్రమము దాటివైచుదురు.

జంతుప్రదర్శనశాల (Zoo) యందు చూచినచో సింహము, పులి, ఎలుగుగొడ్డు మున్నగు క్రూరజంతువులు ఒక్కనిమిషమైనను నిశ్చలముగ నుండక బోనులో ఇటునటు సంచారముచేయుచుండును. వానియందలి రజోగుణాధిక్యతచే నవి యట్లు చపలముగనుండును. రజోగుణము కలిగిన మానవుడున్ను అంతియే. ఈ రజోగుణము తొలగనిచో, లేక సత్త్వగుణములోనికి మారనిచో జీవునకిక సద్గతియే లేదు.

రజసస్తు ఫలం దుఃఖం

'రజోగుణమునకు ఫలితము దుఃఖమే' యని గీతాకారుడు స్పష్టముగ నిరూపించెను. కావున వివేకవంతుడు తన మనంబును

బాగుగ పరిశోధించి తమోగుణలక్షణములుగాని రజోగుణ లక్షణములుగాని ఏవైనయున్నచో ప్రయత్నపూర్వకముగ వానిని తొలగించివేయవలెను. అభ్యాసవశమున వాటిని దూరీకరించవలెను. పొలములో కలుపు, ముండ్లు మున్నగునవి యున్నచో పైరు సరిగా పండదు. సస్యాభివృద్ధిని కాంక్షించు రైతు ముందుగనే జాగ్రత్తపడి వానిని పెరికివేయును. అట్లే హృదయక్షేత్రమున కామక్రోధాది దుర్గుణములు, రజోగుణ తమోగుణదోషములు ఉన్నచో ఆత్మసాక్షాత్కార మను ఫలము పండదు. మోక్షరూప ఫలితము చేకూరదు.

మఱియు, లోకములో సామాన్యముగ ఎవరైన మహనీయులను ఇంటికి ఆహ్వానించునపుడు ముందుగా ఇల్లంతయు కడిగి శుభ్రపఱచుదురు. గోడలకు పట్టియుండు బూజు దులిపి వేయుదురు. సున్నము కొట్టించుదురు. పచ్చతోరణములు కట్టుదురు. అదేవిధముగ ఒక పట్టణములోనికి మంత్రిగాని,గవర్నరు గాని, లేక బాధ్యతగల గొప్ప ప్రభుత్వోద్యోగిగాని రానున్నచో నెలరోజుల ముందునుండియే రోడ్లు బాగుచేయుట, భవనములు మరమ్మతుగావించుట ఒనర్చుచుందురు.సామాన్య మానవులరాకకే ఇంత పరిశుభ్రతను శీలించుచుండ, ఇక సాక్షాత్ వైకుంఠనాథుడే మన హృదయసీమయందు అడుగు పెట్టవలసియుండిన, దాని నెంత పవిత్రముగ, దోషరహితముగ నుంచుకొనవలెనో ఊహించుకొనుడు ! మురికిపేటలో పెద్దలు అడుగుపెట్టరు. ఇక దేవుడు మాత్రము పెట్టునా? కావున భగవత్సన్నిధానము నపేక్షించు మానవుడు తదనుకూలముగ క్షేత్రమును శుద్ధపఱచుకొనవలెను. లోభ,

మోహ, దంభ, అసూయాది దుర్గుణములకు, తృష్ణకు-వీని యన్నింటికి మూలకందములగు రజోగుణ, తమోగుణములకు తత్క్షణమే ఉద్వాసన చెప్పవలయును.

ఇక్కాలమున యువకులలో పెక్కురు ఇంటినుండి పాఠశాలకుగాని, ఆఫీసుకుగాని, లేక వాహ్యాళికిగాని బయలు దేరి పోవునపుడు జేబులో ఒక దువ్వెన, చిన్న అద్దము పెట్టుకొని పోవుచుందురు. ఏలయనగా దారిలో ఎచటనైన జుట్టు చెరిగిపోయినచో, దానిని ఆ సాధనములచే సరిచేసి కొందురు. మంచిదే, కానీ స్థూల దేహములోని ఒకింత బాహ్యవైకల్యముననే అంత జాగరూకత అవసరమైనపుడు సూక్ష్మదేహమగు మనస్సునకు ఇంకెంత అవసరము? ఒక్కొక్కరి మనస్సు ఘోరమగు వికలత్వము, విరూపము, వికారము పొందిపోవుచుండ దానిని గూర్చి యోచించు నాథుడు లేకపోయెనే? ఆ సూక్ష్మదేహము (మనస్సు) చెరిగి పోయినపుడు వలసిన (దువ్వెన, అద్దమువంటి) పరికరములను జనులు తమదగ్గఱ యుంచుకొనుటలేదు. ఆ పరికరములే భగవద్గీత, ఉపనిషత్తులు, భారత భాగవతాదులు, గురు బోధలు. కావున బాహ్యశరీరముతోపాటు, అభ్యంతర శరీరమునుగూడ అందముగ నుంచుకొనుటకై నేటి నవనాగ రికులు ప్రయత్నించుదురుగాక! అందులకుగానువారెల్లప్పుడును తమ జేబులో దువ్వెనలతోపాటు ఒక చిన్నగీతాగ్రంథమును గూడ నుంచుకొనుట శ్రేయస్కరము. బాహ్యసౌందర్యమును ప్రాపంచిక జనులు వీక్షించుచుందురు, అభ్యంతర సౌందర్య మును భగవానుడు వీక్షించును. కావున మొదటి యొక్క

దానిని మాత్రమే పట్టుకొని వ్రేలాడినచో దానివలన మనకు ఏలాటి ప్రయోజనము సిద్ధించగలదు? పైగా మన భౌతిక శరీరముయొక్క అందచందములను జూచునట్టి ఈజనులతోటి మన సంబంధము ఎంతకాల ముండగలదు? అల్పకాలము మాత్రమే. భగవంతునితోటి సంబంధమో శాశ్వతమైనది. ఈజన్మతో పోవునదికాదు. కావున సనాతనమగు ఆ సంబంధమును చెడగొట్టకుండ చూడవలెను. భగవంతుడు మనలను జూచి ప్రీతి నొందులాగున ప్రయత్నించవలెను. ఆతడెట్లు ప్రీతినొందును? ఎవని యెడల ప్రీతిగలిగి యుండును?

భక్తిమాన్యః స మే ప్రియః

అను భగవద్వాక్యానుసారము ఎవడు సర్వేశ్వరునియెడల అనన్యభక్తిగలిగియుండునో, భక్తుని లక్షణములగు అద్వేష్టృత్వాది సద్గుణములకు తనయందాశ్రయ మొసంగునో, రజోగుణ తమోగుణములను అతిదూరముగ తొలగించి వేయునో, అట్టివానిని దైవము ప్రేమించును, లాలించును. ఆతనికే సద్గతి యొసంగును. కాబట్టి భగవత్కటాక్షము నభిలషించు మానవుడు తన హృదయశుద్ధి విషయమై కడు జాగరూకత వహింపవలసి యుండును.

అయితే అట్టి హృదయశుద్ధిని సాధించుటెట్లు? భయంకరములగు రజోగుణ తమోగుణములను దేహగృహమునుండి పారద్రోలుటెట్లు? తమోగుణమును జయించు విషయమై ఇదివరలో కొన్ని పద్ధతులు సూచించబడినవి. ఇపుడు రజోగుణమును దూరీకరించుటకు ఉపాయముల నన్వేషింతుము. రజోగుణమువలన కామము, క్రోధము, లోభము మున్నగు అసభ్య

ప్రవృత్తులుదయించి జీవుని వేధించుచుండును. వానియన్నింటి కిని ఒకటే దివ్యౌషధము. అదియే విచారణ. అజ్ఞానజనితము లగు ఈ రాజసిక, తామసిక దుష్టస్వభావములు జ్ఞానవిచారణ చేతనే అంతమొంది పోగలవు. దేనిపై కామము? ఎవని యెడలి క్రోధము? ఎద్దానియందు లోభము? ఒకింత విచారించి చూచిన వాటిగుట్టు అంతయు బయటపడిపోగలదు. విచారింపని కారణముచేతనే మనుజుడు ఆ యా అల్పగుణములకు దాసానుదాసుడగుచున్నాడు. కాబట్టి విచారించి చూచెదము—

ఈ ప్రపంచమునగల సమస్తపదార్థములు పంచభూత వినిర్మితములు. పృథివ్యప్తేజో వాయురాకాశరూప పంచభూత మహాసముద్రమునందు ఈ దేహాది దృశ్యపదార్థములన్నియు తరంగ, ఫేన, బుద్బుదములవంటివి. అందు పురుష దేహ మొక తరంగము, స్త్రీ దేహము మఱియొక తరంగము, గోవు ఒక తరంగము, గజ మొక తరంగము. అట్లే కుక్క, నక్క, సర్పము, పర్వతము, పక్షులు, సూర్యుడు, చంద్రుడు మున్నగునవి వేర్వేఱు తరంగములు. అవి యన్నియు కొంతకాలమునుండి చితికిపోయి పంచభూతమహాసముద్రమున విలీనములై, మరల వేర్వేఱు ఆకృతులతో నూతనముగ బహిర్గతములగుచుండును. కావున అవి క్షణికములు. క్షణికపదార్థములందు సౌందర్యమును, ఆనందమును అపేక్షించువాడు అవివేకి. గంధర్వనగరముయొక్క తళుకుబెళుకులనుజూచి మురిసిపోవువాడు అజ్ఞానికాక మఱియెవడు? మృత్యుగ్రస్తములగు పదార్థములను నమ్ముకొని యుండువాడు ఎప్పటికైనను దెబ్బతినును.

ఏల యనగా వాటితో వియోగము సంభవించియే తీరును. లేక తానైనను వియోగమును బొందిపోవును. (దేహమును త్యజించును). ఈసత్యమును తెలిసికొనక అజ్ఞాని తనధనమును జూచుకొని, సౌందర్యము చూచుకొని, దేహ, ఆరామ క్షేత్రములను జూచుకొని, ఎగిరెగిరి పడుచుండును.

మా కురు ధన జన యౌవన గర్వం
హరతి నిమేషాత్కాలస్సర్వం
మాయామయమిదమఖిలం హిత్వా
బ్రహ్మపదం త్వం ప్రవిశ విదిత్వా. (భజగోవిందము)

'ఓ జీవుడా! నీయొక్క ధనము, పరిజనము, యౌవనము జూచి వ్యర్థముగ గర్వింపకుము. ఏల యనగా ఒక్క క్షణములో మృత్యువు వానియన్నింటిని హరించివేయగలదు. ఈ దృశ్య మంతయు మాయామయమని, అనిత్యమని యెఱిగి, దాని యెడల విరక్తిగలిగి సత్యమగు బ్రహ్మపదమును తెలిసికొని యందు ప్రవేశింపుము' అని శ్రీశంకరాచార్యులవారు హెచ్చరిక చేసియున్నారు. వస్తువుయొక్క యథార్థ స్వరూపమును బాగుగ వివేచించి చూచినపుడు దానిలోని దోష మెపుడు తెలిసిపోవునో అపుడిక దానిపైగల వ్యామోహము అంతరించి పోవును. ఇంద్రియ నిగ్రహమునకు మహాత్ము లవలంబించు పద్ధతి యిదియే. పదార్థములందలి దుఃఖమును, దోషమును వారు బాగుగ వివేచించి చూచుదురు (దుఃఖ దోషాను దర్శనమ్). దృశ్యవస్తువులయొక్క నశ్వరత్వము, మరణ శీలత్వము జీవుని స్మృతిపథమున కెపుడు వచ్చునో, అపుడు తత్క్షణమే వానియెడల నాతనికి విరక్తి జనించును.

విషయభోగాశ సన్నగిలును. కనుకనే ఇంటిలో యెవరైన మరణించునపుడు ఆ యింటివారికి, చుట్టుప్రక్కలనున్నవారికి ఒకవిధమైన ప్రపంచవిరాగభావము జనించుచుండును. వైర రాగాదులు, భోగభావనలు ఆ సమయమున జనుల చిత్తము నందు సడలిపోవుచుండును. ఎప్పటికైన నశించిపోవు ఈ తుచ్ఛ శరీరమునకు భోగములేల? ఈ కొద్ది జీవితములో ఒకరిపై ద్వేషమేల? అసూయయేల?'- ఇత్యాది భావములు వారి మనఃఫలకమున నుదయించుచుండును. అయితే శవమును జూచుటవలన, మరణ ప్రత్యభిజ్ఞవలన తాత్కాలికముగ నావిర్భవించు ఆవేశమే అది. దానినే శ్మశాన వైరాగ్య మందురు. ఏ వైరాగ్యమైనను కానిండు వైరాగ్యముద యించెనా లేదా యనునదే మనకు సంబంధించిన విషయము. వస్తువినాశమును స్మరించిన వెంటనే హృదయమున ఎట్టి పరిణామము గలుగగలదో గమనించుడు. రజోగుణ మెట్లు పలాయనము చిత్తగించునో చూడుడు.

పూర్వమొక మహారాజుండెడివాడు. అతడు అత్యంత శ్రీమంతుడును, యువకుడును, ధార్మికబుద్ధికలవాడును అయి యుండెను. అతనికొక గురువుండెను. మంత్రోపదేశముచేయ వలసినదిగా ఆ గురువును చాలకాలము రాజు ప్రార్థించుచు రాగా ఒకనాడాతడందులకియ్యకొనెను మంత్ర ముపదేశించుట మాత్రము చాలదనియు, ఆమంత్రము నిరంతరము తనకు జ్ఞాపక ముండులాగున ఏదైన ఉపాయమునుగూడ వచించవలెననియు రాజు తన గురువర్యుని ప్రార్థించెను. అత డందుల కంగీకరించి 'ఇదికూడ ఎప్పటికైనను నశించిపోవును' అను-అర్థమిచ్చు 'Even this shall pass away - అను ఇంగ్లీషువాక్యమును రాజు

గారి వ్రేలియుంగరముపై చెక్కించి అదియే మహామంత్ర మనియు, ఉంగరమును చూచినప్పుడెల్లా అది జ్ఞాపకమునకు వచ్చుచుండునుగాన ఇక మఱచుటకు అవకాశము లేదనియు చెప్పి పంపివైచెను. భూపతి ఆనందభరితుడై నిజస్థానమున కరిగెను. ఆరోజు గడచిపోయెను. మఱుసటిదినము రాజు నిద్ర లేవగనే వందిమాగధులు అతనిచుట్టుజేరి 'నీవు ఇంద్రుడవు, చంద్రుడవు' అని స్తుతింపసాగిరి. అత్తఱి భూపాలునిదృష్టి అక స్మాత్తుగ తన వ్రేలియుంగరముపై బడెను. మహామంత్రము దృగ్గోచరమయ్యెను. 'ఇదికూడ ఎప్పటికైనను నశించిపోవునదే- ఈనాకీర్తి, ఈవైభవము, ఈస్తోత్రములు-మూణ్ణాళ్ళముచ్చట్లే (Fame is a slow decay) అని తలంచి మనంబున వారి స్తుతిపాఠములచే ప్రభావితుడుకాక యుండెను.

కొంతకాలము గడచినది. ఒకనాడు సామంతరాజులు నలుదెసల తాము జయించిన రాజ్యముల నుండి కొల్లగొట్టి తెచ్చిన రత్నములను, వజ్రవైడూర్యములను,సువర్ణాద్యాభర ణములను ఆస్థానమున మహారాజుసమ్ముఖమున కుప్పలుకుప్ప లుగా పోసిరి. రాజుయొక్క ఆనందమునకు మేరయే లేదు. కాని ఆ హర్షోత్కర్ష సమయమున తటాలున అతనిదృష్టి ఉంగరము పైకిపోగా, గురుప్రోక్తమహామంత్రము, తదర్థము జ్ఞప్తికి వచ్చెను. 'ఇదికూడ ఎప్పటికైనను నశించిపోవును.'- కావున ఈరత్నరాసులనుజూచి మురిసిపోకూడదు. ఈ సిరిసంపదలు ఏనుగుతినిన వెలగపండును బోలియుండును. ఈనాటి లక్షాధి కారి విధివైపరీత్యముచే రేపు భిక్షాధికారియైపోవును. ఇట్టి చంచల వైభవములందు మమత్వమేల? అని లోలోన

తలంచుకొని సంపదలయందు నిర్లేపుడై వర్తించెను. మఱి కొంతకాలము గడచినమీదట రాజునకు వివాహము నిశ్చయ మయ్యెను. దూరదూర ప్రాంతములందుగల మహారాజు లందఱును సుముహూర్తమునకు విచ్చేసిరి. వివాహక్రతువు పూర్తిఅయ్యెను. నాటిరాత్రి వధూవరుల ఊరేగింపునకు సర్వ సన్నాహములు గావింపబడెను. నవరత్నఖచితమగు బంగారు పల్లకిలోనూతనదంపతులను ఆసీనులజేసి రాజలాంఛనములతో బ్రహ్మాండమైన ఊరేగింపును సాగించిరి. మేళతాళములు, నృత్యములు, గీతములు - వీనితో గూడి ఆ దృశ్యము కనుల పండువుగ కనిపించుచుండెను. పెండ్లి పెద్దలు ముందు నడచు చుండ, వెనుక దివ్యాలంకారములతో శోభించుచున్న పల్లకి యందు వధూవరు లాసీనులై వచ్చుచుండిరి. జయజయ ధ్వానములచే దిక్కులు పిక్కటిల్లుచుండెను. ఆ యానందాతి రేకసమయమున అకస్మాత్తుగ రాజుదృష్టి చేతి ఉంగరముపై బడెను. 'ఇదికూడ ఎప్పటికైనను నశించిపోవును' అను ఆ మంత్రము స్మృతిపథమున మెఱయ నాయెదురుగాకూర్చొని యున్న ఈ పెండ్లికుతురు కాలగర్భమున ఎప్పటికైనను విలీనమైపోవు ఒకానొక పదార్థము మాత్రమే. ఇది రక్త మాంసములతో గూడిన తోలుబొమ్మయే. పంచభూతముల సమ్మేళనమువలన ఏర్పడిన ఆకృతిమాత్రమే (Human flesh is clay) అని తలంచి లోలోన విరాగమును బొందెను. అప్పటినుండియు నాతడు పైకి వ్యవహారార్థము రాజవిధులను నిర్వర్తించుచున్నను లోలోన ప్రపంచముయొక్క వాస్తవ స్వరూపమును గుర్తెఱుగుటచే పరమవిరక్తి గలవాడై, నిర్లేపుడై మెలఁగుచు నిరతిశయశాంతి బొందగల్గెను.

కిం యానేన ధనేన వాజి కరిభిః ప్రాప్తేన రాజ్యేన కిం
కిం వా పుత్ర కలత్ర మిత్ర పశుభిర్దేహేన గేహేన కిం
జ్ఞాత్వైతత్క్షణభంగురం సపది హి త్యాజ్యం మనో దూరతః
స్వాత్మార్థం గురువాక్యతో భజ మనః శ్రీపార్వతీవల్లభమ్.

'ఓ, మనస్సా! గొప్పగొప్ప వాహనములు, ధనములు, అశ్వములు, గజములు నీకు సంప్రాప్తించినప్పటికిని వానివలన నీకు దుఃఖరాహిత్యము కలుగునా? లేక రాజ్యములు లభించినప్పటికిని నీకు పరమశాంతి చేకూరునా? లేక పుత్రమిత్రకళత్రాదులవలనగాని, గృహారామక్షేత్రాదులవలనగాని ఆత్యంతిక సుఖము లభించునా? జన్మరాహిత్యము సిద్ధించునా? మృత్యువును అవి తప్పించగలవా? లేవు. కాబట్టి ఇవియన్నియు క్షణభంగురములని తత్క్షణమే తెలిసికొని, వానియెడల ఆశవదలి ఆత్మోన్నతి నిమిత్తము సద్గురువు నాశ్రయించి, ఆతడు బోధించురీతి పార్వతీనాథుని అనవరతము భజింపుము' అని ఒక మహనీయుడు తన మనంబును సంబోధించిన ప్రకారము సాధకుడు దృశ్యవస్తువుల అస్థిరత్వమును మరల మరల జ్ఞాపకము చేసికొనుచు నుండవలెను. దానిచే భోగాశ శమించును, తృష్ణ సన్నగిల్లును. క్రోధము పలాయనమైపోవును. కామమంతరించును. తత్ఫలితముగ, జీవుని వేధించుచుండు రజోగుణరూప పిశాచము తొలగిపోగలదు.

ఈ ప్రకారముగ సాధకుడు మున్ముందు తమోగుణమును ఆ పిదప రజోగుణమును పోగొట్టుకొని మెల్లగా సత్త్వగుణములోనికి అడుగు పెట్టవలెను. సత్త్వగుణము నాశ్రయించువాని చరిత్ర ఉదాత్తముగ నుండును. అతడు పుణ్యకార్యములను

దైవకార్యములను విరివిగ ఆచరించుచుండును. రాక్షసత్రయములో విభీషణుడు సత్త్వగుణమునకు దృష్టాంతము.

సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే (14-11)

అని భగవానుడు సెలవిచ్చినట్లు సత్త్వగుణ మభివృద్ధినొందునపుడు అతని సర్వేంద్రియములగుండా జ్ఞానరూపప్రకాశము వెల్లివిరియుచుండును.మఱియు అట్టి సత్త్వాభివృద్ధి సమయమున దేహవియోగము జరిగినచో మనుజుడు ఊర్ధ్వలోకములను, ఊర్ధ్వగతినిమాత్రమే పొందునుగాని అధోలోకములను, అధోగతినికాదు. మోక్షమునకు ఈ గుణము అతిసమీపముగ నుండునుగావున ప్రతివారును ఇద్దాని నాశ్రయించి చిత్తమును నిర్మలమొనర్చుకొని ఆపిదప గుణాతీతస్థితియను ఇంకొక మెట్టు పైకిపోవలసియుండునేకాని అమాంతముగ ఒకే పర్యాయము ఆ నిర్గుణస్థితిని ఎవరును పొందజాలరు. మఱికొందఱు అట్టి గుణాతీతస్థితిని పొందినప్పటికిని లోకసంగ్రహార్థము ఒకింత సత్త్వగుణమును ఆశ్రయించియే యుందురు. ఏలయనగా అతీంద్రియ స్థితిలో లోకవ్యవహారము సాధ్యపడదు. సత్త్వగుణము దీపముపై అమర్చిన తెల్లగ్లాసువంటిది. అదియున్నను ప్రకాశమునకు ఏమంత చెరుపు కలుగదు. అతీతమగు నిర్గుణస్థితిదృష్ట్యా ఈసత్త్వగుణమున్ను (దృశ్యమం దంతర్గతమగుటచే, ప్రకృతిజనితమగుటచే) ఒక తరహా బంధమని చెప్పబడినదే కాని వాస్తవముగ దీనివలన గొప్ప ప్రమాద మేమియును లేదు. ప్రతివారు దీనికడకువచ్చుటకు తప్పక ప్రయత్నించి, దీనియందు నిలుకడబొంది ఆరితేరి, ఆపిదప క్రమముగ దీనినికూడ దాటి ప్రకృతిరహితపరమాత్మస్థితిని పట్టుకొనవలెను. అవియే గుణా

తీతస్థితి. తమోగుణ, రజోగుణములు కలవారు ఒకే పర్యాయము ఆ నిర్గుణ, తురీయాత్మపదమును పొందజాలరు. కనుక మధ్యలో ఈ సత్త్వగుణమును ఒకమెట్టుపై కాలుమోపి, తదుపరి మోక్షసౌధాగ్రము నధిరోహించవలెను. తెలుపుగ్లాసు అయినప్పటికిని కేవల దీపమునకు అదియు ఒకానొక ఆవరణయే కనుక మహాత్ములు పూర్ణస్థితిని బడయుటకు దానినికూడ అభ్యాసవశమున, నిరంతరధ్యానముద్వారా దాటివేయుదురు. దాటుటయనగా ఆసత్త్వగుణమును బలాత్కారముగ తొలగించుటకాదు. ఎప్పుడు మనస్సు అతినిర్మలమై ధ్యానకాలమున గాని, విచారణయందుగాని లేక భక్తితన్మయత్వస్థితియందుగాని అధిష్ఠానమగు ధ్యేయాకారమందు, సాక్షి పరమాత్మయందు ఉప్పుకల్లు సముద్రమునందువలె విలీనమగునో అపుడిక మనస్సనునదియే ప్రత్యేకముగ లేనందున తదంతర్గతమగు సత్త్వగుణమున్ను లేనిదేయగును. అత్తరి యా సత్త్వగుణము దానియంతట నదియే సెలవు తీసికొనును. ఈతడు పంపివేయవలసినపనిలేదు. అయితే వ్యుత్థానదశయందు లోకవ్యవహారార్థము ఆ సత్త్వగుణమును మహనీయులు ఉపయోగించుకొనుచునేయుందురు. వారు ప్రకృతిని దాటినవారుకనుక నిర్లేపులై అసంగులై యుండుటంబట్టి ప్రకృతియొక్క శుద్ధాంశమును లోకోపకారము కొఱకు కొద్దికాల మాశ్రయించినను దాని వలన వారికి కలుగు అపకార మేమియు నుండదు. పైగా లోకులకు దాని నిమిత్తముగ గొప్ప ప్రయోజనమే కలుగగలదు.

ఈ ప్రకారముగ తమోగుణ, రజోగుణ, సత్త్వగుణములను గుఱించి సంక్షేపముగ మనమిపుడు తెలిసికొంటిమి.

వీనిలో ఒక్కొక్క గుణమును దాటుచు ముందునకు సాగి పోవలెను. జీవిత మెల్లప్పుడును ప్రగతిశీలమైయే యుండవలెను. కాని స్తబ్ధముగ నుండరాదు.

A rolling stone gathers no moss.

'ద్రొల్లుచుండు రాతికి పాచిపట్టదు' అను సామెత ననుసరించి నిరంతరసాధనచేయువానికి అజ్ఞానమాలిన్యము అంటుకొనదు. జీవిత మొక పరిశోధనశాల (Laboratory or research institute). ఆత్మవికాసమునకు చేయదగిన సాధనలన్నింటిని ఇచట చేయవలెను. మనస్సునకు మెరుగు పెట్టవలెను. ఇంత వరకు ఎన్నియో జన్మలు గడచినవియనియు, ఇప్పుడు జాగ్రత వహించనిచో మున్ముందు ఇంకను ఎన్నియోగర్భనరకములను పొందవలసి యుండుననియు మనుజులు జ్ఞప్తియందుంచు కొందురుగాక! కావున వివేకవంతుడు ప్రయత్నపూర్వకముగ ఈ దీర్ఘసంసారయాత్రను ఈజన్మతో అంతమొందించవలెను. అట్లు అంతమొందించుటకు వలసిన శక్తిసామర్థ్యములను ధైర్యస్థైర్యములను విజ్ఞానమును ప్రసాదించవలసినదిగా సర్వే శ్వరుని ప్రార్థించవలెను. ఏలయనగా స్వప్రయత్నముతో పాటు భగవత్కటాక్షమునుగూడ జోడించవలెను. అపుడు సాధన లన్నియు నిరాటంకముగ జరిగిపోవ ఈ జన్మయే అంతిమజన్మ కాగలదు. ఇవ్విషయమై ఒక భక్తుడు భగవంతుని యెంత చమత్కారముగ ప్రార్థించెనో చూడుడు!

కర్మాఖ్యః సూత్రధారః బహువిధజననీ గర్భ నేపథ్యమధ్యాత్
విస్ఫార్యాశేష వేషైః శివతవపురతో నైకధావర్తయన్మామ్
హన్త్రశాన్తోఽసి నృత్తాదుపరతిమధునా యాహిమూఢేతి మహ్యామ్
వాజ్మాత్రం పారితోషం దిశసి ఖలు విభో తావతా స్యాం కృతార్థః

'ఓ పరమశివా! కర్మయను సూత్రధారి ఇంతవఱకు ఎందఱో తల్లులయొక్క గర్భమను తెరవెనుకనుండి నన్ను బయటకుపంపి లెక్కలేనన్ని వేషములు వేయింపించినీముందు నాట్యమాడించినది. ఇంత కష్టపడినందులకు నా కేదైన నీవు బహుమాన మివ్వవలెను గదా! అయితే వస్తురూపముగ గాని, నగదురూపముగగాని - నాకు పురస్కారము అక్కర లేదు. 'ఓరీమూఢా! ఇంతకాలము ఊపిరితిరగకుండ నాట్యము చేసినావు. ఇక చాలు. విశ్రాంతి తీసికొనుము' అని నీ నోటి గుండా ఒక్కవాక్యము వచ్చిన చాలును. అట్టి వాఙ్మాత్ర పారితోషికమే నాకు పదివేలు!' అని యాభక్తుడు సర్వేశ్వరుని వేడుకొనెను. నిజముగా ప్రతివారును వేడుకొనవలసినది ఇదియే. అనగా 'జన్మరాహిత్యమును కలుగజేయుము మహా ప్రభో!' అని ప్రార్థించవలెను. నిష్కల్మషమై అవ్యభిచారమై అనన్యమైనట్టి భక్తితో భగవంతుని ప్రార్థించువారు. సేవించు వారు ఆతని కరుణకు తప్పక పాత్రులు కాగలరు. అట్టివారు చేయు సాధనలయందు దైవసహాయము (Divine help) మిక్కుటముగ లభింప అచిరకాలములోనే వారు పూర్ణాద్వైతస్థితి నధిరోహించగలరు. ఇవ్విషయమై శ్రీ కృష్ణుని వాక్యముల నాలకింపుడు -

మాం చయోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే
సగుణాన్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే. (14-26)

'ఎవడు నిర్మల, అచంచలభక్తితో నన్ను సేవించునో అట్టి వాడు ఈసత్త్వరజస్తమోగుణములు మూడింటిని దాటివైచి బ్రహ్మసాక్షాత్కారమును బడయుచున్నాడు.' అఖండముగు

జ్ఞానోపదేశమును ఈ అధ్యాయమున చేసిచేసి తుట్టతుదకు ఎటువంటి భక్తిని భగవానుడు ప్రతిపాదించియున్నాడో చూడుడు! దీనినిబట్టి భక్తియొక్క సహాయముచేతనే జ్ఞానము పరిపక్వము కాగలదని స్పష్టమగుచున్నది.

ఈప్రకారముగ సర్వేశ్వరుని యనుగ్రహమును సంపాదించుటకువలసిన భక్తిభావములను హృదయసీమయందు భద్రపఱచుకొని పురుషప్రయత్నముద్వారా ఒక్కొక్కగుణమును దాటి ముందునకు సాగిపోయి క్రమముగ గుణాతీతస్థితిని చేరుకొనవలెను. అట్టి గుణాతీతస్థితి యెట్టిదో, గుణాతీతు డెట్లు వ్యవహరించునో తెలిసికొనవలెనని అర్జునునకు కుతూహలము జనించి ఆవిషయమై ఈ అధ్యాయాంతమున శ్రీకృష్ణమూర్తిని ప్రశ్నింపగా నతడు సంక్షేపముగ సమాధాన మొసంగెను. గుణాతీతుడు ఈ ప్రపంచమున సమస్త వ్యవహారములందును, పర్వతముమాడ్కి అచంచలుడై యుండును. ఏదైన పొందినచో సంతోషముగాని, పోయినచో దుఃఖమునుగాని కలిగియుండడు. మానావమానములందును, శత్రుమిత్రులందును, నిందాస్తుతులందును. సుఖదుఃఖములందును సమరూపుడై యుండును. దేనివలనను చలింపడు. పర్వతమును పిల్లవాయువులు కదలింపలేనట్లును, బాణములు ఛేదింపజాలనట్లును, లోకస్థితు లెవ్వియును గుణాతీతుని చంచల మొనర్పజాలవు. మానవుని ఆచరణయే ఆతని మనఃస్థితిని నిర్ణయించి చెప్పగలదు. కాబట్టి యెవ డెట్టి నిశ్చల నిర్మలస్థితి ఆచరణయందు గలిగియుండునో. యెవడు ప్రపంచమున విహరించుచున్నను వికారములకు లోనుగాకయుండునో ఆతడే ఉన్నతస్థితినిబడసె

నని చెప్పవచ్చును. పరిస్థితుల ప్రాబల్యమునకు తారుమారై పోవువాడు, తన మనస్థితిని గోల్పోవువాడు గుణాతీతుడెన్నటి కిని కాజాలడు.

వికారహేతౌ సతి విక్రియన్తే
యేషాం న చేతాంసి త ఏవ ధీరాః

'వికారమును కలుగజేయు వస్తువులు సమీపమున నున్నప్పటి కిని ఎవరి చిత్తములందు వికార మిసుమంతైన జనింపక యుండునో వారే ధీరులనదగినవారు' అని కాళిదాసు సెలవిచ్చి యున్నాడు. ఎండుటాకు, రాతిగుండు-రెండును గాలిలేనపుడు నిశ్చలముగ నుండును. పెనుగాలి వీచినచో ఆకు ఆమడం దూరము ఎగిరిపోవును. రాయి అట్లే స్థిరముగ నుండును. గాలి వీచినపుడు ఆ రెండింటియొక్క నిజసత్త బయటపడును. ఆప్రకారమే సంసారక్షేత్రమున పరిస్థితులు సవ్యముగా నున్నపుడు, అందఱును పెద్దమనుష్యులుగనే యుందురు. పరిస్థితులు వికృతములైనపుడు, ఆపదలు సంభవించినపుడు, అనుకోనని ఘటనలు జరిగినపుడు సామాన్యమానవుని చిత్తము తల క్రిందులై పోవును. జ్ఞాని 'ఈ జగన్నాటకమంతయు బూటకమే' అని యెఱిఁగినవాడగుటచే వానిచే విచలితుడు కాక, వాటినన్నింటిని స్వప్నప్రాయముగ వీక్షించుచు స్వకీయ సమ (ఆత్మ) స్థితియందే వర్తించుచుండును. కనుకనే ఒకడు జ్ఞానియో, అజ్ఞానియో, దేవుడో, దయ్యమో, గుణయుక్తుడో, నిర్గుణుడో, అతని చేష్టలనుబట్టి, వ్యవహారమునుబట్టి, ఆచరణనుబట్టి తృటిలో తేల్చుకొనవచ్చును. కనుకనే భగవానుడు గుణాతీతుని కొన్ని లక్షణములను జెప్పి జనులను భ్రమనుండి

తప్పించివై చెను. వేషధారు లధికమైన ఈ రోజులలో వాని యావశ్యకత ఇంకను అధికమైయున్నది. కాబట్టి అట్టి మహత్తర ధర్మములను, సమస్థితిని బాగుగ నభ్యసించుచు గుణములన్నిటినిదాటి నిర్గుణపరమాత్మస్థితిని బడయువఱకు తమ ప్రయత్నమును ఎవరును విరమించరాదు. గమ్యస్థానము చేరువఱకు వెనుకచూపు ఉండరాదు. 'Nil Desperandem' (Despair not) - అధైర్యపడవద్దు నిరుత్సాహమునకు తావీయరాదు.

'నాయమాత్మా బలహీనేన లభ్యః'

'ఈ ఆత్మ దుర్బలునిచే పొందబడదు'-అని ముండకోపనిషత్తు ఘోషించుచున్నది.

'Stand and die in your own strength. If there is any sin in this world it is weakness, avoid all weakness, for weakness is sin, weakness is death'

'బ్రతికినా, చచ్చినా నీబలముపై ఆధారపడి యుండుము. ప్రపంచములో దుర్బలత్వమే పాపము. దుర్బలత్వమేమరణము. కావున దానినెట్లైనను పోగొట్టుకొనుము' అని వివేకానందులు హెచ్చరిక చేసియున్నారు. వాస్తవముగ మనుజుడు ప్రకృతికి దాసుడుకాడు. ప్రకృతియొక్క రథచక్రముల క్రింద నలిగిపోవు బలిపశువు కాదతడు. తద్రథముపై నాసీనుడై యుండాగా ప్రకృతిని శాసించువాడే యతడు. ఈ ప్రపంచకార్యములన్నిటిని దేహకార్యములన్నిటిని ప్రకృతి జరుపుచున్నది. సత్త్వాదిగుణ

ములు జరుపుచున్నవి. తాను సాక్షిగనున్నాడు. 'గుణముల'కు పరమై వెలయుచున్నాడు.

గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి. (14-19)

'గుణములే కర్తగాని, తాను కాదు. తాను గుణములకు పరుడై యున్నాడు'-అను ఈ సత్యము నెవడెఱుంగునో అట్టివాడు పరమాత్మభావమును పొందిపోవుచున్నాడు.' అని గీతాచార్యుడు పలికియున్నాడు. కావున నిరంతరాభ్యాసము చేతను, సద్విచారణాప్రాభవము చేతను తన్ను గుణములనుండి వేఱుచేసికొని, (మనస్సాక్షియగు) ఆత్మయందుస్థితిగలవాడై జన్మసాఫల్యము నొందవలయును. ఇదియే జీవుని పరమ కర్తవ్యము. క్రమముగ ఒక్కొక్క గుణమును దాటిదాటి తుదకు నిర్గుణ ప్రత్యగాత్మయందు స్థితిబొందవలెను.

గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్
జన్మమృత్యు జరాదుఃఖైర్విముక్తోఽమృతమశ్నుతే. (14-20)

'ఉపాధిజనితములగు ఈసత్త్వరజస్తమోగుణములు మూడింటిని ఎవడు దాటునో అట్టివాడు జననమరణవార్ధక్యాది దుఃఖములనుండి విడివడి అమృతరూపమగు కైవల్యపదవి నధిష్ఠించుచున్నాడు'-అని భగవద్వచనము. ఈ అధ్యాయమున కిది ఫలశ్రుతి. ఇంతకుమించిన ఫల మిక నేమి కావలెను? ఇట్టి మహిమాతిశయముతో గూడిన అమృతత్వరూప ఫలము ప్రపంచములోని ఏ వస్తువు చేగాని, ఏ పదవి చేగాని, ఏ విద్య చేగాని, మనుజుడు పొందగలడా? లేదు. వానిచే పొందబడునవియన్నియు మృత్యువున కధీనములు. కాలగ్రసితములు, ఎంతగొప్పవస్తు

నైనను మరణమునకు, వినాశమునకు లోబడినది యగుచో దానిలో చేవలేదనియే అర్థము. మరణరహితమగు ఆత్మయొక్క దానియందే చేవకలదు; సత్తువకలదు. కావున అద్దాని యన్వేషణమందే జీవుడు దత్తచిత్తుడు కావలెను. అద్దాని సాక్షాత్కారమునందే తన పంచప్రాణములను వినియోగించవలెను.

ఇహచేద వేదీదథ సత్యమస్తి
నచేదిహావేదీన్మహతీ వినష్టిః. (కేనోపనిషత్తు)

"పరమాత్మను ఈజన్మయందే తెలిసికొనెనా, ధన్యుడు. అట్లు తెలిసికొనకపోయెనా గొప్పవినాశమతనికి కాచుకొనియున్నది" అని యుపనిషద్వాక్యము. కాబట్టి పరాకు చిత్తగించరాదు. పెద్దలుచేయు హెచ్చరికలను పెడచెవిని పెట్టరాదు. పరిహాసమున కిచట తావులేదు (Life is serious) కావున పెన్నిధివంటి ఈ మానవజన్మను వేళాకోళముగ ఖర్చుపెట్టివేయక గంభీరాచరణముగల్గి, భగవద్వాక్యములను శిరసావహించి అనవరత కృషిచే నిరవధికాత్మానందమును కైవసము చేసికొందురుగాక!

ఓమ్ తత్ సత్.

ఓమ్

# 15-వ అధ్యాయము

# పురుషోత్తమప్రాప్తియోగము

ప్రగతిశీలత్వము గంభీరమానవుని స్వభావము. ఎల్లపుడు ఒకేస్థితియందుండుట కాతడు ఒప్పుకొనడు. దినదినము ఒక్కొక్క మెట్టు పైకిపోవుచు ఉన్నత శిఖరముల నధిష్ఠించవలెనని సంబరపడుచుండును. తదనుకూలముగ వ్యవహరించునుగూడ. కొందఱు భౌతిక విజ్ఞాన (Science) రంగమున, కొందఱు సాహిత్యరంగమున, కొందఱు రాజకీయ క్షేత్రమున తమ విజ్ఞతను అభివృద్ధిపఱచుకొనుచు ముందునకు పోవుచుందురు. కాని అవి చాలవు. నైతిక, ఆధ్యాత్మిక రంగములందుగూడ పురోభివృద్ధిని సాధింపవలెను. 'డార్విన్' అను పాశ్చాత్య వైజ్ఞానికుని పరిణామ వాదము (Theory of evolution) ననుసరించి కోతి క్రమవికాసమునొంది మానవుడుగా మారినదని చెప్పుదురు. కోతి మానవుడగుట అట్లుంచి, అసలు ప్రాణి కోతియగుటకు ఎన్నికోట్ల జన్మలనెత్తియుండునో యోచించుకొనవలయును. ఈప్రకారముగ మానవత్వమును బడయుటకు జీవుడు ఎంతటి తపస్సు నాచరించెనో, ఎన్ని యోనులందు తిరుగాడెనో, ఎన్ని మజిలీలు దాటెనో గ్రహించుకొనవలెను. ఇదియంతయు అతి దీర్ఘకాలమున జరిగిన పరిణామము. కాని ఈ పరిణామము, ఈక్రమవికాసము ఇంతటితో ఆగరాదు. మానవత్వోపలబ్ధి మాత్రముతో వికాసమునకు 'బ్రేక్'

(నిలుపుదల) పడరాదు. వానరుడు నరుడగుట మంచిదేకాని, నరుడు నరుడుగనే యుండుట ఎల్లప్పుడు వాంఛనీయముకాదు. నరుడు నారాయణుడు కావలెను. అది అసలు సంగతి. పురుషుడు పురుషోత్తముడు కావలెను. అది చేయవలసినపని. జీవుని ప్రయత్న మంతటితో ఆగిపోవును. ఎపుడు మానవుడు మాధవుడగునో, ఇక ఆతనికి చేయవలసిన కార్యమేమున్నది ? సమస్తసాధనలు అచ్చోట అంతమైపోవును. దైవత్వమును బడయుటతో జీవుని క్రమవికాసము పరాకాష్ఠనందుకొనును. అదియే చరమస్థితి. అదియే కైవల్యము. అదియే పురుషోత్తమత్వము. అట్టి పురుషోత్తముని అనుపమదివ్యస్థితిని పురుషు డెట్లు పొందగలడో నిరూపించు అధ్యాయమగుటచే ఈ పదు నైదవ అధ్యాయమునకు పురుషోత్తమ ప్రాప్తియోగమను పేరువచ్చినది. నేడు విచారించవలసిన ఘట్ట మిదియే.

గీతలోని చిన్న అధ్యాయములు రెండిటిలో నిదియొకటి, విశేషముగ భోజనకాలమున దీనిని జనులు పఠించుచుందురు. అందులకు కారణమేమియో తదుపరి వివరించి చెప్పెదను. ప్రస్తుత మీయధ్యాయమందలి ప్రధానవిషయములను సూత్ర ప్రాయముగ పరిశీలించెదము కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియ ములు, పంచప్రాణములు, మనోబుద్ధ్యాదులు-వీని యన్నింటి యొక్క సంఘాతమును అష్టపురీకమందురు. అట్టి పురీకమందు నివసించువాడు కనుక పురుషుడు అని జీవునకు పేరుగలిగినది. అట్టి పురుషులలోకెల్ల అనగా సమస్త ప్రాణికోట్లకంటె సర్వో త్తమస్థితి నధిష్ఠించినవాడు కనుక భగవంతునకు పురుషోత్తము డను నామధేయము ఏర్పడినది. ఈప్రపంచమున క్షరపురుషుడు

అక్షరపురుషుడు, పురుషోత్తముడు అను ముగ్వురు కలరు. ఇట అక్షరపురుషు డనగా ఎనిమిదవ అధ్యాయమునందు తెలుపబడిన అక్షరపరబ్రహ్మమని యెవరును భ్రమ పడరాదు. ఈ రెండింటికిని ఆకాశపాతాళభేదము కలదు. జీవుని జీవత్వము మోక్షము పొందువరకును నశింపదు కావునను, చిదాభాసరూపప్రతిబింబము శరీరాదులు నశించినను నూతన దేహములను ధరించి చిరకాలము (ఆమోక్షము) వర్తించుచుండుటవలనను, ఈ ప్రకారముగ క్షణికములగు శరీరాదులతో పోల్చిన, దీర్ఘకాలము ఆయుర్దాయము కలిగి యుండుటవలనను జీవుని (చిదాభాసుని) అక్షర పురుషునిగ నిట వర్ణించి చెప్పిరి. క్షరపురుషు డనగా దేహాభిమాని. ఈ క్షరాక్షరములకు-అనగా దేహ చిదాభాసులకు అన్యముగ బింబరూపమగు శుద్ధచైతన్యముకలదు. అదియే పరబ్రహ్మము, దానినే పురుషోత్తముడని యిట పేర్కొనిరి. అతడే చరాచరములందు వ్యాపించి, బ్రహ్మాండము లన్నింటికిని ఆధారభూతుడై వెలయు అవ్యయపరమాత్మ. మొదటి యిరువురు పురుషులు ప్రకృతికి, మాయకు అధీనులు. మూడవవాడు ప్రకృతికి పరమైనవాడు. మాయాతీతుడు, కనుక నే-

ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః
యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః (15-17)

అని ఈ అధ్యాయమున తెలుపబడినది. అనగా స్థూల, సూక్ష్మ ప్రకృతులకంటె, దేహ మనశ్చిదాభాసులకంటె అన్యుడైనవాడు పరమాత్మయని భావము.

ఇంకను ఆ పరమాత్మ యెట్టివాడు? స్వప్రకాశస్వరూపుడు. ఈ సూర్యుడుకాని, ఈ చంద్రుడుకాని, ఈ అగ్నికాని ఆతనిని ప్రకాశింపజేయజాలవు. మఱియు అచ్చోటికి జనినవానికిక పునరావృత్తిలేదు. ఆ పరమాత్మను జేరినవారికి మరల సంసారచక్రపరిభ్రమణ మనునది ఏకాలమునను ఉండదు. ప్రపంచములో ఎచ్చోటికిజనినను, ఏలోకమున కేగినను మరల తిరిగి రావలసినదే. మరల పుట్టవలసినదే. కాని ఈ విలక్షణమైన స్థానమున కరిగినవాడు మరల తిరిగిరాడు. తిరిగి పుట్టడు. జన్మరాహిత్య రూపనిరతిశయానందకైవల్యపదవి నాతడలంకరించును. ఆ పరమాత్మ ఎక్కడో ఒకచోట ఉండువాడుకాదు. చరాచరములందు వ్యాపించి జీవులందఱియొక్క హృత్పద్మములందు విరాజిల్లువాడు (సర్వస్య చాహం హృదిసన్నివిష్టో) సూర్యుని తేజము, చంద్రుని తేజము, అగ్నియొక్క తేజము ఆతని వలననే కలుగుచున్నవి. ఇంతియేకాదు. ప్రకృతి (Nature) కంతకును ఆధారభూతుడు కనుక ప్రపంచమున ఏ కార్యము జరిగినను ఆ సద్వస్తురూప పరమాత్మయొక్క ప్రభావమువలననే జరుగుచున్నది. ఆతడే వానికి కారణభూతుడు. పుష్పములను వికసింపజేయునది ఎవరు? ఫలింపజేయునది ఎవరు? ఆ యా ఋతువులకు అనుగుణ్యమైన పరిణామములను ప్రకృతియందు కలుగుగజేయువారెవరు? కోట్లకొలది గ్రహములను నక్షత్రములను ఒక్క సెకండుకూడ వారలేకుండ బ్రహ్మాండ కుహరమున త్రిప్పువా డెవడు? క్షేత్రములయందు సస్యముల నభివృద్ధిజేసి, వాటిని పోషించి ఫలవంతముగ జేయునది యెవరు? 'నేనే' అని శ్రీకృష్ణపరమాత్మ గీతయందు ప్రత్యుత్తరమిచ్చు

చున్నాడు. సస్యములను ఫలింపజేసి ప్రాణులకందిచ్చుటతోనే అతనిపని పూర్తిఅయినదా? లేదు. జీవుడు భుజించు అన్నమునుకూడ పచన మొనర్చుచున్నాడు.

అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః
ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్. (15-14)

'నేను వైశ్వానరాగ్ని (జఠరాగ్ని) రూపమున ప్రాణుల శరీరముల నాశ్రయించి ప్రాణాపానాదివాయువులతోగూడి, జనులు భుజించు నాలుగురకములగు అన్నమును (భక్ష్యభోజ్యాదులను) పచన మొనర్చుచున్నాను' అని భగవానుడు కరుణతో సెలవిచ్చెను. ఆహా! ఆ దేవదేవునకు జీవరాసుల యెడల ఎంతటి అపారప్రేమ? ఆహారమునుగూర్చి ఈప్రకారముగ సర్వేశ్వరుడు వచించినపుడు ఇక నద్దాని విషయమై సాధకు లెంత జాగ్రత్త వహింపవలెనో ఒకింత యోచింపుడు. తానే జీవరాసుల కడుపులోనుండి స్వయముగపచనకార్యమును నెరవేర్చుచున్నాడని భగవానుడు పలికినపుడు, ఇక జీవుడు తాను భుజించు ఆహారము, సాత్త్వికముగను, మితముగను, భగవదర్పితముగను, న్యాయార్జితముగను నుండులాగున యత్నించుట సమంజసము. లేకున్న భగవానునకు అపచారము చేసినట్లే యగును.

మోక్షాన్వేషణ మొనర్చు పరమార్థసాధకుని ప్రయత్నములందు, ఆహారనియమము అతిముఖ్యస్థానమును ఆక్రమించుచున్నది కనుకనే శ్రీకృష్ణపరమాత్మ గీతయందు తలచిన చోటెల్లా ఆహారవిషయమై ముముక్షువు అతి జాగరూకుడై యుండులాగున హెచ్చరించుకొనుచు పోయెను. మనకు 'అహంబ్రహ్మాస్మి' కదా కావలసినది. ఆహార రభసయెందుకు?

అని కొందఱు ప్రశ్నించవచ్చును. కాని, చిన్న విషయములందు జాగ్రతలేనిచో పెద్దవిషయములు చేయిజారి పోగలవను సత్యమును వారు మఱచిపోవుచున్నారు. మోక్షము దేనివలన లభించుచున్నది? శ్రవణ మనన నిదిధ్యాసనములవలన; అవి దేని వలన కలుగుచున్నవి? బుద్ధిశక్తివలన; ఆ బుద్ధిశక్తి దేనివలన పరిపోషింపబడుచున్నది? ఆహారశక్తివలన (తస్మాదన్నమయం మనః). ఇవ్విధముగ ఆహారమే మోక్షమును నిర్ణయించు చున్నట్లు స్పష్టపడుచున్నది. కనుకనే ఉత్తమములగు సాధకులు ఆహారసంబంధమైన ఎన్నియో నియమనిష్ఠలు శీలించు చుందురు. కొందఱు అప్పుడప్పుడు ఉపవాసములు చేయు చుందురు. కొందఱు ఒక్కపొద్దు ఉందురు. మఱికొందఱు పప్పులో ఉప్పు మాని వేయుదురు. కొందఱు పాలలో చక్కెర వదలివేయుదురు. రుచికలిగిన వస్తువులను కొందఱు గయలో వదలిపెట్టుదురు.* చాతుర్మాస్య వ్రతము నాలుగు నెలలు కొన్నికొన్ని భోజ్యపదార్థములను వారికివారే నిషేధించు కొందురు. అట్లే కార్తీక మాసములో, మాఘమాసములో మఱికొన్ని పర్వదినములలో ఆహారసంయమము లెస్సగా శీలించుచుందురు. ఇదియంతయు దేనికి? స్వల్పమగు ఆహారము యెడల ఇంతరాద్ధాంత మెందులకు? మహాత్ములకు తెలియక కాదు ఈ నియమము లేర్పరచినది. వారామార్గమున నడచిరి కనుక సాధనలందు ఎక్కడెక్కడ ప్రమాదమున్నదో, ఎక్క

*గయలో వదలివేయువస్తువులను మరల జీవితమునం దెన్నడును భుజింపరు. ఇది యొక ఆచారము.

డెక్కడ పతనమునకు అవకాశమున్నదో స్వయముగ గుర్తుంచుకొని లోకుల నా విషయమై హెచ్చరించిరి.

ఇక్కాలమున సాధకలోకములో అక్కడక్కడ ఈ ఆహార నియమము ఉపేక్షింపబడుచుండుటచే ఆశించిన సత్ఫలితములు జనులకు కలుగకున్నవి. 'Fast and Pray' 'ఉపవసించి ధ్యానింపుము' అని బైబిలునందు ఒక వాక్యము కలదు. నేటి జనులు కొందఱు ఆ వాక్యములో కొన్ని మార్పు చేసి ఆచరణలోనికి దిగిరి. ఎట్లనిన 'Feast and Pray' - 'విందుకుడిచి ధ్యానింపుము' - అని దానిని మార్చుకొనిరి. 'ఉపవసింపుము' అను దాని అర్థము, కేవలము కడుపుమాడ్చు కొనుమని అర్థముకాదు. గీతలో చెప్పినట్లు యుక్తాహార విహారములను శీలించుటయే యగును. ఏమైనను, అధికాహారము పరమార్థక్షేత్రమున పూర్ణ నిషిద్ధత్వమును బొంది యున్నది. వైశ్వానరుడగు భగవంతునకు అది లేనిపోని బరువు పెట్టినట్లు, అనవసరశ్రమ కల్పించినట్లు అగును. గాలి మితముగా పీల్చుచున్నారు. బోలెడు గాలి వున్నదికదా యని ఎవరును గాలిని గబగబ పీల్చుటలేదు. నీళ్ళుమితముగా త్రాగు చున్నారు. బావినిండా నీళ్ళు ఉన్నవికదాయని ఎవరునుబిందెలు బిందెలు త్రాగుటలేదు. అట్టియెడ ఆహారమునుమాత్రము ఏల మితముతప్పి భుజింపవలెను? అని గాంధిమహాత్మ్ముడొకతూరి ప్రశ్నించెనట! కావున ముముక్షువులు అధ్యాత్మరంగమున కీలక స్థానము వహించియున్న ఈ ఆహార విషయమును చులకనగ త్రోసివేయక సంయమనతత్పరులై యుండవలెను.

అన్నం బ్రహ్మ భోక్తాచ బ్రహ్మ

అని ఉపనిషద్వాక్యము. తినబడు అన్నము, తినునట్టి వ్యక్తి ఇరువురును బ్రహ్మస్వరూపులే యని దాని యర్థము. ఈ సత్యమును గీత బాగుగ రుజువుచేసి చూపినది. ఎట్లనిన-'సస్యములలో దాగి వాటిని వృద్ధిపఱచుచు ధ్యానరూపముగ నేనున్నాను; ప్రాణుల దేహములందు జఠరాగ్నిగ వర్తించుచు భోక్తరూపముగ నేను వెలయుచున్నాను' అని శ్రీకృష్ణ పరమాత్మ ఆనతిచ్చెను. ఇవ్విధమున భోక్త, భోజనము రెండును భగవత్స్వరూపములేయని తెలినందున, భోక్తయగు తాను శుద్ధుడుగ నుండుటకును, భోజనము పవిత్రముగ నుండులాగునను జీవుడు ప్రయత్నించవలెను. ఆహారవిషయమైయిన్ని పరమరహస్యములను బోధించిన అధ్యాయమగుటచేతనే జను లిద్దానిని భోజనకాలమున పఠించుచుండుటకు కారణము. ఈ ఆచార మిప్పుడు అనేక ఆశ్రమములందు మఠములందు, గృహములందుగూడ నవలంబింపబడుచున్నది. విస్తరిలో వడ్డన ప్రారంభము కాకముందు ఈ అధ్యాయమును ప్రారంభించినచో, చిన్న అధ్యాయమగుటచే వడ్డన పూర్తియగుసరికి పఠనము పూర్తికాగలదు. అత్తఱి చేతిలో తీర్థమును గ్రహించి 'బ్రహ్మార్పణం బ్రహ్మహవిః...' (4-24) అను గీతాశ్లోకమును పఠించి తీర్థమును సేవించి తదుపరి బ్రహ్మభావనతో దైవబుద్ధితో భుజించినచో, ఆ యన్నము అమృతరూపముగ పరిణమించగలదు. భోజనకాలమున వాగుడు మాని వేయవలెను. లోకాభిరామాయణములు, కోర్టు వ్యవహారములు అచటికి తీసికొని రాగూడదు.

స్నానే చ భోజనే హోమే జపే మౌనం సమాశ్రయేత్.

"స్నానము చేయునపుడు, భుజించునప్పుడు, హోమ మాచరించునపుడు, జపము సల్పునప్పుడు మౌనమును తప్పక నవలంబించవలె'నని శాస్త్రమాదేశించుచున్నది. మౌనముతో, దైవభావనతో భుజించుట మొదటిపద్ధతి. ఇది ఉత్తమోత్తమము. గోవిందనామసంకీర్తన బిగ్గరగా చేయుచు భుజించుట రెండవపద్ధతి. ఇది ఉత్తమము. వ్యాపారకబుర్లు, 'ఎలెక్షన్'కబుర్లు, మార్కెట్‌కబుర్లు, కోర్టుసమాచారములు చెప్పుకొనుచు భుజించుట మూడవ పద్ధతి. ఇది అధమము. కాబట్టి దేహమనంబుల పరిపోషణ కాధారభూతమై, అతిప్రధానమైనట్టి ఈ యాహారమును గ్రహించుపద్ధతిని శాస్త్రములవలన, పెద్దలవలన తెలిసికొని ముముక్షువులు తమ యధ్యాత్మమార్గమును సుగమ మొనర్చుకొందురుగాక! అందులకుగాను, గృహస్థులు మొదలైనవారు అపుడపుడు తీరిక జూచుకొని సుశిక్షణ (discipline) గలిగిన మంచి మంచి ఆశ్రమములకు బోయి కొన్నిరోజులచట ఉండి, చక్కని పద్ధతులను, అనుష్ఠానములను అనుభవజ్ఞులగు మహనీయులయొద్ద గ్రహించి తిరిగి యిండ్లకుబోవుట ఉత్తమము.

మోక్షప్రాప్తిని కాంక్షించు మనుజుడు మూడునియమములను అత్యావశ్యకముగ పాలించవలెను (1) ఆహారనియమము (2) నివాసనియమము (3) అనుష్ఠాననియమము. వీనిలో ఆహారనియమమునుగూర్చి యింతదనుక వివరించి చెప్పబడినది. శరీర మనంబులయొక్క రూపురేఖలను దిద్దునట్టి ఆహారవిషయమై సాధకుడు ఎంత జాగ్రత వహించవలెనో, నివాసమునుగూర్చియు అంత పట్టుదల జూపవలెను. తన

యనుష్ఠానమునకు భంగకరమైనట్టి స్థానము నాశ్రయించరాదు. నాస్తికులమధ్య నివసింపరాదు. ఏలయనగా ఎంతయో కష్టపడి సంపాదించుకొనిన ఒకింతవైరాగ్యము, భక్తి యను చిన్న మొలకను విరుద్ధశక్తులను మేకలు మేసిపోవును. ముఖ్యముగ పాశ్చాత్య నాగరికతా వ్యామోహమున పడిపోవుచు, భోగ విలాసములవైపు ఉరుకులిడుచున్న జనులతో నిండియున్న పల్లెలు, పట్టణములు గల ఇక్కాలమున దైవమార్గావలంబి తన జాగ్రతలో తానుండవలెను. కనుకనే శ్రీకృష్ణపరమాత్మ గీతయందు 'వివిక్తసేవీ', 'అరతిర్జనసంసది'-ఇత్యాది పదముల ద్వారా నివాసవిషయమై సాధకులను హెచ్చరించుచుపోయెను. ఆహార నివాసములవలె, అనుష్ఠానమందును, ప్రత్యేకజాగ్రత చూపవలెను. ఎన్ని ఆటంకములువచ్చినను ప్రతిదినము కొద్ది సేపైనను దైవనిష్ఠను శీలించవలెను. జీవితములో అదియొక నిత్యనియమముగ మారిపోవలెను. స్థూల దేహమునకు ఆహార మిచ్చుటయైనను ఎప్పుడైన మఱవవచ్చునుగాని సూక్ష్మదేహమునకు భగవచ్చింతన వొసంగుట మాత్రము మఱువరాదు. ఈ ప్రకారముగ పెక్కు నియమనిష్ఠలద్వారా ప్రకృతిని వశపఱచుకొనవలెను. మనస్సును లొంగదీయవలెను. వెయ్యేల, సంసారవృక్షమును ఛేదించివేయవలెను.

సామాన్యముగ ఒక వృక్షము నూఱు సంవత్సరముల కాలము జీవించినచో దానివ్రేళ్లు భూమియందు ఎంతదూరమో వ్యాపించి మహాదృఢత్వమును బొందియుండును. దీనికే యిట్లుండ ఒకానొక వృక్షము కోట్లకొలది వత్సరములనుండి ఈప్రపంచమున నిల్చదొక్కుకొనియున్నచో దానిమాట ఇక

చెప్పవలయునా. అదియే సంసారవృక్షము. ఎన్నిజన్మల నుండియో అది బాగుగ వేళ్లుపాతుకొని యున్నది. దీనిని గూర్చియే ఈ అధ్యాయప్రారంభమున గీతాచార్యుడు ప్రస్తావించెను. ఈ సంసారము నొక బలమైన అశ్వత్థవృక్షము (రావిచెట్టు)గ పోల్చి చెప్పెను. అయితే అది అన్ని చెట్లవలె వేళ్లు క్రింద, కొమ్మలు పైన గలది కాదు. వేళ్లుపైన,కొమ్మలు క్రిందకలది. అనగా సామాన్యవృక్షము 'శీర్షాసనము' వేసినచో ఎట్లుండునో ఈ సంసారవృక్షమును అట్లుండునని భావము. అంతయు తలక్రిందులు వ్యవహారమన్నమాట. నిజముగా జీవు డాచరించునది. తలక్రిందు చేష్టలు కాక మఱియేమి ?

అధర్మం ధర్మమితి యా మన్యతే తమసాఽఽవృతా. (18-32)

అనునట్లు అధర్మమును ధర్మముగను, ధర్మమును అధర్మముగను, ఉన్నదానిని లేనిదిగను, లేనిదానిని ఉన్నదిగను అతడు భావించుచున్నాడు. ఉన్న దేవుని లేడనుచున్నాడు. లేని ప్రపంచమును ఉన్నదనుచున్నాడు. క్షణికమగు ఈ శరీరమును శాశ్వతమని యెంచుచున్నాడు. శాశ్వతమగు ఆత్మను తృణీకరించివైచుచున్నాడు. అపవిత్రమై, రక్తమాంస మలమూత్రాదులతో నిండియున్న దేహమునందు సౌందర్యమును వీక్షించుచున్నాడు. నిత్యశుద్ధమై, అకళంకమైనట్టి పరమాత్మయొక్క ఊసే పట్టించుకొనకయున్నాడు. లోకములోని ఈ విపరీతత్వమును గమనించి శ్రీకృష్ణమూర్తి సంసారవృక్షమును 'ఊర్ధ్వమూల మధశ్శాఖ'గ - అనగా తలక్రిందులుగ వర్ణించెను. అనేక జన్మార్జితవాసనలచే జీవునిచిత్తము ఘనీభూతమై యుండుటవలన 'సువిరూఢమూల' మని ఈ వృక్షము నిట

పేర్కొనుట తటస్థించినది. ఇంత బలమైన పాదపమును ఉచ్ఛిన్న మొనర్చుట సామాన్యమైన పనికాదు. బ్రహ్మాండమైన వట వృక్షమును ఛేదించుటకు మంచి 'టెంపర్'తో గూడిన ఉక్కు గొడ్డలి ఎట్లవసరమో, ఈ దుఃఖరూప సంసార వృక్షమును సమూలముగ ఛిన్న మొనర్చుటకు 'అసంగము' (non-attachment) అను మహాశస్త్రము అవసరమై యున్నది.

అశ్వత్థమేనం సువిరూఢమూలం
అసంగశస్త్రేణ దృఢేన ఛిత్వా.

అను వాక్యముల తాత్పర్యమిదియే. కావున అట్టి 'అసంగము'ను ఆయుధమును జీవు డెట్లైనను సంపాదించుకొనవలెను. లేనిచో ప్రతిబంధము తొలగదు ? పరమాత్మదర్శనము కానేరదు. ఎట్లనిన-ఒకానొక నగరమధ్యమున ఒకరోడ్డు కలదు. దాని కిరువైపుల భవనములు కలవు. ఆరోడ్డు ప్రక్కనే ఒక పెద్దమఱ్ఱి చెట్టుకలదు. అది యొకనాడు పెనుగాలికి విరిగిపడెను. వేళ్ళతో గూడ లేపుకొని తలక్రిందుగ దారి కడ్డముగ పడిపోవుటవలన దానిచే రోడ్డు మూసికొనిపోయెను. ఇక పాంథు లామార్గమున నెట్లుపోగలరు ? బస్సులు, బండ్లు ఎట్లు పోగలవు ? గొడ్డళ్ళు ఇతర సాధనములు తెచ్చి ఎట్లైనను దానిని ఛేదించివేసిననే తప్ప బాటసారి ముందుకు అడుగుపెట్టలేడు కదా !

అట్లే పరమాత్మపదమునకు పోవుదారిలో ఈ సంసార వృక్షము అడ్డుగ పడియుండి అవరోధములను కల్పించు చున్నది. అధముడగు మానవుడు దానినిజూచి భీతిజెంది వెను కకు తిరిగి పారిపోవుచున్నాడు. మధ్యముడగు మనుజుడు దాని దగ్గఱకువచ్చి అద్దానిని తొలగించుటకు ప్రయత్నించి విఫలుడై

వెనుకకు మరలుచున్నాడు. ఉత్తముడగు మానవుడు గొప్ప ఆయుధములను సమకూర్చుకొని అహర్నిశములు పరిశ్రమించి దాని అంతుజూడదలంచి ఎట్టైనను దానిని భిన్నభిన్న మొనర్చి ఆవలికి బోవుచున్నాడు. వీరిముప్వురిలో ఉత్తమునివలె మెలగు డని గీతాచార్యుడు ప్రబోధించెను. "తతః పదం తత్పరి మార్గితవ్యం" - ఈ అజ్ఞానరూప సంసార మహావృక్షమును అసంగశస్త్రముచే నఱికివైచి ఆవలనున్న పరమాత్మను వెతకికొనుడు అని యాదేశించెను. 'తమసస్తుపారే' - అను వేదవాక్యము ననుసరించి తమస్సునకు (అజ్ఞానమునకు) ఆవల నున్నట్టి చిత్స్వరూపము ఆ తమస్సును ఛేదించనిచో దృగ్గోచరముకాదుకదా!

కావున సాధన నొనర్పవలయును. ఈతకొట్టువాడు నీటిని వెనుకకుద్రోసివైచిననేకాని తాను ముందునకు పోనట్లు హృదయమందలి దుర్వాసనలను, దుష్టసంకల్పములను, దుర్వృత్తులను వెనుకకు నెట్టివేసినగాని సాధకుడు ముందునకు సాగిపోలేడు. బహుకాలము పారతంత్ర్యశృంఖములచే బంధించివైచి భారతీయులను బానిసలుగా చేసివైచిన ఆంగ్లే యులను 'Quit India' - 'భారతదేశమును వదలిపొండు' అని గాంధిమహాత్ము డెట్లు ఆదేశించెనో, జన్మజన్మాంతరము అస్వాతంత్ర్యమున బడవైచి తాపత్రయాగ్నియందు జీవుని కూలద్రోసి బాధించిన సాంసారికవృత్తులను, అసురసంస్కార ములను, భోగవాసనలను 'Quit my body' - నా ఉపాధిని వదలిపొండు! అని జీవు డాజ్ఞాపింపవలసియున్నది. అట్టి ధైర్యముకలవాడే స్వారాజ్యగంధము నాఘ్రాణించుటకు నోచు

కొనును. అట్టి సాహసమును జేబట్టినవాడే మోక్షసామ్రాజ్య పదవి నధిష్ఠింపగల్గును.

అయితే ఆ వాసనలు సామాన్యముగ తొలగిపోవునా! జీవునకు చులకనగ అవి లొంగిపోవునా? లొంగవు. వానిని జయించుటకు బయలుదేరిన జీవుని అవి ఒక ఆట ఆడించివదలుచున్నవి. ఇవ్విధముగ వాటిని వశమొనర్చుటకు పూనుకొనిన వాడు తానే వాటికి వశుడగుచున్నాడు. క్రిందటి శతాబ్దములో థగ్గులు అను ఒకజాతి దొంగలు మధ్యభారతములోనివసించు జనులకు చాల కీడొనర్చుచుండిరి. ప్రభుత్వమువారు వారినెట్లైన పట్టివేయుటకై కొందఱు సైనికులను నియోగించిరి. ఆ సైనికుల నాయకుడు పెక్కు ఆయుధములతో, పరివారముతో అక్కార్యమును సాధించుటకు బయలుదేరెను. ఆ దొంగలున్న ప్రాంతములో వారందఱును రాత్రి డేరాలు వేసికొని, దొంగలను వెతకుచుండిరి. ఒకనాటి రేయి సైనికుల నాయకుడు తన డేరాలో కూర్చొని వ్రాసికొనుచుండెను. సైనికులు నలువైపుల గస్తీ కాయుచుండిరి. ఇంతలో నాయకునకు ఎక్కడో ఒక కేక వినిపించెను, 'సార్' అని ఒక సైనికుడు దూరము నుండి బిగ్గఱగా అరచుచుండెను. అది విని లోన వ్రాసికొనుచున్న వారి నాయకుడు విషయమేమి యని యడుగ, అంతట వారిరువురికిని ఈక్రింది సంభాషణము నడచెను.

సైనికుడు :- 'సార్' నేనొక దొంగను పట్టుకున్నాను.

నాయకుడు :- వానిని లోపలికి తీసికొనిరా.

సైనికుడు :- వాడు రానని చెప్పుచున్నాడు.

నాయకుడు :- పోనీ, నీవైనా రా.

సైనికుడు :- వాడు నన్ను రానిచ్చుటలేదు.

ఈ ప్రకారముగ నున్నది సామాన్యమానవుని స్థితి, మాయను జయించుట కుద్యమించి మాయచేతనే జయింపబడుచున్నాడు. మానవుడు మనస్సును పట్టుకొనవలెనని వాంఛించి మనస్సుచేతనే పట్టుబడుచున్నాడు. కామమును వశమొనర్పదలంచి కామముననే వశుడగుచున్నాడు. ఒంటిమీది జోరీగనువలె మహాత్ములు ఆ కామమును, బంధరూపమగు చిత్తమును ఎట్లైనను వదిలించుకొందురు, ధీరపురుషులు వాని నెట్లైనను దులిపివేయుదురు. మందప్రజ్ఞులు మాత్రము పట్టువడుదురు. కాబట్టి మహనీయులగువారు, ఉత్తమసాధకులు మనోజయమును తద్ద్వారా పరమాత్మ దర్శనమును ఏ ప్రకారము సాధింతురో, నిరంతరాభ్యాసముచే ప్రకృతిని ఏ ప్రకారము లొంగదీసికొందురో, చక్కగ గమనించి వారివలె పట్టుదలతో సత్కార్యములను సాధించి ఈ జీవితముననే బంధవిముక్తిని బడయులాగున ప్రయత్నించవలెను. ఇందులకుగాను శ్రీకృష్ణపరమాత్మ ఐదు చక్కని సాధనములను ముముక్షువుల ఉపయోగార్థము ఈ అధ్యాయమున తెలిపియున్నాడు. వానినన్నింటిని తు-చ, తప్పకుండ అనుష్ఠించినచో ఇక మోక్షమునకై అతడు పరితపించనక్కఱలేదు. మోక్షమే అతనిని వెతకికొనుచు చెంతకువచ్చును. ఆ సాధన లెవ్వియో వినుడు.

నిర్మానమోహా జితసఙ్గదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః

ద్వన్ద్వైర్విముక్తా స్సుఖదుఃఖ సంజ్ఞైః
గచ్ఛన్త్య మూఢాః పదమవ్యయం తత్. (15-5)

(1) అభిమాన, మోహములు లేకుండుట (2) సంగదోషములను జయించుట (3) నిరంతరము అధ్యాత్మజ్ఞాననిష్ఠ గలిగియుండుట (4) కామమును తొలగించుట (5) సుఖదుఃఖాది ద్వంద్వములను త్యజించుట-అను నీయైదును ఆ సాధనములు. వీనియందు దారితేరినవారు అవ్యయ మగు పరమాత్మ పదమును తప్పక పొందగలరు. 'సాధన సర్వస్వ' మిచట పేర్కొనబడినదని చెప్పవచ్చును. వీటిలో ఏ యొక్కటి ఆచరించినను మనుజునకు అపారమగు అధ్యాత్మశక్తి లభించగలదు. ఇక ఐదింటిని సాధించినచో వేఱుగ చెప్పవలెనా? వీటిలో ముఖ్యముగ 'అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః'- అను వాక్యమును మాటిమాటికి మనన నిదిధ్యాసనములు చేయుచుండినచో ముముక్షువునకు లక్ష్యము కరతలామలకము కాగలదు. ఒక చెంప ఆత్మయందు సతతము స్థితిగల్గియుండుటకు యత్నించుచుండవలెను. మఱియొక చెంప కోరికలను, వాసనలను, భోగాసక్తిని తగ్గించుకొనుచు రావలెను. ఈ రెండిటినే మఱియొక విధముగ జెప్పినచో 'తత్త్వజ్ఞాన, వాసనాక్షయము' లన వచ్చును. ఈ ప్రకారముగ 'అధ్యాత్మజ్ఞాన నిత్యత్వము, వినివృత్తకామత్వము' సిద్ధించినచో ఇక సాధకుడు గట్టెక్కినట్లే. ఏలయనగా అధ్యాత్మజ్ఞానముచే దృక్ - స్వరూపమగు ఆత్మయందు స్థితిగల్గి, దృశ్యభోగములందు విముఖత్వమును సంపాదించుటయే సమస్త సాధనలయొక్క సారాంశము. ఇందు అధ్యాత్మజ్ఞానము నాశ్రయించుటద్వారా కామరాహిత్యము,

కామరాహిత్యమును సంపాదించుటద్వారా అధ్యాత్మజ్ఞానము లెస్సగ ప్రకాశమును బొందుచుండును. కాబట్టి రెండిటిని సమకాలముననే అభ్యసించుచు రావలెను.

జీవితము కామతృప్తికొఱకుకాదు ఏర్పడినది. కామారి* తృప్తికొఱకు. భోగసంపాదన కొఱకుకాదు, యోగసంప్రాప్తి కొఱకు. పశువికారములను బొందుటకొఱకుకాదు, పశుపతి యనుగ్రహమును బొందుటకొఱకు-అని వివేకవంతులు తెలిసికొనవలెను. మోక్షమార్గమున ఈ కామము గొప్ప ప్రతిబంధముగా నిలిచియున్నది. సాధకులను మిక్కుటముగా బాధించునది ఇదియే. కనుకనే అరిషడ్వర్గములలో (కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములలో) దీనికి నాయకత్వము (leadership) నొసంగిరి. 'జ్ఞానినో నిత్యవైరిణా' - 'జ్ఞానులకు నిరంతర శత్రువు' అని భగవానుడు కామమును గూర్చి వర్ణించుట చాల సబబుగానున్నది. వాస్తవికతను అయ్యది ప్రతిబింబింపజేయుచున్నది. మఱియు ఈ అధ్యాయమున 'నివృత్తకామాః' అని చెప్పకుండ 'వినివృత్తకామాః' అని చెప్పుటవలన కామమును పైపైన తొలగించుట చాలదనియు, (వి+నివృత్తి=విశేషనివృత్తి) సంపూర్ణముగ తొలగించవలెననియు భగవదాదేశమైయున్నది. ఇచట కామమనగా కేవల శృంగారభావములని అర్థముకాదు. ఏకోరికయైనను సరే, మోక్షమునకు, దైవప్రాప్తికి అడ్డుగనున్నచో అద్దానిని తొలగించివేయవలెనని భావము. ఎట్టివంటి సాధకుడైనను ఒకింత అజాగ్రతగ నున్నచో కామ పిశాచము వచ్చి

*కామారి = శివుడు

మీదపడును గావున, అట్టి ప్రమాదము తప్పుటకొఱకై శ్రీకృష్ణపరమాత్మ 'అధ్యాత్మజ్ఞాననిత్యత్వ' మను సూత్రమును ఇచ్చట బోధించివైచెను. అనగా నిరంతరము ఆత్మజ్ఞానమును కాపాడుకొనుచు అద్దాని నెన్నడును వదలకయున్నచో ఇక కామప్రవేశమునకు అవకాశమే యుండదని భావము. జన్మ తారణకొఱకు, పరమానందప్రాప్తికొఱకు మహనీయులీప్రకారముగ కామరూప భయంకర శత్రువు బారినుండి తప్పించుకొనవలసినదిగా హెచ్చరికలు చేయుచుండ జనులు వానిని నిర్లక్ష్యముచేయుట అట్లుండ పైపెచ్చు ఆ శత్రువునకు పాలుపోసి పెంచుచున్నారు. వినోద మను పేరిట చూడరాని దృశ్యములను చూచుచున్నారు. చేయరాని పనులను చేయుచున్నారు. అసభ్యచిత్రములచే తమగృహ ప్రాంగణములను అలంకరించుచున్నారు. 'ప్రాతఃస్మరామి' యనునట్లు ఉదయము లేవగనే వాటినే దర్శించుచు, స్పర్శించుచు, సంస్మరించుచు చిత్తమును కలుషిత మొనర్చుకొనుచున్నారు.

జీవితమిందుకొఱకా ఏర్పడినది ? పవిత్రమగు మానవ జన్మను ఈప్రకారముగ రొంపిలో బడవైచినచో ఇక ఎన్నటికి ఆతడు తేరుకొనగలడు ? ఈవిధముగ మానవత్వము దిగజారి పోయినచో జీవునకు శ్రేయోమార్గ మెన్నడైన లభించునా ? ఈ తుచ్ఛసుఖములు, ఈ ఇంద్రియవిలాసములు, ఈభోగసముదాయములు జంతుజాలముకూడ యనుభవించుట లేదా ? ఆ భాగ్యమునకు మానవుడై పుట్టనేల ?

మహాభారతయుద్ధము జరుగుచుండెను. రణరంగమునకు ఒకింతదూరముగ నొకమార్గమున ఏదియో పనిమీద

వ్యాసమహర్షి పోవుచుండెను. అకస్మాత్తుగ నొకచోట నిలబడి భూమిపై ఏదియో విచిత్రమును అతడు చూచుచుండెను. ఒక చిన్న పురుగు మార్గముయొక్క ఒక వైపునుండి మఱియొక వైపునకు అతివేగముగ పరుగిడుచు పోవుచుండెను. వ్యాసు లద్దానిని ఆపి, మాట్లాడు శక్తి దాని కొసంగి 'ఏల ఇంత వేగముగ పోవుచున్నావు'-అని ప్రశ్నింప నయ్యది 'దూరమున నొకరథము ఈమార్గముగుండా వచ్చుచున్నట్లు నేల అదురు వలన తెలిసికొంటిని. అది వచ్చులోపల నేనీ మార్గమును దాటవలసియున్నాను. మెల్లగా నడచినచో రథము క్రిందపడి నలిగిపోవుదునేమోయను భీతిచే వేగముగ బోవుచున్నా'నని చెప్పెను. అంతట వ్యాసులు 'నీవింత చిన్నప్రాణివికదా, నీవు చచ్చినచో వచ్చిన నష్టమేమి? నీకుకూడ ప్రాణముపై ఇంత తీపియేల?' అని యడుగ ఆ పురుగిట్లు సమాధానము చెప్పెను. 'మహాత్మా! అన్నియు తెలిసికూడ తమరీ విధముగ ఏల పలుకుచున్నారు? ప్రతిజీవికి తన దేహముపై, తన కుటుంబముపై ప్రీతి, మమత్వముండును. తినుట, త్రాగుట మున్నగువానిచే మానవుల కెట్టి సుఖము లభించుచున్నదో, మాకును అట్టి సుఖమే లభించుచున్నది. ఇంద్రునకు తన పత్నివలన నెట్టి యానందము కలుగుచున్నదో నాకును నాపత్నివలన నట్టి యానందమే కలుగుచున్నది. విషయ సుఖానుభవమునందు ఇంద్ర, చంద్ర, మానవ, తిర్యక్, క్రిమికీటకాది భేద మేమి యును లేదు. అది అందఱికిని సమానమే. సృష్టియందు నేనున్ను ఒక ప్రాణినే. ప్రాణముపై నాకున్ను తీపి కలదు. అద్దాని సంరక్షణకొఱకే ఇపుడు పరుగెత్తుచున్నాను. క్షమిం

చుడు, రథము వచ్చుచున్నది. నేను పోవలెను' అని మహర్షి యొద్ద సెలవుగైకొని వెడలిపోయెను. చూచితిరా! జంతుజాలమునకున్ను ఎట్టి భోగానుభవము కలుగుచున్నదో! ఇంద్రియార్థములే శరణ్యములైనచో, విషయసంతృప్తియే జీవిత పరమావధియైనచో, ఇక ప్రాణి మానవుడై పుట్ట నవసరము లేదు. చక్కగ క్రిమికీటాదులలో పుట్టి వాని ననుభవించుకొన వచ్చును. ఇక్కడకంటె మించిన సుఖములుకూడ అక్కడ నుండవచ్చును. కాబట్టి విజ్ఞుడీవిషయమంతయు బాగుగ నాలోచించి అమూల్య మానవజీవితమును కామాగ్నియందు, విషయభోగజ్వాలలందు ఆహుతిచేయక పరమార్థవిచారణయందు, దైవప్రాప్తియందు వినియోగించవలెను.

లోభో లుంఠతి చిత్తవృత్తిమనిశం కామః పదాఽఽక్రామ్యతి
క్రోధోప్యుద్ధత ధూమకేతు ధవలో దన్దగ్ధి దిగ్ధోఽధికమ్
త్వామాశ్రిత్య నరాః శరణ్య శరణం సంప్రార్థయా మోవయమ్
మగ్నాం మానవతాం సముద్ధర మహా మోహాంబుధౌ మాధవ.

'ఓ ప్రభూ! వైకుంఠనాథా! లోభము మాచిత్తముల నెల్లప్పుడు కొల్లగొట్టుచున్నది. కామము మమ్ములను త్రొక్కివేయుచున్నది. క్రోధము భయంకర అశనిపాతమువలె కాల్చివేయుచున్నది. మహానుభావా! నిన్ను మేము శరణుజొచ్చుచున్నాము! అజ్ఞాన మహాసాగరమున మునిగిపోయియున్న మానవత్వమును ఉద్ధరింప వేడుచున్నాము!' - అని యొక జిజ్ఞాసువు చక్కని ప్రార్థన గావించెను. ఆప్రకారముగ మానవత్వమును మాయామోహసముద్రమున దిగజారిపోకుండ పైశాచిక భావములకు హృదయమున తావీయకుండ విజ్ఞుడు

ప్రయత్నించవలెను. అందులకుగాను భగవత్కృపనుగూడ అపేక్షించుటమంచిది. ఏలయనిన, సర్వేశ్వరుని కృపాకటాక్ష వీక్షణములను అమృతధారలచే దుర్వార సంసారతాప నివహములన్నియు క్షణకాలములో చల్లారిపోగలవు. భయంకర దుర్వృత్తులును పలాయనము చిత్తగించగలవు.

ఈ ప్రకారముగ దుష్పూరమగు కామమును, తదితర మానసిక దుష్టవృత్తులను అభ్యాస వైరాగ్యములచేతను, భగవదనుగ్రహముచేతను ఎవరు తొలగించుకొని "వినివృత్త కామము" లగుదురో అపుడిక పరమాత్మపదమును ఇచ్ఛేటనే వారు పొందగల్గుదురు. ఉపనిషత్తులున్ను గీతోక్తమగు ఈ పరమసత్యమునే వెల్లడించుచున్నవి—

యదా సర్వే ప్రముచ్యన్తే కామాయేఽస్య హృది శ్రితాః
అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే (కఠోపనిషత్తు)

'ఎపుడు మనుజుడు తనహృదయమందలి కోరికలన్నిటిని లెస్సగ విడనాడునో అపుడతడు అమృతస్వరూపుడై, ఇక్కడనే బ్రహ్మమును పొందిపోవుచున్నాడు' అని కఠోపనిషత్తు తెలుపుచున్నది. కాని ప్రపంచమునందలి సమస్తపదార్థములను పొందినప్పటికిని జనులకు ఆశ ఇంకను చచ్చుటలేదు. ఏలయనిన, ఒక భోగమును ఒక పర్యాయము అనుభవించినచో, ఆ భోగానుభవము సంస్కారరూపముగ పరిణమించి మఱియొకసారి దాని ననుభవించుటకు ప్రేరేపించుచున్నది. ఈప్రకారముగ పదేపదే ఆయాభోగ్యవస్తువుల ననుభవించుటవలన వాసనలు సంస్కారములు బలపడి ఆశలు వృద్ధిఅయి, తత్ఫలితముగ లెక్కలేనన్ని

జన్మలు కలుగ, ఆ యా జన్మలందును మరల ఆ ప్రాకృత చేష్ట లనే కావించుచు జీవుడు క్రమక్రమముగ అధోగతిని పొంది పోవుచున్నాడు.

Sow an action, reap a tendency
Sow a tendency, reap a habit
Sow a habit, reap a character
Sow a character, reap a destiny.

So destiny is your own creation, you can do **it or undo it.**

'ఈరోజు నీవొక కార్యము చేసినచో రేపది సంస్కారముగా మారును. ఈరోజు సంస్కారము కలుగజేసికొనినచో రేపది అలవాటుగా మారును. ఈరోజు అలవాటు గావించుకొని నచో రేపది నీస్వభావముగ మారిపోవును. ఈ రోజు దేనిని నీవు స్వభావముగ జేసికొనినావో, అదియే రేపు నీగమ్యమును నిశ్చయించును. కాబట్టి గమ్యము నీ చేతిలో నున్నది. నీవు దానిని పొందవచ్చును. పోగొట్టుకొనవచ్చును. మార్చుకొన వచ్చును'- అని స్వామి శివానందులు సెలవిచ్చియున్నారు. కావున బీజరూపముగ నున్నప్పుడే ఆ యా దుష్టసంకల్పములను హృదయమున రూపుమాపవలయును. కామము, క్రోధము -ఇత్యాది వృత్తు లేవి యుదయించినను వెనువెంటనే విచా రణచేసి, వాటిని బయటకు సాగనంపవలెను. లేకున్న కామ సంస్కారము విజృంభించి, ఆశ బలపడి ప్రపంచమంతయు తనకు కావలెనని కోరుచుండును.

రామాయణమునందు ఒక విచిత్ర వ్యక్తియొక్క పరిచయము గావింపబడినది, ఇంతవఱకు ప్రపంచములో కని విని యెఱుఁగనట్టి అపురూపమగు ఆకృతిగల వ్యక్తి యతడు. ఆతడే కబంధుడు. అతనికి తల లేదు. లేదనగా అసలు లేదని కాదు, మెడమీదమాత్రము లేదు. ఆ తల పొట్టదగ్గఱనున్నది. అనగా కడుపే కైలాసముగ భావించువాడని అర్థము. పొట్టకొఱకే తలను ఉపయోగించువాడని భావము. అంతమాత్రమే కాదు, చేతులు కొన్ని యోజనముల పొడవు కలవి. తన యా దీర్ఘబాహువులను జాపి అందిన వస్తువులన్నిటితో నతడు తన ఉదరమును నింపుకొనుచుండును. ఇది అతని పని. అట్లే ప్రపంచములో తృష్ణకు, కామమునకు, ఆశకు లోబడి మనుజులు తమ కబంధహస్తములను జాపి అనవరతము పదార్థములను, భోగములను వాంఛించుచునే యుందురు. వారి ఆశకు మేరలేదు.

పూర్వ మొకానొకడు బ్రహ్మదేవునిగూర్చి యిట్లు ప్రశ్నించెనట-'అయ్యా, మహానుభావా! తమరు సృష్టికర్తలు. ఎంతయో ఉత్సాహముతో అన్నిటిని సృష్టించినారు. చాల సంతోషము. కాని ఆ మేరుపర్వతమును* ఎందులకు సృష్టించినారు తండ్రీ, ఎవరికి ఉపయోగపడకుండ!' కమలాసను డా వాక్యములను విని ఇంతవఱకు కంఠఱను నాసృష్టిని సంస్తుతించుచుండ ఈతడెవడో విమర్శించుచున్నాడు. దానికి కారణ మరయవలె నని నిశ్చయించి ఏల నీవిట్లు పలుకుచున్నావు అని యాతనిని ప్రశ్నింప, నాత డిట్లు సమాధాన మొసంగెనట- "మహాత్మా!

* మేరుపర్వతము బంగారు కొండయని ప్రతీతి.

క్షమింపుడు. నా యీ వాక్యములచే తమ మనస్సునకు ఆయాసము కలుగకుండుగాక! ప్రపంచములోని మానవు లంతటిని రెండు తరగతులుగ విభజించవచ్చును-(1) ఆశలేని వారు (2) ఆశకలవారు-అని. వీరిలో ఆశలేనివారికి నీబంగారపు కొండ దేనికి? 'నిస్పృహస్య తృణంజగత్' అనునట్లు ఆశలు లేనివారికి బ్రహ్మాండమంతయు తృణప్రాయమైయుండ ఇక నీ బంగారుకొండ (మేరుపర్వతము) కొఱకు వారు అఱులు జాచుదురా? కాబట్టి ఆ తరగతివారికి నీమేరుపర్వతము కొంత ఉపయోగముకూడలేదు. అది వృథా. ఇక రెండవతరగతి వారు ఆశకలవారు. వారికో, నీబంగారపుకొండ ఇచ్చినను చాలదు. వారి ఆశకు మితములేదు కనుక, నీమేరుపర్వతమును జూచి వారు ఏడ్చుచున్నారు. 'ఇది మాకు చాలదు మహాను భావా, ఇంకా కొంత ఉండినచో మేలు' అని. కాబట్టి వారి కిన్ని నీమేరుపర్వతము ఉపయోగము లేకుండపోయినది. ఇక ఎవరిని ఉద్ధరించినట్లు మహాప్రభో ఆ మేరుపర్వతము?" ప్రజ్ఞావంతుడగు నాతని వాక్యములను విని బ్రహ్మదేవుడు లోలోన నవ్వుకొనెనట!

ఈప్రకారముగ ఆశాపాశశతంబులచే బద్ధులైన జనులు పరమాత్మపదమును ఎన్నటికిని బొందజాలరు. శ్రీరామలక్ష్మ ణులు కబంధుని హస్తములను ఛేదించివేసినట్లు, వెఱ్ఱితలలు వేయుచున్న ఈ ఆశాప్రవృత్తిని మనుజులు తమ హృదయకోట రమున వివేకమను నిశితఖడ్గముచే పరిమార్చవలెను. 'గచ్ఛన్త్య మూఢాః పదమవ్యయంతత్'- అనునట్లు అట్టి వివేకవంతులే అట్టి తృష్ణావిహీనులే అవ్యయమగు పరబ్రహ్మపదమునకు దారి

తీయగలరు. కాబట్టి మనస్సును బాగుగ సంశోధించి, సంస్కరించి దుస్సంస్కారములను పారద్రోలి ఈజీవితమునందే ఆత్మానుభూతిని బడయులాగున ప్రయత్నించుకొనవలెను. ఈ పరమాత్మ దూరమునలేడు-'ఆత్మన్యవస్థితమ్'తన హృదయమునందే అధివసించుచున్నాడు. కావున ఆతని దర్శనమునకై, సాక్షాత్కారమునకై దూరప్రదేశములకు పోనక్కరలేదు.

అయితే అంత సమీపముననున్నపుడు సర్వజనులకును ఆ పరమాత్మ ఏల యనుభూతుడగుటలేదను ప్రశ్న ఉదయించును. అద్దానికి చక్కటి సమాధానమును గీతాచార్యుడు వచించెను.

యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మ న్యవస్థితమ్
యతన్తోఽప్యకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః (15-11)

భగవంతుని దర్శించుటకై ప్రయత్నములు సలుపుచున్న నిర్మలచిత్తులగు యోగులు తమ హృదయమందే అతనిని గాంచగల్గుచున్నారు. 'చిత్తశుద్ధిలేనివారు, దుర్వృత్తులతో గూడినవారు ఎంత ప్రయత్నించినప్పటికిని ఆ పరమాత్మను గాంచలేరు!' గీతయందలి అతిముఖ్యశ్లోకములలో నిదియొకటి. భగవద్దర్శన మేల యగుటలేదని పరితపించువారి కిది సమాధానమును సూచించుచున్నది. తన ముఖమే అయినప్పటికిని మురికి అద్దములో అది కానరాదు. అట్లే తన ఆత్మయే అయినప్పటికిని మలినమనస్సునందయ్యది ప్రతిబింబించదు నిర్మలచిత్తరూపదర్పణముననే అది తెస్సగ ప్రకాశించును. కనుకనే ఎందరో పండితులు సర్వశాస్త్రపారంగతులై యున్నప్పటికిని.

హృదయశుద్ధి లేనందుచే భగవత్ తత్త్వమును సాక్షాత్కరించుకొనజాలకున్నారు.

నావిరతో దుశ్చరితా న్నాశాన్తో నా సమాహితః
నాశా న్తమానసో వాపి ప్రజ్ఞానే నైన మాప్నుయాత్.

'దుర్మార్గమును దుశ్చేష్టలను విరమించనివాడు అశాంతచిత్తుడు, ఏకాగ్రతలేనివాడు, కేవలము పాండిత్యముచే, ప్రజ్ఞచే ఆత్మ నెన్నటికిని పొందజాలడు' - అని ఉపనిషత్తులుద్ఘోషించుచున్నవి. ప్రకాశములో నున్నప్పటికిని కండ్లులేనివాడు వస్తువుల నెట్లు చూడజాలడో, అట్లే సర్వవిద్యాపారంగతుడై యున్నప్పటికిని, హృదయనైర్మల్యములేనిచో మనుజుడు భగవంతుని దర్శింపలేడు. దుఃఖ మాతనికి తొలగదు. బంధవిముక్తి సిద్ధింపదు. శ్రీరామకృష్ణపరమహంస చెప్పినట్లు గ్రద్ద ఆకసములో ఎంతయో పైకిపోయినప్పటికిని దానిదృష్టి భూమిపైగల కుళ్ళినమాంసముపైననే యుండునట్లు, కొందఱు కళాప్రపంచమున, పాండిత్యరంగమున అత్యున్నతశిఖరముల నందుకొనినను, దృష్టిమాత్రము నశ్వరపదార్థములపై, అల్పవిషయభోగములపై ప్రసరింపజేయుచున్నారు. అట్టివారిని సంసారదుఃఖ మెన్నటికిని వీడకుండును. నిత్యజీవితమున చిన్న చిన్న సాంసారిక సంఘటనలలో వారు తల్లక్రిందులై పోవుచుందురు. భగవద్భక్తికలవారు, సర్వేశ్వరునిపై అచంచల విశ్వాసము కలవారు, మనంబున దుర్వృత్తులకు తావొసంగనివారు, విద్యాగంధము లేకున్నప్పటికిని దుఃఖరహితమగు అవ్యయపదమును, పరమానందప్రాప్తిని ఇచటనే పడయుచున్నారు. కాబట్టి ఆత్మానుభూతియందు హృదయనైర్మ

ల్యము ప్రముఖస్థాన మాక్రమించునున్నదే కాని లౌకిక శక్తి సంపదలుకాని, అధికారములుకాని, విద్యలుకాని కావు. ఇవి ఉండగూడదనికాదు. వీనితోపాటు ఆ చిత్తశుద్ధి, కోమల హృదయముకూడ చేర్చబడవలెనని భావము.

విద్యలు నేర్చినవారిని సంస్కృతభాషలో 'సాక్షరాః' అందురు. 'సాక్షరుల'ని పెద్దలు వారికి పేరు పెట్టి ఆ విద్యలతో పాటు 'దమ'మును (ఇంద్రియనిగ్రహమును)గూడ అభ్యసించు డని హితవు చెప్పిరి. వారట్లు అభ్యసించినచో 'సాక్షరుల'ను బిరుదును వారు కాపాడుకొనగల్గియుండెడివారు. కానివారిలో కొందరట్లు చేయలేదు. వారు దమమును ఆశ్రయింపక, ఆపద మును తలక్రిందులుచేసి 'మద'మును అవలంబించిరి. అందుచే ఆ పెద్దలున్ను ఇదివఱలో వారికిచ్చిన 'సాక్షరాః' అను బిరు దును తామున్ను తలక్రిందులుచేసి 'రాక్షసాః' అను బిరుదును తిరిగి వారి కొసంగిరి. అది అసలు సంగతి. అనగా, అద్భుత మగు పాండిత్యప్రకర్ష కలిగియున్నప్పటికిని, అంగ ఉపాంగము లతో గూడ సర్వశాస్త్రములను అధ్యయనము చేసినప్పటికిన్ని, హృదయము సంకుచితముగ నున్నచో, సత్యము, శాంతము, శమము, పరోపకారము జీవకారుణ్యము భోగవైతృష్ణ్యము మున్నగు ఉదాత్తగుణములు వారికి లేనిచో ఆ విద్యలు వారికి శోభించవు. అవి వారికి శవాలంకార సదృశములుగనే యుండును 'అకృతాత్మానోనైనం పశ్యన్త్యచేతసః' - అని శ్రీకృష్ణభగవానులు అట్టివారినిగూర్చి చెప్పాను, హృదయ పవిత్రత, చిత్తశుద్ధి లేనివారు పరమాత్మ నెన్నటికిని దర్శింప జాలరని ఘంటాపథముగ చాటివైచెను. దేవాలయములో

దేవుని ప్రతిష్ఠించక ఊరక శంఖమును ఊదినచో ఏమైన ప్రయోజనముండునా? అట్లే తమతమ హృదయపీఠములను పరమాత్మకు అంకితముచేయక దైవగుణముల కద్దానిని నెలవుగ నొనర్పక అసురసంపత్తికి మాత్రము అచ్చోట ఆశ్రయమును కల్పించినచో, ఎటువంటి ప్రజ్ఞావంతుడైనను లోకములో ఉపరిస్థానము నాక్రమింపజాలడు. మఱియుభగవంతునిదృష్టిలో అసలు గణన కేరాడు. కాబట్టి భగవత్సాక్షాత్కారమును అభిలషించు మానవులందఱున్ను తమ మనఃపవిత్రత విషయమై కడు జాగరూకులుగ నుండవలెను. సర్వేశ్వరుని అనుగ్రహాము నకు పాత్రులు కాదలంచిన వారందఱున్ను, నిర్వాణపదవిని కాంక్షించువారందఱున్ను ఈ విషయమును దృష్టియందుంచుకొని చిత్తనైర్మల్యమునకు వలసిన సాధనసామగ్రిని అవశ్యము సంపాదించుకొనవలెను.

మనస్సునుబట్టియే మరుజన్మ ఏర్పడును. మనస్సు అతి శుద్ధముగా నున్నచో ఆత్మానుభూతి ఇచటనే గలిగి జీవుడు తరించిపోవును. స్వస్వరూపసాక్షాత్కారమును బడయగల్గి సంసార దుఃఖసముద్రమును దాటివేయును. ఒకింత శుద్ధముగా నున్నచో మరణించిన తరువాత ఆ పుణ్యసంస్కార బలముచే మఱుజన్మయందు జీవితవసంతమునుండియే తీవ్రసాధనల నొనర్చుచు క్రమముగ పూర్ణశుద్ధిబడసి దైవమందు విలీనమగును. అట్లుకాక, మనస్సు మలినముగానున్నచో, దుర్వృత్తులు, దుష్టసంకల్పములతో గూడియున్నచో, దైవసంస్కారమొకింతైని లేకుండినదియగుచో, మరణానంతరము నీచయోనులందు జన్మించియో, ఒకవేళ మానవులందు బుట్టినచో దైవ

సాధనకు తక్కువ అవకాశము గల్గియో యుండును. అత్తఱి జీవుడు అతి క్లిష్టములగు దుఃఖపరిస్థితులను ఎదుర్కొనుచు నానాబాధలను బొందుచుండును. పుణ్యముకాని, పాపముకాని, చేసినకర్మయొక్క ఫలితమునుండి ప్రాణి ఎన్నటికిని తప్పించుకొనజాలడు. ఏలయనగా, వారి వారి నీడ వారి వెంట వచ్చుచునేయుండును. ఇంద్రలోకమునకు బోయినను, చంద్రలోకమున కేగినను, పాతాళమున జనినను, సప్త మహాసముద్రముల నట్టనడుమదాగినను, వారివారి కర్మ వారి వెంట వచ్చుచునేయుండును. దూర్వాసుని తఱుముకొని వెళ్ళిన విష్ణుచక్రమువలె అది వారిని వెన్నంటుచునే యుండును. ఈ పరమరహస్యమును శ్రీకృష్ణపరమాత్మ ఈ అధ్యాయమున బాహాటముగ ప్రకటించివైచెను-

> శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః
> గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధా నివాశయాత్. (15-8)

'ఆశ్రయములగు పుష్పాదులనుండి వాయువు గంధమును దూరముగ గొనిపోవునట్లు, జీవుడున్ను ఈ శరీరమును వదలి మఱియొక శరీరమును గ్రహించునపుడు ఆయా ఇంద్రియమనంబులను వానిలోనున్న సంస్కారములను వెంట తీసికొనిపోవును'— పదార్థము సువాసనాయుతమైనచో వాయువు ఆ సుగంధమునే నలువైపుల వ్యాపింపజేయును. దుర్వాసనాభూయిష్ఠమైనచో ఆ దుర్గంధమునే నలుదెసల గొనిపోవును. అట్లే దేహవియోగ సమయమున చిత్తమునందు పుణ్యసంస్కారములు, దైవికగుణములు ఉన్నచో అవి అంతటితో అంతరించక మఱుజన్మకు ప్రయాణమును సాగించి జీవుని సముద్ధరణకు తోడ్పడును. అట్లు

కాక అంత్యకాలమున అంతఃకరణము దుష్టవాసనలతో, అసుర సంస్కారములతో నిండియున్నచో, ఆ మలినవృత్తులు జన్మ జన్మాంతరములకుకూడ ప్రయాణముచేసి జీవుని యధోగతికి కారకములగును. చిత్తము అత్యంత శుద్ధత్వమును బొంది ఆత్మజ్ఞానము నుదయింపజేసి తద్ద్వారా మోక్షమును ఎపుడు కలుగజేయునో, అంతవఱకు ఈ ప్రయాణములు జీవునకు సాగ వలసినదే. జననమరణరూప సంసారచక్రము గిర్రున తిరుగ వలసినదే. కర్మ యున్నంతవఱకు దీనిని యెవరును ఆపలేరు. కావున జ్ఞానాగ్ని నుద్భూత మొనర్చుకొని కర్మసంచితము నంతను భస్మీభూత మొనర్చుట తప్ప ఈ జననమరణ ప్రవాహ మును నిలుపుటకు గత్యంతరము లేదు.

భగవానుని ఈదివ్యవచనములద్వారా జీవుని కర్తవ్యము ఈ శరీరముతో పూర్తికాలేదని స్పష్టముగ తెలియుచున్నది. చార్వాకులు, నాస్తికులు మొదలగువారు దేహాంతముతో అన్ని సమస్యలు తీరిపోవునని చెప్పుదురు. ఆవాక్యము సరికాదు. అది శాస్త్రసమ్మతమగు అభిప్రాయముకాదు. మహాత్ముల యనుభవ మునకును అది కేవలము విరుద్ధమైయున్నది. శ్రీకృష్ణమూర్తియు గీతయందు చార్వాకుల మతమును పూర్తిగ ఖండించివైచి శరీరానంతరముకూడ సంస్కారములు నశింపకనేయుండి మరు జన్మకు హేతుభూతములగునని విస్పష్టముగ తెలిపివైచెను. దీనినిబట్టి నీచజన్మము బడయుటగాని, ఉత్తమజన్మను పొందుట గాని, జన్మరాహిత్యమును కలుగజేసికొనుటగాని మనుజునకు తనచేతిలోనున్న పనియేయని తేటతెల్లమగుచున్నది. రాక్షసు

జరుగుటగాని, దేవతయగుటగాని, దేవుడగుటగాని తన యధీన మునయున్న కార్యమేకాని అన్యముకాదు.

Who sows must reap, they say, and cause must bring
The sure effect, good, good; bad, bad; and none
Escape the law.

అవని జల్లిన విత్తియో అదియె పండు
కారణంబును బట్టియే కార్యముండు
చెడ్డ చెడ్డను, మంచి మంచికిని గల్గు
దీని దప్పించుకొనుటకు తెరవులేదు.

అని వివేకానందులు సెలవిచ్చినట్లు తాను ఏవిత్తును నాటునో ఆ ఫలితమునే అనుభవించును. కుంకుడు విత్తనము నాటి మామిడిపండు లభించవలెనని కోరిన, అది సాధ్యపడువిషయము కాదు. ఏలయనిన, కర్మసిద్ధాంతము అప్రతిహతమైనది.

1. హసతా క్రియతే కర్మ రుదతా పరిభుజ్యతే
దుఃఖదాతా న కోఽప్యస్తి సుఖదాతా న కశ్చనః

2. స్వకర్మణా భవేదుఃఖం సుఖం తేనైవ కర్మణా
తస్మాచ్చ పూజ్యతే కర్మ సర్వం కర్మణి సంస్థితమ్.

"ఈనాడు నవ్వుచు చేసిన పాపకర్మకు రేపు ఏడ్చుచు దుఃఖ మనుభవింపవలసివచ్చును. ఈ ప్రపంచమున సుఖమునుగాని, దుఃఖమునుగాని మఱియొకడు ఇచ్చుటలేదు. తాను చేసిన (పుణ్య) కర్మలవలననే తనకు సుఖము, తాను చేసిన (పాప) కర్మ వలననే తనకు దుఃఖము కలుగుచున్నవి. ఇవ్విధముగ అంతయు కర్మయందే ప్రతిష్ఠితమైయున్నది. కనుకనే కర్మ గౌరవింపబడు

చున్నది." బంధమోక్షములకు కర్మయే కారణము. తనయొక్క విశుద్ధాచరణముచే మోక్షమును, అపవిత్రాచరణచే బంధమును జీవుడు పొందుచున్నాడు. తాను మలిన సంకల్పములతో గూడి, దోషయుక్తమగు కర్మ నాచరించుచు సుఖము కొఱకై, బంధవిముక్తికొఱకై భగవంతుని వేడినచో ఆతడేమిచేయగలడు ? జీవుడు కర్మకర్త, భగవంతుడు కర్మఫల ప్రదాత. జీవుని కర్మ ననుసరించి భగవానుడు ఫలముల నొసంగుచుండును. దేవుడు పోస్టుబంట్రోతువంటివాడు. ఎవరికి ఏ ఉత్తరము వచ్చునో, దానిని వారివారికి బట్వాడాచేయుచుండును. ఆ ఉత్తరములోని సంగతులతో అతని కేమాత్రము సంబంధములేదు. అట్లే వారివారి పుణ్యపాపములకు తగిన సుఖదుఃఖాది ఫలములను వారివారికి అందజేయుచుండును. తమకు సంభవించు ఆపదలు జూచి భగవంతుని తూలనాడువారు అవివేకులు మాత్రమే యగుదురు. ఇక్కాలమున జనులు ఏ చిన్న ప్రమాదము తటస్థించినను 'దేవుడా ! ఏల యిట్లు మమ్ము బాధించుచున్నావు ?' అని అడుగువారే. వారి దృష్టిలో పిల్లవాడు పరీక్ష తప్పినను దానికి దేవుడే కారకుడు. బంధువులలో ఎవరైన మరణించినను దేవుడే బాధ్యుడు. వర్షము కురియకపోయినను అది దేవునితప్పే. ఇట్టిభావము సరికాదు. హ్రస్వదృష్టివలననే అట్టి ఊహాలు వారికి జనించుచుండును. జీవునకు కలుగు సుఖదుఃఖములు అతని పుణ్యపాపముల వలననే కలుగుచుండును. మధ్య భగవంతుని పెత్తనమేమియునులేదు. అతడు నిమిత్తమాత్రుడే యగును.

ద్రౌపదీదేవిని నిండు సభయందు దుశ్శాసనుడు మాన భంగ మొనర్చుట కుద్యమించెను. అత్తఱి ఆ దేవి తన్ను రక్షింపుమని శ్రీకృష్ణుని ప్రార్థింపగా అతడా పరియొక్క దరఖాస్తును తత్క్షణమే జగత్ - ప్రభుత్వము (Univessal Government) యొక్క కర్మవిభాగమును నడుపుచున్న దేశీయాంగశాఖ (Home Department) కు పంపి దాని యొక్క మంచిచెడ్డలనుగూర్చి విచారింపవలసినదిగా ఆశాఖాధిపతికి ఆదేశ మొసంగెనట! ఆ ఉద్యోగి వెంటనే పాత పైళ్ళన్నియు తెప్పించి ద్రౌపదీదేవి పూర్వజన్మలలో చేసిన పుణ్యములను వెదుకసాగెను. దస్త్రము ఇటునటు త్రిప్పగా ఆమెచరిత్రకు సంబంధించిన యొక ఘట్టము కానిపించెను. పూర్వము ఒకానొకజన్మలో ద్రౌపది సముద్రస్నానమున కేగెను. అది పరవటిదినము గనుక అనేక జనులు స్నానార్థమట కేతెంచిరి. అత్తఱి స్నానము చేయుచున్న ఒక సాధుపుంగవునియొక్క కౌపీనము తరంగముల వేగమునకు కొట్టుకొనిపోవ అతడు బయటకు వచ్చుటకు సిగ్గుపడి నీటిలోనే నానుచుండెను. దూరముగా స్నానముచేయుచున్న ద్రౌపది సాధుపుంగవుని యవస్థ గమనించి వెంటనే తన చీరెలోని కొంతభాగమును చింపి సాధువుయొద్దకు విసరివేసెను. అతడది ధరించి సంతోషముతో వెడలిపోయెను. ఈస్వల్ప వస్త్రదాన విషయమై ఆ కర్మవిభాగపురికార్డులో వ్రాయబడి యుండెనట, ఈ సంగతి వెనువెంటనే ఆ శాఖాధిపతి శ్రీకృష్ణపరమాత్మకు తెలుప ఆర్తత్రాణపరాయణుడగు అమ్మహనీయుడు తత్క్షణమే 'ద్రౌపది పూర్వము దానమొసంగిన ఆ చిన్నివస్త్రము

అక్షయమై ద్రౌపదిని కాపాడుగాక !' అని సంకల్పించెను. తదుపరి జరిగిన కథ అందఱికిని తెలిసినదే. చూచితిరా ! ఏనాడో చేసికొనిన స్వల్పపుణ్యము శాఖోపశాఖలుగ విస్తరించి బ్రహ్మాండమైన సుకృతముగమారి మహోపకారమును చేసివైచినది. అట్లే ఏనాడో చేసికొనిన స్వల్పపాపము ఫలించు సమయమున గొప్ప అపకారమును కలుగచేయ వచ్చును. పరీక్షిత్తు వేళాకోళమునకు శమీకమహర్షి మెడలో చచ్చిన పామును చిన్నదొకదానిని వేయగా, ఆ చిన్నిపామే విశాలాకృతిగల తక్షకుడను పాముగా తయారై అతనిని బాధించిన సంగతి జగద్విదితమేకదా !

కాబట్టి తమ పుణ్యాపాపముల విషయమై జనులు అత్యంత జాగరూకులై మెలగవలెను పాపములను రహితమొనర్చి పుణ్యములను విరివిగా నాచరించుటకు పూనుకొనవలెను. దుస్సంకల్పములను, దుర్వృత్తులను పారద్రోలి సత్సంకల్పములను సద్వృత్తులను ఆశ్రయింపవలెను. ఏ పుణ్యము చేయనిచో, తుదకు యమధర్మరాజు ప్రశ్నించు కాలమున దేబరించి చూడవలసివచ్చును.

నరకే పచ్యమానంతు యమేన పరిభాషితమ్.
కింత్వయా నార్చితో దేవ, కేశవః క్లేశనాశనః.

నరకమునందు నానాయాతనలనొందుచున్న ఒకానొకవ్యక్తిని జూచి యముడు "ఓయీ ! సమస్తక్లేశములను పోగొట్టునట్టి మాధవుని నీవేల పూజించలేదు. ఆపద్బాంధవుడగు ఆతని నేల అర్చింపలేదు"అని ప్రశ్నించెనట! కాబట్టి తరువాతపశ్చాత్తాప పడినచో లాభములేదు. పశ్చాత్తాపముకంటె పూర్వతాపము

వేయిరెట్లు మేలని గ్రహించవలెను. అట్లు గ్రహించి రాబోవు ఆపదలకు అవకాశమే ఈయకుండ జీవితకాలము యావత్తు నిరంతర సత్సంస్కార పరిగ్రహణమందే గడుపులాగున ప్రయత్నించవలెను. భగవాను డీయధ్యాయమున తెలిపినట్లు జీవుడు దేహవియోగసమయమున మనస్సును, ఇంద్రియములను, వానియందుగల సంస్కారములను, వాసనలను, అన్నిటిని మూటగట్టుకొనిపోవును గనుక, ఆ మూటలోని సరుకు నాణ్యముగనుండునట్లు చూడవలెను. ఏలయనిన జీవుని ప్రయాణమునందు అదియే దారిబత్తెముగ నుపయోగపడును. అశుద్ధపదార్థములను మూటగట్టుకొనిపోయినచో వానినే తినవలసివచ్చును. అనుభవించవలసివచ్చును. కాబట్టి జీవితమందు ముముక్షువు కడు హెచ్చరికతోనుండి చిత్తమును సత్సంస్కారమయముగ చేసివేయవలెను.

వాస్తవముగ జీవుడు పాపికాడు. పరమపవిత్ర ఆత్మస్వరూపుడు. అకళంకమూర్తి.

మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః (15-7)

అను భగవద్వాక్యము జీవుని భగవదంశముగనే, భగవత్స్వరూపముగనే వర్ణించినది. కావున అవిద్యావశమున తాను మఱచిన తన యథార్థస్వరూపమును మరల గుర్తెఱింగి, తాను అల్పుడనని, పాపినని భావింపక, అట్టి పాపచేష్టలను చేయక నిర్మలజీవితమును గడుపవలయును. సింహము నిద్రపోవునపుడు చిన్న ఎలుకకూడ దానిపై నెక్కి త్రొక్కుచు సవారిచేయుచుండును. కాని యది నిద్రలేచినచో దానిధాటికి గజరాజముకూడ గడగడలాడిపోవును. అట్లే జీవుడు అజ్ఞాన నిద్రయుం

దున్నప్పుడు అల్పములగు కామక్రోధాది జంతుజాలముకూడ పైనబడి పీల్చి పిప్పిచేయును. నిద్రలేవనిచో ఇంకను నానా బాధ లకు లోనుగావలసి యుండును. కాబట్టి మహాశయులారా ! ఇకనైనను జనులు మేల్కాంచి తమ జన్మహక్కైన స్వారా జ్యాధిపత్యమును బడయుటకు యత్నింపవలయును' మానవ జీవితము తమస్సున గడిపివేయుటకు ఏర్పడలేదు.

(Awake! Arise! Stop not till the goal is reached)
ఉత్తిష్ఠత ! జాగ్రత ! ప్రాప్యవరాన్నిబోధత!-లెండు ! మేల్కొ నుడు. లక్ష్యమగు పరమాత్మను జేరువరకు వెనుకంజ వేయ కుడు ! అని యుపనిషత్తు లుద్ఘోషించుచున్నవి. మహనీయు లున్ను హెచ్చరిక చేయుచున్నారు. ఇప్పటికే కాలాతీతమైనది. మన పుణ్యభాగ్యముచే నిక్షేపమువంటిమానవజన్మ దొరికినది. దానిని సదుపయోగ మొనర్చుకొనవలెను.

పునర్గ్రామః పునఃక్షేత్రం పునర్విత్తం పునర్ధనం
పునశ్శుభాశుభం కర్మ న శరీరం పునఃపునః (గరుడపురాణము.)

'గ్రామము పోయిన మరల సంపాదించుకొనవచ్చును. పొలము చేయిజారిన తిరిగి సంతరించుకొనవచ్చును. ధనము పోయిన మరల సేకరించుకొనవచ్చును.అట్లే శుభాశుభకర్మలున్ను మరల చేసికొనవచ్చును. కాని పోయిన శరీరము మాత్రము మరల ఎన్నటికినిరాదు' అని విష్ణుభగవానుడు గరుత్మంతున కుపదే శించెను. కాబట్టి ఈశ్వరదత్తమగు ఈ సదవకాశమును జార విడువక, సత్సాంగత్య, సదాచార, సన్నిష్ఠలచే సర్వులునుజీవిత మును పునీతమొనర్చుకొని భగవత్సాన్నిధ్యమును జేరుదురు గాక ! పురుషుడు పురుషత్వముతో తృప్తినొందక పురుషోత్త

ముడుగా మారుటకు యత్నించునుగాక! అదియే జీవిత లక్ష్యము. అదియే పరమగమ్యము. అద్దానిని కార్యాన్విత మొనర్చినచో ఇక జీవుడు 'బుద్ధిమాన్స్యాత్ కృతకృత్యశ్చ భారత' అనునట్లు కృతకృత్యుడును, కృతార్థుడును కాగలడు. సందియము. లేదు.

ఓమ్ తత్ సత్.



ఓమ్

# 16-వ అధ్యాయము

# దైవాసుర సంపద్విభాగ యోగము

సిద్ధాంతములను ప్రతిపాదించుటకంటే అనుష్ఠానమును నొక్కి-చెప్పుట గీతాచార్యునకు పరమప్రీతి. ఈసత్యము గీతా పాఠకులందఱికిని సువిదితమే అయియున్నది. కాకున్న, 2 వ అధ్యాయమున స్థితప్రజ్ఞునిఘట్టమందు సాధకులకు అత్యంతోప యుక్తములైన ఎన్నియో పద్ధతులను నేర్పి, అంతటితో తనివి నొందక మరల 12 వ అధ్యాయమున అద్వేష్టృత్వాద్యనేక సుగుణములను పేర్కొ-నెను. పోనిండు,వానితో తృప్తినొందెనా యనిన, మరల వెనువెంటనే 13 వ అధ్యాయమున అమానిత్వాదిజ్ఞానలక్షణములను పెక్కింటిని వరుసగా జెప్పసాగెను. అంతటితో ఇక సాధనసంబంధవిషయములకు భరతవాక్యము చెప్పెనాయనిన, కాదు. ముముక్షువులపై కరుణామృతవర్ష మును కురిపించెనా యనునట్లు మరల 16 వ అధ్యాయమున 'అభయం' అని మొదలుపెట్టి ఇరువదియారు దైవికగుణము లతో గూడిన ఒక పెద్ద జాపితా తయారుచేసిపెట్టెను. సాధకులపై భగవానునకుగల ప్రేమకు హద్దుపద్దులు లేకున్నవి-మఱియు సిద్ధాంత ప్రతిపాదనకంటె అనుష్ఠాన నిర్వాహణమే

చాల గొప్పదని ఇట్టి బోధనలద్వారా గీతాచార్యుడు జనులకు తెలియజేయుచున్నాడు.

మనుజునకు సాధ్యవస్తువుపై గల ప్రీతిలో ఏయొక భాగమైనను సాధనయందు వినియోగింపబడినచో లక్ష్యము కరతలామలకము కాగలదు. కాని అట్లు జరుగుట లేదు. ప్రతివారికి కావలసినది దేవుడు. ఆ దేవుడు చాల గొప్పవాడే. అంత మాత్రముచేత జీవునకు కలుగు ప్రయోజనమేమి. ఆ దేవుని పొందుటకు వలయు మార్గమునుగూర్చి అతడు యోచించుచున్నాడా! తన్ను జేరుటకు అవలంబించవలసినపద్ధతి పరమాత్మ కరుణతో గీతాది సద్గ్రంథములందు, ఉపనిషత్తులందు, వేదశాస్త్రములందు ప్రబోధించి అద్దాని ననుసరించవలసినదిగా హితవు జెప్పుచున్నాడు. ఆ మార్గమును జేబట్టిననే జీవుడు ఆ దేవుని పొందగలడు. సాధనను గట్టిగ పట్టుకొనిననే కాని అది సాధ్యవస్తువు దగ్గఱకు గొనిపోజాలదు.

పుంసః ప్రధాన సిద్ధ్యర్థ మంగస్యాశ్రయణం ధ్రువమ్
కర్తవ్య మంగహీనం చేత్ప్రధానం నైవ సిద్ధ్యతి.

'ప్రధానవస్తువు లభించవలెననిన, దాని అంగమును, సాధనను తప్పక ఆశ్రయించవలెను. అట్లాశ్రయించనిచో ఆ ప్రధానవస్తువు ఎన్నటికిని లభించదు.' భారతదేశము తన పూర్వపు ఔన్నత్యమును ఇపుడు పొందజాలకపోవుటకు కారణము లక్ష్యమునందుగల ఆసక్తి లక్ష్యసాధనయందు లేకపోవుటయే యని జ్ఞప్తియం దుంచుకొనవలెను. ఈ పద్ధతి గీతాచార్యునకు సరిపడదు. అందువలననే జ్ఞేయమును తక్కువగా జెప్పి జ్ఞానమును ఎక్కువగా జెప్పెను గీతలో. ధ్యేయమును ఒకింత

జెప్పి ధ్యానమును విస్తారముగ బోధించెను. 'సాధ్యమును' మితముగ దెల్పి సాధనను మిక్కుటముగ ప్రతిపాదించెను. ఈ పదునాఱవ అధ్యాయమును తెలివగనే పాఠకునకు స్థితి యంతయు కండ్లకు గట్టినట్లగపడగలదు.

ఈ అధ్యాయమునకు దైవాసుర సంపద్విభాగయోగ మని పేరు. దైవసంపద, అసురసంపద రెండునుఇందు పేర్కొన బడియుండుటచే అట్టి పేరు వచ్చినది. సంపద యనగా సిరి, ఐశ్వర్యము, ధనము. సామాన్యముగ లోకములో సువర్ణము, ఆభరణములు, భవనములు, క్షేత్రములు, కట్టెన్నినోట్లు, డాలర్లు మున్నగునవి ధనమని, సంపదయని ప్రాపంచిక జనులు తలంచుచుందురు. కాని భగవంతుని దృష్టియందు సచ్ఛీలమే ధనము, సదాచారమే సంపద, బ్రహ్మజ్ఞానమే ఐశ్వర్యము. ప్రాపంచికధనముతోటి సంబంధము మనుజునకు ఈశరీరముండు వఱకే. శరీరవియోగముచే ఆ రెండింటికిని ఎడబాటుకలుగును. 'ఐశ్వర్యపాటికి ఐశ్వర్యము, వీడిపాటికివీడు' వేరైపోవుదురు. జ్ఞానసంపద అట్లుకాదు. ఉత్తమసంస్కారరూపమున అయ్యది ఆమోక్షము వానివెంటనే యుండి, నీడవలె వెంబడించుచు అభ్యుదయపథమున అతనిని ప్రవేశపెట్టుచు తుట్టతుదకు గమ్యమును చేర్చును. కాబట్టి భౌతికసిరిసంపదలకంటె ఎన్నిరెట్లో శ్రేష్ఠతరమైనది ఈ ఆధ్యాత్మికసంపద. కనుకనే మహనీయులు భౌతికముగ ఈశ్వరుడిచ్చినదానితో సంతృప్తిపడి పారమార్థిక ఐశ్వర్యమునే అభివృద్ధి నొందించుటకు యావచ్ఛక్తి ప్రయత్నించుదురు.

మనుజుని విలువ అతని రూపసౌందర్యములందు లేదు. ఆస్తిపాస్తులందు లేదు, సంతతియందు లేదు, క్షేత్రవిత్తాదులందు లేదు, విద్యావైదుష్యమందు లేదు, శీలమందుమాత్రమేకలదు; భక్తియందుమాత్రమే కలదు; పారమార్థిక సుగుణములందు మాత్రమే కలదు.

పూర్వమెప్పుడో కాశీవిశ్వనాథుని దేవాలయప్రాంగణమున ఆకసమునుండి ఒక బంగారుపళ్ళెరముఅకస్మాత్తుగపడెనట. ఆ పళ్ళెరముపై 'నాభక్తునకు' అను అక్షరములు వ్రాయబడి యుండెను. తళతళమెరయుచున్న ఆపసిడిపళ్ళెరమును గాంచుటతోడనే అచట పూజచేయుచున్న పూజారి వెంటనే పరుగెత్తుకొనివచ్చి పేరాశచే దానినిపట్టుకొని పారిపోవనెంచెను. కాని ఏమి దురదృష్టమో, దానిని తాకగానే అది మట్టిపళ్ళెరముగ మారిపోయెను. ఆ మట్టిమూకుడుజూచి ఏవగించుకొని పురోహితుడు దానిని జారవిడువగనే తత్క్షణమే యది మరల హిరణ్మయరూపమున చెన్నొందెను. ఈ ప్రకారము ఎందఱోవచ్చి దానిని తాకిరి. కాని తత్క్షణమే అది మృణ్మయముగ మారిపోవుచుండెను. వారు వదిలినవెంటనే మరల బంగారువస్తువుగ వెలుగొందుచుండెను. రాజులు వచ్చిరి, మహారాజులు వచ్చిరి, చక్రవర్తులేతెంచిరి, కవిపుంగవులువచ్చిరి.విద్యావాచస్పతులరుదెంచిరి. పెక్కు డిగ్రీలుకలవారు వచ్చిరి, బలవంతులు వచ్చిరి. సింహపరాక్రమశీలురగు మల్లు లరుదెంచిరి. వాజపేయులు వచ్చిరి. ఉపన్యాసకర్తలు వచ్చిరి. కాని ఎవరుతాకినను, మరుక్షణమే మట్టిగామారుచుండెను. ఈ వింతనుజూచుటకు దూర దూర ప్రాంతమునినుండి జను లేతెంచిరి. మందిర మంతయు

జనసమ్మర్దముతో గూడియుండెను. వచ్చినవారిదగ్గఱ యాచించుటకు బిచ్చగాళ్లు, వికలాంగులుకూడ వచ్చి బారలుతీర్చి కూర్చొనియుండిరి. ఈ సంరంభమంతయు జూచి ఆశ్చర్యపడి ఒకానొకడు అసలు విషయ మేమియో తెలిసికొనవలెనని మెల్లగా మందిరములోనికి పోవుచుండెను. దారిలో కూర్చొని యున్న కుంటి గ్రుడ్డివారలజూచి అతనిహృదయము ద్రవించిపోయెను. కంటివెంట బాష్పములు రాలుచుండెను. కాని వారికి సహాయము చేయటకు ఆతనియొద్ద కా సెచట? కడుబీదవాడు. ఎట్లో గుండెనిబ్బరము చేసికొని లోని కేగి ఆబంగారు పళ్లెరమును తాకెను. కాని ఏమియాశ్చర్యమోకాని అట్లు తాకినను అది తన సహజలావణ్యసువర్ణచ్ఛాయలను వీడలేదు. చుట్టునున్న వారందఱున్ను జయజయధ్వానములు చేసిరి. భగవంతు డెన్నుకొనిన వీరు డితడే యని సర్వులును ఆనందపడి

ఆతనికి విద్యలేదు; ధనములేదు; ప్రాపంచిక కీర్తులులేవు. కాని హృదయకోమలత్వముమాత్రముకలదు. దయ, ప్రేమ, కరుణ అతనియందు తొణికిసలాడుచుండెను. అదియే అతని ధనము, అదియే అతని సర్వస్వము. ఇన్నికోట్లమంది జీవరాసులలో అ ఒక్కడే భగవంతునకు ప్రీతిపాత్రు డెట్లు కాగల్గెనో ఒకింత యోచింపుడు ! జీవితములో ఎద్దానియందు దృష్టిని ఎక్కువగా కేంద్రీకరించవలెనో ఆలోచించుడు. ధనముండుగాక, విద్యయుండుగాక, భవనములుండుగాక, క్షేత్రములుండుగాక, కాని వానితోపాటు కోమలహృదయముకూడ నుండవలెను. దైవీసంపత్తికూడనుండవలెను. అంతఃకరణశుద్ధత్వము కూడ నుండవలెను. సర్వేశ్వరునియెడల అచంచలమైన భక్తి

సర్వభూతకోట్లయెడల దయ-ఇవి ప్రధానముగ నుండవలెను. తక్కినవి యెట్లున్నను మనుజుడు తన నైతిక, ఆధ్యాత్మిక (moral and spiritual) దృష్టిని పూర్ణముగ వికసింపజేసి కొనవలెను. కేవలము భౌతికబలముపై నాధారపడువాడు ఎప్పటికైనను పతనమొందియేతీరును. నిరాశానిస్పృహలను ఎదుర్కొనును. తుట్టతుదకు అపజయమునే వరించును.

విశ్వామిత్రుడు మొట్టమొదట తన శారీరక, మానసిక బలములపై ఆధారపడి భౌతికశక్తినే నమ్ముకొని 'ఇదం బ్రాహ్మం, ఇదం క్షాత్రం, శాపాదపిశరాదపి'-అను సమరనాద మును గావించుచు, వసిష్ఠునితో పోరునకు తలపడెను. వసిష్ఠు డేమియు చలింపక తన బ్రహ్మదండమును అడ్డుగాబెట్ట విశ్వా మిత్రుని అస్త్రశస్త్రములన్నియు దానిచెంత కుంఠితములై పోయెను. అదిగాంచి విశ్వామిత్రుడు-

ధిక్ బలం క్షత్రియబలం బ్రహ్మతేజోబలం బలమ్.

ఛీ ! ఈక్షత్రియబలమునకు ధిక్కారమగుగాక! బ్రహ్మబలమే బలము. దైవబలమేబలము. ఏలయనగా వసిష్ఠుని ఒక్క బ్రహ్మ దండముచే నాయొక్క అస్త్రశస్త్రములన్నియు వమ్మైపోయి నవి! అని బిగ్గఱగా అరచెను. అప్పటినుండియు విశ్వామిత్రుడు దైవశక్తియొక్క అద్భుతమహిమను గుర్తెఱిగి తీవ్రతర సాధ నలగావించి ఎట్టకేలకు బ్రహ్మర్షి అయ్యెను.

భౌతికశక్తులను నమ్ముకొని, అవియే తన్ను కడతేర్చ గలవని భావించిన దుర్యోధనునిగతి యేమైనదో మీకందఱి కును తెలిసియే యున్నదికదా! 'అక్షౌహిణుల సైన్యము కావలెనా, నేనొక్కడను కావలెనా' అని శ్రీకృష్ణమూర్తి

అర్జున, దుర్యోధనుల నిరువురిని ప్రశ్నించినపుడు, 'నాకు సైన్యమే కావలెనని ధార్తరాష్ట్రుడు, నీ వొక్కడవే నాకు చాలునని కౌన్తేయుడు' పలికిరి. తుదకు విజయము అర్జునుని పక్షము నే వరించెను. చరిత్రయందిట్టి దృష్టాంతరములు కొల్లలుగ గలవు. సున్న (Zero) ఎంత పెద్దదైనను 'ఒకటి' అను సంఖ్యకంటె తక్కువే అని విజ్ఞులు గ్రహించవలెను. స్వప్నస్థ సైన్యము కోట్లసంఖ్యలో నున్నను, మేలుకొనిన ఒక్కమనుజునకు తీసికట్టేయని వివేకవంతులు తెలిసికొనవలెను. భూతాకాశము యొక్క వికారములగు ఈ జగత్ప్రదార్థము లెచట. చిదాకాశ స్వరూపమగు పరమాత్మ యెచట! భౌతికశక్తి లెచట! ఆధ్యాత్మికబల మెచట! రెండిటికిని సంబంధమే లేదు. ఒకటి జడమైనది. రెండవది చైతన్యవంతమైనది.

ప్రపంచములో నేడు విజ్ఞానశాస్త్రము వికసించి పెక్కు నూతనావిష్కరణములకు హేతువైనది. భయంకర మారణాస్త్రములను జనులు కనిపెట్టిరి. కాని వానియన్నింటిచేగూడ శాంతిని కొనగల్గిరా? అన్ని పాంచభౌతికశక్తులు తమ చెంతనే యున్నప్పటికిని సుఖమును నోచుకొనగల్గిరా? సామాన్యునకున్న శాంతిసుఖములుకూడ వారికి లేవు. తుట్టతుదకు ఆయుధములను పారవేసినకాని శాంతికి ఆస్కారములేనట్లు గ్రహించి 'నిరాయుధీకరణము' కొఱకు అన్ని దేశములవారు ప్రయత్నించుచుండుట మనము గమనించుచున్నాము గదా!

'The whole of western civilization will crumble to pieces in the next fifty years if there is no spiritual foundation ...... and what will save Europe is the religion of the Upanishads'.

'ఆధ్యాత్మికమగు పునాదిలేనిచో పాశ్చాత్య నాగరికత యూపత్తు రాబోవు అర్ధశతాబ్దములోకూలి తునాతునకలై పోగలదు... ఉపనిషత్తులందు తెలుపబడిన పరమార్థతత్త్వమే యూరపి దేశ మును పతనమునుండి సంరక్షింపగలదు' అని వివేకానందులు శంఖారావముగావించిరి. కావున నిర్మలనైతికవర్తనముద్వారా జీవుడు తనయందుగల నిగూఢ ఆధ్యాత్మిక శక్తులను బహిర్గత మొనర్చుకొనవలెను. అట్టి సచ్ఛీలసదాచరణనే ఈ అధ్యాయ ప్రారంభమున దైవీసంపద్రూపముగ శ్రీకృష్ణపరమాత్మ తెలిపి యున్నాడు. జన్మజన్మాంతరములనుండి అజ్ఞాన ప్రభావముచే జీవుని యంతఃకరణమున ఆసురికశక్తులు తాండవమాడు చుండెను. వాటిని అరికట్టువారు లేకపోయిరి. అట్టి తాహతు జీవునకు లేకపోయెను. కనుకనే యవి విచ్చలవిడిగ తిరుగాడు సాగెను. చీకటి ఎంతెంత దట్టముగ నుండునో, అంతంత అధికముగ నిశాచర ప్రాణులు సంచరించుచుండును. చీకటి తగ్గినకొలది వాటి సంఖ్యయు తగ్గుచువచ్చును. కావున అవి వేకము, అజ్ఞానము,అవిద్యయను అంధకారము అంతఃకరణము నావరించియుండుటవలన కామక్రోధాదినిశాచరవర్గముయొక్క దుశ్చేష్టలకు పట్టపగ్గము లేకుండపోయెను. కాని సౌభాగ్య వశమున మానవజన్మ లభించి జీవు డొకింత కండ్లు తెరువగా, తనయందింతకాలము కరుగుచున్న అసుర ప్రభుత్వ దురా చారములన్నియు అతనికి ప్రత్యక్షముగ నగపడజొచ్చెను. అపుడు వెంటనే పురుష ప్రయత్నము నాశ్రయించి ఆ దుష్ట వాసనలను దుస్సంస్కారములను దుర్వృత్తులను ఒక్కొక్కటిగ ఏరి పారవేయుటకు కృతనిశ్చయుడయ్యెను. ఇదియే మానవత.

ఆసురికమగు పాత్రప్రభుత్వమును తొలగించి దైవికమగు క్రొత్తప్రభుత్వమును స్థాపించుటయే మానవత్వ చిహ్నము. ప్రాకృతిక గుణములను పారద్రోలి పవిత్రగుణములను జేర్చు కొనుటయే జన్మసార్థకత.

అకృత్వా శత్రుసంహార మగత్వాఽఖిల భూశ్రియమ్
రాజాహమితిశబ్దాన్నో రాజాభవితుమర్హతి. (వివేకచూడామణి)

'శత్రువులను సంహరింపక, సకల భూమండలాధిపత్యము నొందక 'నేను రాజును'అని అనుకొనినంతమాత్రముననే ఎవడైనను రాజగునా ?' అని శ్రీశంకరాచార్యులవారు ప్రశ్నించిరి. అట్లే అరిషడ్వర్గమును జయింపక, నిరతిశయానందరూప ఆత్మ సామ్రాజ్యమును బడయక, దైవీసంపదను జేబట్టక, 'నేను ముక్తుడను' అని అనుకొనునంత మాత్రమున ఎవడును ముక్తుడు కానేరడు. జన్మాంతర దుష్టవాసనలు అత్యంత బలీయములైనవి. ఒక్కొక్కదానినిపట్టి బాగుగ విచారించి హృదయకుహరమునుండి దానిని పారద్రోలవలెను. మనుష్యుడై పుట్టినందులకు ముఖ్యముగ ఆచరించవలసిన కార్యమిదియే. తన పూర్వపు సంస్కారములను మార్చుకొనవలెను. ఒక్కొక్కనికి లెక్కలేనన్ని చెడ్డ అలవాట్లుండును. అభ్యాస వశమున వానినన్నింటిని పోగొట్టుకొనవలెను. ఒక చిన్న అలవాటును మార్చుకొనలేనివారు మాయ నెట్లు జయించ గలరు ? జంతువునకును మనుష్యునకును గల భేద మిచటనే యున్నది. జంతువు తన జన్మాంతర సంస్కారమును మార్చు కొనజాలదు. పులి తన క్రౌర్యమును విడనాడజాలదు. నక్క తన కాపట్యమును వదలలేదు. కాని మనుష్యుడు 'జన్మతః'

తనకు గలిగిన క్రూరస్వభావమును 'కర్మతః' మార్చుకొనగలడు. పురుషప్రయత్నముచే సన్మార్గావలంబి కాగలడు.

చిన్నపిల్లలు చదువుకొను పుస్తకములలో ఒక కథ కలదు. పూర్వ మొకానొక యరణ్యమున అనేక మృగములు నివసించుచు చక్కని కాలక్షేపము చేయుచుండెను. ఒకనాడు నక్క కొకదానికి ఆకస్మికముగ నొక ఊహతట్టెను. బ్రహ్మదేవుడు ఎనుబదినాలుగు లక్షల జీవరాసులను విశ్వమున సృజింప ఒక్కమానవుడే ప్రాణులందఱిలోను గొప్పవాడుగ ఏల చలామణియగుచున్నాడు ? బలములోగాని, ఆకారములోగాని, ఊహాపోహాలలోగాని, తిండిలోగాని, మోసములోగాని మానవుని మించన శక్తియుక్తులుగల ప్రాణికోట్లు ఎన్నియో యుండ, మానవుడు తానే గొప్పయని తలంచుట వెఱ్ఱి ! శాస్త్రాదులా ప్రకారము ఆదేశించుటయు, అందులకు సమ్మతించుటయు చాల ఘోరము. అది కేవలము పక్షపాతమే యగును. కావున నిజానిజములు తేలవలెను. ప్రపంచములో మానవుని యాధిక్యతను నే నిపుడు 'సవాల్' చేయగలను. ఈ విషయము తాడో-పేడో తేలువఱకు నేనిక నిదురపోను అని నిశ్చయించి అదేపనిగట్టుకొని అరణ్యమంతయు తిరిగి తిరిగి ప్రతిమృగమునకును తనకుగల్గిన యభిప్రాయమును నచ్చజెప్పి వాటిని రెచ్చగొట్టి, వాటికి రోషమును కల్పించి తన వెనుక వేసికొనగల్గెను. ఈప్రకారముగ అరణ్యములోని జంతుజాలమంతటిని నక్క ఒకచోట సమావేశపఱచి, ఆ చతుష్పదమహాసభయం దిట్లు ఉపన్యసింపదొడంగెను.

'సోదరులారా ! మన మృగజాతియొక్క చరిత్రయందు నేడు సువర్ణాక్షరములతో లిఖింపదగిన సుదినమై యున్నదని మీరందరును జ్ఞప్తియందుంచుకొనవలెను. ఏలయనగా, ఈ అనంతవిశ్వమందు కోట్లకొలది ప్రాణికోటులుండ, ఒక్క మానవుడు స్వార్థచింతనచే ప్రేరితుడై తన్ను సర్వోపరి స్థానమున నిలబెట్టుకొనియున్నాడు. అతని యభిప్రాయమునకు శాస్త్రములున్ను తాళము కొట్టినవి. ఇది సహింపరాని విషయము. దీనిని చులకనగ వదలివేయుట మన మృగజాతికే తీరని కళంకము. బలమందా, యోచనయందా, ఆకారమందా దేనియందు వానికంటె మనము తక్కువ ? సోదరులారా ! తీవ్రముగ యోచింపుడు ! మన జాతిపై అభిమానము గల్గి యుండుడు ! మన జాతిలోగల అమానుషశక్తులను ఢంకా బ్రమోగించి నలుగురికిని చాటుడు. సృష్టిలో మానవుడుకాదు, ఒకానొక జంతువే సర్వోపరిస్థాన మలంకరించుచున్నది అను తీర్మానమును ఏకగ్రీవముగ సర్వులును ఆమోదించినంత వఱకును మన కర్తవ్యము అపూర్ణముగనే యుండునని మఱువకుడు. ఇక్కార్యసాధనకై మనమందరమును ఇపుడు సమీపమున గల ఒకానొక మహర్షిసత్తమునియొద్దకుపోయి విషయమంతయు సాకల్యముగ నతనికి మనవిచేసెదము. మీమీశక్తులను, స్వభావములను ఆతని సమ్ముఖమున వ్యక్తముచేయుడు' అని గంభీరముగ బలికి వాటినన్నిటిని అటకు గొనిపోయెను.

మహర్షియొక్క అధ్యక్షతక్రింద జంతునివహమంతయు సమావేశమయ్యెను. అందఱును నిశ్చలముగ గూర్చుండిరి. ఇంతలో ఏనుగు లేచి 'మహాత్మా ! నాకు గల బలములో

నూఱవవంతైనను మనుష్యునకు లేదు. ఆకారమున మాత్రమా నావమోకాలంత స్వరూపముకూడ అతనికిలేదు. అట్టిచో మానవు డేల గొప్పవాఁడగును?' అని రోషముతో బల్కి కూర్చుండెను. ఇంతలో సింహములేచి తన పరాక్రమమును చాటుకొని మానవుని యల్పత్వమును బుజువుచేసెను. ఇట్లు అన్ని జీవరాసులున్ను తమ విలక్షణగుణములను ఉగ్గడించి, జంతువుల శ్రేష్ఠత్వమును చాటుకొనెను. మఱియు అమ్మహర్షిని తీర్పునివ్వవలసినదిగా వేడుకొనెను. అత్తఱి మహర్షి వాటి వాదములన్నిటిని ప్రశాంతముగ నాలకించి తుద కిట్లు పలికెను- 'ఓ మృగసత్తములారా! మీరు చెప్పినది యంతయు పరమ సత్యము! మీమీ శక్తులముందు మానవుడు గణనకే రాడు. కాని ఒక్క విషయములో మాత్రము మానవుడు మిక్కిలి యధికుడు. పుట్టుకతోవచ్చిన దుష్టసంస్కారములను మీరు మార్చుకొనలేరు. మానవుడు మార్చుకొనగలడు. ఇదియే అతని ఆధిక్యతకు కారణము, ఇదియే మీకును అతనికిని గల భేదము.' ఋషిసత్తముని గంభీరవిజ్ఞానపూరితములగు ఆ పలుకులను విని నక్క తత్క్షణమే లేచి 'అయ్యా! మహానుభావా! పుట్టుకతోవచ్చిన దుష్టసంస్కారమును మార్చుకొనగల్గుటచే మానవు డధికుడని తాము సెలవిచ్చితిరికదా! అట్లు మార్చుకొననిచో?' అని ప్రశ్నించెను. 'మార్చుకొననిచో మీయందరికంటెను మనుజుడు నీచాతినీచుడే,' అని యాతడు తేల్చి చెప్పివేసెను. న్యాయపరిపూర్ణములును, పక్షపాతరహితములు నగు అమ్మహర్షి వాక్యములను విని జంతువులన్నియు '[illegible], భేష్' అని సంస్తుతించుచు అచ్చోటువీడి చనెను.

కాబట్టి జనతః సంక్రమించిన 'ఆసురీసంపద' ను ప్రాకృతవాసనలను, పురుషప్రయత్నముచే తొలగించుకొని, "దైవసంపద"ను జేబట్టుటవలననే మానవత్వము సార్థకత జెందుచున్నది. 'మాయా'గుణములను పారద్రోలుటవలనను, ఆత్మను దర్శించుటవలనను మానవుడు తనయునికిని సఫల మొనర్చుకొనుచున్నాడు. ఇంగ్లీషులో మానవుని 'మ్యాన్' (MAN) అందురు. దాని వ్యుత్పత్త్యర్థమును జూడుము.

M=Maya-Remove
A=Atman-See
N=Nissvan-Attain

By Removing Maya, see Atman and there by attain Nirvan

"మాయను తొలగించి, ఆత్మను సందర్శించి, నిర్వాణరూపమగు మోక్షమునొందు'మని మానవశబ్దము జనులను ప్రేరేపించుచున్నది. మానవశబ్దము స్ఫురించిన వెంటనే ఈ మహోన్నత భావములు హృదయమున ద్యోతకములై జనులను కర్తవ్యమునకు పురిగొల్పవలెను. కావున ఇక కాలవిలంబనము చేయక దైవసంపదను లెస్సగ అభ్యసించుచు రావలెను. 'మన చిత్తమంతయు దుష్టవాసనలతో నిండి నిబిడీకృతమైయున్నదే, ఇట్టి సద్వాసనలు సత్సంస్కారములు మనకు అబ్బునా?' అని యెవరును నిరుత్సాహపడవలసినపనిలేదు. పాపి పుణ్యాత్ముడగుటకే ఈశాస్త్రములు, వేదములు, పురాణములు - అని యెవరును మఱువరాదు. 'క్షిప్రంభవతి ధర్మాత్మా' - సుదురాచారవంతుడుకూడ అభ్యాసవశమున, భగవద్భక్తి సాహాయ్యమున శీఘ్రముగ ధర్మాత్ముడు కాగలడని వచించి భగవానుడు జీవుల హృదయములందు ధైర్యసంచారమును గావించి యుండెను

గదా! నిరంతరసాధనచేతను. తీవ్రతర అభ్యాసముచేతను ఎటువంటి కార్యమునైనను జగత్తులో సాధించవచ్చును. ఇక దుస్సంస్కారములను పోగొట్టుట ఒక లెక్కా ?

నావిజ్ఞాతం న చాగమ్యం నాప్రాప్యం దివి చేహవా
ఉద్యతానాం మనుష్యాణాం యతచిత్తేంద్రియాత్మనామ్.

'ప్రయత్నశీలురును, ఇంద్రియనిగ్రహపరులగు మనుజులకు ఇహలోకమునగాని, పరలోకమునగాని, తెలిసికొనబడనిదియు, పొందబడనిదియునగువస్తువున్ను ఉండదు' అని శాస్త్రవాక్యము, మనుజుల మాటేల జంతువులకుకూడ చక్కని శిక్షణ యిచ్చి కొందఱు వాటిచే అపూర్వకృత్యములను చేయించుచుండుట మనముగాంచుచున్నాము. సర్కసులోనికోతిసైకిల్ త్రొక్కును. ఏనుగు డోలువాయించును; సింహము తన కరాళవదనమున మానవుని శిరంబును దూర్చుకొని అతని నేమియు బాధింపక యుండును, జంతువే నిరంతరసాధనచే అపూర్వకార్యముల నాచరించుచుండ ఇక మానవు డేల చేయజాలడు ? తన దురలవాట్లను ఏల పోగొట్టుకొనలేడు, తప్పక పోగొట్టుకొన గలడు. కాని పట్టుదల, శ్రద్ధ, అధ్యవసాయము, లక్ష్యముసందు ప్రీతి ఇవి మాత్రము తప్పక ఉండవలెను. ఇవ్విధముగ పట్టుదలతో ఈ జీవితమునందే దైవసంపదను సాధించివేయుటకును తద్ద్వారా పరమానందప్రాప్తి నొందుటకున్ను మానవుడు కృతనిశ్చయుడు కావలసియున్నది. ఇక, శ్రీకృష్ణభగవానుడు వర్ణించిన ఆదైవసంపద యెట్టిదో ఒకింత విచారించెదము-

'అభయం' అని ప్రారంభించి ఇరువదియారు సద్గుణము లను పరమాత్మ పేర్కొనెను. అవి యేవి యనిన-(1) నిర్భ

యత్వము (2) అంతఃకరణశుద్ధి (3) జ్ఞానయోగమునందు నిలుకడ (4) దానము (5) ఇంద్రియనిగ్రహము (6) యజ్ఞము (7) అధ్యయనము (8) తపస్సు (9) ఋజుత్వము (10) అహింస (11) సత్యము (12) క్రోధము లేకుండుట (13) త్యాగము (14) శాంతి (15) కొండెములు చెప్పకుండుట (16) సర్వభూతదయ (17) విషయ లోలత్వము లేకుండుట (18) మృదుస్వభావము (19) ధర్మవిరుద్ధకార్యములందు లజ్జ కలిగియుండుట (20) చపలత్వము లేకుండుట (21) బ్రహ్మతేజస్సు (22) ఓర్పు (23) ధైర్యము (24) శుచిత్వము (25) ద్రోహముచేయకుండుట (26) నిరభిమానము. ఈ ఇరువదియారు సుగుణములున్న జీవుని యంతఃకరణమును పునీతమొనర్చి ఆత్మసాక్షాత్కారమునకు అనువైన వాతావరణమును కల్పించును. ఇవి కలిగియుండనిచో ఎవరును ఏ కాలమందును ఏ ఇతర ఉపాయములచేతను బ్రహ్మానుభూతిని బొందజాలరు మనుజునకు ఇవియే భూషణములు. శీలమే జీవునకు అలంకారము. శీలము చెడినచో కోట్లకొలది ప్రాపంచిక విభవము లున్నప్పటికిని మనుజుడు కించిత్తైనను విలువయుండడు. సామాన్యులు బాహ్య సౌందర్యమును వీక్షించుదురు. భగవానుడు అభ్యంతర లావణ్యమును పరికించును. అంతఃకరణ నిర్మలత్వమునే యాతడు కాంక్షించును గాని వేషభాషలనుగాదు.

## Character is ¾ religion

'సచ్ఛీలమే మూడుపాళ్ళమత'మని చెప్పబడినది. అదిలేనిచో ఇక మతమునకు నామరూపములే యుండవు. ఒకవేళ ఉండి

నను కళాకాంతులు ఉండవు. జనులు తమ శీలమునకు చరిత్రకు ప్రాధాన్య మొసంగక, మతమునందలి బాహ్య ఆచారములందే పట్టుదల వహించుచు పోయినచో, కొలది కాలమున కా మతము నిర్వీర్యమై నిస్తేజమై క్షీణించిపోగలదు. ఒకవేళ ఉన్నప్పటికిని లోన చెదలు తొలచివేసి బయటకు ఆకారమాత్రముగ కన్పించు కొయ్యస్తంభ మువగిదియుండును. చేవ అంతరించిపోవును. కాబట్టి బాహ్య ఆచార విచారములతోపాటు అంతఃకరణవిశుద్ధత్వము యెడల అతిజాగరూకత కలిగియుండవలెను. శ్రీకృష్ణపరమాత్మ సచ్చరిత్రసంపాదనను గీతయం దిన్నిపర్యాయములేల ప్రస్తావించవలెను ? ఏ అధ్యాయము పరికించినను ఇదే విషయము కానిపించుచున్నదే. జీవునకు ఏది అవసరమో అది దేవునకు తెలియును కనుకనే సాధకులపై కరుణగల్గి తారణోపాయమగు సచ్ఛీలసంపాదనను భగవానుడు గీతయందు పదేపదే ప్రతిపాదించెను.

శ్రీకృష్ణపరమాత్మ ఇరువదియారు సల్లక్షణములతో గూడిన దైవీసంపదను అర్జునునకు బోధింపదలచి మొట్ట మొదట ఏగుణమును చెప్పెదమాయని ఆలోచించెను. ప్రథమ తాంబూలము దేనికి ఒసంగిన మంచిది అని యోచనచేసెను. ఏలయనగా సైన్యములోవలె సద్గుణములందును ఒక నాయకుడు, అధిపతి (captain) ఉండవలెను. (సైన్యమునకేకాదు, ప్రభుత్వమువారు ఏర్పాటుచేయు ఏ చిన్నసంఘమునకు కుండ ఒక అధినేత ఉండును, పనివారిలోగూడ "మేస్త్రి"అని ఒకడు పెద్దగ నుండును, జీవుడు ప్రకృతితో (మాయతో) భీషణ సంగ్రామము గావించవలసియున్నాడు. కాబట్టి సుశిక్షణకలిగిన

మంచిసైన్యము, ఆసైన్యమున కొకనాయకుడు, శక్తివంతము లగు అస్త్రశస్త్రములు మున్నగునవి యన్నియు కావలసి యున్నవి. శత్రుపక్షమునందు మాయ వేలకొలది జన్మలనుండి యుద్ధమునకు సన్నాహములు చేసికొనుచు, దుర్వాసనలను, దుర్వృత్తులను, ఆసురీసంపదలను కోకొల్లలుగ జేర్చుకొని మహాపటిష్ఠముగ తన స్థితిని నిలబెట్టుకొనియున్నది. ఇక సద్వానితో పోరుసల్పవలెననిన ఎంతటి గుండెనిబ్బరము గలిగిన యోధులు కావలయునో, ఎటువంటి తేజశ్శాలియగు నాయకుడు ఏర్పడవలయునో యోచించుకొనుడు. యుద్ధమునకు ముందుగా ప్రజలనుండి సైనికులను సమీకరించుదురు. (Recruitment) బలశాలురు, ధైర్యవంతులు నగువారిని ఏరుకొందురు. అట్లే శ్రీకృష్ణపరమాత్మ ప్రపంచములోగల సద్గుణములన్నిటిలో ఇరువదియారింటిని మాత్రము ముఖ్యముగ ఏరుకొని, వాటికన్నింటికిని 'అభయం' అను సద్గుణమును నాయకుడుగా జేసెను. ఇవి యన్నియు కలిసి అసుర సంపదతో యుద్ధమొనర్పవలసియుండును. వీని యన్నిటిని గురించి విచారించుట కిపుడు సమయము చాలదు. కావున ఒక్క-నాయకునిగూర్చి మాత్రము ప్రస్తావించెదను.

సద్గుణములన్నిటికిని 'నిర్భయత్వము' మకుట ప్రాయమైనది. మార్గదర్శకమైనది. అట్లుకానిచో "నిర్భయముగా నుండుడు "(Be fearless) అను మంత్రరాజము శ్రీకృష్ణుని ముఖారవిందమునుండి తొలుదొల్తనే ప్రకటమై యుండెడిది కాదు. భయస్థుడు ఏకార్యమును సాధించజాలడు. లౌకిక క్షేత్రమందుగాని లేక పారలౌకిక క్షేత్రమందుగాని భయశీలుడు,పిరికి

వంద ఒక్కఅడుగైనను ముందునకు వేయలేడు. ప్రాపంచిక సంగ్రామమునందే భయమునకు తావులేకయుండిన, ఇక ఆధ్యాత్మిక సంగ్రామమున ఎట్లుండగలదు? ధైర్యవంతుడు ఒక్క పర్యాయము మాత్రమే మరణించును. భీరువు జీవితమునందడుగడుగునకు మరణించుచునే యుండును. ప్రపంచమున మహత్కార్యములన్నిటిని నిర్భయచేతస్కులే సాధింపగల్గిరి. మోక్షమను చరమలక్ష్యమునుగూడ అట్టి అభయచిత్తులే తమవశ మొనర్చుకొనుచుండుట చరిత్రయందు గాంచుచున్నాము. కనుకనే శ్రీకృష్ణపరమాత్మ 'విగతభీః':-'భయమును పారద్రోలుడు, అభయమును జేబట్టుడు' అని గీతయందు సాధకులను అప్పుడప్పుడు హెచ్చరించుకొనుచు పోయెను. అయినను ఈ భయమనునది సామాన్యముగ జనులను విడిచిపెట్టదు. పలువిధముల పీడించుచునేయుండును. జలగవలె పట్టుకొని వేధించుచుండును. దానిని తొలగించుటకెప్పుడు ఉపాయములను అన్వేషింపవలయును.

> భోగే రోగభయం కులే చ్యుతిభయం విత్తే నృపాలాద్భయం
> మానే దైన్యభయం బలే రిపుభయం రూపే జరాయా భయం
> శాస్త్రే వాదభయం గుణే ఖలభయం కాయే కృతాన్తాద్భయం
> సర్వం వస్తు భయాన్వితం భువినృణాం వైరాగ్యమేవాభయం.

'ఆహా! భోగములు సుఖకరములుగ నున్నవి. వాటిని పూర్ణముగ అనుభవించివేసెదము' అని తలంచువారిని రోగము లెక్కడ తగుల్కొనునో యను భీతి బాధించుచున్నది. అట్లే 'నేను గొప్పకులమునందు జన్మించితిని' అని తలంచువారిని తత్కులోచిత ధర్మముల నాచరింపనిచో ఎక్కడ చ్యుతి

సంభవించునోయను భయము పీడించుచున్నది. పోనిండు, ధనము విశేషముగ నున్నదిగదాయని సంతసించెదమనిన, రాజునుగూర్చిన భయము మనంబున వేధించుచున్నది. అనగా పన్నులబెడదచే బాధితులగుచున్నారని భావము. ముఖ్యముగ ధనవంతులకే ఎక్కడలేనన్ని పన్నులువచ్చి మీదపడుచుండుట లోకమున కానిపించుచున్నది. ఈ ప్రకారముగనే అభిమానవంతులమనుకొనునపుడు దైన్యమెపుడవలంబింపవలసి వచ్చునో యను భయము బలవంతుడనుగదా యనుకొనునపుడు శత్రువులు ఎపుడు ఓడింతురో యను భయము. చక్కదనము కలదుగదా యనుకొనిన వార్ధక్యమునుగూర్చిన భయము, శాస్త్రజ్ఞుడననుకొనునపుడు ప్రతివాదులవలన భయము, గొప్ప గుణములు కలవాడనుగదా యనుకొనునపుడు దుర్మార్గుల వలన భయము, శరీరమును జూచుకొనునపుడు మరణ మెపుడు వచ్చునోయను భయము మనుజులను పీడించుచున్నవి. ఇవ్విధముగ ప్రపంచమునందలి సమస్త పదార్థములును భయాన్వితములై యున్నవి. కాని ఒక్క వైరాగ్యము మాత్రము మనుజునకు నిర్భయమును గలుగజేయును' అని భర్తృహరి లోకస్థితిని పూసగ్రుచ్చినట్లు వర్ణించెను.

కావున నిర్భయత్వమును అలౌకిక గుణమును వాంఛించువాడు ప్రాపంచిక వస్తువులయెడల విరక్తి, భగవంతునియందు భక్తి అలవరచుకొనవలెను. దేహముపై అహంభావము, అభిమానము ఉన్నంతవఱకును, దృశ్యవస్తువులపై మమత్వమున్నంతవఱకును ఈ భయము, ఏకోశమునగూడ మానవుని విడనాడ జాలదు. మఱియు శాశ్వతవస్తువగు పరమాత్మ

నాశ్రయించనంతవఱకును జనసమూహమును భీతి వెన్నంటు చునే యుండును. హిరణ్యాక్షశిపుడు ఎన్నియో యిడుముల పాలుచేసినప్పటికిని ప్రహ్లాదు డేల భీతి జెందలేదు ? దేహాభి మానమును వదలివేసి విష్ణుభగవానుని ఆశ్రయించెను గనుక. అతని నిర్భయస్థితికి ఆ సుగుణద్వయమే మూలకారణము.

'రామనామ జపతాం కుతో భయమ్.'

"రామనామము జపించువారలకు భయమెచట ?' అని ప్రహ్లా దుడు జనులను నిలదీసి ప్రశ్నించెను. భగవద్భక్తి, వైరా గ్యము-అను రెండు దైవగుణములను ఆశ్రయించినందువల్లనే ఇట్టి నిర్భయత్వ మాతనికి కలిగెను. చంచలములగు పదార్థము లను పట్టుకొనువాడు, క్షణికమగు దేహముపై విశ్వాసము కలవాడు భయమను పెనుభూతమునకు వశుడై పోవును. అచంచలమై, శాశ్వతమైనట్టి పరమాత్మవస్తువు నాశ్ర యించువాడు సర్వకాలములందును నిర్భయుడై వెలయు చుండును. తల్లి యొడియందున్న పసికందు ఎన్నడైన భీతి జెందునా ? గట్టి స్తంభమును పట్టుకొని యున్నవాని కెన్న డును పతనభయము లేదుకదా ? అట్లుకాక ఊగుచున్న స్తంభమును పట్టుకొనినచో స్తంభము పడిపోవును, తానున్న నేలకు ఒరిగిపోవును. ప్రపంచములోని ప్రతివస్తువున్ను ప్రకృతికి వశమైయున్నది. కావున, అస్థిరమై, నాశవంతమై, మరణ శీలమై వర్తించుచున్నది. ప్రకృతికి అతీతముగ వెలయుచున్న జగత్సాక్షియగు పరబ్రహ్మమొకటియే ఈ ప్రపంచమున స్థిర మగు వస్తువు. అస్థిరపదార్థ మెన్నటికైనను ప్రమాదభూయి ష్ఠమే యగును. దానియందు పరిపూర్ణశాంతిసుఖము లుండవు.

పైగా అడుగడుగునకు దుఃఖమును, భయమును గలుగజేయుచుండును.

'ద్వితీయాద్వై భయం భవతి'

అను ఉపనిషద్వాక్యానుసారము ద్వైతము మినహా మఱియొక వస్తువున్నదని భావించిన వెంటనే భయమువచ్చి జీవుని బాధించుచుండును. కాబట్టి అద్వయపరమాత్మ స్థితియందే పూర్ణభయరాహిత్యము సిద్ధించగలదని తేలుచున్నది. కావున భగవంతుని ఆశ్రయించుటద్వారాను, ప్రాపంచికపదార్థములు అశాశ్వతము లను భావము కలిగియుండుటద్వారాను మనుజుడు అభయస్థితిని తప్పక పొందగలడు. పూర్ణశాంతి, నిరతిశయసుఖము అట్టి అభయస్థానమందే జీవునకు లభించగలదు. ఇట్టి మాహాత్మ్యము గల్గియుండుటవలననే శ్రీకృష్ణపరమాత్మ 'అభయం' అని ఈ సుగుణమును తొలుదొల్తనే పేర్కొని దాని ఘనతను లోకమునకు చాటెను.

"If there is one word that you find coming out like a bomb from the Upanishads, bursting like a bombshell upon the masses of ignorance, it is the word fearlessness and the only religion that ought to be taught is the religion of fearlessness. It is fear that brings misery, fear that brings death, fear that breeds evil and what causes fear? Ignorance of our own nature."

'ఉపనిషత్తులనుండి 'బాంబు'వలె వినిర్గతమై అజ్ఞానిజనసందోహమధ్యమున పడి వారి అజ్ఞానమును ప్రేల్చివేయునట్టి

పదమేదైన యుండినచో అది 'నిర్భయత్వమే' అయియున్నది. నిర్భయత్వ మతమే యిపుడు చాటదగిన ఏకైక మతము - భయమే దుఃఖమును గలుగజేయును. భయమే చావును తెచ్చును. భయమే దోషములను సృజించును. ఇట్టి భయము దేనివలన కలుగుచున్నది? మన స్వరూపమును మనము మఱచేనందువలననే!- అని వివేకానందస్వామి లోకమునకు ఎలుగెత్తి చాటెను.

కావున వివేకవంతుడు ప్రయత్నపూర్వకముగ ఈ భయమును దుర్గుణమును తన హృదయసీమనుండి ఏరి పారవేయవలెను. మానవుని పట్టి పీల్చి పిప్పిచేయుచున్న ఇట్టి భయము లన్నింటిలోను మరణభయము చాల గొప్పది. ఎటువంటి బలవంతుడైనను, ప్రజ్ఞావంతుడైనను, శ్రీమంతుడైనను 'మరణము'ను శబ్దమును వినగనే దద్దరిల్లి పోవుచున్నాడు. మఱియు, ఆ దృశ్యమును జూచినపుడు నిరాశానిస్పృహలచే పరివేష్టితుడగుచున్నాడు. హృదయము కంపమునొందుచున్నది. అన్ని భయములను నిర్జింపగల్గినను ఈ భయమేల జనులను పీడకున్నది? దీనిని దాటుట ఎట్లు? మరణభయమును తొలగించుకొను ఉపాయము యెద్ది? ఇది ముఖ్యముగ జనులు తెలిసికొనవలసియున్నది. ఒకింత విచారణచే ఇకార్యము సాధింపబడగలదు. ఆ విచారణ యెట్టిది యనిన-

మరణము శరీరమునకే కాని ఆత్మకు కాదు. తాను వాస్తవముగ ఆత్మయే కాని శరీము కాదు. ఈ సత్యమును గీత ప్రారంభమునందే (2 వ అధ్యాయములో) శ్రీకృష్ణమూర్తి బట్టబయలు చేసివైచెను. దానిని జీర్ణ మొనర్చుకొనినచో ఇక

మృత్యుభయమునకు తావేలేదు. 'నాహంజీవః పరాత్మేతి జ్ఞాతిశ్చేన్నిర్భయోభవేత్' - నేను జీవుడనుకాను పరమాత్మను అని తెలిసికొనినవానికి నిర్భయత్వము కలుగునని శ్రీశంకరాచార్యులవారు నుడివిరి. దృశ్యవస్తువు ఏదియైనను సరే, షడ్భావ వికారములకు లోనగుచునేయుండును. అట్లు వికారమునొందుట దానికి సహజమగు స్వభావము, ధర్మమున్ను. దానిని ఎవరును ఆపలేరు. మఱియు అది కాలమునకు లోబడియుండును గావున కాలము తన ధర్మమును నిర్వర్తించుకొని పోవుచుండును. కనుకనే చావునకు 'కాలధర్మము' అను నామాంతరము కలదు. ఒక వస్తువు తన ధర్మమును తానాచరించుకొనుచుండ దానికి ఏడుపు ఎందుకు? దుఃఖమేల? భయమెందులకు? తాను సదా సర్వకాలములందును నిర్వికారమగు ఆత్మయే అయి వెలుగుచున్నాడు. ఈ జనన మరణరూపమగు జంజాటమునకు తాను అతీతుడై, క్షేత్రజ్ఞుడై, సర్వసాక్షియై, ప్రకృతియొక్క వికారములకు అతిదూరముగ వర్తించుచున్నాడు. ఈ ధర్మసూత్రము నెఱింగినచో మృత్యుభయము పలాయనమై పోగలదు. ఇట్టి ఆత్మవిచారణ కలవానికి మరణమనునది లీలామాత్రముగ నుండును.

'What can make me afraid? Death is a joke to me' 'నన్నీ ప్రపంచమున ఏది భయపెట్టగలదు? నాదృష్టియందు చావు ఒక 'తమాషా' మాత్రమే యగును' అని జ్ఞాని పలుకుచుండును. 'సోక్రటీస్' అను మహాతత్త్వవేత్తతో నొకరు 'అయ్యా! తమరు (విషపానముద్వారా) మరణదండన విధింపబడినద'ని చెప్పగా నమ్మహానీయుడు పంచభూతాత్మక

మగు ఈ శరీరము ఎప్పుడైనను పోవలసినదే. చచ్చేదానిని చంపుటలో ఏమిగొప్ప? నేను చావుపుట్టుకలు లేనివాడను. నాకు చావేమిటి?' అని ప్రత్యుత్తర మిచ్చెనట! మహనీయులగువారు దృగ్దృశ్యములను, క్షేత్రక్షేత్రజ్ఞులను, ఆత్మానాత్మలను బాగుగ విడదీసి స్థిరవస్తువునందే (ఆత్మయందే) నిలుకడకలిగి, అస్థిరవస్తువు (శరీరము) యొక్క వికారములకు జంకక, దుఃఖమునొందక, భీతిజెందక నుందురు. ఆత్మకు 'అభయం' అను మఱియొక పేరు గలదు.

అభయం వై జనక ప్రాప్తోఽసి.

'ఓ జనకుడా! నీవు అభయస్థానమును బొందితివి' అని యాజ్ఞవల్క్యుడాతనినిగూర్చి పలుకుట, బృహదారణ్యకోపనిషత్తునందు కానబడుచున్నది. కావున ఆత్మస్థితిని బడసినవాడు-మేరుపర్వతము శ్వాసవాయువులచే చలింపనట్లు - ఈ ప్రపంచము నందలి సుఖదుఃఖములకు ఏమాత్రము చలింపకుండును. మరణాదులనుగాంచి ఏమాత్రము భీతిజెందకుండును.

శ్రీకృష్ణపరమాత్మ కరుణతో వచించిన ఇరువదియాఱు దైవికగుణములలో మొదటిదియగు 'అభయము'ను గూర్చియే ఇంతదనుక విచారించుటైనది. తక్కినవానిని గూర్చియు ఈ ప్రకారమే బాగుగ వివేచనజేసి ఆ సద్గుణజాలమంతయు తన యందుమూర్తీభవించులాగున ప్రయత్నించవలెను. వానియొక్క మనననిదిధ్యాసనములను లెస్సగ నాచరింపవలయును. రోమరోమమునందును దైవీసంపద ఉట్టిపడునట్లు చేసికొనవలెను. అయితే ఇంతటితో సాధకుని పని పూర్తికాలేదు. మంచిని గ్రహించుటతోపాటు చెడ్డనుగూడ వదలివేయుచుండవలెను.

మనుజునకు సద్వస్తుపరిగ్రహమునం దెంతటి అభినివేశముండునో, దుష్టవస్తు పరిత్యాగమునందును అంతటి తీవ్రాసక్తి యుండ వలెను. శరీరము ఆరోగ్యముగ నుండవలెననిన పుష్టికరమగు ఆహారమును లోనికి వేయుచుండవలెను. జీర్ణింపగా మిగిలినట్టి మలమూత్రాదులను బయటకు సాగనంపుచుండవలెను. ఈ రెండు క్రియలున్ను జరుగవలెను. అట్లుగాక గ్రహణముతో పాటు త్యాగము సంభవింపనిచో శరీరము క్రుళ్ళి శిథిలమై పోగలదు శరీరమున ఈద్వివిధకార్యము లెట్లు నెరవేర్చబడు చున్నవో, బయట గృహమందును అట్లే జరుగుచున్నవి. త్రాగుటకు, వంటచేసికొనుటకు ఎక్కడనుండియో ఒకటి రెండు బిందెలు మంచినీరు తెచ్చుకొనుచుందురు గృహిణులు. అట్లే ఇంటియందలి మురికినీటిని గట్టర్ల ద్వారా బయటకు త్రోసివేయుచుందురు. ఈ రెండుకార్యములు జరిగినపుడే ఇల్లు పరిశుభ్రముగను, ఒళ్ళు ఆరోగ్యముగను ఉండును. తేళ్ళను, పాములను, ఎలుకలను, ఎవరును తమయింటిలో నుంచుకొనరు. వాటిని ఇంటియందు చూచిరా, ఇక తరిమివేయువఱకు లేక చంపువఱకు ఒంటికాలిమీద నిలబడుదురు. ఎక్కడో అతి దూరముననున్న అరణ్యమునుండి ఒక జింకనో, నెమలినో, రామచిలుకనో తెచ్చుకొని సాకుచుందురు.

ఆప్రకారముగనే ఈశరీరమునందు అమృతత్వ (మోక్ష) సంపాదనకు వలసిన పరికరములను చేర్చుకొనుటతోపాటు, మృత్యురూప సంసార దుఃఖసాగరమున బడద్రోయునట్టి దుష్ట ప్రవృత్తులను పారద్రోలవలెను. వీనికే గీతాచార్యుడు ఆసురీ

సంపదయను పేరుపెట్టి అజ్ఞానిని విమోచనము గావింపవలసి నదిగా నాదేశించెను.

అమృతం చైవ మృత్యుశ్చ ద్వయం దేహే ప్రతిష్ఠితమ్
మృషా హి సాధ్యతే మృత్యుః సత్యేన సాధ్యతేఽమృతమ్.

'ప్రతి జీవియందును అమృతస్వరూపమగు ఆత్మయు, మృత్యు రూపమగు ప్రకృతి (మాయ) యు కలవు. సత్యముచేతను, దైవిక గుణములచేతను అమృతత్వము సాధింపబడును. అసత్యముచేతను, ఆసురిక గుణముచేతను మృత్యువు సాధింప బడును'-అని శాస్త్రములు హెచ్చరిక చేయుచున్నవి. కావున మృత్యుదాయకములును, మోక్ష ప్రతిబంధకములునగు ఈ రాక్షసగుణములకు సాధ్యమైనంత త్వరలో జీవుడు ఉద్వాసన చెప్పవలయును. అనగా దైవీసంపదకు సన్మానము (Welcome), ఆసురీ సంపదకు వీడ్కోలు (Send off) ఏర్పాటు చేయవలసియుండునని భావము. ఆ వీడ్కోలు ఉత్స వము ఎవరెవరికి జరుపవలయునో ఒకింత విచారించెదము.

దంభము, దర్పము, అభిమానము, క్రోధము, పరు షత్వము (కాఠిన్యము), అజ్ఞానము-అను కొన్నింటిని మాత్రము భగవాను డిచటమచ్చునకుదెలిపెను. వాటి కూటమిచాలపెద్దది. కావున సూత్రప్రాయముగ నిట ఆఱింటెనిమాత్రము వచించి, తదుపరి వాటికి భాష్యము చెప్పసాగెను. 'ఓ అర్జునా ! అసుర సంపద నాశ్రయించువారికి చేయదగిన కార్యమేదియో, చేయ దగనిదేదియో ఏమియు తెలియదు. వారికి శౌచము గాని, ఆచారముగాని ,సత్యనిష్ఠగాని ఉండనే ఉండదు. దేవుడు లేడని వారు వాదించుదురు. స్త్రీ పురుషుల సంయోగము చేతనే

ఈజగత్తు ఏర్పడినదికాని మఱియొక విధముగ గాదని పల్కు-దురు. అల్పబుద్ధికలవారై అనేక హింసాకార్యములందు ప్రవృత్తిగలిగి లోకమునకు కీడు చేయుదురు. కామదాసులై మెలగుదురు. ఆశాపాశములచే జుట్టబడి, కామక్రోధ పరాయణులై, భోగానుభవము కొఱకు అన్యాయముగ డబ్బును సంపాదించుచుందురు. 'నన్నుమించినవాడు లేడ'ని విఱ్ఱవీగు చుందురు' అని ఈప్రకారముగ వారలఁగూర్చి భగవానుడు విస్తారముగ చెప్పసాగెను.

అట్టి పాపాత్ములకు లభించు శిక్షయేమి? 'పతన్తినరకేఽ-శుచౌ'-భయంకరములై, అపవిత్రములై, దుఃఖదాయకములైనట్టి రౌరవాది నరకములే వారికి గతి. వానియందుబడి నానాక్లేశముల ననుభవించుచు, పడరాని యిడుములుబడుచు, దిక్కు- తెలియక నుందురు.

తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్
క్షిపామ్యజస్రమశుభానాసురీష్వేవ యోనిషు (16-19)

'బ్రహ్మద్వేషులును, క్రూరులునగు అట్టి మనుజాధములను ఈ సంసారమునందే పడవైచి, అపవిత్రములైన అసుర జన్మలలో నేను విసిరి పారవేయుదును' - అని శ్రీకృష్ణభగవానుడు అట్టి పాపాత్ములను గుఱించి ఉద్రేకముగ బల్కె-ను. 'నరాధముల'ను కఠినమైన పదమునుగూడ వారియెడల ప్రయోగించెను. 'శాంతాకారం భుజగశయనం' - అను విశేషణములతోగూడిన ఆ ప్రశాంతమూర్తి అధర్మమును,అన్యాయమును, పాపాచరణమును ఆశ్రయించువారిని గూర్చి చెప్పునపుడు అపరరుద్రుడుగ మారిపోయెను. గీతాచార్యుడు తెలిపినట్లు

పాపమనునది ఎన్ని భయంకర పరిణామములను గలుగ జేయునో, ఎంతటి ఘోరాతి ఘోరమగు ఆపదయందు బడద్రోయునో చూచితిరా! పాపమునకు పరలోకిక (నరక) శిక్ష అట్లుండ, ఇహలోకమునగూడ వారికి ప్రత్యక్షముగ శిక్ష లభించుచునేయున్నది. దొంగతనమునకు ప్రభుత్వదత్తమగు కారాగారశిక్ష. వ్యభిచారమునకు దుర్భరరోగబాధ, మున్నగు నవి ఇక్కడనే వారిని ఎదుర్కొనుచున్నవి. ఈ ప్రకారము ఇహమందును, పరమందునుగూడ దురాచారి దుఃఖమును కొని తెచ్చుకొనుచున్నాడు. అట్టి [illegible] హాని నేల నాశ్రయించ వలెను? నిరతిశయ బ్రహ్మానందమునకు దారితీయు దైవసంపదను కాలదన్ని, అనంతయాతనలకు అలవాలమైన అసురసంపద నేల జేబట్టవలెను? ఏ కొంచెము వివేకమున్నను మనుజు డిట్లు ప్రవర్తించునా? సుగంధపూరితమై, దివ్యాలంకార సమన్వితమై నేత్రోత్సవమైనట్టి నందనవనమును తృణీకరించి, కంటకావృతమైన ఘోరారణ్యము నాశ్రయించువాడు మూఢుడు కాక మఱి ఎవరు?

'స్వర్గమునకు మోక్షమునకు పోవు బండి యొకటి, పాతాళమునకు, నరకమునకు పోవు బండి యొకటి. రెండును ఒకే ప్లాట్‌ఫారముయొద్దనిలిచినవి. ఓ జీవుడా! నీవే బండిలో నెక్కదవో బాగుగ యోచించుకొనుము. ఎక్కక పూర్వమే దీర్ఘముగ ఆలోచించుకొనుము. ఎక్కినపిదప ఇక వాటివాటి గమ్యస్థానములకు అవి నిన్ను తప్పక చేర్చును. కనుక ('look before you leap')- 'దూకుటకు ముందుగా క్రింద ఏమున్నదో బాగుగ పరికింపుము. త్వరపడకుము. నీకు యోచన

తట్టనిచో, నీ మెదడు బాగుగ పనిచేయనిచో, పెద్దలను సమీపింపుము. అనుభవజ్ఞులగు మహాత్ముల సలహాగైకొనుము. లేక శాస్త్రములను తిరుగదీయుము' - అని విజ్ఞులు పలుకుచున్నారు.

తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం కర్మకర్తు మిహార్హసి. (16-24)

"ఓ అర్జునా! ఏది చేయదగినది, ఏది చేయదగనిది అను మీమాంసవచ్చినపుడు నీకు శాస్త్రమే ప్రమాణము కాని అన్యముకాదు. కావున శాస్త్రములందాదేశింపబడినరీతి ఎట్టిదో తెలిసికొని ఆ ప్రకార మాచరింపుము' అని ఈ అధ్యాయాంతమున శ్రీకృష్ణమూర్తి అర్జునునకు హితవుజెప్పెను. కావున గ్రుడ్డిగా దేనిని నమ్మరాదు. శాస్త్రవిశ్వాసములేని నాస్తికుల వాక్యములకువిలువనివ్వరాదు. సంశయముకలిగినపుడు, తానైన శాస్త్రము చూడవలెను. లేక శాస్త్రవాక్యములను అనుభవములో నుంచుకొని ప్రత్యక్షముగ ఫలితములను సాధించిన మహనీయుల వచనములందు విశ్వాసమైనను గలిగియుండవలెను. ఈ రెండును లోపించినందువలననే 'అల్పబుద్ధులై', కార్యాకార్యవిచక్షణలేనివారై, దంభదర్పాద్యసురగుణములనే శరణ్యములుగనెంచి ఆలోచనలేక నరకమునకు బోనున్న రైలుబండియందే జనులు అమాంతముగ నెక్కి కూర్చొనుచున్నారు. రోటిలో తలదూర్చినవారు రోకటిపోటును తప్పించుకొనజాలుదురా? కావున అట్టివారుతమగోతినితామే త్రవ్వుకొనుచున్న వారగుదురు. పోయిపోయి వారు నరకద్వారమును తట్టుచున్నారు. నరకమునకు మూడుద్వారములని యెఱుంగవలెను.

త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః
కామఃక్రోధ స్తథాలోభ స్తస్మాదేతత్త్రయం త్యజేత్. (16-21)

'కామము, క్రోధము, లోభము - అను నీ మూడును నరక ద్వారములు. ఇవి జీవుని అధోగతికి గొనిపోవునవి. కాబట్టి వాటిని విడిచివేయవలెను'. అని భగవానుడు సెలవిచ్చెను. శమదమాదులు, సత్సాంగత్యము, ఆత్మవిచారణ మున్నగునవి మోక్షద్వారములు. వాటినే తట్టవలెనుగాని నరకద్వారములనుగాదు. మహాత్ములు కరుణతో గావించుచున్న ఈ హితబోధను పెడచెవినిబెట్టి జను లొకవేళ నరకద్వారమునే తట్టినచో పైన దెలిపిన ఘోర దుష్ఫలితములను తప్పక అనుభవింపవలసియున్నది. కర్మసిద్ధాంతము అప్రతిహతమైనది. కావున చేసిన పాపకర్మయొక్క అశుభపరిణామమునకు వారువారు తలయొగ్గవలసినదే. దీనికి తిరుగులేదు. కాబట్టి జీవితమును సంస్కరించుకొని దైవసంపదనే ఆశ్రయించి అసురగుణములకు తిలోదకము లొసంగవలసియున్నది. శాంతిసుఖమును కోరువాడు, జననమరణరూప దుఃఖ దావాగ్నికి దూరముగ నుండదలంచినవాడు, బంధవిముక్తిని అభిలషించువాడు, దుర్భర నరకదుఃఖములకు వెరయువాడు ఆశ్రయించవలసిన పద్ధతి యిదియే.

అయితే ఈ పద్ధతి ఆచరణయందు వచ్చునపుడు ప్రతిపక్షము (left wing) వారగు రాక్షసగుణములనుండి జీవుడు గొప్ప తిరుగుబాటును ఎదుర్కొనవలసివచ్చును. కోట్లకొలది జన్మలనుండి హక్కుభుక్తముల నేర్పరచుకొని చక్కగా తిష్ఠవేసియున్న ఆ రాక్షసులు శాంతముగ వెడలిపోవుదురా ?

అసలు వెడలుటకు ఇష్టపడుదురా ? లేదు. తమ ప్రాణమునకే ఎసరువచ్చినందువలన ఎంత గందరగోళము చేయవలెనో అంత చేసి వదలుదురు. ఇట్టి క్రాంతి నెదుర్కొనునపుడే సాధకులలో పెక్కురు దిగజారిపోవుదురు. సర్వేశ్వరుని యెడల అచంచలమైన విశ్వాసము, సాహసోపేతమగుబుద్ధి, ధైర్యస్థైర్యములు. గొప్పపట్టుదల, కష్టసహిష్ణుత, లక్ష్యమును జేరవలెనను తీవ్రమగు ఆకాంక్ష ఉన్నవారు మాత్రమే ఈ యుద్ధమున విజయమును జేబట్టుదురు. పాఠశాలలలో విద్యార్థులు త్రాడులాగు పందెము (Tug of war) లో పాల్గొనుచుందురు. ఒకే త్రాడును ఒక వైపు కొందఱు, మఱియొక వైపు కొందఱు పట్టి లాగుచుందురు. ఎవరివైపు త్రాడు ఎక్కువగ జరుగునో వారు గెలుపొందినట్లు. అట్లే ప్రతి ముముక్షువు యొక్క హృదయమందును దైవాసుర సంగ్రామము జరుగుచునే యున్నది. మంచికి చెడ్డకు, ధర్మమునకు అధర్మమునకు న్యాయమునకు అన్యాయమునకు, దైవసంపదకు అసురసంపదకు ఘోరమగు యుద్ధము సంభవించుచునే యున్నది. కేవలము అజ్ఞానియగువాని హృదయమందును, కేవలము జ్ఞానియగు వాని హృదయమందును మాత్రము ఈ సంగర ముండదు. ఏల యనిన అజ్ఞానిమనంబున ఒకే ఒకపక్షము (అసురపక్షము) కాపురముండును. రెండవ పక్షమగు దైవత్వమును గూర్చిన వాంఛయే వానికుండదు. ఇక జ్ఞానియో ప్రతిపక్షమగు అసురత్వమును రూపుమాపి యుండుటచే, ఒకే ఒక దైవపక్షము మాత్ర మతనియందుండును. ఇక మధ్యగల జిజ్ఞాసువునకు మాత్రమే, ముముక్షువునకు మాత్రమే ఈ యుద్ధప్రసక్తి

కలుగును. కాబట్టి సాధకుడు అతిజాగరూకుడై ప్రయత్నపూర్వకముగ గొప్ప ఆధ్యాత్మిక బలమును చేకూర్చుకొనవలెను.

నీటిలో కుండను పెట్టినచో నీటియందు గుంటగా ఏర్పడును. కాని ఆ కుండను పైకి తీయగనే ఆ గుంట తత్‌క్షణమే పూడిపోవును. నీరు తనయందు గుంటలను సహింపదు. అట్లే ముముక్షువు తన యంతఃకరణమును బాగుగ పరిశీలించి, దానియందేవైన గుంటలు (loop holes) ఉన్నచో, దోషములున్నచో, వెనువెంటనే విచారణాదులచే వాటిని తొలగించుకొని హృదయము సమముగ, నిర్మలముగ నొనర్చుకొనవలెను.

నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః.

అనునట్లు, ఎపుడు చిత్తము దోషరహితమై, సమమై వెలయునో అపుడు వారు బ్రహ్మమందు స్థితినొందియున్నవారే యగుదురు. ఏలయనగా బ్రహ్మము సమరూపమును, దోషవర్జితమును అయియున్నది. జీవుడు తన యంతఃకరణమును శుద్ధ మొనర్చుటయందే విలంబముగాని, మోక్షమును పొందుటయందుగాదు. హృదయ నైర్మల్యస్థితి ఏర్పడినప్పుడు మోక్షము త్రుటికాలములో లభించును. ఫోటో తీయుట ఏమంత ఆలస్యముగాదు. సెకండులోని నూఱవ భాగమంత కాలము దానికి చాలును. కాని ఆలస్యమంతా కుర్చీలు సర్దుటలోను, బెంచీలు సరిచేయుటలోను, ముఖవైఖరులను సరిదిద్దుటలోను జరుగుచుండును. మోక్షవశ్యకమగు ఇట్టి చిత్తశుద్ధి జీవునకు కలిగించు నిమిత్తమే శ్రీకృష్ణభగవానుడు గీతయందు పూర్ణముగ ఒక అధ్యాయమంతయు (16 అధ్యా)

దాని క్రింద వినియోగించి, విధినిషేధముల రెండిటేని అద్దాని యందు ప్రతిపాదించివేసెను. అదియే ఈ దైవాసుర సంపద్విభాగయోగము. దైవసంపద విధి. అసురసంపద నిషేధము. దేనిని వదలించుకొనవలెనో, దేనిని గ్రహించవలెనో రెండిటేని జీవుడు తెలిసికొనియుండినచో మంచిదనియెంచి గీతాచార్యుడు ఆ విధినిషేధముల రెంటేని ఇట పొందుపఱచెను.

భగవానుడు చూపిన ఈ మార్గముద్వారా జీవునకిక మోక్షప్రయాణము సులభతరమై పోగలదు. తన హృదయ కవాటముయొద్ద రాత్రింబవళ్లు కావలికాయుచు శత్రుపక్షము వారిని లోనికి రానీయక ఆత్మీయులను మాత్రము రానిచ్చు చుండినదో అచిరకాలములో దేహము దేవాలయమై తనర గలదు. జీవుడే దేవుడై చెన్నొందగలడు. నిరోధింపబడిన శత్రువు తిరుగబడినచో సంఘర్షణము గావించి, పోరుసల్పి, బుద్ధిబలము నుపయోగించి ఎట్లైనను లోనికి రానీయకుండ చేయుటయే జీవుని కర్తవ్యము. తన మనస్సుతో ఘర్షణపడు వానికి ప్రపంచములో నెచటను ఘర్షణయుండ నేరదు. అభ్యంతర శాంతి నొందినవానికి బాహ్యశాంతి దానియంతట నదియే వచ్చిచేరును. కాబట్టి ఉత్తము డగువాడు తన మనస్సులోని మలినభాగముపై యుద్ధప్రకటన గావించి, దైవసంపద్రూప తీక్ష్ణాయుధములచే అద్దానిని హతమార్చి కేవలము శుద్ధభాగమే శేషించులాగున నొనర్చినచో, ఇక మోక్షలక్ష్మి వానిని వెతకి కొనుచు వచ్చి మెడలో పూలహారము వేయును.

సత్త్వపురుషయోః శుద్ధిసామ్యే కైవల్యమ్. (పతంజలియోగసూత్రము)

'ఆత్మ ఎంతశుద్ధముగ నున్నదో మనస్సున్ను అంతశుద్ధత్వము నొందినచో అట్టి స్థితియే మోక్షమని చెప్పబడున'ని పతంజలి మహర్షి నుడివియున్నాడు. కావున మహాశయులారా! త్వర పడుడు! ఆయువు క్షమింపకపూర్వమే దేహనౌక భగ్నము కాకపూర్వమే ఈ సంసార మహాసముద్రమును దాటివేయు దురుగాక! దీపమున్నపుడే ఇల్లు చక్కబెట్టుకొనుట మఱువ కుందురుగాక! వివేకమను తీక్ష్ణఖడ్గముయొక్క ధవళధారలచే దంభదర్పాద్యసుర సమూహమును ఛేదించివైచి, అభయ త్వాది దేవతాగణము నాదరముతో హృదయగుహలోనికి ఆహ్వానించి, సత్కరించి, నిరతిశయాత్మానందామృతమును వారివలన గ్రోలి జీవితములను ధన్య మొనర్చుకొందురుగాక?

ఓమ్ తత్ సత్.

ఓమ్

# 17-వ అధ్యాయము

# శ్రద్ధాత్రయవిభాగయోగము

మృత్యువు అన్నిటిని మ్రింగివేయగలదు. కాని మానవుడు మృత్యువును మ్రింగివేయగలడు. అట్టి అలౌకిక శక్తిని ఈశ్వరుడు వాని కొసంగెను. ఆ శక్తిని వికసింపజేసికొనెనా ధన్యుడు. లేకున్న నిరర్థకజన్ముడే కాగలడు. ఈ భూతలమున మానవజాతి కోట్లసంఖ్యలో నున్నప్పటికిని తనయందు నిగూఢముగనున్న అట్టి అమరత్వశక్తిని అనుభూత మొనర్చుకొనవలెనను సంకల్పము కలిగియున్నవారు చాలతక్కువ. ఒకవేళ అట్టి సంకల్పముకలిగియున్నను తల్లక్ష్యసాధనకై ప్రయత్న మొనర్చువారు ఇంకను తక్కువ. ఒకవేళ ప్రయత్నము సల్పినను, కడవఱకు నిలువగలిగిన తాహతు ఏకొద్దిమందికో యుంటున్నది. తక్కినవారందరున్ను ఈ జనన మరణరూప మహాప్రవాహమునబడి దరిగానక కొట్టుకొనిపోవుచున్నారు. దాటగలిగినశక్తి యుండియు, పడవను నిర్మించుకొనగల సమర్థులయ్యు; నదిలో కొట్టుకొనిపోవుట దౌర్భాగ్యమేయగును. అట్టివారిదశ అత్యంత శోచనీయమైయున్నది. డబ్బులేక దరిద్రులుగా నుండువారు కొందఱు. అట్టి దారిద్ర్యము వారికి నైజమేయగును. కాని డబ్బు ఉండియు దారిద్ర్యదశ ననుభవించు లోభులు కొందఱుందురు. సర్వశక్తిసమన్వితమై, అమృతస్వరూపమై, అకళంకమై, పరమానందమయమైనట్టి ప్రత్యగాత్మ తమ హృదయ

పీఠమున వెలుఁగుచున్నను అజ్ఞానావరణముచే నద్దానిని విస్మరించి సంచరించుచున్న జను లట్టి దరిద్రుల నే పోలియున్నారు. ఇది చాలఘోరము. మానవత్వమున కిదియొకగొప్ప కళంకము; అపచారము. దైవత్వమును బడయుటయే యథార్థమానవత్వ చిహ్నమగును. ఈవిషయమును పదేపదే మహాత్ములుద్ఘోషించుచున్నారు. శాస్త్రములున్ను వక్కాణించుచున్నవి. కాబట్టి స్వల్పమగు ఆయుర్దాయమును వ్యర్థవిలాసములందు, తుచ్ఛ విషయభోగములందు తగులబెట్టక మనుజుడు తన జన్మ హక్కగు స్వారాజ్యసంపాదనమునందు యత్నశీలుడు కావలయును. భవిష్యచ్ఛ్రేయమును ఇప్పుడే నిర్ణయించుకొనవలెను. అట్లు నిర్ణయించుకొని తదనురీతి వ్యవహరించువాడే విజ్ఞుడు.

వర్షార్థమష్టౌ ప్రయతేత మాసాన్
నిశార్థమర్థం దివసం యతేత
వార్థక్య హేతోర్వయసా నవేన
పరత్ర హేతో రిహ జన్మనాచ.

'వర్షాకాలము నాలుగు నెలలు బయటకుపోయి కూలినాలి చేసికొనుటకు అవకాశముండదు. కాబట్టి ఆ నాలుగు నెలలు చక్కగ ఇంటియొద్దనే కూర్చుండి భుజించుటకుగాను తక్కిన యెనిమిది నెలలు బాగుగ కష్టపడవలెను. రాత్రి హాయిగ భుజించి విశ్రాంతినొందుస్థితిని కలుగజేసికొనుటకై పగలంతయు బాగుగ శ్రమించవలెను. వార్థక్యములో పెన్షన్‌గాని, ప్రావిడెంటుఫండ్‌గాని, లేక ఏదో రూపమున నిలువజేసిన ధనముగాని, లభించి నిశ్చింతగ బ్రతుకవలెననిన, బాల్యయౌవనములందు చెమటకార్చి పనిచేయవలసియుండును. ఆ ప్రకారముగనే పరలోకమున శాంతిసుఖముల

ననుభవించవలెననిన, ఇహలోకముననే అందులకై తీవ్రకృషి సలుపవలెను అని శాస్త్రములాదేశించుచున్నవి. ఆ కృషి యెట్టిదో ఇన్ని దినములనుండియు మనము విచారించుచునే యున్నాము. మన భాగ్యవశాత్తు శ్రీకృష్ణపరమాత్మ అరటి పండు ఒలిచి చేతిలోపెట్టినట్లు ఆ యా మోక్షసాధనలన్నిటిని గీతయందు ప్రబోధించియేయున్నారు. వారుపదేశించిన వివిధ ఆధ్యాత్మిక ధర్మములందు నేడు శ్రద్ధాత్రయ విభాగ యోగమును గూర్చి మనము విచారింపబోవుచున్నాము.

గీతయందు 'విభాగయోగములు' నాలుగు కలవు. క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము, గుణత్రయవిభాగయోగము, దైవాసుర సంపద్విభాగయోగము, శ్రద్ధాత్రయ విభాగ యోగము అని. శత్రువు మిత్రునివలె నటించి దగ్గరజేరి కలసి మెలసి యున్నప్పుడు, ఆతనివలన ఎప్పటికైనను ప్రమాదము వాటిల్లగలదు. అందుచే అతని యునికిని పసిగట్టి వెంటనే స్వకీయ పరివారమును విభజించివైచి ఆ శత్రువును బయటకు గెంటివేయవలెను. అపుడే శాంతికి ఆస్కారముండును. అట్లే అనాది కాలమునుండి దృశ్యము దృక్కుతో కలిసియుండుచు వచ్చినది. అజ్ఞానవశమున జీవు డది గ్రహింపలేక ఆ దృశ్యమును, దృశ్యమునకు సంబంధించిన గుణములను, శ్రద్ధలను, తన నెత్తిననే వేసికొని వాటితో తాదాత్మ్యము నొందుచు తత్ఫలితముగ ఆ దృశ్యవికారములకు, తజ్జనితదుఃఖములకు లోనగుచున్నాడు. కనుకనే శ్రీకృష్ణపరమాత్మ ఈ పద్ధతి పనికిరాదు. వెంటనే విభజించివేయవలసినదని యాజ్ఞాపించు చున్నాడు. దగ్దృశ్యములను, క్షేత్రక్షేత్రజ్ఞులను, గుణములను,

శ్రద్ధలను, విభజించి పరిశీలించవలసినదని హెచ్చరిక చేయుచున్నాడు. అట్లు పరిశీలించినపుడు ప్రకృతిసంబంధమైన వికారము లెవ్వియో, నశ్వరవస్తుసముదాయ మెద్దియో, శాశ్వత నిర్వికారపదార్థమేదియో విస్పష్టముగ గోచరింపగలదు.

దృశ్యకోటియందంతర్గతమగు మనస్సును బాగుగ విభజించినచో మూడుగుణములు ప్రత్యక్షమగుచున్నవి. అవియే సత్త్వరజస్తమోగుణములు. వీనిని గూర్చి 14వ అధ్యాయమగు గుణత్రయవిభాగయోగమున విపులముగ చర్చించడమైనది. మనుజున కెట్టిగుణముండునో తదనురూపమగు శ్రద్ధ ఉదయించుచుండును. ఎట్టిశ్రద్ధయుండునో తదనుకూలమగు సంస్కారము ప్రాదుర్భవించుచుండును. ఎట్టి సంస్కారముండునో తదనుగుణ్యముగ వ్యవహారము సలుపుచుండును. కాబట్టి 'శ్రద్ధామయోఽయంపురుషః' అనునట్లు మనుజుడు శ్రద్ధామయుడు, గుణమయుడు, సంస్కారమయుడు, గుణమునుమార్చుకొననిదే శ్రద్ధ మారదు. శ్రద్ధ మారనిచో సంస్కారము మారదు. సంస్కారము మారనిచో వ్యవహారము మారదు. కాబట్టి వివేకవంతుడు ప్రయత్నపూర్వకముగ తనగుణమును (శ్రద్ధను) ప్రప్రథమమున రాజసిక తామసికములనుండి సాత్త్వికమునకు మార్చుకొని అటుపిమ్మట ఇంకను పైకిపోయి గుణరహిత స్థితిని జేబట్టవలెను. అదియే చరమలక్ష్యము. ఇక ఏయే శ్రద్ధ గలవారెట్లెట్లు ప్రవర్తించుదురో ఒకింత విచారించెదము.

సాత్త్వికశ్రద్ధగలవారు దేవతలు మున్నగువారిని ఆరాధించుదురు. రాజసశ్రద్ధగలవారు యక్షులు, రాక్షసులు మున్నగువారిని పూజించుదురు. తామసశ్రద్ధకలవారు భూత

పీతములను కొలుచుదురు. అట్లే ఒక్కొక్క గుణముకల వారికి ఒక్కొక్క విధమైన ఆహారము రుచించుచుండును. ఆ ప్రకారముగనే వారు వారాచరించు యజ్ఞములు, తపస్సులు, దానములుకూడ వారివారి శ్రద్ధను, గుణము ననుసరించి మూడు విధములుగ నుండును. గీతాచార్యుడు వానిన్నిటిని ఈ అధ్యాయమునందు విపులముగ చర్చించెను. మొట్టమొదట ఆహారవిషయమును గైకొని విచారించెదము.

ఆయుర్వర్ధకములును, ఉత్సాహ, బల ఆరోగ్య, సుఖప్రీతులను వృద్ధినొందించునవియు, రసయుక్తములును, చమురుతో గూడినవియు, దేహమునచాలకాలముస్థిరముగానుండునవియు, మనోహరములైనవియునగు పదార్థములతోగూడిన భోజనము సాత్త్వికాహారమని చెప్పబడును. అట్లే చేదు, పులుపు, ఉప్పు, కారములు గలిగినవియు, అత్యుష్ణములును, సారవర్జితములును, దాహజనకములును, శారీరక మానసిక దుఃఖములను, రోగములను గలుగజేయునవియునగు వస్తువులుగల భోజనము రాజసాహారమైయున్నది. వండి చాలసేపైనదియు, రసము లేనిదియు, దుర్గంధముతో గూడినదియు, పాచిపోయినదియు, ఎంగిలిచేయబడినదియు, పూజార్హము కానిదియునగు భోజనము తామసాహారమని చెప్పబడును. వీనిలో రాజస తామసాహారములను త్యజించివేసి ముముక్షువుసాత్త్వికాహారమునే సేవించవలయును. భగవద్గీతలో ఆహారము విషయమై శ్రీకృష్ణమూర్తి ఇన్ని పర్యాయములు సాధకులను ఏల హెచ్చరిక చేయవలసివచ్చినదో ఒకింత ఆలోచింపుడు. ఆహారముయొక్క సూక్ష్మాంశముచేతనే మనస్సు ఏర్పడు

చున్నది. మనస్సు సాత్త్వికాహారములతో గూడియున్నపుడు మాత్రమే ధ్యానము, దైవచింతన, తత్త్వవిచారణ చక్కగా జరుగగలవు. కాబట్టి మనోనిర్మాణమునకు హేతుభూతమైనట్టి ఆహారముయెడల సాధకుడు బహుశ్రద్ధగలిగి యుండవలెను. కారములు మానివేయవలెను. ఏలయనిన, ఈ 'కారము'లు పెరిగినచో ఆ 'కారము'లున్ను (అహంకారము, మమకారము, అపకారము మున్నగునవి) పెరిగిపోవును. మత్స్య, మాంస, మద్యాదులను సేవింపరాదు. తరింప దలంచినవాడు ఏదిగాగా కొంత శిక్షణకు లోనుకావలసియుండును.

అన్ని యింద్రియములను జయించుట ఒక ఎత్తు, నాలుకను జయించుట ఒక ఎత్తు.

జితం సర్వం జితే రసే

రసనేంద్రియమును జయించినచో సర్వేంద్రియములున్ను నిగ్రహింపబడినట్లేయని శ్రీకృష్ణమూర్తి ఉత్తరగీతయందు తెలిపియే యున్నారు. ఇంద్రియములన్నిటిలో జిహ్వాగుహ్యేంద్రియములు రెండునుమహాబలవత్తరములైనవని యెఱుంగవలెను. ఆ రెండును ఒకదానిచే మఱియొకటి సంపుష్టము లగుచుండును. కావున జిహ్వను అరికట్టనిచో బ్రహ్మచర్యము సాధించుట మహాకష్టతరమేయగును. ఈ విషయమును మహనీయులు అనుభవపూర్వకముగా తెలిపియున్నారు. బ్రహ్మచర్యమును సాధించనిచో వచ్చిన నష్టమేమియని మీరడుగవచ్చును.

యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి

అక్షరపరబ్రహ్మమును పొందదలంచినవారు బ్రహ్మచర్యమును సాధించుదురని గీత 8-వ అధ్యాయమున భగవానుడు తెలిపి

యుండుటచేబట్టి పరబ్రహ్మసాక్షాత్కారమునకు ఇదియొక అత్యావశ్యకమైన అంగమని తేలుచున్నది. కనుకనే దీనిని ఈ అధ్యాయమందు తెలుపబడిన శారీరక తపస్సునందుకూడ చేర్చియున్నారు—

'బ్రహ్మచర్యమహింసా చ శారీరం తప ఉచ్యతే'

కావున విజ్ఞులగువారు తమ జీవితములందు ఏదియోరూపమున కొంతవఱకైనను బ్రహ్మచర్యము సాధించియే ఉత్తమ ఫలితములను బడయగల్గుచున్నారు. గృహస్థాశ్రమమున నున్నవారు గృహస్థబ్రహ్మచర్యమును శీలించుచు, సంయమశీలురై యుండవచ్చును. శరీరములోని అతిముఖ్యపదార్థమగు వీర్యము ధ్యాన, దైవచింతనాదులచే ఓజస్సుగ మారి ఊర్ధ్వముఖముగ ప్రవహించునపుడు జీవునియందు అత్యాశ్చర్యకరములగు దైవశక్తు లుదయించుచుండును. అవియన్నియు జీవునకు పారమార్థిక సమున్నతిని గలుగజేసి అతనిని లక్ష్యమునకు చేరువగ గొంపోవుచుండును. వెయ్యేల, ఆధ్యాత్మికరంగమున 'బ్రహ్మచర్యము' ప్రముఖస్థానము నాక్రమించుచున్నది. అద్దాని సాధనకు ఆహారశుద్ధి ఎంతయో అవసరమైయున్నది. కాబట్టి సాధకులగువారు భగవానుడిచట దెల్పిన సాత్త్వికాహారమునే సేవించుచుండవలెను.

అయితే, బహుకాలమునుండి బాగుగ రుచులు మరిగియున్న నాలుక సాత్త్వికాహారసేవనమునకు ప్రారంభమున ఇయ్యకొనదు. తిరుగబడును. కూరలలో కొంచెము ఉప్పు తగ్గినను, కారము తగ్గినను ఎగిరెగిరి పడును ఏమో ప్రళయము సంభవించినట్లు. ఆహారమునకు సంబంధించిన ఇంద్రియములు

రెండు కలవు. ఒకటి నాలుక, మఱియొకటి పొట్ట, ఈ రెంటిలో నాలుక మహాప్రమాదకరమైనది. పొట్ట అమాయకమైనది. దానికి అశుభము శుభము ఏమియు తెలియదు. ఏది వేసిన దానిని స్వీకరించును. కడుపు నిండినచో 'ఇక వేయవద్దు' అని హెచ్చరిక చేయును. 'అలారంబెల్' ప్రయోగించును. కాని ఆ హెచ్చరికను నాలుక పాటింపదు. సంయమముతప్పి ఇంకను భుజించును. తత్ఫలితముగ అజీర్ణము, రోగము సంభవింప, ఒక నాలుకకే కాక, పొట్టకేకాక అన్ని యింద్రియములకు కీడు వాటిల్లును. మఱియు ఉదరమునకు ఇంకొక సుగుణమున్న కలదు. అది రుచులు కోరదు. ఆకలిని తీర్చుమనిమాత్రము ఆదేశించును. దాని కోరిక అంతవఱకే. పదార్థము తీపిగానున్నదా, పులుపుగా నున్నదా అను ప్రశ్నలు అది లేవదీయదు. కాని నాలుక అట్లుకాదు. అది సాధకుని కొంప ముంచివేయును. అతనిని ఒక ఆట ఆడించును పెక్కు రుచులను,రుచికర పదార్థములను అయ్యది వాంఛించుచు జీవుని వేధించుచుండును. ఈ నాలుకను జయించుట సాధకునకు ఒక గొప్ప సమస్యగా తయారగును.

జిహ్వేంద్రియమును జయించుటకు ఒకే ఉపాయము కలదు. అదియే అభ్యాసము. అది కోరినది దానికి ఇవ్వకుండ కొంతకాల మభ్యాసము చేయవలెను. మొదటిలో కొంత కష్టముగనే యుండును. కాని అధికసుఖముకొఱకు అల్పసుఖమును ఎట్లైనను త్యాగము చేయవలసియున్నది. రుచులవలన మనకు లభించు సుఖముకంటె బ్రహ్మానందము ఎన్నిరెట్లో అధికము కదా! జిలేబీ, లడ్లు, మొదలగువానివలన కలుగు సుఖము ఎంతసేపుండును? పోనీ తినినపిదప దానిని మఱచిపోవుస్థితి

కలదా? లేదు. సంస్కారముదయించుటచే మరల అవి ఎపుడు లభించునాయని ఒకే కలవరము కల్గుచుండును. దానిచే మనశ్చాంచల్యము, అతృప్తి, తీరనివాంఛ, ఒకదానివెంట మఱియొకటి ఉరుకులిడుచుండును. కాబట్టి కొంత బాధగా తోచినప్పటికిని ఆయా రుచులను నిగ్రహించిననే జీవునకు ఎప్పటికైనను శ్రేయఃపథము సంప్రాప్తము కాగలదు. ఆ యల్పసుఖమును త్యజించిననే అనంతసుఖమును జీవుడు నోచుకొనగల్గును. త్యాగమే శరణ్యము. 'త్యాగేనైకే అమృతత్వమానశుః'-త్యాగమువలననే అమృతస్వరూపమగు ఆత్మ లభించునని ఉపనిషత్తు లుద్ఘోషించుచున్నవి. కాబట్టి అధికమగు ఆత్మానందముకొఱకై అల్పమగు విషయానందమును జనులు త్యాగమొనర్చుదురుగాక ! అట్టి త్యాగము వలన వారికి నష్టమగునది ఏమియు నుండదు. 'శతేపంచాశత్' న్యాయము ననుసరించి - అనగా నూటియందు యాభై యిమిడియున్న చందమున, వారికి సంప్రాప్తించు బ్రహ్మానందమునందు విషయానందము లన్నియును కూడియే యున్నవని యెఱుఁగవలెను. త్యాగముయొక్క మహిమ యిది.

పూర్వము కౌరవపాండవయుద్ధసమయమున ధర్మరాజు పరిస్థితుల ఒత్తిడివలన 'అశ్వత్థామ అతః-కుంజరః' అని ఒక చెప్పరాని వాక్యము పలుకుట సంభవించెను. తత్ఫలితముగ నాతనికి అంత్యకాలమున 'నరకదర్శన'మను స్వల్ప శిక్ష విధింపబడెను. నరకస్పర్శనముకాదు. నరకానుభవముకాదు. నరకదుఃఖముకాదు, నరకదర్శనమాత్రమే. అదిన్ని ఒకక్షణకాలపర్యంతమే. ధర్మరాజంతటివాడు సంసిద్ధుడయ్యెను. భటులాతనిని

నరకసమీపముగ దీసికొనిపోవుచుండె. మహాపుణ్యమూర్తి ధర్మమూర్తి కనుక అతని రాకచే భీషణసంతాపమయమగు నరక మంతటను శీతలవాయువులు వీవసాగెను. నరక మంతయు 'ఎయిర్ కండిషండ్' (air conditioned) గా మారిపోయెను. దానిచే నరక బాధితులందఱు విస్మితులైరి. వారి తాపముపశమింపజొచ్చెను. దీనికి కారణమేమియని వారందఱును విచారింప ధర్మనిష్ఠుడగు పాండవాగ్రజుని యునికియని తెలిసికొనిరి. తత్క్షణమే ఆ పాపులందఱును ఒక సంఘము (Sinners' Society) గా ఏర్పడి పరుగెత్తుకొని వెళ్ళి ధర్మనందను నిట్లు వేడుకొనిరి-'మహాత్మా! తామెవరో మహాపుణ్యశీలురుగ గన్పట్టుచున్నారు. లేకున్న తమ రాకచే ఈ ఘోర తాపత్రయాగ్ని పరిపూరితమగు నరక లోకమున శీతలచ్ఛాయలు కమ్ముకొనవు. మాపై దయగలిగి తాము కొంతకాల మిచటనే నివసించినచో మా భయంకర సంతాపములు సమసిపోగలవు. మేము హాయిగా ననుభవింప గలము. ఇట్లొనర్చుట తమకొకింత ప్రయాసగ నుండినను, ఇందఱి నరకవాసుల శ్రేయస్సుకొఱకై తమరీ త్యాగమునకు ఒడిగట్టవలెను. పాపుల యీ వాక్యములనాలకించి దయార్ద్రహృదయుడగు ధర్మరాజందుల కంగీకరింప నిశ్చయించెను. కాని ఇంతలో స్వర్గమునుండి దేవభటులేతెంచి ధర్మరాజును 'అయ్యా! తమశిక్ష పూర్తి అయినది. ఇక స్వర్గమునకు కదలుడు'అని ఆదేశించిరి. అందులకు ధర్మరాజు 'నాపుణ్యమంతయు ఈ పాపులకు త్యాగము చేసివైచితిని. దానినంతయు వీరికి ధారాదత్త మొనర్చితిని. ఇక స్వర్గమున కేగుటకు నాకు

పుణ్యము మిగులలేదు' అని పలుక, ఆ దేవభటు లంతట 'ఓ పావనమూర్తీ ! తాము పుణ్యమును త్యాగముచేసినందువలననే తమ పుణ్య మిపుడు ద్విగుణీకృతమై యొప్పారుచున్నది ! కావున ఇక ఏమాత్రము విలంబముచేయక స్వర్గమునకు దయచేయుడు !' అని విన్నవించుకొనిరట !

చూచితిరా ! త్యాగముయొక్క మహిమాతిశయము ! కాబట్టి కొంత కష్టమునకు తెగించియైనను ఇంద్రియార్థముల వలన గలుగు అల్పసుఖమును ఎట్లైనను త్యాగమొనర్చివైచినచో, ఇంద్రియముల నొకింత సంయమనము చేసినచో, ఆత్మానందమను మహత్తర ఫలితమును కైవసము గావించుకొనగలరు. నోరు, ముక్కు, కన్ను, చెవి, స్పర్శేంద్రియము-వీనిని కొంత అదుపులో నుంచవలెను. అవి కోరినవన్నియు వాటికి సమర్పించగూడదు. ఇంద్రియములు తమ సుఖమునే కోరుకొనునుగాని మన సుఖమునుగాదు. తమ శ్రేయస్సునే అవి లెక్కకు తీసికొనునుగాని మన శ్రేయస్సునుగాదు. కాబట్టి ఇవ్విషయమున సాధకులు అతిజాగరూకులై వ్యవహరింపవలసియుందురు. ముఖ్యముగ నాలుకను అరికట్టవలెను. ఏలయనిన—

యోగస్య ప్రథమంద్వారం వాఙ్నిరోధః (వివేకచూడామణి)

అని శ్రీశంకరాచార్యులు తెలిపినట్లు యోగము నభిలషించువాడు అనగా జీవాత్మపరమాత్మల సంయోగమును వాంఛించువాడు మొట్టమొదట తన నోటికి బీగము వేయవలెను. సృష్టికర్తచే జిహ్వేంద్రియమునకు రెండుపనులు (double work) ఏర్పాటు చేయబడినవి - మాట్లాడుట, రుచిచూచుట - అని.

గుహ్యేంద్రియమునకున్ను అట్లే రెండుపనులు విధింపబడినవి - మూత్రవిసర్జన, జననకర్మ-అని. తక్కిన ఇంద్రియములన్నిటికి ఒకేపని నిర్దేశింపబడుటవలన వానియన్నిటికంటెను ఈ రెండును బలవత్తరములై వర్తించుచున్నవి. వాటిని జయించినచో ఇక జగత్తంతయు జయింపబడినట్లే. కాబట్టి నడుముబిగించి రణరంగమున దూకిన ఆధ్యాత్మికవీరుడు-ఈ రెండిటిని నిగ్రహించుటయందు గొప్పఅధ్యవసాయమును, సాహసమునుజూపును. తుట్టతుదకు వాటిని సంయమముచేసిన పరమార్థవిజయముజేపట్టును.

కాబట్టి సంయమమునకు సంబంధించిన కొన్ని నియమములు, వ్రతములు తప్పక శీలించవలెను. రుచులుకోరగూడదు. సాత్త్వికాహారమును సేవించవలెను. అదిన్ని మితముగా భుజింపవలెను.

క్షుద్వ్యాధిశ్చ చికిత్స్యతాం ప్రతిదినం భిక్షౌషధం భుజ్యతాం
స్వాద్వన్నం న తు యాచ్యతాం విధివశాత్ప్రాప్తేన సన్తుష్యతాం.
(సాధనపంచకము)

'ప్రతిదినము ఆకలి అను రోగమునకు అన్నము అను మందును వేయుచు తద్రోగము నుపశమింపజేసికొనవలెను. పెక్కురుచులతో గూడిన భోజనమును కోరరాదు. దైవవశమున సంప్రాప్తించినదానితో తృప్తినొందవలయును.' అని శ్రీశంకర భగవత్పాదులానతిచ్చిరి. ఎంతటి గొప్పయుపదేశము! ఆకలిని ఒక వ్యాధిగావర్ణించిరి. వ్యాధి సంభవించినపుడు ఎవ్వరైన మందును ఎక్కువగాతిందురా? ఎంతఅవసరమో అంతమాత్రమే సేవించుదురు. ఒక్కపిసరుకూడ అధికముగా గైకొనరు. అట్లే ఆకలి అను వ్యాధి ప్రతివానికిని ప్రతిదినమున్ను కలుగుచున్నది. దాని యుపశమనమునకై అన్నమను ఔషధమును అవసరమై-

నంతమాత్రమే మోతాదుగా భుజించవలెను. మితముగ సేవించవలెను. మఱియు రోగి ఔషధము తినునపుడు దాని రుచిని పాటింపడు. రుచిగాలేదే అని వైద్యుని ప్రశ్నింపడు ఒకవేళ మందు చేదుగానున్నచో; దానివాసన భరింపజాలనిది యగుచో ఎట్లో ముక్కుమూసుకొని, కండ్లుమూసుకొని గభాలున మ్రింగివేయును. దాని రుచులనుగూర్చి విమర్శచేయడు. అట్లే ఆకలి అను రోగమునకు విధివశమున సంప్రాప్తించు అన్నమను ఔషధమును భుజించవలెనేకాని, భోగవిలాసములతో గూడిన భోజనమునుగాదు. మఱియు సామాన్యముగ రోగము ఎపుడో ఒక పర్యాయము వచ్చును. కాని ఈ ఆకలి అను రోగము ప్రతిదినమున్ను నియమము తప్పక ప్రతివారికిన్ని వచ్చుచునే యుండును. కాబట్టి దీని విషయమై ఇంకను జాగ్రత అవసరము. ఈప్రకారముగ భోజనము సాత్త్వికముగ మితముగ నున్నప్పటికిని భగవంతునకు నివేదనముచేయక భుజించినచో అదియు ఉత్తమ ఫలమును గలుగజేయజాలదు. మఱియు అన్యాయార్జిత విత్తమువలన లభించిన ఆహారమున్ను శ్రేష్ఠఫలములను ఒసంగకుండును. కాబట్టి ఇన్నివిధముల తాను గైకొను ఆహారమును పునీత మొనర్చుకొని సేవింపవలసి యున్నది. అపుడు మాత్రమే అయ్యది జీవుని యంతఃకరణమునందు సాత్త్విక అణువులను సృష్టిజేసి ఆతని పారమార్థిక అభ్యుదయమునకు లెస్సగ తోడ్పడగలదు.

ఇవ్విధముగ శ్రీకృష్ణపరమాత్మ ఆహారమును గుఱించి ప్రస్తావించి, తదుపరి క్రమముగ యజ్ఞము, తపస్సు, దానము - వీనియొక్క త్రివిధభేదములనుకూడ వక్కాణించెను. ఫలమును

గారవ విధిప్రకార మాచరించు యజ్ఞము సాత్త్వికమున్ను, ఫలాపేక్షతో డాంబికముగ జరుపు యజ్ఞము రాజసమున్ను, శాస్త్ర విధి నుల్లంఘించి, మంత్రాదులను వదలివైచి అశ్రద్ధతో నాచరించు యజ్ఞము తామసమున్ను అగును. ఫలాపేక్షారహితముగ నిష్కామముగ, దైవార్పితముగ గావింపబడు కర్మలకుమహోత్తర ఫలితము చేకూరగలదనియు, ఫలాపేక్షతో, సకామముగ నాచరింపబడు కర్మలకు ఉత్తమఫలములు కలుగవనియు గీతయందనేకసార్లు భగవానుడు తెలిపియేయున్నాడు. కావున ధీమంతుడు నిష్కామపద్ధతినే ఆశ్రయించుట శ్రేయస్కరము.

త్రివిధ తపస్సులనుగూర్చి చెప్పునపుడు గీతాచార్యుడు ఒక నూతనపంథా త్రొక్కెను. ముందుగ శారీరక వాచిక మానసిక తపస్సులను పేర్కొని ఆ పిదప సాత్త్విక రాజసిక తామసిక తపస్సులను ప్రస్తావించెను. దేవతలను, బ్రహ్మనిష్ఠులను, గురువులను, జ్ఞానులగు మాననీయులను పూజించుట, శౌచము, ఋజుత్వము, బ్రహ్మచర్యము, అహింస-మున్నగు లక్షణములు కలిగియుండుట శారీరక తపస్సనబడును సామాన్యముగ 'తపస్సు' అను శబ్దము వినగనే జనులలో ఒక విధమైన భీతావహము కలుగుచున్నది. ఏల యనగా వారి దృష్టిలో తపస్సనగా-తల క్రిందపెట్టి కాళ్ళు పైకిపెట్టి సంవత్సరముల పర్యంతము ఉండుట, అన్నాహారములను వర్జించుట, ఆకు అలములను తినుట, వాయుభక్షణము, జలభక్షణము గావించుట, మండుటెండలో ఒంటికాలిపై నిలబడి ధ్యానము చేయుట-మున్నగునవి యని భావము. కాని అట్టివి యేవియు భగవానుడిచట తెలుపలేదు. సర్వజనసులభసాధ్యములైన

క్రియలనే ఇట పేర్కొనెను. వాస్తవముగ తనయందున్న రజోగుణ తమోగుణములను తపింపజేసి నిర్మూలన మొనర్చుటయే తపస్సనబడును. మనస్సునకు పట్టియున్న ఈ మాలిన్యమును తొలగింపకయే కేవలము భౌతిక దేహమును మాత్రము ఎండవానలలో బాధపెట్టినందువలన ఏమి ప్రయోజనము సిద్ధించును? కనుకనే శ్రీకృష్ణమూర్తి అట్టి క్లేశకరములగు తపస్సుల నేమియు ప్రస్తావించక కేవలము చిత్తనైర్మల్యమున కుపకరించు విధానములనే తపస్సుగ వర్ణించెను.

ప్రపథమమున శారీరక తపస్సుయొక్క లక్షణములను ప్రస్తావించుచు దైవము యెడల మహనీయుల యెడల వినయ విధేయతలు గలిగియుండవలెననియు, వారిని పూజించవలెననియు వక్కాణించెను. బ్రహ్మానుభూతిగల మహనీయులు అవనిపై మూర్తీభవించిన దేవరూపులే (Gods on earth) యగుదురు. 'బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి' 'జ్ఞానీత్వాత్మైవ మేమతమ్' ఇత్యాది శాస్త్రప్రమాణముల ననుసరించి, వారు దేవుని ప్రతినిధులుకాదు-సాక్షాత్ దేవులే అయియున్నారు. 'జంగమదేవాలయము' లగువారు లోకమున ప్రాణికోట్ల యొక్క శ్రేయస్సుకొఱకు సంచరించుందురు. అట్టివారి యెడల ముముక్షువు ఎంతెంత విధేయత, భక్తిభావము గలిగి యుండునో, అంతంత ఉన్నతిని ఆతడు పొందుచుండును. కనుకనే గురుభక్తి, గురుసేవ మున్నగునవి అత్యవసర అంగములుగ సాధకునకు చెప్పబడినవి, అయితే ఇక్కాలమున పెద్దలకు నమస్కరింపవలెనన్నన వారలను పూజింపవలెనన్నన కొందఱికి 'ప్రతిష్ఠ' అడ్డుపడుచున్నది. కాని లౌకిక ప్రతిష్ఠలకు

భగవత్సాన్నిధ్యమందు విలువనే లేదని. అట్టివారు ఎంత శీఘ్రముగ గ్రహించిన అంతమంచిది. మృత్యువునకు లోబడియున్న వారి ఘనత ఏపాటిది? కాలుని భయంకరవదనమున చప్పరించి వేయబడుటకు సిద్ధముగానున్న జనులయొక్క డిగ్రీలకు, కీర్తులకు, అధికారములకు, పదవులకు, ఎంతవిలువయుండును? అమృతస్వరూపమై, శాశ్వతమై అకళంకమైనట్టి దైవశక్తియొక్క సమీపమున ఆ మిథ్యాగౌరవములన్నియు సూర్యునియెదుట నక్షత్రకాంతివలె వెలవెలపోవును. కావున అవి యున్నంతమాత్రమున ఎవరును విఱ్ఱవీగరాదు. మహాత్ములను చిన్నచూపుచూడరాదు. కనుకనే అట్టి మహనీయులను సమీపించునపుడు చెప్పులను దేవళము బయట విడిచివచ్చునట్లు, తమ తమ ప్రాపంచిక ఘనతను దూరముగ వదలిపెట్టి నిరహంభావముతో రావలెను. 'ప్రణిపాతేన' అనునట్లు పూర్ణ ప్రపత్తితో కుందుకొని వారలకు సాష్టాంగవందనమాచరించవలెను. ఇదియొక విధమైన తపస్సు. దీనికే శారీరక తపస్సని గీతాచార్యుడు నామకరణము చేసెను. ఇట్టి తపస్సువలన మనుజునకు రెండు లాభములు చేకూరును. తనయందున్న అహంభావము చచ్చుట, పెద్దలయొక్క అనుగ్రహము సంప్రాప్తమగుట-అను ఈ రెండు మేళ్ళును ఒకేతూరి చేకూరును. దానిచే ఆధ్యాత్మిక పథమున సాధకుడు అతి శీఘ్రముగ అత్యున్నతశిఖరముల నధిరోహింప గల్గును. కాబట్టి సంసార దుఃఖతారణ మపేక్షించువారు మహనీయుల యెడల భక్తిశ్రద్ధలను ఉపేక్షింపరాదు.

ఇక శౌచమనునది మఱియొక తపస్సు. ఇదియు శరీర తపస్సులో చేరినదే. శౌచమనగా బాహ్యాభ్యంతర శుద్ధియని

ఇట గ్రహింపవలెను. బాహ్యశుద్ధియెడల జను లెట్టి శ్రద్ధగలిగి యున్నారో, హృదయశుద్ధి విషయమునగూడ అంతశ్రద్ధయుండ వలెను. పంచాయతీవారు, పురపాలకసంఘమువారు తమగ్రామ ములలోను. పురములలోను ప్రతిదినము పాకీవాండ్రచే మరుగు దొడ్లు, వీధులు శుభ్రపఱిపించుదురు. నిద్రలేవగనే ఆయా పట్ట ణములందు ఈ పని మొమ్మొదట ప్రారంభింపబడు చుండును. ఏల, నెమ్మదిగా ఏ సాయంత్రమో చేయింపరాదా? అట్లు చేసినచో దినమంతయు జనులు దుర్గంధమును భరించలేక బాధపడుదురు. అట్లే ఈ శరీర మొకపురము. తొమ్మిది ద్వార ములుగల ఒక మహాపట్టణము. 'నవద్వారేపురే దేహీ' అని శ్రీకృష్ణభగవాను డీ విషయము నిదివఱకే బహిర్గత మొనర్చి యున్నాడు. ఇట్టి దేహపురమున సరియైన పురపాలక సంఘ ములు (Municipalities) పనిచేయుటలేదు. కనుకనే ఆ పురమున కుళ్ళు పేరుకొనిపోవుచున్నది. శరీరము కుళ్ళి, రోగముల కాస్పదమగుచున్నది. మనస్సుకుళ్ళి సంసార దుఃఖమునకు హేతుభూతమగుచున్నది. కావున—

యః స్మరేత్ పుండరీకాక్షం స బాహ్యాభ్యన్తరశ్శుచిః.

అను సంధ్యావందనమంత్రము ననుసరించి, ఎవడు పరమాత్మను నిర్మలభక్తితో సేవించునో, అట్టివాడు బాహ్యాభ్యంతరము లందు శుచిత్వమును సంపాదింపగల్గును. శౌచమున కిది చక్కటి ఉపాయము. మఱియు—

మలనిర్మోచనం పుంసాం జలస్నానం దినేదినే
సకృద్గీతాంభసి స్నానం సంసారమలమోచనమ్.

శరీరముపై గల మురికినికడిగివేయుటకు జనులెటుల ప్రతిదినము స్నానమాచరించుచురో, అట్లే మనస్సునకు పట్టిన అజ్ఞానమను సంసారమాలిన్యమును తొలగించుటకు గీతాదిశాస్త్రములందు తెలుపబడిన ధర్మములను నిర్మలతోయము నాశ్రయించవలెను. బాహ్యశౌచమునకు వలసిన పరికరములు కొన్నిగలవు-సబ్బు, సున్నిపిండి,సీకాయ,కుంకుడుకాయ మున్నగునవి. జనులు వీటిని సంపాదించుకొనుచున్నారేకాని అంతఃశౌచమునకు వలసిన నైతిక, ఆధ్యాత్మిక పరికరములగు శమదమాదులు, గీతాది శాస్త్ర విచారణ, భక్తివైరాగ్యములు మున్నగువానిని లెస్సగ సమకూర్చుకొనుటలేదు. బాహ్యశౌచమున్నను అంతఃశౌచము లేనిచో సుందరముగ నలంకరింపబడిన దేవాలయమునందు విగ్రహములేని చందమున నుండును. లేక, పాలివ్వని అందమైన గోవుచందమున నుండును. కాబట్టి బాహ్యాభ్యంతరశౌచములు రెండిటిని సంపాదించి, స్థూల సూక్ష్మదేహములు రెండింటిని సునిర్మలముగ నుంచుకొని, దైవమార్గమున అగ్రేసరుడు కావలెను. ఇట్టి క్రియలచే జీవుడు పరమాత్మకు అతిసన్నిహితుడు కాగల్గును. ఇదియు ఒక విధమైన తపస్సని గీతాచార్యుడు మనలకు బోధించుచున్నాడు.

ఇట్టి శౌచముతోపాటు ఋజుత్వము, బ్రహ్మచర్యము, అహింస యను ఉదాత్తగుణములనుగూడ నవలంభించవలెనని గీతామాత యాదేశించుచున్నది. తాను తలంచినట్లు చెప్పుట, చెప్పినట్లు చేయుట-ఇది ఋజుత్వము (Straight-forwardness.) మనోవాక్కాయములు మూడును ఏకీభవించవలెను. దీనినే త్రికరణశుద్ధి యందురు. వక్రత్వము, వంకరటింకరగుడువ్యవ

హారము-ఇది పరమార్థసాధకునకు ఏకోశమునను ఉండరాదు. సర్పము ఋజువుగ, తిన్నగ పోలేదు. వంకరటింకరగపోవును. ఏలయనిన దానియందు విషముకలదు. అట్లే లోన కపటము, మోసము, దుర్మార్గము, దుష్టతలంపులు కలవారు తిన్నగ పోలేరు. ఋజుత్వము నవలంబించలేరు. కావున లోని యావిష మును పారద్రోలి వక్రత్వములేని చక్కని జీవితమును గడుప వలెను.

ఇక రెండవది బ్రహ్మచర్యము. దీనిని గుఱించి యిది వరలో తెలిపియున్నాను. దీపము చక్కగ వెలుగవలెననిన తైల మొట్లు సమృద్ధిగ నుండవలెనో, శరీరమున జ్ఞానజ్యోతి లెస్సగ ప్రకాశింపవలెననిన, దైవధ్యానము మున్నగునవి బాగుగ జరుగవలెననిన, పోషణశక్తియగు వీర్యము వ్యర్థము కాకుండ చూడవలెను. దానిని జాగరూకతతో కాపాడుకొని ధ్యానాదులచే ఓజస్సుగ పరిణమింప జేయవలెను. అట్లే మానసికముగ గూడ బ్రహ్మచర్య విరుద్ధములగు సంకల్పము లెవ్వియు జొరబడకుండ చూడవలెను. జీవితములో శృంగారమే శరణ్యమని యెవరును భావింపరాదు. గార్హస్థ్య జీవితము కేవలము కామతృప్తికొఱకే ఏర్పడినదని తలంచువారు చాల పొరబడినవారే యగుదురు. గృహస్థాశ్రమ మనగా కామాను భవమునకు లైసెన్సు (license) అని ఎవరును తలంపరాదు. వైవాహిక జీవితమునుగూడ తక్కిన యాశ్రమ జీవితములవలె పరమపవిత్రముగ గడుపవలసి యున్నది. విధియుక్తముగ గృహస్థ జీవితమును గడుపుచు, ఇంద్రియములను విచ్చలవిడిగ పరుగిడనీయక, హద్దులను అతిక్రమింపకుండజూచుచు, సంయమ

శీలుడై యొప్పినచో, ఉత్తమ ఫలితములు చేకూరగలవు. ఇక్కాలమున మనుజుడు ఇంటివెసి వదలి బయట అడుగు పెట్ట గనే, బజారునందుగాని, పరిసరములందుగాని వినబడు శబ్ద ములు, కనబడు రూపములు, అతని నైతిక పవిత్రతను, ఆధ్యాత్మికదృష్టిని భంగపరచునవిగా నున్నవి. ఇదివఱలో పట్టణములు, నగరములందు మాత్రమే ఇట్టిపరిస్థితి యుండెను. ఇపు డది గ్రామములకుకూడ ప్రాకెను. కావున తన నైతిక విలువలను కాపాడుకొన దలంచు విజ్ఞుడు లోకమున బహు మెలకువతో నుండి తన చరిత్రకు భంగకరములైన శబ్దములను వినకుండ, దృశ్యములను చూడకుండ, వస్తువులను స్పృశించ కుండ, కార్యములందు ప్రవేశింపకుండ, మఱియు అట్టి ప్రతి కూల వాతావరణముతో గూడియున్న జనులతో కలియకుండ చాల జాగ్రతగ మెలగవలసియున్నది.

మా ద్రాక్షం క్షీణపుణ్యాన్ క్షణమపి భవతో భక్తిహీనాన్పదాబ్జే
మా శ్రౌషం శ్రావ్యబంధం తపచరితమపా స్యాన్యదాఖ్యానజాతమ్
మా స్మార్షం మాధవ త్వామపి భువనపతే చేతసాపహ్నువానాన్
మా భూవం త్వత్సపర్యావ్యతికర రహితో జన్మజన్మాన్తరేఽపి.

(ముకుందమాల)

'లోకైక ప్రభువగు ఓ మాధవా ? క్షణకాలమైనను భక్తితో నిన్ను ధ్యానింపని పాపాత్ములను నా కన్నులతో చూడనివ్వ కుము. పరమపవిత్రమగు నీ చరితామృతకథనము లేని యితర వాక్యమొక్కటియైనను నా చెవులకు సోకనీయకుము నీయందు విశ్వాసము లేనివారలను నా మనస్సునందు స్ఫురింపనీయ కుము. జన్మజన్మాంతరములందును నీ సేవాశుశ్రూషలు లేకుండ నన్ను ఉండనీయకుము' - అని శ్రీ కుల శేఖరాళ్వారు

వలె మనమున్ను భగవంతుని ప్రార్థింపవలసియుండును. ఈ ప్రకారముగ తన శీలమును చక్కగ పరిరక్షించుకొనుచు శారీరకముగ, వాచికముగ, మానసికముగ బ్రహ్మచర్యమును కాపాడుకొనువానికి అఖండశక్తిసామర్థ్యములు కలుగుటయే గాక, మోక్షము అతిసన్నిహితమై వర్తించును. బ్రహ్మచర్యము దృఢముగ గలవానికి సాగరమున్ను గోష్పదతుల్యముగనే యుండును. అది లేనివానికి గోష్పదమున్ను సాగరతుల్యముగ నుండును.

బ్రహ్మచర్యవ్రతో భీమస్సింహోఽపి శునకో భవేత్
బ్రహ్మచర్యస్య హీనేతు శ్వా భీమస్సింహవద్భవేత్.

మఱియు బ్రహ్మచర్యము చక్కగ పాటించువానికి భయంకరమగు సింహమున్ను కుక్కవలె అల్పముగ తోచును. అదిలేనివానికి కుక్కయు భయంకర మృగరాజువలె తోచును. బ్రహ్మచర్యమునకట్టి అపారమహిమయు, సామర్థ్యమును గలిగి యుండుట బట్టియే భగవత్ప్రాప్తికి అద్దానిని ఒకానొక ప్రధానమైన అంగముగ అత్యావశ్యకమైన సాధనగ గీతాది గ్రంథములందు పేర్కొనిరి*. దాని మహిమ వర్ణనాతీతము. అనుభవించినవానికే అది తెలియును. అయితే ప్రారంభములో దానిని సాధించుటయందు సామాన్యమానవుడు కొన్ని కష్టములను ఎదుర్కొనవచ్చును. గొప్పవస్తువులను పొందవలసి వచ్చినపుడు కొంత త్యాగ మవసరమేకదా! జన్మజన్మాంతర

* (1) ప్రశాన్తాత్మా విగతభీర్బ్రహ్మచారివ్రతే స్థితః (6-14)
(2) యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి (8-11)
(3) బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే (17-14)

ములనుండియు బాగుగ బలపడి క్రొవ్వెక్కియున్న ఇంద్రియములు నిరోధమును చవిచూచునపుడు సహజముగనే తిరుగబడి మనుజుని యాటపట్టించును. అత్తఱి గొప్పపట్టుదల, దృఢవ్యవసాయము, వివేకము, నిర్మలభక్తి అవసరమైయున్నవి. అవి కలవానికి బ్రహ్మచర్య సంరక్షణము సులభముగనే సంభవమగును. ఇట్టి మహిమాతిశయముతో గూడిన బ్రహ్మచర్యము పరమార్థసాధకునకు ఎంతయో అవసరమగుటచే బట్టియే శ్రీకృష్ణమూర్తి అద్దానిని శారీరక తపస్సులలో నొకటిగ చేర్చివైచెను. కావున ముముక్షువు లద్దానిని తప్పక సాధించుదురుగాక !

ఇక శారీరక తపస్సులలో కట్టకడపటిది అహింస. శరీరముతోగాని, వాక్కుతోగాని, మనస్సుతోగాని ఏ ప్రాణికిని అపకారము కలుగజేయకుండుటయే అహింస యనబడును. మనస్సునందు ఒకానొకనినిగూర్చి చెడ్డగ తలంచుటగూడ హింస క్రిందనే జమకట్టబడును. అహింస ఏల ఆచరింపవలెను? హింస యనునది దోషముగ నెందులకు పరిగణింపబడినది ? ఒకడు మఱియొకనిని ఏల బాధింపరాదు ? ఇత్యాది ప్రశ్నలకు శాస్త్రములు చక్కని సమాధానము చెప్పుచున్నవి. అదియేది యనిన - 'నీయందు ఏ పరమాత్మ భాసించుచున్నాడో, ఆతడే సర్వప్రాణికోట్లయందును వెలయుచున్నాడు. అంతయు ఒకే స్వరూపము. ఇట భిన్నత్వము వాస్తవముగ లేదు. ఒకే సముద్రము వివిధతరంగముల రూపమున వ్యక్తమగునట్లును, ఒకే వృక్షము వివిధశాఖాపత్రపుష్పాదుల రూపమున ప్రకటమగునట్లును, ఒకే పరమాత్మ భిన్న భిన్న రూపములుగ ఈ

ప్రపంచమున భాసించుచున్నాడు. దిండు గలేబులు రకరకము లుగనున్నను లోనగల దూది ఒకేవిధముగ నున్నట్లున్ను, గోవులు వివిధాకృతులతో నున్నను, అందలి క్షీరము ఏకవర్ణ ముగనే యుండునట్లున్ను, జీవుల ఉపాధులు వేఱ్వేఱుగ నున్న ప్పటికిని అన్నిటియందును అనుస్యూతమై వ్యాపించియున్న చైతన్యముమాత్రము ఒక్కటే యున్నది. 'సూత్రేమణిగణా ఇవ' అనునట్లు మణిహారమున దారమువలె అంతర్యామిగ పరమాత్మ సర్వభూతములయందును అధివసించుచున్నాడు. కాబట్టి ఒక తరంగము మఱియొక తరంగమును బాధించిన ఎట్లుండునో, ఒకవ్యక్తి మఱియొకవ్యక్తిని బాధించుట అట్లుం డును. ఒకరిని హింసించుట తన్ను తాను హింసించుకొనుటయే యగును. ఈ ప్రకారముగ భగవంతుని సర్వవ్యాపకత్వ సూత్రముపైననే అహింసా సిద్ధాంతము ఆధారపడియున్నది. ఆ సూత్రమును విస్మరించినచో ఇక అహింసాధర్మ ప్రతిపాద నకు సరియైన హేతువు, బలువైన ఆధారము లభించుట కష్టము. కాబట్టి ఒకరిపై ప్రేమ, దయ, కరుణ ఎందులకు కలిగి యుండవలెనని ఎవరైనను ప్రశ్నించినగాని, లేక ఒకరిపై ఏల ద్వేషము కలిగియుండకూడదు, ఒకరి నేల బాధింపగూడదని ప్రశ్నించినగాని, ఈ విశ్వవ్యాపక పరమాత్మ చైతన్యము యొక్క అస్తిత్వము వలననేయని సమాధానము చెప్పవలసి యుండును. ఈ ప్రపంచము విభక్తమైయున్నప్పటికిని వాస్తవ ముగ అవిభక్తమైనదే. ఇట్లెఱుగుటయే ఉత్తమజ్ఞానము.*

* అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్. (18-20)

ఈ రహస్యము తెలియనివారు మాత్రమే ఒకరి నొకరు ద్వేషించుకొందురు.

పూర్వకాలమున ఒక గురువుండెడివాడు. అతని కొక శిష్యుడుండెను. గురువున కాతడు సేవాశుశ్రూషలు గావించు చుండెను. ఇట్లుండ కొంతకాలమున కా గురువునొద్దకు మఱి యొక శిష్యుడువచ్చి చేరెను. ఇరువురును భక్తితో గురువును సేవించుచుండిరి. ఒకనాడు మధ్యాహ్నసమయమున గురువు దూరప్రదేశమునుండి తిరిగివచ్చి బడలికచే చాపపై ఒకింత సేపు విశ్రమించెను. పరుండబోవునపుడు తన మొదటి శిష్యుని పిలిచి, ఒరే! నాయనా! కాళ్ళు నొప్పిగానున్నవి, కొంచెము సేపు ఒత్తరా! అని యాదేశించెను. ఆతడట్లు గురువును సేవించుటకు వచ్చుచుండగా, ఇంతలో రెండవ శిష్యుడు ఒక ఆక్షేపణ (Point of order) తెచ్చెను - అతడు గురువుతో 'మహాత్మా! ఇతడు పాతవాడు, చాలకాలమునుండియు తమ సేవ చేయుచున్నాడు. తత్ఫలితముగ ఇప్పటికే బండెడు పుణ్యమును మూటకట్టుకొనివేసెను. నేనింతవఱకు గురుసేవా లభ్యమగు రవ్వంత పుణ్యమునకైనను నోచుకొనలేదు. ఉన్నకాస్త పుణ్యమును ఇరువురును పంచుకొనవలెనేకాని అంతయు అతని పాలిటనే పడుట న్యాయవిదూరము. కాబట్టి నేటి కతనిని నిలిపివైచి నాకే ఈ అవకాశమును యిప్పించ వేడెద!' అని ప్రార్థించెను. మొదటి శిష్యుడు ఏమియు తక్కువ తినినవాడుకాదు. అతడు వెంటనే ఉగ్రుడై 'స్వామీ! గురువర్యా! అతని వాక్యములను వినకుడు. క్రొత్తగా వచ్చెను గనుక కాళ్ళు పిసుకుట అతనికి సరిగా

తెలియదు. అనవసరముగ తాము బాధకు గురియగుదురు. ఏ ఉద్యోగమునందైనను అనుభవము (Service)నకే ఎక్కువ ప్రాధాన్య మొసంగుట లోకధర్మము. తమకు తెలియనిది ఏమున్నది?' అని చెప్పి యూరకుండెను. ఈ ప్రకారముగ ఆ యిద్దఱు శిష్యులు గురువునకు లేనిపోని ఒక సమస్యను తెచ్చి పెట్టిరి. మాయాబంధమును ఛేదించివేయుట గూడ ఆ గురువునకు సులభమనిపించెనుగాని ఈ పరమానందశిష్యు లిరువురికిని రాజీ చేయుటమాత్రము మహాదుస్తర మనిపించెను. ఏమి చేయుటకు తోచక, తుద కొక 'మధ్యేమార్గ' మవలంబింప నిశ్చయించి, ఇరువురిని దగ్గఱకు పిలిచి 'ఒరే నాయనలారా! తగవులాడుకొనకుడు. భగవంతుడు నాకు రెండు కాళ్లు ఇచ్చి యున్నాడు. కనుక చెరియొక కాలు పంచుకొని సేవించుడు. ఈ పీడకు ఇదియే విరుగుడు' అని చెప్పి పరుండెను.

శిష్యులిద్దఱున్ను 'భేష్, భేష్' అని సంతోషించి అట్లే చెరియొక కాలు పంచుకొని సేవించుచుండిరి. వైమనస్యము అసలు ఉండరాదు. ఉండినచో అది యేదియో ఒకరూపమున బయటకు వెడల్రగక్కబడుచునేయుండును. ఈ శిష్యుల విషయ మట్లు అయినది. పొరపాటున ఒకరు పిసుకుచుండిన కాలు మఱి యొక దానికి కొద్దిగా తగిలెను. అవతలివాడు కోపగించి 'ఏమిరా! ఒళ్ళు దగ్గఱపెట్టుకొని పనిచెయ్యి' అని మందలించి ప్రతీకార చర్యగ తాను ఒత్తుచుండిన గురువుకాలు ఎత్తి అమాంతముగ అవతలదానిమీద విసరివేసెను. వాడున్ను రుద్రాకారమును ధరించి 'ఒరే! నా కాలు'ను కొట్టెదవా?- 'నీ కాలు' పని పట్టించెదను చూడు!' అని రోషారుణితనేత్రుడై

దగ్గఱనేయున్న గురువుగారి కమండలువును తీసికొని దానితో అవతలి కాలుమీద బలవంతముగ కొట్టెను. వాడున్ను ప్రతీయాకృతి వహించి గురువుగారి యోగదండము తీసికొని ఇవతలి కాలును చావమోదెను. ఈ 'గలాటా' అంతయు చూచి గురువుగారు నిద్రలేచిరి. శిష్యుడు శిష్యుడు పోట్లాడుకొని గురువుకాళ్ళు చప్పగ నాశనముచేసిరి. గురువు బాధతో 'ఏమిరా ఈ గల్లంతు!' అని అరువగా ఆ శిష్యులిరువురును 'మహాత్మా! తాము పరుండుడు! ఇది మా అంతరంగ వ్యవహారము (domestic affair). ఇదేదో తేలవలె, వాడి కాలు గొప్పో, నా కాలుగొప్పో' అని పలికిరి. అంతట గురువు 'ఒరే! నీకాలు, వాడికాలు ఏమిరా, ఆ రెండును నా కాళ్ళు కదరా! ఎంత తెలివితక్కువవారురా మీరు!' అని తిట్టి ఇరువురిని దూరముగ పంపివైచెను.

అట్లు ప్రపంచమునందలి జీవరాసులందఱును పరమాత్మయొక్క అవయవములు. అవయవములు వేఱ్వేఱుగ కనిపించినను 'అవయవి'దృష్ట్యా వానియన్నిటియందును ఏకత్వమే కలదు. దృష్టాంతమందలి గురువుగారి ఒక కాలు మఱియొక కాలును తన్నుట ఎంతహాస్యాస్పదమైన విషయమో, ఒకప్రాణి మఱియొక ప్రాణితో పోట్లాడుట, దానిని ద్వేషించుట, హింసించుట అంత హాస్యాస్పదమేయగును. 'సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి'-'ఏ దేవునకు నమస్కరించినను అది విష్ణువునకే చెందును' - అని మనము పూజలో చెప్పుకొనుచున్నాము. మంచిదే. కాని దానితోపాటు 'సర్వజీవతిరస్కారః కేశవం ప్రతిగచ్ఛతి'-'ఏ జీవుని తిరస్కరించినను (దూషించినను

'అదియు దేవునకే చెందును'- అను వాక్యమునుగూడ మనము జ్ఞాపకము చేసికొనవలెను. చిన్నప్పుడెప్పుడో కుమారస్వామి పిల్లిని కొట్టెనట. కొట్టిన పిదప తల్లియగు పార్వతీదేవివంక చూడ, ఆమె బుగ్గపై ఎఱ్ఱటివాత తేలియుండుటగాంచి షణ్ముఖుండు పరితాపమునొంది, సర్వజీవరాసులు దేవీస్వరూపులుగ నిర్ణయించుకొని అపారభూతదయను అలవరచుకొనెనని చెప్పుకొనుచుందురు. కాబట్టి ఒక ప్రాణికి ఉపకారము చేసినచో భగవంతుని పూజించినట్లే. నరునకు సేవచేసినచో నారాయణునికి అర్పించినట్లే. అట్లే ఒక ప్రాణికి అపకారము చేసినచో దేవునకు అపకారము సలిపినట్లేయగును. ఇట్టి ధర్మసూక్ష్మము నెఱిఁగి జనులు జీవకారుణ్యమును, సర్వభూతదయను అలవఱచుకొని, అహింసను త్రికరణశుద్ధముగ నాచరణయందుంచుకొనుచు భగవత్కృపకు పాత్రులు కావలయును. అహింస, పరోపకారము మున్నగు మహోన్నత నైతికగుణములయొక్క ప్రాముఖ్యత జూచియే శ్రీకృష్ణపరమాత్మ గీతయందు మాటిమాటికి భూతదయను ప్రోత్సహించుచు పోయెను.*

జనులలో మూడు తరగతులవారుందురు. మొదటి తరగతివారు-

**तेरा ही तेरा, मेरा भी तेरा** (తేరా హీ తేరా, మేరా భీ తేరా) 'నీది నీకే ఉంచనీ, దానితోపాటు నాదికూడ నీవే తీసుకో'.అని చెప్పువారు. వీరు సర్వోత్తమపురుషులు, త్యాగ

* (1) అద్వేష్టా సర్వభూతానాం (12-13)

(2) సర్వభూతహితేరతాః (12-4)

(4) నిర్వైరస్సర్వభూతేషు. (11-55)

శీలురు. తాను తగ్గించుకొనికూడ ఇతరులకు సమర్పించువారు తన హితమునుగూడ పాటింపక పరహితమును వాంఛించువారు స్వార్థరహితులు. పరోపకారపారీణులు, రంతిదేవుడు, శిబిచక్రవర్తి, దధీచి మున్నగువారిట్టి కోవకు చెందినవారు. వారు అవనిపై మూర్తీభవించిన దేవులే కాని మానవులు కారు. ఇక రెండవ తరగతివారు-

**तेरा ही तेरा, मेरा ही मेरा** (తేరా హీ తేరా, మేరా హీ మేరా) 'నీది నీకుండనీ, నాది నాకుండనీ, నా జోలికి నీవు రావద్దు; నీజోలికి నేనురాను; నీసొత్తు నాకు వద్దు నా సొత్తు నీకువద్దు'. ఈ ధోరణిలో నుండువారు. వీరు మధ్యరకపు మనుష్యులు. వారివారి గొడవ వారు చూచుకొనుచుందురు. మఱియొకరి గొడవ వారికి పట్టదు. పట్టించుకొననుకూడను. ఇతరులకు ఉపకారము చేయరు. కాని అపకారముమాత్రము చేయకుందురు. ఇట్టివారివలన లోకమునకు మేలు లేకపోయినను, కీడు ఉండదు గనుక కొంతమెఱుగే యని చెప్పవచ్చును. వారి వారి కుటుంబపోషణమునందును, వారి వారి సంపాదనయందును తలమునకలుగా వర్తించుచు, ఒకరికి అపకారము చేయవలెనను తలంపులేక, ఉపకారము చేయవలెనను తలంపు అంతకంటెనులేక తమ గొడవలో తాము మునిఁగియుండు జనానీకమంతయు ఈ తరగతిలోనే చేరును. ఇక మూడవ తరగతివారు-

**मेरा ही मेरा, तेरा भी मेरा** (మేరా హీ మేరా, తేరా భీ మేరా) 'నాది నాకుండనీ, నీదికూడ నాకేరానీ',-అను సిద్ధాంతము ననుసరించువారు వీరు కనిష్ఠులు. స్వార్థపరులు. "ఆశా

పాశ శతైర్బద్ధులు". అపర కబంధులు. తాను సుఖపడవలె, ఎదుటివాడు దుఃఖపడవలె, అను దుష్టాలోచన కలవారువీరు. వీరు లోకమునకు భారభూతులు. రావణ, దుర్యోధనాదులు ఈ తెగకు జెందినవారు. ఇది మానవత్వమును భ్రష్టమొనర్చి, జీవుని యభ్యున్నతిని భంగముచేయుపద్ధతియేకాని మరియొకటి కాదు. ఇట్టి స్వభావము కలవారు క్రమక్రమముగ మనుష్యత్వమునుండి దిగజారి, పశుత్వమును, రాక్షసత్వమును బడయుచుందురు. కాబట్టి ఈ రెండిటిని విడనాడి, ఉత్తమమగు మొదటి తరగతినే జీవుడాశ్రయించి కరుణ, దయ, అహింసాది సద్గుణముల నవలంబించి జీవితమును ప్రకాశమయముగను, ఆనందమయముగను, తేజోవంతముగను నొనర్చుకొనవల యును. ఇట్టి ఉదాత్తభావములనే శ్రీకృష్ణమూర్తి మన కిచట ఉపదేశించుచున్నాడు. వీనిని గ్రహించువాడు ధన్యుడు. తిరస్కరించువాడు దురదృష్టవంతుడు.

ఇంతవఱకు శారీరకతపస్సునుగూర్చియు, దాని యంగములనుగూర్చియు విచారించడమైనది. ఇక వాచికతపస్సును పరిశీలింతము. సత్యమును పలుకుట, ఒకరికి బాధ కలుగకుండులాగున హితముగ, ప్రియముగ మాట్లాడుట శాస్త్రాధ్యయనముగావించుట వాఙ్మయతపస్సనబడును. ఈ క్రియలచే వాక్కు పవిత్రమైపోవును ఉదయము నిద్రలేచినది మొదలు రాత్రి పరుండబోవువఱకును మనుజుని వాక్కు అనేక నిరుపయోగపదముల ఉచ్చారణయందును, అపవిత్రభాషణములందును, దూషణములందును వ్యర్థమైపోవుచున్నది. ఇండ్లలో లోకాభిరామాయణము, అనవసరవాగుడు పెరిగిపోవుచున్నవి.

వాక్కు-ద్వారా జనులశక్తి ఎంతయో వినష్టమైపోవుచున్నది. అద్దానిని భగవన్నామస్మరణయందుగాని, శాస్త్రాధ్యయనము నందుగాని, సంకీర్తనమునందుగాని వినియోగించినచో, అపార మగు సత్ఫలితము చేకూరగలదు. పరమార్థసాధకుడు తన శారీరక వాచిక మానసిక శక్తులను వృథాగాపోనీయక కూడ పెట్టుకొని దైవధ్యానమందు ఉపయోగించవలెను. దీనినే శక్తి సమాహరణము (Conservation of energy) అందురు. ముముక్షువున కిద్ది యత్యావశ్యకమైయున్నది. వ్యర్థముగ సముద్రములోపడిపోవు నదీజలమును అరికట్టి ఇంజనీర్లు ఆనకట్టల ద్వారా దానిని మళ్ళించి క్షేత్రముల కుపయోగపడునట్లు ఎట్లు చేయుదురో, అట్లే సాధకుడు ప్రాపంచిక సరససల్లాపము లందు వ్యర్థమైపోవు తన వాక్శక్తిని మౌనాదులద్వారా కూడ బెట్టుకొని అద్దానిని దైవధ్యానాదులందు వినియోగించుకొను చుండును. కాబట్టి అధ్యాత్మపథమున శీఘ్రగతిని పురోగమింప నుద్యుక్తుడైన మనుజుడు తన వాక్కును సంయమన మొనర్చి మితముగను, హితముగను, సత్యముగను, భాషించుటను నేర్చుకొనవలయును. భగవత్కాలక్షేపములనే సలుపుచు చుండవలెను. రత్నాకరుడను బోయవాడు వ్యర్థవాక్యముల నుచ్చరించుచున్న తనవాక్కునుమరలించి రామనామస్మరణము నందు వినియోగించి వాల్మీకిగా మారిపోవుట సర్వులకును తెలిసియే యున్నదిగదా! ఇదియే వాక్-తపస్సు.

ఇంతదనుక శారీరక, వాచికతపస్సులనువిచారించితిమి. ఇక మూడవదియగు మానసిక తపస్సునుగూడ ప్రస్తావించినచో, ఇక ఈ తపోఘట్టము పూర్తికాగలదు. ఈ మూడుతపస్సులలో

మానసిక తపస్సు అతిముఖ్యమైనదని యెఱుంగవలయును. అది ఒకింత కష్టతరముఁగూడను. మనోనైర్మల్యము సౌమ్యభావము, మౌనము (వృత్తిరాహిత్యము), ఇంద్రియనిగ్రహము, భావసంశుద్ధి - ఇవి కలిగియుండుటయే మానసిక తపస్సు, మౌనమును మానసికతపస్సునం దంతర్భూతము చేసి నందువలన కేవలము నోరుమూయుట మాత్రమే మౌనము కాదనియు, మనస్సంచారమును అరికట్టుటయే యథార్థమగు మౌనమనియు స్పష్టపడుచున్నది. కొందఱు మౌనవ్రతమును శీలించుచు నోటికిమాత్రము బీగము వేసి తక్కిన ఇంద్రియములను ఆడించుచు నానావిధసంజ్ఞలను చేయుచు, ఒకేమోపున పలకపై పేజీలు పేజీలు వ్రాయుచు, ముక్కుతో 'ఘూఁఘూఁ' అను శబ్దము చేయుచు నానా హంగామా చేయుచుందురు. వారు నోరు మెదపరేకాని మనస్సుతో 'అతి'గ పని Over) work) చేయుచుందురు. భగవానుని దృష్టియందు ఇది మౌనముకాదు. శాస్త్రములున్ను ఇట్టి ఆర్భాటమును మౌనముగ అంగీకరింపవు. మానసిక మౌనమునకు సహాయభూతమగుననియే శారీరకమౌనమును పెద్ద లేర్పరచిరికాని మఱి యొక ఉద్దేశ్యముచేగాదు. అట్టితఱి మనస్సు సహస్రవృత్తులందు ప్రవేశించుచుండ, నోరుమాత్రము మూసియుంచినచో నేమిప్రయోజనము? 'మౌనాత్సత్యంవిశిష్యతే' అనునట్లు అట్టి 'మిథ్యాచారము'కంటె నోరు తెఱచి రెండు సత్యవాక్యములు, రెండుభగవన్నామములు పలుకుట ఎంతయో శ్రేష్ఠము. మౌనమునుగూర్చిన ఈ ధర్మసూక్ష్మములను చూపుటకొఱకే శ్రీకృష్ణమూర్తి, అద్దానిని మానసికతపస్సునందు చేర్చి

వైచెను. కాబట్టి మానసిక మానసమును లక్ష్యముగ పెట్టుకొని, బాహ్యసమును అందులకు సహాయముగ నవలంబించుట జనులయొక్క కర్తవ్యమైయున్నది.

మోక్షసాధనలయందు భావశుద్ధి ప్రముఖస్థానమును ఆక్రమించుచున్నది. ఏలయనగా అది సిద్ధించినచో ఇక లక్ష్యము చేకూరినట్లే. ఆత్మసాక్షాత్కారము లభించినట్లే. సాధనలన్నియు ఆత్మను పొందుటయందు కాక మనస్సును శుద్ధమొనర్చుటయందే పర్యవసించుచున్నవని యిదివఱలో తెలిపియుంటిమి.

ఆత్మా తు సతతంప్రాప్తోఽప్య ప్రాప్తవదవిద్యయా
తన్నాశే ప్రాప్తవద్భాతి స్వకంఠాభరణం యథా. (ఆత్మబోధ)

'ఆత్మ ఎల్లప్పుడును పొందబడియే యున్నది. కాని అవిద్య (అజ్ఞానము) వలన పొందబడనట్లు కనిపించుచున్నది. ఆ యవిద్య నశింప విస్మృతి కంఠాభరణమువలె తిరిగి పొందబడు చున్నట్లు కానంబడుచున్నది!' అని శ్రీశంకరాచార్యులవారు నుడివియున్నారు. కాబట్టి వాస్తవముగా ఆత్మను క్రొత్తగా పొందుట యనునదిలేదు. అడ్డుగనున్న మనస్సును తొలగించుటయో, లేక శుద్ధమొనర్చుటయో కావించిన, ఆత్మ తనంతట నదియే తన సహజస్వరూపముతో ప్రత్యక్షమగును. అద్దము నందు ప్రతిబింబశక్తి స్వతస్సిద్ధముగనే యున్నది. కాని దుమ్ము పడినచో ఆ యద్దమునందు వస్తువు ప్రతిబింబించదు. దుమ్ము తుడిచివైచినచో అద్దముయొక్క సహజరూపము వ్యక్త మగును. ఆత్మవిషయమున్ను అంతియే. అనేక వాసనలు దృశ్యవృత్తులు, సంకల్పములు, దుష్టస్వభావములు మనస్సు

నందు పేరుకొనిపోవుటచే అయ్యవి ఆవరణరూపముగ వర్తించుచు ఆత్మను కప్పివేయుచున్నవి - మేఘము సూర్యునివలె. ఆ యీ దుష్టవాసన లన్నియు వివేక విచారణాదులచేతను, భక్తివైరాగ్యములచేతను ఎప్పుడు రహితములగునో అప్పుడాత్మ నిరావరణముగ భాసించును. దీనినే మోక్షస్థితి యందురు.

న మోక్షో నభసః పృష్ఠే పాతాలే న చ భూతలే
మోక్షో హి చేతో విమలం సమ్యగ్జ్ఞాన విబోధితమ్. (యోగవాసిష్ఠము)

'మోక్షము ఆకాశమునలేదు, పాతాళమునలేదు, భూమిపై లేదు. ఉత్తమజ్ఞానముచే ఏర్పడిన నిర్మల చిత్తమే మోక్షమ'ని వసిష్ఠుడు శ్రీరామచంద్రునకుపదేశించెను. భావశుద్ధియే జ్ఞానసిద్ధియని పెద్దలు వచించుచుందురు. ఆ వాక్యము పరమసత్యము. కనుకనే భగవానుడు గీతయందు మానసిక తపస్సును గుఱించి వర్ణించుచు భావసంశుద్ధి నచట విస్పష్టముగ పేర్కొనెను. శుద్ధి అని చెప్పక సంశుద్ధి (సమ్యక్ శుద్ధి) యని చెప్పుటచే మానవుడు మనశ్శుద్ధియొక్క పరాకాష్ఠను అందుకొనవలసి యుండునని భావము. చిత్తమునందు ఒకింతైనను మాలిన్యముండరాదు. ఏదేని మలినసంకల్ప ముదయించుచో తత్క్షణమే వివేకఖడ్గముచే దానిని తుత్తునియలుగా చేసివేయవలెను. పెద్దపెద్ద బ్యాంకులందు రాత్రింబగళ్ళు బంట్రోతులు 'ఘారా' కాచుచుందురు. ఏలయనగా ఒకింత అజాగ్రతగనున్నచో చోరులు అచటగల ధనరాసులను అపహరించుకొనిపోవుదురు. అట్లే జ్ఞానరత్నాపహరణముకొఱకు కామక్రోధాది తస్కరులు అహర్నిశము పొంచియున్నారు. వారిని దరికి

చేర్చకుండుటకొఱకై జీవుడు నిరంతరము సావధానచిత్తుడై మెలగవలెను. అఖండజ్ఞానదీపమును వెలిగించవలెను. తస్మాజ్జాగ్రత జాగ్రత!' అను వాక్యమును మననము చేయవలెను. ఈప్రకారముగ దృఢవ్రతముతో కొంతకాలముసాధనచేయుచు రాగా, మనస్సునందలి వాసనలన్నియు సమూలముగ క్షాళగింపబడ, హృదయము శరత్కాల సరోవరమువలె అతి నిర్మలమై యలరారును. అట్టి వినిర్మల హృదయమునందు పరమాత్మ లెస్సగ సాక్షాత్కరించును. కాబట్టి మోక్ష సామ్రాజ్య విజిగీషు లందఱున్ను మానసికతపస్సగు ఈ భావ సంశుద్ధిని తప్పక సాధించవలసియున్నది.

ఇవ్విధముగ తపస్సులను గురించి వర్ణించి శ్రీకృష్ణమూర్తి తదుపరి 'దానకాండ' యందు ప్రవేశించెను. పుణ్యకార్యములను ప్రోత్సహించుట, పాపకార్యములను గర్హించుట గీతయొక్క ప్రధానాశయములలో నొకటియని మీరు జ్ఞాపకమునం దుంచుకొనవలయును. జ్ఞానమేకదా మనకు కావలసినది, పుణ్యకార్యములతో నేమిపని ? అని ప్రశ్నించువారు ఫలముకదా మనకు కావలసినది, పుష్పముతో నేమిపని యన్ని అడుగువారి చందముననే యుందురు. వారు చెప్పునది అనుభవశూన్యమగు వాక్యము. పుణ్యకార్యములచే పాపము నశించును.* సత్త్వగుణ మావిర్భవించును. సత్త్వాధిక్యతచే క్రమముగ జ్ఞానముదయించును. జ్ఞానముచే మోక్షము సిద్ధించును. కాబట్టి మోక్షప్రాప్తికి పుణ్యకార్యములు అత్యావశ్యకములే అయియున్నవి. పుణ్యకార్యము లనేకములు కలవు. వానిలో

*యేషాం త్వన్తగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్. (7-28

దానమొకటి. భూదానము, గోదానము, వస్త్రదానము, విద్యాదానము, అన్నదానము, జ్ఞానదానము' సంపత్తిదానము, శ్రమదానము-ఈ ప్రకారముగ దానములు వివిధములు. దానము పరమపవిత్రమైన గుణము అయియున్నప్పటికిని, దాతయొక్క మనోభావము ననుసరించియే ఆ దానక్రియ న్యూనాధిక ఫలముల నొసంగుచుండును. ప్రత్యుపకారమును గోరక, దేశ, కాల, పాత్రల నెఱింగి చేయబడు దానము ఉత్తమమైనది. దీనినే భగవానుడు సాత్త్వికదానమని పేర్కొనెను. అట్టి సాత్త్వికదాతను నీవేల దానముచేయుచున్నావని యడిగినచో 'ఇది నా ధర్మము, నాకర్తవ్యము, కనుక యిట్లుచేయుచున్నాన'ని మాత్రమే చెప్పును. అట్లుగాక మఱికొందఱు ప్రత్యుపకారమును గోరికాని, ఫలము నుద్దేశించికాని, లేక మనస్సులో బాధపడుచుగాని దానము చేయుదురు. ఇది అంత శ్రేష్ఠమైనది కాదు. ఇది రాజసదానము. ఉత్తములు దీని ననుసరింపరు. ఇచ్చి పుచ్చుకొను పద్ధతి దాన మనఁబడదు. అది వ్యాపారమే యగును. పైగా దానము చేసి 'అయ్యో! డబ్బంతయు అయిపోయినదే' అని దుఃఖించువారికి ఆ దానఫలము పూర్ణముగ లభింపదు.

వాస్తవముగ ఒకరి కిచ్చుటచే సంపద ద్విగుణీకృతమగునేకాని తరగదు. ఇదియొక ధర్మరహస్యము. సముద్రము తనలోని జలమును సంతోషపూర్వకముగ మేఘములకు దానము చేసివేయును. అట్లిచ్చునపుడు అది దుఃఖించినదా? లేదు. ఫలితమేమైనది? ఆ జలమే అనేకరెట్లుగ నదుల రూపమున వచ్చి తిరిగి దానియందే చేరుచున్నది. కనుకనే రామ

తీరులు దానమనగా 'దోచుకొనుట' అని అర్థము చెప్పెను. ఒక్క రూపాయను మీరీదినమున దానము చేసినచో, అది ఏనాడైనను కొంపొండు వడ్డీతోసహా తిరిగి మీయొద్దకు వచ్చియేతీరును. దానము చేయబడిన విత్తము బ్యాంకునందు నిలవయున్నట్లేయని నమ్ముడు. అట్లుగాక, సంపాదించినది యంతయు, కేవలము స్వార్థముకొఱకే అట్టిపెట్టుకొనినచో, దానధర్మములను చేయనిచో, ఆ పాత్రు పుణ్యభాగ్యమును పొందక మురుగెత్తిపోవును. నది ప్రవహించి తన నీటిని సముద్రమున కిచ్చివేయును. మరల క్రొత్తనీరు వచ్చి దాని యందు చేరుచుండును. కనుక నదీతీర్థమెల్లపుడును స్వచ్ఛముగ నిర్మలముగ, నిరావరణముగ నుండును. చెఱువులు, బావులు అట్లుకాదు. 'మేము మా నీటిని ఎవ్వరికిని ఇవ్వము' అని అవి భీష్మించుకొనియుండును. అందుచేత, పాతనీరు పోక, క్రొత్తనీరు రాక అవి మురుగెత్తి పాచిపట్టిపోవును. చెఱువు లోని నీరు మొత్తము పాచిపట్టుట మీరు చూచియున్నారు కదా! నదిలో ఇట్టి స్థితి ఎన్నడైన సంభవించునా? కాబట్టి లోభులు, పిసినిగొట్టువారు ఈ సత్యమును గుర్తెఱిగి తమ లుబ్ధత్వమును బోగొట్టుకొని దానశీలురై మెలగుదురు గాక! పూర్వము ప్రజాపతి 'ద, ద, ద' అని బోధించినపుడు మానవుడు దాని అర్థము 'దానము' అని గ్రహించి దానవంతుడై ప్రవర్తించిన విషయము ఉపనిషత్తులలో మనము విని యున్నాముకదా!

ముఖ్యముగ శ్రీమంతులు తమ జీవితకాలములలోనే తాము చేయదలంచిన దానాది పుణ్యకార్యములన్నిటిని స్వయా

ముగ నిర్వహించివేయవలెను. తాము పోయిన పిదప తమ కుమారులు ఆపనిచేసెదరని భావించి తూష్ణీంభావము వహింపరాదు. ఈ క్షణమున ఉన్న భావము మరుక్షణము లేకపోవచ్చును. కావున ఎప్పుడు చేయవలసిన ధర్మ కార్యమును అప్పుడే చేసివేయవలెను.

పూర్వ మొకపుడు కర్ణుడు తనగృహమున అభ్యంగన స్నానము చేయుచుండెనట. నవరత్నఖచితమగు నొకపాత్రలో నూనె, మఱియొక పాత్రలో సున్నిపిండి ప్రక్కనుంచుకొని నూనెతో తానే కూర్చొని తలంటుకొనుచుండెను. సరిగా అదే సమయమున శ్రీకృష్ణమూర్తి అతని గృహమునకు విచ్చేసెను. కర్ణుడు తలంటుకొనుచుండుటయు, ప్రక్కనే మరకతమాణిక్యములు పొదగబడిన విలువైనపాత్ర యుండుటయు చూచి, ఆ నటనసూత్రధారి కర్ణునితో తనకాపాత్ర కావలయునని అడిగెను. ఇంద్రునకు తన కవచకుండలములనే దాన మొసంగివైచి 'దానకర్ణుడ'ని లోకమున విఖ్యాతినొందిన అమ్మహనీయుడు సాక్షాత్ పరమాత్మయేవచ్చి అడిగినపుడు ఇక వెనుకకు తగ్గునా? వెంటనే యతడు (కుడిచేతితో తలంటుకొనుచుండెను గనుక) తన ఎడమచేతితోనే దానిని పరిగ్రహించి శ్రీకృష్ణున కివ్వదొడగెను. కాని శ్రీకృష్ణు డద్దానిని స్వీకరింపక, 'కర్ణా! ఎడమచేతితోనా నాకు సమర్పించుట? ఇంతమాత్రము శిష్టాచారము నీకు తెలియదా?' అని యడుగ నంత కర్ణు డిట్లు సమాధాన మొసంగెను—

క్షణం చిత్తం క్షణం విత్తం క్షణం జీవితమావయోః
యమస్య కరుణా నాస్తి ధర్మస్య త్వరితా గతిః.

'శ్రీకృష్ణా! ఇప్పుడున్న భావము మఱుక్షణ ముండకపోవచ్చును, ఇప్పుడున్న ధనము మఱుక్షణమున మాయమైపోవచ్చును. ఇప్పుడున్న జీవితము ఉత్తరక్షణమున అంతమైపోవచ్చును. యమధర్మరాజు ఎవరిపైనను విచక్షణచూపడు. జీవుల ధర్మబుద్ధి త్వరితగతిని మార్పునొందుచుండును! కాబట్టి తైలంటుకొనుచున్న నానచేతిని (కుడిచేతిని) కడుగుకొని దానితో నీకు ఆ పాత్రనిచ్చులోపల నాబుద్ధి ఏమిమారిపోవునో! అంతవఱకు నా జీవిత ముండునో లేదో అను విచికిత్స నాలో కలుగ తత్క్షణమే నేను ఎడమచేతితో దానిని నీకిచ్చివేయ దొరకొంటిని. అంతియేకాని తెలియక కాదు' - కర్ణుని అధ్యాత్మభావ పరిపూర్ణములగు ఆ వాక్యములను విని కృష్ణుడు లోలోన చాల సంతసించెను.

లుబ్ధత్వము మహాప్రమాదకరమైన గుణము. కామ క్రోధ, లోభములను 'అగ్రదుష్టత్రయము'లో అది స్థానమును సంపాదించుకొనగల్గినది.

త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః
కామః క్రోధస్తథాలోభ స్తస్మాదేతత్త్రియం త్యజేత్. (16-21)

'కామ, క్రోధ, లోభములు మూడును నరకద్వారములు. ఆత్మవినాశకరములు. కావున వాటిని త్యజించివేయవలెనని శ్రీకృష్ణ భగవానుడు ఆనతిచ్చియుండలేదా? కావున త్యాగశీలురై మెలగవలెను. దానపరత్వము నలవఱచుకొనవలెను. ఈనాడు లోకములో ఎందఱో దరిద్రులను మనము చూచుచున్నాము. కూటికి గుడ్డకు కఱవైపోయి నానాబాధలను పొందుచు వీధులలో తిరుగాడుచుండు ఈ దరిద్రు లెవరు? ఇట్టి దీనస్థితి

వీరి కేల సంభవించినది? భగవంతునకు వీరిపై ఏమైన పక్షపాతము కలదా ? లేదు. 'న మే ద్వేష్యోఽస్తి న ప్రియః'- నా కెవనిపైనను ద్వేషములేదని ఆతడు చెప్పనే చెప్పెను. కొందఱు తిని త్రాగి లక్షణముగ ఆనందించుచుండ పాపము వీరికిమాత్ర మేల ఇట్టి శోచనీయస్థితి ఘటిల్లినది! ఏనాడో దానధర్మములు చేయని కారణముచేతనే ఇట్టివారికి దీనత్వము సంభవించినది.

అదానదోషేణ భవేద్దరిద్రః

అని శాస్త్రము లైక్యకంఠముతో బలుకుచున్నవి. కావున 'దానము చేయని దోషముచే జీవుడు దరిద్రుడై జన్మించును'- తామనుభవించుదానిలో తృణమో పణమో మాఱియొకరి కిచ్చుట నేర్చుకొనవలెను. ఈ శరీరనిర్మాణమును జూడుడు- భగవంతుడు ఒకరికిచ్చు పద్ధతిలోనే చేతిని సృష్టించెను. చేతులు క్రిందకు వ్రాలియున్నపుడు వాటి తీరు గమనించినచో ఈ సత్యము బోధపడగలదు. ఇమ్ము, ఇమ్ము (give, give) - ఇదియే జీవితరహస్యము.

The less I have the more I am.

అను నానుడిప్రకారము, ఇతరులకు దానధర్మములు చేయుచు తన స్వంతమునకై మనుజుడు ఎంతెంత తక్కువ వినియోగించుకొనుచుండునో అంతంత గొప్పవాడుగ నాతడు పరిగణింపబడుచుండును.

మహాదేవ గోవిందరానడే అను గొప్ప మహనీయునకు ఒకసారి ఎవరో ఒక పండ్లగంపను పంపిరట! అందులో ఒక

పండును కొద్దిగా కోసికొని ఒక ముక్కతిని తక్కినది మరల ఆ గంపలోనే పడవైచిపోయెను. ఆ దృశ్యమునుజూచి ఆతని భార్య 'ఏమండీ! పండు బాగాలేదా ఏమి? అంతయు వదలి వేసి వెళ్లుచున్నారు!' అని ప్రశ్నింప, రానడే 'చాలా బాగు న్నది! అని ప్రత్యుత్తరమిచ్చెను. బాగున్నచో మఱి ఏల వదలివేసినారు?' అని భార్య మరల ప్రశ్నచేయ, బాగున్నది కనుకనే వదలివేసితిని - మంచివస్తువెప్పుడును ఇతరులే ఎక్కువగ అనుభవించవలెను.' అని యాతడు పలికెనట! చూచితిరా! ఎట్టి మహోన్నత స్వభావమో! ఎట్టి అతిశయదాతృత్వమో! మహనీయు లీప్రకారము ప్రవర్తించుచుండ కొందఱు లోభులు తాము బయట అన్నము తినుచుండ, కాకివచ్చినచో దానిని తోలకయే యుందురు. ఏలయనిన, చేతితో దానిని అదలించినచో చేతినుండి జారి ఒకటి రెండు మెతుకులు క్రింద బడినచో ఎక్కడ అది తినిపోవునో యను భయము వారలను వేధించుచుండును. వెయ్యేల! ఈమధ్య ఒకలోభి దేవునకు పూజచేయదలంచి, ధూపదీపనైవేద్యము లర్పించినచో కొంత డబ్బు ఖర్చు అగునని తలంచి అవియేవియు లేకనే మానసిక ముగ పూజచేసి ముగించదలచెనట! ఆ మానసిక పూజలో కూడ దేవునకు కుళ్ళిన అరటిపండునే సమర్పించెనట. మంచి పండు ఖరీదు అధికమని తలంచి. ఓహో! ఎంతటి లోభత్వము! మానసికముగ ప్రపంచములోని పండ్లన్నిటిని సమర్పించినను ఒక్కపైసాకూడ ఖర్చుకాదని ఆ మూఢునకు తెలియుదు. ఇట్టి హీనప్రవృత్తిని జనులు విడనాడవలెను.

'దేయం దీనజనాయ చ విత్తం'

"దీనులకు, దరిద్రులకు తన కున్నదానిలో కొంత ఇచ్చి సాయము చేయవలెన'ని శ్రీశంకరాచార్యులవారు జనులకు హితము చెప్పిరి. ఒకవేళ అట్లుచేయక దానబుద్ధి ఒకింతైనను లేక, లక్షలు లక్షలు గడించి, కోటికి పడగెత్తి కూర్చున్నచో అతని గతి ఏమగునో ఊహించితిరా ?—

> చత్వారో విత్తదాయాదాః ధర్మభూపాగ్ని తస్కరాః
> జ్యేష్ఠభ్రాత్రవమానేన త్రయః కుప్యన్తి సోదరాః

"డబ్బుకు నలుగురు వారసులు కలరు. (1) ధర్మము (2) రాజు (3) అగ్ని (4) దొంగ-అని ఇందులో పెద్దవారసుడు ధర్మము. అతడు నలుగురిలో పెద్దన్న. తండ్రి డబ్బులో పెద్దన్నకు పెద్ద వాటా రావలెను. అనగా ధర్మమునకు ఎక్కువడబ్బు వినియోగించబడవలెనని అర్థము. అట్లుకాక, తండ్రి ఆస్తిలోని పెద్ద భాగముగాని, చిన్నభాగముగాని, అసలు ఏ భాగము గాని అతనికి లేకుండ చేసినచో, ఈ ప్రకారముగ ఆతనిని (ధర్మమును) అవమానించినచో తక్కిన ముగ్గురు సోదరులు (రాజు, అగ్ని, దొంగ) అది భరింపలేక కోపోద్రిక్తులై చెల రేగెదరట.' అనగా 'ధర్మ' కార్యములకు తనసొత్తును వినియోగించనిచో, పన్నులమూలకముగ రాజు దానిని స్వాధీనపఱచు కొనివేయును. అగ్నిప్రమాదములు సంభవించి ఆస్తి నష్ట మగును. దొంగలుపడి దానిని దోచివేయుదురు' అని భావము. కాబట్టి సంపదలో కొంతభాగము దానధర్మములకు కేటా యించవలెను. దానధర్మములకు వినియోగించుద్రవ్యము ఇహ మందును, పరమందునుగూడ తిరిగివచ్చును. స్నేహితుల కొఱకు వినియోగించు ద్రవ్యము ఇహమందుమాత్రమే తిరిగి

వచ్చును. భోగముల కొరకు వినియోగించు ద్రవ్యము ఇహమందుగాని పరమందుగాని యెచటను తిరిగిరాదని మఱువకుడు.

కావున త్యాగముయొక్క మహిమను మనుజుడు గుర్తెఱిఁగి, జీవితమును త్యాగమయముగ గావించవలెను. దాతృత్వబుద్ధి హృదయమున తాణికిసలాడుచుండవలెను. అయితే ప్రత్యుపకారవాంఛలేని సాత్త్వికదానమునే ఆశ్రయించవలెనుగాని ఫలాపేక్షతో గూడిన రాజస దానమును గాని, తిరస్కారముతో గూడిన తామస దానమునుగాని ఆశ్రయించరాదు. ఈ తత్త్వమును బోధించుటకొఱకే భగవానుడీ యధ్యాయమునందు త్రివిధదానములను పొందుపఱచెను. అశ్రద్ధతోగాని, అవజ్ఞతోగాని, అసత్కారపూర్వకముగగాని ఒకనికి ఏదియైన యిచ్చినను అది యివ్వనిదానితో సమానమే యని గీతాచార్యుడు నుడువుచున్నాడు. *అశ్రద్ధతో ఏదియైన చేసినను అది చేయనిదానితో సమానమే యని వాక్రుచ్చుచున్నాడు. కాబట్టి చేసిన ఒకింత కార్యమును శ్రద్ధతో పూర్ణవిశ్వాసముతో చేయవలెనని భగవానుని యాదేశము.

ఈ ప్రకారముగ శ్రీకృష్ణపరమాత్మ ఈ యధ్యాయమునందు ఆహారముయొక్కయు, దాన, తపంబులయొక్కయు త్రివిధ (సాత్త్విక, రాజసిక, తామసిక) లక్షణములను చక్కగ వర్ణించి చెప్పెను. అట్లు చెప్పుటకు కారణమేమి? ఆయా వస్తువులయొక్క రాజస, తామసభావములను త్యజించి సాత్త్విక

* అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్
అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ. (17-28)

భావమునే ఆశ్రయించవలసి యుండునని ఉద్బోధించుటయే యగును. కావున భగవదాజ్ఞను శిరసావహించి ఆయా పుణ్య కార్యములను సాత్త్వికరూపముననే అమలులో పెట్టి తద్ద్వారా హృదయనైర్మల్యమును జనులు సంపాదించుదురుగాక! 'ఓం', 'తత్', 'సత్' అను త్రివిధసంజ్ఞలచే సూచించబడు ఏ పరబ్రహ్మముకలదో అయ్యది అట్టి విశుద్ధహృదయమున తెస్సగ ననుభూతము కాగలదు. పరబ్రహ్మసాక్షాత్కారమే జీవిత పరమావధి కనుక, అట్టి సాక్షాత్కారమునకు అనువగు పరిస్థితులను తన హృదయపీఠమున కలిగించుకొనుట ప్రతిజీవి యొక్కయు విధ్యుక్తధర్మము. గీతాచార్యుని ఈ సద్బోధ లన్నింటియొక్క తాత్పర్యమిదియే. భగవన్ముఖారవిందము నుండి వెలువడిన ఈ అమూల్యదివ్యోపదేశములనుముముక్షువు అత్యంతశ్రద్ధాభక్తులతో కార్యాన్వితమొనర్చి, ఈ జీవితమందే ఆత్మసాక్షాత్కారము ద్వారా స్వారాజ్యపదవి నధిష్ఠించి నిరతిశయ బ్రహ్మానందమును గ్రోలుచు మానవత్వమును చరితార్థ మొనర్చుకొనునుగాక !!

ఓమ్ తత్ సత్.

ఓమ్

# 18-వ అధ్యాయము

# మోక్షసన్న్యాస యోగము

ఏ వస్తువైనను ఉన్నపుడు దాని విలువ తెలియదు. కంటియొక్క విలువ కండ్లున్నప్పుడు అంతగా తెలియదు. గ్రుడ్డివాడు నేత్రములయొక్క విలువను చక్కగా అంచనా వేయగలడు. చేతులవలనను, కాళ్ళవలనను మనము ఎంత లాభమును పొందుచున్నామో ఇపుడు తెలియదు. వాటికి వైకల్యము సిద్ధించినపుడు తెలియును. ఆరోగ్యముయొక్క విలువ అనారోగ్యము కలిగినపుడు బాగుగ తెలియగలదు. సూర్యునియొక్క విలువ పగలు గుర్తెఱుంగువాడు చాల అరుదు. రాత్రి చీకటిలో అవస్థపడునపుడు ఆ సూర్యుడు లోకమున కెంత ఉపకారము చేయుచున్నాడో చక్కగ అనుభూత మగుచుండును. అట్లే శరీరమున్నపుడు దాని విలువ యెంతటిదో మనుజుడు గ్రహించుటలేదు. అది పోయినపిదప పశ్చాత్తాపము చెందుచున్నాడు. ఎన్నియో జన్మలు దాటిదాటి సుకృతవశమున మానవుడై పుట్టుచున్నాడు జీవుడు.

కదా చిల్లభతే జన్తు ర్మానుష్యం పుణ్యసంచయాత్.

అని గరుడపురాణమున విష్ణుభగవాను డీ విషయము నే వైన తేయునకు తెల్పియుండెను. కావున మానవజన్మ దుర్లభము కాదు సుదుర్లభమనియే చెప్పవలసియున్నది. మోక్షమునకు సోపానమువంటి దిది. పూర్వము సృష్ట్యాదియందు చతురాననుడు (బ్రహ్మ) వృక్షములను, సరీసృపములను. పశువులను,

పక్షులను, మత్స్యములను సృజించియు వానిచే ఏమాత్రము సంతుష్టిని బొందక యుండెను. కాని తదుపరి మనుజునిసృష్టించి పరమానందభరితు డయ్యెనట ! ఏల ? బ్రహ్మావలోకమునకు వలసిన బుద్ధిబల మాతనికి మాత్రమే కలదు. తక్కిన (84 లక్షలు - 1) జీవరాసుల కది లేదు. ఆ బుద్ధిబలమును సదుప యోగ మొనర్చుకొని పరమార్థలక్ష్యప్రాప్తియం దద్దానిని వినియోగించినపుడు మాత్రమే అది సఫలమగును. లేనిచో, అదియున్నను లేనిదానితో సమానమే యగును. కాని మనుజు డట్లు చేయుచున్నాడా ? మోక్షసౌధారోహణమునకు భగ వాను డొసంగిన ఈచక్కని సోపానమును మనుజుడు సదుప యోగ మొనర్చుకొనుచున్నాడా? 'హరి'ద్వారమును జేరుటకు యత్నించుచున్నాడా ? లేదు. 'అరి'* ద్వారమునే తట్టు చున్నాడు. దేవుని కొఱకు దేహమును వినియోగించు చున్నాడా ? లేదు. దేహము కొఱకే దేవుని ఉపయోగించు కొనుచున్నాడు. ఈ ప్రకారముగ అమూల్యమగు సదవ కాశమును భ్రష్ట మొనర్చుకొని విషయవ్యామోహాయుక్తుడై ఉన్నత శిఖరములనుండి క్రమక్రమముగ దిగజారిపోవు చున్నాడు. చిన్మయుడుగా వెలుగొందవలసియున్న యాతడు మృణ్మయుడుగ తయారగుచున్నాడు. ఇది చాల శోచనీయము. అతని దౌర్భాగ్యస్థితిని శాస్త్రము లెంత చక్కగ వర్ణించి యున్నవో చూడుడు.-

సాల్యాం వై డూర్యమయ్యాం పచతి తిలఖలం చాందనై రింధనౌఘైః
సౌవర్ణైర్లాఙ్గలాగ్రైః విలిఖతి వసుధామర్కతూలస్య హేతోః

* అరి = శత్రువు —'కామక్రోధాది అరిషడ్వర్గము'

చిత్త్వా కర్పూరఖండాన్ వృతిమివ కురుతే కో ద్రవాణాం సమన్తాత్
ప్రాప్యేమాం కర్మభూమిం స భజతి పురుషో య స్తపో మందభాగ్యః.

'వజ్రవైడూర్యములతో పొదగబడిన పాత్రయందు తేలిక పిండిని ఉంచి చందనపుకట్టెలతో దానిని వండుచున్నాడు! జిల్లేడుచెట్లు పైరుచేయుట కొఱకు బంగారపు నాగలితో పొలముదున్నుచున్నాడు! ఆరుగ పైరును సంరక్షించుటకొఱకు అరటిమొక్కలనుసరికిపొలముచుట్టు నాటుచున్నాడు! అట్లే కర్మభూమియగు భూలోకమున జన్మించియు ఎవడు తపస్సు నాచరింపడో, దైవమును సాక్షాత్కరించుకొనుటకు యత్నింపడో, ఉత్తమమగు ఈ మానవశరీరమును తుచ్ఛ విషయ భోగానుభవమునందును, నశ్వరప్రాపంచిక వస్తుసంపాదనము నందును మాత్రమే వినియోగించునో, అట్టివాడు మంద భాగ్యుడే యగును!' అని శాస్త్రము లుద్ఘోషించుచున్నవి. మహనీయులున్ను హెచ్చరిక చేయుచున్నారు.

కాబట్టి భగవానుడు కరుణించి మానవ దేహ మను చక్కని ఉపకరణమును మనకొసంగినపుడు, అది శిథిలము కాక పూర్వమే దానివలన ఎంత పారమార్థిక లాభమును పొంద గలుగుదుమో అంత పొందియే తీరవలెను. ఇట్టి మహదవకాశ ములు మఱి ఏ యితర లోకమునను, ఏయితర జన్మయందును గూడ లభింపవు. గాలి వున్నపుడే తూర్పారబట్టవలెను. దీపమున్నపుడే ఇల్లు చక్కపెట్టుకొనవలయును.

Strike the iron when it is hot.

'ఇనుము వేడిగానున్నపుడే దానిని సాగదీయవలెను. చల్ల బడినచో వీలుపడదు. కావున దేహముయొక్క విలువను

దేహమున్నపుడే బాగుగ తెలిసికొని, దానిని మధించి, (చక్కటిసాధనలుగావించి) చెఱకునుండి రసమువలెను. పాల నుండి వెన్నవలెను, పంచకోశాంతర్గతమగు పరమాత్మను అందుండి వెలికి తీయవలెను. (సాక్షాత్కరించుకొనవలెను). ఇకార్యము నెటుల సాధించవలెనో వేదశాస్త్రము లుద్బోధించుచున్నవి. గీతాది సద్గ్రంథములు స్పష్టముగ తెలియజేయుచున్నవి. అట్టి సాధనలనే గీతయందు ఇంతదనుక మనము విచారించుచు వచ్చినాము.

నేడు వాటిని పరిసమాప్తము చేయవలసియున్నది. గీతాగ్రంథముయొక్క చరమభాగమునందు నేడు అడుగు పెట్టబోవుచున్నాము. ఇంతవరకు 17 అధ్యాయములను సాంగోపాంగముగ విచారించితిమి. ఇక చివరి అధ్యాయములో-గీతాభవనముయొక్క చివరి గదిలో - నేడు ప్రవేశించుచున్నాము. భవనముయొక్క గదులన్నింటిలోను ఇది చాల పెద్దది. యుద్ధము ప్రారంభము కాబోవుచున్నది కనుక, ఇక గురుశిష్యసంవాదమునకు సమయము ఎక్కువలేనందున, ఇంతదనుక చెప్పినవాటి నన్నింటిని క్రోడీకరించి, చెప్పనివాటిని జతపరచి ఈ అధ్యాయమును గురువగు శ్రీకృష్ణభగవానుడు శిష్యుడగు అర్జునునకు చెప్పివేసెను. ఇరువురు స్నేహితులు చాలసేపు సంభాషించుకొని సెలవుతీసికొనునపుడు సారభూతములగు ఒకటి రెండు మాటల నెట్లు మాట్లాడుకొని విడిపోవుచుందురో, అట్లే కృష్ణార్జునులును ఇక యుద్ధకార్యమునందు ప్రవేశింపవలెను గనుక, ఎవరిపని వారు చూచుకొన

వలసియున్నది. కనుక, సంభాషణ కట్టిపెట్టవలయునప్పుడే ఆఖరికు గీతాసారమును ఒక పర్యాయము చెప్పుకొని ఇక బోధకు మంగళముపాడిరి. కావున ఒక దృష్టితో ఈ 18-వ అధ్యాయమును సంక్షిప్త భగవద్గీత యని మనము పల్కొనిన తప్పులేదు.

ఈ అధ్యాయము పేరు మోక్షసన్న్యాస యోగము. సన్న్యాసమనగా త్యాగము. (1) భగవద్భక్తులగు సాధకులు చేయుచు రాగా మోక్షము దానియంతటనదియే సమకూరును గావున, ఇక నట్టివారికి మోక్షమునుగూర్చిన వేఱుసంకల్పము అనవసరము కావున, మోక్షసంకల్ప త్యాగమును వారు కావించవచ్చును. మోక్షసన్న్యాసమున కిది యొక్క అర్థము. (2) త్యాగము(సన్న్యాసము)ను అవలంబించి తద్ద్వారా మోక్ష ప్రాప్తినొందుము. అనియును మోక్షసన్న్యాసమునకు మఱి యొక అర్థము కలదు. మోక్షానుభూతిని సిద్ధింపజేయు సాధనలలో త్యాగ ముచ్చస్థానము నలంకరించుచున్నది. ఒక దానిని త్యజింపనిచో మఱియొకటి లభింపదు-ఇదిలోకధర్మము. అట్లే దృశ్యమును త్యజింపనిచో దృక్స్వరూపమగు ఆత్మ లభింపదు. అల్ప (విషయ) సుఖమును త్యజింపనిచో అధిక (ఆత్మ) సుఖము సంప్రాప్తింపదు. కాబట్టి మోక్షకాంక్షి ఏనాడైనను త్యాగము నవలంబించక తప్పదు.

ఈ అధ్యాయ ప్రారంభమున శ్రీకృష్ణపరమాత్మ యజ్ఞ దాన తపఃకర్మలను త్యజించవలదనియు, అవి ('పావనాని మనీషిణామ్')-జీవుల చిత్తమును శుద్ధపఱచును గావున

వాటిని తప్పక ఆచరించవలయుననియు జ్ఞాపకము చేసెను.* మేడ ఎక్కకమునుపే నిచ్చెనను కాలదన్ని వేయుసాధకులకుభగవానుని ఈ వాక్యములు కనువిప్పుగా నుండగలవు. ఎటువంటి వానికైనను చిత్తశుద్ధిలేనిచో జ్ఞాన మెట్లు కలుగగలదు? మురికి అద్దములో తనముఖము చూడగల్గువా డింతవఱ కెవడును జగత్తున ఉద్భవించలేదు. ఉద్భవించదుకూడను. ఈ కీలకము తెలిసియే మహాసీయులగు శాస్త్రజ్ఞులు ఎంత అతీతమగుజ్ఞానమును ప్రబోధించినప్పటికిని, దానిసాఫల్యమునకు అత్యావశ్యకమైనట్టి హృదయనిర్మలత్వమును, అట్టి నిర్మలత్వమును సాధించునట్టి నైతిక గుణగణములను (ethics) నొక్కి చెప్పుచువచ్చిరి. సర్వజనాదరణీయంబైన గీతాగ్రంథ మవలంబించిన పద్ధతియు నిదియే. వెనుకటి అధ్యాయములం దీ విషయమును పదేపదే నిరూపించియున్నప్పటికిని; గ్రంథము పరిసమాప్త మగుచున్న ఈ సమయమున జనులు వానియెడల ఏమాత్రము పరాకు చిత్తగించకుండనుండు నిమిత్తము మరల నొక పర్యాయము ఆ భావములను గీతాచార్యుడు రంగముమీదికి తీసికొని వచ్చెను. కాబట్టి చిత్తశుద్ధికరములగు అట్టి పుణ్యకార్యముల యెడ ముముక్షువులు శ్రద్ధగలిగియుందురుగాక!

అయితే అట్టికార్యములను ఆచరించునపుడు మనుజుడు నిరుత్సాహమునకు, అధైర్యమునకు ఏ మాత్రము తావీయరాదు. 'ధృత్యుత్సాహసమన్వితుఁడై' యుండవలెను. ఆయా కార్యములందు ఫలాపేక్షలేక, దైవార్పితబుద్ధితో నాచరించు

* యజ్ఞదానతపః కర్మ న త్యాజ్యం కార్యమేవతత్
యజ్ఞోదానం తపశ్చైవ పావనాని మనీషిణామ్. (18-5)

చుండవలెను. కార్యము సిద్ధించినను, సిద్ధించకపోయినను నిర్వి కారుడై మెలగవలెను. ఇట్టివాడే సాత్త్వికకర్త యనబడునని భగవాను డీ యధ్యాయమున సెలవిచ్చెను. మొట్టమొదట కర్మాచరణమున పరిశుద్ధుడు కానిదే అధ్యాత్మపథమున జీవుడు ఉన్నత శిఖరములను అందుకొనలేడు. మనుజుని చిత్తము ఏ స్థితియందున్నదో అతని ఆచరణమే పట్టిచూపును. రాగ ద్వేషయుక్తుడై ఫలాభిలాషతోగూడి, లోభబుద్ధి గలిగి, హింసాయుతముగ కర్మ నాచరించువాడును, శుచిత్వము లేక యుండువాడును హర్ష శోకములకు లోనగువాడును, లేక సోమరితనముతో గూడి ఎల్లప్పుడు విషాదచ్ఛాయలచే నావృత్తుడై దీర్ఘసూత్రియై యొప్పువాడును ఆచరణమున పరిశుద్ధత్వమును బొందనివాడే యగును. కావున ఇట్టి నికృష్ట భావములను పరిత్యజించి సాత్త్వికబుద్ధితో కర్మాచరణము గావించుచు, నిర్మలమగు అనుష్ఠానము గలిగియుండువాడు అచిరకాలములో పరమార్థ క్షేత్రమున గొప్ప యభివృద్ధిని సాధించగలడు.

ఇట్టి మోక్షసాధనలను శీలించునపుడు ఆరంభములో కొన్ని ప్రతిబంధములను జీవు డెదుర్కొనవచ్చును. ఆచరించు నపుడు కొంతకష్టముగాగూడ తోచవచ్చును. అంతమాత్రమున చేత వాటిని వదలి వేయరాదు. ఏలయనగా, ఆ ఒకింత కష్ట మును అధిగమించిన పిదప నిరతిశయానందము నాతడు పొందగలడు! కొన్ని ఔషధములు త్రాగినపుడు చేదుగా నుండును. ఆ కారణముచేత వాటిని ఎవరైనను వదలివేయుచున్నారా? అట్లు వదలినచో రోగ మెట్లు ఉపశమించును? ఆరోగ్యసుఖ

మెటుల కలుగును? కావున ఆరోగ్యసంబంధమైన పరమ సుఖము కొఱకు, చేదువలన కలిగిన ఒకింత దుఃఖమును మనుజు డెట్లు దిగమ్రింగుచున్నాడో, అట్లే అనంత బ్రహ్మా నంద సాగరమున నోలలాడుట కొఱకు ముముక్షువు సాధన జనితమైన ఒకింత శ్రమను, ప్రయాసను ఓర్చుకొనవలెను. ప్రతికూల వాతావరణమును సహించుకొనవలెను! ఉత్తమ సుఖము (సాత్త్వికసుఖము) యొక్క లక్షణ మివ్విధముగనే యుండునని గీతాచార్యుడు తెలిపియున్నాడు—

యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్
తత్సుఖం సాత్త్వికం ప్రోక్తమాత్మబుద్ధి ప్రసాదజమ్. (18-37).

'ప్రారంభమున విషప్రాయముగ తోచి అంతమందు అమృత రూపముగ పరిణమించు సుఖ మేదికలదో, అదియే సాత్త్విక సుఖమనియు, అట్టిది బుద్ధిని నిర్మల మొనర్పగలదనియు భగవదాశయము. విషమివ' (విషమువలె) అనిచెప్పిరే కాని విషమని చెప్పలేదు. కావున కష్టముగ కన్పించునే కాని వాస్తవముగ అది కష్టముకాదు. సంతానము కలుగబోవు సమయమున స్త్రీ ప్రసవవేదన ననుభవించును. ఆ ప్రసవ సంజనిత దుఃఖము పుత్ర ముఖారవింద సముద్భూతమగు మహా దానంద సమ్ముఖమున వెలవెల బోవుచున్నది. అట్లే జ్ఞానా విర్భావమునకు ముందు సాధకుడు ప్రకృతిని ఎదుర్కొనుటలో కొన్ని ఆటంకములను, దుఃఖములను అనుభవించవలసి వచ్చి నను, వాస్తవముగ అది యాతనికి శ్రమగ తోపదు. ఏల యనిన దుఃఖరహితమగు సచ్చిదానంద పరమాత్మయే గమ్య మని అతనికి తెలియును. 'అచిర కాలములోనే దాని ననుభ

వింపబోవుచున్నాను గనుక, ఇక మార్గమధ్యమున సంభవించు ఈచిల్లర దుఃఖములను లెక్కచేసికొనగూడదు' అని మానవుడు భావించి ముందునకు సాగిపోవును.

> ప్రారభ్యతే న ఖలు విఘ్నభయేన నీచైః
> ప్రారభ్య విఘ్నవిహతా విరమన్తి మధ్యాః
> విఘ్నైర్ముహుర్ముహురపి ప్రతిహన్యమానాః
> ప్రారబ్ధముత్తమగుణా న పరిత్యజన్తి. (భర్తృహరి సుభాషితము)

విఘ్నములు కలుగునను భయముచే అల్పులు పుణ్యకార్యములను అసలు ప్రారంభించనే ప్రారంభించరు. మధ్యములు ప్రారంభించి ఒకటి రెండు విఘ్నములు తటస్థింపగనే దానిని వదలివైచి పారిపోవుదురు. ఉత్తములు, ఎన్నివిఘ్నములు సంభవించినను, ప్రారంభించిన సత్కార్యమును వదలనే వదలరు.' అను భర్తృహరి యుపదేశ మీ సందర్భమున స్మరింపదగియున్నది. 'వేలకొలది మనుష్యులలో ఏ ఒకానొకడు మాత్రమే మోక్షసిద్ధికై యత్నించుననియు, అట్లు యత్నించువారిలో ఏ ఒకానొకడు మాత్రమే యథార్థముగ తెలిసికొని మోక్షసిద్ధి బడయగల్గుననియు *శ్రీకృష్ణమూర్తి ఇదివరలో తెలిపియే యున్నాడు కదా! 'కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్షత్'.కోట్లకొలది మనుజులలో ఒకానొకధీరుడు మాత్రమే ప్రత్యగాత్మను చూడగలుగును అని కఠోపనిషత్తు పలుకుచున్నది. సాధన ప్రారంభదశయందు తోచు విఘ్నపరంపరలను లెక్కచేయకుండ ముందునకు జనువాడే ఈధీరుడు. ఆతనికి కలుగు ఈ విఘ్న

---

* మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః. (7-3)

ములు, ఈ దుఃఖములు, ఈ సంతాపములు విషమువలె కని పించునే కాని వాస్తవముగ విషముకాదు. అది అమృతత్వము నకు దారితీయు వస్తుసముదాయమే యగును.

(దృష్టాంతమునకు) ఉదయము బ్రహ్మముహూర్తమున (4 గం॥ నుండి $5\frac{1}{2}$ గం॥ లోపల) నిద్రలేచి స్నానాదులను నిర్వర్తించుకొని దైవధ్యానము సలుపవలసినదిగా శాస్త్రము లాదేశించుచున్నవి. అలవాటు లేనివారికి ఇదియొక పెద్ద సమస్యగానుండును. కప్పుకొనిన దుప్పటి తెరచుటకే అత్తఱి మన స్సొప్పదు. ఇక స్నానముమాట వేఱుగ చెప్పవలయునా? ఇక చలికాలమైనచో మనస్సు ఇంకను పెద్దతిరుగుబాటుచేయును. అయినను ఎట్లో తెగించి, నిద్రాసుఖమును పారద్రోలి. కష్టమున కోర్చి స్నానముచేసివైచి ధ్యానమునకు కూర్చొనినచో, అపుడు కలుగు సుఖము చెప్పతరముకాదు. ఎంతయో ప్రశాంతి, నిర్మలత్వము, ఉల్లాసము మనస్సునకు కలుగును. అదేవిధముగ కారము, పులుపు, ఉప్పు మొదలగునవి తగ్గించుకొనవలె ననియు, అవి రాజసాహారములో చేరునుగావున అభ్యాసముచే క్రమముగ వానిని విడనాడవలెననియు శాస్త్రములు చెప్పు చున్నవి. ఎంతయోకాలమునుండి, లేక ఎన్నిజన్మలనుండియో ఆవకాయ, పచ్చిమిరపకాయలకు దాసత్వము చేసిన నాలుకలు గనుక, ఆ వాక్యమును పాలించుటకు అవి ఇష్టపడవు. ఒకవేళ ఇష్టపడినను కష్టముతో దానిని నెరవేర్చును. కష్టమో, నిష్ఠురమో, ఎట్లైనను తెగించి సాత్త్వికాహారమును భుజించుచు వచ్చినచో, అత్తఱి మనుజునకు కలుగు ఆనందమునకు, ఆరోగ్యమునకు మేరయే ఉండదు. అట్లే బ్రహ్మచర్యము

వలె విచక్షణాలేక వసంగిడుచున్నారు. కాని అచిరకాలములోనే తాపత్రయమును గాలము గొంతులో గ్రుచ్చుకొనగా వివశులై పరిరోదించుచుందురు. పోనిండు, ఇతర దుఃఖములమాట అట్లుండనిచ్చినను, పుట్టిన ప్రతివానికిని మరణమనుగొప్ప ఆపద, మహాదుఃఖము కాచుకొనియుండ ఇక దాని సమ్ముఖమున ఈ సంసారసుఖములయొక్క వస ఏపాటిది? అట్టి స్థితిలో సుఖము సుఖమేనా? అసలది సుఖమని యెట్లు చెప్పబడును? మృత్యుముఖమున తిరుగాడుచు చక్కలిగింతలవంటి ఒకటి రెండు అల్పసుఖముల ననుభవించినంత మాత్రమున అది సుఖానుభవమగునా? గొడుగని తలంచి పాముపడగక్రింద విశ్రమించువా డెంతటి సుఖము ననుభవించగలడు! 'లోకాన్సమాహర్తు మిహ ప్రవృత్తః' - అని కాలుడు తన కరాళవదనమును వివృతమొనర్చి వికటాట్టహాసము చేయుచు లోకులందరిని తన యుదరములోనికి ఆహ్వానించుచుండ, అట్టి స్థితిలో వీరనుభవించు విలాసములు, విషయ భోగములు ఏపాటివి? ఉరిశిక్ష పడినవానిని ఉరితీయుటకు ముందుగా అతని కిష్టమైన పదార్థమును చెప్పవలసినదిగా జైలు అధికారులు కోరుదురు. దానిని తెచ్చియు ఇచ్చెదరు. ఎంత ప్రియమైనను ఆ సమయమున వానికి దాని ననుభవించుటలో ఏమైన సుఖము లభించునా? ఆ సమయమున పంచభక్ష్య పరమాన్నములు భుజించినను అందేమైన రుచియుండునా? ఉండదు. ఏల? క్షణకాలములో ఉరికంబము నెక్కబోవుచున్నాడు కావున. అట్లే జీవుని యొక్క స్థితియు, పుట్టినవానికి చావు నిక్కము. అది నిక్కమైనపుడు, ఇక దానిని జయించి అమరస్థితి నొందుటకై ఈ జీవిత

ములో యత్నింపవలెనా. లేక జన్మజన్మాంతరముకూడ మృత్యుముఖమున బడుటకు సిద్ధపడి, అల్పవిషయభోగములను అనుభవించుచు కూర్చొని పుణ్యకాలముకాస్త గడపివేయ వలెనా ? విజ్ఞుడు బాగుగ యోచించుకొనుగాక !

ఒకనొకడు ఒక గొఱ్ఱెపిల్లను బలియిచ్చుటకై తీసికొని పోవ నిశ్చయించి దానిని బాగుగ కడిగి, పసుపు కుంకుమపెట్టి, మంచి వస్త్రములతో నలంకరించి, మెడలో పూలహారమువైచి, మృష్టాన్నభోజనము కుడిపించి, ఒకచోట నుంచెను. ఆ గొఱ్ఱె పిల్ల తనకానాడు తనయజమాని చేయుచున్న అమితాదరణకు, అపరిమిత గౌరవమునకు, మురిసిపోయి అమాంతముగ తన తల్లి యొద్దకు పరుగిడి 'అమ్మా! అమ్మా! నా అదృష్ట మేమని చెప్ప వచ్చును! ఈరోజు ఎక్కడలేని ఆనందము నాకుకలుగుచున్నది. నా జీవితములో సువర్ణాక్షరములతో లిఖింపదగిన సుదినము నేడు! ఆహా! ఎట్టి అలంకారము! ఎట్టితిండి! ఎంతటివైభవము!' అని ఏమేమో చెప్పుకొనిపోవుచుండ, తల్లి ఆపి; 'ఓసీ ! పిచ్చి దానా! నీవు మందమతివి కనుకనే ఈ ఆర్భాటము, విలాసము చూచి మైమఱచిపోవుచున్నావు. ఇది యంతయు చావునకు ముందు నీకు చేయబడుచున్న గౌరవము. నేటిరాత్రి నిన్ను బలి యివ్వబోవుచున్నారు. మృత్యుదేవత నిన్ను గ్రసించివేయ నున్నది. కావున ఇది నీ యదృష్టముకాదు. దురదృష్టము. సౌభాగ్యముకాదు. దౌర్భాగ్యము. నేడు నీకు సుదినముకాదు. దుర్దినమే!' అని తన బిడ్డకు హితము చెప్పెనట ?

ఆప్రకారమే ప్రాపంచిక విషయభోగముల ననుభవిం చుచులోకకీర్తులకై ప్రతిష్ఠలకై దేవులాడుచు, అవియే పర

మార్గమని యెంచి మురిసిపోవువారు చాల పొరబడుచున్నవారే యగుదురు. ఇది ముణ్ణాళ్ళముచ్చటయే యను సంగతి వారు మఱచుచున్నారు. ఆయుష్షు క్షణికమను భావము వారికి లేకున్నది. మృత్యువు బెబ్బులివలె ప్రక్కనే కాచుకొనియుండుటను విస్మరించినందువలననే శాశ్వతదైవమును ఉపేక్షించి, సర్వ భోగవిలాసములందు వారు కాలము గడుపుచున్నారు. వినాశము యొద్ద విలాసము శోభించునా? శాశ్వతపదార్థ సంపాదనమే యథార్థమగు విలాసమని జనులు గుర్తెఱుగుదురుగాక! అదియే నిజమైన ఆనందము. నశించు వస్తువునందు అనుభూతమగు ఆనందము అంతంతమాత్రముగనే యుండును.

నచికేతుడు యమధర్మరాజును బ్రహ్మజ్ఞానమునుగూర్చి అర్థించినపుడు ఆ బాలుని వైరాగ్యనిష్ఠను పరీక్షింపనెంచి అంతకుడు మొట్టమొదట దానిని బోధింపక ఐహికవైభవము లాతనికి ఒసంగెదననియు, ఆత్మజ్ఞానమును గూర్చి మాత్రము ప్రశ్నింపవలదనియు చెప్పెను. "ఓ నచికేతా! మానవలోకము నందు అతిదుర్లభములైనట్టి భోగసంపద లెన్నికలవో, వాని నన్నింటిని వరుసపెట్టి నీవు కోరుకొనుము. ఇవిగో రథములు, ఇవిగో వాద్యములు, ఇవిగో విలాసవతులు - వీని నన్నింటిని గైకొనుము. కాని మరణరహితమగు ఆత్మనుగూర్చి అడుగకుము"-అని యముడు పలుకగనే నచికేతుడు "మహాప్రభో మీరిచ్చిన 'లిస్టు' అంతయు రేపటివఱకైనా ఉండునా?" అని సూటిగ ప్రశ్నించెను-

శ్లో॥ భావామర్త్యస్య యదన్తకైతత్సర్వేన్ద్రియాణాం జరయన్తి తేజః।
అపి సర్వం జీవితమల్పమేవ తవైవవాహాస్తవ నృత్యగీతే॥ (కఠోపనిషత్తు),

"ఓయమధర్మరాజా! ఈభోగ్యపదార్థములన్నియు నశ్వరములు "శ్వోభావములు" — (శ్వః = రేపు, అభావః = లేనిది) అయినను ఒకవేళ అనుభవించెదమనిన, ఇంద్రియములయొక్క శక్తి దినదినము క్షీణించియే పోవుచుండును. పోనీ దీర్ఘకాల మనుభవింతమనిన, ఎంత దీర్ఘఆయువు అయినను అనంతకాలములో అది అతిస్వల్పపరిమాణము కలదియే యగును. శాశ్వతము కాదు. కాబట్టి నీవాహనములు, నీలొట్టిపిట్టలు, నీవాద్యములు నీవే తీసికొనుము. నాకు వద్దు మహానుభావా! నాకు కావలసినది ఆత్మజ్ఞానము. దాని నుపదేశింపుము' అని హఠము పట్టి ఎట్టకేలకు దానిని పొందగల్గెను. కావున 'రేపటివఱకు' కూడ ఆయుస్సులేని ఈ వైభవములందు జనులకు పూర్ణసుఖము ఎన్నటికిని లభించజాలదు. లభించిన కొంత సుఖమున్ను మరణాదిభయములతో సమ్మిశ్రితమై యున్నందువలన పసలేనిదై నిష్ప్రయోజనకరమై యుండుచున్నది.

వివేకానందస్వామి పశ్చిమ దేశములం దచటచట ఆధ్యాత్మికోపన్యాసములు గావించుచు వేదాంతశంఖారావమును పూరించుచున్న ఆరోజులలో ఒకచోట 'రాబర్టు ఇంజర్‌సాల్' అను పాశ్చాత్యప్రముఖుడు స్వామితో వాగ్వాదము సలుపదిగెను. అతడు చెప్పునదిది - 'మహాశయా! ఏమోఆత్మసుఖము, బ్రహ్మసుఖము, మోక్షసుఖము అని మీరు చెప్పుచుందురు. వానిపై మాకు విశ్వాసములేదు. ఏలయనిన అవి యన్నియు పరోక్షములైనవి. వాటిని గూర్చి ఊహాగానము (Speculation) చేయుచు కాలముగడుపుట మాకిష్టము లేదు. మాకు దృశ్యవిషయములలో ప్రత్యక్షముగ ఆనందము లభించు

చున్నది. ప్రపంచములోగల సారమునకంటె మేమనుభవించు చున్నాము. మీవలె బాహ్యప్రపంచమున, స్వప్నప్రపంచమున తిరుగాడుటలేదు'. . .ఆతని యీ వాక్యములకు వివేకానందు లిట్లు గంభీరముగ సమాధాన మొసంగిరి - 'అయ్యా! మీరు పొరబడుచున్నారు. మేమనుభవించునది కల్పితసుఖము కాదు. నిత్యమై, సత్యమై, శాశ్వతమైనట్టి ఆత్మానందము. అది పరోక్షముకాదు. మీరనుభవించుదానికంటెను ఇంకను ప్రత్యక్షమైనది. మీరాశ్రయించునది ప్రతిబింబ సుఖము. అది చంచలమైనది. క్షణికమైనది. దుఃఖమిశ్రితమైనది. మాది అట్లుకాదు, అది బింబసుఖము. అది నిరతిశయమైనది. దుఃఖవర్జితమైనది. మీరనుభవించు ఒకింత సుఖముకూడ నిరంతరభీతితో అనుభవించుచున్నారు. దొంగతనముగ వంటింటిలో జొరబడి అన్నము తినుచున్న కుక్కకు కలుగు సుఖమువంటిదే దృశ్యవిషయములవలన మీకు కలుగుచున్న సుఖము! అనగా ఆ కుక్కకు అన్నమును తినుటలో కొంతసుఖము లభించినను, ఎక్కడ ఇంటియజమాని వచ్చి చావగొట్టునో యను నిరంతర భీతితో ఆ సుఖ మెట్లు కలుషితమై పోవుచున్నదో, అట్లే మీరనుభవించు దృశ్యసౌఖ్యములును, మృత్యుభీతిచేతను, తదితర భీతులచేతను మిళితములై కళావిహీనములుగ, పేలవములుగ తయారగుచున్నవి. కాబట్టి నిర్భయానందమునే సేవింపుడు! సత్యవస్తువునే ఆశ్రయింపుడు! క్షణిక పదార్థములను బట్టుకొని వ్రేలాడకుడు!'-అని హితోపదేశము చేసెను. సహేతుకములును, అర్థగంభీరములునగు, ఆవాక్యములచే నా

పాశ్చాత్యుడు ప్రభావితుడై స్వామికి తత్క్షణమే వినయాంజలి ఘటించి శిష్యుడయ్యెను.

పాశ్చాత్యనాగరికతా వ్యామోహమున కొట్టుకొని పోవుచు, యథార్థతత్త్వమును గ్రహింపక, విషయసౌఖ్యము లనే పరమధ్యేయముగ దలంచి అహర్నిశములు వానినే వెన్నంటుచు కాలమును గడుపుచుండు జనులను చూచి ఆవేదనను ఆపుకొనలేక వారికి కనువిప్పు కలుగుటకై 'అనిత్యమసుఖం లోకమిమం ప్రాప్య భజస్వమామ్' (అనిత్యమై, సుఖవర్జితమైనట్టి ఈ సంసారమును బొందిన జనులు తరించుటకై నన్ను సేవింపవలెను) అను గీతావాక్యార్థమును విపులీకరించుచు వివేకానందు లొక ఉపన్యాసవేదికపై నిట్లు సింహగర్జన మొనర్చిరి-(సాధకుల కీ వాక్యములు అత్యంత ప్రభావమును గలుగజేయునవి యగుటచే వానిని మీ యెదుట పొందుపరచుచున్నాను.'

"In spit of the sparkle and glitter of western civilisation, in spite of all its polish and its marvellous manifestation of power, standing upon this platform I tell them to their face that it is all vain. It is vanity of vanities. God alone lives, The soul alone lives, Spirituality alone lives, Hold on to that."

"పాశ్చాత్య నాగరికత తళుకు బెళుకులతో గూడియున్నప్పటికిని, ఆశ్చర్యకరములైన భౌతికశక్తులనుదిగ్దర్శనము చేసినప్పటికిని, అదియంతయు నిరుపయోగమని ఈ ఉపన్యాస

వేదికపై నిలబడి వారి యెదుటనే చెప్పివైచుచున్నాను. అది శుష్క దండుగ. దైవమొకటియే సత్యము. ఆత్మయొకటియే సత్యము. పరమార్థ మొకటియే సత్యము. దానినే పట్టుకొనుడు !!" కాబట్టి రాజసములగు ఈ ప్రాపంచిక దృశ్య సౌఖ్యముల కొఱకు భోగవిలాసముల కొఱకు పరువిడక సాత్త్వికమగు ఆధ్యాత్మిక సుఖము కొఱకే జనులు ప్రయత్నించవలెనని శ్రీకృష్ణమూర్తి ఈ అధ్యాయమున బోధించుచున్నాడు. అట్టివారికే పూర్ణశాంతి కలుగును. మఱియు దుఃఖమున్ను వారినుండి శాశ్వతముగ పలాయనమై పోవును. (దుఃఖాన్తం చ నిగచ్ఛతి.)

ఈ ప్రకారముగ గీతాచార్యుడు వివిధరీతుల అర్జునునకు పారమార్థిక విజ్ఞానభండారమును ప్రసాదించుచు యుద్ధసమయ మాసన్నమగుటచే తన ప్రబోధము నిక విరమింపదలంచి, శిష్యుడగు అర్జునునకు, తన్నిమిత్తముగ సమస్తసాధకలోకమునకు ఉపకరించుటకొఱకై గీతాసారమంతయు సంక్షేపముగ మూడుశ్లోకములందు చెప్పివైచెను. అవి యేవి యనిన-

(1) బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాఽఽత్మానం నియమ్య చ
శబ్దాదీన్విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ. (18-51)

(2) వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః. (18-52)

(3) అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహం
విముచ్య నిర్మమశ్శాన్తో బ్రహ్మభూయాయ కల్పతే. (18-53)

అంతిమ అధ్యాయములోని ఈశ్లోకత్రయము గీతకు మకుటము వంటిది. కావున దీని తాత్పర్య మెఱిఁగియుండుట ముముక్షువు

లకు నితాంతావశ్యకమైయున్నది. "అతినిర్మలమగు బుద్ధితో గూడి, ధైర్యముతో మనస్సును నిగ్రహించి, శబ్దాది విషయములను త్యజించివైచి, రాగద్వేషములను పారద్రోలి, ఏకాంతస్థలములందు నివసించుచు, మితాహారియై, మనోవాక్కాయములను స్వాధీనమునందుంచుకొని, ఎల్లప్పుడును ధ్యానయోగతత్పరుడై, వైరాగ్యమును లెస్సగ నాశ్రయించి అహంకార, బల, దర్పములను కామక్రోధ పరిగ్రహములను పూర్ణముగ విడిచిపెట్టి, మమత్వవర్జితుడై, శాంతుడై విలసిల్లువాడు బ్రహ్మసాక్షాత్కారమును బడయుచున్నాడు"—సంసారసముద్రమును దాటుటకు, పరమానందపదవి నొందుటకు ఇదియే విధానము. ఈ సాధనములను ఒక్కొక్కటిగ బాగుగ నభ్యసించి వాటిని తన సొత్తుగ - తన రక్తమాంసములుగ-తన స్వరూపముగ-గావించుకొనువాడు మోక్షభాగి తప్పక కాగలుడు. (బ్రహ్మభూయాయ కల్పతే)-అని శ్రీకృష్ణమూర్తి నిశ్చయపూర్వకముగ చెప్పియున్నాడు. కాబట్టి సాధకుడు వీనిని సదా తన స్మృతిపథమున నుంచుకొనవలయును. మొత్తము గీతను కంఠస్థము చేయలేకపోయినచో అతడు కనీసము ఈ మూడు శ్లోకములనైనను కంఠగతమొనర్చుకొని, సదా వాటి యర్థమును మననము చేయుచు, అవి తనవిగా చేసికొనవలెను.

ఈసాధనములయందు వైరాగ్యమును లెస్సగ ఆశ్రయించవలసినదనియు, కామక్రోధాదులను పూర్తిగ విడిచిపెట్టవలసినదనియు చెప్పుటను సాధకుడు ముఖ్యముగ గమనింపదగియున్నది. దృశ్యపదార్థములందు విరక్తిజనింపనిచో ఆత్మయం

దాసక్తి కలుగ నేరదు. విషయభోగలాలస, దేహాభిమానము గలిగియున్నవాడెవడును ఇంతవఱకు మోక్షమును చవిచూచి యెఱుగడు. అది అసాధ్యమైన పనియే యగును.

శరీరపోషణార్థీసన్ య ఆత్మానం దిదృక్షతి
గ్రాహం దారుధియా ధృత్వానదీం తర్తుం స గచ్ఛతి
(వివేక చూడామణి)

అని శ్రీశంకరాచార్యులవారు ఇవ్విషయమున చక్కని ఉపమానమును సెలవిచ్చిరి. ఒకచోట ఒక నది వేగముగ ప్రవహించుచుండెను. అది రాత్రిసమయము అంధకారము నలుదెసల గాఢముగ వ్యాపించియుండెను. ఒకబాటసారి ఆనదీతీరమునకువచ్చి నిలబడెను. ఆవలియొడ్డుననున్నగ్రామమునకాతడు చేరవలసియున్నది. ఉపాయమును వెతకసాగెను. ఒడ్డుననే ఒక నల్లటి మొద్దు పడియుండెను. 'భేష్' అని సంతోషించి అదియొక కొయ్యమొద్దు అని తలంచి దానిపై కూర్చొని నదీ మధ్యభాగమునకు బోయెను. అది కొయ్యకాదు, మొసలి. చీకటిలో అతనికి కనిపించలేదు. ఇక ఆతనిగతి యేమగును? నది దాటగలడా? దాటుట అట్లుంచి తానే మృత్యుముఖమున పడిపోవుచున్నాడు. అట్లే తాను రక్తమాంసములతో గూడిన ఈ శరీరమేయని తలంచి, దానియందు అభిమానముగలిగి దానిభోగములనుగూర్చియే రోజంతయు చింతన జేయుచు, ఆ దేహాది దృశ్యవస్తువులనే నమ్ముకొనియుండి, ఆత్మ నెవడు సాక్షాత్కరింపదలంచుకొనునో, అట్టివానికి కథలోని బాటసారికి పట్టిన దుర్గతియే పట్టును. కావున దృశ్యపదార్థములందాసక్తిని త్యజించి, వైరాగ్యమును పూర్ణముగ

నాశ్రయించి చిత్తము నంతర్ముఖముజేసి ఆత్మధ్యానమును శీలించవలసినదిగా భగవాను డిచట అదేశించుచున్నాడు. మోక్షకాంక్షి అవలంబించవలసిన పద్ధతి ఇదియే యనియు సూచించుచున్నాడు.

మఱియు కామక్రోధాదులను పూర్తిగ విడిచివేయవలె నని ఇట శాసించెను. అవి యున్నవాడు ఎన్ని నిష్ఠలు సల్పి నను వ్యర్థమేయగును? ఎన్నిపూజలు పురస్కారములు జరిపి నను నిష్ఫలములే యగును. గొప్ప శివభక్తి గలిగియున్నను రావణాసురుడు కామమునకు దాసుడగుటవలన తుట్టతుదకు పతనమునే పొందెనుగదా! కౌశికుడను ముని అరణ్యములో ఘోరతపము సల్పుచున్నను, శిరస్సుపై పక్షి రెట్టవేసినంత మాత్రముననే తన శాంతిని గోల్పోయి, అమాంతముగ విరుచుకుపడి, దానిని శపించి భస్మముచేసివైచెనుగదా! క్రోధమునకు బానిసయైయుండుటవలన పాపమాతడు ఎంత యో కాలము తపస్సు చేసినప్పటికిని సత్ఫలితములను పొందలేక పోయెను. తుట్టతుద కొక పతివ్రతాశిరోమణిచే బోధితుడై దారికి వచ్చియుండుట భారతమునందు మనము వినియే యున్నాము. కాబట్టి కుండెడు పాలలో ఒక విషబిందువు వేసిన చందమున నుండును, ఈకామక్రోధాదులను చిత్తమునసాకుచు వైవనిష్ఠలు సలుపుచుండుట! కోపిష్ఠుల యనుష్ఠానములు, కాముకుల బ్రహ్మనిష్ఠలు, కళాయిలేనిపాత్రలో వండిన పప్పు పులుసువలె నిరుపయోగములై పోవునని శ్రీమహర్షి మల యాళస్వాములవారు పదేపదే బోధించుచుందురు. కావున అధ్యాత్మపథమున శీఘ్రపురోగతిని సాధించ యత్నించు

మానవులందఱున్ను ఈ కామాది అసభ్యగుణములను తమ హృదయమందేమాత్రము తావొసంగకుండ చూచవలెను. గీతామాత ప్రతి అధ్యాయమునందును నెత్తిన నొక్కిచెప్పుచు కొని ప్రవచించుచున్న పరమసాధన ఇదియే.

అయితే జన్మాంతర విరుద్ధశక్తులు హృదయమున అతి బలీయములై వర్తించుచుండుట వలన, సాధకుడు దైవసహాయమును బొందనిచో ఇకార్యమును నెరవేర్పగల్గుట కష్టతరము. సర్వేశ్వరుని అనుగ్రహము' అతని కృపాకటాక్షవీక్షణము సాధకునకు ఎంతయో ఆవశ్యకమైయున్నది. అదిలేనిచో ఈ భయంకర ప్రకృతిని జయించుట మహాదుస్సాధ్యము. ఎన్నియో కష్టములు, ఎన్నియో విఘ్నములు, ఎన్నియో ఆటంకములు, ఎన్నియో సందేహపరంపరలు అతనిని నిరతము వేధించుచుండును. వాటినన్నింటిని అధిగమించుట ఎట్లు? అందులకు ఒకే ఒక ఉపాయము కలదు—

'మచ్చిత్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి' (18-58)

"ఓ అర్జునా! నాయందు చిత్తమునుంచినచో నాయనుగ్రహము వలన నీవు ఆటంకములన్నిటిని దాటివేయగలవు' అని శ్రీకృష్ణ భగవానుడు పార్థునకు బోధించెను. ఇదియే ప్రతిబంధకములు తొలగుటకు చక్కని ఉపాయము. దీనినే భక్తి యందురు. పతంజలిమహర్షి దీనినే 'ఈశ్వర ప్రణిధానమ'ని పేర్కొని అట్టి క్రియచే సాధకునకు అంతరాయములు తొలగుటయే కాక, ప్రత్యగాత్మ సాక్షాత్కారమున్ను లభించగలదని ఖండితముగ చెప్పియుండెను* సామాన్యముగ సాధకునకు తటస్థించు ప్రతి

* తతః ప్రత్యక్చేతనాధిగమోఽప్యన్తరాయాభావశ్చ.

బంధకములు ఒకటికాదు, అనేకము లుండును. వ్యాధి, ప్రమత్తత, అలసత్వము, భ్రాంతిదర్శనము, అనవస్థితత్వము మొదలగు కొన్నిటిని మాత్రము పతంజలి తన యోగసూత్రములందు తెలిపియుండెను.* మాయయొక్క ప్రభావమున ఒక్కొక్క ఆటంకము సంభవించుతరి ముముక్షువు తలక్రిందులై పోవుచుండును. అట్టి సమయమున భగవచ్ఛరణాగతి యొకటియే అతనిని కాపాడగల గొప్ప అస్త్రము. అతిశయ భగవద్భక్తికలవాడు అవలీలగ ఈ విఘ్నపరంపరలను దాటివేయగల్గును. అంతియేకాదు. జ్ఞానావిర్భావము ద్వారా మోక్ష సౌధప్రవేశమున్ను బడయగల్గును.

భక్త్యా మామభిజానాతి యావాన్యశ్చాస్మి తత్త్వతః
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్. (18-55)

'ఓ అర్జునా! భక్తిచే నేనెట్టివాడనో, నాస్వరూపమెద్దియో యథార్థముగ మనుజుడు తెలిసికొనగల్గుచున్నాడు. అట్లు తెలిసికొని ఆ పిదప నాయందు ప్రవేశించుచున్నాడు. (ఐక్యమొందుచున్నాడు)' అని భగవద్వాక్యము. భక్తిచే జ్ఞానము, జ్ఞానముచే మోక్షము సిద్ధించుచున్నవని ఈ వాక్యములద్వారా స్పష్టమగుచున్నది. కాబట్టి ఎట్టివాడైనను సరియే, సంసార దుఃఖసాగరమును దాటి మోక్షసామ్రాజ్యము నధిష్ఠించ గోరువో, భక్తియొక్క ఆశ్రయమును తప్పక గైకొనవలసియే యున్నది. ఇది తిరుగులేని సాధనము. అట్లు కాకున్న గిఱ్ఱున తిరుగుచున్న ఈ భీషణసంసార చక్రమును ఆపగలిగిన స్తోమత

* వ్యాధిస్త్యాన సంశయప్రమదాలస్యా విరతి భ్రాన్తిదర్శనాలబ్ధ భూమికత్వానవస్థితత్వాని చిత్తవిక్షేపాస్తేఽన్తరాయాః.

మఱి చేసికుండగలదు? అనాదికాలమునుండి కొనసాగుచున్న ఈ మాయాచక్ర పరిభ్రమణము ఒక రాగాన హఠాత్తుగ నిలిచిపోగలదా! నిలిచిపోగలదు, దానికి తగిన విధానము ననుసరించినచో. ఆ విధాన మెయ్యది? ఆ చక్రము నెవరు త్రిప్పుచున్నారో వారి పాదముల నాశ్రయించుటయే ఆ విధానము.* ఆ త్రిప్పువాడెవడు? సర్వజీవుల హృదయాంత రాళములం దధివసించు పరమేశ్వరుడే. కావున ఆతని యను గ్రహమును సంపాదించు నిమిత్తము భక్తితో నాతనిని ఆరాధించుటయే, ముముక్షువుయొక్క ఏకైక కర్తవ్యము. తత్ఫలితముగ జీవునకు దుఃఖములు, విఘ్నములు తొలగుటయే గాక, పరమ శాంతి స్వరూపమైన శాశ్వత బ్రహ్మపదము సంప్రాప్తించుచున్నది.

శిష్యునిపై గురువున కెపుడు వాత్సల్యముదయించునో, ప్రీతిజనించునో, అపుడు గురువు తన హృదయమును విప్పి వైచును. అతిరహస్యములైన బోధలనుగూడ అత్తఱి వానికి చెప్పివైచును. వాని నెట్టులైన తరింపజేయవలెనను కుతూహలము గల్గియుండును. ఈ ప్రకారముగ గురువుయొక్క అనుగ్రహ మును, ఇష్టతను సంపాదించుకొనిన శిష్యుడు లోకమున ధన్యాతిధన్యుడు. అతనికి కావలసినదేమి? గురుదేవుని కటాక్ష మును బొందగల్గిన శిష్యుడు తరించినట్లే యెంచుకొనవచ్చును.

---

* (1) ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి
భ్రామయన్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా. (18-61)

(2) తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత
తత్ప్రసాదాత్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్. (18-62)

ఆతని అనుగ్రహమును చూరగొను భాగ్యము గల్గిన అంతే వాసి తన కర్తవ్య మీడేరినట్లే భావించవచ్చును. అర్జునుని సౌభాగ్యరేఖ ఎట్టిదోకాని లోకైక నాథుడగు శ్రీకృష్ణమూర్తి యొక్క అనుగ్రహభాగ్యము నతడు పొందగల్గెను. నరనారాయణుల చిరకాల సన్నిహిత సంబంధ మెచటికి పోవును! అర్జునుడు తన కెంతయో ప్రీతిపాత్రుడను విషయమును శ్రీకృష్ణమూర్తి గీతయందనేక సందర్భములందు ప్రకటించియున్నాడు.* కనుకనే అతి రహస్యములైన ఆధ్యాత్మిక సాధన లన్నిటిని అతనిముందు విరజిమ్మివైచెను. ఇక బోధ పరిసమాప్తము కాబోవుచున్నది కనుక రహస్యములలోకెల్ల పరమరహస్యములగు ఒకటి రెండు వాక్యములను అంత్యమున శ్రీకృష్ణమూర్తి కరుణతో అర్జునునకు బోధింప నుద్యమించెను. 'గుహ్యాద్గుహ్యతరం' - 'సర్వగుహ్యతమం' ఇత్యాది విశేషణములను భగవానుడు ప్రయోగించుటవలన ఈ బోధ లెంత సారవంతములైనచో, జనులు వానియెడల ఎంతటిశ్రద్ధను ప్రదర్శించవలెనో తేటతెల్లమగుచున్నది. 'నేను ప్రతిజ్ఞచేసి చెప్పుచున్నాను ఓ అర్జునా!' అని శ్రీకృష్ణమూర్తి పలికిన పలుకులచే బోధ యొక్క అనుపమ గాంభీర్యమున్ను వ్యక్తమగుచున్నది. భగవన్ముఖారవిందమునుండి వెలువడిన అద్భుతములగు ఆ కడపటి వాక్యము లెవ్వియో చూతము—

'ఓ అర్జునా! నాయందే మనస్సును నిలుపుము. నా భక్తుడవుకమ్ము. నన్నారాధింపుము. నాకు నమస్కరింపుము. ఇట్లొనర్చినచో నీవు తప్పక నన్ను పొందగలవు. ఇది పరమ

* "ఇష్టోఽపి మే దృఢమితిః ప్రతిజానే ప్రియోఽసి మే"

సత్యము. ప్రతిజ్ఞచేసి చెప్పుచున్నాను! వినుము!" * భగవంతుని హితవచనము లిట్లుండ జనులు తద్విపరీతముగ ప్రవర్తించుచున్నారు. వారు దేవుని ఆరాధించుటలేదు. విషయముల నారాధించుచున్నారు. ఆత్మకు మ్రొక్కుటలేదు. దయ్యములకు మ్రొక్కుచున్నారు. అంతర్ముఖులై స్వహృదయాంతర్వర్తియగు పరమాత్మ నుపాసించుటలేదు. బహిర్ముఖులై ఇంద్రియార్థములను తృప్తిపఱచుకొనుచున్నారు. ఇక్కారణముననే వారు శాంతికి దూరులై, పరమాత్మను పొందజాలక, సంసారకుహరమున చిక్కుకొని జనన మరణములకు లోనగుచు నానాయాతనల ననుభవించుచున్నారు. కాబట్టి జీవుని కుమార్గమున బట్టించి యధఃపతనమును నొందించు ఈ పద్ధతిని విడనాడి, ప్రకృతిదాసత్వమును త్యజించి, సత్యవస్తువగు ఆత్మనే దర్శింపవలెను. ఆత్మనే స్పృశింపవలెను. ఆత్మనుగూర్చియే మననము చేయవలెను. ఇదియే భగవానుని యాశయము. ఇవ్విధముగ బోధించి శ్రీకృష్ణపరమాత్మ తుట్టతుదకు సమస్త సిద్ధాంతములను క్రోడీకరించి సారవంతమగు అద్భుత శ్లోక మొకదానిని చెప్పివైచెను. దీనినే వైష్ణవులు చరమశ్లోక మందురు. అద్దానిని విచారించనిచో గీత అసమాప్తముగనే యుండిపోవును. కావున దానిని ప్రస్తావించుట మన విధ్యుక్తధర్మము. అది యేది యనిన-

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః (18-66)

---

* మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే. (18-65)

దృశ్యవృత్తులన్నిటిని పరిత్యజించి (దృక్స్వరూప) ఆత్మయగు నన్నే శరణుబొందుము. అట్టి నిన్ను సమస్త పాపములనుండి నేను విముక్తునిగ జేసెదను, శోకింపకుము'. ఈ శ్లోకమునందు శరణాగతి నిరూపింపబడినది. తన్ను శరణుబొందినవా డెవడైనను సరియే, భగవంతుడు రక్షించును. ప్రభో! నేను నీవాడను అని ఒకపర్యాయము నన్ను శరణువేడినప్పటికిని, అట్టివానికి నేను అభయమొసంగుదును. ఇది నావ్రతము' అని శ్రీరామచంద్రుడు విభీషణుని శీలము యెడల సందేహమును వెలిబుచ్చినవారికి కుండ బ్రద్దలుకొట్టినట్లు చెప్పివైచెను.* దృశ్యవిషయములను, భోగయశస్సులను, ప్రాపంచిక సంపదలను శరణుజొచ్చినవారికి శాంతి సుదూరమున నుండుచుండును గాని, ఆత్మనాశ్రయించినవారికి, భగవానుని శరణుబొందిన వారికి శాంతి అదూరముననే యుండును. జనులకు సుఖ మేల కలుగుటలేదనగా, వారు దైవమును శరణు జొచ్చుటలేదు. ప్రకృతిని శరణుజొచ్చుచున్నారు. అస్థిరవస్తువు నాశ్రయించువాడు అస్థిరచిత్తుడే యగునని ముమ్మాటికిని నమ్ముడు! చంచల పదార్థము నాశ్రయించి 'ఆహా! ఇది నాసౌభాగ్యము' అని ఉవ్విళ్ళూరవచ్చునుగాని, అచిరకాలములోనే 'అయ్యో! ఇది యెంత దౌర్భాగ్యము' అని అనుకొనుదశ వారికి వచ్చితీరగలదు. అనుభవమే జనులకు పాఠము నేర్పును. కాబట్టి ప్రపంచమను మజ్జిగను చిలికి సారభూతమైన పరమాత్మ (సచ్చిదానందము) అను వెన్నను వెలికిదీసి దానినే ఆశ్ర

* సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే
అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ. (రామాయణము)

యించువాడు. దానినే శరణుజొచ్చువాడు, దానినే ఉపాసించు వాడు ధన్యుడు. ఇట్టివ్యక్తియే సతతము పాపరహితుడై, నిర్భయుడై, ఆనందయుతుడై లోకమున మెలగగలడు. ఏల యనగా తన్నాశ్రయించువారి సమస్తపాపములను కడిగివేసెద నని భగవానుడు 'హామీ' నొసంగియున్నాడు.

జీవుడు తాను చేయదలచిన కార్యమును తాను చేసినచో పరమాత్మ తానాచరింపవలసిన కార్యమును తానాచరించును. గీతలోని ఈ చరమశ్లోకములోగల ప్రథమ పాదము "సర్వ ధర్మాన్–" అనునది జీవుని కర్తవ్యమును నిరూపించును. రెండవపాదము "అహంత్వా–" అనునది దేవుడు చేయు పనిని స్పష్టీకరించును. జాబువ్రాసినచో తిరుగుజాబు వచ్చును. పిలిచి నచో ప్రత్యుత్తరము వచ్చును. అసలు జాబే వ్రాయనిచో అది యెవరి దోషము? దేవుడు మాత్రము దానికి ప్రత్యుత్తర మెట్లీయగలడు? రైలు ఎక్కినచో గమ్యస్థానమునకు తీసికొని పోగలదు. అసలు రైలే ఎక్కనిచో - దానికి ఎవరు ఏమి చేయగలరు? సుఖప్రాప్తికి, నిరతిశయశాంత్యనుభవమునకు, పూర్ణదుఃఖరాహిత్యమునకు భగవానుడు దారిచూపుచుండగా రెండుచేతులు పైకెత్తి ప్రతిజ్ఞాపూర్వకముగ పలుకుచుండగా, దానిని ఉపేక్షించి, నరకద్వారముననే తట్టుచుండినచో ఇక దానికి ఎవరును ఏమియు చేయజాలరు. వారివారి పతనమునకు వారే బాధ్యులు కాగలరు. ఈ సత్యమును గుర్తెఱింగి గీతా చార్యుని యాదేశప్రకారము దైవమునే శరణుబొంది జనులు శోకరాహిత్యమును బడయుదురుగాక!

గీతోక్తమగు భగవానుని తత్త్వబోధ 'మాశుచః'- "దుఃఖింపకుము' అను పదముతో సమాప్తమునొందినది. దీనిని బట్టి దుఃఖరాహిత్యమే గీతయొక్క ప్రధానోద్దేశమని స్పష్టము కాగలదు. దుఃఖసాగరమున గ్రుంకులిడుచుండు అభాగ్యజీవులకు కరావలంబన మొసంగి ఒడ్డుకుచేర్చి పరమానంద మొనగూర్చుటయే గీతయొక్క ఆశయము. అయితే భగవంతుడు చేయిజాపినను దానిని పట్టుకొనుటకు కూడ ఇష్టపడని జీవుల విధివిలాస మేమని చెప్పవచ్చును! ఆహ్వానించినను తిరస్కరించు మనుజుల దుష్కృత మెట్టిదై యుండవలెను! కావున తమస్సును పారద్రోలి, నాస్తికత్వమునకు తిలాంజలి యొసంగి, సర్వజీవులను కడతేర్చుటకు బద్ధకంకణుడైన పరమాత్మను ఈక్షణముననే భక్తితో నాశ్రయించవలెను. తాను పాపినని ఎవరును దుఃఖింపనవసరములేదు, పాపమునకు విరుగుడు గీతయందు బోధింపబడెను. పుణ్యమే పాపక్షయమునకు మార్గము. జ్ఞానమే సమూల పాపవిధ్వంసమునకు ఉపాయము. భగవచ్ఛరణాగతియే సర్వపాపశమనైక భేషజము. ఇట్టి యుపాయములను వజ్రాయుధముచే పాపపర్వతములను ఛేదించివైచి, మరల దానియందడుగుపెట్టక, శ్రేయోమార్గముననే యనుసరించవలెను. పాపము చెడ్డదికాని పాపికాదు. పాపమును దూషింపవలెనుగాని పాపినిగాదు. ఏలయనిన, పాపి మరల పుణ్యాత్ముడు కాగలడు. తన తప్పు తెలిసికొని మరల సన్మార్గమును జేపట్టగలడు.

Let the dead past bury its dead
Be not like dumb driven cattle
Be a hero the strife.

'అయిన దేమిటో అయినది. గతించిన దానిని గూర్చి వగవ కుము... ఇకమీదట మాగసకుప్పవలె సుంపుస రణరంగమున ధీరుడవై మెలగుము'-అని యొక కవిపుంగవుడు పలికినట్లు, పూర్వపు దుష్కృత్యములనుగూర్చి పరితపించుటలోనే పుణ్య కాలము యావత్తు గడపివేయక, ఇకమీదట అట్టి పాపము లాచరింపక ధైర్యముతో ముందునకు పోవుటయే శూరుని లక్షణము. ఈ ప్రకారముగ ఎట్టివంటి పతితవ్యక్తినిగూడ గీత పైకిలేపి వాని భుజముతట్టి; ఆశ్వాసమొసంగి, సహకరించి, సన్మార్గమున గమనశీలునిగ జేసివైచుచున్నది. ఇదియే గీత యొక్క విశిష్టత. పతితుల నుద్ధరించుటకు గీత కంకణము కట్టుకొనినది. పాపిని అయ్యది ఉపేక్షింపలేదు. గీతాగ్రంథ మున కింత విశ్వవ్యాపకత్వము కల్గుటకు గల కారణములలో నిది ప్రధానమైనదని చెప్పవచ్చును. కావున సోమరితనమును త్యజించివైచి, జన్మసాఫల్యమునకు మార్గమైనట్టి భగవ చ్ఛరణాగతిని జీవు డతి శీఘ్రముగ సాధించివైచునుగాక !

ఏలయనగా, జీవితము క్షణభంగురమైనది. ఎత్తైన చెట్టుకొమ్మయొక్క చివరిభాగమునగల ఆకుకొనయందు వ్రేలాడు మంచుబొట్టువలె శరీరము ఏక్షణమున క్షణము రాలుటకు సిద్ధముగనున్నది. ఆయువును కొందఱు ఏనుగు చెవితోపోల్చిరి. మఱికొందఱు కప్పయొక్క కంఠచర్మముతో ఉపమించిరి. కొందఱు మెఱుపువలె అతి చంచలమని సాదృ శ్యము చెప్పిరి. కావున దీనిపై విశ్వాసము తగదు. చేయదగిన పారమార్థిక కార్యములన్నింటిని బాల్యయౌవనములందే ప

సమాప్తము గావించివేయవలెను. ఆరోగ్యము, ఇంద్రియ సౌష్ఠవము, సదవకాశములు, అనుకూల పరిస్థితులు ఉన్నపుడే ఆధ్యాత్మిక యత్నములను, తీవ్రముగ ఆచరింపవలెను. వార్ధక్యములో జ్ఞాపకశక్తి తగ్గిపోవును. ఇంద్రియములు సడలిపోవును. శక్తిక్షీణాముఖము పట్టును. అట్టితఱి తీవ్రసాధన లోనర్చుటకు అనుకూల్యత ఏర్పడదు. కాబట్టి-

గృహీత ఇవకేశేషు మృత్యునా ధర్మమాచరేత్.

అని పెద్దలు చెప్పినట్లు - మృత్యువు జుట్టుపట్టుకొనియున్నట్లు భావించి, ధర్మము నాచరించవలెను. వాస్తవముగ నిది అతిశయోక్తి కాదు. యథార్థమే. కనుకనే శ్రీశంకరాచార్యుల వారు భగవంతునిగూర్చి ఈ ప్రకారముగ ప్రార్థించిరి.

రోగా ఘదన్తి సతతం ప్రబలా శ్శరీరం
కామాదయోఽప్యనుదినం ప్రదహన్తి చిత్తం
మృత్యుశ్చ నృత్యతి సదా కలయన్ దినాని
తస్మాత్త్వమద్య శరణం మమ దీనబన్ధో.

"ఓ దీనబంధూ! భయంకరములైన రోగములు నాశరీరమును నిరంతరము సతమతము చేయుచున్నవి. కామ క్రోధాదులు చిత్తమును దహించివేయుచున్నవి. మృత్యువు నా ముందు నాట్యము సలుపుచు రోజులు లెక్కపెట్టుచున్నది. కాబట్టి ఇపుడు నీవే నాకు శరణ్యము." "పచ్చికుండలోని నీటివలె ఆయువు నశించిపోవుచున్నది. నూతన యౌవనశోభ మెఱుపువలె చంచలముగా నున్నది. వార్ధక్యము ఆడసింహామువలె

పరుగిడివచ్చుచున్నది. కావున ఇప్పుడు నీవే నాకు శరణ్యము!"*
శ్రీ శంకరుల వాక్యములు వాస్తవికతను ప్రతిబింబింపజేయు
చున్నవి. ప్రతిజీవియు 'మృత్యుసంసారము'న తగుల్కొని
యున్నాడు. కావున దానినుండి తప్పించుకొను తెలివు
యోచించుకొనియే తీరవలెను. కానీ ప్రపంచమున ఎన్ని
భోగభాగ్యముల ననుభవించినను, మహోన్నతవైభవములను కండ్ల
జూచినను, అవియన్నియు బంధన మధ్యమున తాననుభవించి
నవే యగును.

ఎలుకబోనులో మంచిరుచిగల ఎరను తగిలించుదురు.
ఎలుక దానిలో ప్రవేశించగనే బోనుయొక్క తలుపు పడి
పోవును. అపుడది భీతిజెంది పారిపోవుటకై యత్నించి పలు
దెసల త్రోవకై వెతకుచుండును. కాని త్రోవ కానరాదు.
ఎలుక బంధనమున చిక్కుకొనును. అత్తరి ఆ ఎర ఎంత
స్వాదిష్టమైనదిగా నున్నను. సుందరముగా కన్పించినను,
గుమగుమలాడుచున్నను మూషికమునకు దానిపై మోజు
ఏమాత్రమున్ను ఉండదు. ఏల ? తాను బంధనమున తగు
ల్కొనినట్లు ఎఱిగినది కావున, అంతమాత్రపు బుద్ధియు
మానవునకు లేకున్నది. ఏలయనగా, జననమరణరూపఘోర
సంసార బంధమున తగుల్కొనియున్నను,భోగముల సేవించు
చునేయున్నాడు. కాబట్టి సత్వరము తాను బంధమునం

* ఆయుర్వినశ్యతి యథామఘటస్థతోయం
విద్యుత్ప్రభేవ చపలా నవయౌవనశ్రీః
వృథా ప్రధావతి యథా మృగరాజపత్నీ
తస్మాత్త్వమద్య శరణం మమ దీనబన్ధో.

దున్నట్లు తెలిసికొని, బంధవిముక్తికై ప్రయత్నించవలెను. దీనినే ముముక్షుత్వ మందురు. తీవ్రముముక్షుత్వ మెప్పుడు కలుగునో అపుడు ప్రాపంచిక విలాసముల యెడల జీవునకు రుచియే కలుగదు - దృష్టాంతమందలి ఏలుకకువలె. అట్లే జైలులో నున్నవానికి ఎన్నివైభవము లొసంగినను ఆనందము కలుగదు. బంధవిముక్తి ఒకటియే అతనికి ఆనందమును చేకూర్చును.

రాజకీయరంగమున 'అరెస్టు' అయిన కొందఱు మహాపురుషులను ప్రభుత్వమువారు 'డిటెన్యూ'ల క్రింద పరిగణించి వారిని గొప్పగొప్ప బంగళాలయందో- లేక మహాప్రాసాదములందో ఉంచి వారి అంతస్తుకు తగినట్లు సమస్త సౌకర్యములను అచట చేయుదురు. మంచి మంచి భోజనముల నిచ్చెదరు. విలాస వస్తువులనుగూడ సమకూర్చెదరు. కాని ఆ బంగళా ఆనుకొనియుండు ఉద్యానవనము బయటచుట్టూ పోలీసువారు లేక సైనికులు కాపలా కాయుచుందురు. ఏలయనగా ఆతనిని ఎంత గౌరవము చేసినను ఆతడు ఖైదీయే. ఆతడనుభవించునది అస్వాతంత్ర్యమందు పరిమిత స్వాతంత్ర్యము. అట్టి స్థితియందు విజ్ఞుడగు ఖైదీ యెవడున్ను తన కొసంగబడుచుండు పంచభక్ష్య పరమాన్నములనుజూచి మురిసిపోడు. విలాసవస్తువులనుజూచి ఆనందపడడు, ఏల? తాను బంధనమునందున్నాడని అతనికి తెలియును. బంధవిముక్తియే అతనికి సంతుష్టిని కలుగ జేయగలదు. కాని మఱియే చిల్లర వస్తువులున్ను గాదు. అట్లే జీవుడు అనాదికాలమునుండి జననమరణ రూపమగు ఈ సంసార బంధనమున తగుల్కొని అస్వతంత్రుడై యున్నాడు. ఇట్టి పారతంత్ర్య వాతావరణమున నుండియు, బంధవిముక్తికై

ప్రయత్నించుట, విలాసవస్తువులకై పరుగిడుట, శబ్ద, స్పర్శాది భోగ్యవస్తుజాలముసకై అఱ్ఱులు జాచుట కేవలము అజ్ఞత్వమే యగును. బంధనమునసున్నవాడు చేయవలసిన మొట్టమొదటి పని బంధవిమోచన యత్నము, ఇది ప్రధానము. తక్కినవి గౌణము. ప్రధానమును మఱచి గౌణమునందు తగ్గినువాడు కృతకృత్యు డెన్నటికిని కానేరడు. తాను మఱచిన తన స్వరూపమును తిరిగి జ్ఞాపకమునకు తెచ్చుకొనవలెను. తాను ఆత్మయేకాని దేహాదిసంఘాతము కాదను విషయమును మాటి మాటికి స్మరించుచుండవలెను. పారతంత్ర్య వాతావరణము నందు క్రుఁగిపోయి నానాబాధల ననుభవించు జనులు స్వాతంత్ర్యముకొఱకు, స్వారాజ్యముకొఱకు ఎట్లు తహ తహ నొందుచుందురో, అట్లే మాయాబంధమున చిక్కుకొని వివిధ నరకయాతన లనుభవించుచు, సాంసారిక క్లేశములచే తల్లడిల్లు చుండు జనులు తమ జన్మహక్కగు మోక్షముసకై, స్వారాజ్య ముసకై, నిరతిశయ బ్రహ్మానందముసకై తీవ్రమగు ఆకాంక్ష గలిగియుండవలెను. పారతంత్ర్య స్థితియందు భోగజాలము లభించినను దానిపై దృష్టి నుంచరాదు కథలోని చిలుకవలె -

> వాసః కాంచనపంజరే నృపకరై ర్నిత్యం తనోర్మార్జనం
> భక్ష్యం స్వాదు రసాలదాడిమఫలం పేయం సుధాభం పయః
> వాచ్యం సంసది రామనామ సతతం ధీరస్య కీరస్య భో
> హాహా హన్త తథాపి జన్మవిటపి క్రోడం మనో ధావతి

'ఒకానొక మహారాజు రామచిలుక నొకదానిని పెంచుచుండెను. దాని నివాసము బంగారపు పంజరమునందు. ప్రతిదినము రాజులు స్వయముగ దానికి స్నానము చేయించుచుందురు.

తియ్యటి మామిడిపండ్లు, దానిమ్మపండ్లు దానికి ఆహారముగ నిత్తురు. అమృతతుల్యమగు క్షీరమును త్రావించుచుందురు. అప్పుడప్పుడు నిండుసభలయందు గౌరవపురస్సరముగ తీసికొని వచ్చి దానిచే రామనామమును పలికించుదురు. ఇంతగౌరవము దానికి జరుగుచున్నప్పటికిని ఆ చిలుకకు సంతుష్టిలేకయున్నది. ఎందుకనగా దాని మనస్సు అచట లేదు. ఏకాంతవనమున, చెట్టుకొమ్మపై ఎపుడు పోయి వ్రాలుదునా యను సంకల్ప మొకటియే దానిని పట్టి పీడించుచున్నది.' శరీరము రాజ సౌధములందున్నను మనస్సు అరణ్యములందే తిరుగాడు చున్నది. ఏలయనగా అరణ్యము దాని జన్మస్థానము - చెట్టు కొమ్మ దానిపుట్టిల్లు. పరకీయస్థలమున భోగభాగ్యము లనుభ వించుటకంటె స్వకీయస్థలమున సామాన్యముగ నుండుటయే ఆ చిలుకకు మేలనిపించెనట! ఈపాటి బుద్ధి మనుష్యుల కుండి నచో ఇక వారి కేమికొదువ? పరమాత్మ వారి జన్మస్థానము, స్వస్థానము. ప్రకృతి పరకీయస్థానము. ప్రకృతిలో, మాయలో, అవిద్యలో కాలముగడుపువారు - 'నచేదిహావేదీన్మహతీవినష్టిః' అనునట్లు మహావినాశమునకు ఒడిగట్టినవారే యగుదురు. జన్మస్థానమగు పరమాత్మ కెగబ్రాకువారు 'తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్'-అనునట్లు శాశ్వత సుఖమునే కూడ గట్టుకొందురు. కాబట్టి 'మామేకం శరణంవ్రజ' అని శ్రీకృష్ణ మూర్తి సెలవిచ్చినట్లు, జీవులందఱున్నూ ఇతర వ్యాపకములను తగ్గించుకొని సచ్చిదానంద పరమాత్మ నొక్కనినే శరణువేడి నచో, కర్మలచేతను, వాక్కుచేతను, మనస్సుచేతను, ఆతనినే ఆశ్రయించినచో, బంధవిముక్తిని బడసి ఈ జీవితమునందే

నిత్య నిరతిశయ అపరిచ్ఛిన్న బ్రహ్మానందము ననుభవించగలరనుటలో ఏలాంటి సందేహమున్ను లేదు.

ఈ ప్రకారముగ ఉపనిషత్సారమంతయును పిండి, శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతారూపమున అర్జునునకు ప్రసాదించెను. బ్రహ్మనిర్వాణమను గమ్యమును బొందుటకు వివిధమార్గములను వివిధపద్ధతులను వివిధసాధనలను సూచించెను. ఇది ధర్మము, ఇది అధర్మము; ఇది న్యాయము, ఇది అన్యాయము; ఇది పుణ్యము, ఇది పాపము; ఇది దైవము, ఇది అసురము; ఇది యుక్తము. ఇది అయుక్తము; ఇది నేల, ఇది గొయ్యి. అని విడదీసి చూపించి, 'ఓ అర్జునా! 'యథేచ్ఛసి తథా కురు' - ఇక నీ కెట్లిష్టమో అట్లాచరింపుము; వీనిని బాగుగ విమర్శించి ఇక నీ కిచ్ఛవచ్చిన ట్లొనర్పుము.' అని భగవానుడు తనపై కర్తృత్వమేమియు పెట్టుకొనక, ఆచరించు విధానమును అర్జునునకే వదలివేసెను. గురువులు దారిచూపుదురు. అంతమాత్రమే. నడక నేర్చుకొని నడువవలసినది శిష్యులే. కావున శిష్యుడు గురుబోధ శ్రవణానంతరము తన ధీశక్తిచే అమృతముయొక్క సత్ఫలితములను, విషముయొక్క దుష్ఫలితములను, ముక్తిజనిత ఆనందమును, బంధజనిత దుఃఖమును రెండిటిని బాగుగ వివేచించి ఉత్తమమగుదానినే చేబట్టి నికృష్టమును పారద్రోలవలెను. అర్జును డట్లే చేసెను. కాబట్టి ఆతనికి అజ్ఞానమంతయు పటాపంచలై పోయెను. జ్ఞానభాస్కరు డుదయించెను.

అయితే యెటువంటి ప్రజ్ఞాశాలియగు వైద్యుడైనను, ఆతడు ప్రయోగించినది ఎంతటిశక్తివంతమైన ఔషధమైనను

ఔషధసేవనానంతరము రోగియొక్క పరిస్థితిని వైద్యుడు విచారించియే తీరును. శ్రీకృష్ణుడున్ను అట్లే కావించెను. అర్జునునిచే గీతామృతమను భేషజమును పానము చేయించిన తదుపరి 'ఓ అర్జునా! ఈ గీతాజ్ఞానౌషధముచే నీయొక్క అజ్ఞానసమ్మోహ రోగము నశించినదా?' అని ప్రశ్నించెను. తత్క్షణమే అర్జునుడు 'నష్టోమోహః' - 'మహాత్మా! నీ యనుగ్రహముచే నా అవిద్య నశించినది. ఆత్మజ్ఞాన ముదయించినది. సందేహము లన్నియు తొలగిపోయినవి. ఇక నీయాజ్ఞ నెరవేర్చెదను' అని హర్షోత్ఫుల్లమానసుడై ప్రత్యుత్తర మిచ్చెను. భగవానుడు ప్రయోగించినది చక్కని చిట్కా. కాలాంతరమున నెప్పుడో ఆరోగ్యమును కలుగజేయునదికాదు అది. సేవించిన తత్క్షణమే సద్యఃఫలితమును గలుగ జేయునది. కలుగజేసినది కూడను. అర్జునుడే అందులకు నిదర్శనము. వైద్యుని తొలిప్రయోగమే సఫలమైనది. కావున ఇక మందువిషయమై ఎవరికిని ఏ చికిత్స అవసరము లేదు. రెండు చేతులతో దానిని పరిగ్రహించి ఇండ్లకు తీసికొని వెళ్ళవచ్చును. అర్జునునకు రోగము నయమైనపుడు ఇక ఎవరికి మట్టుకు నయముకాదు? ఒక చోట ప్రయోగము (experiment) సఫలమైనపుడు, అన్నిచోట్ల కూడ అది సఫలమైయేతీరును. ఇందు ఏమాత్రమున్ను సంశయములేదు. కావున సర్వమానవకోటి, కాదు. దేవకోటి, అసురకోటికూడ గీతారూపమగు ఈ అనుపమదివ్యౌషధమును సేవించి, భవరోగమును బాపుకొని శాశ్వత సౌఖ్యమును బడయును గాక!

గీతాధ్యయనమును, గీతానుష్ఠానమును ఎవరు కావించె దరో, వారు మహత్తరమగు 'జ్ఞానయజ్ఞమును' ఆచరించిన వారేయగుదురు. సామాన్య యజ్ఞములకే ఎంతయో గొప్ప ఫలితము నిర్దేశింపబడియుండ ఇక జ్ఞానయజ్ఞవిషయమై వేఱుగ చెప్పవలయునా! అన్ని లాభములకంటె గొప్పలాభము, అన్ని పదవులకంటె గొప్పపదవి, అన్ని సంపదలకంటె గొప్పసంపద జ్ఞానయజ్ఞము నాచరించినవారికి సిద్ధించును. నిస్సంశయముగ వానికట్టి మహోచ్చదశ సంప్రాప్తించియే తీరును. ఏలయనిన జ్ఞానయజ్ఞాచరణముచే నతడు ఇక నరుడుగా నుండక నారాయణుడుగ రూపొందును. భక్తుడుగ నుండక సాక్షాత్ భగవంతునితో నైక్యమొందును.

అయితే గీతాధ్యయనము చేయుటకు తగినంత అక్షరజ్ఞానము లేనివారు కొందఱుండవచ్చును. అట్టి నిరక్షరాస్యుల గతియేమి? వారున్ను తరించుటకు ఉపాయమేమైన కలదా యనిన, కలదని భగవానుడు కరుణతో వచించుచున్నాడు. అట్టివారు శ్రద్ధతో వినిన చాలును. అట్టి శ్రవణజ్ఞానము చేతనే క్రమముగ వారు ముక్తిపదము నలంకరించగలరని శ్రీకృష్ణమూర్తి వారలకు ధైర్యప్రదానము గావించెను. శ్రవణము చేసినవాడు ఊరక నుండడు. దానిని అప్పుడప్పుడు మననము చేయును. మననము చేసినదానిని నిదిధ్యాసనము చేయును. దానిచే గీతాజ్ఞానము చక్కగ వంటబట్టును. శ్రోతయొక్క రక్తమాంసములందయ్యది సమ్మిశ్రితమై పోవును. తత్ఫలితముగ అతని హృదయక్షేత్రమున జ్ఞానప్రకాశ మావిర్భవించి అజ్ఞానతమమును దూరీకరించివేయును. కాబట్టి చదువు

లేనివారు దిగులుపడక ఎచటనైనను గీతాకాలక్షేపములు, గీతోపన్యాసములు, గీతాతత్త్వవిచారణ జరుగుచున్నచో శ్రద్ధాన్వితులై అచటకేగి ఏకాగ్రతతో విని అనుష్ఠించిన చాలును; తరించిపోవుదురని గీతాచార్యుడు అభయ మొసంగెను. అయితే విద్యావైదుష్యము, సాహిత్యజ్ఞానము ఉండుటయే శ్రేష్ఠము. ఏ కారణముచేనైనను లేనిచో శ్రవణాదుల ద్వారా బ్రహ్మవిద్యను సంపాదించుకొని తరించవచ్చుననియు, హృదయనైర్మల్యముపై ఆధారపడునది కావున మోక్షమునకు నిరక్షరాస్యత అంత ప్రతిబంధకము కాదనియు భావము.

భగవన్ముఖారవిందమునుండి వెలువడిన ఈ అఖండ జ్ఞానోపదేశమును జనులు తాము గ్రహించి ఇతరులకుకూడ ప్రసాదింపవలెను. తాను తరించి ఇతరులనుగూడ తరింప జేయవలెను. ఇదియే సనాతన ధర్మము.

తీర్ణాస్స్వయం భీమమహార్ణవం జనా
నహేతునాఽన్యానపి తారయన్తః (వివేకచూడామణి)

అని శ్రీశంకరాచార్యులు వచించినట్లు మహనీయులైనవారు భయంకరమగు ఈ సంసార సాగరమును తాము స్వయముగ దాటి నిర్హేతుకముగ అన్యులనుగూడ దాటింపజేయుచున్నారు జ్ఞానోపదేశముచే. ఇట్టి జ్ఞానదానము దానములన్నిటిలోను సర్వశ్రేష్ఠమైనది. 'సర్వేషా మేవ దానానాం జ్ఞానదానం విశిష్యతే' అని శాస్త్రములు వక్కాణించుచునే యున్నవి. ప్రాపంచిక వస్తువులను ఇతరులకు బహూకరించినచో అవి కొంతకాలముమాత్రమే వారికి ఉపయోగపడును. కాలాంతరమున నశించిపోవును. కాని ఆత్మజ్ఞానమును ప్రసాదించినచో

కలకాలము వారి వెంటనుండి శాంతిసుఖముల నొసంగి మోక్ష శిఖరమునకు గొంపోవుచుండును. ఇది తరగని నిక్షేపము. విద్యను ఒకరికి ప్రసాదించుటవలన అభివృద్ధి నొందునే కాని తఱిగిపోదు. శ్రీకృష్ణమూర్తి తాను బోధించిన పరమార్థ జ్ఞానము [ గుహ్యాద్గుహ్యతరం' ]-అతి రహస్యమైనదని తెలియు జేసియు, అట్టి రహస్యమును ఇామకొొనక శ్రద్ధావంతులైన వారి కందరికిని పంచిపెట్టవలసినదిగా ఆజ్ఞాపించెను. అతి రహస్యమును ఈప్రకారముగ బట్టబయులు చేయుమని ఎవరైన చెప్పుదురా ? కాని భగవంతునకు భక్తులపైగల అవ్యాజ కరుణయే ఈ ప్రకారముగ సలిపిని ప్రేరేపించినది. వాస్తవ ముగ ఏదియో రూపమున ఒకప్రాణికి ఉపకారము జరిగినచో, అదియే మహాత్ములకు ఆనందము. అదియే వారి దృష్టిలో భగవత్సేవ, భగవదారాధన.

"యేన కేన ప్రకారేణ పరస్య పురుషస్య తు
సంతోషం జనయేత్ప్రాజ్ఞః తదేవేశ్వరపూజనమ్"

'ఏదియో యొకవిధముగ విజ్ఞుడగువాడు మఱియొకనికి సంతోషమును గలుగజేయవలెను. అదియే ఈశ్వరపూజ యగును.' అని ఆ ప్తవాక్యము. నరుని సేవ నారాయణుని సేవయే యగును. ఒక్క నరుని విషయమే కాదు. విశ్వ మందలి ఏ ప్రాణికి ఉపకారము చేసినను అది దైవసేవయే. ఏలయనిన దైవము సర్వహృదయాంతర్వర్తి.

"So long as a single dog in my country is without food, my whole religion is to feed it."
"నా దేశములో ఒక్కకుక్క అయినను పస్తుఉండినచో దానికి

అన్నమిడుటయే నామతము' అని వివేకానందులు సర్వభూత హిత ప్రవర్తనయొక్క శ్రేష్ఠత్వమును ఉగ్గడించియున్నారు. కావున ప్రతివారును తమతమ జీవితములందు పరిప్రాణుల కుపకారము కలుగజేయు నవసరములను పెంపొందించుకొను చుండవలెను. అట్టి అవకాశమేదియైన కలిగినచో అదియే తనయొక్క అహోభాగ్యమని తలంచవలెను.

దుర్భరవిచారవహ్నిదోధూయమాన
చిత్తుడగు నొక్కసోదరు చెక్కిలిపై
జారు కన్నీరు తుడుపంగ జాలుదేని
నాదు జన్మము సఫలము కాదె వసుధ.

అని యొక భక్తుని హృదయావేదన ఇట్టి భావమునే వ్యక్తము చేయుచున్నది. అయితే ఒకడు మఱియొకనికి చేయగల ఉప కారములన్నిటిలోను జ్ఞానప్రదానమే సర్వోత్కృష్టమైనది. ఏల యనగా దానిచే ప్రతిగ్రహీత ఈ జన్మయందేకాక జన్మ జన్మాంతరమునకూడ ఉపకారమును బొందగల్గును. సంసార దుఃఖములను పోగొట్టుకొనగల్గును. ఈ జన్మయందే తరించి పోవచ్చునుగూడ. కాబట్టి మొట్టమొదట తాను జ్ఞానమును బొంది పరమార్థవిషయమును స్వయముగ ననుభూత మొనర్చు కొని పిమ్మట ఇతరుల కద్దానిని వ్యాపింపజేయవలెను. ఈప్రకార ముగ గీతాప్రబోధమును తాను క్షుణ్ణముగ హృద్గతము చేసి కొని తదుపరి ఆ జ్ఞానామృతమును పరులకు ధారాదత్తము చేయవలెను. ఇవ్విధముగ గీతాప్రచారము సలుపువాడు తనకు

అత్యంతప్రియుడని శ్రీకృష్ణపరమాత్మ సెలవిచ్చెను. *'మామేవైష్యత్యసంశయః' అని అసందిగ్ధముగ చెప్పియుండినవాఁడగాన అట్టి గీతాప్రచారకుడు, గీతాధ్యయనము అతిశయభక్తితో గావించినవాడై భగవానుని తప్పక పొందగలడని స్పష్టీకరించెను. ఇంతియే కాదు. గీతాజ్ఞానమును లోకుల కందజేయువాని యంతటి మహాప్రీతిపాత్రుడు భూతభవిష్యద్వర్తమానములందును తనకింక నుండబోడనియు పరమాత్మ వచించెను. ఆహా! భక్తులపై భగవానున కెంతటి వాత్సల్యము! జ్ఞానవ్యాప్తిపై శ్రీకృష్ణున కెంతటి మక్కువ! గీత కెంతటి మహిమ యొసగబట్టెను, గీతాజ్ఞానవ్యాప్తి కింతటి సత్ఫలితములు చేకూరగనుండుటబట్టియే, నేడు ఏ ప్రాంతమునకు బోయినను గీతకు బ్రహ్మరథము పట్టువారే కానిపించుచున్నారు. గీతామృతపానముచేసి వేలకువేలు జనులు తరించి, ఆనందాంబుధి నోలలాడుచున్నారు. పశ్చిమదేశీయులందును గీతయెడల ఆసక్తి పెంపొందుచున్నది. ఖండఖండాంతరములందును గీతాసౌరభము వ్యాపించి జనుల హృదయాంతరాళములందు ఆహ్లాదమును పెంపొందించుచున్నది. ప్రపంచమునగల వివిధభాషలలో గీత అనువదితమై పఠింపబడుచున్నది. ఏదియో యొక అద్భుతశక్తిలేనిచో నిట్లు జరుగదు. కావున అట్టి యుద్గ్రంథమును ప్రతివారున్ను అధ్యయనముచేసి, అధ్యాపన మొనర్చి, అందలి బోధలను తన

* (1) య ఇమం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః. (18-68)

(2) న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః
భవితా న చ మే తస్మాదన్యః ప్రియతరో భువి. (18-69)

నిత్యజీవితములో మేళవింపజేసికొనుచు భగవంతునకు అత్యంత ప్రీతిపాత్రులై, పరమానంద మనుభవించుచు మానవ జీవితమును సార్థకమొనర్చుకొందురుగాక !

ఈ గీతోపదేశమును వ్యాసమహర్షియొక్క అనుగ్రహముచే సంజయుడు వినినవాడై అతిహర్షమును బొందెను. సామాన్యముగ మనుజునకు అధ్యాత్మబోధవలన రెండు సత్ఫలితములు చేకూరుచుండును- (1) శోకరాహిత్యము (2) అతిహర్షము. ఈ రెండును శ్రీకృష్ణపరమాత్మవలన గీతను నేరు (direct) గ వినినట్టి అర్జునునకు, సంజయునకుగూడ గలిగినవి. ఎపుడో కలుగుటకాదు. వినిన మఱుక్షణముననే అయ్యవి ప్రాదుర్భవించినవి. ఈవిషయమునే సంజయుడు 'హృష్యామిచ ముహుర్ముహుః. హృష్యామి చ పునఃపునః'- (మరల మరల ఆనందమును పొందుచున్నాను) అను వాక్యముల ద్వారా ధృతరాష్ట్రున కెఱింగించెను. అర్జునునకు, సంజయునకు, గీతాశ్రవణముచే దుఃఖరాహిత్యము, ఆనందప్రాప్తి కలిగినపుడు ఇక తక్కినవారికి ఏల కలుగదు ? తప్పక కలుగును. ఫలాని వారికే మాత్రమే శాంతి సుఖములు లభించునని గీత యెన్నడును శాసించలేదు. వ్యక్తులపై గీతకుగాని, గీతాచార్యునకు గాని పక్షపాతములేదు. గీతయందు కలది సార్వజనిక బోధ అది వ్యక్తిసంబంధమైనదానికి అతీతమైనది. సిద్ధాంతమునే అయ్యది నిర్వచించును. ఆ సిద్ధాంతము నెవడు అమలుపఱచుకొనునో ఆతడే తత్ఫలితముల ననుభవించును.

యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్. (9-29)

'ఎవరు నన్ను భక్తితో సేవించుదురో వారు నాయందును, నేను వారియందును ఉందున'ని గీతాచార్యుడు స్పష్టముగ చెప్పివైచినాడు. కాబట్టి వారి వారి భక్తినిబట్టి వారి వారి హృదయనిర్మలత్వమునుబట్టి వారి వారి పారమార్థిక జిజ్ఞాసను బట్టి తన్మార్గమున వారు వారు గావించు న్యూనాధిక యత్నములబట్టి వారి వారికి ఆయా సత్ఫలితములు తరతమభేదములతో సంప్రాప్తించుచుండును. అర్జునుడు, సంజయుడు తమ తమ హృదయక్షేత్రములను దైవోన్ముఖములుగ నుంచుటచే ఆదైవవాణి తత్క్షణమే వినిపించుటయు, వికసించుటయు జరిగినది. భగవదనుగ్రహ మను మారుతము ఎల్లెడల వీచుచునే యున్నది. జీవుడు తన చిత్తమను తెరచాపను ఎత్తి యుంచిన చాలును. తత్క్షణమే తద్వాయువేగముచే పురోగతిని సాధించగల్గును. కాబట్టి శ్రద్ధావిశ్వాసములతో గీతను సమీపించినట్లైన అర్జున సంజయాదులు బడసిన శోకరాహిత్యస్థితిని, అతిహర్షస్థితిని ప్రతివారున్ను బడయగలరు, సంశయము లేదు.

ఇంతకుమించి ఇక మనుజులకు కావలసినది యేమి? ఆత్యంతిక దుఃఖరాహిత్యమునకు పరమానందప్రాప్తికి మించిన సద్గతి లోకమున ఏదైన కలదా! ఎన్ని ప్రాపంచిక సంపదలైనను, రాజ్యభోగములైనను, భౌతికవిలాసములైనను జీవునకిట్టి పరమశాంతిని, సుఖమును కలుగజేయగలవా? మరణమును తొలగించగలవా? దుఃఖరూప సంసారచక్రమును నిరోధింపగలవా! తాపత్రయములను చల్లార్చగలవా? లేవు. అట్టిశక్తి ఆధ్యాత్మికజ్ఞాన మొక్కదానికే గలదు. అట్టి దైవికజ్ఞానము అట్టి బ్రహ్మవిద్య, భగవద్గీతయందు లెస్సగ ప్రతిపా

దింపబడినది. జీవుని నిమ్నస్థానమునుండి మెల్లగ పైకిలేపి క్రమక్రమముగ ఉపరిస్థానములకు దీసికొనిపోవుచు, అంతమున పరమాత్మతో కలిపివేయగల సామర్థ్యము గీతకు గలదు. కావున జీవబ్రహ్మైక్యమునకు రాజబాటను గీత తెరచినదనియే చెప్ప వచ్చును. కాబట్టి అట్టి పవిత్రగ్రంథము నాశ్రయించినవారు ధన్యులు. దానిని సేవించినవారు కృతార్థులు.

లోకములో ప్రతివారున్ను విజయమునే కోరుచుందురు కాని అపజయమును గాదు. సంపత్తునే వాంఛించుదురు కాని దారిద్ర్యమునుగాదు. అయితే అట్టి విజయ మెట్లు చేకూర గలదు? అట్టి సంపత్తు ఎట్లు సంప్రాప్తించ గలదు? దానికి ఉపాయమును మనము వెతకవలసిన పనిలేదు. సంజయుడే దానిని చెప్పివైచెను. మత్తవేదండము నెక్కి లోకమున కింతటికిని దానిని చాటివేసెను! అది యేది యనిన-

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ. (18-78)

"ఎచ్చట యోగేశ్వరుడగు శ్రీకృష్ణమూర్తియు, ధనుర్ధారియగు అర్జునుడును ఉందురో అచట లక్ష్మి, విజయము, ఐశ్వర్యము, నీతి తప్పక ఉండునని నాయభిప్రాయము' అని సంజయుడు ధృతరాష్ట్రునితో పలికెను. గీతాగ్రంథమందలి కడపటి వాక్యము లివి. ఈ వాక్యములతో గీతాపాఠకుడు తన గీతాధ్యయన మును పరిసమాప్తము గావించును. ఇందలి భావము లెట్టి యర్థ గాంభీర్యముతో గూడియున్నవో చూడుడు! ఓ జీవుడా! విజయముకొరకై ఇక నీవు తహతహ పడవలసిన పనిలేదు. ఐశ్వర్యముకొఱకై పరితపనజెంద నవసరములేదు. శ్రీకృష్ణ

పరమాత్మను దగ్గఱ జేర్చుకొనుము. ధనుర్ధారియగు అర్జునుని వలె కార్యాచరణ శీలుడవై మెలగుము చాలును. ఇక సిరి యన్నియును నీయొద్దకువచ్చి చేరును- రాజునొద్దకు భృత్యులు వచ్చి చేరునట్లు.

'నీడను వెన్నంటితివా, కోట్లకొలదివత్సరములకైనను అది నీకు లభించదు. నీకంటె ముందుగనే అది పరుగిడి నీకు అందకుండును. కాని నిరాశ జెందవలదు. వెనుకకు తిరిగి సూర్యుని వైపు గమనశీలుడవుకమ్ము! ఇక ఆ నీడ నీ వెనుకనే నిన్నాశ్రయించుచు రాగలదు. నీకు దాసియై వర్తించగలదు. అట్లే ప్రకృతియం దంతర్గతములగు విజయ, ఐశ్వర్యాదులను వెంటాడినచో అవి సామాన్యముగ లభించవు. ప్రకృతికి అతీతుడై యున్న పురుషుని-అనగా పరమాత్మను ఆశ్రయించినచో, దైవోన్ముఖముగ ప్రవర్తించినచో ఇక ఆ ప్రకృతి నీకు దాసత్వమును చేయగలదు. విజయైశ్వర్యమును నీకిక కరతలామలకములై పోగలవు. ఇదియే ఇటగల రహస్యము' - అని ఈ శ్లోకముద్వారాగీతాంతమున సంజయుడు విజయకీలకమును సువ్యక్త మొనర్చెను.

ఏ యింటియందు శ్రీకృష్ణపరమాత్మను జనులు స్థాపన చేయుదురో, అయింటియందు లక్ష్మి తాండవమాడుచుండును. ఏ ఒంటియందు నందనందనుని జనులు ప్రతిష్ఠించుదురో, ఆ ఒడలు దివ్యత్వమును వెదజల్లుచుండును. అయితే శ్రీకృష్ణుని ప్రతిష్ఠించుటకు ఉపాయమేదైన కలదాయనిన, కలదు. ఎచట గీతావిచారణ జరుగుచుండునో, గీతాపఠనము, గీతాపాఠనము, గీతాశ్రవణము కొనసాగుచుండునో, అచ్చోట తప్పక శ్రీకృష్ణ

పరమాత్మ హాజరగుచుండును. ఈ సత్యమును భగవంతుడు తానే స్వయముగ భూదేవికి వచించియున్నాడు.* కాబట్టి విభయము కావలెనా, శ్రీకృష్ణమూర్తి యుండవలెను; శ్రీకృష్ణమూర్తి యుండవలెనా, గీతావిచారణ గావింపవలెను. ఇవ్విధముగ భగవద్గీత నాశ్రయించువారికి సాక్షాత్ పరమాత్మయొక్క సాన్నిధ్యశ్రీ లభించుటయు, విజయైశ్వర్యాదులు సంభవించుటయు తేటపడించుచున్నది. కావున ఇట్టి మహిమాన్వితమగు గ్రంథమును జనులు తమ జీవితములో భాగస్వామిగ జేసికొనుట, శ్రద్ధాభక్తులతో నందలి సత్యములను అనుష్ఠించుట ముఖ్యకర్తవ్యమై యున్నది.

ప్రతిగ్రామమునందును ఒక గీతాసంఘమును స్థాపించి గీతోక్తజ్ఞానమును నలుగురికి తెలియజేయునిమిత్తము, గీతాపారాయణములు, గీతాపూజలు, గీతాపోటీపరీక్షలు, గీతోత్సవములు, గీతోపన్యాసములు, గీతాగోష్ఠులు, జరుపుచు నిర్మాణాత్మకమగు కృషిసల్పి తద్ద్వారా జనులలో నైతిక,ఆధ్యాత్మిక ఉత్తేజమును గలుగజేయవలెను. ఇట్టికార్యము శ్రీకృష్ణ పరమాత్మకు అత్యంత ప్రీతికరమైనదని వేఱుగ చెప్పనక్కఱలేదు. మనుజుడు తాను చేయు ఈ సేవచే ఒక్క ప్రాణికైనను సంసారదుఃఖము శమించి, ఉపకృతి లభించినచో తన కృషి సఫలమైనట్లే యెంచవలెను. ముఖ్యముగ పాశ్చాత్యనాగరికతా వ్యామోహము జనుల చిత్తమును పీల్చివేయుచున్న ఇక్కాలమున గీతాప్రబోధము, గీతాప్రచారము ఎంతేని ఆవశ్యకమై

* యత్ర గీతావిచారశ్చ పఠనం పాఠనం శ్రుతమ్
తత్రాహం నిశ్చితం పృథ్వి నివసామి సదైవ హి (గీతామాహాత్మ్యము)

యున్నది. కావున జన్మసార్థక్యమునకు హేతుభూతమైన ఈ మహోన్నత గ్రంథరాజమునకు ముముక్షువులు తమ జీవితములను అంకితముచేసి తదుక్తమగు ఆచరణను శీలించుటద్వారా నిర్వాణపదవిని ఈ జన్మయందే చేబట్టుదురుగాక !

దైవమునకు దైవవాణికి అవినాభావసంబంధము కలదు. రెండును వేర్వేరు వస్తువులుకావు. ఒకే స్వరూపము. దైవముపై విశ్వాసము గలిగి దైవవాణిని ఉపేక్షించువారి ఆస్తికత సంశయింపదగినదే యగును. కావున కృష్ణునిపై భక్తికలవారు కృష్ణవాణియగు భగవద్గీతను తప్పక గౌరవించవలసియున్నది. అందలి బోధలను తప్పక అనుష్ఠింపవలసియున్నది. లేనిచో దైవముపై విశ్వాసములేనివారేయగుదురు. కాబట్టి గీతాచార్యుడు బోధించిన విధముగ జనులు అభ్యాసవశముచేత చిత్తమందలి రజోగుణము తమోగుణములను పారద్రోలి అద్దానిని సత్త్వమయముగచేసి, ధ్యానవిచారణాదులచే అట్టి నిర్మలచిత్తమును అధిష్ఠానమగు ప్రత్యగాత్మయందు విలీనమొనర్చి కేవల క్షేత్రజ్ఞరూపులై, ఆత్మమాత్రులై వెలయుదురుగాక ! ఇట్టి నిర్గుణపరమాత్మపదవిని మించిన పదవి లోకమున లేనేలేదని ఢంకాబ్రమోగించి చెప్పవచ్చును. వేదాంతడిండిమ మీసత్యమునే వేనోళ్ల చాటుచున్నది. అల్పపదవులకై అఱ్ఱులుచాచి జీవితమును భ్రష్టమొనర్చుటకంటె పరమానందపదవిని కైవశమొనర్చుకొని జన్మసార్థకతనొందుట ఎంతయో మేలుకదా ! కావున నేటినుండియే ఈ గీతాధర్మములను ఆచరణలో పెట్టుచు బ్రహ్మానందవారాశిలో మునిగి తేలుడు ! అజ్ఞానాంధకారములచే లోకమావరింపబడి నలువైపుల అశాం

ప్రబలియున్న తరుణమున జ్ఞానప్రకాశముచే జనుల హృదయాంతరాళములను తేజోవంతమొనర్చి వారికి శాంతిభిక్ష నొసంగ గల సమర్థత ఈ గీతాశాస్త్రమునకు కలదని మువ్మాటికిని నమ్ముడు ! గీతాముఖమున సాక్షాత్ పరంధాముడే పలుకుచున్నాడను పరిపూర్ణ విశ్వాసము కలిగి యుండుడు ! గీతోక్తధర్మములను చక్కగ ననుష్ఠించుచు మీదేహములను మీ గేహములను, మీ హృదయములను, మీ పరిసరములను దైవసాన్నిధ్యమున కాస్పదములుగ నొనర్చుడు ! ఇట్టి గీతా యజ్ఞములను విరివిగ నాచరించుచు జనులందఱును జ్ఞానభిక్షను బడసి తరించు సదవకాశమును కల్పించి ధన్యులు కండు! ఇట్టి జ్ఞానయజ్ఞములు లోకములో సర్వత్రవ్యాపించి దైవమతము, కరుణామతము, స్వాతంత్ర్యమతము ఎల్లెడల సుప్రతిష్ఠితములై యలరునట్లు కావింపుడు ! గీతాఘోష ఇంటింటియందును ప్రతిధ్వనించునట్లు చేయుడు! గీతాజ్ఞానామృతవర్షముచే జనుల హృదయము లాప్లావితములై నిత్యనిరతిశయ బ్రహ్మానందానుభవసమర్థము లగునుగాక ! పరమకారుణికుడగు సర్వేశ్వరుని కృపచే లోకములో గీతానుభూతిచే భక్తిజ్ఞానవైరాగ్యములు పెంపొంది, జనుల హృదయసీమలందు శాంతిసుఖములు వర్ధిల్లునుగాక !!

ఓమ్ శ్రీకృష్ణార్పణమస్తు. ఓమ్ తత్ సత్ ఓమ్.

జై శ్రీకృష్ణభగవానునకు జై । గీతామాతకు జై ॥

ఓమ్.

ఉత్తమ గీతాగ్రంథము] [వెలువడినది



# గీతామకరందము

రచయిత: 

## శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు

ఇందు శ్రీ భగవద్గీతయొక్క మూలశ్లోకములు వాటి సంబంధము, (తెలుగు) తాత్పర్యము, విశేషార్థము (వ్యాఖ్యానము), ప్రశ్నోత్తరములు, ఇంకను గీతా సంబంధమైన పెక్కు వివరములు పొందుపఱుపబడినవి. ముముక్షువులకు లెస్సగ ఉపకరించునట్టి గ్రంథము.

రాయల్ సైజు - క్యాలికో బైండు

1100 పేజీలుగల గ్రంథము.



వెల: రు 22-00 లు.  పోస్టేజి ప్రత్యేకము.

ఈ క్రింది అడ్రసుకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

మేనేజరు

శ్రీ శుకబ్రహ్మాశ్రమము

శ్రీ కాళహస్తి (పోస్టు)

చిత్తూరు జిల్లా (ఆంధ్రప్రదేశ్)

# శ్రీ వసిష్ఠగీత

[అనువాదకులు - శ్రీ విద్యాప్రకాశనందగిరిస్వాములవారు]

శ్రీ వసిష్ఠమునీంద్రులచే శ్రీరామచంద్రున కుపదేశింప బడిన శ్రీయోగవాసిష్ఠమను ఆధ్యాత్మిక గ్రంథముయొక్క సారమే ఈ 'వసిష్ఠగీత'. 32 వేల శ్లోకములతో గూడిన మూలగ్రంథమునందు సాధకులకు అత్యంతోపయుక్తము లైనట్టి దాదాపు 10 వేల శ్లోకములను ఏరి, అధ్యాయము లుగ విభజించి, తెలుగు తాత్పర్యమును జేర్చి ఈగ్రంథము తయారుచేయబడినది. జ్ఞానవైరాగ్యాది సాధనలు, ముముక్షువు లవలంబించవలసిన పద్ధతులు దీనియందు చక్కగ తెలుపబడినవి. ఇయ్యది నాలుగు భాగములు గలిగియున్నది. ప్రథమ సంపుటమునందు రెండు భాగము లును, ద్వితీయ సంపుటమునందు రెండు భాగములును ముద్రింపబడినవి. సాధకుల కిది అత్యంత ప్రయోజనకర మగు గ్రంథము.

ప్రథమ సంపుటము 1150 పేజీలు - వెల రు. 17-00

ద్వితీయ సంపుటము 1100 పేజీలు - వెల రు. 17-00

డెమ్మీ 1/8 సైజు - పూర్తి క్యాలికోబైండు.

(పోస్టేజి ప్రత్యేకము)

వలయువారు ఈ క్రింది విలాసమునకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

మేనేజరు.

శ్రీ శుకబ్రహ్మాశ్రమము

శ్రీ కాళహస్తి (పోస్టు)

చిత్తూరు జిల్లా (ఆంధ్రప్రదేశ్.)

# శ్రీ భగవద్గీత

(మూలశ్లోకములు మాత్రము)

పారాయణోపయుక్తమైనది.

క్యాలికోబైండు వెల : 1-50 పై.

---

శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారి

# జీవిత చరిత్ర

శ్రీవారి జీవిత విశేషములు ఇందు గలవు.

వెల : 0-80 పై.

---

# ఆత్మ విద్యావిలాసము

పరమార్థతత్త్వమును సులభముగ బోధించుచున్న పొత్తము.

వెల : 0-75 పై.

---

# తత్త్వసారము

అధ్యాత్మ విజ్ఞానమును తేటతెల్లముగ తెలుపు 108 తత్త్వములు.

వెల : 1-00 పై.

# సదుపదేశములు

## శ్రీశ్రీశ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు

(1) సాధకుడు ప్రారంభమున చిత్తమును, ప్రార్థనా నామస్మరణాదులచే పరమార్థరంగమున ఒకింత పైకిలేపి ఆ పిదప తత్త్వవిచారణచే ఊర్ధ్వముగ గొనిపోవలెను.

(2) మనస్సు రాగాదికషాయయుతమై మలినముగానున్నచో దైవమునందుగాని, దైవవాక్కునందుగాని, అభిరుచి గలుగదు. కావున విషయ భోగములందు విరక్తి గలిగి యుండవలెను.

(3) బ్రహ్మజ్ఞాన సౌధమునకు వైరాగ్యము పునాదివంటిది. పునాది గట్టిగలేనిచో ఎంత పెద్ద భవనమయినను అచిరకాలములో కూలిపోవునట్లు విషయవిరక్తి సంపూర్ణముగ లేనిచో తత్త్వజ్ఞానము నిలువదు. కావున సాధకుడు సంపూర్ణ విషయవిరక్తి కలిగియుండవలెను.

(4) $\frac{\text{దైవము}}{\text{మాయ}}$ అను భిన్నము (Fraction) లో క్రింది సంఖ్యయగు మాయ అధికమగుకొలది పై సంఖ్యయగు దైవము తగ్గుచుండును. అట్లే మాయాగుణములు, అశాపిశాచము, కామక్రోధాదులు, జీవునియందు ఎంతెంత అధికమగుచుండునో అతనియందున్న దైవత్వము అంతంత సన్నగిలిపోవుచుండును. అవిఎంతెంతతగ్గుచుండునోదైవత్వముఅతనియం

దంతంత ప్రబలుచుండును. ఏనాడు ఈ మాయాగుణములు సంపూర్ణముగ తొలగిపోవునో, అప్పుడు కైవల్యము మాత్రము శేషించును.

(5) బిడ్డ ఊయలయందు పరుండి, ఏడ్చినచో తల్లి అన్నిపనులు వదలుకొని అచటికి పరుగెత్తుకొనివచ్చి అతని యోగక్షేమముల విచారించి నట్లు భక్తునిమొరను భగవంతుడు ఆలకించుచునే యుండును. కావున మీ దృష్టిని ప్రాపంచిక సుఖములనుండి మరల్చి దైవమునందు నిలిపి అ దైవముకొరకై పరితపించుడు.

(6) దేవుడున్నాడా ? ఉన్నచో మాకు కనుపించుటలేదే ! అని యనకుడు. కనుపించనివస్తువే లేదనుట సిద్ధాంతమైనచో వాయువు కన్ను లకు కనుపించునా ? ఆకాశము కనుపించునా ? తన కన్ను తనకు కను పించునా ? పగలు నక్షత్రములు కనుపించునా? లేదు. అంతమాత్రముచేత అవేవియు లేవనవచ్చునా? కాదు. పాలలోనివెన్న స్థూలనేత్రమునకు కాన రాదు. కాని వివేకముతో తెలిసికొనవచ్చును. ప్రయత్నముతో ప్రత్యక్ష ముగా చూడవచ్చును. అట్లే భగవంతుని వివేక నేత్రముతో చూడవచ్చును. సాధనచేసినచో ప్రత్యక్షముగ భగవదనుభూతిని పొందవచ్చును.

7 ఈ ప్రపంచమునగల ప్రతివస్తువున్ను పరిణామశీలమైనది. ఈనాడు రమణీయముగనున్న పుష్పమాల రేపటికి వాడిపోవుచున్నది. ఆ మరునాటికి క్రుళ్లిపోవుచున్నది. నే డెంతయో రమణీయముగనున్న సౌధ ములు నగరములు కొంతకాలమునకు శిథిలములై కేవలస్మృతిమాత్రముతో శేషించుచున్నవి. ఇప్పు డిచటనున్న అణువు రేపు సూర్యునిలోనికి పోవ చ్చును. సూర్యునిలోని అణువు రేపు ఇచటికి రావచ్చును. ప్రతి ఏడుసంవత్స

రములకు ఈ శరీరములోని అణువులన్నియు పోయి క్రొత్త అణువు చేరునని విజ్ఞానశాస్త్ర సిద్ధాంతము. ఈ ప్రకారముగ దృశ్యమంతయు ణామశీలమైయున్నది. కాని ఇవన్నియు మారుచున్నను, నశించుచున్న ఏ పరిణామము లేనిదై, అవినాశియై, వీనికన్నింటికిని ఆధారమైనట్టి వస్తు వొకటి కలదు. అదియే దైవము. అట్టి దైవమును మీలో దర్శించుడు.

8 మానవజన్మము సార్థకము కావలెనని ప్రజ్ఞానరూపబ్రహ్మ మును అనుభూతము చేసికొనవలెను.

ఓమ్ తత్ సత్

